

ధర : రూ. 200/-

అట్టమీద ఫోటో : హరీష్ నాగరాజ్, శ్రీ వినాయక తోలుబొమ్మల బృందం, నిమ్మలకుంట గ్రామం, అనంతపురం జిల్లా వారి నుంచి సేకరణ

మొదటి ముద్రణ : జూలై 2015

ప్రతులకు, వివరాలకు : హైదరాబాద్ బుక్ ట్రస్ట్,
ప్లాట్ నెం. 85, బాలాజీ నగర్,
గుడిమల్కాపూర్, హైదరాబాద్ - 500 006.
ఫోన్ : 23521849
www.hyderabadbooktrust.blogspot.com

---

ముద్రణ : అనుపమ ప్రింటర్స్, గ్రీన్ వ్యూ, 126 శాంతినగర్,
హైదరాబాద్ - 28 ఫోన్ : 23391364, 23304194
Email: anupamaprinters@yahoo.co.in

# విషయసూచిక

# ముందుమాట

ఆధునిక సమాజంలో సమస్యలెన్నో ఉండగా పురాణ కథల గురించి ఇంకా రాయ వలసిన అవసరం ఏమిటీ అని చాలామంది అనుకోవచ్చు. స్వశక్తినీ స్వయంకృషినీ పక్కకు పెట్టి దేవుళ్ళను మొక్కుకోవటాలూ దేవుళ్ళమీద ఆధారపడటాలూ రోజురోజుకూ ఎక్కువవటం గమనించాక మహాత్మా జోతిరావ్ పూలే (1827–1890), డా. బి.ఆర్. అంబేద్కర్ (1891–1956), శ్రీ మాదరి భాగ్యరెడ్డి వర్మ (1888–1939) గార్ల భావజాలాన్ని వర్తమాన సమాజానికి అందించవలసిన అవసరం ఉన్నదనిపించింది.

భారతదేశంలో మతమే ప్రజల జీవన విధానాన్ని నిర్దేశిస్తున్నది. ముఖ్యంగా కింది కులాల ప్రజలకు పురాణ పాత్రలు, రామాయణ, మహాభారతాలలోని పాత్రలూ ఆదర్శం. ఆ పాత్రల గురించి వారికి తెలియజెప్పవలసి ఉంది.

శూద్ర కులాలనూ స్త్రీలనూ విద్యకు దూరం పెట్టినప్పటికీ పురాణాలలోనివిగా విన్న విషయాలను వారే బలంగా నమ్ముతున్నారు. ఆచరణలో పెడుతున్నారు. వాస్తవ విషయాలను స్వయంగా చదవకపోవడం వల్లనూ పురాణాలను ప్రశ్నించకూడదనే ఆంక్షలవల్లనూ ఈ పరిస్థితి ఏర్పడింది. పురాణాలలోని సంఘటనలనూ వాటి పూర్వాపరాలనూ తార్కికంగా పరిశీలించిన మహాత్మా జోతిరావ్ పూలే అసుర చక్రవర్తులను స్థానికులుగా పరిపాలనా దక్షులుగా, ధర్మ ప్రవర్తకులుగా, ప్రజలకు సమన్యాయం అందించిన మానవతావాదులుగా గుర్తించారు. పురాణాల పేరిట, ధర్మశాస్త్రాల పేరిట, ప్రజలను – ముఖ్యంగా రైతులనూ కింది వర్గాల వారినీ దోచుకుంటున్న పురోహిత వ్యవస్థను ప్రశ్నించారు. తాను కనుగొన్న వాస్తవాలను రచనల ద్వారా, రాత్రి పాఠశాలల ద్వారా, దృశ్య కళారూపాల ద్వారా ప్రజలలో ప్రచారం చేశారు.

జోతిరావ్ పూలే ఆలోచనా ధారను డా. బి.ఆర్. అంబేద్కర్ మరింత ముందుకు తీసుకువెళ్ళారు. వైదిక మతం గురించీ వర్ణ ధర్మాల గురించీ, రాముని, కృష్ణుని రహస్యాల గురించీ చర్చించారు. ఎవరైతే మన స్థానిక వీరులైన అసురులను తుదముట్టించారో వారినే మనం పూజించటం తగనిపని అని భాగ్యరెడ్డి వర్మ చెప్పారు. ఆర్య – ఆర్యేతర ఘర్షణలలోని వాస్తవాలను చిన్న చిన్న నాటకాలుగా ప్రదర్శింపజేసి ప్రజలను చైతన్య పరచారు.

వివేకానందుడు (1863–1902) తన చివరి రోజులలో మత సంస్కృతిలోని దోషాలను గురించి ఆందోళనపడ్డాడు. "మతంలో ఏమీ దోషంలేదు. జనపీడన యంత్రాంగాన్ని ప్రవేశపెట్టిన కపట మతాచార్యులదే దోషం" అన్నాడు. వేదాలు, రామాయణ, మహాభారతాలు, అష్టాదశ పురాణాలు అప్పటప్పటి సామాజిక రాజకీయ పరిస్థితులను

మానవ మనస్తత్వాలను, ప్రతిబింబిస్తూ ఉన్న రచనలు వాటిని ఉద్దేశపూర్వకంగా మత ధర్మాలతో ముడిపెట్టడం జరిగింది. అలా ముడిపెట్టడం వర్గ ప్రయోజనాల కోసమే.

భారతీయ నాగరికత గురించి అధ్యయనం చేసిన పాశ్చాత్య పండితుడు సి. బొగ్లే ఈ నాగరికతకు ఒక రకమైన స్తంభిత వికాస లక్షణం ఉందన్నాడు. "ఇతర నాగరికతలు మామూలుగా దాటుకుంటూపోయిన దశలను భారతదేశం బలవంతంగా పొడిగించింది. ఈ పొడిగింపులో వికాసం కుంటుపడింది. తిరోగమన దిశలోనే పయనం సాగించింది" అన్నాడు. ఇది నిశ్చయంగా పురాణాల ప్రభావమే. ఇతర దేశాలలోని నాగరికతలు ఐక్యతకూ సమభావనకూ దారిచూపితే భారతదేశ నాగరికత విభజనకూ శ్రేణీకరణకూ దారితీసింది. వర్ణాశ్రమ ధర్మ వ్యవస్థను సగర్వంగా చాటుకున్న భారతదేశంలో "ఒక వ్యక్తి ముందు బ్రాహ్మణుడు/వైశ్యుడు/క్షత్రియుడు/శూద్రుడు అవుతాడు; ఆ తర్వాతనే మనిషి అవుతాడు." అని కూడా సి. బొగ్లే చెప్పారు.

భారతదేశపు సంస్కర్తలు ఎంత ప్రయత్నించినా ఈ వ్యవస్థలో మార్పు తేలేక పోయారు. ఆంధ్రదేశంలో త్రిపురనేని రామస్వామి చౌదరి, నార్ల వేంకటేశ్వరరావు, కుసుమ ధర్మన్న, భాగ్యరెడ్డి వర్మ, బోయి భీమన్న వంటి వారు హేతువాద దృష్టితో పురాణాలను పరిశీలించి ఆర్య – అనార్య సంఘర్షణలలోని వక్రీకరణలను – దేవాసుర యుద్ధాల అసత్య కథనాలను బహిర్గతం చేశారు. అయినా ఈ వ్యవస్థ మారటంలేదు.

"భూమి దైత్యులది" అని రామాయణంలో ఒక సందర్భంలో జటాయువు రామునికి చెప్పాడు. దైత్యులు అసుర గణాలలోని వారు. "ఈ భూమి ఇక్ష్వాకులది" అని వసిష్ఠుడు రామునికి మరో సందర్భంలో చెప్పాడు. ఇక్ష్వాకులు సూర్యవంశీయులు – సూర్యుడు దేవ గణాలలోనివాడు. రాముడు ఇక్ష్వాకుడు. రాజ్య విస్తరణ కోసం పట్టుదలతో అసురులను చంపుతూ వెళ్ళాడు. భూమిని అసురుల నుండి స్వాధీనపరచుకున్నాడు.

భూమికోసం – మూడడుగుల నేల కోసం; దేవాసురులు (ఆర్య – ఆర్యేతరులు) ఘర్షణపడ్డారు. అసురులను చంపటం లోకకళ్యాణం కోసం అనే భావన బలపడింది. వర్ణాశ్రమ ధర్మపరిరక్షణ పాలకుల కర్తవ్యమయింది. రామాయణం ఏర్పరచిన ఆ మార్గాన్నే ఈనాడూ పాలకులు అనుసరిస్తున్నారు.

భూమి పోరాటాలు ఈనాడూ జరుగుతున్నాయి. ప్రజల భూములు ప్రజల కోసమే స్వాధీనం చేసుకుంటున్నామని ప్రభుత్వాలు చెబుతున్నాయి. పాలకవర్గమూ కార్పొరేట్ శక్తులూ బలపడుతున్నాయి. న్యాయవర్తనమూ అదే తీరులో ఉంది. శంబూకుని పట్ల అమలు అయిన న్యాయమే దళితులపట్ల అమలవుతూ ఉంది. ఊచకోతలలో దళితులది అసుర వారసత్వమే. రామాయణాన్ని అందులోని విషయాలనూ ప్రామాణికంగా ఇప్పటికీ భావిస్తుంటారు. అందులోని మత ధార్మిక విషయాలను 21వ శతాబ్దపు దృష్టితో కాకపోయినా వాస్తవాల కోసమైనా తెలుసుకోవాలి. పురాణాలకు పెరుగుతున్న ఆదరణ

దృష్ట్యా ఈ వ్యాసాల అవసరం ఉన్నదని భావిస్తూ నా పరిశీలనను మీ ముందు ఉంచుతున్నాను. వర్తమానాన్ని అర్థం చేసుకోవటానికి గతాన్ని తెలుసుకోవటం అవసరం. ఈ పరిశీలన సమగ్రం అని నేను అనుకోవటం లేదు. ఈ కోణంలో అధ్యయనం ఇంకా సాగవలసి ఉంది.

ఇందులో వ్యాసాలు కొన్ని గతంలో 'నీలిజెండా' పక్షపత్రికలో వచ్చాయి. ఆ పత్రిక సంపాదకులు శ్రీ బొజ్జా తారకంగారికీ, శ్రీ గనుమల జ్ఞానేశ్వర్ గారికీ, ఈ పుస్తకం ప్రచురించటానికి ముందుకు వచ్చిన 'హైదరాబాద్ బుక్ ట్రస్టు' శ్రీమతి గీత గారికీ నా ధన్యవాదాలు.

**-బి. విజయభారతి**

# భారతీయ సాహిత్యం

ప్రాచీన భారతదేశపు సాంఘిక వ్యవస్థ గురించి తెలుసుకోవటానికి సాహిత్యం చక్కని ఆధారం. భారతీయ సాహిత్యంలో మొదటగా వేదాలను చెబుతారు. వేదాలు ఆర్యుల సాహిత్యం. అవి బ్రహ్మ నోటి నుండి వెలువడ్డ పవిత్ర సూక్తాలంటారు. చాలా కాలం ఇవి మౌఖికంగా వ్యాప్తిలోకి వచ్చాయి. ప్రస్తుతం లభిస్తున్న గ్రంధస్థమైన సూక్తాలు ఋషుల పేర్లతో ఉన్నాయి. వారు వాటిని వంశపారంపర్యంగా భద్రపరుస్తూ వచ్చారట. దీనికి భిన్నమైన మరో వాదం కూడా ఉంది

'త్రయోవేదస్య కర్తారో భాండ ధూర్త నిశాచరాః

జర్పరీ తుర్ఫరీత్యాది పండితానాం వచః స్మృతం ।"

మొదట్లో మూడు వేదాలూ వ్యర్థ పదాలతో కూడుకొని ఉన్నాయనీ వాటిని ధూర్తులు నిశాచరులు (రాక్షసులు) రాశారనీ పండితులు (ఆర్యులు) వాటిని నిరసించి కొత్తవి చెప్పుకున్నారట. ఈ ప్రకారం చూస్తే వేదాల కర్తృత్వం ఆలోచించదగ్గదే. ఈ సందర్భంగా ఆర్యుల గురించీ భారతదేశంలోని ఆదిమ జాతుల గురించీ వారి సంస్కృతి గురించీ తప్పక ప్రస్తావించుకోవలసి ఉంటుంది. భారతదేశంలో ఆర్యుల రాకకుముందే గొప్ప నాగరికత ఉండేదని చరిత్రకారులు చెప్పారు. మొదట్లో దానిని "సింధులోయ నాగరికత"గా పేర్కొన్నప్పటికీ అది సింధు లోయకు మాత్రమే పరిమితంకాదనీ పశ్చిమాన బెలూచిస్తాన్, తూర్పున ఉత్తరప్రదేశ్, దక్షిణాన నర్మద - తపతి, అంతర్వేది, ఉత్తరాన హిమాలయ ప్రాంతపు రూపార్‌ల వరకు విస్తరించి ఉన్నదని స్పష్టమయింది. దానిని హరప్పా సంస్కృతిగా పిలుస్తున్నారు. ఇది మూల భారతీయ సంస్కృతి. ఈ నాగరికత విలసిల్లిన కాలానికి సంబంధించి భిన్నాభిప్రాయాలున్నప్పటికీ క్రీ.పూ. 18వ శతాబ్ది నాటికి ఈ నాగరికత క్షీణించిందని చరిత్రకారులు అంగీకరిస్తున్నారు.

భారత భూభాగంపై ఆర్యజాతులు స్థిరపడటానికీ హరప్పా సంస్కృతి క్షీణించటానికీ సంబంధం ఉన్నదని కొందరి అభిప్రాయం. అందుకు ఆర్యుల దాడులు కారణమని కారణమని కొందరు చరిత్రకారులు చెబుతుండగా వాతావరణ మార్పులు - (అట్లాంటిక్ తుపానులు, సింధునది ప్రవాహంలోని మార్పులు) కారణమని కొందరు పురాతత్వ శాస్త్రజ్ఞులు భావించారు. ఋగ్వేదంలోని ప్రస్తావనలనూ హరప్పా తవ్వకాలలో లభించిన సామగ్రినీ పరిశీలించిన మీదట ఆర్యుల దాడులవల్లనే హరప్పా సంస్కృతి ధ్వంసమయిందనే భావం బలపడింది.

ఋగ్వేద కాలం క్రీ.పూ. 1500-1000 మధ్య అనీ మలివేద కాలం క్రీ.పూ. 1000-600 అనీ కొందరు చరిత్రకారులంటున్నారు. ఋగ్వేద సూక్తాల సంకలనం క్రీ.పూ. 1700-1500 అనీ, క్రీ.పూ. 1500-1000 అనీ మరి కొందరి అభిప్రాయం. యజుర్, సామ, అధర్వణ వేదాలు క్రీ.పూ. 1200-900 నాటివనీ ఒక అభిప్రాయం

ఉంది. వేదసూక్తాలు మూల భారతీయ నాగరికతను తెలుసుకోవటానికి గొప్ప సాధనాలు. "కొత్త మంత్రాలతో స్తుతిస్తున్నాము" అనే మాటలు ఋగ్వేద సూక్తాలలో కొన్నిచోట్ల కనబడటం వల్ల వేదాల కర్తృత్వంలో అసురులకూ స్థానం ఉన్నదా అనే అభిప్రాయం కలుగుతుంది. పాత మంత్రాలు అసురులవై ఉంటాయా? వాటిని జర్భరీ, తుర్భరీ వంటి అపభాషణాలుగా ఆర్యులు నిరాకరించి తాము కొత్తవి చెప్పుకున్నారా అనేది ఆలోచించ వలసిన అంశం. అసురులు పూర్వ దేవతలుగా తొలివేల్పులుగా చెప్పబడటం ఈ ఊహకు ఆస్కారమిస్తున్నది. తొలివేల్పుల నాగరికత హరప్పా నాగరికత అయి ఉండవచ్చును. హరప్పా నాగరికత క్రీ.పూ. 5000–1500 మధ్య అనీ, క్రీ.పూ. 3000–1400 మధ్య కాలం అనీ, క్రీ.పూ. 2500–1750 మధ్య కాలం అనీ భిన్నాభిప్రాయాలున్నాయి. ఇది క్రీ.పూ. 2200 క్రీ.పూ. 2000 మధ్య అత్యున్నత దశలో ఉన్నదంటారు. ఆర్యుల వేదాలను శూద్రులు, స్త్రీలు చదవకూడదు - విన కూడదు, అన్నారు. చాటుగా వాటిని ఉండి విన్నందుకు హయగ్రీవుడనే దైత్యుడినీ సోమకాసురుడినీ విష్ణువు చంపాడు. విశ్వామిత్రుడు వేదాలు తెలుసుకోవటానికి ఎంతో ప్రయత్నించి ఎన్నో సంవత్సరాలు తపస్సుచేసి వాటిని తెలుసుకోగలిగాడు. వాటిలో ఏమీ లేదని అప్పుడు ఆయనకు అర్థమయింది. వేదం అంటే జ్ఞానం. తెలుసుకోవటం. ఎప్పటి కప్పుడు కొత్త సమాచారంతో ఆవిష్కరణలతో అది పరిపుష్టం కావాలి. అలాకాక పాత జ్ఞానాన్నీ సమాచారాన్నీ భద్రంగా దాచిపెట్టుకుని దానినే ప్రామాణికంగా భావించడం వల్ల సమాజ వికాసం కుంటుపడింది. వేదాల గురించి ఎన్నెన్నో కథలు ప్రచారంలో ఉన్నాయి. వేదాలు తెలుసుకునే అర్హత కొన్ని వర్ణాలకే ఉన్నదని ప్రచారం జరిగింది. శుభ కార్యాలలో వేదపఠనం ఒక వర్గంవారే చేయటం, దాన్ని గొప్ప గౌరవంగా చూడటం ఇప్పటికీ ఉంది.

వేదాలు అనంతాలు, అంటూ ఒక కథ చెబుతారు. వేదాలు నేర్చుకోవాలని భరద్వాజ మహర్షి చాలాకాలం ప్రయత్నించి చాలా కొద్ది భాగం మాత్రం నేర్చుకోగలిగాడట. ఇక ఇలా కాదని బ్రహ్మ గురించి తపస్సు చేసి వేదాలు పూర్తిగా నేర్పవలసిందిగా కోరాడు. 'వేదాలు మాకే అగోచరం" అన్నాడు బ్రహ్మ.

"వేదాలకు పరిమితి లేదు..." అంటూ వేదరాశిని చూపించాడు. అవి పర్వతాల లాగా గుట్టల్లాగా ఉన్నాయట. "వీటన్నింటినీ చదివే శక్తి నాకు లేదు. మీకు తోచినంత నాకు ఇవ్వండి" అని బ్రహ్మను అడిగితే ఆయన మూడు పిడికిళ్ళు వేదాలు భరద్వాజునికి ఇచ్చాడట. (ఇవి వస్తువుల వంటివా అని అనుమానం కలుగుతుంది). భరద్వాజుడు మూడింటి మంత్రాలు వేరుచేసి అధ్యయనం చేశాడట.

ఛందోబద్ధ మంత్రం ఋగ్ మంత్రం
గద్య మంత్రం యజుర్వేదం
గానాత్మక మంత్రం సామవేదం

'వేదాలను విభజించిన వాడు వేదవ్యాసుడని ప్రతీతి.' ఆ ప్రకారం అవి ఋగ్, యజుర్, సామ, అధర్వణ వేదాలుగా నాలుగు అయ్యాయి. అనంతర కాలంలో వచ్చిన పురాణాలలోను ఇతిహాసాలలోను వేదగాథల చాయలు కనిపిస్తాయి.

వేదకాలం క్రీ.పూ. 3000–1400 మధ్యకాలంగా చెబుతున్నారు. వేదాల చుట్టూ అల్లుకున్న కథలు ఆలోచనలు రేకెత్తిస్తాయి. వేద విద్యలు దాచిపెట్టుకోవటమూ, చాటుగా విన్నవాళ్ళని చంపటమూ కథలుగా చెబుతారు. హయగ్రీవుడు వేదాలు దొంగిలించాడనే కథ విన్నప్పుడూ అవి వస్తురూపంలో ఉండేవా అని అనుమానం వస్తుంది. వాటిని తిరిగితెస్తే గాని సృష్టి పూర్తిచేయలేనన్నాడట బ్రహ్మ.

వేదాల తర్వాత బ్రాహ్మణాలు, ఉపనిషత్తులు వచ్చాయి. ఇవి క్రీ.పూ. 800 – క్రీ.శ. 300 ప్రాంతాల నాటివంటారు. ఆరామాలలో, ఆశ్రమాలలో గురువు – శిష్యులు జిజ్ఞాసతో తర్కించుకోవటం అనేది జైన సంఘాలను, బౌద్ధ సంగీతులను గమనించిన మీదటనే వైదిక మతంలో మొదలయింది. ఆరణ్యకాలూ అప్పటివే. బ్రాహ్మణాలు కొన్ని జైన బౌద్ధాలకు ముందు, కొన్ని ఆ తర్వాతా వచ్చాయి. ధర్మశాస్త్రాలు (స్మృతులు) క్రీస్తుపూర్వం నాల్గవ శతాబ్ది తర్వాతివే. వాటి క్రోడీకరణ, గ్రంధస్థం చేయటం అనంతర కాలంలోనే జరిగింది.

శ్రుతులు (వేదాలు), స్మృతులు (ధర్మశాస్త్రాలు), ఇతిహాసాలు, పురాణాలలో శ్రుతులు ప్రమాణం. దానికి భిన్నంగా లేకపోతే స్మృతి ప్రమాణం. వీటికి విరోధించకపోతే ఇతిహాసం ప్రమాణం – దానితో విరోధించకపోతే పురాణం ప్రమాణం అంటారు పండితులు. కాని కాలక్రమంలో ప్రజలను పురాణాలవైపే మొగ్గుచూపే విధంగా తయారు చేశారు.

## పురాణాలు

"పురాభవ ఇతి పురాణం". పురాణాలు ప్రాచీన గాధలను తెలుపుతాయి. ఋగ్వేద సూక్తాలలో కనబడే చాలా గాధలకు పురాణాలు విస్తృత రూపాన్నిచ్చాయి. పురాణాలలో సృష్టిక్రమం, దేవదానవుల పుట్టుక, మనువుల పుట్టుక, వారి పాలనా విశేషాలు, సూర్యచంద్ర వంశాలలో పుట్టిన రాజుల చరిత్ర, వీరుల చరిత్ర, దేవుళ్ళ మహిమలు – స్తోత్రాలు, అప్పటి మత ధార్మిక ఆచార వ్యవహారాలు, విశ్వాసాలు – ప్రజలు అనుసరించవలసిన ధర్మాలు, వ్రతాల వివరాలు ఉంటాయి. ఇవి చాలావరకు ప్రతీకాత్మకాలు. అద్భుతమైన కల్పనలతో కూడి ఉన్నాయి.

పురాణాలలో ఏ కథ చెప్పినా దేవతల ప్రశస్తినే చెబుతారు. క్రతు విధానాలనూ, హోమాదికాలనూ చెప్పటంతోబాటు స్త్రీలు చేయవలసిన వ్రత విధులనూ వెబుతారు.

సాధారణంగా పురాణాలలో అయిదు అంశాలుంటాయి. సర్గ, ప్రతిసర్గ, వంశం, మన్వంతరం, వంశానుచరితం అనే ఈ అయిదు లక్షణాలూ పాఠకులను, శ్రోతలను

గాభరాపెట్టేస్తాయి. ఇదేదో మనకు అర్ధంకాని వ్యవహారం అంటూ సాహిత్య పాఠకులు కూడా వాటి జోలికి-పోరు. పౌరాణికులు చెప్పే కథలపైనే ఆధారపడతారు. పై లక్షణాలన్నీ సాధారణ విషయాలే - జటిలంగా చేయబడినాయి. (made difficult) ఎవరూ వాటి జోలికి పోకుండా భయపెట్టటానికే ఆ ఆర్భాటమంతా.

సర్గ - అంటే పరమాత్ముని గురించిన ఆలోచన.

ప్రతిసర్గ - మొదటి తరం మానవుల సృష్టిక్రమం - ప్రళయ క్రమం - జీవుల గురించిన ఊహలు - బ్రహ్మ నుండి ప్రజాపతులు వచ్చారనటం.

**వంశం** - ప్రజాపతుల నుండి సృష్టి కొనసాగిన విధానం. మొదటి రాజుల గురించీ మునుల గురించీ వారి వంశాల గురించీ ప్రచారంలో ఉన్నవీ మునులు చెప్పుకున్నవీ గాధలు.

**మన్వంతరం** - మనువులు - దిక్పాలకులు - (లోకాల అధిపతులు) వారి కాలంలో జరిగిన విశేషాలు - మునుల కథలూ ఇవీ ఉహలే -

**వంశాను చరితం** - భూగోళ, ఖగోళ వ్యవస్థలు, నదులు, కొండలు, వాటి వివరాలు, విశేషాలు, తీర్ధయాత్రలు, దేవుళ్ళు, వారి అవతార మహిమలు, పాప పుణ్యాల జాబితా, మరణానంతర అవస్థలు, వాటిని జయించిన వారి కథలూ మొ వి వినోదాత్మకంగానే ఉంటాయి.

పురాణాల ద్వారానే మానవుల సామాజిక, భౌతిక, మానసిక ప్రవర్తనలను నియంత్రిస్తూ వచ్చారు. పాలక వర్గాలూ, ఆధిపత్య వర్గాలూ, వీటిని తమ ప్రయోజనాలకు అనువుగా రూపొందించారు.

ఫలానా పురాణం ఇలా చెప్పింది, ఫలానా శాస్త్రంలో ఇలా ఉన్నది అంటూ విద్యా వంతుల కులాలు ఇతర కులాలను శాసించాయి. వారికి విద్యావకాశాలు లేకుండా చేసి పురాణాలలోనూ శాస్త్రాలలోనూ ఏమి ఉన్నదో వారు తెలుసుకోకుండా జాగ్రత్తపడ్డాయి. ఈ పురాణాలన్నీ వేర్వేరు కాలాలలో వచ్చినందున వీటిలో వైరుధ్యాలూ ఉన్నాయి. వాటిని పండితులు ఎలాగో సరిదిద్దేస్తుంటారు.

ప్రధానమైన పురాణాలు 18. 1. మార్కండేయ 2. మత్స్య 3. భవిష్య, 4. భాగవత 5. బ్రహ్మ 6. బ్రహ్మవైవర్త 7. బ్రహ్మాండ 8. విష్ణు 9. వాయు 10. వరాహ 11. వామన 12. అగ్ని 13. నారదీయ 14. పద్మ 15. లింగ 16. గరుడ 17. కూర్మ 18. స్కాంద పురాణాలు. శ్రీదేవీ భాగవతాన్ని, శివపురాణాన్నీ కూడా ఈ కోవలోనే చెబుతుంటారు. ఇవన్నీ మత పరమైనవి. కొన్ని విష్ణువు గొప్పతనాన్నీ, కొన్ని శివుని గొప్పతనాన్నీ చెబుతుంటాయి. కొన్ని ఆయా అవతారాల పరంగా వ్యాప్తిలోకి వచ్చాయి. ఈ పురాణాలన్నీ క్రీ.శ. 400 తర్వాతివే అని పండితుల అభిప్రాయం. ఇవికాక మరో 18 ఉప పురాణాలున్నాయి. ప్రధాన పురాణాలన్నీ వ్యాసుడు రాశాడనే చెబుతారు. ఇవిగాక

ఆది జాంబవ పురాణం. దక్కలి పురాణం వంటివి ఉన్నాయి. జైన ధర్మంలోనూ పురాణాలున్నాయి. బౌద్ధ ధర్మానికి సంబంధించి జాతక కథలు పురాణాల వంటివే.

**ఇతిహాసాలు**

ఇతి హఅస – ఇలా జరిగిందట అని చెప్పేవి ఇతిహాసాలు. ప్రాచీన సాహిత్యంలో మహాభారతం, రామాయణం ఇతిహాసాలుగా ప్రసిద్ధమైనాయి. ఇతిహాస్ అంటే హిందీలో చరిత్ర అని అర్థం. రామాయణ, మహాభారత కథలు చరిత్ర అనే కొందరు నమ్ముతారు. అవి కాల్పనికాలే అని కొందరంటారు. కొన్ని కొన్ని చారిత్రక సంఘటనల చుట్టూ అల్లిన కావ్యాలుగా వాటిని అంగీకరించవచ్చు. ఈ రెండింటికీ యుద్ధ నేపథ్యం ఉంది. ప్రపంచ సాహిత్యంలో ప్రసిద్ధమైన చాలా కావ్యాలకు ఈ లక్షణం ఉంది.

సాహిత్యం సమకాలిక జీవనాన్ని ప్రతిఫలిస్తుందనీ పురాణ గాధల ద్వారానూ ఇతిహాసాల ద్వారానూ ఆనాటి ప్రజల నాగరికతనూ జీవన విధానాన్నీ తెలుసుకోవచ్చుననీ పండితులు చెబుతుంటారు.

పురాణాల జాబితాలో లేకపోయినప్పటికీ రామాయణం, మహాభారతం, భాగవతం పురాణాలుగా చలామణీ అవుతున్నాయి.

రామాయణ మహాభారతాలలో ఏది ముందు అనే ప్రశ్న ఉంది. మహాభారతంలో రాముని గురించి ప్రసక్తి ఉన్నది కాబట్టి రామాయణమే ప్రాచీనం అంటారు కొందరు. భారతం, మహాభారతం రెండూ వేర్వేరనే వాదమూ ఉంది. కాలక్రమంలో ఇవి ఒకటిగానే గ్రంథస్థం అయ్యాయి. కాదు భారతమే ముందటిది అంటారు కొందరు.

కురుక్షేత్ర యుద్ధాలు రెండు జరిగాయని ప్రముఖ పండితులు శంకరనారాయణ గారి అభిప్రాయం. ఒకటి క్రీస్తుపూర్వం 25వ శతాబ్దంలోనూ మరొకటి క్రీ.పూ. 10వ శతాబ్దంలోనూ (950?) జరిగాయనీ గుర్తుపెట్టుకోవటంలో వాటిని ఒకటిగానే ప్రస్తావించుకుంటూ వచ్చారనీ ఆయన అన్నారు. మహాభారత యుద్ధకాలం క్రీ.పూ. నాల్గవ శతాబ్దం – క్రీ.శ. నాల్గవ శతాబ్దాల మధ్య అని VS. సుక్తాంకర్ గారి అభిప్రాయం.

రామాయణ, మహాభారత, భాగవతాలను, వేదాలను, ఉపనిషత్తులను తెలుగు పాఠకులకు అందించిన దాశరథి రంగాచార్య గారు కూడా "రామాయణం కాల్పనికం - కావ్యం. కావున అందులోని అన్నీ విధిగా జరగనవసరంలేదు. అందులోని స్థల ఆభూషణాదులు విధిగా ఈనాటికీ ఉండనక్కరలేదు. రామాయణ కథ కేవలం కల్పితం కాదు. అది వాల్మీకి నాటికి ప్రచారంలో ఉన్న కథ..." అన్నారు.

రామాయణ కాలం క్రీ.పూ. 400 – క్రీ.శ. 200 మధ్య అనీ భారతం రచనా కాలం క్రీ.పూ. 300 – క్రీ.శ. 300 మధ్య అనీ ఒక అభిప్రాయం ఉంది.

అప్పటి వ్యవస్థలోని గోబ్రాహ్మణ హితం, వర్ణ ధర్మం రామాయణంలో పదే పదే ప్రస్తావించారు. కర్మకాండను, యజ్ఞ క్రతువులను గొప్పగా చూపించారు. యజ్ఞాలతో

అన్నీ సాధ్యమవుతాయన్నారు. "పుత్రకామేష్టి" చేసి ఆ పాయసం తాగితే కొడుకులు పుడతారని చెప్పారు. పుత్ర సంతానం గురించి గొప్పగా చెప్పారు. దశరథునికి శాంత అనే కూతురు ఉన్నదనీ ఆమెను పెంపుడు ఇచ్చేశారనీ జానపదుల పాటల నుండి తెలుస్తున్నది తప్ప రాముని అక్కగా ఆమె గురించి రామాయణం విశదంగా చెప్పటం లేదు. కొడుకులే రాజులవుతారనటం పురుషాధిక్య సమాజాన్ని ప్రవేశపెట్టడానికే. స్త్రీ పాత్రలను దుష్ట స్వభావం కలవారిగా చూపటం, స్త్రీలు పురుషుల రక్షణలోనే ఉండాలనటం, పతివ్రతా ధర్మాలను పదే పదే భర్త భార్యకు, భార్య భర్తకు, కొడుకు తల్లికి, తల్లి కొడుకుకూ, అత్త కోడలికీ, కోడలు అత్తకూ చెబుతూండటం, ఏ ఇద్దరు స్త్రీలు కలిసినా పతివ్రతా ధర్మాలూ, స్త్రీ ధర్మాలూ ముచ్చటించుకోవటం రామాయణంలోనూ భారతంలోనూ కూడా కనిపించే అంశాలు. పురుషాధిక్య సమాజం వీటి లక్ష్యం. జైన బౌద్ధ ధర్మాలలోని సామాజిక వ్యవస్థను కాదని వర్ణాశ్రమ ధర్మాలను నిలబెట్టడానికి చేసిన ప్రయత్నం రామాయణ మహాభారతాలలో కనిపిస్తుంది.

"రామాయణం", ఆదికావ్యంగా ప్రసిద్ధం. కావ్యరచన అప్పటికే ఉన్నప్పటికీ రామాయణాన్ని సంస్కృతంలో - సంస్కరించబడిన భాషలో - చెప్పటంవల్ల దానిని ఆది కావ్యం అన్నారు. పురాణ సాహిత్యంలో 'కవి' అనే పదం శుక్రుని తండ్రి భృగువుకు స్థిరపడి ఉంది. అందుకే "కావ్యుడు" అనీ శుక్రుడిని పేర్కొంటారు. శుక్రుడు అసురగణాల ఆచార్యుడు. వీరి రచనలు ఏవీ తర్వాతి తరాలవారు ఎవ్వరూ ఉదహరించనైనా లేదు. అవి బహుశః పాళీ భాషలోనో, అపభ్రంశ భాషలలోనో ఉండి ఉంటాయా? సంస్కృత భాష మీది వ్యామోహంతో దేశభాషలలోని కావ్యాలను నాశనం చేశారా?

పైశాచి భాషలోని, "బృహత్కథ"ను తగలబెట్టినట్టే తగలబెట్టేశారా? అనేది ఆలోచించ వలసిన విషయమే. అసురుల ఆచార్యుని తండ్రి కవి అయినప్పుడు అసురులూ (మూలవాసులు/ ఆదివాసులు) కవితా స్పృహగలవారే అయి ఉంటారు.

బృహత్కథ ఏడు లక్షల పత్రాల గ్రంథం. దీనిలో సప్త విద్యాధరుల చరిత్ర ఉన్నది. ఆరు లక్షల పత్రాలు అగ్నికి ఆహుతికాగా లక్ష ఆకుల గ్రంథం - (నరవామన దత్త ప్రకరణం) మాత్రం మిగిలింది. అదే కథాసరిత్సాగరం. దీనిలోని వృత్తాంతాలన్నీ సామాన్య జనజీవితాన్ని తెలిపేవే. హరుని లీలలు ఎక్కువగా ఉన్నాయి. ప్రాకృతాన్ని శైవాన్నీ నిరసించే సమాజం వల్ల ఈ గ్రంథం నిరాదరణకులోనయింది. (విద్యాధరులు శివుని అనుయాయులు) శైవం తరువాత జైనమూ బౌద్ధమూ ప్రజలలో వ్యాప్తిచెందాయి. వీటి మధ్య వైషమ్యాలతో వైష్ణవం ముందుకు వచ్చింది. రాముడూ కృష్ణుడూ జనసామాన్యాన్ని ఆకర్షించే రీతిలో అవతార మూర్తులుగా నిలదొక్కుకునే విధంగా ఆ పాత్రల రూపకల్పన జరిగింది.

రామాయణాన్ని భారతీయ సంస్కృతికి ప్రతీకగా చెబుతూ ఉంటారు. "రామో విగ్రహవాన్ ధర్మః" అంటూ రాముడిని మూర్తీభవించిన ధర్మంగా కీర్తించారు. సమాజాన్ని

ఒక క్రమపద్ధతిలో నడిపించటానికే రాముడు అవతరించాడన్నారు. రాముని ధర్మం ఎలాంటిది? అంతకు ముందున్న ధర్మం ఎలాంటిది? రాముని ధర్మం సమకాలిక సమాజంలో ఏ వర్గానికి న్యాయం చేసింది? ఉదాత్తమైనవిగా సమాజానికి ఆదర్శప్రాయంగా తీర్చిదిద్దినట్లు చెబుతున్న పాత్రల లక్ష్యం ఏమిటి? అప్పటికి పూర్వం ఉన్న సమాజంలోని సామాజిక సంబంధాలు కొన్ని వర్గాలకు అనుకూలంగా లేకపోవటంవల్ల సమాజాన్ని తమకు అనుగుణంగా దిద్దుకోవటానికి అలాంటి పాత్రల రూపకల్పన జరిగిందా? అని ప్రశ్నించుకుంటే చాలా అంశాలు బోధపడతాయి.

రామాయణం, మహాభారతం ప్రతిపాదించిన అంశాలకు భిన్నమైన సామాజిక వ్యవస్థ పూర్వ సమాజంలో ఉండేది. స్వేచ్ఛాయుతమైన, క్రమబద్ధమైన జీవన విధానం ఉండేది. గణ రాజ్యాలు ఉండేవి. స్త్రీ రాజ్యాలు ఉండేవి. వర్ణధర్మం పేరిట గోబ్రాహ్మణాధికారం ఎక్కువైన కాలంలో ప్రజలు పాలకుల అధికారాన్ని ప్రశ్నించే పరిస్థితి ఏర్పడింది. మత విషయాలలో రాజ్యం జోక్యంచేసుకోవటంవల్ల స్థానిక అసుర జాతులు పాలకుల ఆధిపత్యాన్ని ప్రతిఘటించడం మహాభారత, రామాయణ కథలలో గమనించవచ్చు.

# సృష్టిక్రమం

సృష్టి స్థితి లయాల గురించి పురాణాలు ఎన్నో కథలు ప్రచారంలోకి తెచ్చాయి. మొట్టమొదట సృష్టిలో బ్రహ్మ, విష్ణువు ఇద్దరూ తమంత తామే పుట్టారట. కూర్మ పురాణం ప్రకారం కథ ఇది. విష్ణువు దగ్గరకు బ్రహ్మవచ్చి "ఈ సృష్టికర్తను నేనే. సృష్టి అంతా నాలో ఉంది. నీవెవరవు" అని అడిగాడు. "ఈ సృష్టి కర్తను నేనే. సృష్టి అంతా నాలోనే ఉంది" అన్నాడు విష్ణువు. ఈ విధంగా కొంత వాదన జరిగాక నిర్ధారణ కోసం విష్ణువు బ్రహ్మ నోటిలో నుండి పొట్టలోకి ప్రవేశించాడు. అక్కడ సృష్టి సమస్తమూ కనబడటం చూసి ఆశ్చర్యపడుతూ నోటి నుంచే బయటకు వచ్చేశాడు. ఈసారి బ్రహ్మ విష్ణువు పొట్టలోకి ప్రవేశించాడు. అక్కడ సృష్టి అంతా కనిపించింది బయటకు రాబోతే విష్ణువు నవరంధ్రాలూ మూసేశాడు. అప్పుడు విష్ణువు నాభిలోంచి (బొడ్డు) తామరతూడు బయటికి వచ్చింది. అందులోంచి బ్రహ్మ బయటపడ్డాడు. సృష్టిలో విష్ణువునూ బ్రహ్మనూ ముఖ్యులుగా చూపే లక్ష్యంతో అల్లిన కథ ఇది.

రామాయణంలో సృష్టిక్రమం గురించి రెండుచోట్ల ఉంది. వసిష్ఠుడు చెప్పిన కథనం అయోధ్యకాండ (సర్గ-110)లోనూ, జటాయువు చెప్పిన కథనం అరణ్యకాండ (సర్గ-14) లోనూ ఉన్నాయి. రామునికి వసిష్ఠుడు చెప్పిన సృష్టిక్రమం ఇలా ఉంది.

మొదట అంతా జలమే ఉంది. అందులో స్వయంభువులుగా బ్రహ్మ, దేవతలు పుట్టారు. నారాయణుడు వరాహ రూపం ఎత్తి నీటిలోని భూమిని పైకి తెచ్చాడు. బ్రహ్మ తన కొడుకులతో సృష్టి చేశాడు.

సృష్టిలో జీవం నీటిలో మొదలయిందా, నేలమీద మొదలయిందా అనే జిజ్ఞాస పూర్వ పండితులలో ఉన్నదనటానికి ఇలాంటి కథలు ఉదాహరణ ప్రపంచ మతాలలో చాలా సృష్టి కథనాలు ఉన్నాయి. భారతదేశ పురాణాల ప్రకారం సృష్టికి ఆద్యుడు బ్రహ్మ. బ్రహ్మ సృజించిన ప్రజాపతుల ద్వారా సృష్టి విస్తరించింది. ఆ పరంపరలో మనువు ఒకడు.

"ఈ భూమిని మనువు మొట్టమొదట ఇక్ష్వాకుకు ఇచ్చాడు. మనువు నిర్మించిన అయోధ్యకు మొదటి రాజు ఇక్ష్వాకు. ఆ వంశంలో త్రిశంకుడు శరీరంతోనే స్వర్గానికి వెళ్ళాడు. ఆ వంశంలోని వాడవే నీవు" అంటూ వసిష్ఠుడు 36 శ్లోకాలలో ఇక్ష్వాకు వంశ చరిత్ర చెప్పాడు. (అయోధ్యకాండ సర్గ. 110)

బ్రహ్మ కొడుకులు అంటే ప్రజాపతులు. వీళ్ళు ఆరుగురు : 1) మరీచి, 2) అంగీరస, 3) అత్రి, 4) పులస్త్యుడు, 5) పులహుడు, 6) క్రతువు - అని కొందరంటారు. వసిష్ఠుడిని కలిపి ఏడుగురని కొందరంటారు. దక్షుడినీ భరద్వాజుడినీ కలిపి తొమ్మిదిమంది అని మరికొందరు చెబుతారు.

భూమిపై జీవంపుట్టుక గురించి అధ్యయనాలు జరుగుతూనే ఉన్నాయి. సుమారు 400 కోట్ల సంవత్సరాల క్రితం భూమిని కొన్ని గ్రహ శకలాలు ఢీకొన్నాయనీ అవి భూమిని బలంగా తాకటంవల్ల లోతయిన బిలాలు ఏర్పడ్డాయనీ ఆ బిలాలలోని చీకటి, నీరు (చెమ్మ), వేడిమి - సూర్యరశ్మి మొదలైన జీవ రసాయన చర్యల ఫలితంగా ఏక కణ జీవులు ఉద్భవించాయనీ, అవే రకరకాల జీవులుగా పరిణామం చెందాయనీ శాస్త్రవేత్తలు చెబుతున్నారు.

అయినప్పటికీ సృష్టి కథనాన్ని గురించిన మతవిశ్వాసాలే ప్రజలలో ఎక్కువ బలంగా వ్యాప్తిలో ఉన్నాయి.

రామునికి జటాయువు చెప్పిన కథనంలో ప్రజాపతులు 16 మంది. ఆ పరంపరలో మొదటివాడు కర్దముడు.[1] అఖరివాడు కశ్యపుడు. కశ్యపుడే ఇక్ష్వాకులకూ జటాయువుకూ మూల పురుషుడు.

ప్రజాపతులలో ఒకడైన దక్షునికి 60 మంది కూతుళ్ళు. వారిలో ఎనిమిది మంది కశ్యపుని భార్యలు. అదితి, దితి, దను, కాళిక, తామ్ర, క్రోధవశ, మను, అనల. తనతో సమానులయిన లోకరక్షా పరతంత్రులయిన, పుత్రులను కనాలని కశ్యపుడు భార్యలకు చెప్పాడు. అందులో నలుగురే అతని మాటలు విన్నారట. (దితి అదితి కాళిక దను అనే వారు).

స్త్రీల ఇష్ట ప్రకారమే సంతానం కలుగుతుందనే భావన అప్పట్లో ఉండేదన్న మాట. స్త్రీలకు గల సంతానోత్పత్తి శక్తి ఆ నమ్మకానికి కారణం. అందుకే స్త్రీలకు వ్రతాలూ నియమాలూ విధించారు. మగ పిల్లవాడు కలగకపోతే దోషం స్త్రీ మీదనే వేయటం ఇప్పటికీ ఉంది. శాస్త్రజ్ఞానం విస్తరించక ముందటి నమ్మకాలే నేటికీ సమాజాన్ని నడుపు తున్నాయి.

**కశ్యపుని భార్యలలో :**

1. అదితికి ద్వాదశాదిత్యులు - అష్టవసువులు - ఏకాదశ రుద్రులు - అశ్వనీ దేవతలు అనే 33 మంది కలిగారు. వారు దేవగణాలు.
2. దితికి యశోవంతులయిన పుత్రులు కలిగారు. సముద్రాలతో, అరణ్యాలతో కూడిన ఈ భూమివారిదే. వారే దైత్యులు (సర్గ 14-15 అన్నాడు జటాయువు).
3. దనువుకు అశ్వగ్రీవుడు కలిగాడు.
4. కాళికకు నరకుడు, కాళకుడు కలిగారు.
5. తామ్రకు క్రౌంచి, భాసి, శ్యేని, ధృతరాష్ట్రి, శుకి అనే కూతుళ్ళు కలిగారు. పక్షి జాతులు వీరి నుంచి వచ్చాయి. క్రౌంచికి గుడ్ల గూబలు, భాసికి భాసజాతులు

---

1. చూ. అనుబంధం 1, 2, 3

(కోళ్ళు) శౌనికి డేగ/గద్ద జాతులు, ధృతరాష్ట్రికి హంసలు/కలహంసలు/చక్రవాక పక్షులు కలిగారు. శుకి కూతురు నత, నత కూతురు వినత.

6. క్రోధవశకు మృగి, మృగమంద, హరి, భద్రమద, మాతంగి, శార్దూలి, శ్వేత, సురభి, సురస, కద్రువ అనే కూతుళ్ళు కలిగారు. మృగికి మృగజాతులు – హరికి సింహాలు, వానరులు కలిగారు. భద్రమద కూతురు ఇరామతి. ఆమెకు ఐరావతం అనే ఏనుగు కలిగింది.

మాతంగి సంతానం ఏనుగులు. శార్దూలికి కొండముచ్చులు, పులులు మొదలైనవి కలిగాయి. శ్వేతకు దిక్పాలకులయిన ఏనుగులు కలిగాయి. సురభికి ఇద్దరు కూతుళ్ళు. వారిలో రోహిణికి గోవులు, గంధర్వికి గుర్రాలు కలిగాయి. (గంధర్వులను గుర్రపు ముఖాల వారుగా కొన్ని పురాణాలు వర్ణించాయి). సురస, కద్రువలకు సర్పాలు కలిగాయి.

వినత అనే ఆమె కశ్యపుని భార్య. ఆమెకు గరుడుడు, అరుణుడు కలిగారు. అరుణుని కొడుకు జటాయువు(వ). జటాయువు అన్న సంపాతి.

కశ్యపుని భార్యలలో 'మను' అనే ఆమెకు బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులనే మనుష్య జాతుల వారు ఉద్భవించారు. అనల అనే ఆమెకు ఫలవృక్ష జాతులు కలిగాయి.

ఇదంతా జటాయువు చెప్పాడు. సంపాతి గురించి కూడా రామాయణం (కిష్కింధా కాండ సర్గ. 56) చెప్పింది.

(వినత అనే పేరు కశ్యపుని మనుమరాలికీ ఉంది. ఆమె భర్త పేరూ కశ్యపుడే. సురస కద్రువ అనే పేర్లు కశ్యపుని భార్యల పేర్లు. అవే పేర్లు ఆయన కూతుళ్ళకు కనిపిస్తున్నాయి. వారి భర్తల పేర్లూ కశ్యపుడే. కుటుంబంలో ఒకే పేరు చాలా మందికి ఉండటం సాధారణమే కాని ఈ పేర్ల గందరగోళంవల్ల వేదాలలో కశ్యపుని ప్రసక్తి చాలా అపోహలు కలిగించింది.)

సమాజ పరిణామ క్రమంలోని లైంగిక సంబంధాల అధ్యయనానికి ఈ అంశం కీలకమైనదే. భిన్న గణాలలోని స్త్రీ పురుషుల మధ్య లైంగిక సంబంధాల గురించి మానవ శాస్త్రం చెప్పే విషయాలను ఈ కథలకు అన్వయించి పరిశీలించటం సామాజిక అవగాహనకు అవసరం.

జటాయువు దితి పుత్రులు మొదటి పాలకవర్గం అని చెప్పాడు. ఈ భూమి వారిదే.

"...దితి స్త్వ...దైత్యాం స్తాతత యశస్వినః తేషాం

ఇయం వసుమతీ పురాసీత్ సవనార్ణవా" (సర్గ. 14, 15) మొదట్లో పాలక వర్గం దైత్యులు అని దీనివల్ల అర్థమవుతుంది. ఆది దైత్యులు అనే మాట కూడా పురాణాలలో తరచు వినిపిస్తుంది.

దితి కొడుకులలో హిరణ్య కశిపుడు, హిరణ్యాక్షుడు ప్రముఖులు, కూతురు సింహిక, ఆమె భర్త విప్రచిత్తి. విప్రచిత్తి కొడుకు రాహువు, హిరణ్య కశిపుని సంతతిలోనివాడు

ప్రహ్లాదుడు. ప్రహ్లాదుని మనుమడు బలి చక్రవర్తి. వీరంతా అసురులూ, రాక్షసులూను. ఇతర ప్రజాపతులలో పులస్త్యునికి ఇద్దరు కొడుకులు. 1) అగస్త్యుడు 2) విశ్రవస్సు. వీరిలో విశ్రవస్సుకు ఇలబిల అనే భార్యవల్ల కుబేరుడు కలిగాడు. "కైకసి" అనే భార్య ద్వారా రావణ, కుంభకర్ణ, విభీషణులు కలిగారు, 'రాక' అనే ఆమె వల్ల ఖర, దూషణ, త్రిశిరులు కలిగారు. వీరంతా యక్షులూ, రాక్షసులూ, అసురులూను.

మరో ప్రజాపతి అయిన పులహుని సంతానమూ రాక్షసులే. ఈ వివరాలు మత్స్య పురాణంలోనూ ఉన్నాయి. ఋగ్వేద కాలపు తెగల నుండే 1) దేవగణాలు, 2) గంధర్వులు, 3) పితరులు, 5) అసురులు, 5) రాక్షసులు అనే అయిదు గణాలూ ఏర్పడ్డాయని నిరుక్త రచయిత యాస్కుడు చెప్పాడు. యాస్కుని కాలం క్రీ.పూ. 7, 8 శతాబ్దాలు; వలసలుగా వచ్చిన జాతులు ఈ కాలానికి స్పష్టంగా విడిపోయి ఎవరి ఉనికిని వారు నిరూపించుకునే ప్రయత్నాలలో పడ్డారు.ఆ క్రమంలో పరస్పర ఘర్షణలు అనివార్యమైనాయి. స్థానిక ప్రాబల్యానికి వీరంతా పోటీపడ్డారు.

మేరు పర్వత ప్రాంతం నుంచి వలసలు సాగినట్టు చెబుతున్నారు. వారిలో కొందరు నైలు నది పరిసరాలలో కొండలమీద నగరాలు కట్టుకుని స్థిరపడ్డారు. కొందరు కాస్పియన్ సముద్రం పక్క భూములలో స్థిరపడ్డారు. అస్సీరియా భాషలలో మెరక నేలలను "కుర్రు" అనీ, పల్లపు నేలల్ని 'తుర్రు' అనీ అనేవారని భాషా శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. (తెలుగు నాట కుర్రు (కుర్తి), తుర్రు (తుర్తి) అనే పదాలు గ్రామ నామాలకు చేరి ఉండటం గమనించవచ్చు. అది వాటి భౌగోళిక ఉనికిని నిర్ధారించే విశేషణం) నైలు నది దగ్గర కుర్రు భూముల నుంచి వ్యాపించిన వారు (మెడిటరేనియన్, ఫినీషియన్ మొ॥ జాతులు) కురు గణాలుగా వ్యవహరింపబడ్డారని ఒక వాదం ఉంది. 'సుమేరు'పదం మేరు పర్వతానికి సంబంధించిన పదం. ప్రాచీన సాహిత్యంలోనూ, పురాణాలలోనూ మేరు పర్వతానికి ప్రత్యేక ప్రతిపత్తి ఉంది. 'కశ్యప' పదం కాస్పియన్ సముద్ర సంబంధం కలిగిన పదం. ఇవన్నీ జాతుల ప్రాంతీయతను సూచిస్తున్నాయి.

ఋగ్వేదంలో సృష్టి కథనాలు రెండున్నాయి.

1. ఇంద్రరూప ప్రజాపతి దేహం నుంచి ఏడుగురు ఋషులు పుట్టారనీ, వారి నుంచి సృష్టి విస్తరించిందనీ ఋగ్వేదం (10-27-15)లో ఉంది.
2. ఋగ్వేదం (10-90)లోని పురుష సూక్తం వర్ణ ధర్మాలను కూడా కలుపుకున్నది. పురుష సూక్తం ప్రకారం ప్రపంచం ఒక మహాపురుషుని శరీరం నుంచి రూపుదిద్దుకుంది. పురుషుణ్ణి పశువుగా చేసి యజ్ఞం చేసినప్పుడు ఆయన తల ఆకాశమూ, నాభి అంతరిక్షమూ, పాదాలు భూమీ అయ్యాయి. వసంత రుతువు నేయి, గ్రీష్మ రుతువు సమిధ, శరదృతువు హవిస్సు అయ్యాయి

మనసులోంచి చంద్రుడూ, కంటిలోంచి సూర్యుడూ, నోటిలోంచి ఇంద్రుడూ-అగ్నీ-ప్రాణంలోంచి వాయువూ పుట్టారు. ఆయన నోరు (ముఖం) బ్రాహ్మణుడు అయింది. చేతులు రాజన్యులు, తొడలు వైశ్యులు అయ్యారు. పాదాల నుంచి శూద్రులు పుట్టారు.

ఈ కథనం యజుర్వేద వాజసనేయ సంహితలోను, అధర్వణ వేదంలో కొన్ని మార్పులతోనూ ఉంది. కొన్ని శతాబ్దాలు ఈ కథనం భారతీయ సమాజాన్ని శాసించింది. బ్రాహ్మణులు యజ్ఞపురుషుని ముఖం నుంచి పుట్టారనీ, ఉత్తమాంగం శిరస్సు కాబట్టి వారు ఉత్తమ జన్ములనీ సంకేతాలు వెళ్ళటంతో శూద్రులు హీన జన్ములనే భావన స్థిరపడి సమాజంలో వర్ణ ధర్మాలూ, వివక్షా పాతుకున్నాయి. దీనిని ప్రశ్నించే సాహసం చాలా కాలంవరకూ ఎవరూ చేయలేదు. లోక వ్యవహారాన్ని బట్టి శాస్త్రమూ సూత్రీకరణలూ ఏర్పడతాయి. యజ్ఞమే బ్రహ్మం, యజ్ఞకర్త బ్రాహ్మణుడే గొప్పవాడు అంటున్నాయి వేదాలు.

బ్రాహ్మణుని మాట ప్రకారం క్షత్రియుడు రాజ్యం పాలించాలి. వైశ్యులు వ్యాపారం చేయాలి. శూద్రులు ఈ అందర్నీ సేవించాలి, అనే నియమాలు బయలుదేరాయి. నేయి, చితుకులు, మెతుకులుగా రుతువులను చెప్పటంవల్ల ఈ యజ్ఞం మానసికం అని తెలుస్తున్నది.

పురుష సూక్తం చెప్పిన సృష్టి కథనాలు వర్ణధర్మాలకు అనుకూలంగా ప్రచారమయ్యాయి. ఇంద్రుడూ అగ్నీ కూడా నోటిలోంచే పుట్టారు గనుక బ్రాహ్మణుడూ, ఇంద్రుడూ అగ్నీ వంటి దేవగణాలూ, ఒకే కోవలోకి చేరిపోయారు. భూమిమీద బ్రాహ్మణులు భూదేవుళ్ళు అయ్యారు. నోరుపెట్టుకుని బతికే వర్గం అయ్యారు.

సృష్టి క్రమాన్ని వర్ణధర్మాలనూ కలగలిపి చెప్పిన మరో పురాణం ఆది జాంబవ పురాణం. సృష్టి ఎలా ఏర్పడిందో చెబుతూనే మానవులలో వర్ణాల ఏర్పాటు గురించి ముఖ్యంగా మాల మాదిగ కులాలు ఏర్పడటం గురించి ఈ పురాణం చెబుతోంది. అలాగే రాజ్యాల ఏర్పాటునూ చెప్పింది.

**ఆది జాంబవ పురాణం** ప్రకారం యుగాలు 18. అవి అనంత, అద్భుత, తమండ, తారజ, తండజ, అండజ, భిన్నాయక, భిన్నాయుక్త, అవాయుక్త, మహీరణ, మహారణ, విశ్వమయ, విశ్వావరణ, అలంకృత, కృత, త్రేతా, ద్వాపర, కలియుగాలు.

వీటిలో చివరి నాల్గింటినీ ఇతర పురాణాలు చెప్పాయి. ఆది జాంబవ పురాణం ప్రకారం మొదట్లో అంతా చీకటే ఉంది. జ్యోతిర్మహేశ్వరుడు పరబ్రహ్మ స్వరూపుడుగా తనంత తానే పుట్టాడు. ప్రణవ మంత్రం ఓంకారం పఠిస్తూ, పంచభూతాలు, పంచప్రాణాలు, పంచవాయువులు చేర్చుకొని బ్రహ్మాండ నిర్మాణం చేశాడు.

అది అనంత యుగంలో జరిగింది. అద్భుతయుగంలో వేద శాస్త్ర పురాణాలు నిర్మించాడు. తమండ యుగంలో నీరు - తామర కమలం - శంఖువు - ఆది జాంబవ ముని పుట్టారు. తారజ యుగంలో జ్యోతిర్మహేశ్వరుడు ఓంకారం జపించాడు. జలం

నుండి ఒక బుగ్గ, అందులో నుండి ఆదిశక్తి నాలుగు చేతులతో నుదుటిమీద కన్నుతో పుట్టింది. నుదుట నోము ఫలం, కళ్ళలో అయిదు వేదాలు, చెవులల్లో ఆరు శాస్త్రాలు, నాలుకమీద నక్షత్రం, పండ్లలో పరుసవేది, పుక్కిట వేదమంత్రం, బొడ్డున చింతామణి, వీపున వింజామర, అరచేతిలో తామర పద్మం, గోళ్ళల్లో గోమయం, అరికాళ్ళలో పద్మరేఖలు, పంచవేదాలు ఉన్నాయి. (ప్రణవ, రుగ్యజు, సామ, అధర్వణ వేదాలు).

ఆమె కొంతకాలం తపస్సులో ఉండి తన కంటే ముందు ఎవరైనా ఉన్నారా అని చుట్టూ చూసింది. అక్కడ అది జాంబవముని మరొక్క కమలంలో తపస్సుచేస్తూ కన్పించాడు. ఆమె అతన్ని సమీపించి పురుష కాంక్షతో నీదగ్గరకు వచ్చానని వేడుకొన్నది. ఆయన కోపగించుకున్నాడు. జ్యోతిర్మహేశ్వరుని ప్రణవనాద శక్తితో నాకన్న వెనక పుట్టావు కాబట్టి నాకు చెల్లెలవుతావు అన్నాడు. నీవు ఆదిమునివి, నేను ఆదిశక్తిని. నీకు నాకు ఎవ్వరూ భేదం పెట్టరు అని ఆదిశక్తి అన్నది. ఇద్దరూ తమకంటే ముందు పుట్టిన జ్యోతిర్మహేశ్వరుని దగ్గరకు వెళ్ళాలనుకున్నారు. తమ రూపాలతో వెళ్ళితే ఆయన కళ్ళు తెరచిచూడగానే భస్మమైపోతామేమో అనే భయంతో నెమలిపెట్టల రూపాలు ధరించి వెళ్ళారు. తమ పింఛాలతో జ్యోతిర్మహేశ్వరునికి చల్లగాలి విసిరారు. ఆయన కళ్ళు తెరచి ఎదురుగా ఉన్న నెమలి ఈకలను ఆనందంతో చూశాడు. ఆ ఆనందంలో కళ్ళనుండి మూడు బిందువులు రాలాయి. ఆదిపెట్ట అయిన ఆదిశక్తి ఆ బిందువును తాగింది. అక్కడికి తండజ యుగం ముగిసింది.

ఆదిశక్తి నెమలి అక్కడి నుండి బయలుదేరి ఎక్కడా చోటులేక తన చంకలకింది చెమటతీసి ఓంకార ప్రణవ జపం జపించి జలంపై చిమ్మింది. అప్పుడు భూమిలాగా బయలు కల్గింది.

ఆదిశక్తి తన మంత్ర ప్రభావంతో దాన్ని కదలకుండా చేసి దానిపైకెక్కి మూడు గుడ్లు పెట్టింది. మంత్రజలంతో 12 శిరస్సుల నాగేంద్రుని సృష్టించి గుడ్లకు కాపలా పెట్టింది. నాగశేషుడికి ఆకలివేసి ఆ గుడ్లు తాగాలనే కోరిక కల్గింది. వెంటనే ఆదిశక్తి తన పిక్క వెంట్రుకతీసి ఆదిశేషుని 12 శిరస్సులను కట్టివేసి ఆ శిరస్సుమీద గుడ్లను కదలకుండా పెట్టింది. పరమాత్మ ఆ మూడు గుడ్లకు అండము, పిండము, బ్రహ్మాండము అనీ అ, ఉ, మ కారములని పేర్లుపెట్టాడు. జ్యోతిర్మహేశ్వరుడు ప్రణవ మంత్రాన్ని జపించి మంత్రజలాన్ని ఆ గుడ్లపై చల్లాడు. తొమ్మిది ఘడియలలో ఆ గుడ్లు పగిలి వాటిలో నుండి బ్రహ్మ, విష్ణువు, శంకరుడు బయటికి వచ్చారు. గుడ్లలో చిన్న చిన్న ముక్కలను ఆ పరమేశ్వరుడు మంత్ర ప్రభావంతో పట్టి విసరగా పర్వతాలు, గుట్టలు, వృక్షాలు, మృగాలు పుట్టాయి. ఈ విధంగా సృష్టి ఏర్పడిందని ఈ పురాణం చెబుతోంది. సప్త సముద్రాలు, నదులు, సప్తద్వీపాలతో, (జంబూ, పక్ష, శాక, సాల్మలి, క్రౌంచ, కుశ, పుష్కర) సృష్టించిన భూఖండం 500 కోట్ల యోజనాలతో ఉంది. జ్యోతిర్మహేశ్వరుడే కామధేనువు, కల్పవృక్షాలను

పుట్టించాడు. త్రిమూర్తులను పెంచి విద్యావంతులుగా చేయడానికి ఆదిశక్తికి అప్పగించి జ్యోతిర్మహేశ్వరుడు అదృశ్యమైనాడు. ఆదిశక్తి కొంతకాలం త్రిమూర్తులకు విద్యా, బుద్ధులు నేర్పించింది. ఆ తర్వాత ఆమెకు మళ్ళీ పురుషకాంక్ష కలిగింది. బ్రహ్మ, విష్ణువు, శంకరుడు ఆమెను కాదని జాంబవముని దగ్గరకు పరుగెత్తారు. జాంబవుడు వారికి ఒక ఉపాయం చెప్పాడు. ఆదిశక్తి కోరికను అంగీకరించి ముందుగా స్నానంచేసి రమ్మని చెప్పమన్నాడు. ఆమె తన ఫాలనేత్రాన్ని ఒడ్డున ఉంచి స్నానానికి నీటిలో దిగగానే మీలో ఒకరు ఆ ఫాలనేత్రాన్ని ధరించి ఆమె బయటకి రాగానే ఆ నేత్రంతో చూసి ఆమెను భస్మం చేయవచ్చు, అని చెప్పాడు. ఆ విధంగా ఆదిశక్తి భస్మం కావడం భిన్నజ యుగంలో జరిగింది.

ప్రచారంలో ఉన్న అష్టాదశ పురాణ కథలలోకంటే ఈ పురాణంలోని కథ సృష్టి నిర్మాణాన్ని ఆవిర్భావాన్ని గురించిన భావనకు దగ్గరగా ఉన్నట్టు గమనించవచ్చు. మిగిలిన పురాణాలలో వలెనే జాంబవ పురాణంలో కూడా బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు సరస్వతి, లక్ష్మి, పార్వతులు భార్యలుగా ఉన్నట్లు చెప్పారు. ఈ కథనంలోని ప్రత్యేకత ఏమిటంటే భస్మమైపోయిన ఆదిశక్తి భస్మాన్ని 5 భాగాలు చేయడం. ఆ భస్మాన్ని బ్రహ్మ శిరస్సుమీద ఒక భాగం, విష్ణువు వక్షస్థలంమీదను ఒక భాగం, ఒక కుప్ప శంకరుని నాభిపైన పెట్టి ఆ కుప్పల నుండి సరస్వతి, లక్ష్మి, పార్వతులు వచ్చినట్లు చెప్పారు. ఇది జ్యోతిర్మహేశ్వరుడు చేసిన ఏర్పాటు. మిగిలిన రెండు కుప్పలలో ఒక కుప్ప నుండి జలవీర కన్యక, కమలాక్షి పుట్టారట వారిని జాంబవమునికి భార్యలుగా ఇచ్చాడట. 5వ భస్మపు కుప్ప నుండి 6 చేతులు, 3 శిరస్సులు కల్గిన శక్తి పుట్టింది. ఆమె కాళి. దేవదానవులకు యుద్ధాలు జరిగినప్పుడు రాక్షసులను చంపి వారి రక్తంతాగి ఆకలి తీర్చుకోవల్సిందిగా ఆయన కాళికి చెప్పాడట. ఇది భిన్నాయక యుగపు కథ.

దేవదానవ యుద్ధాలలో దేవగణానికి సహాయంగా కాళి ఉండడం అనే విషయం అష్టాదశ పురాణాలలోనూ చెప్పారు. జ్యోతిర్మహేశ్వరుడే పంచ బ్రహ్మలను పుట్టించి వారిని విశ్వకర్మలుగా చేశాడట. సృష్టిలోని చరాచర జీవులను, వస్తువులను వారే చేసినట్లు జాంబవపురాణం చెబుతున్నది. పంచలోహాలు తయారుచేసే క్రమంలో విశ్వకర్మకు చర్మపుతిత్తి కావాల్సి వచ్చింది. అదే సమయంలో జాంబవమునికి కుడి డొక్క నుంచి ఒక పిల్లవాడు కల్గాడని, అతనికి యుగ మహాముని అని పరబ్రహ్మ స్వరూపుడు పేరుపెట్టాడని జాంబవపురాణం చెబుతూంది. అది అవాయుక్త యుగం. చర్మపు తిత్తిని తయారుచేయడానికి ఏ మృగాన్ని చంపినా పాపం చుట్టుకుంటుంది కాబట్టి జాంబవముని తన కుమారుణ్ణే చంపి ఆ చర్మాన్ని తిత్తిచేయడానికి విశ్వబ్రహ్మకు ఇచ్చాడు. మరణ సమయంలో ఆ కుమారుడు ఇచ్చిన శాపంవల్ల జాంబవ మహాముని చండాలుడు అయ్యాడట. విచారంతో ఉన్న జాంబవమునికి జ్యోతిర్మహేశ్వరుడు ప్రత్యక్షమై ఆ శాపం వల్ల కలియుగంలో నీ మనుమలు చండాలురై, అంటరానివారై, పంచములని పిలువబడి కష్టాలు పొందుతారని

10,000 సంవత్సరాలు గడిచిన తర్వాత శాప విమోచనమై పూర్వపు జపతపాలు పొందుతారని చెప్పాడట.

ఇది అముదాయుక్తం అనే యుగంలోని కథ. లోకకళ్యాణం కోసం తన కుమారుడిని ఆది జాంబవముని చంపడం ఇందులో ముఖ్యంగా కన్పిస్తుంది. ఇలాంటి సంఘటనలు ఇతర మతాలలోను (ఇస్లాం, క్రైస్తవం) కన్పిస్తాయి. శివభక్తుల కథల్లోను (చిరుతొండనంబి కుమారుని చంపి అతిథులకు ఆహారంగా వండి వడ్డించటం) ఇటువంటి కథలున్నాయి.

పరాత్పరుడు శంకరుని దేహం నుంచి ఒక బాలుని (శాస్య మహాముని), రుద్ర కన్యకను, శివసానులను పుట్టించినట్లు రుద్రకన్య ఆ బాలునికి భార్యగా చేసినట్లు వారందరికి లింగాలు ధరింపచేసి వారిని ప్రజలు నులక సంగయ్య (చందయ్య)లని పిలుస్తారు అని చెప్పినట్టూ మహీరణ యుగంలోని కథలో ఉంది.

యుగ మహాముని శరీరపు చర్మంతో తిత్తిని ఇతర పనిముట్లను తయారుచేశారు. చర్మపు తిత్తి పనిముట్లతో బంగారు, వెండికొండలు కరిగించి ఆభరణాలు, పాత్రలు త్రిమూర్తుల వివాహాల కోసం తయరుచేశారట. బ్రహ్మదేవుడు తపస్సులో ఉండి సరస్వతిని తలచుకొన్నప్పుడు ఇంద్రియ పతనం జరిగి దాన్ని ఒక కుండలో (కుంభం) పెడితే అందులో నుండి అగస్త్యుడు పుట్టాడు. పుట్టగానే అతనికి ఆకలి వేసింది. త్రిమూర్తుల వివాహాలకు వెళితే తన ఆకలి తీరుతుందని భావించి బయలుదేరాడట. అగస్త్యుడు వస్తే వండిన పదార్థాలన్నీ ఆయనకు సరిపోతాయని, తమకేమీ మిగలవని ఆయనను అక్కడికి రాకుండా చేశారట. ఫలితంగా విశ్వబ్రహ్మ కులంవారు శాపాలకు గురి అవ్వడం – జ్యోతిర్మహేశ్వరుడు ఆ శాపాన్ని మరికొందరికి పంచడం (పాతాచి, వాతాచి) వంటి వృత్తాంతాలు మన్వరణ యుగంలో (మహారణ?) చెప్పారు. అగస్త్యుడు, వాతాచి, పాతాచి అనే రాక్షసుల పేర్లు కొంత భిన్నంగా ఇతర పురాణాలలో కన్పిస్తున్నాయి.

జాంబవముని వివాహం, అతనికి కుమారులు కల్గడం – చపల మహాముని పుట్టడం త్రిమూర్తులకు పరబ్రహ్మ వారి వారి విధులు చెప్పి మూడు లోకాలు వారికి ఇవ్వటం, పంచ బ్రహ్మలకు వారి వారి గోత్రాలు చెప్పడం వంటివి విశ్వమయ యుగంలో చెప్పారు. ఇందులోనే బ్రహ్మ మానసపుత్రుల జననం, పార్వతి వినాయకునికి ప్రాణం పోయటం వంటి కథలున్నాయి. జాంబవ మహాముని కుమారుల పరంపరలో మతంగ మహాముని జననం ఇందులోనే చెప్పారు. ఇతడు క్షురమహామునికి సత్యలోకం నుంచి వచ్చిన బ్రాహ్మణ కన్య శ్యామలాదేవికి పుట్టాడట. మతంగ మహాముని తనను కర్దమ ప్రజాపతి అని పిలిచేలాగా బ్రహ్మ నుంచి వరం పొందాడట. అతడు మనువు కుమార్తె అయిన దేవహూతిని పెండ్లాడి 9 మంది కుమార్తెలను పొందాడు. వారిలో అరుంధతి ఒకతె. అతడు సన్యాసం స్వీకరించాలని అనుకుంటున్న సమయంలో "కుల్యాన్ని ఉద్ధరించడానికి ఒక పురుష సంతానాన్ని కన్న తర్వాత సన్యాసాన్ని స్వీకరించండని" ఆయనను కోరగా అంగీకరించి గృహస్థాశ్రమంలోనే ఉండిపోయాడట. అప్పుడు పుట్టినవాడు కపిలుడు.

పురుష సంతానానికి ప్రాముఖ్యమివ్వటం, కుల, వర్గ భేదాలు ప్రస్తావించటం విశ్వమయ యుగ లక్షణంగా గ్రహించవచ్చు. మతంగునితోనే సమాజంలో పంచమ వర్ణంగా భావించే వర్గం రూపొందినట్లు జాంబవపురాణం, ఇతర పురాణాలు చెబుతున్నాయి. సృష్టి క్రమం గురించి చెప్పటంలో పరబ్రహ్మ మానసపుత్రులు వారి వారి సంతానం - దక్ష ప్రజాపతికి ధరణికి, సతి అనే పేరుతో పార్వతి పుట్టడం మొదలైన అంశాలు విశ్వావరణ యుగం కథలో చెప్పారు. కశ్యపుని భార్యలు పదముగ్గురు - వారి నుంచి చరాచర జగత్తు పుట్టినట్లు పురాణాలు చెబుతున్నాయి. అదే కథ ఆది జాంబవ మహాపురాణంలోను ఉంది.

పరబ్రహ్మ స్వరూపుని మానస పుత్రులలో మరీచ మహాముని పుత్రుడు మాతంగ మహాముని. ఇతనికి, పుత్రి అనే ఆమెకు, పుట్టినవాడు కశ్యప ప్రజాపతి. ఈ విషయాలలో పురాణాలన్నీ ఏకీభవిస్తున్నాయి.

మతంగ మహాముని పుత్రి శ్రద్ధ. ఆమె అంగీరసునకు భార్య. వారి కుమారులు 1) బృహస్పతి 2) సంవర్ధుడు; కూతుళ్ళు 1) గుణాశ్రయ, 2) యోగసిద్ధి. ఈ పేర్లు ప్రతీకాత్మకంగా కన్పిస్తున్నాయి.

మతంగుని కూతుళ్ళలో అనసూయ, అత్రి మహాముని భార్య. ఆమెకు ధర్మాత్ములు, వేదవేత్తలు, సత్యపరులైన మునులు జన్మించారట. వీరు సప్తకోటి మునులు. మతంగ మహాముని మరో కూతురు ఆవిర్భువు పులస్త్యుని భార్య. వారి సంతానం క్రూర రాక్షసులు. మరొక కూతురు గతి. ఆమె పులహుని భార్య. వీరికి మతంగ సహచారులు పుట్టారు (గంధర్వులు). వారికి భుజాల మీద రెక్కలు ఇవన్నీ ఉన్నాయి. కళ భర్త మరీచముని. వారి కొడుకు కశ్యపుడు. కశ్యపుని భార్యలలో ఒక భార్య అయిన అదితికి దేవగణాలు, రెండో భార్య దితికి దైత్య, రాక్షసులు పుట్టారు. ఆ విధంగా వారు మతంగునికి కుమార్తె సంతానంగా రెండో తరంవారు.

మతంగుని కుమార్తెకు పులస్త్యుని వల్ల కల్గిన సంతానం క్రూర రాక్షసులు. వీరు కూడా రెండో తరంవారే. దైత్యులు, రాక్షసులు అసుర సమాజంలోని వారుగా ప్రసిద్ధులైనారు. దేవతల గురువైన బృహస్పతి మతంగుని మనుమడే. ఈ విధంగా రాక్షసులకు, దేవతలకు రక్త సంబంధం ఉండటం గమనించవచ్చు. (చూ. పట్టిక)

పరబ్రహ్మ స్వరూపుని హృదయం నుండి ప్రణవ మంత్ర ప్రభావంవల్ల భృగు మహర్షి పుట్టాడు. అతని భార్య ఖ్యాతి. ఆమె మతంగ మహాముని కూతురు. వీరి కుమారుడు కవి. కవి కుమారుడు శుక్రాచార్యుడు. ఇతను రాక్షసుల గురువు. ఇది విశావరణయుగపు కథ.

పరబ్రహ్మ స్వరూపుని సంకల్పంతోనే దేవగణాలు, గ్రహాలు అన్ని ఏర్పడ్డాయట. అతని కడుపులోనే పధ్నాలుగు లోకాలున్నాయట. అష్టదిక్కులకు దిక్పాలకులను ఏర్పరచి

పరబ్రహ్మ స్వరూపుడు ఇంద్రుడిని దేవతలకు అధిపతిగా నిర్ణయించి అదృశ్యమయ్యాడని అది జాంబవ మహాపురాణంలో ఉన్నది. దుర్వాసుని శాపంవల్ల ఇంద్రుని సంపద సముద్రంలో పడిపోయిందని, ఆ సంపదను పైకి తెచ్చుకోవటానికి పాల సముద్రాన్ని మధించవలసిన అవసరం ఏర్పడిందని పురాణాలు చెబుతున్నాయి. అప్పుడు మహా బలశాలులైన రాక్షసుల సహాయం ఇంద్రునికి అవసరమైంది. ఆ సమయంలో విప్రజిత్తు రాక్షసరాజుగా ఇంద్రుని రాజ్యాన్ని ఆక్రమించాడు.

దేవతలు రాక్షసులతో కపట స్నేహంచేసి సముద్ర మథనంలో సహాయం కోరారు. సముద్రాన్ని చిలకటానికి మందర పర్వతాన్ని గరుత్మంతుడు తీసుకొని వచ్చి పాల సముద్రంలో ఉంచినప్పుడు అది మునిగిపోతూ ఉండగా ఆది జాంబవముని ఆ పర్వతం కింద తన మోకాలిని అన్ని కూచున్నాడట. అప్పుడు నారాయణుడు కూర్మ రూపం ధరించి మందర పర్వతాన్ని జాంబవముని మోకాలిపై నుంచి తీసి తన వీపుమీద పెట్టుకొన్నాడు. ఈ వివరం ఇతర పురాణాలలో లేదు. అమృతాన్ని దేవతలకు, రాక్షసులకు పంచే సందర్భంలో జాంబవ పురాణం మరికొన్ని వివరాలు చెబుతున్నది. అప్పుడు జరిగిన యుద్ధంలో ఎవరు ఎవరితో తలపడ్డారో వారి పేర్లు వివరంగా చెప్పింది. దేవతలు ఆ యుద్ధంలో జయించారు. బ్రహ్మ ఊర్వశిని బలాత్కరించినట్లు, అది చూసి శంకరుడు తన కత్తితో బ్రహ్మ శిరస్సును ఖండించినట్లు ఆ శిరస్సు భూమిమీద పడితే లోకాలు భస్మమైపోతాయనే భయంతో దానిని మృగశిర నక్షత్రంగా చేసినట్లు, ఆ పరాత్పరుడు విష్ణువు నాభి నుండి పద్మాన్ని సృష్టించి, ఆ పద్మంలో బ్రహ్మదేవున్ని కూర్చుండబెట్టినట్లు, తరవాత ఆ పద్మం మూసుకుపోయినట్లు జాంబవ పురాణం చెబుతున్నది. ఇది అలంకృత యుగపు కథ. ఈ యుగానికీ కలియుగానికీ అనేకకోట్ల సంవత్సరాల అంతరం ఉన్నదట.

బ్రహ్మవల్ల ఊర్వశికి కల్గిన వసిష్ఠుడు కులానికి గురువై చతుర్వర్ణాలను ఏర్పరిచాడట. ఆ తర్వాతనే వ్యాసుడు పంచవేదాలను స్వాధీనం చేసుకొని, 24 కులాలు, 18 వర్ణాలు ఏర్పరచాడని జాంబవ పురాణం చెబుతున్నది. పరబ్రహ్మ స్వరూపుడు బ్రహ్మకు జన్మించిన వసిష్ఠునికి బ్రాహ్మణత్వం అనుగ్రహించాడు. అతడే దేవతలకు గురువుగా బృహస్పతిని, రాక్షసులకు గురువుగా శుక్రాచార్యున్ని నియమించాడు. 56 రాజ్యాలను నిర్ణయించి 56 చక్రవర్తులను నియమించి వారికి గురువుగా వసిష్ఠుని నియమించాడు.

జాంబవ పురాణంలోని కథలు కింది అంశాలను స్పష్టంచేస్తున్నాయి.

పరాత్పరుని సంకల్పం మాత్రం చేతనే ఈ సృష్టి ఏర్పడిందని చెప్పటం, పక్షి గుడ్ల నుండి పిల్లలు వెలువడ్డం గమనించిన దశలో ఈ సృష్టి కూడా అండ, పిండ, బ్రహ్మాండాలుగా ఏర్పడినట్లుగా ఊహించడం, సంతానోత్పత్తి శక్తి స్త్రీలకే ఉండడంవల్ల సృష్టి అంతా ఆదిశక్తి నుండే కల్గిందని ఊహించడం – స్త్రీ సంతానాన్ని ప్రముఖంగా భావించడం – రాజ్యాధికార, వారసత్వ పోరాటాలలో స్త్రీలకు ప్రాధాన్యత తగ్గించి పితృస్వామ్యాన్ని బలపరచడం, ఆధిక్యత,

ఆధిపత్యాల నిర్ధారణకు పుట్టిన వంశాన్ని, కులాన్ని పరిగణించటం లాంటివన్నీ మానవ పరిణామక్రమానికి సంకేతాలు.

ఈ కథల్లో అసంగతాలు, శాప వృత్తాంతాలు, సంకల్ప మాత్రంచేత ఏర్పడ్డాలు కనిపిస్తాయి. శాపాలన్నీ జాతులమధ్య ఉన్న అసూయా ద్వేషాల ఫలితంగానే కల్గినట్లు స్పష్టంగా తెలుస్తున్నది. రామాయణ కథలో యక్షజాతికి చెందిన తాటకను రాక్షస స్త్రీగా అవుతావని శపించడం, మార్కండేయ పురాణంలో పురోహితుని మాటలను పాటించని రాకుమారుడు పిశాచరూపం పొందటం, తండ్రి మాట పాటించని కొడుకు చండాలుడుగా అవటం గమనిస్తే ఇవి పుట్టుకతో ఏర్పడినవి కావనీ కింది కులాలమీద ఉన్న రకరకాల ఆంక్షలు ఆధిపత్య వర్గం ఏర్పరిచినవే అనీ తెలుస్తున్నది. కింది వర్గాలను తమతో కలుపుకోవాల్సిన అవసరం ఏర్పడినప్పుడు సోదరభావాన్ని, సంబంధాన్ని చూపటం చాలా ప్రాచీనమైన ఆలోచన. బలవంతులైన అసురగణాల సహాయం కావాల్సినప్పుడు దేవతలు వారితో మైత్రి పాటించడం, ఫలితాలను పొందిన తర్వాత వారిని దూరంగా పెట్టడం, వారి అధికారాలను లాక్కోవటం పురాణాలలో కన్పిస్తున్నది.

సృష్టి పరిణామక్రమాన్ని ఎంతో వివరంగా చెబుతున్న ఆది జాంబవ మహాపురాణం లోని మొదటి 3, 4 అధ్యాయాలు జానపదుల/మానవుల ఊహలను ప్రతిబింబించేవిగా ఉన్నాయి. ఆ పురాణం ఒక తరం నుండి మరొక తరానికి మౌఖికంగా పాటల రూపంలోను, కథల రూపంలోను అందజేయబడుతూ ఉండడంవల్ల అందులో ఎక్కువ మార్పులు చోటు చేసుకోలేదు.

ఆది జాంబవ పురాణం ప్రకారం చపల మహాముని వంశంలో మతంగుడు తొమ్మిదో తరంవాడు. అతని మనుమడు కశ్యపుడు.

మతంగుడు తపస్సుచేసి తనను కర్దమ ప్రజాపతి అని పిలిచేలా వరం పొందాడు. పేరు మార్పు ఎందుకు అవసరమయిందో? అనేది ప్రశ్న. 'మతంగ' నామం అప్పటికే కింది కులాన్ని సూచించే లాగ ఉన్నదా? మతంగుడు పేరు మార్చుకున్నాడా? కులం మార్చుకున్నాడా? మతం మార్చుకున్నాడా? అనేవి పరిశోధించవలసిన అంశాలు. (కర్దమక వంశం చరిత్రలో ఉంది.)

మతంగుని తొమ్మిది మంది కూతుళ్ళు. కళ, శ్రద్ధ, అనసూయ, హవిర్భువ, గతి, ఖ్యాతి, గ్రియ, అరుంధతి, శాంతి అనేవారు. కపిలుడు వీరి సోదరుడు. గొప్ప విజ్ఞాని. అతడు తన తల్లి దేవహుతికి ఆత్మజ్ఞానం గురించీ యోగం గురించీ చెప్పాడట. పురాణాలు ఇతనిని గొప్పగా కీర్తించాయి. మతంగుల జ్ఞానాన్ని ఆర్య వాఙ్మయం అసహనంతో చూసింది. మతంగుని కర్దమునిగా చేసి బ్రాహ్మణీకరించుకున్నది. జ్యోతిర్మహేశ్వరుని మానస పుత్రులయిన మునులు మతంగుని (కర్దముని) అల్లుళ్ళు. కళ భర్త మరీచి. మరీచికీ కళకూ పుట్టినవాడు కశ్యపుడు. ఈ కశ్యపునికి దక్షుని కూతుళ్ళు అదితి, దితి, దను

మొదలైనవారు భార్యలు. వారిలో అదితికి ఆదిత్యులూ, దితికి దైత్యులు కలగటం వంటి విషయాలు రామాయణంలో జటాయువు చెప్పిన వివరాలతో సరిపోతున్నాయి. అయితే భూమి దైత్యులది అనే విషయం ఆది జాంబవ పురాణం చెప్పటం లేదు. జ్యోతిర్మహేశ్వరుడు 56 రాజ్యాలు నిర్ణయించాడనీ రాజులను ఏర్పాటు చేశాడనీ చెప్తున్నది. వసిష్ఠుడు చతుర్వర్ణాలు ఏర్పరచటం మానవులు శాపంతో చండాలురవటం వంటివీ చెప్పింది.

వర్ణ ధర్మాల ప్రచారం కోసమే ఇందులోనూ ప్రయత్నం జరిగింది. శాపగ్రస్తులను చండాలురుగా పంచమవర్ణంగా ప్రక్కకు పెట్టారు. తాము శాపగ్రస్తులమని వారిచేత నమ్మించారు.

విశ్వం పుట్టుక నీరు, గాలి, ప్రకృతి, కొండలు ఏర్పడటం, గ్రహాల ఆవిర్భావం వంటి వాటికి కోట్ల సంవత్సరాలు పట్టిందంటున్నారు శాస్త్రవేత్తలు. ఆది జాంబవ పురాణంలోని మొదటి 14 యుగాలూ ఈ క్రమానికి సరిపోతాయి. ఆధునిక అధ్యయనాల ప్రకారం ఈ పరిణామాలకు దాదాపు నాలుగు వందల కోట్ల సంవత్సరాలు పట్టింది.

సృష్టి, స్థితి లయాల నియమం గురించి శాస్త్ర పరిశోధనల వెలుగులోనూ ఆలోచించ వలసి ఉంది. ఛార్లెస్ డార్విన్ తన Origin of species అనే గ్రంథంలో పరిణామ క్రమంలో సృష్టిలోని రకరకాల జీవులు, జాతులు ఉద్భవించాయన్నాడు. తర్వాత శాస్త్రజ్ఞులు ఉత్పరివర్తనాలను కనుగొన్నారు. ఉత్పరివర్తనాల వల్ల ఒక జాతి నుంచి మరొక జాతి ఉద్భవించినట్లు తెలిసింది. పరిణామాత్మక మార్పు గుణాత్మకంగానూ వృద్ధిచెందటం ఒక నియమంగా శాస్త్రవిజ్ఞానం చెబుతున్నది. శిలాజాల, అస్థికల అధ్యయనంవల్ల ఆది మానవ జాతి తొలుత ఆఫ్రికా ఖండంలో ఉండేదని తెలిసింది. భూమిమీద ఇప్పటి ఖండాలన్నీ ఒకప్పుడు కలిసే ఉండేవనీ, సముద్రంలోని ఫలకాల కదలికల వల్లనూ వాతావరణ మార్పుల వల్లనూ, భూమండలం ఖండాలుగా విడిపోయిందనీ తెలిసింది. జలప్రళయాల వల్ల జీవుల వలసలు, కదలికలు అనివార్యమయ్యాయి. భూమార్గాల ద్వారా, జలమార్గాల ద్వారా వేర్వేరు ప్రాంతాలకు జీవులు వలసపోయాయి. జలప్రళయంలో కొన్ని జీవులు రక్షించబడటం అనేది మత్స్యపురాణం వంటి వాటిలోనూ, క్రైస్తవ మతగ్రంథమైన బైబిలు, కథనంలోనూ సూచించారు. ప్రధానంగా మూడు జల ప్రళయాలను చరిత్రకారులు, సముద్ర శాస్త్రాన్ని అధ్యయనం చేసిన నిపుణులూ చెబుతున్నారు. చరిత్రకు తెలియవచ్చిన మొదటి జలప్రళయం క్రీ.పూ. 14, 715 నాటిదని ఆచార్య కె. శ్రీనివాస రాఘవన్ అన్నారు. రెండోదాని గురించి భిన్నాభిప్రాయాలున్నాయి. మూడవది క్రీ.పూ. 2,278లో సంభవించిందని 'లాంబ్ సాంగ్ రాంప' అభిప్రాయం. అ ప్రళయాలలో ప్రాణాలు దక్కించు కొని వలసలు వెళ్ళిన మానవులు అయా వాతావరణాలను బట్టి రూపురేఖలలో వేర్వేరు లక్షణాలు సంతరించుకొని వేర్వేరు జాతులుగా అభివృద్ధి చెందారు.

జీవ పరిణామవాదులూ, పురాజీవ శాస్త్రజ్ఞులూ చెప్పే ప్రకారం భూమి ఏర్పడటమూ, ప్రాణికోటి ఆవిర్భావమూ కోట్ల సంవత్సరాల చరిత్ర కలది. ఆఫ్రికా ఖండంలో వివిధ

రకాల ఆఫ్రికాలో పితికస్ మానవులు పది లక్షల సంవత్సరాల క్రితం నివసించారట. ఈ క్రమ పరిణామ దశలలో సుగ్రీవో పితికస్, రామా పితికస్ అనే పేర్లు వినిపిస్తున్నాయి సుగ్రీవ అంటే చక్కని మెడ కలిగిన (మెడ నిర్మాణం బాగా ఉన్న) అని అర్థం. రామ పితికస్ అంటే అందమైన శరీర నిర్మాణం గల అని అర్థం.

మనోహరమైన రూపమూ అవయవ నిర్మాణమూ గల మానవాకృతిని 'రామ శబ్దం సూచిస్తున్నది. పురాణాలన్నీ మానవ సముదాయాలను ఒకే తండ్రి బిడ్డలుగానో పరాత్పరుని సంకల్పం చేత కలిగిన ప్రజాపతుల సంతానంగానో చెప్పటం గమనిస్తే వేర్వేరు జీవన రీతులు గల గణ సముదాయాలను కలిపి ఉంచే ప్రయత్నంగా దీనిని అర్థం చేసుకోవచ్చు.

కింది వర్గాలు తిరుగుబాటు చేయకుండా "అందరం సోదరులమే" అని సముదా యించి చెప్పటమూ ఇందులోని అంతరార్థం కావచ్చు. దాయాదులకు ఆస్తిలోనూ, అధికార పంపిణీలలోనూ కలహాలు సహజం అనే భావనతో ఈ పురాణాలను ప్రజలు ఆస్వాదిస్తారనే నమ్మకం కూడ పురాణ కర్తలకు ఉండి ఉంటుంది.

పురాణాలలోనూ, ఇతి హాసాలలోనూ తరచు వినిపించే "వర్ణ ధర్మం" అనే ఏర్పాటు సమాజాన్ని నిలకడగా ఉంచే ఏర్పాటుగా కొందరు నమ్మిస్తుంటారు. ఒక వర్గం మరో వర్గంపై పెత్తనం చేయటం అనేదాన్ని అత్యంత సహజంగా చూపుతూ ప్రశ్నించటానికి వీలు కానిదిగా వ్యవస్థీకృతం చేయటానికి దీనికి కర్మ సిద్ధాంతాన్ని జతపరచారు. ఈ క్రమంలో కింది వర్గాల 'ఆత్మగౌరవం' గురించిన ఆలోచనలు ఎవ్వరికీ రాలేదు. కింది వర్గాల ప్రజలకు కూడా ఆశలు, ఆలోచనలు, భావాలు, ఉద్వేగాలు ఉంటాయనే తలంపు ఎవరికీ కలిగినట్టు కనిపించదు. మనుధర్మం ప్రకారం పై వర్ణాలను సేవించటమే కింది వర్గాల జీవితం అయింది. అందుకోసం సృష్టి క్రమాన్నే తదనుగుణంగా మార్చారు. రామాయణమూ పురాణాలూ దానినే ప్రచారం చేశాయి.

సృష్టి కథనాలు ప్రపంచవ్యాప్తంగా భిన్నంగా ఉన్నాయి. అయినా వాటిలో కొన్ని పోలికలూ కనబడతాయి. బాబిలోనియన్ల ప్రకారం తియామత్ అనే సముద్రాధిదేవత డ్రాగన్ రూపంలో అనేక విచిత్ర జంతువులను సృష్టించి భూదేవతల మీద యుద్ధానికి తలపడింది. మర్దూక్ అనే సూర్యదేవుడు ఆమెను అతి కష్టంమీద ఓడించి ఆమె శరీరాన్ని రెండు భాగాలుగా చీల్చాడు. ఒక భాగంలో ఆకాశం మరో భాగంలో భూమి ఏర్పడ్డాయి. సుమేరియన్ల ప్రకారం "ఇయా" అనే జలదేవుడు దక్షిణం నుంచి ఎరిడూ రేవుకు వచ్చి అక్కడి ప్రజలను విజ్ఞానవంతులను చేశాడు. అతనికి మనిషి తల, చేపశరీరం, మనిషి పాదాలు, చేపతోక ఉన్నాయి. ఎరిడూ రేవు పర్షియన్ గల్ఫ్ తీరంలో ఉంది. "ఇయా" పగలు భూమిమీదకు వస్తాడనీ రాత్రి సముద్రంలోకి వెళ్ళిపోతాడనీ నమ్ముతారు. ఓడ

మీద ఆ రేపు పట్టణానికి వచ్చిన వారిని ప్రజలు అలా గుర్తుపట్టుకున్నారేమో. "ఎరిడూ" అనేది హిందూ పద పూర్వరూపం కావచ్చునని బ్రిటిష్ రచయిత "పీటర్ లమ్" ఊహ.

'మాంసం వండటం' అనేది జానపద గాథలలో సృష్టి సంబంధి ప్రక్రియగా ఒక కథగా ప్రాముఖ్యం సంతరించుకొన్నది. జాంబవముని దేవలోకంలో ఎద్దు మాంసం వండుతూండగా ఒక ముక్క పాత్రలో నుంచి కింద సముద్రంలో పడి వ్యాపించి భూమిగా మారిందని ఒక కథ వ్యాప్తిలో ఉంది. జాంబవముని ఎముకలు భూమిమీద వేయగా అవి పర్వతాలైనాయనీ కథలు ప్రచారంలో ఉన్నాయి.

చైనాలోని ఒక జానపద కథ ప్రకారం 'నూకువా' అనే దేవత భూమిని పళ్ళెంలాగ సృష్టించి పైన ఒక అర్ధగోళాన్ని బోర్లించి అది నేలకు తగలకుండా నాలుగు స్తంభాలు బోటు (ఊతం)గా పెట్టింది. వాటికి డ్రాగన్, ఎర్రపక్షి, తెల్లపులి, నల్ల తాబేలు కాపలా కాస్తుంటాయి. స్తంభాలు కదలకుండా దిక్పర్వతాలకు బిగించి కట్టింది. ఒక రాక్షసుడు వాటిని అల్లకల్లోలం చేసి సముద్రంలో దాక్కుంటే నీటిని నిప్పుతో ఆవిరిచేసి రాక్షసుడిని బయటకు లాగారు. ఈ గొడవల్లో పర్వతాలు ఒరిగిపోయాయి. స్వర్గం పాడైపోయింది. నూకువా దేవత అన్నీ బాగుచేసింది. నల్ల తాబేలు కాళ్ళు కోసి స్తంభాలకి మరమ్మతులు చేసింది. స్వర్గాన్ని నిలబెట్టింది. ఇలాంటి కథలలోని సంఘటనలు హిందూ పురాణ గాథలను జ్ఞప్తికి తెస్తుంటాయి. సృష్టి స్థితి లయాలను గురించిన ఆలోచనలు అన్ని మతాలలోను చర్చకు వచ్చాయి. పుట్టుకతోనే మానవులు వర్ణాలుగా విభజింపబడటం మాత్రం ఏ మతంలోనూ లేదు.

అలాగే పరలోక జీవనం గురించిన ఆలోచనలలోనూ చాలా సాదృశ్యం కనిపిస్తుంది. ఇస్లాంలోనూ క్రైస్తవంలోనూ కూడా మృతుల పాపపుణ్యాల విచారణ గురించి చాలా చెప్పారు. ఇస్లాం మతం ప్రకారం జీవి మరణావస్థ నుంచి పితృలోకం (ఆలమెబర్గఖ్)లో ప్రవేశిస్తాడట. అక్కడ రకరకాల దశలు అనుభవించిన తర్వాత ప్రళయదినాన తిరిగి బతుకుతాడట. మృతులందర్నీ అప్పుడు ఒక మైదానంలోకి ప్రవేశపెడతారు - అది హష్ర్ పునరుత్థాన మైదానం. అక్కడ కర్మల విచారణ జరుగుతుంది.

కర్మ ఫలాలు అనుభవించటానికి జీవులు నిర్ణీత స్థలాలకు వెళ్తారు. ఈ ప్రయాణం లోనూ ఎన్నో దశలుంటాయి. అవన్నీ దాటాక శాశ్వత గమ్యంగా నరకానికో స్వర్గానికో చేరతారు. ప్రాపంచిక సంపదలను చూసి భ్రమపడకూడదనీ మంచి జీవనం సాగించాలనీ పరలోక జీవన సాఫల్యానికి ప్రయత్నించాలనీ అప్పుడే శాంతి లభిస్తుందనీ ఖురాన్ చెబుతోంది. (28-60/29-64/3-14/10-24, 25).

క్రైస్తవ మతంలోనూ, మృతులు ప్రళయపు రోజున తిరిగి లేవటం - ప్రతి ఒక్కర్నీ పాప పుణ్యాలూ విచారింపబడటం అనే విషయం ఉంది.



భౌతిక సుఖాలకు ఆశపడక దైవజనులుగా సన్మార్గంలో జీవితాలు గడపాలని ఏసుక్రీస్తు బోధించాడు. ఏసు చేసిన కొండమీది ప్రసంగం (మత్తయి 5-1-12) ప్రపంచంలో ఎందరినో ఆకర్షించింది. పరలోక రాజ్యమే లక్ష్యంగా అక్కడి సుఖశాంతులే పరమార్థంగా క్రైస్తవం చెప్పింది.

హిందూ పురాణాల ప్రకారం యమధర్మరాజు కార్యదర్శి చిత్రగుప్తుని దగ్గర జీవుల పాప పుణ్యాల చిట్టా ఉంటుంది. ఆ ప్రకారం పాప, పుణ్యలోకాలు నిర్ధారిస్తారు. పాప, పుణ్యాల ఫలాల అనుభవం అయ్యాక కర్మల ప్రకారం పునర్జన్మలుంటాయి. స్వర్గంలో అనుభవాలు ఫైవ్‌స్టార్ హోటళ్ళ అతిథ్యాలలాగా ఉంటాయి. ఎన్నాళ్ళు బుక్ చేస్తే అన్నాళ్ళు, నరకంలో జీవితం ఇప్పటి పోలీసుల లాకప్ శిక్షలు – జైలు శిక్షలను తలపిస్తుంది. ఆ శిక్ష అయ్యాక మళ్ళీ పునర్జన్మ. పాపాలు చెయ్యటం, పుణ్యాలు చెయ్యటం అనేది జీవి వశంలో ఉండదు. "బుద్ధి కర్మానుసారిణీ" అన్నారు. మంచిబుద్ధి, చెడ్డబుద్ధి కర్మ ప్రకారమే కలిగినప్పుడు జీవి చేయగలిగింది ఏమీలేనట్టే. పాపపుణ్యాల ఫలాలు కూడా వర్ణాన్ని బట్టే నిర్ణయమౌతూ ఉండటమూ పురాణాలు చెప్పాయి. ఆ నిర్ణయాలను మార్చగలిగిన పూజాదికాలు, క్రతువులూ చెప్పాయి. అయినా, "చేసేది నీవు కాదు – చేయించేది నేను. నీవు నిమిత్త మాత్రుడివి" అంటాడు గీతాకారుడు. ఇదొక చక్రవ్యూహం.

సృష్టి క్రమం గురించి మనుస్మృతి, విష్ణు పురాణమూ, మత్స్య పురాణమూ (అధ్యా. 4) రకరకాల కథలు వినిపించాయి.

మహాత్మా జోతిరావ్ పూలే పురాణాలను నిశితంగా అధ్యయనం చేశాడు. ఆయన తన విమర్శను సంభాషణాత్మకంగా జోతిరావ్‌కూ ధోండిబా (నామదేవ్ కుంభర్)కూ జరిగినట్టుగా రాశారు. ("స్లేవరీ" గ్రంథం) సృష్టిని గురించి పురాణాలు చెప్పిన అసంగత విషయాల గురించి చర్చించుకుంటూ బ్రహ్మ నాలుగు వర్ణాలనూ, నాలుగు అవయవాల నుంచి పుట్టించటం ఎలా సాధ్యమయింది. అన్ని జననాంగాలున్నాయా, ఎంత కాలం గర్భం ధరించాడు? వారి తల్లి ఎవరు? ఆమె ఏ అవయవం నుంచి పుట్టింది వంటి ప్రశ్నలు వేసుకుంటూ తోచిన సమాధానాలు చెప్పుకుంటూ వచ్చారు. ఈ భూమిమీద ఫ్రెంచి, జర్మన్ లాంటి జాతుల ప్రజలున్నారు కదా! వారు ఏ అవయవాల నుంచి పుట్టారో? ఈ విషయంలో మనుస్మృతి ఏం చెబుతోందీ అని ప్రశ్నించుకుని అది వారి గురించి ఏమీ చెప్పలేదని నిర్ధారించుకున్నారు. చివరకు ఇలాంటి విషయాలు ఆలోచించటం – తర్కించటం సమయాన్ని వృథా చేయటమే అని తీర్మానించుకున్నారు.

శరీరంలో ఒక అవయవం గొప్పదనీ ఒకటి తక్కువ అనీ అనుకోవటం మూర్ఖత్వం – అది నిర్ణయించటం సాధ్యంకాదు. ఒక వర్గం మరోవర్గం కంటె ఎక్కువా కాదు, తక్కువా కాదు అని పూలే చెప్పారు. అందుకే యూరప్ దేశాలు ఒక వర్గం మరో వర్గానికి దాస్యం చేయటం అనే దాన్ని (బానిసత్వం) నిర్మూలించాయన్నారు.

# పురాణాలలో కనబడే జాతులు

ప్రాచీన కాలంలో భారతదేశంలో నివసించిన జాతుల గురించి పరిశోధనలు చాలానే జరిగాయి. చరిత్ర చెప్పిన సత్యాలకన్నా ఆర్య వాఙ్మయం చెబుతున్న కథనాలే జనంలో ఎక్కువ ప్రచారంలో ఉన్నాయి. అవి మూఢ నమ్మకాలకు దారితీస్తూ వర్గ, వర్ణ విభేదాలను బలపరుస్తున్నాయి.

పురాణ కథలలో నాగులు, యక్షులు, రాక్షసులు, అసురులు, దేవగణాలు ప్రధానంగా కనిపిస్తారు. రామాయణ కథలో వానరులు ప్రత్యేకంగా కనిపిస్తారు. వీరేగాక దైత్య, దానవ, గంధర్వ, ఉరగ, పతగ, కిన్నర, గరుడ, మతంగ, సుర జాతుల ప్రసక్తి కనిపిస్తుంది. ఈ జాతులు ఎలా పుట్టాయో చెప్పే వివరాలూ ఉన్నాయి. వాస్తవానికి పైన పేర్కొన్న జాతులన్నీ మానవ సముదాయాలే. ఇందులో చాలాపేర్లు సంస్కృతీకరించబడిన పేర్లు. ఆర్య వాఙ్మయం స్థానిక జాతులను వారి గణ చిహ్నాలతో చెప్పింది. కొన్ని సందర్భాలలో గణ చిహ్నాలనే వారి రూపాలకూ అన్వయించింది. ఆర్య జాతులు భారతదేశంలో ప్రవేశించినప్పుడు స్థానిక జాతులు వారిని అడ్డుకున్నాయి, ప్రతిఘటించాయి. ఆ పోరాటాలలో స్థానిక వీరుల రణ కౌశలమూ వేగమూ గమనించిన ఆర్య జాతులు స్థానికులను తమ భాషలో ఆయా సంకేతాలతో గుర్తుంచుకున్నారు. శత్రువులు తరుముతున్నప్పుడు పాములలాగా నేలకు జారిపోతూ అతివేగంగా పాకుతూ తప్పించుకునే వారిని సర్పజాతులుగా నాగులుగా పన్నగులుగా ఉరగులుగా చెప్పారు. లాఘవంగా ఎగురుతూ చెట్లమీదికి ఎగబాకే వారిని గరుడ, పతగ జాతులుగానూ, కొండచరియలలో దాక్కుని అదృశ్యంగా పోరాడే వారిని యక్ష జాతులుగానూ ఇలా వారికి తోచిన రీతిలో ప్రతిఘటనా లక్షణాలను బట్టి చెప్పుకున్నారు.

భౌగోళికమైన మార్పులవల్లనూ ఉన్నచోట మౌలిక సదుపాయాలు లేకనూ ప్రజలు వలస పోవటం పరిపాటి. ఇండియాకు వలస వచ్చిన జాతులలో అలాంటి ఆరు ప్రాథమిక జాతులున్నట్లు పరిశోధకులు చెబుతున్నారు. అవి: 1) నీగ్రిటో 2) ప్రోటో ఆస్ట్రలాయిడ్ 3) మాంగొలాయిడ్ 4) మెడిటరేనియన్ 5) పశ్చిమ బ్రాకీ సెఫాలిక్ 6) నార్డిక్ జాతులు.

నీగ్రిటో జాతులు ఆఫ్రికా నుండీ ప్రోటో ఆస్ట్రలాయిడ్లు పశ్చిమ ఆసియా నుంచీ వచ్చారట. నీగ్రిటోల ఛాయలు భారతదేశంలోని కొన్ని గిరిజన సముదాయాలలోనూ అండమాన్ దీవులలోనూ కనిపిస్తున్నాయంటారు. ఆంధ్రప్రదేశ్‌లోని యానాదులు ఆ మూలం కలవారు. ఆస్ట్రలాయిడ్ల వారసులు అసురులుగానూ, నార్డిక్ జాతుల వారు ఆర్యులుగానూ, మెడిటరేనియన్ జాతులు ద్రావిడులుగానూ ప్రచారంలోకి వచ్చారని

అంటున్నారు. ఇండియాకు వలస వచ్చిన సిరియన్లు సురులుగా అసీరియన్లు అసురులుగా ప్రసిద్ధులయ్యారనీ మరో కథనం ఉంది.

శాస్త్రవేత్తల అంచనాల ప్రకారం భారతదేశంలో మొదట నివసించిన వారు నీగ్రిటో జాతుల ప్రజలు. ఏనాదులు, పులయ్యన్‌లు వారి వారసులు. సంతాలులు ముండారీలు శబరులు మొదలైనవారు అసురుల వారసులు.

ఆర్య ఆర్యేతర జాతులు పరస్పరం భిన్నమైనవే అయినా కాలక్రమంలో వారి మధ్య వివాహ సంబంధాలు ఏర్పడ్డాయి. జాతుల సమ్మిశ్రణం జరిగింది. భారతదేశపు భౌగోళిక స్థితిని బట్టి వింధ్య పర్వతాలకు అవతలి వారిని ఉత్తర భారతీయులుగానూ ఇవతలి వారిని దక్షిణ భారతీయులుగానూ పరిగణిస్తుంటారు. ఉత్తర భారతదేశంవారు దేవ, ఆర్య గణాల వారసత్వం గలవారనీ దక్షిణ దేశంవారు స్థానికులు అనీ ద్రావిడులు అనీ ఒక భావన ఉంది. ఉత్తర భారతదేశంలో పశ్చిమ యురేషియన్ జాతులవారు (మధ్య ఆసియా - మధ్య ప్రాచ్యదేశాల నుంచీ కాకస్, యూరప్ ప్రాంతాల నుంచీ వచ్చిన వారు) ప్రధానంగా ఉండేవారు. వారు తమను తాము దేవ, ఆర్య - సుర - గణాలుగా ప్రచారం చేసుకున్నారు. వీరంతా ఒక వర్గం. దక్షిణా దేశంలో స్థానిక జాతులతోబాటు అండమాన్ ప్రాంతాలలోని జాతుల వారసత్వంగల వారూ ఉండేవారు. వీరంతా ఒక వర్గం. ఆర్యుల సాహిత్యం ప్రకారం వీరు అసురులు. కొన్ని వేల సంవత్సరాల పాటు పై రెండు వర్గాలకూ ఘర్షణలు జరిగాయి. దేవాసుర యుద్ధాలు అవే. భౌగోళిక పరిణామాలు, జలప్రళయాలు, నగరాల విధ్వంసం, జీవనం కోసం వలసలు సాగటం వంటి అనేకానేక సంఘటనలలో ఈ జాతుల మధ్య, తెగల మధ్య, సంఘర్షణలు జరిగినా సమ్మిశ్రణమూ జరిగింది. క్రీ.పూ. 4,200 ప్రాంతాల నుంచి ఈ జాతుల మధ్య సమ్మిశ్రణం మొదలయిందంటారు. ప్రకృతి - జీవుడు - చావు పుట్టుకలు - దుఃఖం - మోక్షం వంటి భౌతిక, మానవాతీత శక్తుల గురించిన చర్చలు జరిగాయి. భిన్న మతాలు, వాదాలు వ్యాప్తిలోకి వచ్చాయి. జైన, బౌద్ధ ధర్మాలు - శైవ, వైష్ణవ ధర్మాలు పరస్పరం సంఘర్షించటం జరిగింది. దేవ, ఆర్యగణాల ఆధిపత్యాన్ని చాటే విధంగా పురాణ వాఙ్మయం విస్తరించింది. దేవుళ్ళుగా కొందరినీ భూదేవులుగా మరికొందరిని నిలబెట్టే ప్రయత్నంలో సామాజిక సంబంధాలపై నియంత్రణ మొదలయింది. ఫలితంగా వర్ణ ధర్మాలు రూపొంది స్థిరపడ్డాయి. వివాహ సంబంధాలలో కట్టుబాట్లు, ఆంక్షలు మొదలయ్యాయి. కులాల ఏర్పాటు అనంతర పరిణామం-అని శాస్త్రవేత్తలు అంటున్నారు.

జన్యు విశ్లేషణల ప్రకారం ఉత్తర, దక్షిణ భారతీయులలో జన్యుపరమైన సమాన లక్షణాలు చాలా ఉన్నాయనీ, కొడైకెనాల్ కొండల్లోని పాళెగార్ల దగ్గర్నుంచి రాజస్థాన్‌లోని భిల్లుల వరకు అన్ని తెగలలోను జన్యుపరమైన బదిలీలు (జన్యువుల సంకరం) జరిగాయనీ శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. అయినప్పటికీ కొన్ని కులాలు తమను స్వచ్ఛమైన వారిగా,

ఉన్నతులుగా చెప్పుకోవటం కొన్ని కులాలపై ఆధిపత్యం చలాయించడం జరుగుతూనే ఉంది. ఈ భ్రమల నుండి బయటపడవలసిందే.

పురాణాలలోనే కనిపించే భౌగోళిక విభజన మరొకటి ఉంది. అది స్వర్గ, మర్త్య, పాతాళ లోకాలు అనే అంశం. స్వర్గం దేవతలది. స్వర్గం పైన ఆకాశంలో ఉన్నది అని నమ్మకం. అంటే ఇది భారతదేశ పటంలో పైన ఉత్తరాన ఉన్న ప్రాంతం. మధ్యదేశం మానవులది. (దండక ప్రాంతం) ఇదే మర్త్యలోకం. కిందిది పాతాళలోకం – అదే నాగలోకం అన్నారు. ఇది చోళ పాండ్య చేర రాజులు పాలించిన ప్రాంతం.

రామాయణంలో ప్రధానంగా కనబడే జాతులను ఈ క్రింది వర్గాలుగా చెప్పుకోవచ్చు.

**1. దేవగణాలు :** ఇంద్రుడూ – అతని సహచరవర్గమూ – వీరిని సురులు అనీ అన్నారు. స్థానిక జాతులను వశపరచుకోవటానికి వీరు ఆర్య రాజులకు ఆయుధాలూ, ఇతర సహాయమూ అందించేవారు. అందుకు తగ్గ ప్రతిఫలాలు పొందేవారు.

**2. ఆర్య గణాలు :** వలసలుగా వచ్చి స్థానికులపై ప్రాబల్యాన్ని సంపాదించటానికి ప్రయత్నించిన జాతుల ప్రజలు.

**3. అసురులు/రాక్షసులు :** స్థానిక ప్రజలు. దైత్యులు, దానవులు, యక్షులు, నాగులు, మాతంగులు మొదలైన జాతుల సముదాయం. వీరు ఆర్యులను ప్రతిఘటించిన వీరులు.

**4. వానరులు :** స్థానిక గిరిజన, ఆదివాసీ తెగల ప్రజలు, యుద్ధవీరులు.

ఈ జాతుల గురించి చెప్పుకునే ముందు వారి భాషలను గురించీ ఒకమాట చెప్పుకోవాలి. రామాయణ కాలం కన్నా ముందు ఈ దేశంలో స్థానిక భాషలు (దేశి భాషలు) చాలా ఉండేవి. ఆ భాషలలో అపారమైన సాహిత్యమూ వచ్చింది. కాలక్రమంలో సంస్కృత భాషా ప్రాబల్యం వల్లనూ రాజాదరణ లేకనూ అవి చాలావరకు అంతరించి పోయాయి.

చరిత్రకు అందినంతవరకు తొలి శాసనాలు ప్రాకృతంలో బ్రాహ్మీలిపిలో ఉన్నాయి. క్రీ.శ. నాల్గవ శతాబ్ది నుంచే సంస్కృత భాషలో శాసనాలు కనిపిస్తున్నాయి. ఇవి కూడా బ్రాహ్మీలిపిలోనే కనిపిస్తున్నాయి.

**భాషలు**

ఒక లెక్క ప్రకారం ప్రపంచ భాషలు 2796. భారతదేశంలో అతి ప్రాచీన భాషగా ప్రజల వ్యవహార భాషగా "పాళి"ని చెబుతారు. ప్రజలు మాట్లాడే ప్రకృతి సిద్ధమైన భాషగా దీనిని ఆయా ప్రాంతాలకు – దేశాలకు జోడించి, ప్రాకృతంగా చెప్పటమూ ఉంది.

**పాళి/ప్రాకృతం**

మగధ దేశపు ప్రాకృతం (ప్రకృతి సిద్ధం) మాగధి ప్రాకృతం. అదే 'పాళి'. పాటలీపుత్రంలోని మాండలికం కాబట్టి దానిని పాలి (పాటలి) అన్నారంటారు తిరుమల రామచంద్రగారు. ప్రాకృత మూలభాష "పాలి". వింధ్య ప్రాంతపు ప్రాకృతం "పైశాచి".

ఇది "పాలి"కి దగ్గరగా ఉంటుంది. కళింగ దేశంలోని భాష 'పాలి' అని కొందరి వాదన. అప్పటి కళింగదేశం అంటే దక్షిణ ఒరిస్సా, ఆంధ్రదేశంలోని తూర్పు ప్రాంతాలూను.

బుద్ధుని బోధనలు 'పాళి' భాషలో ఉన్నాయి. జైనుల బోధనలు 'అర్ధమాగధి' ప్రాకృతంలో ఉన్నాయి. ఇదీ పాళీ లోనిదే. భారతదేశంలోని ప్రాచీన శాసనాలు 'పాళి' ప్రాకృతంలో ఉన్నాయి. (క్రీ.పూ. 250 ప్రాంతం). సంస్కృత శాసనాలు ఆ తర్వాత కాలం నుంచే కనబడుతున్నాయి. ప్రాకృతంలో 'ఋ' అక్షరం లేదు. సంస్కృత శాసనాలు వచ్చిన తర్వాతనే ఈ అక్షరం కనిపించింది. అశోకుని శాసనాలలో ఈ అక్షరంలేదు.

నాగ జాతుల భాష ప్రాకృతమే. గ్రీకు దేశం నుండి టర్కీ వరకు ఈ భాష వ్యాపించి ఉంది. ఆయా దేశాలను బట్టి మాండలిక భేదాలతో వేర్వేరు పేర్లతో భాషలు వ్యాప్తిలోకి వచ్చాయి. లిపి బ్రాహ్మీలిపి. ప్రాచీన యుగాలలో ప్రజల వలసలనుబట్టి భాషలలో కొత్త పదాలు చేరుతూ అవి సంపన్నమవుతూ వచ్చాయి.

భారత ఉపఖండంలో ఒకప్పుడు దక్కన్ భూభాగంలోని ప్రజలు వాతావరణ మార్పు వల్ల ఉత్తరాదికి వలస వెళ్ళారనీ, గంగా సింధు మైదానాలలోని ప్రజలు దక్షిణాదికీ వచ్చారనీ ఇవి దశలు దశలుగా జరగటం వల్ల భాషల సమ్మిశ్రణం జరిగిందనీ పరిశీలకుల అభిప్రాయం. ఉత్తరాదికి వలస వెళ్ళినవారే సింధు నాగరికతకు పూర్వులు అంటారు.

భారతదేశంలో ఆర్యులు అడుగుపెట్టేనాటికి ఇక్కడ చాలా భాషలున్నాయి. కొన్నింటికి లిపి ఉంది. అప్పటి ఆర్యుల భాష ఇప్పటి సంస్కృతం కాదు. స్థానిక భాషల సంపర్కంతో ఆర్యులు తమ భాషను సంస్కరించుకుని సంస్కృతంగా ప్రచారం చేసుకున్నారు. దానిని దేవభాషగా చెప్పుకున్నారు. స్థానిక జాతులకు అర్థంకాని రీతిగా ఆ భాషను తయారు చేసుకుని అందులోనే తమ జ్ఞానాన్నంతా నిక్షేపించి పెట్టుకున్నారు. ధర్మశాస్త్రాలూ, ప్రవర్తనా నియమాలూ, గ్రహసంచార విజ్ఞానమూ, జ్యోతిషమూ అన్నీ వేదజ్ఞానం పేరిట స్థానిక జాతులకు అందకుండా దాచిపెట్టుకున్నారు. రుగ్వేద భాష క్రీ.పూ. 1184 ప్రాంతాల నాటిదంటారు. ఆర్య మునులు, పురోహిత వర్గమూ ఏర్పరచిన వర్ణాశ్రమ ధర్మ వ్యవస్థలో వేద జ్ఞానం కీలకపాత్ర వహించింది. స్థానికులపై ఆధిపత్యం వహించటానికీ ఇది ఉపకరించింది. మొదట్లో ఈ భాషకు లిపిలేదు. అంతా మౌఖికమే. తర్వాతనైనా ఇది బ్రాహ్మీ లిపిలోనే ఉండేదేమో. దేవభాషగా ప్రశస్తి పొందటానికి దీనికి దేవ నాగరి లిపి ఏర్పాటయి ఉండాలి. హంగరీ మైదాన ప్రాంతాల భాష - పర్షియన్ ఆఫ్ఘన్ భాషా పదాలు ఇండియా లోని ప్రాకృత, ద్రావిడ భాషా పదాలు అన్నీ కలుపుకుని సంస్కృతం రూపుదిద్దుకున్నది.

ఇప్పటి సంస్కృత భాషకు ఒక ప్రామాణికతను ఏర్పరచినవాడు పాణిని. ఇతడు (క్రీ.పూ. 4-6 శతాబ్దాలవాడని పండితులు చెబుతుంటారు. పాణిని క్రీ.పూ. 350 ప్రాంతాల వాడనీ పాణినికి బుద్ధుడు వ్యాకరణం బోధించాడనీ అయోతీదాసు (1845-1914)

అభిప్రాయం. అయోతీదాస్ తమిళ దేశానికి చెందిన మేధావి. అగస్త్యునికి తమిళ వ్యాకరణమూ బుద్ధుడే నేర్పాడంటారు ఆయన.

ఇంద్రుడే బుద్ధుడనీ ఐంద్రవ్యాకరణం అంటూ ఒకటి పూర్వం ఉండేదనీ వైదిక పండితులు చెబుతుంటారు. పాణిని భాషను "భారతీ భాష"గా అమరసింహుడు పేర్కొన్నాడు. "బ్రాహ్మీ తు భారతీ భాషా" అనటాన్ని బట్టి బ్రాహ్మీ.లిపి నుంచే అన్ని భాషల లిపులూ రూపొందాయనుకోవాలి.

సంస్కృత భాషను దేవభాషగా ప్రచారం చేయటంలోనూ ఆ భాషా పదాలకు రక రకాల అర్థాలు సృష్టించడంలోనూ ఎవరికి ఏయే ప్రయోజనాలున్నాయో అర్థం చేసుకోవటం కష్టమేమీ కాదు. స్థానిక భాషలలో ప్రచారమవుతున్న విజ్ఞానాన్ని ప్రజలకు అందకుండా చేయటం పాలక ఆధిపత్య వర్గాలకు అవసరమైన కాలంలో సంస్కృత భాషా నిర్మాణం జరిగింది. సంస్కృత భాషా పదాల అన్వయం క్లిష్టంగా ఉంటుందనటానికి దిగువ ఉదాహరణ చెప్పుకోవచ్చు.

హిందూ మతంలో ముఖ్యమైన సిద్ధాంతాలుగా ద్వైతం, అద్వైతం, విశిష్టాద్వైతం అనేవి ప్రచారంలో ఉన్నాయి. విశిష్టాద్వైత సిద్ధాంతకర్త రామానుజుడు (క్రీ.శ. 1017-1137) యాదవ ప్రకాశాచార్యుల దగ్గర కొన్నాళ్ళు చదువుకున్నాడు. గురువుగారు ఛాందోగ్యోపనిషత్తు పాఠం చెబుతూ ఒకచోట ఒక శ్లోకానికి చెప్పిన అర్థం రామానుజునికి నచ్చలేదు.

"తస్యయాతా కప్యాసం పుండరీకం ఇవం అక్షిణీం" అనే దానిని వివరిస్తూ యాదవ ప్రకాశుల వారు 'కపి' అనే పదానికి వానరం/కోతి అనే అర్థాన్ని గ్రహించి ఆ పరమాత్ముని కనులు కోతి కనుల వలె ఎరుపుదనంతో ఉన్నాయి అని చెప్పారు. పరమాత్మ కనులను కోతికనులతో పోల్చటం రామానుజునికి బాధ కలిగించింది. "కపి" అనే పదానికి ఇంకా ఇతరమైన అర్థాలున్నాయా అని అన్వేషించాడు. 'కపి' అంటే సూర్యుడు అనీ అర్థం కనబడింది. సూర్యుడు పుండరీకాలను (పద్మాలను) వికసింప చేస్తాడు గనక 'కపి' అంటే సూర్యుడు అనే అర్థం ఇక్కడ చెప్పుకోవాలని రామానుజుడు వాదించాడు. 'కపి' అంటే మరో అర్థమూ ఉన్నదట – "తామరతూడు" అని. ఆ అర్థం ఇక్కడ ఇంకా బాగా సరిపోతుందన్నాడు – తూడుపై నిలిచి ఉన్న పద్మం మరింత తాజాగా నవ నవోన్మేషంగా కనిపిస్తుంది గనక పరమాత్మ కనులకు ఆ పోలిక సరిగ్గా నప్పుతుందనీ ఆయన చెప్పాడు.

రామానుజుని "వేదార్థ సంగ్రహం" ఈ రకమైన వివరణలను ఇస్తున్నది. భక్తి భావ భరితమైన మానసిక స్థితి సుందరమైన లలితమైన ఉపమానాల వైపు మొగ్గడం సహజం. అందువల్లనే ఆ పదానికి గల అనేక అర్థాలలో ఉచితమైనదిగా "తామరతూడు" అనేది ఆయనకు తోచింది. సందర్భాన్ని బట్టి ఉపయోగించేందుకు వీలుగా సంస్కృత పదజాలాన్ని రూపొందించారనటానికి ఇదొక ఉదాహరణ.

రామాయణ కథలోని చాలా సంఘటనలు దండకల్లో జరిగినట్లు చెబుతున్నారు. అప్పటి దండకలో ఇప్పటి మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, ఒడిశా, ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలోని చాలా భాగాలు చేరి ఉండేవి. ఒక కాలంలో ఆ ప్రాంతాలలోని చిన్న చిన్న రాజ్యాలను గోండ్వానా రాజ్యాలుగా పిలిచేవారు. ఆ ప్రాంతాలలోని భాషలు ద్రావిడ భాషా కుటుంబానికి దగ్గరగా ఉన్నాయి. తమిళం, మలయాళం, కన్నడం, తొద, కోత, ఇరుళ్, కురుంబ, తుళు, కొడగు దక్షిణ ద్రావిడ భాషలు. తెలుగు, గోండి, కొండ, కూయి, కూని, పెంగొ, మంద అనేవి దక్షిణ మధ్య ద్రావిడ భాషలు. ఇవి దండక ప్రాంతాలలో వ్యవహారంలో ఉండేవి. అందువల్ల తెలుగు అసురుల భాషల వారసత్వం కలిగినదిగా చెప్పుకోవచ్చును.

స్థానిక భాషల సంపర్కంతో ఎదిగిన సంస్కృత భాషలోనే రామాయణాన్ని కావ్యంగా రాశారు. ఇందులోని చాలా నామవాచక పదాలు సంస్కృతీకరించిన పదాలే. ద్రావిడ అనేదీ సంస్కృత పదమే. దక్షిణాదిలోని అన్ని ప్రాంతాలకూ వర్తించేదిగా ఈ పదాన్ని వాడేవారు. అయినా ఈ పదం తమిళ భాషకూ తమిళులకూ సంబంధించినదిగానే ప్రసిద్ధం అయింది. వాస్తవానికి తెలుగే మూల ద్రావిడానికి దగ్గర అంటున్నారు, పరిశోధకులు. ద్రావిడ భాషా కుటుంబానికి మాతృక అయిన భాష సుమారు ఆరువేల సంవత్సరాల నాటిదని భాషావేత్తలు చెబుతున్నారు. అది అసురుల భాష అయి ఉండటానికి ఆస్కారం ఉంది.

బెలూచిస్తాన్ మాండలికం బ్రూహిలో ప్రాచీన తమిళ పదాలున్నాయి. ఆఫ్రికన్ భాషలలోని పదాలకూ దక్కన్ భాషలలోని పదాలకూ పోలికలు కనిపిస్తున్నాయి.

ప్రపంచంలోని అత్యంత ప్రాచీన నాగరికతలలో కనీసం మూడింట రెండైనా ద్రావిడ భాషలు మాట్లాడే వారితో ముడిపడి ఉన్నాయని అలెగ్జాండర్ కాండ్రేటర్ (The Riddles of three Oceans) అభిప్రాయం.

మూడు ప్రాచీనాంధ్ర రాజ్యాలు క్రీ.పూ. 300 నుండి క్రీ.శ. 225 వరకు పాలించాయనీ అప్పటికి ప్రాకృతమే వారి భాష అనీ శ్రీ వంగూరి సుబ్బారావుగారి అభిప్రాయం. (ఆంధ్ర వాఙ్మయ చరిత్ర పే. 89) అప్పటికి దక్షిణ బ్రాహ్మీలిపి వ్యవహారంలో ఉన్నది. దండకారణ్య భూములలోని ప్రజలు పైశాచి ప్రాకృతం మాట్లాడేవారు. దానికి లిపి ఉంది. రాజభాషగానూ అది గౌరవించబడింది. శాతవాహనుల కాలంనాటి 'బృహత్కథ' పైశాచి భాషలో రాయబడిన గొప్ప గ్రంథం.

తాను పైశాచి భాషలో రాసిన బృహత్కథను రాజు నిరాదరించటంతో గుణాఢ్యుడు ఆ గ్రంథాన్ని అగ్నికి ఆహుతి చేశాడు. ఈ సంఘటన కుంతల శాతకర్ణి కాలంలో జరిగినట్లుగా కొందరు నిర్ధారించారు. బృహత్కథ విద్యాధర రాజుల వృత్తాంతాలను గ్రంథస్థం చేసింది. ఇందులోని కౌశాంబి నగరం - వత్సరాజ్యం క్రీ.పూ. 1000-900 ప్రాంతాల నేపథ్యం కలవి. అప్పటికి దూరప్రాంతాలతో వాణిజ్యం సాగుతూ ఉండేది. సమకాలిక

సమాజంలో అన్ని వర్గాలకు చెందిన జీవనరీతులనూ ఈ బృహత్కథలో చెప్పటం గమనిస్తే అప్పటికి ప్రచారంలో ఉన్న పూర్వ వృత్తాంతాలను ఇది గ్రంథస్థం చేసిందని ప్రాంతీయ భాషలను రాజులు ఆదరించారనీ తెలుస్తున్నది. సంస్కృతం రాజాస్థానాలలో ప్రవేశించటం మొదలైన తర్వాతనే ప్రాంతీయ (దేశ) భాషలకు తిరస్కారం ఎదురయింది. సంస్కృతాన్ని ప్రచారం చేసే క్రమంలో ఇలాంటి గ్రంథాలు, స్థానిక భాషలు నిరాదరణకై లోనై నశించాయి. రాజుల ఆదరణ, ప్రజల ఆదరణ, ప్రచారమూ, వ్యవహారమూ లేకపోతే భాషల మనుగడ కష్టం. పూర్వకాలపు భాషల సంగతి అటుంచి ఇరవయ్యో శతాబ్దంలోనే చాలా భాషలకు ముప్పు కలుగుతుందేమోనని శాస్త్రజ్ఞులు చింతిస్తున్నారు. 1961 నాటి భారతదేశ జనాభా గణన లెక్కల ప్రకారం 1652 భాషలున్నాయట. కొన్ని భాషలు మాట్లాడేవారి సంఖ్య చాలా తక్కువగా ఉండటంతో 1100 భాషలనే పరిగణనలోకి తీసుకున్నారు. కనీసం 10 వేలమంది మాట్లాడే భాషనే గుర్తించాలనే కేంద్ర ప్రభుత్వం నిర్ణయం (1971 జనాభా లెక్కల సేకరణ) ప్రకారం 1971లో 108 భాషలనే గుర్తించ గలిగారు. కంప్యూటరీకరణ అతి వేగంగా విస్తరిస్తున్న వర్తమాన యుగంలో ఎన్ని భాషలు నిలవగలుగుతాయో.

బ్రిటిష్ పాలన కాలంలో భారత ఉపఖండంలో 179 భాషలు లెక్కించారు (1898). అనంతర కాలంలో 780 భాషలను పరిశోధకులు గుర్తించారు. వీటిలో 400కు పైగా భాషలు ఆదివాసులు, సంచార జాతులు మాట్లాడేవారట. (2009). సంచార జాతులలో, ఆదివాసులలో ప్రతి తెగకూ ఒక భాష ఉంటుంది. పాటలు – దృశ్య రూపకాల రూపంలోనే కొన్ని భాషలు వంశపారంపర్యంగా వస్తున్నాయి. సామాజిక రాజకీయ కారణాలవల్ల వలసల వల్ల వీనిలో చాలా భాషలు క్షీణించాయి. ఆంధ్రప్రదేశ్‌లో గుటాబా, గడాబా, మండా, కుపియా, మన్నడోనా, గోర్మతి వంటి భాషలు దాదాపు అదృశ్యమైపోయినట్టే.

దేవ ఆర్య గణాల ప్రాంతాలుగా పేరొందిన చోట్ల పూర్వం వైవిధ్యంతో కూడిన దేశీమాండలికాలు ఉండేవి. గోర్పా (మత్స్యకారుల భాష) పూజిలే, ధాని, మాజ్బి వంటి చాలా భాషల పేర్లు మాత్రమే నిలిచాయి.

రామాయణంలో చాలా పేర్లు స్థానిక భాషల సంబంధంగా ఉన్నాయని పరిశీలకుల అభిప్రాయం. కబంధ, పంప, ఋష్యమూక, కిష్కింధ, శృంగిబేర పదాలు స్థానిక భాషల లోనివి. సవర భాషలో 'లంకాన్' అంటే ఎత్తుగా, ఎత్తుమీద అని అర్థం. రావణుని నగరం ఎత్తుమీద ఉంది గనక దానిని 'లంక' అన్నారు. చుట్టూ నీరు ఉండి మధ్యలో ఎత్తుగా ఉన్న భూములు లంక భూములు.

సవర భాషలో యువ అంటే తండ్రి. జటా అంటే జట్టు. 'జటాయువ' అంటే తండ్రి జట్టువాడు అని అర్థం. జటాయువు రాముని తండ్రి అయిన దశరథుని మిత్రుడు.

సవర భాషలో 'దాన్' అంటే నీరు. 'డాకి' అంటేనూ నీరు అనే అర్థం. దాన్‌డాకి అంటే విశేషంగా నీరున్న ప్రాంతం. విశేషంగా నీరున్న అడవిని దాన్‌డాక్ (దండక)గా పిలిచారని భాషావేత్తల అభిప్రాయం.

గదబ, బొండా, కుటియారాణాల భాషల పదాలు కొన్ని తెలుగుకు దగ్గరగా ఉన్నాయి. కందూల్ = కందులు, మొక్క = మొక్కజొన్న మొదలగునవి.

విదేశీ వాణిజ్యం వల్ల కొన్ని గ్రీకు పదాలు కూడా అప్పటికి స్థానికుల వాడుకలోకి వచ్చాయి. 'ఇలెఫన్' అనే గ్రీకు పదానికి ఏనుగు, దంతపు పని, అని అర్థాలు. అదే అర్థంలోని ఈజిప్షియన్ పదం 'ఇబు'. ఇవి సంస్కృతంలో 'ఇభ'గా స్థిరపడ్డాయి. మదేభము అంటే మదగజం. మదపుటేనుగు. ఆర్యుల సంస్కృత భాషలో విదేశీ పదాలు, స్థానిక భాషల పదాలు చాలా కనపడతాయి.

పాళీ భాషలో వర్తక బిడారు నాయకుడిని 'సాత్రహు' అనేవారు. అతడు బిడారు రక్షణ బాధ్యత వహిస్తాడు. రక్షణ బాధ్యతను సూచిస్తూ ఆ పదాలను సంస్కృతీకరించుకుని 'క్షత్ర' పదాన్ని ప్రచారం చేశారు.

జైన, బౌద్ధమతాల సారస్వతం దేశి భాషలలో ప్రచారమైంది. మహావీరుని ప్రవచనాలు అర్ధమాగధి భాషలోనూ, బుద్ధుని ప్రవచనాలు పాళీ భాషలోనూ ఎక్కువగా ప్రచారమయ్యాయి. కథా వాఙ్మయానికి మూలం అనదగిన "బృహత్కథ" పైశాచీ భాషలో ఉంది. దానికి లిపి ఉంది. శాలంకాయనులు - విష్ణుకుండినుల కాలానికి ఆ లిపి కొంత మారింది. క్రీ.శ. ఏడవ శతాబ్దానికి వేంగీ చాళుక్యలిపి ఏర్పడింది. ఇదే తెలుగు కన్నడలిపి అనీ నన్నయ భారతం నాటికి ఇదే లిపి ఉండి ఉంటుందనీ కొందరి అభిప్రాయం.

ఆంధ్రదేశంలో పశ్చిమగోదావరి జిల్లాలోని గుంటుపల్లిలోని ఒక స్తంభంమీద ఉన్న సంస్కృత శాసనం క్రీ.శ. 4వ శతాబ్ది నాటి శాలంకాయనరాజు రెండో నందివర్మ వేయించిన శాసనం. అప్పటి వరకు శాసనాలు ప్రాకృత భాషలో ఉండేవి. ఆ తర్వాతనే దక్షిణ భారతదేశంలో సంస్కృత శాసనాలు కనిపిస్తున్నాయి.

## దేవగణాలు

దేవగణాలు సాధారణ మానవ గణమే. వారికి అలౌకికమైన ప్రతిపత్తి కల్పించటం వల్ల పురాణ వాఙ్మయం మొత్తం అవాస్తవిక కల్పనా కథలతో నిండిపోయింది. దేవలోకం, ఇంద్రలోకం, బ్రహ్మలోకం, గోలోకం, వైకుంఠం ఇలాంటి కల్పనలన్నీ పారలౌకిక భావనల తోనే ప్రచారమయ్యాయి. ఇప్పటి ఉత్తరాఖండ్ పరిసర ప్రాంతాలు - దేవీ ప్రయాగ, మందాకిని, భాగీరథి, అలకనంద పరీవాహక ప్రాంతాలూ, గౌరీకుండ్, బదరీనాథ్, కేదార్‌నాథ్ ప్రాంతాలూ దేవ భూములుగా వారి రాజ్యాలుగా ప్రసిద్ధమయ్యాయి.

పురాణాల ప్రకారం "కశ్యప" ప్రజాపతికి "అదితి" అనే భార్యవల్ల కలిగిన సంతానం ఆదిత్యులు వారే దేవగణాలు. అదితి అంటే (న+దితి) అనంతమైనది అని అర్థం. ఆ భావనకు మూర్తీకరణం చేసి ఆమె సంతానం హద్దులు లేనిది కాబట్టి ఇతరుల భూములనూ రాజ్యాలనూ ఆక్రమించుకోవటం వారు తమ హక్కుగా భావించారు.

పురాణాలు దేవగణాలను దేవతలుగా చెప్పటంవల్ల మొత్తం సామాజిక చరిత్ర దురవగాహమై పోయింది.

దేవగణాలు, నాగ యక్ష అసుర గణాల వలెనే ఒక మానవ సముదాయం. వైదిక వాఙ్మయాన్ని అనువదించుకునే క్రమంలో 'దేవ' పదాన్ని దేవతగా చెప్పటం వల్ల దేవగణాలు మానవ సముదాయాలు కారనీ పరలోక సంబంధమైన వారనీ పొరపాటు భావన కలిగింది. అదే, ప్రచారమైంది. 'దేవ' పదాన్ని గాడ్ (దేవత)గా అనువదించిన వారిని ఏమనాలో అర్థం అవటం లేదన్నారు డా॥ అంబేద్కర్.

అదితి సంతానంలో ఆదిత్యులు 12 మంది – వసువులు 8 మంది – రుద్రులు, 11 మంది – అశ్వినీ దేవతలు ఇద్దరు, కలిసి మొత్తం 33 మంది. వీరిని దేవగణాలుగా పురాణాలు చెప్పాయి. కశ్యపుని ఇతర భార్యల సంతానంలో యక్షులూ, నాగులూ, కిన్నరులూ దైత్యులు దానవులు వంటి వారున్నారు. వారంతా దేవగణాలకు దాయాదులు. వారిని 'అసురులు' అనేవారు. దేవగణాలకూ అసురగణాలకూ తరచుగా యుద్ధాలు (ఆస్తి కోసమూ అధికారం కోసమూ) జరుగుతుండేవి. వాటిని దేవాసుర సంగ్రామాలుగా పురాణ వాఙ్మయం పేర్కొన్నది.

దేవ గణాలను సురగణాలు అనీ అంటారు. అసురులకు శత్రువులు కాబట్టి వీరు సురులు. అయితే వీరు సురులు అనటానికి మరో ఆధారం ఉంది. లడాఖ్ ప్రాంతంలోని సురూలోయలో నివసించే ప్రజలు కాబట్టి వీరు సురులు అయ్యారంటారు.

"కార్గిల్ నుండి ఈశాన్యంగా 140 కి.మీ. దూరంలో ఉన్న పెంజిలా వాటర్ షెడ్ ప్రాంతం నుంచి 'సురు' నది ఉద్భవించిందట. పురాణాలలోని 'సురాపగ' (సుర+ఆపగ) దేవనది ఇదే. ఈ నది, దాని ఉపనదులు, కొన్ని వేల చదరపుమైళ్ళ ప్రాంతంలో విస్తరించి ఉన్నాయి. ఇదంతా సురూ లోయ ప్రాంతం. ఇక్కడివారు దరాద్ అనే తెగ ప్రజలనీ టిబెటన్ల సంతతి వారనీ చెబుతారు. వీరు ఒక దశలో బౌద్ధులు. తూర్పున ఇన్‌స్కార్‌లోయ లెహ్ ప్రాంతాలు బౌద్ధాన్ని నిలుపుకోగా వాయవ్యంలో ఆఫ్ఘనిస్తాన్ – అరబ్ రాజ్యాలదిశగా గల కార్గిల్ ప్రాంతీయులు ఇస్లాంలోకి మారారు.

సురులకూ, ఆర్యులకూ అసురులు శత్రువులు. కాబట్టి, అసుర సంహారంలో – అసురులను ఎదుర్కోవటంలో ఈ రెండు గణాలవారూ పరస్పరం సహకరించుకున్నారు. ఈ ఇద్దరిలోనూ దేవగణాలది ఆధిపత్య స్థానం. దేవగణాల సోమపానం ప్రసిద్ధమైనదే. సురుల నాయకుడు ఇంద్రుడు. ఇంద్రుడు సోమం తాగి యజ్ఞశాలలో ప్రవేశించటాన్ని ఋగ్వేదం చాలా సందర్భాలలో చెప్పింది.

"కురుక్షేత్రం దగ్గరి శర్యణావత సరస్సులో సోమం ఉంది. దానిని ఇంద్రుడు సేవించాలి."

సోమం ఆర్జీకం దేశం నుండి రావాలి. (9-113.11)

"ఇంద్రుడు సోమపానం చేసి గడ్డం మీసాలు దులుపుకుంటాడు. శత్రువులను చంపటానికి వెళ్తాడు.

వర్షం పశువులను తడిపినట్టు ఇంద్రుడు ఆకుపచ్చ పసుపు రంగు మద్యం (హరిత సోమం)తో తన గడ్డం మీసాలు తడుపుకుంటాడు.

ఆ తర్వాత యజ్ఞగృహంలో ప్రవేశిస్తాడు...

వాయువు అడవిని కదిలించినట్లు ఇంద్రుడు తన గడ్డం మీసాలు దులుపుతాడు."

తాగేటప్పుడు అంటిన రసం దులుపుకుంటాడన్న మాట ఋగ్వేదంలో (20-23-1,2,3,4) గొప్ప విశేషంగా చెప్పారు.

యజ్ఞాలలో తాగేది సోమరసం. మామూలుగా తాగేది సుర. రెండూ మత్తు కలిగించే పానీయాలే.

'అసుర' శబ్దానికి గల తోసివేయు, అనే అర్థాలలో అసురులు అంటే కొట్టేవారు, తరిమి వేసేవారు అని అర్థం చెబుతాను. అసురులు తమ శత్రువులను తరిమికొడుతూ ఉండటం మొదట్లో జరిగిందేమో. ఆ తర్వాత అవతలివారే వీరిని అణచివేస్తూ వీరి నగరాలను నాశనం చేస్తూ వచ్చారు. ఇంద్రుడు పురందరుడు.

1) శత్రుపురాలను నాశనం చేసిన వాడనీ, 2) పురు అనే రాక్షసుని చంపిన వాడనీ అతని గురించి చెబుతున్నారు.

త్రిపుర దహనం కథ అసురుల నగరాలకు సంబంధించినదే. శివుడు వారి నగరాలు నాశనం చేశాడు. రామాయణంలో ఆంజనేయుడు రావణుని ముఖ్యపట్టణమైన లంకా నగరాన్ని దహనం చేశాడు.

శత్రువుల నగరాలు తగలబెట్టటం అనేది వేద గాథలలో ఉంది. తమ శత్రువులయిన స్థానిక అసురులను - దాస/దస్యులను వారి నగరాలనూ నాశనం చేయవలసిందిగా ఆర్యమునులు యుద్ధ నాయకుడైన ఇంద్రుని వేడుకోవటం వేద సూక్తాలలో ఉంది. అందుకు ముఖ్య కారణం అసురులు తమ ఆచారాలు పాటించకపోవటమే అనీ ఆ సూక్తాలు చెబుతున్నాయి. హరప్పా నగరాలను నాశనం చేయటం ఇందులో ధ్వనిస్తున్నది.

తన ఆశ్రితుల కోసం ఇంద్రుడు 30 వేలమంది దాసుల్ని చంపాడు. (ఋ. 4.30.210). వెయ్యిమందిని బంధించాడు (2.13.9). వారి గోశాలలు పట్టుకున్నాడు (10.48.2). స్వర్గానికి ఎక్కే ప్రయత్నం చేసిన దస్యుల్ని పడగొట్టాడు వంటివి ఋగ్వేదంలో ఉన్నాయి. ఇంద్రుడు దస్యుజాతి వృత్రుని చంపాడు (ఋ. 6-2-3-8,9,10). దస్యుజాతి పేరు సహితం తుడిచిపెట్టదలిచాడు (ఋ. 10-23-2) అనటాన్ని బట్టి దస్యులకు సుర గణాలకు ఉన్న వైరాన్ని గ్రహించవచ్చు. వృత్రుడు దస్యుడూ అసురుడూ కూడా. అతడు జాతిచేత దస్యుడు. దేవగణాలకు విరోధి కాబట్టి అసురుడు. పాలకవర్గానికి విధేయత

చూపని వారంతా అసురులూ/రాక్షసులూ అయ్యారన్నమాట. వీరు ఇప్పటి ప్రభుత్వాలలోని ప్రతిపక్షాల పాత్ర వహించిన వారై ఉండాలి. మంచి ఆలోచనలు కలిగి ఉండటం దేవతత్వమనీ చెడు ఆలోచనలు అసురత్వమని కొందరు చెబుతుంటారు గాని కుట్రలు దేవగణాల నుండే జరిగినట్లు పురాణగాథలు చెబుతున్నాయి.

'దేవ' పదాన్ని 'దేవత'కు పర్యాయపదంగా వాడటంవల్ల కలిగిన అపార్థాలు దేశానికి హానికరంగానే పరిణమించాయి.

ఈ సందర్భంలో హిందువుల ముప్పై మూడు కోట్ల దేవతల గురించి ఏనుగుల వీరస్వామయ్యగారు చెప్పిన మాటలు గుర్తు చేసుకోవాలి.

ఏనుగుల వీరస్వామయ్య (1780-1836) చెన్న పట్టణం కోర్టులో దుబాసీగా పనిచేస్తూ ఇంగ్లీషు దొరలతో సన్నిహితంగా ఉండేవారట. మత విషయాలూ వారితో చర్చిస్తూ ఉండేవాడు. ఆయన పలుకుబడి గలవాడూ, విశాల మనస్కుడూను. కాశీ యాత్ర చేస్తూ గయలో డాక్టర్ 'జాన్ దేవిడ్ సన్' అనే దొరను కలిసినప్పుడు ఆ దొర ఈయనను, "నీవు ఎన్ని దేవుండ్లను ఆరాధన చెయ్యడము?" అని ప్రశ్నించాడు. "జగదాధారమైన దేవుడు ఒక్కడే" అని వీరస్వామయ్య బదులు చెప్పాడు.

"మా వలె అలా ఎలా చెపుతావు. నీవు హిందువువు కాదా? మీరు ముప్పై మూడు కోట్ల దేవతలను కొలవటం లేదా" అని ఆయన తిరిగి అడిగారట. "మీరు అనేకమైన సెయింట్స్ అనే దేవ సమానులయిన పురుషులను నమ్మి ఆరాధన చేసినట్టు మాకు ముప్పై మూడు కోట్ల దేవతలు కద్దు. దేవతలనగా మీ సెయింట్స్ వంటి దివ్య పురుషులు గాని జగదీశ్వరులు కారు. జగదీశ్వరుడు ఒక్కడేను. ఆ జగదీశ్వరుని 'గాడ్' అని తర్జుమా చెయ్యవలసింది. కడమ శివుడు, విష్ణువు, గణేశుడు మొదలయిన వారినంతా 'సెయింట్స్' అని తర్జుమా చెయ్యవలసింది. అలా చేయక దేవత అనే వాచకము వచ్చినప్పుడల్లా గాడ్ అని భ్రమ ప్రమాదముల చేత తర్జుమా చేసుటవల్ల ముప్పై మూడు కోట్ల జగదీశ్వరులు కలరని నమ్మి ఆరాధన చేసేటట్టు మీకు బోధపడ్డది. మా హిందూతత్వ ప్రకారము సర్వాంత ర్యామిగా ఉండేవాడు, మీరు అనుకున్నట్టే మాకు ఒకడే కాని, 'ఏకమే నా ద్వితీయ్యం బ్రహ్మ' అనే వాక్య ప్రకారము రెండో వస్తువు లేదని బోధ చేసేటప్పటికి శానా ప్రయాస అయినది" అని వీరస్వామయ్య గారు తన కాశీయాత్రా చరిత్రలో రాసుకున్నారు. "శైవ వైష్ణవాల పేరుతో హిందువులు తమ తమ దేవుళ్ళ గొప్ప చెప్పుకుంటూ తమలో తాము పోట్లాడుకుంటుంటే పైవారు నవ్వరా మరి" అన్నాడు ఆయన.

దేవగణం ఆర్యులకు బాసటగా ఉంటూ అసురుల నుండి రక్షణనిస్తూ ఉండేది. అందుకు ప్రతిఫలంగా ఆర్యుల మొదటి పంట, ఆర్యస్త్రీల మొదటి రాత్రి అనుభవం దేవగణాలు పొందుతుండేవారట. ఇప్పటికీ పురోహితులు వల్లించే వివాహ మంత్రాలలో ఆ అర్థాలున్నాయి. పెళ్ళికూతురు మొదట అర్యమ, వరుణ, పూష అనే ముగ్గురి ఆధీనంలో ఉంటుందని వారి నుండి విముక్తి పొందినాకనే (వారు ఆమెపై తమ హక్కు వదులుకొన్న

అనంతరమే) ఆమె పెళ్ళికొడుకు అధీనమవుతుందనీ ఆ మంత్రాల అర్థం. ఆర్యుల కన్యలపై దేవగణాలకు హక్కు ఉండేదనటానికి ఇది సూచన అని డా॥ అంబేద్కర్ వివరించారు.

రామాయణ కథల్లోని వాలి అహల్యకు ఇంద్రునివల్ల కలిగిన కొడుకు. అహల్యను బ్రహ్మ ప్రత్యేకంగా సృష్టించాడట. (ఆమె ముద్గలుని కూతురు అని వేరే చోట ఉంది) అహల్య గౌతముని భార్య అయినా, సూర్యుడివల్ల ఒక కొడుకూ, ఇంద్రుని వల్ల ఒక కొడుకూ ఆమెకు కలిగారు. వాలిని ఋక్షవిరజుడనే వానరుడు పెంచి తన రాజ్యం ఇచ్చాడనీ ఒక కథ ఉంది. ఋక్ష విరజుడు స్త్రీ రూపంలో ఉంటే ఆమెను ఇంద్రుడు మోహించాడనీ వారికి వాలి కలిగాడనీ మరో కథ ఉంది. ఏ విధంగా చూసినా వాలికి ఇంద్రుని (సుర నాయకుడు) సంబంధం ఉంది. అయినా వారసత్వంగా దేవగణాలకు సంబంధించిన ఏ చిన్న రాజ్యమూ వాలికి దక్కలేదు. గిరిజన/ఆదివాసీ ప్రజలే అతనిని తమవానిగా ఆదరించారు. రాజుగా గ్రహించారు.

పురాణాలు చెప్పే ఇలాంటి కథలలో, దేవ, ఆర్య, ఆర్యేతర జాతుల మధ్యగల వ్యవహార భేదాలు కనబడతాయి.

హిమాలయ పర్వతాలలోని మానస సరోవరం - కైలాసం - కైలాసగంగ లాంటి వర్ణనలను ఆధునిక పరిజ్ఞానంతో విశ్లేషించుకుంటే ఎన్నో సత్యాలు బోధపడతాయి. ఇప్పటి హిమాలయాల స్థానంలో పూర్వం టెథిస్ సముద్రం ఉండేదనీ రెండు భూఖండాలు ఒక దానినొకటి బలంగా తాకటంవల్ల ఆ ప్రదేశంలో మంచుకొండలు పైకి లేచాయనీ చరిత్ర చెబుతున్నది.

ఇటీవలి ఉత్తరాఖండ్ ఉత్పాతం (2013 జూన్ 16, 17 తేదీలలో కేదార్‌నాథ్ క్షేత్రంలో జరిగిన జలప్రళయం) చాలా విషయాలు బోధపరుస్తున్నది. కుమయూన్ హిమాలయాలు విస్తరించినచోట ఇరవైవేల మంచునీటి సరస్సులు (హిమనదాలు) ఉన్నట్టు ఇటీవల శాస్త్రజ్ఞులు గుర్తించారు. ఉష్ణోగ్రత పెరగడటంవల్లగాని, భూకంపాలవల్ల గాని ఏ ఒక్క సరస్సులోని నీరు పొంగినా అది ప్రళయాన్ని సృష్టిస్తుందంటున్నారు.

పురాణ కథలలోని సృష్టి స్థితి లయాల వృత్తాంతాలలో జలప్రళయాలలో జీవజాలం చాలా శాతం నశించటం - కొన్ని జీవులు రక్షించబడటం వంటివి గతంలోని చిన్న - పెద్ద హిమప్రళయాల సంఘటనలను తెలిపేవే కావచ్చు. ఆ క్రమంలో అక్కడి దేవగణాలూ, వారి ఆశ్రితులయిన ఆర్యగణాలూ దక్షిణ ప్రాంతాలకు వచ్చి స్థిరపడటమూ సంభవించి ఉంటుంది.

వేద దేవతల పేర్లుగల శిలాఫలకం ఆసియా మైనర్ భోగజ్ కాయ్ ప్రాంతంలో లభించింది. ఇది క్రీ.పూ. 1400 నాటిది అంటారు. దేవలోకానికి పైన బ్రహ్మలోకం ఉండేదని పురాణాలు చెప్పాయి. దీనిని బ్రహ్మావర్తంగా మనుస్మృతి పేర్కొన్నది.

"సరస్వతీ దృషద్వతీ నదుల మధ్య ప్రదేశం బ్రహ్మావర్తం. ఇది దేవ నిర్మితం." (మనుస్మృతి 2-17). దీనికి దిగువన కురుక్షేత్రం ఉన్నదట. మత్స్యదేశం, పాంచాలం, శూరసేనకం అక్కడి రాజ్యాలు. ఈ ప్రాంతాలను బ్రహ్మర్షి దేశం అనీ అనేవారట. మనుస్మృతి ఈ విధమైన విభజనలన్నీ చేసింది.

వాస్తవానికి దేవలోకమూ బ్రహ్మలోకమూ ఇంద్రలోకమూ అన్నీ మానవ లోకాలే. ఈ వర్గీకరణలు కొన్ని వర్గాలు తమ ఔన్నత్యాన్ని చాటుకోవటానికి చేసినవే.

దేవగణాలు - అసుర గణాలు - ఒకే తండ్రి సంతానమనీ, విరాట్పురుషుని శరీరంలోని వివిధ భాగాల నుండి వేర్వేరు జాతులతో మానవ, మృగ, పక్షి, సరీసృప జీవజాలంతో కూడిన సృష్టి ఏర్పడిందనీ చెప్పే కథలూ వర్గ ప్రయోజనాలను ఆశించి చేసినవే.

పురాణాలు బహుముఖంగా కీర్తించే 'నారాయణుడు' మరీ ప్రాచీనుడు కాదు. క్రీస్తుశకం 200 ప్రాంతాల శాసనాలలోనే నారాయణుని ప్రస్తుతి కనిపిస్తున్నది - రామాయణం గ్రంథస్థమైనదీ ఆ కాలంలోనే అంటున్నారు. దేవగణాలలో మొదట ఇంద్రుడు ప్రముఖుడుగా ఉండేవాడు. తర్వాత బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు వచ్చారు. వీరిలో ఈ త్రిమూర్తులలో బ్రహ్మ సృష్టికర్త. జ్ఞానానికి సంకేతం. విష్ణువును ఉపేంద్రునిగా చేశారు. (ఉప+ఇంద్రుడు) - అతడు ఇంద్రునికి సోదరుడనీ అన్నారు. మహేశ్వరుడు అనార్యుల (అసురుల) దైవమైన రుద్రుడే. అసురులతో సఖ్యంగా ఉండటానికి ఇతనికీ దైవం హోదా ఇచ్చారు. వీరిని త్రిమూర్తులుగా సృష్టి, స్థితి, లయ కారకులుగా చెప్పటం ఒక సంకేతం, - ఒక ఒప్పందం కూడా.

నాగార్జునకొండ దగ్గర లభించిన శాసనాలలో ఆభీరరాజు వసుషేణుడు వేయించి నట్టు చెప్పబడుతున్న శాసనం - క్రీ.శ. 287-90 ప్రాంతం నాటిది - పురాణ పురుషుడైన నారాయణునికి వందనంతో మొదలయింది. విష్ణువును నారాయణునిగా చెప్పిన మొదటి శాసనం ఇది. అక్కడే "భగవతో అఠభుజ సామిస దచ్చిన కరణసర" వంటి ప్రాకృత పదాలున్న రెండు శంఖాలు లభించాయట. అష్టభుజ స్వామి రుద్రుడని కొందరంటారు. కాని ఆలయాలు ఆ మూర్తిని విష్ణువుకు (నారాయణునికి) స్థిరపరచాయి. (స్థానికులైన) అసురులను చంపటం కోసం నారాయణుడు ఎన్నో అవతారాలు ఎత్తాడు. వాటిలో ఒకటి రామావతారం. రావణాసురుని చంపటం కోసం నారాయణుడు (విష్ణువు) ఆయుధ సమేతంగా రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులుగా అవతరించాడని రామాయణం చెబుతున్నది. వీరిని ఆర్యులుగా ప్రసిద్ధం చేసింది.

నారాయణుడు అసురులను చంపుతూ వారి రాజ్యాలు దేవగణాలకు - ఇంద్రునికి - కట్టబెట్టటం పురాణ కథలలో చూడవచ్చు. చాలాకాలం ఇంద్రుని తమ్ముడుగా ఉపేంద్రునిగా ఉన్న విష్ణువు ఆ తర్వాత త్రిమూర్తులలో ఒకడుగా ముఖ్యుడుగా ఎదిగాడు.

దేవగణాలకు త్రిమూర్తులు బ్రహ్మ, విష్ణువు, శివుడు, అధిష్ఠానవర్గం. ఈ ముగ్గురికీ వేర్వేరు రాజ్యాలు (లోకాలు) ఉన్నాయి. అవి స్వతంత్ర ప్రతిపత్తి కలిగి ఉన్నట్టే తోస్తుంది.

**ఆర్యులు**

ప్రాచీన భారతదేశంలో ఉత్తరాపథంలో సూర్యచంద్ర వంశాల వారమని చెప్పుకునే రెండు రాజవంశాలు ప్రసిద్ధంగా ఉండేవి. వారి పాలనలోని భూములు ఆర్యావర్త భూములుగా మనుధర్మ శాస్త్రం చెప్పింది. కాబూలు మొదలుకొని ఆధునిక పంజాబు, గంగా సింధు మైదాన ప్రాంతాలు, ఉత్తరప్రదేశ్ పరిసర ప్రాంతాలు ఆర్యావర్త భూములు. అక్కడి ప్రజలు ఆర్యులు.

భారతదేశపు జాతులలో ఇండో ఆర్యన్లను శాస్త్రవేత్తలు ప్రస్తావించారు. వీరు క్రీస్తు పూర్వం 12వ శతాబ్దిలో పశ్చిమోత్తర మార్గాల ద్వారా భారతదేశంలో ప్రవేశించారంటారు.

దాదాపు అయిదువేల సంవత్సరాలకు పూర్వం సుమేరియా ప్రాంతాల నుండి భారతదేశానికి వాయవ్య దిశ నుండి వచ్చిన సంచార తెగలు ఆర్యులని కొందరి వాదం. ఆర్య వాఙ్మయంలో 'మేరు' పర్వతం తరచూ ప్రస్తావనకు వస్తుంటుంది.

ఆర్యులు ఇండో-యూరోపియన్ భాషా మూలాలు గల జన సముదాయం. వీరిలో గ్రీకులు, శకులు (బాక్ట్రియన్లు), పార్థియన్లు (పహ్లవులు), కుషానులు మొదలగువారు ఉన్నారు. ఆర్యుల భాష వైదిక సంస్కృతానికి మూలభాష కావచ్చును. ఆర్యులలోనూ వర్గాలున్నాయనీ ఋగ్వేద ఆర్యులూ, అధర్వణవేద కాలపు ఆర్యులూ వేర్వేరనీ డా॥ అంబేద్కర్ చెప్పారు. చరిత్రకారులు ఆర్యులంతా ఒకటే అనే భావనతో చరిత్ర నిర్మిస్తూ పోయారు. భాషను బట్టీ, స్వభావాన్ని బట్టీ గుణ శీలాలను బట్టీ నిర్ధారించవలసిన ఆర్యత్వాన్ని జాతిపరంగా ప్రసిద్ధం చేయటానికి జరిగిన ప్రయత్నాలలో పురాణాలు వింత స్వరాలు వినిపించాయి.

'ఆర్య' పదం శ్రేష్ఠ వాచకంగా గౌరవ పూర్వకంగా వాడే పదం. తమను తాము శ్రేష్ఠులుగా చెప్పుకోవటం కోసం ఆచార వ్యవహారాలలో కొన్ని నియమాలు పెట్టుకొని మిగతా సమాజానికంటే భిన్నంగా జీవించిన వర్గం ఆర్యవర్గం. తమ గొప్పతనాన్ని నిరూపించుకోవటం కోసం ఒక వ్యవహార సరళి ఏర్పాటు చేసి దానికి భిన్నంగా నడిచిన వారిని శిక్షించటమూ, వెలివేయటమూ కొన్నింటికి ప్రాయశ్చిత్త కర్మలు చేయించి కలుపుకోవటమూ చేస్తుండే వారు. ఇలా వెలివేయబడిన వారిని దక్షిణాపథ భూములకు పంపేవారట. ఆర్యమునుల ఆశ్రమాలు సైనిక స్థావరాలుగా ఆర్యుల పాలనను కాపాడుతూ ఉండేవి.

ఆర్యుల రాజ్యాలు జనపదాలు. వాటి ఏలికను 'మహాదేవుడు' అనేవారు. ఈ "మహాదేవ" పదాన్ని భూమిమీది దేవుళ్ళుగా పురోహిత వర్గం 'మహిదేవ' విశేషణంగా తమకు ఆపాదించుకున్నది.

ఆఫ్ఘనిస్తాన్‌లో హారధయు (హరీ-రుదో) నదీ ప్రాంతం ప్రాచీన ఆర్యుల రాజ్యం అని కొందరంటున్నారు. రామకథకు మూల సంఘటనలు అక్కడివేనంటున్నారు. (ది వేదిక్ పీపుల్ - రాజేష్ కొచ్చర్). ఆర్యుల రాకను గురించి జోతిరావ్ పూలే 'స్లేవరీ' గ్రంథంలో చర్చించాడు. పురాణాలు చెప్పిన అవతారాల కథలకు ఆయన కొత్త రీతిలో అర్థం చెప్పారు. ఇరానియన్లు చిన్ని చిన్న నావలమీద ఈ దేశానికి వచ్చారు (వీరిని పర్షియన్లు అనీ అన్నారు). వారి నావలు నీటిలో చరించే చేపలలాగా ఉన్నాయి గనక వారి నాయకుడిని మత్స్యునిగా చెబుతూ పురాణాలలో మత్స్యావతారం ఊహించారన్నాడు. ఆ తర్వాత వచ్చినవారు కొంచెం పెద్ద ఓడలమీద వచ్చారు గనక కచ్ఛపం తాబేలుగా ఊహించారనీ పూలే అన్నాడు. మొదట వచ్చిన మత్స్య నాయకుడు ఇక్కడి స్థానిక అసుర సేనా నాయకుడిని (శంఖాసురుని) ఓడించి తన స్థావరం ఏర్పాటుచేసుకున్నాడనీ మత్స్యుని అనంతరం శంఖాసురుని అనుయాయులు తిరిగి ఆ ప్రాంతాలు వశపరచుకున్నారనీ చెప్పాడు. తర్వాత దశలు దశలుగా వచ్చిన ఇరానియన్లు ఆర్యన్లుగా బ్రహ్మ అనుయాయులు కాబట్టి బ్రాహ్మణులుగా తమను తాము చెప్పుకున్నారన్నాడు. ఆర్యులూ పర్షియన్లూ (ఇరానియన్లు) ఒకే ఆదిమతెగ నుండి వచ్చినవారు. అసుర క్షత్రియులు బ్రహ్మ అనుయాయులను ప్రతిఘటిస్తూనే వచ్చారని చెప్పాడు. భారతదేశ వాయవ్యప్రాంతం పర్షియన్ల అధీనంలో ఉండేదని జెండ్-అ-వెస్తాలో ఉంది.

ఆర్యులు వామనుని నాయకత్వంలో బలిని పాతాళానికి అణచివేయటమూ తర్వాత బాణాసురుడు విజృంభించి దేవ/ఆర్య గణాలను తరిమివేయటమూ బాణాసురుని తర్వాత తిరిగి దేవ/ఆర్య గణాలు అసురుల రాజ్యాలు వశపరచుకోవటమూ జరిగిందని పూలే అన్నాడు. అప్పుడే పరశురాముడు అసుర క్షత్రియులను 21 (ఇరవై ఒక్కసార్లు) వెదికి వెదికి చంపాడని పూలే నిర్ధారించారు. ఓడిన అసుర క్షత్రియులను ఆర్యులు క్షుద్రులుగా, శూద్రులుగా పరిగణించి వారికి సేవాధర్మం విధించారన్నారు. అలెగ్జాండర్ దండయాత్ర కాలానికి జీలం బియాస్ నదుల మధ్య ఏడు రాజ్యాలున్నాయట. వాటిలో గణవ్యవస్థ గల క్షుద్ర రాజ్యం ఒకటి. వారే ఓడిపోయి శూద్రులుగా వ్యవహారంలోకి వచ్చారేమో.

మానవులు గుర్రాలనూ, ఆవులనూ, ఒంటెలనూ తమ ప్రయోజనాల కోసం మచ్చిక చేసుకోవటం వేల సంవత్సరాల క్రితమే ఆరంభమైంది. వాటిని ఆహారంగా తీసుకోవటమూ అలవాటయింది. ముఖ్యంగా శీతల ప్రాంతాల వారు గుర్రాల మాంసం తినేవారు. తర్వాత వాటిని రవాణాకూ, ఇతర పనులకూ ఉపయోగించారు. ఆవులు, ఒంటెలు మొదలైనవి ఆహారంగానూ వ్యవసాయ పనులకూ ఉపయోగపడ్డాయి.

సురులకూ, ఆర్యులకూ గుర్రాలు/ఆవులు ప్రతిష్ఠాత్మకంగా ఉండేవి. స్థానికులకు గొర్రెలూ మేకలూ ధనంగా ఉండేవి.

గుర్రాలూ, రథాలూ ఆర్యుల సంస్కృతి. ఇండో యూరోపియన్ సమాజంలో గుర్రాలు, రథాలు కలిగి ఉన్నవారు సామాజిక హోదాలో పై వర్గంగా ఉండేవారు. రామాయణంలో దశరథుడు పది రథాలున్న రాజుగా మహారథికునిగా ప్రసిద్ధుడు.

అప్పటి ఆర్యుల రాజ్యాలలో అయోధ్య, కోసల, మిథిల మొదలైనవి ప్రసిద్ధంగా ఉన్నాయి. ఆర్య సంప్రదాయాలు ఈ రాజ్యాలలో పాటించారు. కర్మకాండ మీద యజ్ఞాల మీద నమ్మకం ఎక్కువగా ఉండేది. అయోధ్య రాజయిన దశరథునికి 350 మంది భార్యలు, ముగ్గురు పట్టపు రాణులు ఉన్నారు. అయినా పుత్ర సంతానం కోసం 'పుత్ర కామేష్టి' చేశాడు. ఆర్యరాజులు పుత్ర సంతానం కోసం పుత్రకామేష్టి, రాజ్యం కోసం రాజసూయం, విందులు వినోదాలకు వాజపేయం, పౌండరీకం, అశ్వమేధం వంటివి చేస్తుండేవారు. ఆర్యులను గురించి చెప్పాలంటే అది విస్తృతమూ, వివాదగ్రస్తమూ అయిన అంశం. రామాయణ కథకు సంబంధించినంతవరకు ఆర్యులను గురించి చెప్పుకోవటం విషయావగాహనకు అవసరం కాబట్టి, ఆ విషయాలు క్లుప్తంగానే ప్రస్తావించడం జరుగుతున్నది.

పురాణ కథనాల ప్రకారం నారాయణుని ఇరవై ఒక్క అవతారాలలో రామావతారం పద్దెనిమిదవది. వాటిలోనూ ప్రఖ్యాతంగా ఉన్న దశావతారాలలో ఏడవది. ఇది ఆర్య ధర్మ విస్తరణకూ, అసుర సంహారానికీ ఉద్దేశించిన అవతారంగా ప్రతీతి. రాముడు ఆర్యరాజుగా ప్రసిద్ధుడు. అసురులను అనార్యులుగా చెబుతుంటారు. హిందూ పురాణాలు దేవాసుర (సురాసుర) యుద్ధాల కథలు ఇతివృత్తంగా గలవి. హరప్పా నాగరికత వీటికి నేపథ్యం అనుకోవచ్చు. అసురుల తోడి యుద్ధాల విషయంలో దేవగణాలూ, ఆర్యులూ పరస్పరం సహకరించుకొనేవారు. ఆర్యరాజయిన దశరథుడు ఒకప్పుడు ఇంద్రునికి యుద్ధంలో సహాయంగా వెళ్ళాడట. ఆ సందర్భంలోనే కైకేయికి దశరథుడు వరాలు ఇచ్చాడని రామాయణం చెబుతోంది.

'ఆర్య' శబ్దాన్ని జాతి వాచకంగా కాక భాషా సంస్కృతుల పరంగా చూడాలని భాషా శాస్త్రవేత్తలు చెబుతున్నారు.

ఆర్యావర్తం గురించి చెప్పిన ధర్మశాస్త్రకర్తలు శిష్టాచార పరాయణులు నివసించేది ఆర్యావర్తమనీ అక్కడ చతుర్వర్ణ వ్యవస్థ ఉంటుందనీ చెప్పారు. ఇది క్రీ.పూ. మూడో శతాబ్దం నాటి పరిస్థితి.

ఏ దేశంలో చతుర్వర్ణ వ్యవస్థ ఉండదో అది మ్లేచ్ఛ దేశం అనీ అన్నారు. 'మ్లేచ్ఛ' అనేది 'మ్లిష్ట' శబ్దంతో సంబంధంగల పదం. తమకు అర్థంకానివిగా అస్పష్టంగా ఉన్న స్థానికుల భాషలను ఆర్యులు 'మ్లిష్ట', మ్లేచ్ఛ పదాలతో పేర్కొన్నారు. ఆ ప్రజలనూ తిరస్కార భావంతో చూశారు. అపభాషణం (సరిగ్గా పలకక పోవటం) ఒక దోషం. ఈ దోషాన్ని గురించి చెబుతూ పతంజలి మహాభాష్యంలో మ్లేచ్ఛనము అనే మాట ఉపయోగించాడు. అప్పటికి ఇది శబ్దదోషపరమైన పదమే కాని జాతి మత సంబంధి కాదు. కాలక్రమంలో మ్లేచ్ఛులు అనేది జాతి అనే అర్థంలో ప్రచారమయింది.

ఆర్యులు త్రైవర్ణికులు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య ధర్మాలు పాటించేవారు. కౌసల్య బ్రాహ్మణ బ్రహ్మచారులను పోషించటమూ, రాముని పట్టాభిషేకానికి జరిగిన సన్నాహాలలోని క్రతువులూ, దానాలూ, పూజాదికాలు ఉపవాసాలూ, వాస్తు ధర్మాలూ మొదలైన వాటిలో బ్రాహ్మణ పురోహితుల పాత్ర ఉండటమూ సమాజానికి మార్గదర్శనం చేసింది. వర్ణధర్మం పాటించాలనే సూచన రామాయణ పాత్రల ద్వారానే సమాజానికి అందింది.

ఆర్యులు పుత్ర సంతానానికి ప్రాధాన్యం ఇచ్చారు. మాతృస్వామ్యాన్ని కాదని పితృ వంశానుక్రమాన్ని ప్రవేశపెట్టారు. తండ్రి తర్వాత పెద్ద కొడుక్కి రాజ్యం వస్తుందన్నారు. దశరథునికి శాంత అనే కూతురు ఉన్నట్టు జానపద గాథల నుంచీ, స్త్రీల రామాయణ పాటల నుంచీ తెలుస్తున్నది గాని రామాయణ కావ్యం ఆమెకు గుర్తింపు ఇవ్వలేదు.

రామాయణ స్త్రీలు విద్యావంతులు. రాజకీయ పరిజ్ఞానం కూడా వారికి ఉండేది. అయినా పురుషులు వారి జ్ఞానాన్ని గుర్తించే వారే కాదు. ఆ విషయంలో వానర సమాజం కొంత నయం.

ఆర్యుల జీవనం గోవుల చుట్టూ తిరిగింది. గోధనం, గోష్పాదం, గోరోజనం, గోధూళి, గోచరం, గోచారం వంటివన్నీ వారి జీవన విధానాలనూ, లెక్కింపులనూ తెలిపే పదాలు. 'గోవు' అప్పటి మారక ద్రవ్యం. 'గోఘ్నుడు' అంటే అతిథి. అతిథి రాగానే అతనికి ఆతిథ్యం కోసం గోవును చంపే వారు. మాంసం తోడి ఆహారాన్నే వారు భోజనంగా వ్యవహరించేవారు. మాంసాహారుల ఇళ్ళల్లో ఒకప్పుడు చుట్టాలు రాగానే కోడిని కోసి వండి వడ్డించేవారు. పూర్వం ఆర్యుల ఇళ్ళల్లో చుట్టాలు రాగానే మంచి భోజనం పెట్టటానికి ఆవును చంపేవారన్న మాట. గోవధను వ్యతిరేకించటం ఇటీవలి పరిణామం.

పురోహిత వర్గానికి గోవులు ఆస్తిగా, ధనంగా, ఆహారంగా ఉండేవి. 'గో' శబ్దానికి వేదం (జ్ఞానం) అనే అర్థం కూడా చెప్పుకుని వేదం తెలిసిన బ్రాహ్మణులు తమను గోబ్రాహ్మణులుగా ప్రసిద్ధం చేసుకున్నారు. గో బ్రాహ్మణుల హితమే సమాజ హితంగా ఆర్య వాఙ్మయం చెబుతున్నది.

ఆర్యులు స్థానికుల నగరాలను, సంపదను వశపరచుకోవాలని చూసినప్పుడూ – తమ సంప్రదాయాలను స్థానికులు అనుసరించాలని బలప్రయోగం చేసినప్పుడూ స్థానికులు ప్రతిఘటించేవారు. హరప్పా సంస్కృతి క్షీణించటమూ ఆర్యుల ప్రాబల్యం పెరగటమూ చారిత్రక పరిణామాలు. ఆర్యుల నాగరికతా దశలను మొదట్లో అదితి యుగం – పునర్వసు యుగం – మృగశీర్ష యుగం – ఇత్యాదిగా లెక్కించే వారట. యుగం అంటే వారి లెక్కలు వేరే. కృత్తికా యుగంలో ఋగ్వేదం రూపుదిద్దుకున్నదట. క్రీ.పూ. 1700–1500 ప్రాంతంలో ఆర్యులు వాయవ్యంగా గంగానదీ తీరానికి విస్తరించారంటారు. అది ఆర్యావర్తం అయింది. సురాసుర యుద్ధాలలోని ఇతివృత్తం అదే. అసురులనూ వారి నగరాలనూ నాశనం చేయాలనీ, వారి సంపదను తమకు వశపరచాలనీ ఆర్యమునులు దేవగణాలను కోరుతూ

చేసిన స్తుతులు (సూక్తాలు) ఋగ్వేదంలో ఉన్నాయి. ప్రతిఫలంగా వారికి (సురులకు) కొన్ని ప్రత్యేక కానుకలు అందేవి.

ఆర్య శబ్దం 'అర్' ధాతువు నుండి ఏర్పడిందనీ 'ఆర్య అంటే 'పొందటం' అనీ అంటారు. "సమస్తాన్ని పొందేవాడు", "తీసుకునే హక్కు కలవాడు" అనే అర్థంలోనే ఆర్యులు వ్యవహరించారు. భూమి మీది సంపదకంతా తామే హక్కుదారులం అనుకున్నారు. (అదే రీతిలో ఈనాడూ ఇరవై ఒకటో శతాబ్దంలోనూ పాలకవర్గాల మనుకునేవారు వ్యవహరించటం కనిపిస్తున్న వాస్తవం.)

ఋగ్వేద ఆర్యులు సప్తసింధు ప్రాంతంలో మొదట నివాసాలు ఏర్పరచుకొన్నారు. చిన్న చిన్న చెరువులనూ జలాశయాలనూ కూడా వారు సింధువులుగా (సముద్రాలుగా) పేర్కొన్నారు – సప్త సముద్రాలకు అవతల కీకారణ్యంలో – అంటూ మొదలయ్యే జానపద గాథలలోని సప్త సముద్రాలు సింధునది శాఖలే. సింధునది + దాని శాఖలు అయిదు + సరస్వతి ఇవి సప్త సింధువులు. క్రీ.పూ. 1900 ప్రాంతంలో సరస్వతి నది అంతార్ధానమయింది.

ఋగ్వేద కాలంనాటి స్త్రీ దేవత ఉషస్సు (ఉషాదేవి). వ్యవసాయ దేవత సిత. సితా భూముల గురించి ప్రాచీన అర్థశాస్త్రాలలో ప్రస్తావనలున్నాయి. పన్ను వసూలు చేయదగ్గ భూములు 'సితా' భూములు. రాజుకు వ్యవసాయ భూమిపై వచ్చే ఆదాయంలో అధిక శాతం 'సితా'నే. 'సితా' భూముల గురించిన పోరాటమే సీతకథ కావచ్చు.

రామాయణం ప్రకారం రాముని కాలానికి అసురుల నగరాలూ, వానర రాజ్యాలూ ఉన్నత స్థాయిలో ఉన్నాయి. దశరథుని అయోధ్యకంటే వాలి రాజధాని కిష్కింధ శోభాయమానంగా ఉండటం చూసి లక్ష్మణుడు ఆశ్చర్యపోయాడు. రావణుని లంకానగరం కిష్కింధను మించిన వైభవంతో ఉండటం చూసి హనుమంతుడు ఆశ్చర్యపోయాడు. అయినప్పటికీ ఆర్యులు తమను గొప్పగా చెప్పుకునేవారు.

దశరథుని అధీనంలో సింధు, సౌవీర, సౌరాష్ట్ర, అంగ, వంగ, మగధ, కాశీ దేశాలున్నాయన్నారు. అయోధ్య, కోసల, మిథిల, కేకయ రాజ్యాలూ ఆర్యులవే. కేకయ రాజ్యం పశ్చిమ పంజాబు ప్రాంతం. మిథిల బీహార్‌లోని దర్భాంగా ప్రాంతం కావచ్చు. ప్రస్తుత అయోధ్య స్థలం పూర్వపు సాకేత రాజ్యం. బృహదశ్వుడు అనే బౌద్ధ రాజు అక్కడ పాలించాడు. క్రీ.శ. ఏడవ శతాబ్ది నాటికి అది మరో వంశం వారి వశమైంది. వారిలో మిత్రశ్రుంగుడనే రాజు తన పేరుకు 'రామ్' అనేది చేర్చుకున్నాడట. ఈ నేపథ్యంలో రామ్, ఋశ్యశృంగ పదాలను పరిశీలించాలి. ఈ అయోధ్యలో బౌద్ధ శిథిలాలున్నాయి.

తమను తాము గొప్పగా భావించుకునే సముదాయం కాబట్టి ఆర్యులు తమకంటూ కొన్ని ప్రత్యేకతలు ఆపాదించుకున్నారు. వర్ణధర్మం, క్రతుకర్మలు చేయటం, సంస్కరించబడిన భాష మాట్లాడటం మొదలైనవి.

'కర్మభూమి' అనే భావనను రామునిచేత పలికించారు "కర్మభూమి మిమాం ప్రాప్య కర్తవ్యం కర్మ యచ్ఛుభం..." (అరణ్య 109-28). కర్మభూమిలో కర్మ చేయాలంటాడు రాముడు.

అనార్యుడయిన హనుమంతుడు చక్కగా మాట్లాడటం చూసి, "అనార్యునికి ఇంత భాషా పాటవమా" అని రాముడు ఆశ్చర్యపోయాడు (కిష్కింధ 3-28). వేదాలు చదవకుండా అంత భాషాజ్ఞానం రాదన్నాడు. ఇలా అనుకోవటం ఆర్యుల లక్షణమే.

స్థానిక జాతులతో ఆర్యుల వైరం కొంతకాలంపాటు సాగింది. నల్లనివారిని వధిస్తూ, వారి ఇళ్ళూ పంటలూ తగలబెడుతూ ఉండే ఆర్యులు, కాలక్రమంలో తమలోనూ నల్లని వారిని గమనించి వర్ణానికి (రంగు) ప్రాధాన్యం ఇవ్వటం తగ్గించారేమో.

వారి నాయకులు రాముడూ, కృష్ణుడూ నల్లనివారే. వర్ణధర్మం శరీరవర్ణానికి అతీతంగానే ఉంది. సాధారణంగా సమాజంలో తెల్లని శరీర వర్ణం గలవారిని ఆదరం గాను సానుకూల వైఖరితోను చూస్తుంటారు. నల్లని వారిని అంత పట్టించుకోరు. ఈ వివక్ష పాతకాలంలోను ఉండేది. సాక్షాత్తూ పార్వతీదేవి ఇలాంటి నిరసనకు గురి అయింది. పార్వతి (గిరిరాజ తనయ కాబట్టి) నల్లనిది. శివుడు అనార్యుల దైవతం అయినా తెల్లనివాడు. శివుడు ఒకప్పుడు పరిహాసంగా పార్వతి శరీర వర్ణాన్ని ప్రస్తావించాడు. ఆవిడకు కోపం వచ్చింది. ఇంటి నుంచి వెళ్ళిపోయి తపస్సుతో రంగు మెరుగుపరచుకుని తిరిగి వచ్చింది. గౌరవర్ణంతో వచ్చింది కాబట్టి 'గౌరి' అయింది. (ఇంటికి తిరిగివచ్చిన పార్వతిని ఎవరూ గుర్తుపట్టకపోవటం వేరే కథ). రంగు మార్పుకు ఆమె ఏమి లేపనాలు వాడిందో.

ఆర్యులు తాము దేవగణాలకు ఇచ్చిన కానుకల వంటివే తాము జయించిన వర్గాల నుండి ఆశించారు. స్థానిక జాతుల సంపద మీదా స్త్రీల మీదా తమకు హక్కు ఉన్నదని భావించారు. తాము వర్గీకరించిన ప్రకారం సమాజంలోని కింది వర్గాలు తమకు సేవలు చేయాలన్నారు. దేవగణాల పురుషులు ఆర్య స్త్రీలతో ప్రవర్తించినట్టే ఆర్య పురుషులు స్థానిక స్త్రీలతో వ్యవహరించబోయారు. ఇంద్రుడు అహల్యతో ప్రవర్తించిన తీరూ నారాయణుడు శంఖచూడుడనే రాక్షసుని భార్యను (జలంధర/తులసి) వంచించి అనుగ్రహించిన తీరూ రాముడు తాటక, శూర్పనఖలతో వ్యవహరించిన తీరూ గౌరవ ప్రదమైనవి కావు. వరుణుడూ, సూర్యుడూ ఊర్వశిని చూసి మోహించిన ఫలితంగా వసిష్ఠుడు, అగస్త్యుడు పుట్టారట. సుగ్రీవుడు, ఆంజనేయుడు తమ తల్లులకు సూర్య, వాయువుల వల్ల జన్మించారట. ఈ విధమైన ఆర్య దేవగణ సంబంధాలు చాలా ఉన్నాయి.

ఆర్య సంస్కృతి ఇలాంటివి ఒప్పుకున్నది. వాటిని సమర్థిస్తూ ధర్మసూత్రాలు తయారు చేయించింది. ఎవరైనా తిరుగుబాట్లు చేసినప్పుడు మాత్రమే ఈ రహస్యాలు బయటపడుతూ ఉండేవి. ఆర్యేతర జాతుల స్త్రీలు ఇలాంటి సంబంధాలను ప్రతిఘటించినప్పుడు అవి సంచలనాత్మకాలయ్యాయి - వక్రీకరణలతో నమోదు అయ్యాయి.

పూర్వ సాహిత్యం పేర్కొన్న ఆర్య రాజ్యాల వర్ణనలు అతిశయోక్తులతో నిండినవే. ఆ రాజ్యాలు మరీ అంత పెద్దవికావు. రామాయణ కథలో యజ్ఞపాయసం పంచటానికి దశరథుడు భార్యల ఇళ్ళకు స్వయంగా వెళ్ళాడు. యజ్ఞం దగ్గర వారులేరు. ఏదో గుడిలో పూజ వంటిది చేశాడేమో. ఎక్కడ పూజ/యజ్ఞం జరిగినా ప్రసాదం సమయానికి కుటుంబ సభ్యులంతా అక్కడ చేరతారు. కాని ఇక్కడ వర్ణన అలా లేదు.

జనక మహారాజు ఇల్లు కూడా అలాంటి వర్ణనే. జానపద కథల ప్రకారం సీత ఇల్లు అలుకుతూ శివచాపాన్ని చేతితో జరిపి అక్కడా అలికింది. కైకేయి కోపగృహంలో కిందపడుకున్నప్పుడు ఆమె శరీరానికి ధూళి (మట్టి) అంటుకున్నది. ఇలా గమనిస్తే అప్పటి రాజభవనాలన్నీ మామూలు ఇళ్ళే అని తెలుస్తుంది.

ఆర్యుల నియమాలు వ్యక్తినీ సమాజాన్నీ కట్టుదిట్టం చేశాయి. సమాజాన్ని ఎదగ నీయకుండా చేశాయి. 1) రాజు కోరుకుంటే అమాయకుడిని శిక్షించగలడు. 2) ధన వంతుడిని దరిద్రుడిగానూ దరిద్రుడిని ధనవంతుడుగానూ చేయగలడు అనే ధోరణి ఉండేది. 3) పెద్దవారిని చిన్నవారు సేవించాలి అనే ధర్మం రామ లక్ష్మణుల ప్రవర్తన ద్వారా తెలియపరచారు. “నీతోపాటు అరణ్యాలకు వచ్చి నిన్ను సేవిస్తాను. నీ బాణమ్మూ, ధనుస్సూ, పారచిప్ప, గంప మోసుకుంటూ నీకు దారి చూపుతూ నీ ముందు నడుస్తాను” అని లక్ష్మణుడు రామునితో అనడం (అయో. సర్గ 31) గమనించాలి.

జ్యేష్ఠునికే రాజ్యార్హత అనేదీ వారిదే. భరతునికి రాజ్యం రావలసి ఉందని కైక అడిగినప్పుడు, “రాముడు నీ పెద్ద కొడుకు అనే దానివి కదా. పెద్ద కొడుక్కే రాజ్యం రావాలి” అని దశరథుడు వాదించాడు (అయో. 12-13).

ఆర్యుల ప్రాబల్యాన్ని మతధోరణులనూ తట్టుకోలేని కొందరు ప్రజలు దక్షిణా పథానికి వచ్చారనీ వారిలో “పణులు” ముఖ్యులనీ కొందరి అభిప్రాయం. వారి పేరిట ఫణిగిరి ప్రసిద్ధమైందట.

ఫణిగిరి తవ్వకాలలో బౌద్ధుల ప్రాభవాన్ని తెలిపే కట్టడాలు ఎద్దు, ఏనుగు, పద్మం వంటి చిహ్నాలు బయల్పడ్డాయి. వీరి భాష ప్రాకృతం. క్రీ.పూ. ఒకటవ శతాబ్ది నుంచి క్రీ.శ. నాల్గవ శతాబ్దం వరకు వీరి పాలన సాగింది. పణులకూ ఫణి రాజులకూ సంబంధం ఉండి ఉంటే వీరు నాగజాతి వారే అయి ఉంటారు. త్రిరత్నం, గుర్రం, ఎద్దు, సింహం, ఏనుగు, నెలవంక గుర్తులున్న నాణాలూ ఈ ప్రాంతంలో లభించాయి.

వలసదారుల రాజకీయాలలో స్థానికుల అణచివేత ప్రధాన లక్షణం. ఆర్యగణాలు ఇంద్రుడిని నాయకుడిగా గ్రహించి ఒక సామాజిక వర్గంగా రూపొందాయి. ఇంద్రుడి నాయకత్వాన్ని అంగీకరించిన ఆర్యవర్గం ఇప్పటి మంత్రివర్గాల తరహాలో పాలకవర్గంగా విధాన నిర్ణయాలు చేస్తూ ఉండేది. ఆ నిర్ణయాలకు కట్టుబడిన ప్రజలు శిష్టులయ్యారు. వ్యతిరేకించిన వారు అనార్యులు అయ్యారు. స్థానిక జాతులు కూడా ఈ ఆర్య అనార్య

విభజనలోకే నెట్టబడ్డాయి. ఆర్య రాజ్యాల విస్తరణమూ, అసుర సంహారమూ దేవ/ఆర్య గణాల లక్ష్యాలయ్యాయి.

ఇప్పటి ప్రభుత్వాలలో అసమ్మతి వర్గాలూ, అధిష్ఠాన వర్గాలూ ఉన్నట్టే అప్పటి వ్యవస్థ కూడా ఉండేది. త్రిమూర్తులు అధిష్ఠాన వర్గం. మాతృస్వామ్య వ్యవస్థలో 'దేవి' శక్తి స్వరూపిణిగా, 'మాత'గా ఉండేది. తర్వాత ఆమెను ఏమార్చి త్రిమూర్తులు అధికారం చేజిక్కించుకుని అధిష్ఠాన వర్గం అయ్యారు. ముగ్గురూ మూడు రకాల అధికారాలూ ఎంచుకున్నారు.

"కృణ్వంతో విశ్వమార్యం, అపఘ్నతో అరావ్ణః" (ప్రపంచాన్ని ఆర్య ధర్మాలతో నింపుతాం. అడ్డుకున్న వారిని చంపుతాం) అంటూ సాగించిన ఆర్య ప్రభంజనానికి ఎందరెందరు బలి అయ్యారో! ఆర్య ధర్మం గోబ్రాహ్మణ హితం కోరే ధర్మం. జాతి వివక్షతో కూడుకున్న ధర్మం. 19వ శతాబ్దంలో జర్మనీ నియంత హిట్లరు స్వచ్ఛమైన ఆర్యరక్తం పేరిట సాగించిన హత్యాకాండ లాంటిదే అక్కడా పూర్వం జరిగింది.

అసురుల రక్తపు చుక్కలు కూడా మిగలకుండా అసుర జాతులను ఆర్యులు నిర్మూలించినట్లు పురాణ కథలు చెబుతున్నాయి.

**అసురులు**

తొలి వేదకాలపు దాసులు, దస్యులు అనంతర కాలానికి అసురులుగా ప్రచారమయ్యారు. కొందరు అసురుల పేర్లు తరువాత దేవతాగణంలో చేరిపోయి వేద సూక్తాలలో కనిపిస్తున్నాయి.

1. పూర్వం అద్భుతశక్తులు గలవారికి 'అసుర' అనే విశేషణం వాడేవారు. వరుణుడు గొప్ప అసురుడు అని ఋగ్వేదంలో (1-24, 14) ఉంది. సవిత్రుడు బంగారు హస్తాలు గల అసురుడు (1-35, 9) అని అన్నారు.

2. "అసుర" పదం ఇండో ఆర్యన్, ఇరానియన్ సంబంధం కల పదం.

అసుర అంటే ప్రభువు, స్వామి, యజమాని అని అర్థం. రాక్షసుడు అనే అర్థం మలి వేదకాలంలో వాడుకలోకి వచ్చింది.

ఈ దేశంలోని మొట్టమొదటి పాలకవర్గాలు అసురులు. వలసదారుల ఆక్రమణలతో ప్రాభవం కోల్పోయారు. అందుకే వీరిని తొలి వేల్పులు అంటారు. హరప్పా సంస్కృతి క్రీ.పూ. 5000-1500 వీరిదే. అదే మూల భారతీయ నాగరికత. దక్షిణ దేశంలోనూ హరప్పా సంస్కృతి అవశేషాలు కనిపించాయి. తమ తమ సంప్రదాయాల పట్ల నిబద్ధత గల నాగులు, యక్షులు, దైత్యులు, దానవులు, పిశాచులు, గంధర్వులు, యాతుధానులు మొదలైన వారంతా చిన్న చిన్న ఒంటరి జాతులు. వీరిలో ఎవరికి వారికి ప్రత్యేక అస్తిత్వం ఉంది. దురాక్రమణలనూ, వలసదారులుగా వచ్చిన కొత్తవారినీ ఎదుర్కొనే క్రమంలో కొన్ని సందర్భాలలో వీరంతా కలిసేవారు. ఇలా కలిసిన జాతుల సముదాయం

అసురగణంగా ప్రస్తావించబడింది. ఈ జాతుల సంప్రదాయాలలో ఒక అంతస్సూత్రం కనిపిస్తుంది. తల్లి దేవతలను పూజించటం - ప్రకృతి శక్తులను స్త్రీ మూర్తులుగా ఆరాధించటం - గ్రామ దేవతలు, జలదేవతలు, నగర దేవతలు మొదలైనవారిని తమకు ఆత్మీయంగా భావించుకోవటం వీరిలో ఉంది. అనంతర కాలపు ఆర్యుల పితృస్వామిక వ్యవస్థ ఈ తల్లి దేవతలను తమ పురుష దేవుళ్ళకు భార్యలుగా చేసి తమ ఆధిక్యాన్ని ప్రచారం చేసుకున్నది; బలపరచుకున్నది. అసుర సముదాయంలోని జాతులన్నింటికీ తమ తమ గణచిహ్నాలున్నాయి. పాము, ఏనుగు, పెద్దపులి, ఎలుగుబంటి, మొదలైన వనచరాల చిహ్నాలూ గరుడపక్షి, నెమలి వంటి పక్షుల చిహ్నాలు వారు ధరించేవారు.

సురులకు వ్యతిరేకులు కాబట్టి వీరు అసురులు అయ్యారని సాధారణంగా అను కుంటారు. కాని సురులకంటే అసురులే ప్రాచీన జాతి అనీ క్రీ.పూ. ఆరవ శతాబ్దానికి చెందిన 'అవెస్తా' (పార్సీల మత గ్రంథం) లోని 'అహుర' శబ్దంలో నుంచే 'అసుర' శబ్దం ఏర్పడిందనీ పండితుల అభిప్రాయం.

అవెస్తాలో 'అహుర', 'దైవ' అనేవి పరస్పర ప్రతికూల శక్తులు. 'దైవ' అనేదాన్ని మంచికి ప్రతీకగా గ్రహించి దేవతలకు ముడిపెట్టారు. 'అహుర'ను 'అసుర'గా, చెడుకు ప్రతీకగా ప్రచారం చేశారు. ఇది అనంతర కాలపు పరిణామం. ఒక విధంగా కుతంత్రం.

"అసుర" పదం ఆవిర్భావాన్ని పరిశీలిస్తే ఆ వివరాలు ఆసక్తిదాయకంగా ఉన్నాయి.

1. "అస్" అంటే ఉండటం. "స్వర్" అంటే వెలుగు, తేజస్సు. తేజోవంతంగా ఉండటం అసుర లక్షణం.

2. అసువులు అంటే ప్రాణాలు. ప్రాణశక్తిని గురించి జిజ్ఞాసతో ఆలోచించిన వారు అసురులు. మరణాన్ని గురించి ఆలోచించిన వారూ, మరణం లేకుండా ఉండాలని తపస్సు చేసినవారూ అసురులే.

'అసుర' పదం 'ఊపిరి-జీవం' అనే అర్థాలలో వచ్చిందనీ ప్రకృతి శక్తులను మూర్తీకరించటాన్ని ఇది సూచిస్తున్నదనీ చెబుతారు.

ఒక అభిప్రాయం ప్రకారం సురగణాలు, అసుర గణాలు తమ శక్తులను కార్య కలాపాలను పంచుకున్నాయనీ, సురగణాలు పగటిపూట, అసురులు, రాత్రిపూట బలవంతులుగా ఉంటారనీ ఐతరేయ బ్రాహ్మణం చెప్పింది.

అసురులు ధ్యాన యోగాభ్యాస నిరతులు. కొందరు "బ్రహ్మ" అనే విశేషణం ధరించారు. రావణ బ్రహ్మ, పులస్త్య బ్రహ్మ వంటి పదాలు జానపదుల కథల్లోనూ కనిపిస్తాయి. అసురులను చంపిన వారికి బ్రహ్మహత్యా పాతకం చుట్టుకున్న ఉదంతాలు పురాణ కథల్లో ఉన్నాయి. వృత్రాసురుని చంపిన ఇంద్రుడినీ రావణాసురుని చంపిన రాముడినీ బ్రహ్మ హత్య వెన్నాడింది. దాన్ని పోగొట్టుకోవటానికి వారు నానా అవస్థలూ పడ్డారు. రాముడయితే అంతర్వేది క్షేత్రంలో - వసిష్ఠ గోదావరి సముద్రంలో కలిసేచోట - లక్ష్మీనరసింహుని సేవించాడు. సేతువు దగ్గర రామేశ్వరంలో శివలింగం ప్రతిష్ఠించాడు. చాలా చాలా

ప్రాయశ్చిత్తాలు చేసుకున్నాడు. అతనికి ఉపశమనం కలిగించినవారు నరసింహుడూ - శివుడూ - వీరు అనార్య దేవుళ్ళు - అనార్యుల దేవుళ్ళే (గణనాయకులే) చివరకు రాముడిని క్షమించి వదలిపెట్టారన్న మాట.

రామాయణం సుర, అసుర పదాలను సుర (మద్యం)తో అనుసంధానం చేసింది.

పాల సముద్రాన్ని మథించినప్పుడు వరుణ దేవుని కూతురు 'వారుణి' అనే సురాధి దేవత సురాభాండంతో పైకి వచ్చింది. సురను పుచ్చుకోవటానికి దైత్యులు ఇష్టపడలేదు. ఆదిత్యులు 'సుర'ను పుచ్చుకొని 'సురులు' అయ్యారు. సురను తీసుకోనివారు 'అసురులు' అయ్యారు అని కథ. సురాభాండం అంటే కల్లుకుండ. (రామాయణం బాల. 45-24)

దైత్యులు, దానవులు (అసురులు) మద్యం తీసుకోకపోవటానికి కారణం వారి గురువైన శుక్రాచార్యుని ఆంక్ష అని చెప్పే కథ పురాణాలలోనూ, మహాభారతంలోనూ (కచదేవయాని ఉదంతంలో) ఉంది. చూ. మృతసంజీవని.

ఒక కథనం ప్రకారం తొలి వేదాలు అసురులు కూర్చిపెట్టుకున్నవే. అవి బాగా లేవని ఆర్య పురోహితులు వాటిని వదిలివేసి కొత్త సూక్తాలు తయారు చేశారు. పాతవి "జర్ఫరీ, తుర్ఫరీ" వంటి వ్యర్థ పదాలతో అస్పష్టంగా ఉన్నాయనీ అవి అసురులు రాసినవనీ నిరసించారు. (చూ. అంబేద్కర్ రచనలు ప్రసంగాలు సం. 4) పురాణ కథలు సృష్టించిన గందరగోళం నుంచి అసురుల మూలాలు నిర్ధారించటం కష్టసాధ్యమే. అసురుల సముదాయంలో పంచజనులూ ఉన్నారు.

## పంచజనులు

రామాయణం కిష్కింధాకాండ (42-28)లో పంచజనుని ప్రసక్తి ఉంది. వానర ముఖ్యులకు దారి చెప్పే సందర్భంలో సుగ్రీవుడు చెప్పిన వివరాల ప్రకారం పడమటి దిక్కులో చక్రవంతము అనే కొండ దగ్గర వేయి అంచులుగల చక్రాన్ని విశ్వకర్మ నిర్మించి ఉంచాడు. దానిని హయగ్రీవుడనే రాక్షసుడు రక్షిస్తూ ఉండేవాడు. విష్ణువు హయగ్రీవుని చంపి ఆ చక్రాన్ని తీసేసుకున్నాడు. అక్కడే పంచజనుడు ఒక శంఖాన్ని రక్షిస్తూ ఉన్నాడు. విష్ణువు అతనిని కూడా చంపి ఆ శంఖాన్ని తీసేసుకున్నాడు. ఆ శంఖం పంచజనుని పేర 'పాంచజన్యం'గా పేరుపడింది. "తత్ర పంచజనం హత్వా హయగ్రీవంచ దానవం..." అంటూ చెప్పాడు సుగ్రీవుడు. పంచజనులు, రాక్షసులూ దానవులూ ఒకే కోవలోని వారనేది ఇక్కడ స్పష్టంగా ఉంది. వీరంతా ఉత్పత్తి కులాల/వర్గాల వారా అనేది ఆలోచించాలి. (పాంచజన్యం కృష్ణునికి బహుకరణగా ఇచ్చారని భారతం చెబుతోంది.)

ఋగ్వేదం పంచజనులను పేర్కొన్నది. వారు అయిదు వర్గాల వారట (10-4-11-5). May the five orders of men may these who were born for the

sake of ghi - may those who are untitled to worship" అంటూ వారు పూజకు గౌరవానికి అర్హులు కారని చెప్పింది. వారు యజ్ఞాలలోని హోమద్రవ్యాన్ని (నేయి) ఆశిస్తున్నారనీ ధ్వనించింది.

వారు ఆర్యుల యజ్ఞ భాగాలకు అర్హులు కాకపోయినా హోమద్రవ్యాన్ని ఆశిస్తున్నా రనటంవల్ల వారు ఆర్యగణాలకు శత్రువర్గంలోని వారనీ దాయాదులే అనీ అసుర వర్గంలోనివారే అనీ అనుకోవచ్చు. వస్తువులనూ ఆయుధాలనూ తయారుచేసే నైపుణ్యంగల వారు కావచ్చు. శంఖాన్ని రక్షిస్తూ ఉన్న పంచజనుడు రాక్షసుడే అనటం నిస్సందేహం. చక్రాన్ని కాపాడుతూ వచ్చిన హయగ్రీవుడు దానవుడని స్పష్టంగా ఉంది. పురావస్తు శాఖ తవ్వకాలలో ఖనిజాలతోనూ లోహాలతోనూ తయారైన రకరకాల వస్తువులు క్రీ.పూ. 2400 సంవత్సరాల నాటివి ఈనాటికీ బయల్పడుతూ ఉండటం గమనిస్తే ఖనిజ పరిశ్రమలు స్థానికంగా ఉండేవని తెలుస్తున్నది. సింధునదీ పరీవాహక ప్రాంతాలలోనే గాక గుజరాత్ పరిసర ప్రాంతాలలోనూ ఇంకా దక్షిణంగానూ ప్రాచీన ముద్రలు, బంగారు పూసలు, సూదులు, ఆభరణాలతోపాటు కత్తులు, రకరకాల ఆయుధాలూ, కమ్మరి కొలుములూ బయల్పడ్డాయి. హరప్పా సంస్కృతి క్రీ.పూ. 18వ శతాబ్ది నాటికి అంతరించిందట.

ఈ నాగరికత అసురులదే. లోహాసురుని వృత్తాంతం అసురుల లోహ సంస్కృతికి సంకేతమా అనిపిస్తుంది.

దక్షిణ దేశంలో ఇప్పటి కృష్ణా గోదావరి, వంశధార, మహానది డెల్టా ప్రాంతాలు, విశాఖ, విజయనగరం, శ్రీకాకుళం పరిసర ప్రాంతాలు అసురుల రాజ్యాలు. ఒరిస్సాలో గంజాం, జయపూర్‌ల వరకు ఛత్తీస్‌గడ్, రాయ్‌గడ్ వరకూ వారికి చిన్న చిన్న రాజ్యాలుండేవి. తెలంగాణ ప్రాంతాలు, వింధ్య పరిసర ప్రాంతాలూ వారివే. కోసల రాజ్యానికి చెందిన దక్షిణ కోసల ప్రాంతమూ ఇప్పటి తెలంగాణా ప్రాంతాలూ విదిశ రాజ్య ప్రాంతాలూ వింధ్య పరిసర ప్రాంతాలూ త్రికళింగంగా గుర్తించారు. ఇవి అసురుల ప్రాంతాలు. ఈ ప్రజలలో కాళింగులు, కొండరాజులు, మత్స్యకారులు ఎక్కువ. ఈ రాజ్యాలలో కొన్నింటిని అనంతర కాలంలో ఆర్యులు కైవసం చేసుకొన్నారు. రామాయణంలో ప్రసక్తమైన వానర సైన్యం వివరాలు చూస్తే వారంతా ఈ ప్రాంతాలలోని గిరిజన ఆదివాసీ సముదాయాలు అని స్పష్ట పడుతుంది.

ఆది జాంబవ పురాణం ప్రకారం జ్యోతిర్మహేశ్వరుడు ఏర్పాటు చేసిన రాజ్యాలు 56.

అవి అంగ, వంగ, కళింగ, 'కాంబోజ', కర్నాట, కకురు, కొంకణ, టెంకణ, త్రిగర్త, కోసల, శూరసేన, ఆంధ్ర, పంచ, విరాట, బూరు ఒరాట, మల్లవ, నేపాల, మగధ, పాంచాల, మద్ర, మచ్ఛ, మలయాళ, వీర, సౌవీర, సౌరాష్ట్ర, విదేహ, విదర్భ, యుద్వల్ల, ద్రాయల, కాలసమాన, పులింద్రి, పాండ్య, గోల, గాంధార, కుంతల, గర్జర,

దిపునుద్రా, సుధేష్ణ, శూరసేన, సైరె వాల్మీక, సింధు, కేరల, లోలయ, పార్శిక, సింహళ, బైలు, గంధర్వ, వలుక, పాపజులకల, నోజ, చకోర, వర్త, సంగర, పుష్పక, బంగాళ, బాహ్లిక, మహారాష్ట్ర రాజ్యాలు. ఇవి కృతయుగం నాటివి. క్రీ.పూ. ఆరో శతాబ్దం నాటికి ఉత్తర భారతదేశంలో చిన్న చిన్న రాజ్యాలు కలిసి పదహారు మహాజన పదాలుగా ఏర్పడినట్టు చరిత్ర చెబుతున్నది. వాటిలో 14 జనపదాలు – అంగ, చేది, వత్స, మగధ, కోసల, కురు, పాంచాల, కాశి, మత్స్య, శూరసేన, అశ్మక, అవంతి, గాంధార, కాంబోజ అనేవి ఉన్నాయి. వజ్జ, మల్ల అనేవి సమాఖ్య రాజ్యాలు.

గోదావరీ తీరప్రాంతాలు దండకలోని ప్రాంతాలు చాలావరకు అసురుల పాలనలో ఉండేవి.

(పురాణాలలో అసురులను నల్లగా వికారంగా వర్ణిస్తుంటారు. సినిమాలలోనూ టి.వి.లలోనూ అంతే. భారతదేశంలో వర్ణ వివక్ష శరీరపు రంగుతోనూ, ఆచార వ్యవహారాల తోనూ కూడా ముడిపడి ఉంది. ఇది మార్చుకోవటానికి వీలులేనిది. మతం మార్చుకోవటమే దీనికి పరిష్కారం అనుకుంటే మతం మార్చుకున్న కింది కులాల వారని ఆయా మతాలూ విడిగానే చూస్తున్న అనుభవం చాలమందికి ఉంది.)

అసుర రాజ్యాలలోని ప్రజలు స్వతంత్రమైన ఆలోచన, నిర్దిష్టమైన కార్యాచరణ కలిగి ఉండేవారు. చిన్న చిన్న రాజ్యాలే అయినా బయటి వారిని సంఘటితంగా ఎదిరించే వారు. (ఈ సందర్భంలో అశోకుని ఎదిరించిన కాళింగులను గుర్తుచేసుకోవాలి. కాళింగులూ, మత్స్యకారులూ ఇతర సముదాయాలూ కలిసి అశోకునితో చేసిన పోరాటమే కళింగ యుద్ధం. వింధ్య పరిసర ప్రాంతాలను త్రికళింగగా గుర్తించారు. ఇవి అసురుల ప్రాంతాలు. ముఖ్య కళింగ ప్రాంతాన్ని (యలమంచిలి – విశాఖపట్టణం ప్రాంతాలు) దేవగణాలు ఆక్రమించుకుని దానిని దేవ రాష్ట్రంగా ప్రసిద్ధం చేశారు. యలమంచిలి దగ్గర పెంటకోట దగ్గర (విశాఖుని) కార్తికేయుని ఆలయం ఉండేదట. అది కాలక్రమంలో సముద్ర గర్భంలో కలసిపోయిందనీ విశాఖుని పేరిట అక్కడి పట్టణం విశాఖపట్టణం అయిందనీ చరిత్ర చెబుతున్నది. ఈ ప్రాంతాన్ని క్రీ.పూ. 9వ శతాబ్దం నాటి చేది జనపదంగా చరిత్రకారులు గుర్తించారు. ఇప్పటి చికాకోల్, గంజా, విజయనగరం ప్రాంతాలు అసురుల రాజ్యాలు. ఈ రాజ్యాలలో కాళింగులు బలంగా ఉన్నారు. ఆర్యుల పాలనలోకి వెళ్ళిన జనపదాలు వేద ధర్మాన్ని ప్రవేశపెట్టడం వల్ల స్థానిక గిరిజనులు వారితో ఘర్షణపడేవారు.

ఆధునిక భారతదేశంలోని గిరిజన, ఆదివాసీ తెగల జాబితాలలోని వారూ వెనుక బడిన వర్గాలుగా, షెడ్యూల్డ్ కులాలుగా పరిగణింపబడుతున్న వారూ అసుర మూలాలు గలవారై ఉంటారా అనేది పరిశోధించవలసిన అంశం. తమ ప్రాచీన సంప్రదాయాలను విడిచిపెట్టక పోవటం అనే లక్షణం వారిలోనే కనిపిస్తున్నది.

అసురులు శివార్చనా తత్పరులనీ సిద్ధ సంప్రదాయం పట్ల ఆసక్తి చూపారనీ పురాణాలు చెబుతున్నాయి. బలి, సముచి, హిరణ్యకశిపుడు, వృషపర్వుడు, వృషుడు, బాణుడు, హేతి, ప్రహేతి, మాలి, సుమాలి, రావణుడు, కుంభకర్ణుడు మొదలైన వారంతా శివుని పూజించి సిద్ధులు పొందారని స్కంద పురాణం (1-8-32) చెబుతోంది.

శైవం అతి ప్రాచీన ధర్మం. శతాబ్దాల కిందటి సమాజాలలో ఆ ధర్మం ఎలా పాటింపబడేదో గాని గిరిజనులు, కోయదొరల ధ్యానాలలో ఆ ఛాయలు ఇప్పటికీ కనిపిస్తాయి. అసురులు తత్వచింతనాపరులు, ధ్యాన తత్పరులు. యోగశక్తితో ధ్యానబలంతో అతీత శక్తులు సాధించటం అనేది భారతీయ భావన. అసుర సంస్కృతిలో ఆ లక్షణాలు కనిపిస్తాయి. ఈ సంస్కృతి నుండే జైన, బౌద్ధ ధర్మాలు వికసించాయి.

వేదాలలోనూ, పురాణాలలోనూ కనిపించే శంబరాసురుడు (శబరుల/సవరలు) కిరాతుల రాజు. అతనికి ఆరుగురు సేనా నాయకులు. ఒక్కో విభాగానికి ఒక్కొక్కరు అధిపతిగా ఉండేవారు. వారిని 'రాజు' అనేవారు. తమ సంస్కృతిని కాపాడుకునే క్రమంలో శంబరుడు దివోదాసుతో 50 సంవత్సరాలు పోరాడాడు. ఇంద్రునితోనూ పోరాడాడు. ఈ పోరాటంలో తన రాజ్యాలను సంస్కృతిని రక్షించుకోవటం కూడా ప్రధానమే. అప్పటి 56 రాజ్యాలలో శంబరాసురునివి ఆరు రాజ్యాలు.

ప్రాచీన భారతదేశంలో ఆదిమ తెగలు వేర్వేరు సంప్రదాయాలు కలవారైనప్పటికీ తమ తమ సంప్రదాయాలను కాపాడుకునే క్రమంలో సంఘటితంగా నిలిచి, ఆర్యధర్మంపై పోరాడారు. భారతదేశ విశిష్ట లక్షణంగా చెప్పబడే 'భిన్నత్వంలో ఏకత్వం' బహుశః ఇదే అయి ఉండాలి. తమ మీద జరుగుతున్న అణచివేత విధానాలకు ఆలస్యంగా నైనా ప్రతిస్పందించటం భారతదేశంలో ఇప్పటికీ చూడవచ్చు.

బలపరాక్రమాలతో, ఆత్మవిశ్వాసంతో, స్వచ్ఛమైన ఆలోచనలతో, ఉన్న దస్యులను చూసి ఆర్యులు మొదట్లో భయపడ్డారు. వారిని విరోధులుగా పరిగణించారు. వారు తమ ఆచారాలను పాటించరు గనుక వారిని శిక్షించాలనీ వారి ఇళ్ళు తగలబెట్టాలనీ - వారి నగరాలు ధ్వంసం చేయాలనీ - వారి సంపదను తమకు కట్టబెట్టాలనీ తమ దేవుళ్ళకు (దేవగణాలకు) మొక్కుకున్నారు. వారిపై నేరాలు చెప్పారు. ఋగ్వేద సూక్తాలలో చాలావరకు ఈ రకమైన ప్రార్థనలే ఉన్నాయి.

వర్తమాన సమాజంలో కార్పొరేట్ వర్గాలు ఆదివాసీల భూముల కోసం, అక్కడి ఖనిజ సంపద కోసం ప్రభుత్వాలను ఆశ్రయిస్తున్నాయి. ప్రభుత్వరంగం స్థానికులను శత్రువులుగా చూస్తూ వారిపై తన బలగాలను మోహరిస్తున్నది. చరిత్ర పునరావృతం కావటం అంటే ఇదే. ఈ నేపథ్యంలో పురాణాలనూ, ఇతిహాసాలనూ చరిత్రగానే చూడవలసి వస్తున్నది.

ఆర్య గణాలు గిరిజన స్థావరాలలో చొరబడటం రామాయణంలో చూడవచ్చు. తాటక రాజ్యంలోని మలద కరూశ దేశం (దాని అసలు పేరు ఇది కాదు) వనౌషధులకు ప్రసిద్ధి. దానిని ఇంద్రుడూ ఆర్యమునులూ ఆక్రమించుకున్నారు. ఆ ఆక్రమణలను అడ్డు కుంటున్నదనే కక్షతోనే తాటకను చంపారు. అలాంటి రాజకీయ హత్యలు ఎన్ని జరిగాయో. ఆర్య ధర్మాన్ని ఇష్టపడకుండా తమ తమ సంప్రదాయాలకే కట్టుబడి ఉండే స్థానిక జాతులతో ఆర్య రాజులు, ఆర్య మునులు తరచుగా తగవులు పెట్టుకుని వారిని శిక్షిస్తూ, అవమానిస్తూ వీలైతే చంపుతూ ఉండేవారు. శపించటం అనేది ఆర్య మునుల సహజ గుణం. అలా శపించబడిన వారు రాక్షసులుగా ప్రచారమయ్యారు. నాగులూ, యక్షులూ, శాపగ్రస్తులైతే రాక్షసులయ్యేవారు. ఆర్య గణాలలోని వారు శాపాలు పొందినట్టయితే వారు ఆర్యేతర స్థానిక జాతులవారితో కలిసి పోవలసి వచ్చేది, వారికి శాపాన్ని బట్టి పిశాచ రూపమూ (పిశాచులు ఒక స్థానిక జాతి) చండాల రూపమూ (చండాలురు ఆర్యులు ఏర్పరచిన వర్ణ వ్యవస్థలో సంకర వర్ణం వారు) వస్తుండేవి. స్థానిక జాతులూ, శాపగ్రస్తులైన ఆర్య/ దేవగణాలలోని వారూ దక్షిణాపథంలో కలిసి ఉండవలసి వచ్చిన కాలంలో వారి మధ్య వివాహ సంబంధాలు ఏర్పడటమూ ఫలితంగా మిశ్రజాతుల అవిర్భావమూ జరిగింది. హిందూ ధర్మశాస్త్రాల ప్రకారం భిన్న కులాల స్త్రీ పురుషులు వివాహం చేసుకుంటే వారి సంతానం తండ్రి కులానికీ తల్లి కులానికీ చెందకుండా మరో కులం అవుతుంది. అవాంతర కులాలు ఈ విధంగానే ఏర్పడ్డాయి. అనులోమ, విలోమ వివాహాలను ధర్మశాస్త్రాలు పేర్కొన్నాయి. వారి సంతానాన్ని వర్గీకరించాయి.

వేదాల నుంచి రామాయణం వరకూ గల అసురుల ప్రతిఘటనోద్యమాలను ఆర్య వాఙ్మయం నమోదు చేసిందంటే ఆ ప్రతిఘటనలు ఎంత తీవ్రస్థాయిలో జరిగాయో ఊహించు కోవచ్చు.

రామాయణ కాలంలో అసురుల (రాక్షసుల) వధకు ఇంద్రుని నాయకత్వంలో వ్యూహ రచన జరిగింది. సుతీక్ష్ణ మహర్షి ఆశ్రమానికి ఇంద్రుడు తరచుగా వచ్చిపోతూ ఉండేవాడు. దండకలోని అసురుల అనుపానులు సైన్య రహస్యాలన్నీ సేకరించేవాడు. దండకలోని అసుర రాజులను తుదముట్టించే ప్రయత్నాలు గూఢంగా జరుగుతూ ఉండేవి. మునుల ఆశ్రమాలు కొన్ని స్థానికులకు వ్యతిరేకంగా విదేశీ పాలకుల సైనిక స్థావరాలుగా ఉండటం వసిష్ఠ విశ్వామిత్రుల వైరగాథలలోనూ తెలుస్తుంది. ఇంతటి ప్రతికూల పరిస్థితుల లోనూ శాస్త్ర విజ్ఞానం అసుర సముదాయాలలోనే మొగ్గ తొడిగింది. మృత సంజీవని, శాంభరీ విద్య, ఆయుర్వేదం మొ నవి. వృత్తిపరమైన విద్యలూ నైపుణ్యాలూ వీరిలో వికసించాయి. గణితశాస్త్రంలో పూర్వభాగంగా చెప్పబడే శుల్బ సూత్రాలు క్రీ.పూ. 800 – క్రీ.శ. 200 మధ్య ఏర్పరచినవని పండితుల అభిప్రాయం. అప్పటికి స్థానిక రాజ్యాలలో గణరాజ్యాలు గిరిజన రాజ్యాలు అధికంగా ఉన్నాయి. శుల్బ సూత్రాలు అసుర

సముదాయాల పాలనలో వృద్ధిచెందినవే కావచ్చు. శుల్బ సూత్రాలు అంటే గణిత (సంఖ్యాశాస్త్ర) నియమాలు. ఇవి అప్పటి స్థానిక భాషలలోనే వృద్ధిచెంది ఉంటాయి.

ఇంద్రుడు యుద్ధ నాయకుడు. దేవగణాలకు రాజు. రాజ్యశక్తికి ప్రతీక. రాజ్యం తనకు అడ్డు వచ్చిన వారిని కొందరిని ప్రత్యక్షంగా, కొందరిని పరోక్షంగా చంపుతూ ఉంటుంది. శత్రు పక్షాలలో కొందరిని చేరదీసి పని జరిపించుకోవటమూ రాజ్య విధానమే. ఈ విధానాలన్నీ రామాయణంలో గమనించవచ్చు.

తమకు అడ్డు వచ్చిన వారిని తొలగించుకునే ప్రక్రియలో ప్రతిస్పర్థులకు నేర చరిత్రలు అంటగట్టడమూ ఒక విధానం. రామాయణంలో ఆ లక్షణమూ ఉంది. రాక్షసులు/ అసురులు దుష్టులుగా చిత్రీకరింపబడటం ఆ విధంగా జరిగినదే.

ఆర్యులమని చెప్పుకునే జాతులు తమ తమ మతాలనూ, విధానాలనూ బలవంతంగా స్థానిక ప్రజలపై రుద్దినప్పటికీ వారి చేత ఆచరింపజేసినప్పటికీ స్థానిక అసుర సంస్కృతి నిలదొక్కుకుంటూనే వచ్చింది. శైవ, జైన, బౌద్ధ ఆరామాలు నాశనమైనా వారి భావజాలంలో ఆ సంస్కృతి చిగురిస్తూనే వచ్చింది. జానపద గాథలలోనూ, గిరిజనుల సంప్రదాయాలలోనూ, జాతరలలోనూ, అవి గోచరమవుతూనే ఉన్నాయి.

సామాజిక అసమానతలపైనా, ప్రజల వనరులను రాజ్యం హస్తగతం చేసుకొని ఉన్నత/ఆధిపత్య వర్గాలకు కట్టబెట్టడం పైనా ఉద్యమాలు నడుస్తున్న ప్రస్తుత పరిస్థితులలో అసురుల ఉద్యమాలను మననం చేసుకోవటం గొప్ప సందర్భం. ఆ ఉద్యమ సారథుల పేర్లు పురాణాలలో రామాయణంలో గ్రంథస్థమయ్యాయి. వారినీ ప్రస్తావించుకోవలసి ఉంది.

## నాగులు

అసురులలో నాగులు ప్రముఖులు, వీరు యుద్ధవీరులు. రామాయణ కాలం నాటికి బలమైన జాతిగా ఉన్నారు. చాలా తెగలను కలుపుకుని 'నాగులు'గా వ్యవహరించటమూ కనిపిస్తుంది. వీరి రాజ్యాలు తూర్పు అస్సాం ప్రాంతంలోనూ, బ్రహ్మపుత్రా పరీవాహక భూములలోనూ దక్షిణా పథంలోనూ ఉండేవి.

**Naga :** The name of a people and their country situated in eastern Assam... chiefly peopled by tribes, collectively called Nagas............

......The Nagas are classified as brachy cephalic Negritos from Africa and are among the earliest people to have come to India. (D.H )

ఆఫ్రికా నుండి భారతదేశానికి వచ్చిన తొలి జాతులలోని వారు నాగులు. వీరు బ్రాకీ సెఫాలిక్ నీగ్రిటో జాతికి చెందిన వారనీ అనంతర కాలంలో వచ్చిన ప్రోటో అస్ట్రలాయిడ్‌ల చేతిలో పరాభూతులై కాలక్రమంలో వారిలో కలసిపోయారనీ కొందరిని ద్రావిడులు చేర్చుకున్నారనీ చరిత్ర చెబుతున్నది.

ప్రాచీన కాలంలో ఆంధ్రదేశంలోని కృష్ణానదీ ముఖద్వారం ప్రాంతానికి 'నాగభూమి' అనీ 'వజ్ర దేశము' అని 'మంజీర దేశము' అనీ పేర్లుండేవని బౌద్ధ వాఙ్మయం చెబుతున్నది. చరిత్ర ఇక్కడి ప్రజలను రాక్షసులుగా చెప్పింది. స్థానిక జాతులయిన శబర/నాగ ప్రజలను "తెలుంగులు" అనీ పిలిచారు. అనంతర కాలంలో ఇక్కడికి ఆంధ్రులు (అంధక బౌద్ధులు) వచ్చి చేరారు. తెలుగువారూ ఆంధ్రులూ మొదట్లో కొంత ఘర్షణపడినా తర్వాత కలిసి పోయారు.

ఆంధ్రదేశంలో కృష్ణా, గోదావరీ తీర ప్రాంతాలలోనూ ప్రస్తుతపు తెలంగాణ, రాయలసీమ, నల్లమల ప్రాంతాలలోనూ ప్రాచీన నాగరికత ఉన్నత స్థాయిలో ఉండేదనీ ఇతిహాసాలలో పేర్కొన్న నాగులు, యక్షులు, రాక్షసులు, అసురులు ఈ నాగరికతకు సంబంధించిన వారనీ ఆంధ్రప్రదేశ్ హిస్టరీ కాంగ్రెస్ వారి పరిశోధనలు తెలుపుతున్నాయి.

తెలుగు మాట్లాడే ప్రజలలో అధిక సంఖ్యాకులు నాగజాతి వారసులు. ఆంధ్ర దేశంలో దొరికిన ఒక పురాతన రాతి పలక మీద 'నాగబు' అనే తెలుగు మాట కనిపించిందట. దాని తాలూకు పూర్తి పదం 'నాగబుద్ధ' అనీ ఆ పలక విరిగిపోయి దొరికిందనీ ఒక అభిప్రాయం ఉంది. నాగ పదం తెలుగునాట ఎక్కువ వ్యవహారంలో ఉంది. నాగ భవనం (నాగుల చోటు), నాగ మాణవక (నాగయువకుడు), నాగరాజు పదాలు శాసనాలలో ఉన్నాయి. నాగుల రాజును వైదిక వాఙ్మయం 'దాహక'గా చెప్పింది. ఇండియా, ఇరాన్ భాషా పదాల ఆదాన ప్రదానాలలో ఈ పదం 'దాస' అయిందంటారు డా। అంబేద్కర్.

మతపరంగా చూస్తే నాగ పదం బౌద్ధంతో ముడిపడి ఉంది. పాము, ఏనుగు రెండూ బౌద్ధ శిల్పాలలో/కథలలో ప్రముఖంగా కనిపిస్తాయి. అనంతర కాలంలోనే వాటిని ఆర్యుల పురాణాలు గ్రహించాయి.

భారతదేశంలో వాయవ్యాన తక్షశిల మొదలు ఈశాన్యాన అస్సాం వరకు, దక్షిణాన శ్రీలంక వరకు యక్షులు, నాగులు విస్తరించారు. వీరిని దైవాంశగల తెగగా గౌరవించే వారు. నాగుల రక్షణ అందరికీ అవసరంగా ఉండేది. అందుకే నాగుల పరంగా పండుగలు చేసేవారు. ఆంధ్రుల ఇష్టదైవమైన గణపతికి నాగరాజు యజ్ఞోపవీతంగా ఉంటాడు. అది రక్షణ కవచమే. ప్రముఖుల సైన్యంలో నాగవీరులు ప్రధాన దళంగా ఉండేవారు. యక్షుల/నాగుల ప్రతిమలు శిల్పాలలో చాలా ఎక్కువగా కనిపిస్తాయి. అజంతా ఎల్లోరా గుహలలోని శిల్పాలు యక్షుల/నాగుల ప్రాధాన్యాన్ని చెబుతున్నాయి. ఆ గుహల కంటే ప్రాచీనమైన ఒక నగరం అవశేషాలు 20వ శతాబ్దంలో ఆ ప్రాంతంలోనే బయటపడ్డాయి. ఈ నగరం లోని ప్రజలే ఎల్లోరా గుహలు తొలిచి ఉంటారనే అభిప్రాయమూ వ్యక్తమౌతున్నది. అది నాగుల నగరమే కావచ్చునంటున్నారు. ఆర్యమునుల శాపాలకూ, శిక్షలకూ గురి అయిన ప్రజలలో నాగులూ, యక్షులూ ఎక్కువ శాతం ఉన్నారు. బ్రాహ్మణ హితం కోసమూ,



వర్ణధర్మ రక్షణ కోసమూ కంకణం కట్టుకొన్న ఆర్య రాజుల చేతిలో దుర్మరణం పాలైన తాటక సహస్ర నాగ బల సమన్విత.

కిష్కింధాకాండలో సుగ్రీవుడు తన చారులను అన్ని దిక్కులకూ పంపుతూ వివరాలు చెప్పే సందర్భంలో దక్షిణ దిక్కుగా ఉండే రాజ్యాలలో నాగుల రాజ్యాలను పేర్కొన్నాడు. సుగ్రీవుని సైన్యంలోనూ నాగవీరులు అధిక సంఖ్యలో కనిపిస్తారు.

దక్షిణ దిక్కులో దుర్గమాలయిన నాగుల ప్రాంతాలున్నాయి. వేయి శిఖరాలుగల వింధ్య పర్వతాలు నర్మదానది ప్రవహించే పగులు లోయకు దక్షిణాన ఉన్నాయి. ఇవన్నీ నాగుల ప్రాంతాలు. గోదావరి, కృష్ణవేణి, మహానది, వరద అనే నదుల పరిసరాలూ నాగులవే అని చెప్పాడు సుగ్రీవుడు. (సర్గ 41) ఆంధ్ర, పుండ్ర, చోళ, పాండ్య, కేరళ దేశాల గురించీ చెప్పాడు. కావేరినీ వర్ణించాడు. తామ్రపర్ణి నదినీ పేర్కొన్నాడు. మహేంద్ర పర్వతం సముద్రంలో మునిగి ఉన్నట్టు ఉంటుంది. అక్కడ యక్షులు, సిద్ధచారణులూ, దేవర్షులూ ఉంటారన్నాడు. సిద్ధ సంప్రదాయం అప్పటికే ఉత్తమ సంప్రదాయంగా నెలకొని ఉంది. అక్కడే సముద్రంలో నూరు యోజనాల వెడల్పుతో ఒక ద్వీపం ఉంది. అది రావణుని నివాసస్థానం అని చెప్పాడు (శ్రీలంకను ఒకప్పుడు "ఇలా మండలం" అనేవారట.)

దక్షిణ దిక్కులోనే కుంజర పర్వతం ఉంది. విశ్వకర్మ దాని మీద అగస్త్యునికి ఇల్లు కట్టి ఇచ్చాడట. ఆ ఇల్లు 12 యోజనాల పొడవు ఉంది. కుంజర పర్వతం బంగారుమయం. అంటే బంగారు గనులు ఉన్నాయేమో. కుంజర పర్వతంలోనే భోగవతీ పురం ఉంది. అది వాసుకి నిలయం. వాసుకి నాగరాజు. ఆ మధ్యలో ఉన్నవీ నాగుల ప్రాంతాలే. భోగవతి దాటాక ఋషభ పర్వతం ఉంది. అవన్నీ గంధర్వ రాజుల ప్రాంతాలు. అక్కడ ఔషధ వృక్షాలు, చందనం చెట్లూ ఉంటాయి. వాటికి గంధర్వుల కాపలా ఉంది వాటిని ముట్టుకోవద్దన్నాడు. వనాల సంరక్షణ గంధర్వుల చేతిలో ఉండేదనటాన్ని చాలా చోట్ల పూర్వ కవులు చెప్పారు. చందనం చెట్ల దగ్గర నాగులుండటం పరిపాటి.

సుగ్రీవుడు దక్షిణ దిక్కులోని నగరాలలో ఉత్కళదేశం, దశార్ణ నగరం, అశ్వవంతి, అవంతి, విదర్భ, ఋషిక, మహిషక, వంగ, కళింగ, కాశీ, దండకారణ్య ప్రాంతాలూ చెప్పాడు. తమ భూములలోకి ఇండో ఆర్యన్ జాతులను రానీయకుండా నాగులు ప్రతిఘటించారు.

తూర్పు దిక్కున కూడా నాగుల నగరాలు, దానవుల స్థానాలు ఉన్నాయి. జంబూ ద్వీపం, యవద్వీపం (జావా), సువర్ణ రూప్యక ద్వీపం వంటివి చెబుతూ నాగుల నగరాలూ పేర్కొన్నారు. ఉత్తర దిశలో ఉత్తర కురు భూములలో గంధర్వులు, కిన్నరులు, నాగులు, సిద్ధులు, విద్యాధరులు ఉంటారని చెప్పాడు. తమ సంప్రదాయాలలోగాని, పాలనా వ్యవహారాలలో గాని మరొకరు జోక్యం చేసుకున్న సందర్భాలలోనే ప్రతిఘటనలు, పోరాటాలు జరిగాయి. వైదికమతాన్ని అనుసరించని తెగలలో నాగులు, అశ్వకులు, మహిషకులు ఉన్నారు. అశ్వకులు (అశ్మకులు) మహిషకులు (మహబూబ్‌నగర్ ధార్వాడ్ జిల్లాల ప్రజలు) ఆంధ్రులే. మత్స్య పురాణం ప్రకారం 'మహిష్మతి' నగరం నాగుల రాజధాని.

నాగజాతిని ఉద్దేశించే ఆర్యులు దాస, దస్య పదాలు వాడారట. "ప్రాచీన భారతీయ వాణిజ్యమూ, సంస్కృతీ దస్యులతో, ద్రావిడులతో ముడిపడి ఉన్నది" అన్నారు డా॥ అంబేద్కర్. తూర్పు సముద్ర పర్యంతం వ్యాపించి ఉన్న భూభాగంలో దాహ, దస్యులున్నారనీ వీరే ఋగ్వేదంలో చెప్ప బడిన దాస దస్య వర్ణాలనీ చరిత్రకారులు నిర్ధారించారు. (ఆంధ్రదేశ చరిత్ర - సంస్కృతి భాగం 1 శ్రీ బి.ఎన్. శాస్త్రి పుట 25)

నాగులను గురించి చెప్పుకునేటప్పుడు డా. అంబేద్కర్ నాగపూర్ ప్రసంగాన్ని గుర్తు తెచ్చుకోవటం అవసరం. 15-10-1956న నాగపూర్‌లో బౌద్ధధర్మాన్ని స్వీకరించిన సందర్భంలో ఆయన నాగుల గురించీ నాగపూర్ గురించీ ప్రస్తావించారు. "బుద్ధుని ధర్మాన్ని తొలుత ప్రచారం చేసినవారూ స్వీకరించిన వారూ నాగులు. వీరు ఆర్యులతో ఎన్నో యుద్ధాలు చేసినవారు. నాగజాతిని సమూలంగా తుడిచిపెట్టే ప్రయత్నంలో ఆర్యులు ఒకప్పుడు నాగులను మంటల్లోవేసి తగలబెట్టారు. ఆ సమయంలో ఒక ముని వల్ల ఒక నాగుడు రక్షింపబడ్డాడు. అతని వంశీయులమే మనమంతా" అన్నారు.

"అణచివేతకు గురైన దీనస్థితిలో ఉన్న నాగులు భగవాన్ బుద్ధునిలో తమ విమోచకుని దర్శించారు. వారే బుద్ధుని ధర్మాన్ని ప్రపంచ దేశాలలో వ్యాప్తిచేశారు. నాగపూర్ నాగుల తొలి నివాసం. ఈ పరిసరాలలోనే ఒకప్పుడు "నాగ" నది ప్రవహించేది. ఆ నదీ తీరం వెంబడి నాగులు నివాసాలు ఏర్పరచుకున్నారు. అందుకే బౌద్ధ ధర్మదీక్షకు నేను 'నాగపూర్'ను ఎంచు కున్నాను" అని ఆ సందర్భంలో డా॥ అంబేద్కర్ చెప్పారు.

పురాణాలలో ఆర్య - ఆర్యేతర సంఘర్షణలు కథలు కథలుగా కనిపిస్తాయి. నాగులే యక్షులు - వారే రాక్షసులు - వారే అసురులు. వారే దానవులు, దైత్యులూను. ఈ పేర్లన్నీ నాగులను ఉద్దేశించినవిగా స్పష్టంగా కనిపిస్తాయి. పురాణ కథలలో ఈ నాగులను పాములుగా చెప్పారు. అది వక్రీకరణే.

మహాభారతంలో జనమేజయుడు సర్పయాగం చేసిన వృత్తాంతం ఉంది. నాగ నాయకులందర్నీ పేరు పేరునా పిలుస్తూ బలవంతంగా తీసుకువచ్చి మంటల్లో పడవేసిన ఈ ఘట్టాన్నీ ప్రతీకాత్మకంగా చెప్పారు. (భార. అది.) ఈ సంఘటననే అంబేద్కర్ ప్రస్తావించారు. ఇక్కడ యాగంలో ఆవాహన అరెస్టు వారెంట్ లాంటిదే.

తెలుగు సాహిత్యంలో హైస్కూలు నుంచి కళాశాల స్థాయి వరకు విద్యార్థుల తెలుగు పాఠ్యాంశాలలో దీన్నిని సాధారణంగా చేరుస్తూ ఉంటారు. నాగుల మారణకాండ ఆస్తీకుడనే ముని జోక్యంతో ఆగింది. తక్షకుని గురించీ ఆస్తీకముని[1] గురించీ మహాభారతం గొప్పగా

1. 15-10-1956 నాటి డా. అంబేద్కర్ ఉపన్యాసాన్ని ప్రచురించినప్పుడు నాగులను రక్షించిన (సర్ప యాగాన్ని ఆపిన) ముని పేరు అగస్త్యునిగా ప్రచురించారు. ఆస్తీకుని పేరు పాఠక లోకంలో అంత ప్రసిద్ధం కాకపోవటంవల్లనూ అగస్త్యుని పేరు అందరికీ తెలిసిన పేరు కావటంవల్లనూ ఈ పొరపాటు దొర్లి ఉండాలి. అంబేద్కర్ ప్రస్తావించినది ఆస్తీకుడినే.

చెప్పింది. ఈ కథలలో చారిత్రకాంశాలు ఇమిడి ఉన్నాయనటం నిస్సందేహం. నాగ నదిని ప్రస్తావించుకున్నప్పుడు నాగావళి నది గుర్తుకు రాకమానదు. వంశధార, నాగావళి ఒరిస్సాలోని నదులు. ఒరిస్సా ప్రాంతం అశోకుని కళింగ యుద్ధాన్నీ అనంతర కాలపు బౌద్ధ ధర్మవ్యాప్తినీ స్పష్టంగా గుర్తుకు తెస్తుంది.

ఆస్తీకుడు జరత్కారు దంపతుల కొడుకు. ఇతని తల్లి నాగకాంత, వాసుకి చెల్లెలు పేరు జరత్కారు. జరత్కారుడనే ముని ఈ నాగ వనితను పెళ్ళిచేసుకోవటం సంభ్రమాశ్చర్యాలు కలిగించే పెద్ద కథ. ఈ దంపతులకు పుట్టబోయే కొడుకు నాగవంశాన్ని రక్షిస్తాడని నాగులకు ముందే సూచన ఉంది. మహాభారత యుద్ధం ముగిసిన తర్వాత జరిగిన వృత్తాంతం ఇది. పరీక్షిత్తు అభిమన్యునికీ, ఉత్తరకూ పుట్టిన కొడుకు. అతడు అరవై సంవత్సరాలు రాజ్యం చేశాడట. ఒకరోజు వేటకు వెళ్ళి ఒక మృగాన్ని తరుముతూ శమీక మహర్షి ఆశ్రమంలోకి వెళ్ళాడు. కళ్ళు మూసుకుని మౌనంగా తపస్సు చేసుకుంటున్న మునిని మృగం గురించి ప్రశ్నించాడు. ఎంతకూ సమాధానం రాకపోవడంతో ఒక చచ్చిన పామును ముని మెడలోవేసి వెళ్ళిపోయాడు. ఆ విషయం తెలిసి ముని కుమారుడు శృంగి అనేవాడు రాజుకు శాపం ఇచ్చాడట. "నిష్కారణంగా నా తండ్రి మెడలో పాము శవాన్ని వేశావు కాబట్టి నీవు ఏడు రోజులలో తక్షకుడనే పాము కాటుకు గురై మరణిస్తావు" అనేది శాపం.

ఇక్కడ నాగులకు ప్రతీకగా పాములను చెప్పారు. ఈ కథలో చాలా మలుపులున్నాయి. శమీకుడికి విషయం తెలిసి కొడుకును మందలించాడు. ఆ విషయం రాజుకు చెప్పి రమ్మన్నాడు. ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా పరీక్షిత్తుకు తక్షకుని వల్ల మరణం తప్పలేదు. పరీక్షిత్తు కొడుకు జనమేజయుడు. తండ్రి మరణానికి కారణం తక్షకుడు అని తెలుసుకుని నాగులపై ఆగ్రహించాడు. నాగులచేత అంతకుముందు భంగపడి ఉన్న ఉదంకుడు, రురుడు అనే వారు జనమేజయుని రెచ్చగొట్టి అతనిచేత సర్పయాగం చేయించారు. మంత్రాలకు పాములన్నీ వచ్చి అగ్నిగుండంలో పడి చనిపోతూ ఉన్నాయి. వారి లక్ష్యం తక్షకుడు. ఆ సమయంలో నాగులకు మేనల్లుడయిన ఆస్తీకుడు జనమేజయుని దగ్గరకు వచ్చి అతనిని సమాధానపరచి, మెప్పించి, అతనిచేత సర్పయాగం మాన్పించాడు. ఆ విధంగా తక్షకుడు రక్షింపబడ్డాడు. "అతని వంశీయులమే మనమంతా" అన్నారు డా. అంబేద్కర్. మహాభారతం ఆదిపర్వంలో ఉదంకుని వృత్తాంతం ఉంది.

దాస, దస్యు వర్గాలలో అనేక ఉప జాతులుండేవి. వారందరూ కలిసే నాగులుగా వ్యవహరించబడినా వారిలో వారికి పరస్పరం ఘర్షణలు జరుగుతూనే ఉండేవి. ఆర్య గణాలతో జరిగే పోరాటాలలో ఒక్కొక్కప్పుడు వారంతా ఐక్యంగా ఉండేవారు. ఒక్కోసారి కొన్ని జాతులు ఆర్య గణాలకు మద్దతు ఇచ్చేవి. కొన్ని జాతులు తటస్థంగానూ ఉండిపోయేవి.

నాగుల రాజ్యాన్ని ఒకప్పుడు కశ్యప పుత్రులు (మౌనేయులనే గంధర్వులు) ఆక్ర మించారట. వారు అరవైవేలమంది. అప్పుడు నాగులకు పురుకుత్సుడు సహాయం చేశాడు. అతడు మాంధాత కొడుకు. పురుకుత్సుని భార్య నర్మద. నర్మదా నదీతీరం నాగుల ప్రాంతం. నర్మద నాగులకు సోదరి వంటిది. నర్మదా నదిని స్త్రీగా మూర్తీకరించి ఆమె మేఖల ముని కూతురు అని వర్ణించారు. నర్మద నాగుల జలదేవత. ఇలాంటి పురాణ కథలన్నీ అప్పటి జాతుల సంఘర్షణలను రేఖామాత్రంగా సూచిస్తాయి.

నర్మదా తీరంలో జైన సంప్రదాయం నెలకొని ఉంది. ఇప్పటికీ నర్మదా పరిక్రమణ ప్రాంతాలలో జైన సన్యాసినులు, అవధూతలు కనిపిస్తారు. 'మిట్టీ తలాయి' అనే ఊళ్ళో యాత్రికులు ఏ మతంవారైనా జైన ఆశ్రమాలలోనే బసచేస్తారు. పావాగడీ కోట లోపల కూడా జైన ఆశ్రమం ఉంది. జైన ధర్మానికి మూలమైన ఆలోచనలు నాగుల సంస్కృతి నుండి పెంపొంది ఉండవచ్చుననుకోవటానికి ఆస్కారం ఉంది. నాగుల దైవం శివుడు. శివుడు నాగాభరణుడు. ఆదిమ భారతీయులు శివుని యోగ దక్షిణామూర్తిగా దర్శించారు. అప్పటి మూలరూపం ఎలా ఉండేదోగాని నాగాభరణుడైన శివుని ఆర్యులు తమకు అనువుగా మలచుకున్నారు. జైన బౌద్ధమతాల ఆవిర్భావానికి, నాగుల సంప్రదాయాలూ వారి భావ జాలమూ మూలమని పండితుల అభిప్రాయం. బౌద్ధంలో మహాయాన సిద్ధాంతానికి ప్రాతి పదికలయిన గ్రంధాలను అచార్య నాగార్జునుడు నాగులనుంచే గ్రహించాడంటారు.

నాగులకూ సిద్ధ విద్యలకూ సంబంధం ఉంది. నాగులు సిద్ధరసం తయారు చేయటంలో నిపుణులు. సిద్ధరస కూపాలు పురాణ కథలలో కనిపిస్తాయి. త్రిపుర దహన కథలో గాయపడిన దైత్యులు, సిద్ధరస కూపంలో మునిగి ఆరోగ్యవంతులయ్యేవారన్న సమాచారం ఉంది. రస విద్యలు, సంజీవనీ విద్యలు వీరికి తెలుసునంటారు. శివ భక్తులుగా వీరు యోగవిద్యా సంపన్నులు. మహేంద్రగిరి మర్రిచెట్టు కింద కూచుని 'పరముడు' (దక్షిణామూర్తి – శివుడు) నలుగురు శిష్యులకు యోగమార్గాన్ని ఉపదేశించినట్లు తమిళ శైవ గ్రంథాలు తెలుపుతున్నాయి. 'పరమ' అంటే పైనున్న – అత్యున్నత లోకం. బ్రహ్మ, బ్రాహ్మి, వంటి భావనలు దీని నుంచే ఏర్పడ్డాయంటారు "కాశీ పాండ్యన్."

మొహంజోదారో శిథిలాలలో నాగ ప్రతిమలు – శరీరపు పైభాగం మానవాకృతితోనూ కింది భాగం పాము గానూ ఉన్నవి లభించాయి. నాగకన్యలు అందమైన వారూ అతీతశక్తులు గలవారూ అని కథలున్నాయి. ప్రాచీన జైన, బౌద్ధ శిల్పాల సృష్టికర్తలు నాగులలోని అంధక (చైత్యక) శాఖవారే. ధ్యానముద్రలో ఉన్న జినునికి, బుద్ధునికి నాగరాజులు గొడుగులాగా పడగ పట్టినట్టుగా ఉన్న పురాతన శిల్పాలు చెక్కినది వారే.

మానవ శరీరంలోని కుండలినీ శక్తికి పాము సంకేతం. శరీరంలోని అయిదు వాయువులు అయిదు పాములను సూచిస్తాయనీ పాము పురుష తత్వానికి చిహ్నమనీ చెబుతుంటారు. పాములను ప్రకృతి శక్తులుగా పూజించే సంప్రదాయం చాలా దేశాలలో

కనిపిస్తుంది. ఈజిప్టులో వారి పంటల దేవత "రన్నత్"కు పామును ప్రతీకగా భావిస్తారు. పర్షియాలో ఇంద్రధనుస్సును సర్పదేవతగా నమ్మేవారట. పాములు పంటలను వృద్ధి చేస్తాయనీ వర్షాలు కురిపిస్తాయనీ నదులను ప్రవాహాలతో నింపుతాయనీ ప్రాచీనులు నమ్మేవారు. బెంగాల్‌లో "మానసాదేవి"ని నాగదేవతగా కొలుస్తారు. ఇవన్నీ ప్రకృతి శక్తుల ఆరాధనలోని అంశాలే. ఈ విధంగా 'పాము' కొన్ని జాతులకు చిహ్నంగా ఉండేది. ఈ జాతులు మిశ్ర మంగోలియన్ జాతివారని కొందరి అభిప్రాయం. వీరు బలమైన వారు కాబట్టి, ప్రాబల్య శక్తులుగా ఉండేవారనీ, అందరూ వీరి అనుగ్రహం కోరుకునే వారనీ తెలుస్తున్నది. ఆంధ్రదేశంలోనూ, అస్సాం, బెంగాలు ప్రాంతాలలోనూ నాగారాధన ఉంది. వారి చిహ్నంగా పాములను పూజించటం - నాగ ప్రతిమలు చెక్కిన శిలలను ఆరాధించటం, పుట్టలో పాలు పోసి చలిమిడి, చిమ్మిలి ముద్దలు నైవేద్యంగా పెట్టటం, "నా కులాన్నీ నా వారినీ రక్షించు" అంటూ వేడుకోవటం సంప్రదాయంగా చాలాచోట్ల గమనించవచ్చు. ఆంధ్ర విశ్వకళా పరిషత్తు చిహ్నంలో రెండు పాములు అర్జున వృక్షాన్ని పెనవేసుకున్న చిత్రం ఉంటుంది. ఇది జ్ఞాన చిహ్నంగానూ ఆంధ్రుల జాతి చిహ్నంగానూ ఉంది. నాగుల ఆలోచనా ధార నుండే జైన, బౌద్ధ ధర్మాల ఆలోచనలు రూపుదిద్దుకున్నాయి.

ఆర్యజాతులను ఎదుర్కొన్న స్థానిక జాతులలో నాగుల పాత్ర ప్రధానంగా ఉండటం వల్ల దేవాసుర యుద్ధ గాథలలో నాగులను గురించిన కథలు ప్రతికూల దృక్పథంతోనే ప్రచారమయ్యాయి. అవి చాలావరకు ప్రతీకాత్మకాలు. ఈ సందర్భంలో వాటిని కూడా ప్రస్తావించటం అసందర్భం కాబోదు. ఆర్యులు నాగులంటే భయపడేవారు. వారిని ఎలాగైనా తమకు దాసులుగా చేసుకోవాలనుకునేవారు. ఆ లక్ష్యాలతో చాలా కథలు ప్రచారమయ్యాయి. పాములకూ గరుడ పక్షులకూ ఉండే జాతివైరాన్ని కథలుగా మలచటంతో నాగులకూ ఆర్యులకూ - శైవానికీ వైష్ణవానికీ మధ్య ఉన్న మత వైషమ్యాలు స్పష్టమవుతాయి. విష్ణువు గరుడవాహనుడు. గరుడునికి పాములు ఆహారం. వీరు ఒకరినొకరు చంపుకోవటాన్ని చెప్పే పూర్వ కథలూ, ఆ కథల్లోని వర్ణ సంస్కృతీ - ఇవన్నీ పరిశీలించగలిగితే అది సామాజిక రాజకీయ చరిత్ర అవుతుంది.

పురాణాలలోని సర్పయాగాలు - కాళీయ మర్దనం లాంటి ఘట్టాలు నాగుల అణచివేతనూ వారిపై జరిగిన హింసనూ చెబుతాయి. ఇది పరోక్షంగా నాగుల మత సంస్కృతుల శైవంపై - అణచివేతనూ - జైనంపై - బౌద్ధంపై వైష్ణవం జరిపిన దాడులనూ మత స్పర్థలనూ తెలియ జేస్తున్నది. యుద్ధాలలో ఓడినవారి చిహ్నాలను గెలిచిన వారు స్వీకరించటం ఒకప్పటి పద్ధతి. ఆ విధంగా నాగజాతి చిహ్నమైన 'పాము' వైదికమతంలో ప్రవేశించి ఉండాలి. విష్ణువు శేషునిపై శయనించటం అలాంటి విజయ చిహ్నమే.

నాగుల అణచివేతను గురించి చరిత్ర స్పష్టంగా చెప్పకపోయినా సాహిత్యంలో అందుకు ఆధారాలున్నాయి. నాగుల అణచివేతలో భాగంగానే పురాణ కథలు పుట్టు

కొచ్చాయి. ఆర్యుల వర్ణ ధర్మ వ్యవస్థనే ఈనాడూ కొనసాగిస్తున్నారు కాబట్టి ఆ కథలు ఇంకా ఈనాడూ ప్రచారంలో ఉన్నాయి. ముఖ్యంగా పాఠశాలస్థాయి కళాశాల స్థాయి విద్యలో తెలుగు ప్రాథమిక భాషగా గాని ప్రాంతీయ/మాతృభాషగా గాని చదివే విద్యార్థుల పాఠ్య ప్రణాళికలో ఉండే పాఠ్యాంశాలు గమనిస్తే ప్రాచీన సంస్కృతిగా వారు ఎలాంటి భావాలను భావితరానికి అందిస్తున్నారో తెలుస్తుంది. "ఉదంకోపాఖ్యానము". "మాతృదాస్య విమోచనము" వంటివి కచ్చితంగా ఏదో ఒక స్థాయిలో తెలుగు విద్యార్థులు చదవవలసి ఉంటుంది. ఈ రెండూ మహాభారతంలోనివి – నాగుల గురించి చెప్పేవే. ఇక్కడ వీటిని కొంతవరకైనా చెప్పుకోవటం అవసరం. 'ఉదంకోపాఖ్యానము' కథలో ఉదంకుడనే ముని కుమారుడు, గురువు గారి భార్య కోసం పౌష్యుడనే రాజుగారి భార్య నుండి ఆమె చెవి కమ్మలు అడిగి తీసుకోవలసి వస్తుంది. (గురు కులాలు – గురుదక్షిణ – గురువు ఫలానా రాజుగారి భార్య చెవి కమ్మలు తన భార్య కోసం అడగటం – ఇవన్నీ తీరిగ్గా విమర్శించుకోవలసిన అంశాలు) ఆ కమ్మలను కాజేయటానికి తక్షకుడనే నాగుడు ఎదురుచూస్తున్నాడనీ అతని నుండి కాపాడుకుంటూ తీసుకువెళ్ళాలనీ పౌష్య మహాదేవి (పౌష్యుని భార్య) ముందే చెప్పింది. వారు భయపడినట్లే వాటిని మార్గమధ్యంలో తక్షకుడు దొంగిలించటమూ జరిగింది. ఉదంకుడు నాగలోకానికి వెళ్ళి నాగరాజులను కీర్తించి వారి అనుగ్రహంతో ఆ కుండలాలు (చెవి కమ్మలు) తిరిగి పొందాడు. నాగరాజులను ఉదంకుడు కీర్తిస్తూ చెప్పిన పద్యాలు మహాభారతాన్ని తెలుగులో రాసిన నన్నయ కవి చాలా గొప్పగా రాశారు. నాగుల ఉజ్జ్వల స్థితి, మహనీయత, బలదర్పాలు, శక్తి సామర్థ్యాలు ఆ పద్యాలలో ద్యోతకమవుతున్నాయి.

"బహువన పాదపాబ్ధికుల పర్వత పూర్ణ సరస్సరస్వతీ
సహిత మహా మహీభర మజస్ర సహస్ర ఫణాళి దాల్చి దు
స్సహ తర మూర్తికిన్ జలధి శాయికి బాయక శయ్యయైన య
య్యహి పతి దుష్కృతాంతకుడనంతుడు మాకు ప్రసన్నుడయ్యెడిన్"

(ఆదిపర్వం – 1–104)

"అరిది తపోవిభూతి నమరారుల బాధలు వొందకుండగా
నురగుల నెల్ల గాచిన మహోరగ నాయకుడు..." అంటూ వాసుకిని స్తుతించారు. నాగులు దేవ మనుష్య లోకాలలోనూ తిరిగేవారని అంగీకరించారు.

"దేవమనుష్య లోకముల ద్రిమ్మరుచున్ విపుల ప్రతాప సంభావిత
శక్తి శౌర్యులు...." ఐరావత కోటి ఘోర ఫణిరాజులు..." అంటూ వారి సంఖ్యా బలాన్నీ చెప్పారు.

తక్షకుని గురించీ ఒక పద్యం ఉంది. అశ్వసేనుడనే వానితో కలిసి తక్షకుడు తిరుగుతూండేవాడట.

"గోత్ర మహా మహీధర నికుంజములన్ విపినంబులం గురు
క్షేత్రమునం బ్రకామ గతి ఖేలన నొప్పి సహాశ్వసేనుడై
ధాత్రి బరిభ్రమించు బలదర్పపరాక్రమ దక్షుడీ క్షణ
శ్రోత్ర విభుండు తక్షకుడు శూరుడు మాకు బ్రసన్నుదయ్యెడిన్"
(తెలుగు భారతం ఆది. 1-107)

ఇంత గొప్పగా కీర్తింపబడిన నాగులను అనాగరకులుగానూ, అల్పబుద్ధులుగానూ చూపే ప్రయత్నం అనంతర కాలంలో జరిగింది. పై పద్యాలు నాగులను స్తుతించే ఒక శతకం లోనివి కావచ్చుననీ, దానిని ఎవరో శిథిలంచేసి ఉండవచ్చుననీ కొందరి అభిప్రాయం.

నాగులను అపఖ్యాతి పాలుచేసే లక్ష్యంతోనే నాగులకు సంబంధించిన వాఙ్మయాన్ని నాశనం చేశారు. వారి పరాక్రమ గాథలను వక్రీకరించారు. "మాతృదాస్య విమోచనము" కథ కూడా భారతంలోనిదే. (ఆదిపర్వం - రెండో అశ్వాసం) నాగులకూ గరుదునికీ ఏర్పడ్డ వైరం - గరుడుడు తన తల్లి వినతను ఆమె సవతి అయిన కద్రువ దాస్యం నుంచి విడిపించుకోవటం ఈ కథలోని ముఖ్యాంశం. ఇదీ నాగులను కుటిల వర్తనులుగా చూపేదే.

అమృతం కోసం దేవాసురులు సముద్రాన్ని మథించినప్పుడు అందులోంచి ఉచ్చైశ్రవము అనే గుర్రం వచ్చింది. దానిని ఇంద్రుడు తీసుకున్నాడు. ఒక సాయంత్రంవేళ ఆ ఉచ్చైశ్రవం తోటలో తిరుగుతూ ఉంటే కశ్యపుని భార్యలు - వినత, కద్రువ అనేవారు - "ఎంత తెల్లగా ఉందో గుర్రం" అని సంబరంగా చూశారు. "అంత తెల్లదానికి తోక దగ్గర నలుపు ఉన్నది" అని కద్రువ అన్నది. దేనికైనా వంకలు పెట్టటం - ఒకరు అవునన్న దానిని కాదనటం కొందరి అలవాటు.

"కాదు. తోక కూడా తెల్లగానే ఉన్నది" అని వినత అన్నది. గుర్రం తోక దగ్గర నలుపు ఉన్నదంటూ కద్రువ వాదానికి దిగింది. పందెం కూడా వేసింది. "తెల్లని గుర్రానికి తోక దగ్గర నలుపు ఉంటే నీవు నాకు దాసివి, నలుపు లేకపోతే నేను నీకు దాసిని." అని కద్రువ పందెం వేసింది. అప్పటికి చీకటిపడుతోంది. మర్నాడు తొందరగా వచ్చి చూద్దామనుకుంటూ ఇద్దరూ తమ తమ ఇళ్ళకు వెళ్ళిపోయారు.

కద్రువ నాగమాత. గుర్రం మొత్తం తెల్లగా ఉన్న విషయం ఆలస్యంగా గ్రహించుకుంది. అయినా పందెం కాసింది. తనమాట నిజం చేయటానికి కొడుకుల సాయం కోరింది. మర్నాడు తాము వెళ్ళే సమయానికి గుర్రం తోకకు చుట్టుకొని తోక నల్లగా కనబడేటట్లు చేయవలసిందిగా కొడుకులను (నాగులను) కోరింది. "కామాచారులకు దుష్కరమైనది లేదు" అనీ అన్నది. నాగులంటే పాములే అనే భావనతో అల్లిన కథ ఇది - నాగులు అలా చేయటానికి ఒప్పుకోలేదు. "అది అధర్మం" అన్నారు వారు. కద్రువ కోపగించుకుంది. "జనమే జయుడు చేసే సర్పయాగంలో మీరు మరణిస్తారు" అని శపించింది. తల్లి శాపానికి భయపడి కర్కోటకుడనే వాడు గుర్రం తోకను చుట్టుకుని

(నీలంగా) వేళ్ళాడాడు. దూరంనుంచి చూస్తే తోక చివర నల్లగా కనిపించింది. వినత తాను ఓడి పోయానని నమ్మి కద్రువకు దాసీగా పనులు చేస్తుండేది. వినతకు గరుత్మంతుడు పుట్టాడు. అతడు కూడా తల్లితోపాటు నాగులకు సేవలు చేయవలసి ఉండేది. కద్రువ అతనిచేత కూడా పనులు చేయించుకునేది. గరుడుడు ఈ దాస్యం నుంచి విముక్తి పొందాలనుకునే వాడు. తమను దాస్యం నుంచి తప్పించటానికి ఏం కావాలన్నా తెచ్చి ఇస్తానని నాగులనూ కద్రువనూ అడిగాడు. అమృతం కావాలన్నారు నాగులు. ఇంద్రలోకానికి వెళ్ళి అమృతం తేవాలంటే అది కష్టసాధ్యమైన పని. అందుకు తగిన బలం రావాలంటే మంచి ఆహారం కావాలి. తనకు మంచి ఆహారం కావాలని గరుడుడు తల్లిని అడిగాడు.

"సముద్రం లోపల అసంఖ్యాకులైన నిషాదులున్నారు. వారు భూమి మీది ప్రజలను బాధిస్తున్నారు. వాళ్ళను తినేసి వెళ్ళు" అన్నది వినత. "తినేటప్పుడు బ్రాహ్మణుడిని వదిలి పెట్టాలి" అనీ చెప్పింది. ఆహారంగా నిషాదులను తినటం – బ్రాహ్మణులను వదలి పెట్టటం – అనేది అప్పటి సామాజిక న్యాయాన్ని సూచిస్తున్నదా?

నిషాదులంటే క్రూరులు, కులం తక్కువవారు అనే ఇప్పటికీ అర్థం. సముద్రంలో ఉంటారంటే పాతాళలోక వాసులనే అర్థం. పాతాళం అంటే దక్షిణాది ప్రాంతాలే. వామనుడు అసురుడైన బలిని అణగద్రొక్కినది పాతాళానికే. అంటే నిషాదులు అసురుల కోవలోకే వస్తారన్నమాట. సమాజం వారిపట్ల ఎంత నిర్దయగా, క్రూరంగా ఉండేదో దీని నుంచి తెలుస్తున్నది. ఈ కథ ఇంకా ఉంది.

"తినేటప్పుడు బ్రాహ్మణుడిని గుర్తుపట్టడం ఎలా" అని తల్లిని అడిగాడు, గరుడుడు. "మింగుతూ ఉంటే ఎవరైతే గొంతు దిగకుండా అక్కడే అగ్నిలాగా మంటకలిగిస్తారో వారు బ్రాహ్మణులు అని తెలుసుకో" అన్నది తల్లి.

నిషాదుల లోపల బ్రాహ్మణులు ఉండవచ్చుననే అనుమానం ఆ తల్లికి కలిగిందంటే అప్పటి సామాజిక వ్యవస్థను ఊహించుకోవచ్చు. భిన్న జాతుల మధ్య లైంగిక సంబంధాలు ఉండేవి. వాటిని వివాహాలుగా ప్రకటించుకున్నవారూ ఉన్నారు. బలవంతులకు సమాజ బలం ఉంటుంది.

వారు అనుమానించినట్లే గరుడుడు నిషాదులను (శత సహస్ర సంఖ్యలలో ఉన్నారట వారు) మింగుతూ ఉంటే ఒక విప్రుడు కుత్తుక దగ్గర మంట కలిగించాడు. గొంతు దిగకుండా ఉన్నాడు. గరుడునికి అనుమానం వచ్చింది. "నా కంఠంలో బ్రాహ్మణుడు ఉంటే దయచేసి బయటికి రావలసింది" అన్నాడు. గొంతులో అందరు ఉండగా ఎలా మాట్లాడాడో? అప్పుడు విప్రుడు ఇలా అన్నాడట. "నేను విప్రుడిని. నా భార్య నిషాది. దానిని వదలి రావటం నాకు న్యాయం కాదు" అని.

"...విప్రుడ నున్నవాడ న పవిత్ర నిషాది మదీయ భార్య..." (భారతం ఆదిపర్వం 2-63) అంటూ నిషాదులు అపవిత్రులు అనే అప్పటివారి భావాన్ని కూడా కవి స్పష్టంగా

చెప్పాడు. విప్రుడు అంటే వేదాలు చదివిన బ్రాహ్మణుడు అని అర్థం. వేదాధ్యయనం - పవిత్రత - బ్రాహ్మణులకు ఆపాదించటం, ఇతర జాతులకు సామాజిక క్రమంలో కింది స్థానం ఇవ్వటం 10, 11 శతాబ్దాలకు ముందే మొదలయింది. నిషాదులను అపవిత్రులుగా చూశారు. అపవిత్రులు, అంటే మైలపడ్డవారు - వారిని తాకటం నిషిద్ధం.

కొన్ని కొన్ని సందర్భాలలో మైలపట్టటం - ఏవో కొన్ని దినాలు మైల పాటించటం లోకంలో ఉంది. ఆ రోజుల్లో ఇతర కుటుంబాలు వారితో కలవరు. శుద్ధి అయ్యాక కలుస్తారు. కొన్ని సందర్భాలలో ప్రాయశ్చిత్త కర్మలు చేసి కలుపుకుంటారు. ఇక్కడ అలా కాదు - నిషాదజాతి మొత్తం అపవిత్రమైనదిగా సమాజం పరిగణించింది. అంటరాని కులాలూ జాతులూ అప్పటికి ఉన్నాయి. మహాభారత రచనా కాలంనాటికి కచ్చితంగా ఉన్నాయి. ఆ వ్యవస్థను పటిష్ఠం చేయటానికే మరిన్ని ఇలాంటి కథలు పుట్టుకొచ్చాయి.

ఆ విప్రుడు నిషాదితో కలిసి జీవిస్తూ కూడా ఆమెను అపవిత్రురాలిగానే తలచాడు. ఆ భావన వర్ణ సమాజపు స్వభావం. గరుడుడు తన గొంతులో నుండి అతనిని బయటకు రమ్మన్నా అతడు భార్యను విడిచి రానన్నాడు. భార్య మీది ప్రేమ, భర్తగా ఆమెను భరించాల్సిన తాను ఆమెను అలా వదిలి రాలేకపోవటం - ఇక్కడ ధర్మాచరణనూ కవులు వదలిపెట్ట కుండా చెప్పారు. ఈ సమస్యను గరుడుడే తీర్చాడు. "విప్రులతో కూడియున్న అపవిత్రులూ పూజ్యులే" అంటూ ఆ భార్యాభర్తలను బయటకు రమ్మని చెప్పి వదిలేశాడు. (పరస్పరం) ఇష్టపడి పెళ్ళిచేసుకున్న భార్యను 'అపవిత్ర' అంటూ కులదృష్టితో కించపరుస్తూ చూడటాన్ని అప్పుడూ ఇప్పుడూ స్త్రీలు భరిస్తూనే వస్తున్నారు. భిన్న జాతుల మధ్య వివాహ సంబంధాలు ఆయా కులపెద్దల ఆగ్రహానుగ్రహాలను బట్టి స్థిరపడేవి. ఎంతో పురోగతి సాధించిన ఆధునిక కాలంలో భిన్న కులాల స్త్రీ పురుషులు వివాహం చేసుకుని తరచు పెద్దల ఆగ్రహానికి గురికావటమూ జరుగుతోంది. "పరువు హత్యలూ" ఈనాడు సమాజంలో ఉన్నాయి. ఆర్య పురోహిత వర్గపు కులధర్మ నియంత్రణ ఇంకా సజీవంగానే ఉన్నది. అది మానవీయ సంబంధాలను కలుషితం చేసింది, చేస్తున్నది.

గరుడుడు ఇంద్రుని రాజ్యంలో ప్రవేశించి అమృత రక్షకులను జయించి ఇంద్రుని వజ్రాయుధాన్ని ఎదుర్కొని అమృతం తీసుకువెళ్ళి నాగులకు ఇచ్చి తన తల్లిని దాస్యం నుండి విడిపించుకున్నాడు[1]. ఆ అమృతం నాగులకు దక్కకుండా ఇంద్రుడు మాయచేసి ఎత్తుకుపోవటం అనేదీ జరిగింది.

---

1 గరుడ పక్షులు పాత వైరంతో నాగులను (పాములను) తింటున్నాయంటారు. జనమేజయుని సర్పయాగం - నాగులపై జరిగిన మారణకాండను సూచిస్తున్నది. వినత నాగుల దాస్యం నుంచి విముక్తి పొందిన రోజు నాగపంచమి అంటారు. నాగులు తమ జోలికి రాకుండా ప్రసన్నం చేసుకునేందుకు వారిని పూజిస్తారు.
దీనిని గరుడుని విజయంగా శ్రీవైష్ణవులు భావించి గరుడ పంచమిగా జరుపు కొంటారు. (నాగులకూ గరుడునికీ గల వైరగాథ ఇంకా చాలా ఉంది).

బౌద్ధంపై వైష్ణవం విజయం సాధించటం చాలా కథలలోని ముఖ్య ఇతివృత్తం. అనంతర కాలంలో నాగజాతి వారిని వైదిక ధర్మానుయాయులుగా చూపటమూ జరిగింది. కృష్ణుడు నాగవంశీయుడంటారు. అతడు కాళియుడనే నాగుని పాతాళానికి అణచివేసినట్లు కథలున్నాయి. కాళియుడు రమణక ద్వీపవాసి. రమణక ద్వీపం ఇప్పటి 'బోర్నియో' అని శ్రీ కోట వెంకటాచలం గారు తమ "బ్రహ్మాండ సృష్టి విజ్ఞానము" అనే గ్రంథంలో చెప్పారు. ఈ కృష్ణునిచేతనే "భగవద్గీత" చెప్పించారు. అది బౌద్ధాన్ని ఎదుర్కొనటానికే –

రామాయణంలో వానర సైన్యంలో నాగసైనికులున్నారు. సైన్య సమీకరణలో దశ నాగబల, శతనాగబల వంటి పదాలు ఈ విషయం తెలియజేస్తున్నాయి. నాగులూ రాక్షసులూ ఒకే కుదురువారైనప్పటికీ వానరుల సైన్యంలో ఉండటం వల్ల ఆ సైనికులు రామ రావణ యుద్ధంలో తమ వారిపైనే (రాక్షసులతో) యుద్ధం చేయవలసి వచ్చింది. రాజకీయశక్తుల నిర్ణయాలవల్ల తమ వారితోనే పోరాడవలసిన పరిస్థితి అప్పటిది[1]. ఈనాడూ అలాంటి పరిస్థితులున్నాయి.

## యక్షులు

యక్షులు అసుర గణాలలోనివారే. పురాణాల ప్రకారం కశ్యప ప్రజాతికి 'ఖస' అనే అప్సరసవల్ల యక్షులు, రాక్షసులు పుట్టారట. అరిష్ట అనే భార్య వల్ల గంధర్వులు కలిగారు. నారాయణుని తొడల నుంచి వైశ్యులు, పాదాల నుంచి శూద్రులు పుట్టారట. తర్వాత ఆయన యక్ష రాక్షసులను పుట్టించాడని వరాహ పురాణం (9–17) చెబుతున్నది. వీరంతా ఆర్యేతరులుగా పరిగణించ బడ్డారు. భారతీయ జానపద గాథలలో యక్షుల గురించి కథలూ నాగుల కథలూ ఎక్కువగా వినిపిస్తుంటాయి. ఇవి గ్రామీణ – గిరిజన – నేపథ్యంతో ఉంటాయి.

వేద సంస్కృతికి పూర్వమే యక్ష, రాక్షస, భూత, ప్రేత, పిశాచ గణాల సంస్కృతి వర్ధిల్లింది. "ఇతర జనులు"గా ఆర్యులు పేర్కొన్న వర్గాలలో వీరున్నారు. తమ మతాన్ని అనుసరించని వారిని 'అన్యులు'గా చెప్పటం ఇప్పుడూ ఉంది, యక్షులు మంచి చేస్తారు – చెడూ చేస్తారు. అందుకే వారిని ప్రసన్నులుగా చేసుకోవాలి – అనేది ఆర్యుల ఆలోచన. Yaksa - The collective name of the mysterious gold lings or spirits which frequent field, forest and jungle and whose activities are the theme of much Indian folklore. They may be either beneficent or malignant, and hence it was considerd essential to propitate them with appropriate offerings (Dictionary of Hinduism) నాగపూజను యక్షుల పూజనూ సామరస్య ధోరణితో కొనసాగించారు.

1. రాజకీయాధికారం లేని కిందివర్గాలు – బలహీన వర్గాలు – గిరిజనులు – ఆదివాసీలు తమ హక్కుల కోసం ఆందోళనలు చేస్తుంటే వారిని అణచటానికి ఆయా వర్గాల వారినే పురికొల్పుతున్న రాజకీయ పరిస్థితి భారతదేశంలో ఉన్నది. అందుకు 'సల్వాజుడుం' వంటి దళాలు ఉదాహరణ.

రామాయణ కథలో 'తాటక' యక్షస్త్రీ. ఒక యక్షుని కూతురు. ఒక యక్షుని భార్య. నాగులకు నాయకురాలు. ఆర్యగణాలకు విధేయంగా ఉండకపోవడం వల్ల వారి శాపంతో "రాక్షసి" అయింది. "నరమాంసం తినే రాక్షసివై వికృతాకారంతో తిరుగుతూ ఉండు" అని అగస్త్యుడు ఆమెను శపించాడు. తర్వాత ఆమె ఆర్య క్షత్రియుల చేత చంపబడింది. ఆమెకు ఇవ్వబడిన శాపాల గురించి ఎన్నెన్నో కథలున్నాయి. అవన్నీ ఆర్య రాజులకు విధేయత చూపకపోవటంవల్ల కలిగినవే.

యక్ష నాగ రాక్షస రాజ్యాలలో జైన, బౌద్ధాల ప్రభావం ఎక్కువ. వ్యక్తి క్షేమం కంటే సమాజ శ్రేయస్సును ప్రధానంగా భావించటం వల్లనే వారు ఆర్య సంప్రదాయాలు వ్యతిరేకించారు.

అవసరాన్నిబట్టి దేవగణాలు వీరిని తమతో కలుపుకుంటూ ఉంటారు. సాధారణంగా కష్టాల్లో ఉన్నప్పుడు వీరితో కలిసి ఉంటారు.

"దుర్జయేన జితోధాత్రి దేవరాజః శతక్రతుః
భారతే హి తదా వర్షే వారణాస్యాంతు పూర్వతః
ఆశ్రిత్య సంస్థితో దేవైః సహా యక్ష మహోరగైః"

దుర్జయుడనే రాజు చేతిలో దేవేంద్రుడు ఓడిపోయినప్పుడు భారత వర్షంలోని వారణాసిని ఆశ్రయించి యక్షులతో, నాగులతో దేవతలతో కలిసి నివసించాడట. (వరా. 16-5).

ప్రజాపతి సృష్టిచేస్తూ రకరకాల జాతులను సృష్టించాడనీ ఆయన కటిస్థలం నుంచి తమో మాత్రులయిన అసురులు పుట్టారనీ మార్కండేయ పురాణం చెబుతోంది. తర్వాత ఆయన ఆ శరీరం వదలిపెట్టగా అది రాత్రి అయింది.

ప్రజాపతికి ఆకలి, దాహం కలిగి మరో శరీరం ధరించాడట. ఆ చీకట్లో ఆ కలివల్ల చిక్కిపోయిన వారు కలిగారు. వారిలో రక్షామ (రక్షిస్తాం) అన్నవారు రాక్షసులూ, జక్షామ (తింటాం) అన్నవారు యక్షులూ అయ్యారు. యక్షణం అంటే తినటం అని అర్థం.

ప్రజాపతి వాక్కును (గో) ధ్యానించినప్పుడు గంధర్వులు కలిగారట. ఇలాంటి రకరకాల కథలు ఒక్కో పురాణం ఒక్కో విధంగా చెప్పింది.

మూర్తి పూజ, గణేశ పూజ, సప్త మాతృకలు, 64 మంది యోగినులు, కొన్ని దేవీ రూపాలు యక్షిణుల మూల భావన నుంచే ప్రాచుర్యం పొందాయంటారు.

దండకారణ్య భూములలోనే యక్షుల రాజ్యాలూ ఉన్నాయి. ఆర్యులకు మిత్రులైన యక్షులను ఉత్తములుగానూ, విరోధించిన వారిని క్రూరులుగానూ ఆర్య వాఙ్మయం చిత్రించింది. మహాభారతంలో "యక్ష ప్రశ్నల" ఘట్టం యక్షుల పాండిత్యాన్ని ప్రస్ఫుట పరుస్తున్నది.

యక్షులు అరణ్యాలలో కొండల్లో కోనల్లో నివసించే మానవాతీత శక్తులని ప్రజలలో ఒక నమ్మకం. వీరు సాధారణంగా మేలుచేస్తారు. ఆగ్రహిస్తే కీడూ చేస్తారు కాబట్టి వీరిని ప్రజలు కొలుపులతో ప్రసన్నం చేసుకుంటూ ఉండేవారు. యక్షులను పూజించటం వేదాలకు పూర్వమే ఉన్న సంప్రదాయం. వీరిని ఆర్యులు 'ఇతర జనులు'గా చూశారు. కొన్ని సమాజాలు వీరిని 'పుణ్య జనులు'గా చూశాయి. జైన ధర్మంలో యక్షులకు ప్రాధాన్యం ఎక్కువ. 24 జైన తీర్థంకరులలో అందరికీ యక్షులు అనుయాయులుగా ఉన్నారు. బౌద్ధంలోనూ వీరు ప్రముఖంగా కన్పిస్తారు. సాంచి, అమరావతి, బార్హత్ స్తూపాలపై యక్ష, యక్షిణి శిల్పాలు, ప్రతిమలు ఉన్నాయి. బుద్ధునికి పూలమాల తీసుకువెళ్తూ ఉన్న కుబేరుని శిల్పం బౌద్ధారామాలలో కనిపిస్తుంది. కుబేరుడు యక్షరాజు. శివుని మిత్రుడు.

పూర్వపు గ్రామాల్లో యక్షులు నివసించే చెట్లుగా కొన్ని చెట్లుండేవి. వాటిమీది యక్షుడు గ్రామానికి మేలుచేస్తాడని నమ్మేవారు. ఒక కాలంలో గణేశుని కూడా యక్షునిగానే పూజించారు. సంతానం కోసం యక్షులను పూజించటమూ ఉంది. యక్షులు అందమైన వారు. కామ రూపులు. వారు అందంగా ఉండటమూ శక్తిమంతులుగా ఉండటమూ సహించలేని ఆర్య జాతులవారు ఏదో నెపంతో వారిని హింసిస్తూ, దండన (శాపం)కు గురిచేసేవారనీ, వికృతాకారం కలిగించేవారనీ (ముక్కు చెవులు కోయటం) తెలుస్తున్నది. వారి నైపుణ్యాలను హరించటం కూడా జరుగుతూ ఉండేది. ఒక కాలంలో బౌద్ధ శిల్పాలను యక్షిణీ శిల్పాలను, వికృతపరచారు. విగ్రహాలకు ముక్కులు విరగ్గొట్టి తమ ఓర్వలేనితనాన్ని ప్రకటించారు.

కొన్ని వర్గాలపై ఈ హింస ఇప్పటికీ అన్ని రంగాలలోనూ సాగుతూనే ఉన్నది.

**రాక్షసులు**

తమ ప్రాచీన మతాన్ని, సంపదనూ రక్షించుకునే వారు "రాక్షసులు" – అని పాశ్చాత్య పండితుడు మాక్స్ ముల్లర్ అర్థం చెప్పాడు. వేదాలను నిశితంగా అధ్యయనం చేసిన ఎ.ఎ. మాక్డొనల్ కూడా ఇదే అభిప్రాయం వెలిబుచ్చాడు. ఈ అభిప్రాయాలు భారతీయ పండితుడైన యాస్కుని ఆధారంగా వెలిబుచ్చినవే.

ప్రముఖ వ్యాకరణవేత్త అయిన పాణినికి ముందటి కాలం వాడు (పూర్వీకుడు) యాస్కుడు. ఆయన చెప్పిన నిరుక్తం వేద మంత్రాలకు అర్థం వివరిస్తున్నది. యాస్కుని కంటే ముందరే ఒక నిఘంటువు ఉన్నదట. అది పరంపరాగతంగా వచ్చినదీ, అతి ప్రాచీనమైనదీను. ఆ మూల గ్రంథంలోని అయిదు అధ్యాయాలు యాస్కునికి లభించాయనీ అదే యాస్కునికి ఆధారమనీ అంటారు. అందులో నైఘంటుకకాండ అనబడే మొదటి మూడు అధ్యాయాలలో ఒకే అర్థం ఉన్న పర్యాయ పదాల జాబితాలున్నాయట. నైగమకాండ అనే నాలుగో అధ్యాయంలో భిన్నార్థాలు గల పదాల జాబితా ఉంది. అయిదో అధ్యాయం

దైవతకాండ. ఇందులో దేవతల పేర్లున్నాయి. వీటిని యాస్కాచార్యుడు వివరించాడు. దానినే మళ్ళీ పాణిని వ్యాఖ్యానించాడు. ప్రాచీనతమమైన భాషాపరమైన ఆధారాల నుంచే పై పాశ్చాత్య పండితులు తమ నిర్ధారణలు చేశారు. ఆ ప్రకారం "తమ సంప్రదాయాన్ని రక్షించుకునే క్రమంలో ప్రతిఘటనా శీలురైన వారు రాక్షసులు" అని స్పష్టమవుతున్నది.

"రక్స్" పదం రక్షణను సూచిస్తుంది. ఈ ధాతువు నుంచే రక్షణకు సంబంధించిన పదాలు వస్తాయి.

1. Raksa - Any amulet or token used as a charm. Sometimes a piece of thread or silk is bound round the wrist to avert the evil eye and protect the wearer against witchcraft.
2. From the root 'raks' to guard, watchover, protect . (A Dictionary of Hinduism)

స్థానిక జాతులు ఆర్య జాతుల నుంచి తమను తాము రక్షించుకునే ప్రయత్నాలతో రక్ష కట్టుకునేవారా? ఆర్యులు స్థానిక జాతుల నుంచి రక్షించుకునేందుకు రక్ష కట్టుకునేవారా? అనేది ఆలోచించవలసిన అంశం.

రక్షరేకులు - తాయెత్తులు, రక్షా బంధనాలు, రక్షామణులు అనంతర కాలంలో దుష్టశక్తుల నుంచి తప్పించుకునే సాధనాలయ్యాయి.

ఈ కోణంలో చూస్తే చరిత్రను తిరగ రాయవలసే ఉంటుంది. తమనూ, తమ క్రతు కర్మకాండలనూ ప్రతిఘటించిన స్థానికులను ఆర్య వాఙ్మయం రాక్షసులుగా ప్రచారం చేసింది. వారి వాఙ్మయాన్నీ చరిత్రనూ వివరించే ఆధారాలు నాశనం చేసింది. సంఘటనలను తారుమారు చేసి ప్రచారంలోకి తెచ్చింది. వారి భాషలనూ నిరాదరించింది. స్థానిక భాషలయిన 'పైశాచీ' వంటి భాషలలోని సారస్వతాన్ని సంస్కృతంలోకి అనువదించుకుని మూల భాషలను నాశనం చేసింది.

జన జీవితాలకు అద్దంపట్టిన గుణాఢ్యుని "బృహత్కథ" మంటల్లో తగలబడి పోవటానికి కారణమైన కథలు దాగని సత్యాలు. ఒకానొక శాతవాహన చక్రవర్తి రాణి, సంస్కృత భాషలో మాట్లాడటమూ ఆ భాష అర్థంకాని రాజు అవమానంతో బాధపడి పట్టుదలగా సంస్కృతం నేర్చుకోవటమూ - స్థానిక భాషలను నిర్లక్ష్యం చేయటమూ ఆ క్రమంలోనే పైశాచీ భాషలో ఉన్న గుణాఢ్యుని 'బృహత్కథ'ను నిరాదరించటమూ సాహితీ ప్రియులకు తెలిసిన వివరాలే. బృహత్కథలో వింధ్యకు ఇవతలా, అవతలా నివసించే రక రకాల జాతుల గురించీ వారి ప్రవర్తనలు - సంస్కృతులు - భాషల గురించీ ప్రస్తావన లున్నాయి. 'వింధ్యవాసిని' అనే దేవత పేరూ అందులో తరచుగా కనిపిస్తుంది. యక్ష రాక్షస పాత్రలూ, విద్యాధరుల పాత్రలూ ఉన్నాయి. రాక్షసుల గురించి చెప్పుకునేటప్పుడు ఈ ఎరుక అవసరం.

పురాణ కథలలో, యక్షులూ, నాగులూ, గంధర్వులూ శాపాలవల్ల రాక్షసులవుతుంటారు. రామాయణంలో అగస్త్యుని శాపంతో యక్ష పుత్రిక అయిన తాటక రాక్షసి

అయింది. 'ఘృతాచి' అనే అప్సరసను కూడా అగస్త్యుడు రాక్షసిగా శపించాడట. ఆమె కపిలతీర్థంలో విముక్తి పొందింది. (స్కంద పురాణం).

శాపాలు పొంది రాక్షసులుగా అయ్యే వారిలో నాగులూ, యక్షులూ, గంధర్వులూ ఎక్కువ. రామాయణంలో సుగ్రీవుడు రాక్షసుల రాజ్యాలు చాలా పేర్కొన్నాడు. కిష్కింధకు తూర్పుగా వెళ్తే వచ్చే ప్రాంతాలలో రాక్షసుల రాజ్యాలున్నాయన్నాడు. 'కిష్కింధ' దక్షిణ భారతదేశంలో విస్తరించిన దక్కన్ భూ భాగం. 'కిష్' అంటే పాలకవర్గం. ఇది అస్సీరియన్/ సుమేరియన్/ ఫినీషియన్ భాషా మూలాలుగల పదం. (సంస్కృతం స్థిరపడినాక రూపొందిన పదాలే రామాయణంలో కనిపిస్తాయి) ఇక్షు సముద్రం మహాకాయులైన అసురుల ప్రాంతం. పైనున్న వాటిని ఆకర్షించే స్వభావంగల శిలలు అక్కడ ఉన్నాయట. మధు సముద్రం ఎర్రని నీటితో ఉంటుంది. అక్కడ మందేహులనే రాక్షసులుంటారు. శిశిర పర్వతం మీద దేవ దానవ రాజ్యాలూ ఉన్నాయన్నాడు సుగ్రీవుడు.

రావణుడు తాను 32 కోట్ల రాక్షసులకు ప్రభువునని సీతతో చెప్పాడు. రావణుడు, రాక్షసుడూ, అసురుడూ కూడా. ఇతడు యక్షులకూ బంధువే. రాక్షస రాజ్యాల అస్తిత్వాన్ని తృణీకరించే విధంగా "రక్షస్" పదాన్ని ప్రతికూల భావంతో అన్వయించటం అనంతర కాలపు పరిణామం.

అధర్వణ వేదం "రక్షస్సు"లను వ్యాధి కారకాలుగా చెప్పింది. వీటి నుండి రక్షించుకోవాలన్నది. రక్షస్సులు రకరకాల ఆకారాలతో తోకచుక్క ఆకారాలతో ఉంటాయన్నది 'కౌషీతకి సూత్రం, (126.9). వీటిలో మంచివీ చెడువీ ఉంటాయట. అవి ఇప్పటి 'వైరస్'ల లాంటివే కావచ్చు. తమ జోలికి వస్తే సహించని స్వభావం గలవారే రాక్షసులుగా ముద్రపడ్డారు. రక్షస్సులు (వైరస్)లు అలాంటి స్వభావం కలవే. తినే పదార్థాలలోను తాగే పానీయాలలోను ఉండి కడుపులో హానిచేస్తాయని నమ్మేవారు.

స్థానికులు తమ ప్రాచీన మత సంప్రదాయాలను వదలిపెట్టకుండా వైదిక క్రతువులను అనుసరించకుండా ఉన్నప్పుడు వారిని ఆర్యమునులు "రాక్షసత్వం భజేత్యహం" (నిన్ను రాక్షసత్వం ఆవహిస్తుంది) అంటూ శపించేవారు. ప్రతిఘటించిన స్థానికులకు "రాక్షస" పదం తగిలించేవారు. దక్షిణ దేశంలోని ప్రజలను ప్రాచీన చరిత్రకారులు రాక్షసులుగా చెప్పారు.

రాక్షసులలో బ్రహ్మరాక్షసులూ కనిపిస్తారు. వీరు బలమూ, వైదుష్యమూ కలవారుగా (జానపద కథలలో) ప్రతీతి. "మన్నియ బ్రహ్మరాక్షస" అనేది అనంతర కాలంలో గొప్ప బిరుదుగా పరిగణించారు. మహా మాండలిక కేతయ వేయించిన సిరికొండ శాసనంలో ఈ పదం విశేషణంగా కనిపిస్తున్నది. (శాసన సంపుటి పుటలు 129-148).

రక్షస్సులు చీకట్లో నివసిస్తాయనీ నిప్పుకు భయపడతాయనీ నమ్మేవారు. ఆ లక్షణాలను బట్టి యజ్ఞ విరోధులుగా వారికి ముద్రవేశారు. రాక్షస శక్తులు రకరకాల

రూపాలతో తిరుగుతుంటాయని నమ్మేవారు సంస్కృతంలో "ఋక్ష" అంటే హాని కలిగించేది అని అర్థం చెప్పుకుని రక్షస్, రాక్షస పదాలను తిరస్కార దృష్టితో ప్రచారం చేశారు.

"శూద్ర" పదానికి సుమేరు భాషలో రక్షకుడు అని అర్థం. రక్షకులలో తీవ్ర స్వభావం కలిగినవారు రాక్షసులుగా ముద్రపడ్డారు. శూద్ర - రాక్షస సంబంధం అధ్యయనానికి ఆసక్తికరమైన అంశం.

రాక్షసుల నగరాలలో బ్రహ్మ రాక్షసులు వేదం చదువుతుండేవారు. యాతుధానులు, మంత్రాలు వల్లిస్తుండేవారు. స్త్రీలూ సంధ్యావందనం చేసేవారు. లంకా నగరవర్ణన ఒక క్రమబద్ధమైన సంస్కృతికి అద్దం పడుతున్నది.

**వానరులు**

వానరులు భారతదేశంలోని స్థానిక జాతులు. దక్షిణ భారతదేశంలో సవరలు, శబరులు మరికొన్ని ఆదివాసీ తెగలవారూ రామాయణంలో వానరులుగా పేర్కొనబడ్డారు. వీరు, వాలము గల నరులు. వాలము అంటే తోక. ఇక్కడ వేలాడే తోకలాంటి వస్త్రం ధరించే నరులు అని అర్థం. వానరులు సంఖ్యాబలం గలవారు. వారి జనాభా క్కోట్ల సంఖ్యలో ఉండేదని రామాయణం చెప్పింది.

వానరులు - 'A Tribe of Savaras is called Arsi or Arisi which means a monkey in the language of Savaras. By their Oriya neighbours they are called Lambo Lanjia (long tailed) which is the Oriya equivalent of Arsi. They got the name from a long piece of cloth which the males allow to hang down... '

*(Castes and Tribes of South India - Thurston)*

సవర జాతిలో అర్సి, అరిసి అనే శాఖలు ఉండేవనీ వారిలో మగవారు వెనకవైపు తోకలలాగా, పొడుగ్గా వేలాడే విధంగా వస్త్రధారణ చేసేవారనీ, అందువల్ల వారిని పొరుగు వారైన ఒరియావారు. పొడుగు తోకల వారుగా పిలిచేవారనీ పరిశోధకులు స్పష్టం చేశారు.

అడవుల్లో నివసించే చాలా తెగల వారిలో పురుషులు పొడుగ్గా వేలాగే గోచీలు మాత్రం ధరించి తిరుగుతుంటారు. వారి జీవన విధానానికీ, ఆహార సేకరణకూ అది అనువైన వస్త్రధారణ.

రామాయణం పొడుగు తోకల వస్త్రధారణ గలవారిని కోతులుగా చెప్పేసింది. అయితే వానర స్త్రీలకు తోకలు వర్ణించలేదు. తోకలు పురుషులకు మాత్రమే వర్ణించింది. నాటకాలలోనూ సినిమాలలోనూ ఆంజనేయునికీ, సుగ్రీవునికీ తోకలున్నట్లు చూపిస్తారు. తారకూ, రుమాదేవికీ చూపించరు. స్త్రీల వస్త్రధారణ వేరు.

రాముని భార్యను రావణుడు అపహరించినప్పుడు రామునికి ఏ ఆర్యరాజూ సాయం రాలేదు. కర్ణాటక, ఆంధ్ర, దండక ప్రాంతాల వానరులే సహాయపడ్డారు. ఈ మూడు ప్రాంతాలలోనూ ఆర్య రాజ్యాలు లేవు. ఉన్నవి అసురుల రాజ్యాలే. అసురులను చంపటానికే

రాముడు పుట్టాడు కాబట్టి స్థానికులలో వానరులను మిత్రులుగా చేసుకున్నాడు. ఆ మైత్రిలో వారికి పరస్పర ప్రయోజనాలున్నాయి.

అన్నదమ్ములలో చిన్నవాడు పెద్దవాని భార్యను వివాహం చేసుకోవటం అనే ఆచారం సవరలలో ఉన్నదట. ఆ ఆచారం వానరులలోనూ వాలి సుగ్రీవుల విషయంలో కనిపిస్తున్నది.

రామాయణంలో యుద్ధంలో పాల్గొన్న వానరులు గిరిజన/ఆదివాసీ తెగలవారే. కొండ కోనలలో, దట్టమైన అడవులలో చిన్న చిన్న జనావాసాలు ఏర్పరచుకుని నివసిస్తూండే ప్రజలు. ప్రపంచవ్యాప్తంగా 9,600 గిరిజన తెగలున్నాయంటారు. రామాయణ కాలం నాటికి, ఈ దేశంలో ఎన్ని ఉన్నాయో. ఆధునిక కాలంలో 20వ శతాబ్దినాటి లెక్కల ప్రకారం ఆంధ్రదేశంలో 35 గిరిజన తెగలవారున్నారంటున్నారు. వీరిలో 31 తెగలు అటవీ ప్రాంతాలలోనూ మిగతా 4 తెగలు మైదాన ప్రాంతాలలోనూ ఉన్నాయట. భారత దేశంలో 635 గిరిజన తెగలున్నాయట. వీరి జనాభా 2001 జనాభా లెక్కల ప్రకారం88.5 మిలియన్లు.

వానరులు బహు భాషలు తెలిసినవారు. వానర ముఖ్యుడైన హనుమంతుడు మొదటిసారి రామలక్ష్మణులను సమీపించి తనను పరిచయం చేసుకున్నప్పుడు అతని మాటలు విని వారు ఆశ్చర్యపోయారు.

"నా నృగ్వేద వినీతస్య నా యుజుర్వేద ధారిణః
నా సామవేద విదుష శ్శక్యమేవం ప్రభాషితం" (28) కిష్కింధకాండ

'ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదాలలో శిక్షణలేనివానికి ఇలా మాట్లాడటం సాధ్యం కాదు' అని రామలక్ష్మణులు అనుకున్నారు. ఇతనికి వ్యాకరణం బాగా వచ్చు. మాటలలో అపశబ్దాలు లేవు. ఉచ్చారణ బాగుంది. మాట్లాడేటప్పుడు ముఖ లక్షణాలు కూడా సహజంగానే ఉన్నాయి – అని అనుకోవటం వానరుల వైదుష్యాన్ని తెలుపుతున్నది. రావణుని లంకలో సీతను చూసిన హనుమంతుడు ఆమెను ఏ భాషలో పలకరించాలా అని ఆలోచించాడు. సంస్కృతంలో మాట్లాడితే రావణుడు ఈ రూపంలో వచ్చాడను కుంటుందేమో అనీ సందేహించాడు. అంటే అప్పటికి అసురులూ సంస్కృతం మాట్లాడే వారని దీనివల్ల అర్థమవుతుంది. సంస్కృతం దేవభాష అనీ అందరికీ రాదనీ శూద్ర కులాలు ఆ భాష వినరాదనీ మాట్లాడరాదనీ అనటం కుతంత్ర ప్రచారమే.

సంస్కృతం ఒక భాషగా రామాయణ కావ్యం తర్వాతనే ప్రచారంలోకి వచ్చింది. (A History of Sanskrit Literature - AAA Macdonell, p 22)

వానరుల గురించీ, వానర రాజ్యాల గురించీ రామాయణం చాలా స్పష్టంగా చాలా విషయాలు చెప్పింది. కాని వాటిని అర్థం చేసుకోవటంలోనే పొరపాట్లు జరిగాయి. పొరబాట్లూ వక్రీకరణలూ ఉద్దేశ పూర్వకంగా కావాలని కల్పించినవే. వానరులంటే

'కోతులు' అనే అర్థం ప్రచారంలోకి రావటానికి ఎవరు కారణమో చెప్పలేము కాని కోతి రూపాలు వానరులకు రాముడే నిర్దేశించాడు.

యుద్ధాలలో పాల్గొనే సైనికులకు ప్రత్యేక దుస్తులు, చిహ్నాలు ఉంటాయి. రావణునితో యుద్ధానికి సన్నాహాలుచేస్తూ రాముడే తన సైన్యానికి రూపాలు కూడా నిర్దేశించాడు. లంకాపురిని ఎలా ముట్టడించాలో చెబుతూ తూర్పు ద్వారంవైపు నలుడు, పశ్చిమం వైపు హనుమంతుడు, దక్షిణ ద్వారంవైపు అంగదుడూ వెళ్ళాలనీ తాను ఉత్తర ద్వారం ముట్టడిస్తాననీ చెప్పాడు. వానరులెవరూ మానవ రూపాలలో ఉండకూడ దన్నాడు. (యుద్ధకాండ సర్గ-37) వానరులు నిజంగా కోతులే అయితే వారికి మానవ రూపం నిషేధించటం ఏమిటి? ఈ ప్రశ్నకు సమాధానం ఎవరికి వారు ఊహించుకోవలసిందే.

వానరేంద్రశ్చ బలవాన్ ఋక్షరాజస్య వీర్యవాన్ అంటూ వానర, ఋక్ష సమూహాలను పొగడుతూ "నచైవ మానుష రూపం హరిభి రాహవె..."

"యుద్ధంలో వారికి మానుష రూపం వద్దు. కోతుల రూపాలలో ఉండాలి" అన్నాడు. 'హరి' అంటే కోతి అనీ, విష్ణువు అనీ అర్థాలున్నాయి. కృతక భాష కాబట్టి సంస్కృత భాషకు ఎవరెన్ని అర్థాలు చెప్పినా చెప్పుకోవచ్చు. వానరులు యుద్ధంలో విష్ణువు రూపాలతో లేరు. కోతుల రూపాలలోనే ఉన్నారు.

"ఏషా భవతు నస్సంజ్ఞా యుద్ధేస్మిన్ వానరే బలె
వానరా ఏవ నశ్చిన్హం స్వజనే స్మిన్భవిష్యతి
వయంతు మానుషే చైవ సప్తయోత్
స్యామమే వరాన్"

(యుద్ధంలో వానరులు తమ చిహ్నాలతో ఉండకూడదు. మనుష్య రూపంలో ఏడుగురే ఉంటారు) అని ఆజ్ఞాపించాడు. "ఏషా భవతు" (ఇలా జరగాలి) అనేది ఆజ్ఞ. మనుష్య రూపంలో ఉండే ఏడుగురూ ఎవరంటే, "నేను (రాముడు), నా తమ్ముడు లక్ష్మణుడు, మిత్రుడు విభీషణుడు, ఆయన నలుగురు మంత్రులూ" అని చెప్పాడు.

"అహమేవ సహభ్రాత్రా లక్ష్మణే మహౌజసౌ
ఆత్మనాం పంచమశ్చాయం సఖామయ విభీషణం
సరామః కృత్య సిద్ధర్థ్య ఏవ ముక్త్వా..." (37-8)

రావణుడు రాక్షసుడు. రావణుని తమ్ముడు, మంత్రులు అంతా రాక్షసులే. రాక్షసులతో యుద్ధానికి విభీషణుడూ అతని మంత్రులూ మనుష్య రూపాలు ధరించటం ఏమిటి? రామలక్ష్మణులు మానవులే. విభీషణుడూ ఆయన నలుగురు మంత్రులూ రాక్షసులన్నది ప్రచారంలో ఉన్న విషయమే. వాళ్ళూ మానవులుగా మారి రాక్షసులతో యుద్ధం చేయటం ఏమిటి?

యుద్ధాలలో పాల్గొనే గణాలకు (సైనిక దళాలకు) తమ తమ చిహ్నాలుండటం విధాయకం. అయితే ఇక్కడ రాముడు వానరులకు వారి సంజ్ఞలు నిషేధించాడు. వేష భాషల పైనా, గణ చిహ్నాలపైనా రాజ్యం నియంత్రణ ఇక్కడ గమనించాలి.

రాముని కార్యదక్షతను రాజనీతినీ, యుద్ధ తంత్రాన్ని గొప్పగా ప్రచారం చేయటానికే ఈ ఏర్పాట్లూ, వర్ణనలూను. మానవ రూపాలు నిషేధించాక కిష్కింధ సైన్యం కోతుల వేషాలు వేసుకుని యుద్ధంలో పాల్గొన్నారన్న మాట. కోతుల అల్లరి చేష్టలు, రాళ్ళూ, చెట్లు, కొమ్మలూ విసరటాలూ, తోకలతో ఎగరడాలూ వర్ణించి, ప్రదర్శించి పాఠకులకు వినోదం కలిగించారు. ఆ విధంగా రామాయణ కథ విశేష ప్రచారం పొందింది.

అజ్ఞానం నుంచి జ్ఞానం వైపూ, చీకటి నుంచి వెలుగులోకీ కాకుండా - మానవ దశ నుంచి వెనక్కు - తిరిగి వనచరుల దశకు - తిరోగమనాన్ని రామాయణం ప్రోత్స హించింది. అందులోని కీలకాంశాలను పదిమంది దృష్టికి తేవటాన్ని ఈనాడూ నాగరిక సమాజం అడ్డుకుంటున్నది.

లంకపై దండెత్తటానికి అన్ని ఏర్పాట్లూ చేసి అంత సైన్యం సమకూర్చిపెట్టి అన్ని సన్నాహాలూ చేసిన వానర నాయకులకు రాముడు మానవ రూపాలు అనుమతించక పోవటంలో కింది వర్గాల పట్ల ఆదివాసీలపట్ల పాలకవర్గానికి సమాజానికి గల తేలిక భావం స్పష్టమవు తున్నది. అయినా వానరులు విధేయులుగానే వ్యవహరించారు. ఇప్పటి రాజకీయాలోని పరిస్థితీ అంతే.

రాముడు విభీషణుడినీ, అతని మంత్రులనూ చాలా ఆదరంతో చూశాడు. “మమసఖా” (నా సఖుడు) అనేశాడు, నాలుగు రోజుల్లోనే. ఒక పార్టీ వదలి ఎదుటి పార్టీలో కొత్తగా చేరేవారికి లభించే గౌరవం అది. ఇప్పటికీ కొనసాగుతూ ఉంది.

పార్టీల కుమ్ములాటల్లో ప్రతిస్పర్ధి పార్టీ నుంచి మనుషులను ఆకర్షించటం, వారికి వెంటనే పదవులూ రాయితీలూ గుర్తింపూ ఇవ్వటం రాముని వారసత్వమే.

అసంఖ్యాకంగా వచ్చిన వానర బలం, రాముడు చెప్పిన ఈ ఏడుగురికీ పెద్దరికం ఇచ్చి దాస్యం చేయవలసి వచ్చింది. తమ గుర్తింపు, ఉనికి, సహజ రూపం అన్నీ వదిలేయ వలసి వచ్చింది. సుగ్రీవుడు తన కోసం చేసుకున్న ఒప్పందంవల్ల రాముని వంటి అసహన పరుల కోసం వానరులు పోరాడవలసి వచ్చింది. వానర సేనలో ఎక్కువ బలగం నాగులే. క్రమశిక్షణ గల నాగులు తమ ఇష్టానికి వ్యతిరేకంగానే సుగ్రీవుని ఆజ్ఞ పాటించి పోరాడారు. అందుకే “సుగ్రీవాజ్ఞ” అత్యంత కఠినమైన ఆజ్ఞగా ప్రసిద్ధమైంది.

మానవ రూపాలతో పోరాడటానికి రాముడు అనుమతించిన ఏడుగురి పేర్లూ కొన్ని రామాయణాలలో వేరేగా కనిపిస్తున్నాయి. సంస్కృత భాషలోని జటిలత అందుకు కారణం కావచ్చు. స్వామి కృష్ణదాసజీ గారి ‘శ్రీరామ చరితామృతం’లో రామలక్ష్మణులు విభీషణుడు అతని మంత్రులు మాత్రం తమ సహజ రూపాల్లో అంటే మానవ రూపాల్లో

ఉంటారని ఉంది. విభీషణునికీ అతని మంత్రులకూ సహజ రూపం మానుష రూపమేనా? అంటే రాక్షసులూ మానవులూ - మానవ రూపాలు కలవారే అని స్పష్టమవుతున్నది.

దాశరథి రంగాచార్య గారి శ్రీమద్రామాయణంలో విభీషణుని నలుగురు మంత్రులకు బదులు నలుడు, హనుమంతుడు, అంగదుడు, సుగ్రీవుడు ఉన్నారు. వీరు మానవ రూపాల్లో ఉంటారన్నారు. అంటే కోతులుగా చెప్పబడ్డ పై నలుగురు వానరులూ మానవ రూపాలు ధరించగలిగారన్న మాట. అంటే వానరులు మానవులే. మానవ రూపాలు కలవారే అని స్పష్టమవున్నది.

వానరులు మనుషులే అనే సంగతి 'సంపాతి' మాటల్లోనూ తెలుస్తుంది. (కిష్కిం. 56) సంపాతి జటాయువు సోదరుడు. వీరు పక్షులు అని రామాయణం అన్నది. కాని సంపాతి మాటలలో వీరూ మానవులే అని తేటపడుతున్నది. సంపాతి మనిషి రూపంలోనే ఉన్నాడన్నారు. వీరు గరుడ చిహ్నం గల తెగకు చెందిన ప్రజలు.

రాక్షసులకు వ్యతిరేకంగా ఆర్యులు చేసిన దాడులలో వానరులు ఆర్యులకు సాయ పడటం, వానరుల సైన్యంలోని నాగసైనికులూ క్రమశిక్షణ పేరిట అర్యులకు సాయంగా రాక్షస రాజయిన రావణునితో పోరాడవలసి రావటం నాయకుల ఒప్పందాల ఫలితమే. వానరసేనలో నాగుల సంఖ్య ఎక్కువ. కిష్కింధాకాండ (31).

రామాయణం బాలకాండ కథ ప్రకారం ఆర్య రాజైన రాముడు సహస్ర నాగబల సమన్విత అయిన యక్ష స్త్రీ తాటకను చంపాడు. ఆ విధంగా రామునికి నాగ, యక్ష వర్గాలు శత్రువర్గం. కిష్కింధకాండకు వచ్చేసరికి రాముడు వానరుల రాజు సుగ్రీవునితో సఖ్యం చేశాడు. వానర సైన్యాలు ఆయనకు సాయం వెళ్ళాయి. వానర సైన్యాలలో నాగజాతి వారే ఎక్కువగా ఉన్నారు. సుగ్రీవునితో మైత్రి చేసుకున్న ఆర్యులు స్థానిక తెగలోని వానర, నాగజాతుల సైనికులకు రాక్షసులకు ఎదురు నిలిచి పోరాడే పరిస్థితి కల్పించారు. స్థానిక జాతుల ఐక్యతను దెబ్బతీయటం అక్కడి పన్నుగడ.

నాయకుల స్వార్థ రాజకీయాల వల్ల, వారి ఎత్తుగడలవల్ల దళిత బహుజన వర్గాలు సంఘటితం కాలేకపోవటం, సామాజిక చైతన్యాన్ని కోల్పోతూ ఉండటం వర్తమానంలో కనిపించే వాస్తవం.

యుద్ధంలో 'మానవ రూప నిషేధం' అనే ఈ అంశం సమాజంలో కొన్ని వర్గాల వేష భాషల పట్ల నియంత్రణ ఎలా జరిగిందో వారికి మానవ హక్కులు ఎంత నిర్దాక్షిణ్యంగా నిరాకరించబడ్డాయో విశదంగానే చెప్పింది. కాని వాటిని అర్థం చేసుకోనీయని పరిస్థితి కల్పించారు. వ్యక్తుల మానసిక అపరిపక్వత, అజ్ఞానం, బలహీనతల వల్లనే పురాణ కథలు మూఢ భక్తి వ్యాఖ్యానాలతో దేశాన్ని ముంచెత్తుతున్నాయి. ఇది రోజు రోజుకూ విస్తృతం అవుతున్నది. హేతుబద్ధమైన ఆలోచనను ప్రజల ముందు ఉంచ వలసిన బాధ్యతను సామాజిక శాస్త్రవేత్తలూ, విజ్ఞులూ వహించవలసే ఉంటుంది.

రాక్షసులకూ, వానరులకూ జరిగిన యుద్ధం పూర్వపు దేవదానవ యుద్ధాలవలెనే ఉన్నట్టు రామాయణం వర్ణించింది. పౌరాణికులు వానరుల (కోతుల) యుద్ధాన్ని పామర జనరంజకంగా హాస్యంగా చెబుతూ ఉంటారు.

వానరులు బలవంతులు, విస్తృతమైన పరిజ్ఞానం, లోకజ్ఞానం కలవారు; సైనిక బలం కలవారు. అందుకే రాముడు వారిని ఆశ్రయించాడు. అయినా వారిని తేలికగానే చూశాడు.

రామాయణం వర్ణించిన వానరుల గురించీ, కిష్కింధా నగరం గురించీ వాస్తవాలు చాలా ఉన్నాయి. కిష్కింధకాండ తప్పక చదవవలసిన భాగం.

రామాయణంలో మనోజ్ఞమైన ప్రకృతి వర్ణనలేమైనా ఉంటే అవి కిష్కంధకాండలోనే ఉన్నాయి. ఇవి మహాకవి కాళిదాసు రచనను గుర్తుకు తెస్తుంటాయి.

లక్ష్మణుడు సుగ్రీవుని నగరానికి వెళ్ళిన సందర్భంలో చూసిన కిష్కింధ నగరం గొప్ప భవనాలతో ఉన్నది. అవి తెల్లని ప్రాకారాలు గల ఇంద్రుని భవనాల్లాగా ఉన్నాయి. (దేవతా) గృహాల మీది గోపురాలు కైలాస శిలల్లాగా ఉన్నాయి. నగర ద్వారం బంగారు వాకిలితో, జెండాలతో, తప్త కాంచన తోరణాలతో ఉన్నది. ధనికుల ఇళ్ళకూ పూజా గృహాలున్నాయి. (33-34 సర్గలు) "చందనాగరు పద్మానాం గంధైః స్సురభి గంధినామ్, మైరేయాణాం మధూనాంచ" రాజవీధులలో సుగంధ ద్రవ్యాలు, మధువు మొదలైనవి అమ్ముతూ ఉన్నారట.

వానర వీరులైన అంగదుడు, మైందుడు, ద్వివిదుడు, గవయుడు, గవాక్షుడు, గజుడు, శరభుడు, విద్యున్మాలి, సంపాతి, సూర్యాక్షుడు, హనుమంతుడు, వీరబాహుడు, సుబాహుడు, నలుడు, కుముదుడు, సుషేణుడు, లూరుడు, జాంబవంతుడు, దధివక్త్రుడు, నలుడు, సపాటలుడు, సునేత్రుడు మొదలైన కపిశ్రేష్ఠుల గృహాలు బలంగా నిర్మింపబడి ఉన్నాయి. దివ్యమైన పూలహారాలతో అలంకరింపబడినవీ, విశేషంగా ధనధాన్యాలతో నిండినవీ, ఉత్తమురాండ్రైన స్త్రీలతో ప్రకాశిస్తున్నవీ అయిన గొప్ప భవనాలు రాజమార్గంలో లక్ష్మణుడు చూశాడు.

సుగ్రీవుని భవనం ఎన్నో కక్ష్యలతో (ప్రాకారం) ఉన్నదట. ఏడు ప్రాకారాలు దాటిన తర్వాత సుగ్రీవుని అంతఃపురాన్ని లక్ష్మణుడు చేరగల్గాడు. అన్ని ప్రాకారాల దగ్గరా భటులున్నారు. అంతఃపురం లోపల గదులలో చిత్రాసనాలు బంగారు, వెండి మంచాలు, ఆసనాలు, సంగీత వాయిద్యాలు ఉన్నాయి.

వానరులందరు దివ్య మాల్యాంబర ధరులై ప్రియదర్శనులై ఉన్నారు. వారు దేవ గంధర్వ పుత్రులు, కామరూపులు.

తా మపశ్య ద్బలాకీర్ణాం హరి రాజ మహాపురీమ్।
దుర్గా మిక్ష్వాకు శార్దూలః కిష్కింధాంగిరి సంకటే॥

కిష్కింధ శత్రువులకు చొరరాని మహానగరం. ("హరి వాగురాయ వ్యాప్తాం తప్త కాంచన తోరణా... ధ్వజ యంత్రాఢ్యాం..." -14 సర్గ, 22 శ్లోకాలు) దట్టమైన కొండల మధ్యలో ఉన్న దుర్గం. వానర సేనతో రక్షింపబడుతూ హరిరాజ మహాపురిగా చెప్పబడింది. కిష్కింధలోని వానరులు ప్రియదర్శనులే అయినా ఆయుధాలతో భయంకరులుగా ఉన్నారట. సేనా నాయకులకు వారి హోదానుబట్టి వారికింద సైన్యం ఉండేది. కొందరి కింద దశ నాగ సహస్ర బలమున్నట్టు వర్ణించారు.

దశ నాగబలాః కేచి త్కేచి ద్దశగుణోత్తరాః!
కేచి న్నాగ సహస్రస్య బభూరీ స్తుల్య విక్రమాః!! (సర్గ 31-25)

యుద్ధ ప్రయత్నాల గురించి అడిగినప్పుడు లక్ష్మణునికి సుగ్రీవుడు ఇలా చెప్పాడు. "ఓ శత్రు సంహారకుడా! ఇంద్రుని కంటే పరాక్రమం గల వానర సేనాపతులలో కొందరు నూర్గురు వానరులతోను, కొందరు వేయి మందితోను, కొందరు లక్షమంది వానరులతోను, కొందరు కోటిమంది వానరులతోను, కొందరు అర్బుదము సంఖ్యగల వానరులతోను, కొందరు నూరు అర్బుదముల సంఖ్యగల వానరులతోను, కొందరు "అంతము" అనే సంఖ్యగల వారితోను కొందరు మధ్యము అనే సంఖ్యగల వానరులతోను, కొందరు సేనాపతులు సముద్రము అనే సంఖ్యగల వానరులతోను వస్తున్నారు." ఈ వివరాలే పది సర్గలలో ఉన్నాయి. అతిశయోక్తులుగా తీసివేసినా కొంత నిజం ఉండి ఉండాలి... "వీరు మందర పర్వతాలలో నివసించే వానరులు. ఆ పర్వతాల లాగనే గట్టివారు. వారు రావణుని చంపి సీతను తెస్తార"ని సుగ్రీవుడు రాముడిని ఊరడించాడు.

వానర సైన్యం కోట్ల కోట్ల సంఖ్యలో ఉంది. రామాయణంలో చెప్పిన సంఖ్యలు[1] అవి.

యుద్ధకాండలో వానరసేనను రావణునికి చూపిస్తూ శుకుడు అనేవాడు చెప్పిన వివరాల ప్రకారం యాభైకు పైగా వానర రాజుల రాజ్యాల పేర్లు తెలుస్తున్నాయి.

1) శ్వేతుడు ఒక వానర రాజు ఇతని రాజ్యంలోని వారు తెల్లనివారట.

2) కుముదుడు - సంకోచనం అనే ప్రాంతం నుంచి వచ్చిన రాజు.

---

1. పూర్వపు లెక్కల వివరణ యజుర్వేదం ప్రకారం కింది విధంగా ఉంది. "ఒకటిని పదిచే గుణించుచో పది, పదిని పదిచే గుణించుచో వంద (100); దానిని పదిచే గుణించుచో వేయి (1000); దానికి పదిరెట్లు పదివేలు (10,000); దానికి దశ గుణము లక్ష (1,00,000), దానికి పదిరెట్లు పది లక్షలు, (10,00,000) దానికి పది రెట్లు కోటి; (10000000) దానికి పదిరెట్లు ఆర్యము (100000000); దానికి పది రెట్లు ఖర్వము (1000000000); దానికి దశ గుణము దశ ఖర్వము (1,0000000000); దానికి దశ గుణము నీలము (100000000000); దానికి పదిరెట్లు దశ నీలములు (1,000000000000); దానికి పదిరెట్లు పద్మము (10000000000000); ఆ తర్వాత దశ పద్మము (100000000000000); దానికి పదిరెట్లు శంఖము (1,000000000000000); దానికి పదిరెట్లు (1,0000000000000000) దశ శంఖము అని సంఖ్యల పేర్లు. (యజుర్వేదం 17-852 గణిత విద్య)

3) వింధ్య, సహ్యా పర్వత ప్రాంతాల రాజులు.

4) కృష్ణగిరి నుంచి వచ్చిన నాయకులు.

5) రంభుడు

6) సాల్వేయ పర్వత ప్రాంతపు రాజు – శరభుడు.

7) పవనుడు, 8) కవయుడు 9) క్రోధనుడు, 10) హరుడు వీరంతా వానర రాజులు. వీరితో భల్లూక రాజులు కూడా వచ్చారు.

11) ధూమ్రుడు – భల్లూక వీరుల అధిపతి

12) జాంబవంతుడు – దేవాసుర యుద్ధాలలో దేవగణాలకు సాయపడిన రాజు.

13) సన్నాదుడు (అగ్నికీ గంధర్వ కన్యకూ పట్టినవాడు)

14) కథనుడు (కుబేరుని విహార స్థలమైన జంబూకవనం నుంచి వచ్చాడట).

15) ప్రమాధి – ఉశీర బీజం అనే పర్వత ప్రాంతపు రాజు.

16) గోలాంగూలాధిపతి – కొండముచ్చుల రాజు. (కొండముచ్చు వారి జెండా లేదా చిహ్నం అయి ఉండాలి).

17) గవాక్షుడు : కోటి మంది వీరులకు నాయకుడు.

18) కేసరి : కాంచన పర్వతపు వానరుల రాజు. (హనుమంతుని తండ్రి?)

19) మైందుడు, 20) ద్వివిదుడు, 21) సుముఖుడు.

22) ద్విముఖుడు, 23) గవయుడు, 24) గవాక్షుడు

ప్రముఖులైన వీరు కాక అంగదుడు, శతబలి, సుషేణుడు, గజుడు, శరభుడు, గంధమాదనుడు, నీలుడు, నలుడు – ఋషభుడు, విజయుడు, శరారి, శరగుల్మ, సుహోత్రుడు, మారీచుడు, వినతుడు, రంహుడు, దుర్ముఖుడు, రుమణ్వంతుడు, తారుడు, దరిముఖుడు (రుమాదేవి తండ్రి), వహ్ని కుముదుడు, ఉల్కాముఖ, అసంగ మొ॥ పేర్లు చాలా ఉన్నాయి.

సుషేణుడు – వైద్యశాస్త్ర నిపుణుడు, తార తండ్రి, వరుణుని కొడుకు. ఒక దివ్యౌషధి ద్వారా వానరులకూ, లక్ష్మణునికీ యుద్ధంలో గుచ్చుకున్న బాణపు ములుకులు తీసివేశాడట. ఇది శస్త్ర విద్య (ఆపరేషన్ లాంటిదే).

జాంబవంతుడూ – వైద్య మూలికల ఉపయోగం తెలిసినవాడే, వానరులు గిరిజనులు కాబట్టి వన మూలికల గురించి వారికి కనీస పరిజ్ఞానం ఉంటుంది.

వానరులు అప్సరసలకూ, దేవతలకూ పుట్టినవారు. మైంద ద్వివిదులు అశ్వనీ దేవతల పుత్రులు. వాలి ఇంద్రుని కొడుకు. వాలిని తార 'ఆర్యపుత్రా' అని సంబోధించింది.

ఉల్కాముడు, అసంగుడు అనేవారు అగ్ని కొడుకులు. సుగ్రీవుడు ఋక్షరజస్సు కొడుకు. దధిముఖుడు చంద్రుని కొడుకు. జాంబవంతుడు గద్గదుని కొడుకు. బ్రహ్మ ఆవులించినప్పుడు పుట్టాడట. బలి చక్రవర్తి యాగంలో విష్ణువు త్రివిక్రముడైనప్పుడు అతనికి

21 సార్లు ప్రదక్షిణ చేశాడట. గజుడు, గవాక్షుడు, గంధమాదనుడు, గవయుడు, శరభుడు, యముని కొడుకులు. హనుమంతుడు అంజని కొడుకు. వీళ్ళందరికీ పూర్వ కథలున్నాయి.

మహేంద్రం, హిమవంతం, వింధ్య, కైలాసం, మందర అనే అయిదు పర్వతాల పరిసర రాజ్యాలు వానరులవే. పడమటి దిక్కులో అస్తగిరి వరకు ఉండే కొండ ప్రాంతాలు ఉదయ పర్వత ప్రాంతాలు, చందన తాటి వనాలు, అంజన, మేరు పర్వత పార్శ్వాలు, ధూమ్రగిరి, మహారుణ పర్వతం పరిసరాలు వానరుల రాజ్యాలు - అంటే గిరిజనుల రాజ్యాలు. వీరిలో చాలా తెగలున్నాయి కాని అందరినీ వానరులుగానే చెప్పారు. కిష్కింధ 37, 38, 39 సర్గలు అంతా వీరి వర్ణన ఉంది.

వానర సైన్య వివరాలు 40వ సర్గ. శతవలి మేరు పర్వతం నుంచి 10 కోట్ల మంది తెల్లని వారితో వచ్చాడట. సుషేణుడు (తారతండ్రి) అనేక కోట్ల మందితో ధూమ్రుడు రెండు వేలకోట్ల ఎలుగుబంట్లతో (ఆ చిహ్నం గల తెగవారితో) - గోలాంగూల (కొండ ముచ్చుల) రాజు (గోలాంగులం అంటే అవుతోక అనీ అర్థం ఉంది. వీరు అలాంటి కుచ్చుల గోచీ ధరించేవారై ఉంటారు) వెయ్యి కోట్ల మందితో వచ్చారు.

ప్రస్తుతం విశాఖపట్టణం సమీపంలోని అరకు మండలం పూర్వం వానర రాజ్యం లోనిదేనంటారు. బొర్రా గుహలలో రాముడు లక్ష్మణుడు కొంతకాలం గడిపారంటారు.

కర్ణాటకలోని హంపీ ప్రాంతాన్నీ వానర రాజ్యంగా గుర్తించారు. దక్షిణా పథంలో చాలా ప్రాంతాలు వానరుల పాలనలో ఉండేవి.

వానర వర్గాలలో చాలామంది సంచార జాతులు గనుక, రకరకాల దేశాలు వారికి తెలిసి ఉంటాయి. సీతను వెదకటానికి కొందరు వానర ముఖ్యులను నాలుగు దిక్కులకూ పంపుతూ సుగ్రీవుడు ఆయా దిక్కుల మార్గాలూ - అక్కడి నదులూ, రాజ్యాలూ, కొండలూ అన్నీ వారికి వివరంగా చెప్పాడు. రాముడు అతని భౌగోళిక పరిజ్ఞానం చూసి ఆశ్చర్య పోయాడట. "ఇవన్నీ నీకు ఎలా తెలిశాయి" అని అడిగాడు. అన్న వాలి, తనను తరుము కుంటూ వచ్చినప్పుడు అతని నుంచి పారిపోతూ అన్ని దిక్కులూ చూశానని సుగ్రీవుడు బదులు చెప్పాడు.

విదేశీ వర్తకుల వల్లా, సైనికుల వల్లా తెలుసుకున్న విశేషాలు కూడా చేర్చి రామాయణ కవులు ఈ ఘట్టాన్ని అత్యంత ఆసక్తితో వర్ణించారు. ఆరవ శతాబ్ది నాటికి చరిత్రకు తెలియవచ్చిన నగరాలూ, స్థలాలు, దుర్గాలూ ఈ వర్ణనలో చేరాయి.

కిష్కింధకు తూర్పున జంబూ ద్వీపం -, యవ (జావా), సువర్ణ రూప్యక, ప్లక్ష ద్వీపాలూ, భాగీరథి, సరయు, కౌశికి, యమున, సరస్వతి, సింధు శోణ నదులూ, శిశిర పర్వతం (దేవ, దానవుల స్థానం) లవణ సముద్రం దగ్గర శోణ నది రక్తవర్ణంగల నీటితో ఉంటుంది. (ఇది సిద్ధులు, చారణులు ఉండే ప్రాంతం), ఇక్షు సముద్రం (అసురుల ప్రాంతం), మధు సముద్రం, ఎర్రని నీటితో ఉంటుంది. (ఇది మందేహులనే రాక్షసుల

ప్రాంతం), క్షీర సముద్రం (తెల్లని నీటితో ఉంటుంది), సముద్రం మధ్యలో ఋషభ పర్వతం (ఇక్కడి సుదర్శన సరస్సులో దేవతలు, యక్షులు, కిన్నరులు, చారణులు, అప్సరసలు క్రీడిస్తారట) మంచినీటి సముద్రం (బడబాగ్ని దీనిలో ఉంటుంది). జగత్తును నాశనం చేయాల్సిన సమయాలలో ఇది ఎర్రగా అగ్ని జ్వాలలతో పైకిలేచి సముద్ర జలాలను మైళ్ళ దూరం విసిరి కొడుతుంది. ఈ తేజస్సు గుర్రం ముఖంతో ఉంటుంది. ఉప్పెనలలో ఇలాంటి దృశ్యాలు కనిపిస్తాయి. కనక పర్వతం 13 యోజనాల విస్తారంతో బంగారు రాళ్ళతో ఉంటుంది. అది నాగరాజు అనంతుని స్థానం. ఆ తర్వాతది ఉదయగిరి. (ఉదయగిరి బోయల దుర్గం) ఉదయగిరి దాని శిఖరాలలో ఒకటైన 'సౌమనసము' అనే దాని మీద త్రివిక్రమావతారంలో విష్ణువు తన పాదం మోపాడట. రెండో పాదం మేరు శిఖరం అయిన 'సౌవర్ణికము' మీద పెట్టాడట. (40వ సర్గ అంతా ఈ వివరాలున్నాయి).

కాలమహి, బ్రహ్మమాల, విదేహ, మాళవ, కోసల, మగధ, పుండ్ర, వంగ రాజ్యాలూ చెప్పాడు. ఉదయ పర్వతం, సుదర్శన ద్వీపం కూడా చెప్పాడు. "ఉదయగిరి తర్వాత అంతా చీకటి. మీరు వెళ్ళలేరు" అన్నాడు. మహేంద్ర పర్వతం దాటాక ఉండే రావణుని రాజ్యం గురించీ చెప్పాడు.

పురాణాలలో ప్రసక్తికి వచ్చే జాతుల గురించి ఇంకా అధ్యయనం చేయవలసి ఉంది.

భారతదేశంలోని కులాలూ, జాతులూ చెప్పుకుంటున్నంత స్వచ్ఛంగా లేవని జన్యు పరిశోధనలు తెలుపుతున్నాయి. ఆదిమ గిరిజన తెగల నుంచే, ప్రధానంగా రెండు తెగల నుంచే భారతీయ సమాజం రూపుదిద్దుకున్నదని అంటున్నారు.

రంగు కారణంగానో, మరొక కారణంగానో వేరుపడిన మానవ సముదాయాలను ప్రత్యేక గుర్తింపు పొందినప్పటికీ వాటిని ఇప్పటి కులాలుగా పరిగణించరాదని మానవ శాస్త్రవేత్తల అభిప్రాయం. వారి పరిశోధనల ప్రకారం ఉత్తర భారతీయులు ఐరోపా జాతులకు దగ్గరగానూ, దక్షిణ భారతీయులు ఒంగె గిరిజన తెగకు దగ్గరగానూ ఉన్నారట. 'ఒంగె' తెగ 6,5000 సంవత్సరాల క్రితం ఆఫ్రికా నుంచి వలస వచ్చిన ఆదిమ జాతుల మూలంగల తెగ. ఈ పరిశోధనలలో తేలిన మరో విషయం ఏమిటంటే ఆధునిక భారతీయులలో అధిక శాతం ప్రజలలో పై రెండు జాతులకు చెందిన జన్యువులూ కలిసే ఉన్నాయట. అందరిలోనూ ఎంతో కొంత రెండు రకాల జన్యు ఛాయలూ కనబడుతున్నాయట. దక్షిణ భారతదేశంలో కృష్ణా తుంగభద్ర లోయ సంస్కృతిలోనూ హరప్పా సంస్కృతి ఛాయలున్నాయి.

భారత జాతిలోని అంతస్సూత్రం ఇలా ఉండగా బాహ్యంగా వర్ణ కుల సమాజాలు ఎలా రూపుదిద్దుకున్నాయో, జాతి ఐక్యతను ఎలా దెబ్బతీస్తున్నాయో పరిశోధించవలసిన అంశం.

సామాజిక అసమానతలపై ఉద్యమాలు నడుస్తున్న ఈ రోజులలో గతంలో జరిగిన ఉద్యమాల చరిత్రను తెలుసుకోవటం అవసరం. అందుకు పురాణ కథలు ముఖ్యమైన ఆధారాలు. వీటికి చెందిన జానపద గాథలను కూడా పరిగణనలోకి తీసుకోవలసి ఉంది.

దేవాసుర సంగ్రామాల కథలు వాస్తవానికి ఆర్య, ఆర్యేతర జాతుల పోరాటాలు. ఈ పోరాటాలలో ఒక్కొక్కప్పుడు అర్య గణాలు, ఒక్కోసారి అసుర గణాలూ గెలుపు సాధిస్తూ ఉండేవి. రాజ్యాధికారమూ ఒక్కొక్కప్పుడు అసురులకూ దక్కుతూ ఉండేది. వర్తమాన కాలపు రాజకీయ పక్షాల వైరుధ్యాల వంటివే పురాణ కథలలో దేవాసురుల మధ్య గమనించటం ఆసక్తికరంగానే ఉంటుంది.

దేవగణాలూ, అసుర గణాలూ కూటమిగా ఏర్పడి పాలన సాగించిన కథలూ, దేవ గణాలు అనార్య రాజుల అధికారానికి తలవొగ్గి ఉన్న కథలూ పురాణాలలో ఉన్నాయి. ఏకపక్షంగా ప్రకృతి వనరులను తామే అనుభవించాలనుకోవటం, అవతలి వర్గానికి వాటా ఇవ్వక పోవటం అనేవే సాధారణంగా అసంతృప్తికి – రాజ్యాధికార పోరుకూ కారణాలవు తూంటాయి. సమష్టి కృషి ఫలితం ఒక వర్గానికే దక్కటం, సమష్టి సంపద ఒక వర్గానికే చేరటం అనే లక్షణాలతో ఉన్న వ్యవస్థను పురాణాలలో గుర్తించగలిగితే అవతారాల రహస్యాలూ వాటి వెనుక ఉన్న పాలకవర్గాల కుట్రలూ అర్థం అవుతాయి.

భాషనుబట్టీ స్వభావాన్నిబట్టీ గుణాలనుబట్టీ పరిగణించవలసిన ఆర్యత్వాన్ని జాతిపరంగా ప్రసిద్ధం చేయటానికి ఎన్నో ప్రయత్నాలు జరిగాయి – దానికి ఎన్నో సిద్ధాంతాలూ పుట్టు కొచ్చాయి. పురాణాలూ ప్రచారమయ్యాయి. ఆర్యులను ఒక పవిత్రమైన జాతిగా స్థిరపరచే ప్రయత్నంలోనే కులాలు ఏర్పడ్డాయి. తమకంటూ ఒక జీవన విధానాన్ని ఏర్పాటు చేసుకుని తమ వర్గాన్ని బయటి వారితో కలవకుండా చేసి వివాహ సంబంధాలు – భోజనాదికాలు తమలో తామే చేసుకుంటూ కులాలు ఏర్పరచారు. అందులోనూ మళ్ళీ హెచ్చుతగ్గులు వచ్చాయి. తాము ఏర్పరచిన నియమాలను ఉల్లంఘించిన వారికి శిక్షలు వేయటం – తమ సమాజం నుంచి – కులం నుంచి బహిష్కరించటం – తమ ప్రాంతాలకు దూరంగా పంపేయటం జరుగుతూ వచ్చింది.

పవిత్రత – అంటరానితనం – విద్య – వృత్తులు – ఇలానే స్థిరపడ్డాయి. బలవంతుల జీవన విధానమే మతంగా రూపుదిద్దుకున్నది. ఆ మతంలో ఎన్నో వైరుధ్యాలు – పూజించే దేవతలలో భేదాలు – పూజా విధానాలలో తేడాలు – తమ తమ గొప్పలను – బలా బలాలను నిరూపించుకునే క్రమంలో ఎన్ని మారణ హోమాలో జరిగాయి. సాహిత్యమూ పుట్టుకు వచ్చింది.

# యజ్ఞకర్మలు

ప్రాచీన మానవుడు ప్రకృతిలోని ప్రతి అంశాన్నీ నిశితంగా పరిశీలిస్తూ తన జ్ఞానాన్ని పెంపొందించుకుంటూ వచ్చాడు. రాత్రి, పగలు ఋతువులు, వర్షాలు, ఎండలు, చెట్లు చిగురించటం వంటి వానితోబాటుగా ఆకాశంలోని నక్షత్రాల వరుసలనూ, ఆకారాలనూ వాటి పరిక్రమణాన్నీ చలనాన్నీ అధ్యయనం చేస్తూ వచ్చాడు. వేదకాలపు ఆర్యులు తమ యజ్ఞకర్మలకు ఆకాశంలోని నక్షత్ర గమనాలను స్ఫూర్తిగా తీసుకున్నారు. దూర ప్రాంతాల నుండి ప్రయాణిస్తూ వచ్చిన ఆర్యజాతులు గాని స్థానికంగా ఉన్న మూల వాసులు గాని నక్షత్రాలను పరిశీలించే క్రమంలో తమకు పరిచయమైన జంతువుల ఆకారాలలో వాటిని గుర్తుపెట్టుకున్నారు. మీనం, మేషం, వృషభం, సింహం వంటివి ఇలా స్థిరపడిన పేర్లే. ప్రపంచవ్యాప్తంగా బాబిలోనియన్లు, సుమేరియన్లు, పార్ధీనియన్లు, సెమైట్లు, మొదలైన వారంతా ఇలాంటి ఊహలు చేశారు. టైగ్రిస్, యూఫ్రటిస్ నదుల మధ్య నివసించే ప్రజలు ఈ కల్పనలో ముందంజ వేశారు.

సముద్ర దేవుడు, దేవత, నదీ దేవతలు, ఆకాశ దేవతలు, వనదేవతలు కథల లాగానే నక్షత్ర రాశులకు మూర్తీకరణం చేశారు. తమకు పరిచితమైన ఆకారాలలో రూపాలు కల్పించుకున్నారు. వాటిని గురించి కథలు చెప్పుకున్నారు. వేద కాలంలో ఒక నక్షత్రరాశిని అజము (మేక) అనేవారు. అది క్రమంగా మకరరాశి అయింది. ఈ మేక పూషుడు అనే దేవునికి రథాశ్వం, వాహనమూను. ఋగ్వేదంలో దీని ప్రస్తావన "అజాశ్వ పూషాయా..." (ix-67-10) ఉంది. ఆకాశంలో ముందుగా మేక చుక్కలు ఆ వెనుక భాద్రపదా నక్షత్ర రూపంగల గుఱ్ఱపు చుక్కలూ ఉదయిస్తాయి. ఈ క్రమాన్ని అనుసరించి యజ్ఞాలలో ముందర మేకను తర్వాత గుఱ్ఱాన్నీ నడిపిస్తారట. ఆ వెనకాల యాజ్ఞికులు వరసగా నడిచివస్తారట.

"ఏవచ్ఛాగ పురో విశ్వరూప" అనేది మంత్రం. "ఛాగము" అంటే మేక అని అర్థం – ఆ తర్వాత ఆ రాశిలోని జంతురూపం నడుము పైభాగం మేకగానూ కింది భాగం చేప రూపంగానూ ఉండటం గమనించి దానిని మకరం అన్నారు. ఈ విధంగా వాటి గమనాన్ని పరిశీలించుకుంటూ జ్ఞానాన్ని పెంపొందించుకున్నారు. యజ్ఞ క్రతువులు ఖగోళ దృశ్యాలకు (వారు గమనించిన తీరులో) అనుకరణలు అంటారు; డా. మహీధర నళినీ మోహన్. ఈ విధంగా ఆయన ఆధునికశాస్త్ర విజ్ఞానం సహాయంతో చాలా నక్షత్ర రాసుల గురించి వివరించారు.

ఆర్ద్రా నక్షత్రం రుద్ర (శివ) దైవతం. ఆర్ద్ర ఉదయించే వేళకు మూల, పూర్వాషాఢ నక్షత్రాలు అస్తమించాయి. ఇవి ధనూరాశి చుక్కలు. వీటికి మన్మధునితో, జలంతో సంబంధం ఉంది. ఆర్ద్ర ఎర్రగా మెరుస్తూ ఉంటుంది. దానిని శివుని మూడవ కన్నుగా

ఊహించారు. ఆ వెలుతురుకు ధనూరాశి చుక్కలు (మన్మధుడు) మసకబారటాన్ని శివుడు మన్మధుడిని భస్మం చేయటంగా చెప్పారంటారు ఆయన.

చాలా పురాణ కథలను ఇదే రీతిలో ఆయన విశ్లేషించారు. కన్యారాశి పక్కన వాయుదైవతం స్వాతి ఉన్నదనీ అందువల్ల కన్య మరుద్గణాలు (వాయు) ఏడుగురికి భార్య అయిందనీ పూర్వులు ఊహించారట. భారత కాలం నాటికి ఈమె పాండవుల భార్య అయింది. కన్యారాశిలో చిత్ర ముఖ్యమైన నక్షత్రం. ఇది సముజ్జ్వలంగా ఉంటుంది. ఈ కన్యారాశి మహాభారతంలోని ద్రౌపది అని గొబ్బూరి వేంకటానంద రాఘవరావుగారు నిరూపించినట్లు మహీధర వారు చెప్పారు.

ప్రకృతిని గురించిన ఊహలు, కల్పనా కథలు ఇలా ఉండగా వీటిని యదార్థాలుగా ప్రచారం చేస్తూ మూఢభక్తితో క్రతు కర్మలకు పూనుకోవటం - ప్రజలను అజ్ఞానంలో ఉంచి వారిపై అధికారం చలాయించటం పూర్వం జరిగింది. ఆధునిక యుగంలోనూ జరుగుతున్నది. గ్రహాల గురించీ సూర్యచంద్రుల గురించీ విజ్ఞానశాస్త్రం ఎన్నెన్నో ఆవిష్కరణలు చేస్తూ ఉండగా భారతీయులలో ఎక్కువ శాతం పురాతనమైన అశాస్త్రీయమైన నమ్మకాల లోనే ఉన్నారు.

ఆర్యుల యజ్ఞకర్మలు ఖగోళ దృశ్యాలకూ ఇతరేతర ప్రకృతి సంఘటనలకూ అనుకరణ. అసురులూ యజ్ఞాలు చేశారు. వారికీ పూజాదికాలు సంధ్యావందనం లాంటి దైనందిన కృత్యాలు ఉండేవి. జైన, బౌద్ధాల వెలుగులో వారు తమ క్రతు కర్మలలో కొన్ని మార్పులు చేసుకున్నారు. జైన, బౌద్ధాలను అంగీకరించని వైదిక మతానుయాయులు తమ పూర్వ విధానాలనే అనుసరించారు. అహింసా ధర్మాన్ని పాటించే అసురులు యజ్ఞక్రతువులలో జంతు హింసను నిరసించారు. మునుల యజ్ఞాలకు ఆటంకాలు కలిగించటం ఒక పనిగా పెట్టుకున్నారు.

## అసురులు యజ్ఞాలను ఎందుకు వ్యతిరేకించారు?

భారతీయ సంస్కృతిలో యజ్ఞ క్రతువుల గురించి గొప్పగా చెప్పుకుంటూ ఉంటారు. యజ్ఞాలు, ప్రజల శ్రేయస్సు కోసం జరిగేవి అనే చెప్పారు. అలాంటి యజ్ఞ క్రతువులకు రాక్షసులు ఎందుకు విఘ్నం కలిగించేవారో అనే సందేహం సామాన్యులకు కలగటం సహజం. యజ్ఞాలు చేసే వారి ప్రయోజనాలు రాక్షసుల ప్రయోజనాలను దెబ్బ తీసేవిగా ఉండేవా? వారి మధ్యగల సంబంధాలు ఎలాంటివి? అని ఆలోచిస్తే అవి ఈనాటి ప్రజల ప్రతిఘటనోద్యమాల లాంటివేనా అనే సందేహం కలుగుతుంది.

ఈనాడు పారిశ్రామికాభివృద్ధి పేరిట దేశాన్ని ప్రగతిపథంలో నడిపిస్తున్నామన్న ప్రచారంతో కార్పొరేట్ సంస్థలూ, పాలక వర్గాలూ కలిసి నిర్వహిస్తున్న రకరకాల యజ్ఞాలకు సమిధలుగా ఉపాధి భూములూ/సంపదా కోల్పోతూ ప్రతిఘటిస్తున్న ప్రజానీకం గురించి

వింటూ ఉంటే అలనాటి రాక్షసుల కథలు కళ్ళముందు కదలాడతాయి. అప్పుడూ ఇలాగే జరిగి ఉంటుందా?

ఆనాటి యజ్ఞాలు "గోబ్రాహ్మణ హితం" లక్ష్యంగా సాగాయి. వాటికి పాలకుల అండదండలున్నాయి. ఈనాడూ అదే పరిస్థితి. కార్పొరేట్ దిగ్గజాలు, పాలకవర్గమూ కలిసి స్థానికుల సామాజిక ఆస్తులను కొల్లగొట్టడంలో వర్గ ప్రయోజనాలు స్పష్టంగానే కనిపిస్తున్నాయి. రాక్షసులంటే స్థానిక ప్రజలే.

శతాబ్దాల కిందటి యజ్ఞాలలో వర్గ ప్రయోజనాలున్నాయా అని కొందరు ఆశ్చర్య పడవచ్చు. ఆ వివరాలు తెలుసుకునేందుకే ఈ పరిశీలన.

యజ్ఞ క్రతువుల నిర్వహణ భారతదేశంలో ఆర్యులతో ముడిపడి ఉంది. ఆర్యులు తొలి దశలోసంచార జీవులు. వీరికి స్థానిక జాతులతో తరచుగా ఘర్షణలు జరిగేవి. ఆ ఘర్షణలలో దేవగణాలు వీరికి సహకరిస్తుండేవి. ఆ కృతజ్ఞతతో ఆర్యులు దేవగణాలకు కానుకలు ఇస్తూండేవారు. కానుకలు అందజేసేందుకు యజ్ఞాలు సందర్భంగా ఉండేవి. యజ్ఞాలుచేస్తూ ఆ యజ్ఞాలలో లభించిన సంపదలో దేవగణాలకు భాగం ఇస్తుండేవారు. ఒక రకంగా ఇవి ముడుపులు. స్త్రీలూ/ధనమూ/ మద్యమూ ఈ ముడుపులలో చేరి ఉండేవి. ఈ సంపద స్థానిక జాతుల నుండి గ్రహించిన సంపద. బలవంతంగా తీసుకొన్నదే. తమ ఆధిక్యతను చూపుకోవటానికే ఆర్యులు యజ్ఞాలు చేశారు. శుద్ధి కార్యక్రమాలు చాలా తరచుగా చేస్తుండేవారు ప్రతి దానినీ శుద్ధిపరచడమే. మడి, మైల వంటి ఆచారాలతో తమను గొప్పగా నిరూపించుకోవటం వారి లక్ష్యం.

ఆర్యులలో ద్విజన్మల (ద్విజుల) గురించీ ఇక్కడ చెప్పుకోవాలి.

ఆర్యులు సముదాయాలుగా వలసలు సాగించినప్పుడు ఆ ప్రయాణాలలో ఆర్య స్త్రీలు తగినంతమంది పురుషుల వెంట రాలేని పరిస్థితి ఉండేది. ఆ క్రమంలో ఇక్కడికి వచ్చిన పురుషులు స్థానిక జాతుల స్త్రీలను వివాహం చేసుకోవటం, వారి ద్వారా కలిగిన సంతానానికి రక రకాల కర్మలు నిర్వహించి తమతో కలుపుకోవటం, ముఖ్యంగా పురుష సంతానానికి ఉపనయనాదులు చేసి 'ద్విజన్ములు'గా చెప్పుకోవటం జరిగింది. ఆ విధంగా తమను శ్రేష్ఠ వర్గంగా వారు ప్రచారం చేసుకున్నారు. పితృస్వామ్య వ్యవస్థ ఏర్పడింది. సంచార జీవులు గనుక సూర్యుడిని ప్రమాణంగా, ప్రధానంగా భావించేవారు. సూర్య నమస్కారాలు, నదీ స్నానాలు, సంధ్యావందనం, ఎప్పుడూ "నిప్పు"ను వెంట ఉంచుకోవటం (నిత్యాగ్నిహోత్రులు) మృత శరీరాలను పాతిపెట్టకుండా దహనం చేయటం వంటివి వారి అలవాట్లు అయ్యాయి.

వీరు ఎక్కడ ఆహారం దొరికితే అక్కడ ఉండేవారు. జంతువులను కాల్చి తినే కాలంలో కొన్నాళ్ళు అలాగే సాగినా ఆ మాంసాన్ని దేవతలకు నివేదించి తినటం (బిస్మిల్లా

చేయటం వంటిదే) మొదలుపెట్టారు. ఆ క్రమంలోనే యజ్ఞ క్రతువుల తతంగం మొదలయింది. దేవగణాల ప్రీతికోసమూ, తమకోసమూ క్రతువులు చేసేవారు.

పుట్టబోయే శిశువుకు చేసే క్రతు కర్మల దగ్గర్నుంచీ ప్రతిపనికీ జీవితాంతం ఏదో ఒక తతంగం ఉండేది.

ఆర్య ధర్మాలను క్రోడీకరించిన మనువు శ్రౌత ధర్మాలూ, గృహ్యా ధర్మాలూ చెప్పాడు. వీటిలో యజ్ఞాలు ప్రధానం. శ్రౌత ధర్మాలంటే శ్రుతులు చెప్పిన యజ్ఞ క్రతువులు. గృహ్యా ధర్మాలంటే గృహస్థు చేయవలసిన పనులు వీటిలో పంచమహాయజ్ఞాలున్నాయి. ఇవి కొంచెం సాత్వికమైనవి. శ్రౌత ధర్మాలలోని యజ్ఞక్రతువులు పశుహింస ప్రధానంగా గలవి.

రాముడు దండకలోని రాక్షసులను చంపుతున్నప్పటి రణరంగ దృశ్యాన్ని వాల్మీకి యజ్ఞభూమితో పోల్చి చెప్పాడు. (అరణ్య - 27వ సర్గ). ఒక వేటగాడు వృత్తిధర్మంగా ఒక పక్షిని చంపితే దుఃఖించిన వాల్మీకి మహర్షి - రక్తపు మడుగులతో, తెగిపడిన అవయవాలత్తో, నేలంతా పరచుకొన్న కేశాలతో ఉన్న జుగుప్సాకరమైన యుద్ధభూమిని పవిత్ర కర్మగా భావించే యజ్ఞ భూమితో పోల్చటం ఆలోచించదగ్గదే. ఇలాంటి హింసాత్మకమైన యజ్ఞాలను అసురులు అడ్డుకున్నారు.ఎక్కడ పశువులు ఎక్కువగా కనబడితే అక్కడ యజ్ఞాలు చేసెయ్యటం ఆర్యుల అలవాటు.

ఆర్యమునుల యజ్ఞాలు సాధారణంగా అసురుల భూములలోనే జరుగుతుండేవి. ఇందులో దురాక్రమణ కూడా కలిసి ఉంది. భూమి యాజమాన్య హక్కు స్పర్థలకు దారితీసేది. భూమిపై హక్కు ఎవరిది? అంటే పాలకవర్గాలదే అనేవారు కొందరు. కాదు, బ్రాహ్మణ పురోహితులది అనేవారు కొందరు. బ్రాహ్మణ క్షత్రియ వివాదాలుగా వీటిని చరిత్రకారులు చెబుతుంటారు. అవి రాక్షస రాజులకూ ఆర్య బ్రాహ్మణ పురోహితులకూ జరిగిన ఘర్షణలతోనే ఆరంభమై ఉండాలి.

అతి ప్రాచీన కాలంలో దక్షిణాపథంలోని స్థానికులను ముఖ్యంగా ఆంధ్రులను 'రాక్షసులు'గా వ్యవహరించారు. తమ సంస్కృతిని రక్షించుకోవటానికి ఆర్యులతో ఘర్షణపడ్డారు గనక వీరిని ఆర్యులు రాక్షసులుగా పేర్కొన్నారు. వీరి భావజాలం జైన, బౌద్ధ ధర్మాలకు ప్రాతిపదిక అయింది. అందువల్లనూ రాక్షసులు యజ్ఞహింసకు వ్యతిరేకులు అయ్యారు.

యజ్ఞాలను అడ్డుకున్న రాక్షసులను ఆర్య మునులు శాపాల పేరిట శిక్షలకు గురి చేశారు. మునులకు ఆర్య రాజులు మద్దతు పలికారు.(చూ. తాటక వధ)

పాలకుల దమననీతిని ప్రశ్నిస్తున్న వారంతా దుర్మార్గులనీ వారిని అణచివేయాలనీ చట్టాలు చేస్తూ వారి భూములకే వారిని పరాయివారుగా చేస్తున్న ఈ రాజనీతి శతాబ్దాల నాటిది.

అసురుల హోమాలు సాత్వికమైనవి. ఆయుర్వేదం/వృక్షాయుర్వేదం వంటి పద్ధతులు పశుసంపదనూ, వృక్షసంపదనూ పెంచే విధానాలతో ఉండేవి. పైశాచీ పాళీ భాషలలో అలాంటి వాఙ్మయం ఉండవచ్చును. అరణ్యాలను దహించటం ద్వారా అరణ్య భూములను సారవంతం చేయటం అనేది స్థానిక సంప్రదాయం. ఇప్పటికీ చెరకు తోటల సాగులో ఆ పద్ధతి కనిపిస్తుంది. భారతంలోని "ఖాండవవన దహనం" ఆరోగ్యం కోసం జరిగినట్లుగా చెప్పారు. వాతావరణ కాలుష్యాన్ని ఎప్పటి కప్పుడు నివారించే ప్రక్రియలుగా ఇవి కనబడతాయి. కాగా ఆర్య పురోహితుల క్రతు కర్మలు ఇందుకు భిన్నమైనవి. వ్యవసాయానికి అవసరమయ్యే పశుసంపదను స్థానికులు కాపాడుకునేవారు. యజ్ఞ యాగాలలో పశు సంపద నాశనమవటం స్థానిక ప్రజలకు నచ్చేది కాదు. హోమ విధానాలూ నచ్చేవికావు. ఆర్యమునుల ఆశ్రమాలు అరణ్య భూములలో ఉండటంవల్ల ఆశ్రమ పరిసరాలలోనే యజ్ఞ క్రతువులు నిర్వహించేవారు. ఒకచోట యజ్ఞం జరుగుతున్నదీ అంటే పరిసర రాజ్యాలలోని పురోహితవర్గమూ, మునుల సముదాయాలూ అక్కడకు చేరుకుని నెలల తరబడి అక్కడే ఉండి రకరకాల చర్చలతో కాలక్షేపం చేస్తుండేవారు. అంతమందికీ భోజన సామగ్రి – ఇతర సౌకర్యాలు చూడవలసిన భారం చుట్టుపక్కల ఉన్న స్థానిక తెగల మీదనే పడేది. వారి నుంచే యజ్ఞ సామగ్రి బలవంతంగా సేకరించేవారు. గోమాంసం ప్రాచీన ఆర్యుల ముఖ్యాహారం. అందుకోసం వారు ప్రత్యేకంగా 'గోమేధం' అనే యజ్ఞమూ చేసే వారు. అందులో వధించవలసిన ఆవులకు ఎలాంటి లక్షణాలుండాలో కూడా శాస్త్రాలుగా రాసి పెట్టారు. సలక్షణమైన వాటిని స్థానిక జాతులనుండే పట్టుకుపోయేవారు. యజ్ఞ పశువులను ఎలా పట్టుకోవాలో, ఎక్కడెక్కడ వంచాలో, ఏ అవయవం ఏ దిక్కుకు ఉండాలో, వాటిని పరలోకానికి ఎలా పంపాలో అన్నీ స్పష్టంగా పద్ధతిగా శాస్త్ర గ్రంథాలు చెప్పాయి. సాధారణంగా పశువును 36 ముక్కలుగా చేసేవారు. ఏ భాగం ఎక్కడి నుంచి ఎంతవరకు కొయ్యాలో ఏ ఆకారంలో కొయ్యాలో ఏయే భాగాలు ఎవరెవరికి ఇవ్వాలో అంతా ఒక పద్ధతి ప్రకారం జరిగేది. యజ్ఞ కర్మలలో పాల్గొన్న పురోహిత వర్గానికి దేవగణాలకూ భాగాలు పంచేవారు.

గోమేధం గురించి శబ్దకల్ప ద్రుమం ఇలా చెప్పింది. "గోవు" అంటే ఆవు. ఎద్దు కాదు; మేక కాదు, గుర్రంకాదు. ఆవులను హోమంచేసే యజ్ఞం గోమేధం". ఈ యజ్ఞంలో అన్ని శుభలక్షణాలు కలిగిన ఆవులనే ఎంచుకుని హోమం చేసేవారు. దానిని ఎలా హోమం చేయాలో ఐతరేయ బ్రాహ్మణం వివరంగా చెప్పింది. పశువు కాళ్ళు దక్షిణ దిశకు మడవాలి. కళ్ళు సూర్యునివైపు ఉండాలి. నేలమీద పరుండబెట్టి దాని ప్రాణాలు పంచభూతాలలో కలిసిపోయే లాగ వధించాలి. మేకలను ఇతర పశువులనూ వధించే పద్ధతీ ఇదే. యజ్ఞాలలో మరణించిన ఆవు "గోలోకం" చేరుతుంది. యజమానుడు (యజ్ఞకర్త) స్వర్గంలో స్థానం సంపాదించుకుంటాడు. అక్కడ సీటు గారంటీ.

మొదట్లో ప్రత్యక్షంగా దేవగణాల ప్రీతి కోసమే చేసిన యజ్ఞాలు అనంతర కాలంలో సంప్రదాయాలుగా ఆచారాలుగా స్థిరపడ్డాయి. ఆయా దేవగణాల పేరిట పురోహిత జనాలే యజ్ఞాలవల్ల ప్రయోజనాలు పొందుతూ వచ్చారు. యజ్ఞాలను కాదన్న వారిని శపించటం – చంపటమూ కూడా చేసేవారు. యజ్ఞ క్రతువులను అడ్డు కున్నందుకే సుందుడు అనే యక్షుడు అగస్త్యుని శాపానికి గురై మరణించాడు.

కాలక్రమంలో గోవుల స్థానంలో ఇతర పశువులు చేరాయి. పశువులను వధించే కార్యక్రమం హింసాత్మకమూ, జుగుప్సాకరమూను. గోవు/పశువు చర్మం ఎక్కడా తెగిపోకుండా వొలిచేవారట. ఆ పశువు ప్రాణాలతో ఉండగానే చర్మం ఒలిచేవారా? అందువల్లనే "చర్మం వొలుస్తా", "తాట తీస్తా", "తోలుతీసి డోలు కడతాం", "ఒళ్ళు చీరేస్తా" లాంటి పలుకు బడులు భాషలో జనజీవనంలో చోటు చేసుకున్నాయా అనేది ఆలోచించాల్సిన అంశం.

యజ్ఞాలలో ముఖ్యమైనది హోమం చేసే విధానం. హోమంలో ప్రధానమైనది అగ్నిహోత్రం. అగ్నిహోత్రం రాజెయ్యటం – ప్రత్యేకమైన సమిధలు – హోమద్రవ్యాలువేస్తూ మంత్రాలు చదువుతూ అగ్ని ప్రజ్వలించేలా చూడటం వంటివన్నీ వాతావరణ కాలుష్యాన్ని పోగొట్టటానికే. హోమంతో పైరులను కాపాడటం అనేది అసురుల పద్ధతి. ఆధునిక శాస్త్ర పరిశోధనలలో ఇది రుజువైంది. ఆర్యుల రాకకు ముందు భారతదేశంలో ఇలాంటి హోమాలు ఉండేవి – వేద విజ్ఞానమూ ఉండేది. స్థానికుల హోమ విధానాలలోనే ఆర్య పురోహితులు మార్పులుచేసి జంతుహింసను ప్రవేశపెట్టి అవి తమ ప్రత్యేకతలుగా చెప్పుకున్నారనిపిస్తుంది. స్థానికులైన నాగ/యక్ష జాతుల హోమాలు విశ్వ కల్యాణం కోసం జరుగుతుండేవి. ఆర్యుల యజ్ఞాలు వ్యక్తిగత ప్రయోజనాలకు పరిమితమయ్యాయి. నైమిశారణ్యం వంటి అటవీ ప్రాంతాలలో మునులు సత్రయాగాలు (అందరూ కలిసి చేసేవి) చేయటం – దేశదేశాల వృత్తాంతాలు – కబుర్లు కలబోసుకోవటం పురాణాలలో కనిపిస్తుంది. పురాణాలలోని కథలన్నీ ఆ సందర్భాలలో సూతుడో, శౌనకుడో వినిపించిన కథలే.

ఆర్య రాజుల యాగాలన్నీ స్వప్రయోజనాలకే. సంతానం కోసమో – ఇతర రాజులను జయించటం కోసమో – పదిమందిలో తమ గొప్పతనం ప్రదర్శించుకోవటం కోసమో జరిగేవి. చాలా యజ్ఞాలు జంతుహింసతోనూ అసభ్య/అశ్లీల కామ కలాపాలతోనూ నిండి ఉండటం పూర్వ సాహిత్యంలో కనిపిస్తుంది.

దండకలో స్థానికులైన మతంగ మహర్షి వంటివారు చేసిన హోమాలకూ, ఆర్యమునులు రాజులచేత చేయించిన హోమాలకూ, వానర రాక్షస నగరాలలో జరిగే హోమాలకూ చాలా తేడా ఉంది. భారతదేశ సంస్కృతిని గురించిన అధ్యయనాలలో ఈ కోణంలో పరిశోధనలు జరగవలసి ఉంది.

యజ్ఞ క్రతువులలో దేవతలకు ఇచ్చే వాటాలన్నీ అగ్ని ద్వారా దేవతలకు చేరతాయని నమ్మేవారు. వారి వారి కానుకలన్నీ అగ్ని భద్రంగా చేరవేసేవాడు. అతని రథానికి ఏడు గుర్రాలట. ఇది సూర్యుని రథానికి ప్రతిరూపమే. సూర్యుని రథానికీ ఏడు గుర్రాలే. ఇది సూర్యారాధననూ ఇముడ్చుకున్న పద్ధతి. ఆర్యులు సూర్యారాధకులు.

ఆర్యుల యజ్ఞకర్మలను ఋగ్వేదమూ, సంహితలూ, బ్రాహ్మణాలూ రకరకాలుగా వివరించాయి. ఆచరణకు వచ్చేసరికి ఎవరికివారు ఆ విధానాలను తమకు అనువుగా మలచుకున్నారు. అవి గొప్ప శాస్త్ర విధులు అయ్యాయి.

తొలిదశలో ఆర్యులు చేసిన యజ్ఞాలలో 1) వాజపేయం, 2) అశ్వమేధం, 3) రాజసూయం ఎక్కువగా కనిపిస్తున్నాయి. ఇవి ఆహారానికీ, సంతానోత్పత్తికీ అధికార విస్తరణకూ ఉద్దేశించిన క్రతువులు.

యజ్ఞాల నిర్వహణలో యజ్ఞం చేసేవారిని యజమాని అనేవారు. యజ్ఞ నిర్వహణకు కావలసిన ఏర్పాట్లు చేసేవారిని, వారి వారి అర్హతలను బట్టి వర్గీకరించి బాధ్యతలు అప్పగించే వారు. యజ్ఞ నిర్వహణలో మంత్రాలు చదివేవారూ, హోమం రగిల్చేవారూ, హోమద్రవ్యం సమకూర్చేవారూ, హోమ ద్రవ్యాన్ని మంటల్లో వేసేవారూ చాలామంది ఉండేవారు.వీరు గోబ్రాహ్మణులు.

బలి పశువులను తెచ్చేవారూ, వధించేవారూ ఉండేవారు. సోమం (కల్లు) సరఫరా చేసేవారూ, దాన్ని రకరకాల దినుసులతో పానీయాలుగా తయారు చేసేవారూ ఉండేవారు. అతిథుల సదుపాయాలకూ, వంటలకూ, సంతర్పణలకూ కావలసిన సామగ్రి స్థానికుల నుండే రాబట్టేవారు. (ఊళ్ళోకి అధికారులు ఎవరైనా వస్తే వారి కోసం గ్రామస్తుల నుండి మంచి వస్తువులూ, సరుకులూ బలవంతాన లాక్కుపోయే వ్యవస్థ ఇప్పటికీ ఉంది.)

సేవలన్నీ కిందివర్గాల వారి చేతనే చేయించుకునేవారు. ఇప్పటికీ పెళ్ళి మంత్రాల లోనూ ఇతర సందర్భాలలోనూ పురోహితులు చదివే శ్లోకాలలో "గో బ్రాహ్మణ హితార్థాయ" – "యాజమానా" వంటి పదాలు పదే పదే వినిపిస్తుంటాయి. గౌరవంగా చూడవలసిన యజమాని వర్గమూ, హితం పొందవలసిన గోబ్రాహ్మణ వర్గమూ, సేవకవర్గమూ, చర్మకారులూ ఏర్పడటానికి యజ్ఞాలు దోహదం చేశాయి. సుఖపడే వర్గాలూ, శ్రమచేసే వర్గాలూ ఏర్పడటానికి దారి చూపాయి. సేవలు చేసే వర్గాలు తమ బాధ్యతలు పంచుకుంటూ మరిన్ని శాఖలుగా వృత్తిపనులు చేసేవారిగా నైపుణ్యాలు సంతరించుకుంటూ రూపొందటం తప్పనిసరి అయింది.

యజమాని సేవక సంబంధాలు వ్యవస్థీకృతమై వంశపారంపర్యంగా బలపడుతున్న కాలంలో తిరుగుబాట్లు జరిగాయి. సమధర్మం, సమన్యాయం జీవనశైలిగా ఉండే స్థానిక సముదాయాలు ఆర్యుల యజ్ఞక్రతువులను అడ్డుకున్నాయి. వారి యజ్ఞాలు భంగం చేయటం – ఒక కార్యక్రమంగా పెట్టుకున్నాయి. అవి ఇప్పటి ధర్నాల లాంటివే కావచ్చు.

యజ్ఞాలవల్ల పురోహితవర్గం బలపడింది. వారి వేదాలకు, జ్ఞానానికి ప్రాధాన్యం వచ్చింది. స్థానిక జాతులు ఆధిపత్య వర్గాల .అధికారానికి తలవంచవలసి వచ్చింది. ఆ వర్గాల వారికి కావలసిన వస్తువులు ఉత్పత్తిచేస్తూ వృత్తిపనులతోనే కాలం గడపవలసి వచ్చింది. యజ్ఞాలను నిరసించిన వారూ గో బ్రాహ్మణుల ఆధిపత్యాన్ని సహించని వారూ ఆర్య సమాజానికి శత్రువులయ్యారు. ఆర్యులు వారిని "రాక్షసులు"గా ముద్రవేసి చంపటం మొదలయింది. ఇందుకు సంబంధించిన సమాచారం "వాల్మీకి" అందించాడు. యక్షులూ, నాగులూ 'యజ్ఞ విరోధులు' అనీ, వారిని చంపితే తప్ప గో బ్రాహ్మణ హితం జరగదనీ దేశం సుఖం కోసం అలాంటి వారిని చంపవలసిందేననీ సిద్ధాంతీకరించి ఆర్యమునులూ, పురోహితులూ వారిని చంపించారు. ఈ చర్యలను సంప్రదాయ రక్షణగా సమాజంచేత ఆమోదింపజేశారు. పదిమంది కోసం పనులు చేస్తున్నట్లు కనిపిస్తూ ఆధిపత్య వర్గాల ప్రయోజనాలు మాత్రమే కాపాడే వ్యవస్థ ఏర్పడింది. పాలక శ్రేణులు వైదికమతంలోనూ వృత్తివర్గాలు వైదికేతర మతాలలోనూ కొనసాగటం చరిత్రలో కనిపిస్తుంది. ఆత్మజ్ఞానం - భక్తి కర్మ మార్గాలు, నీతి వర్తనం వంటివి బోధించి జైన, బౌద్ధధర్మాలు దిగువ వర్గాలకు దగ్గరయ్యాయి. వేదాలను, కర్మకాండనూ ప్రశ్నించటం మొదలయింది. పితృ దేవతలకు పెట్టే శ్రాద్ధ కర్మల గురించి పురోహిత బ్రాహ్మణ వర్గాలు గొప్పగా చెప్పుకున్నాయి. శ్రాద్ధంలో భూలోకంలోపెట్టే ఆహారపదార్థాలు మరణించిన వారి బంధువులకు ఎలా చేరతాయనేది హేతువాదుల ప్రశ్న.

మనిషి పుట్టేటప్పుడే అనేక రుణాలతో పుడతాడట. అందులో పితృరుణం తీర్చుకోవాలంటే సంతానాన్ని పొందాలి. ఈ సంతానం పైలోకాలలోని పితరులకు శ్రాద్ధ కర్మలుచేస్తూ వారికి ఆహార పదార్థాలు యజ్ఞాల ద్వారా చేరవేయవలసి ఉంటుంది. సంతానం తన తలిదండ్రులనూ పరలోకాన్ని చేరిన పూర్వీకులనూ కూడా పోషించాల్సి ఉండేదన్న మాట. సంతానం పొందటం అనే ఈ మూడో రుణాన్ని విధిగా అందరూ తీర్చుకోవలసిందే అన్నారు. ఇదొక బాధ్యతగా చేశారు.

యజ్ఞాలనేవి శుద్ధి కర్మలుగా మొదలయ్యాయి. అపరిశుభ్రంగా భావించ బడే వస్తువులు ముట్టుకొన్నప్పుడు శుద్ధి కోసం కొన్ని కొన్ని పనులు చేయాలన్నారు. అవి ముట్టుకుంటే మైలపడతామనే భావన తర్వాత వచ్చింది. ఆ వస్తువుల జాబితా ఆశ్చర్యకరంగా, ఉంటుంది. (1) చీపురు, (2) జల్లెడ, (3) చేట, (4) కుండ, (5) రోలు, రుబ్బు రోలు/ పచ్చడి నూరుకునే బండ. ఈ అయిదూ ముట్టుకుంటే మైలపడతారట. ఆ మైల పోవడానికి పంచ మహాయజ్ఞాలు చేయాలన్నారు. ఈ వస్తువులు వాడాక చేతులు శుభ్రంగా కడుక్కోవా లన్నదే అక్కడి అంతరార్థం. ఇది ఆరోగ్య సూత్రమే తప్ప వేరు కాదు. పైవస్తువులు నిత్య జీవితంలో వాడే వస్తువులు. కొన్ని గిరిజన సముదాయాలకు పై అయిదూ పవిత్ర వస్తువులు. సోదె జెప్పే గిరిజన స్త్రీలకు అవసరమైన వస్తువులు.

కాలక్రమంలో వీటికి దేవ, పితృ, భూత, మనుష్య, బ్రహ్మ యజ్ఞాలుగా నామకరణం చేశారు. వాటికి ఒక పద్ధతి జోడించారు. ఆయా పనులు ఎందుకు ఎలా చేయాలో చెప్పారు. దేవతా తృప్తికోసం హోమమూ, పితృదేవతల కోసం బ్రాహ్మణులకు భోజనం పెట్టటమూ, భూతయజ్ఞంలో పశువులు/జంతువుల కోసం తాను తినే భోజనంలో ఒక ముద్ద పక్కకుపెట్టి వాటికి వేయటమూ మనుష్య యజ్ఞంగా అతిథులకు భోజనం పెట్టటమూ చేయాలన్నారు. అయిదోదైన బ్రహ్మయజ్ఞంలో భాగంగా రోజూ ఒక ఋక్కు వేద సూత్రం పఠించాలన్నారు. పఠించటం ద్వారా నేర్చుకోవటాన్ని ప్రోత్సహించారు. వీటిని అందరికీ కాకుండా కొన్ని వర్గాలకే పరిమితం చేయటమూ, అవి కొన్ని వర్గాల ప్రయోజనాలను కాపాడటమూ ఇక్కడ గమనించవలసిన అంశాలు.

ఆర్యుల యజ్ఞ క్రతువులలో పాప పరిహారార్థం చేసేవి కొన్ని. ప్రత్యేక ప్రయోజనాల కోసం చేసేవి కొన్ని. శత్రువులను బాధించే లక్ష్యంతో చేసేవి కొన్ని. యజ్ఞాలలో సమర్పించే హోమద్రవ్యం సురులకే చెందాలనేది ఆర్యరాజుల నియమం. అది ఆర్యులకూ, సురులకూ ఉన్న ఒప్పందాలలో ఒకటి.

హోమకర్త సాధారణంగా ఏడుగురు పురోహితులను పెట్టుకునేవాడు. ఈ ఏడుగురూ ఏడుగురు సూర్యులను రక్షించే మంత్రాలు చదువుతారు. ఇంద్రుడు ఒక ప్రజాపతి. అతని నుంచి ఏడుగురు మునులు పుట్టారనేది ఒక వాదం. వీరిని రక్షించాలని కోరే మంత్రాలు చదవటం కొంత తతంగం అయ్యాక హోమద్రవ్యాల సమర్పణ – గోబ్రాహ్మణులకు సంతర్పణలు జరిగేవి. ఈ విధానాలన్నీ నేటి భూ, జల యజ్ఞాలకు పూర్వరూపాలు. ఒప్పందాలూ, సంతకాలూ, తమ వారికి సంతర్పణలూ ప్రధానాంశాలు. అవి జరిగే తంతు సుదీర్ఘమైనది.

అన్ని యజ్ఞాలలోనూ స్త్రీలు శారీరకంగా, మానసికంగా హింసకు గురి అయ్యారు. స్త్రీలు యజ్ఞాశ్వాల దగ్గర గడపటం అనే హీనమైన ఆచారం ఉండేది. దాని తాలూకు మంత్రాలూ జుగుప్సాకరమైనవి. యజ్ఞం పూర్తి అయ్యాక యజ్ఞం చేయించిన ముఖ్య పురోహితులకు (హోత ఉద్గాత మొ॥ వారికి) భార్యలను దక్షిణగా ఇవ్వటం, ఆ తర్వాత ఎంతో కొంత 'ఓలి' ఇచ్చి వారిని విడిపించుకోవటం ఉండేది.

అశ్వాలు ఆర్యుల సంస్కృతి. అశ్వజాతి లక్షల సంవత్సరాల నాటిది. యురేషియాలో చలిని తట్టుకోలేక ఉష్ణ ప్రాంతాలను అన్వేషిస్తూ, అవి ఇతర ప్రాంతాలకు విస్తరించాయట. సౌదీ అరేబియాలో 'అసిర్' రాష్ట్రంలో అల్ ముఖురీ ప్రాంతంలో జరిపిన తవ్వకాలలో అశ్వాల గురించిన ఆధారాలు లభించాయట, అశ్వమేధాల సంస్కృతి ఆర్య సంబంధమైనదే.

అశ్వమేధ యాగం సాధారణంగా చేసే యజ్ఞం. పుత్ర కామేష్టికి ముందు కూడా దీనిని చేయవలసి ఉండేది. మూడు రోజులపాటు విధిగా 21 ఆవులనూ, గుర్రాలనూ, ఎద్దులనూ బలి ఇచ్చేవారు. 'బలి' అంటే దేవతకు ఇచ్చే సుంకం. ఎద్దులు 600 వరకూ

అంటే రోజుకు 200 చొప్పున బలి అయ్యేవి. ఆ కళేబరాల చుట్టూ రాణులు ప్రదక్షిణలూ పూజలూ చేయవలసి ఉండేది. తర్వాతనే ఆ మాంసం వాడేవారు. గుర్రంతో పట్టపురాణి రాత్రంతా గడపవలసి వచ్చేది. ఇవి సంతానోత్పత్తి కోసం స్త్రీలకు చేసే వాజీకరణ ప్రక్రియలు (ఆధునిక శస్త్రచికిత్సల వంటివి) అని ఎంత సరిపెట్టుకున్నా, ఈ ప్రక్రియ ఆటవికమైనదే. స్త్రీని సంతాన సాధనంగా చూసే సంస్కృతి దీనిలో ప్రస్ఫుటమవుతున్నది. రామాయణం ప్రకారం దశరథుడు పుత్రకామేష్టి చేసేముందు అశ్వమేధంలో కౌసల్య యాగాశ్వాన్ని పూజించి దాని గుండెపై మూడు నాట్లు పెట్టింది. రాత్రంతా గుర్రం దగ్గరే గడిపింది. యాగం ముగిశాక దశరథుడు రాజ్యమంతా ఋత్విక్కులకు ధారపోశాడు. వారు ఆ రాజ్యం తిరిగి అతనికే ఇచ్చారు. అందుకుగాను వారికి పది లక్షల ఆవులు, నూరు కోట్ల విలువగల బంగారం, నాలుగు వందలకోట్ల వెండి ఇచ్చాడు. ఇతర రాజ్యాల నుంచి వచ్చిన బ్రాహ్మణులకు కోటి సువర్ణాలు ఇచ్చాడు. చివరికి ఒకాయన వస్తే తన చేతి కడియం ఇచ్చాడు. (బాలకాండ) ఇది అశ్వమేధం సంగతి. పుత్రకామేష్టి తర్వాతనూ మరిన్ని దానాలు జరిగాయి.

'అతిరాత్రం' అనే క్రతువు పన్నెండు రోజులు సాగేది. ప్రధాన ఋత్విక్కులు - సహాయక బృందం - రకరకాల హోదాలలో పనిచేసేవారు. యాగశాల నిర్మాణం, యాగ పశువులను చూసుకోవటం - బలిపీఠం నిర్మాణం మొదలైన పనులలో రకరకాల పద్ధతులు వారు స్వయంగా వారి సౌకర్యం కోసం చెప్పుకున్నవే. యాగశాలను దున్నటం, విత్తనాలు చల్లిన కుండను పాతిపెట్టటం వంటివీ, సమిధలతో నిప్పురాజేయటం. యాగపశువును చంపటం, కాల్చటం వంటి అన్ని పనులూ ఒక పద్ధతి ప్రకారం చేసేవారు. వాటిని ఏమాత్రం ఉల్లంఘించినా కోప్పడటం/శపించటం జరిగేది. ఆర్య పురోహితుల నిరంకుశత్వం కఠినంగానే ఉండేది. వారి విధానాలే అనంతర కాలపు పూజా విధానాలకు మార్గదర్శకం అయ్యాయి. కొబ్బరికాయ ఎలా పట్టుకోవాలి, హారతి ఎన్నిసార్లు ఎటు నుంచి ఎటు తిప్పాలి అనేవన్నీ అనుకరణలే.

ఏదేనా ముందు సురులకు ఇవ్వటం అనవాయితీ. పర్వదినాలలో (పండుగల సందర్భాలలో) మరీ తప్పనిసరి. ముందు ఇచ్చేవి 'పురోడాశం'.

"రాముని రాజ్యాన్ని కైకకు ఇవ్వటం, పర్వకాలంలో దేవతలకు ఇవ్వవలసిన పురోడాశాన్ని రాక్షసులకు ఇచ్చినట్టుంది" అని కౌసల్య దశరథుని నిందించింది. (అయో 43-5).

యజ్ఞాల గురించీ సోమపానం గురించీ హవిస్సు గురించీ వర్ణధర్మాల గురించీ రామాయణం చాలాచోట్ల ప్రస్తావించింది. అనుష్ఠానం, జాత్యాచారం, ప్రేతకర్మలు, శ్రాద్ధ కర్మలు చెప్పారు. వీటిలో హేతువుకు అందనివి చాలా ఉన్నాయి.

యజ్ఞవేది పవిత్రమైనదనీ చండాలుడు తాకరానిదనీ చెప్పారు. "ద్విజాతి (బ్రాహ్మణులు) మంత్రాలచేత పూజోపకరణాల చేత స్రుక్‌భాండాల చేత యజ్ఞవేది పవిత్రంగా చేయబడుతుంది. దానిని చండాలురు తాకరాదు. అలాగే నీవు నన్ను తాక కూడదు" అని సీత రావణునితో అన్నది (అరణ్య 56-18). (స్రుక్ భాండాలు అంటే యజ్ఞ పశువుల రక్తం నింపిన కుండలు).

యజ్ఞాలలో చంపిన గుర్రాన్ని 'క్షత్ర' అనీ, ఇతర పశువులను 'విసు' అనీ అనేవారు. ఆ సందర్భంగా ఇచ్చే బహుమతుల వల్లనో ఏమో ఆ పేర్లు ఆయా జాతి సూచకాలయ్యాయి.

పాశ్చాత్య వర్తకులు, ముఖ్యంగా పోర్చుగీసు వర్తకులు, ఇండియాలోని భిన్న సముదాయాలను పేర్కొనేటప్పుడు పాలక, వాణిజ్య, పురోహిత వృత్తి వర్గాలను క్షత్ర, విసు (వైశ్య) వంటి పేర్లతో భిన్న వర్ణాలుగా ఉటంకించారు. కాలక్రమంలో అవే పేర్లు స్థిరపడ్డాయని చరిత్రకారుల అభిప్రాయం.

వాజపేయ యజ్ఞంలో సోమరస పానం ప్రధాన ఆకర్షణ. ఈ యజ్ఞం 17 రోజుల నుంచి ఒక సంవత్సరంపాటు సాగుతుండేది. రథాల పోటీలతో, రకరకాల కార్యక్రమాలతో ఉల్లాసంగా గడిపేవారు. అతిథులకూ, యజ్ఞకర్తలకూ కావలసిన వస్తు సామగ్రి - పానీయాలు - రకరకాల భక్ష్యాలు సమకూర్చటంలో కింది వర్గం వారిపైనే భారం పడేది. యజ్ఞ సమయాలలో తాటి కల్లుకు గిరాకీ ఏర్పడి తాటివనాలు (తోపుడు) ఎద్దడికి గురయ్యేవి. ద్రావిడ భాషల్లో తరు-తాటక- తాట పదాలు తాటిచెట్టుకు వాడేవారట. తమ తాటి తోపులను - సోమరసం తయారీకి ఆర్యులు వాడుకోవటాన్ని స్థానిక యక్షులూ, నాగులూ అడ్డుకుని ఉంటారు.

రామాయణం బాలకాండ 45వ సర్గలో వాజపేయ యాగం గురించి ఉంది. ఆ యాగం చేసిన వారికి గొడుగులు ఇచ్చేవారు. గొడుగు వేసుకునే అర్హత ఇతరులకు లేదు. (గొడుగులు అడిగి మాతంగ కన్యలు భంగపడటం హరిశ్చంద్రుని కథలో కీలకాంశం. ఇతర యాగాలనూ రామాయణం ప్రస్తావించింది. రాముడు గుహుని నావ ఎక్కేటప్పుడు బ్రాహ్మణులూ, క్షత్రియులూ చెప్పదగిన "నావారోహణ మంత్రం" తన హితం కోసం జపించాడు. బ్రాహ్మణులూ, క్షత్రియులూ తమకంటూ కొన్ని కర్మకాండలు ఏర్పరచుకోవటం వర్ణధర్మ సమాజ లక్షణమే. ఈ కర్మకాండలనూ, క్రతువులనూ ధర్మశాస్త్రాలు క్రోడీకరించి స్థిరపరిచాయి. క్రతువులు వినోద కార్యక్రమాలుగానూ ఉండేవి. రకరకాల పోటీలు ఏర్పాటు చేసేవారు. వాటిలో యజ్ఞకర్త పక్షానికే గెలుపు వచ్చేలాగా చూసేవారు. అది ఒకరకమైన ఫిక్సింగ్.

నూరు యాగాలు చేసినవాడు ఇంద్రుడవుతాడన్న మాట రామాయణంలో ఉంది. ఆర్యులు చేసే యజ్ఞాలలో ప్రథమ భాగం దేవతాగణాలకు వెళ్ళేది. ఆర్య స్త్రీల మీద కూడా వారు హక్కు పొందారు. ఆర్యులకూ, దేవగణాలకూ గల సంబంధాలు సేవక, భూస్వామి సంబంధాల వంటివి అని డా॥ అంబేడ్కర్ విశ్లేషించి చెప్పారు.

"దేవగణం" సాధారణ మానవ గణం. "దేవతా గణం" పరలోక సంబంధమైన అలౌకిక భావన. మానవ సముదాయమైన దేవగణానికి అలౌకిక హోదాను అపాదించటం ఏ ప్రయోజనాలను ఆశించి ప్రచారం చేశారో ఊహించటం కష్టమేమీ కాదు.

భూస్వామి సేవక సంబంధాలు పోవాలనీ సమాన భాగస్వామ్యం కావాలనీ అన్నందుకే రాక్షసులు యజ్ఞ విరోధులుగా ప్రచారం అయ్యారు. ఈ ఆలోచనా పరిణతిని తెచ్చినవి జైన, బౌద్ధ ధర్మాలు. ప్రకృతిలోని చరాచరాలన్నీ జీవులే అనే ఎరుక, సమధర్మం, సమన్యాయం అనే భావనలు ఒక వర్గంలో కలిగించిన చైతన్యాన్ని అసురుల కథలు ప్రతిబింబిస్తున్నాయి.

# దేవాసుర యుద్ధాలు

వలసలుగా వస్తున్న ఆర్య జాతులకూ స్థానిక అసుర క్షత్రియులకూ జరిగిన ఘర్షణలే దేవాసుర యుద్ధాలు.

ఋగ్వేద సూక్తాలలో కనబడే చాలా గాథలు, ఇంద్ర - దస్యు ఘర్షణల వంటివి. పురాణాలలో విపులంగా మూర్తీకరణం చెంది దేవాసుర సంగ్రామాలుగా గ్రంథస్థమయ్యాయి. ఇవి ఆర్య - దస్యు ఘర్షణల జ్ఞాపకాలుగా భావించవచ్చు. అంటే ఇవి హరప్పా సంస్కృతితో సంబంధంగలవి. ఈ సంస్కృతి క్రీ.పూ. 2200 - 2000 మధ్య అత్యున్నత దశలో ఉండి క్రీ.పూ. 1500 ప్రాంతానికి క్షీణదశకు చేరుకున్నదని చరిత్ర చెబుతున్నది.

దేవాసుర యుద్ధాలలో చాలా వాటిని రామాయణం పేర్కొన్నది. వృత్ర ఘాతము (వృత్రాసుర వధ), అంధకారము (అంధకాసుర వధ), అమృత మథనం (క్షీరసాగర మథనం) వామనము మొదలైనవి. వీటిలో కొన్ని చరిత్ర పూర్వయుగంలోని సంఘటనలకు మూర్తీకరణలు. కొన్ని జైన, బౌద్ధ ధర్మాలను వ్యతిరేకిస్తూ వైష్ణవాన్ని నిలబెట్టటానికి జరిగినవి.

ఆర్య దేవగణాలకూ, అసురులకూ జరిగిన చాలా పోరాటాలు పురాణాల నుంచి తెలుస్తున్నాయి. మత్స్య మహాపురాణం 12 దేవాసుర సంగ్రామాలను పేర్కొన్నది. (47వ అధ్యాయం).

ఇవి నారసింహము, వామనము, వారాహము, అమృత మంథనము, తారకా మయము, ఆడీ వధము త్రైపురము, అంధకారము, వృత్ర ఘాత(క)ము, ధాత్రము, హాలా హలము, కోలాహలము అనేవి. ఇవన్నీ నారాయణుని అవతారాల కథలతో దైత్యులనూ, దానవులనూ, యక్షులనూ, రాక్షసులనూ దుష్టులుగా చెప్పే కథలతో నిండి వున్నాయి.

కొన్ని పురాణాల ప్రకారం కశ్యప ప్రజాపతికి పదమూడు (13) మంది భార్యలు. అతనికి అదితి వల్ల కలిగిన సంతానం దేవగణం (ఆదిత్యులు). దితివల్ల కలిగిన సంతానం దైత్యులు. దనువు వల్ల కలిగిన వారు దానవులు. క్రోధవశ వల్ల రాక్షసులు, విశ్వవల్ల యక్ష రాక్షసులు, సురసకు, వినతకు, నాగులు కలిగారు. వీరంతా దాయాదులు. రాజ్య వ్యవస్థలో దేవగణాలకు వీరు ప్రతిస్పర్ధులు. వీరికి ఇంకా అనేక వర్గాల సోదరులున్నారు. వీరి మధ్య రాజ్యం కోసం సంపద కోసం పోరాటం సాగుతూ వచ్చింది. వీరిలో దైత్యులు, దానవులు, యక్ష రాక్షసులు, అసుర వర్గంగా ప్రసిద్ధులు. అసురుల రాజ్యాలు సహజ వనరులతో సంపన్నంగా ఉండేవి. దేవగణాలు ఆ సంపద కోసమూ అసుర వర్గాలపై ఆధిపత్యం కోసమూ ఉత్సాహపడేవారు. ఆ క్రమంలో అసురులను కిందిస్థాయి వారిగా చెప్పారు. అసురుల కథలు కులాల ఉత్పత్తికి జోడించారు. చతుర్వర్ణ వ్యవస్థను పదిలపరచటానికే ఇది జరిగింది. యక్షులనూ, నాగులనూ, రాక్షసులనే పేరుపెట్టి చంపటం మొదటి నుంచీ

ఉన్నదే. అనంతర కాలపు వ్యవస్థలో దేవతల నుంచి బ్రాహ్మణులు, అసురుల నుండి శూద్రులు ఉద్భవించారనే వాదాన్ని ముందుకు తెచ్చారు. (తైత్తిరీయ బ్రాహ్మణం - 1-2.6.7).

ఈ వాదాలను విశ్లేషిస్తే దేవాసుర యుద్ధాలను దాయాదుల పోరాటాలుగా చూపే ప్రయత్నం జరిగినట్లు అర్థం చేసుకోవచ్చు. సామాజిక, రాజకీయ మత, సాంస్కృతిక పరమైన వైరుధ్యాలు ఈ వర్గాలలో ఉన్నాయి. జైనమూ, బౌద్ధమూ ప్రవేశపెట్టిన తాత్త్విక ఆలోచనా ధారతో ఉన్న అసుర రాజ్యాలూ, భోగ ప్రవృత్తి కలిగిన దేవ/ఆర్య రాజ్యాలూ పరస్పరం సంఘర్షించుకున్న చరిత్ర ఇది. ఆర్యులు దేశంలో నిలదొక్కుకున్న తర్వాతనే పురాణాలు·రాయించి తమ విజయాలను చెప్పుకున్నారు.

గ్రామం పునాదిగాగల జనస్థానాలూ వర్ణ కుల వ్యవస్థలేని సమాజాలూ దండకలోని రాజ్యాలలో కనిపిస్తాయి. గోండులు, కోయలు, గుత్తికోయలు, సవరలు, జాతాపులు, చెంచులు, జక్కులవారు - బోయలు మొదలైన ఇక్కడి సమాజాలను ఆర్యులు తమ వ్యవస్థ లోకి తీసుకురావటానికి చేసిన ప్రయత్నాలు ఘర్షణలకు దారితీశాయి. "కృణ్వంతో విశ్వ మార్యం" అంటూ బయలుదేరిన వైదిక ధర్మ వ్యవస్థ జనస్థానాలపై తన ప్రభావాన్ని చూపటానికి ప్రయత్నించింది. ఆర్యుల వ్యవస్థలో వర్ణధర్మాలున్నాయి. అంతర్వివాహాలున్నాయి. వర్ణసాంకర్యం పేరుతో శాపాల పేరుతో కొందరిని వేరుచేసి బహిష్కృత కులాలుగా వెలిగా పెట్టే ప్రయత్నమూ జరిగింది. జైన, బౌద్ధాల నుంచి వైదిక ధర్మాన్ని రక్షించుకోవటమూ ఒక కర్తవ్యంగా ఆర్య దేవగణాలవారు భావించారు. బౌద్ధం విస్తరించకుండా చూడటం ఆ స్థానంలో వైష్ణవాన్ని నిలబెట్టడం ఈ యుద్ధాల లక్ష్యం.

మహాత్మా జోతిరావ్ పూలే విశ్లేషణ ప్రకారం పురాణ కథలలో వినిపించే 'బ్రహ్మ', ఆర్య గణాల నాయకుడు. ప్రజాపతులు అతని వెంట వచ్చిన ఆర్యజనం. సంకల్పం చేత పుట్టడం అంటే అతని ఆదేశాలతో, అంగీకారంతో ఇక్కడికి వలస రావటం అన్నమాట.

మధుకైటభులు స్థానిక అసురవీరులు. నారాయణుడు సముద్రం మీద శేషతల్పంపై పడుకుని ఉండగా, అతని నాభి నుంచి తామర కమలం - అందులో బ్రహ్మ పుట్టారని, చెవుల నుండి మధుకైటభులు పుట్టారనీ పురాణాలు కథలు చెప్పాయి. మధుకైటభులు సృష్టిచేయ బోతున్న బ్రహ్మను బాధపెట్టారనీ నిద్ర నుండి లేచిన విష్ణువు మధుకైటభులను తన తొడల మీద పెట్టుకుని చంపాడనీ కథ.

సముద్ర మార్గాన భారతదేశానికి వచ్చి తన వారిని ఇక్కడ స్థిరపరచబోతున్న ఆర్యులకు బ్రహ్మ సృష్టి ప్రతీక - ఇరాన్ నుంచి వస్తున్న వలసలను ఆర్యుల రాకను అడ్డుకున్నవారు స్థానిక అసుర క్షత్రియవీరులు. మధుకైటభులు వారి నాయకులు. ఆర్యుల నాయకుడు నారాయణుడు వారిని చంపి తనవారికి ఈ దేశంలో రాజ్యాలు ఏర్పరచాడనేది జోతిరావ్ పూలే విశ్లేషణ.

విదేశీయులను ఎదుర్కొన్న తొలి స్థానిక వీరులు మధుకైటభులు అన్నారు పూలే. బ్రహ్మ, నారాయణుడు సముద్ర జలాల సంబంధంగలవారై ఉండటం – సముద్ర మార్గాన వచ్చిన ఇరానీయులకు మూర్తీకరణం. బ్రహ్మ సృష్టించిన ప్రజాపతులు ఇరానీయులే అంటారు జోతిరావ్.

మధుకైటభులు విష్ణువు చెవుల నుంచి పుట్టారనీ కాని తాము దేవీ శక్తివల్ల పుట్టినట్లు భావించుకుని బ్రహ్మతో (ఆర్యులతో) యుద్ధానికి దిగారనీ కథలున్నాయి. (దేవీ భాగవతం) సమస్తమూ విష్ణువు పరంగానే చెప్పే ప్రయత్నం ఇది. మధుకైటభులతో జరిగిన యుద్ధాలలో వారే గెలుస్తూ వచ్చారు. (ఇవి అనార్య – ఆర్య యుద్ధాలుగా అనుకోవచ్చు) విష్ణువు దేవిని ప్రార్థించి, మాయోపాయంతోనే వారిని చంపగలిగాడు. "మీరు నన్ను శరణు కోరండి నేను మీకు వరం ఇస్తాను" అన్నాడట విష్ణువు. "నీవే శరణు కోరుకో, మేము నీకు వరం ఇస్తాము" అని వీరు అన్నారు. "మీరు నా చేతిలో మరణించేలాగ వరం ఇవ్వండి" అని విష్ణువు వరం కోరాడు. నీళ్ళులేని చోట చంపవలసిందిగా వారు కోరారనీ విష్ణువు తన తొడలు పెంచి వారిని తొడలమీద పెట్టుకుని చంపాడనీ కథ. భారతంలోనూ వీరి ప్రసక్తి ఉంది. అదీ వైష్ణవ మతం ఆధిక్యతను చెప్పేదే.

**శంఖాసురుడు**

శంఖాసురుని గురించి పురాణాలు స్పష్టంగా చెప్పలేదు గాని పరోక్ష ప్రస్తావనలు చేశాయి. శంఖాలకు మూర్తీకరణం శంఖాసురుడు. ఇతనిని శంఖ పురుషుడు, అయుధ పురుషుడు, పంచజనుడు, శ్రీఫాల, పేర్లతో శతపథ బ్రాహ్మణం ప్రస్తావించింది. రాక్షసులను తరిమే సాధనంగా దీనిని చెప్పారు. విష్ణువుకూ శివునికీ కూడా శంఖ సంబంధం చెప్పారు. పంచాయతన పూజలో శంఖానికి ప్రత్యేకత ఏర్పరచారు. శంఖం సాఫల్య చిహ్నం. జానపదులూ శంఖాన్ని పూజిస్తారు. శంఖాల దండలు ఆభరణాలుగానూ వాడేవారు. శంఖాలు సోమం నుంచి వస్తాయని అధర్వణ వేదం చెప్పింది. శంఖాలతో వృత్రునికీ సంబంధం ఉందనీ చెప్పారు.

శంఖాసురుడు స్థానిక అసుర నాయకుడనీ, ఆర్యులు చిన్న చిన్న పడవలమీద వచ్చి (చేపలవలె) సప్తసింధు ప్రాంతాలను ఆక్రమించుకోవటానికి ప్రయత్నించినప్పుడు తీరప్రాంతాల వీరులు వారిని ఎదుర్కొని పోరాడారనీ మహాత్మా జోతిరావ్ పూలే విశ్లేషించి చెప్పారు.

శంఖాల మొనలను చీల్చటం అసురులను చీల్చటం అని వరాహపురాణం చెప్పింది. అసురులంటే 'అవిద్య' అని తాత్వికార్థం చెప్పింది. ఆర్యులను ఎదుర్కొన్న అసురవీరుల ఎముకలు శంఖాలుగా అయ్యాయని జానపద గాథలున్నాయి. పూలే విశ్లేషణకు అది ఆధారం. శంఖచూడుడు, శంఖుడు అనే అసురుల గురించి శివపురాణము, బ్రహ్మవైవర్త

పురాణమూ చెప్పాయి. శంఖ పురుషుడు - శంఖాసురుడు పంచజనుల నాయకుడని అనుకోవటానికి ఆస్కారం ఉంది.

'పంచజన' పదాన్ని పురాణాలు రకరకాలుగా చెప్పాయి[1]. పూర్వం సంకల్ప మాత్రం చేతనే సృష్టి వర్ధిల్లుతూ ఉండేది. జగన్నాథుని (పరాత్పరుని) సంకల్పంవల్లనే ప్రజాపతులు పుట్టారు. దక్ష ప్రజాపతి "హంస గుహ్యము" అనే స్తవం (ప్రార్థన)తో జగన్నాథుని స్తుతించి నప్పుడు ఆయన 'అసిక్ని' అనే ఆమెను అతనికి భార్యగా ఇచ్చాడు. అసక్ని పంచజనుడనే ప్రజాపతి కూతురు. స్త్రీ పురుషుల కలయిక వల్ల సంతానం కలగటం వీరితో మొదలయింది. ఆ భార్యాభర్తల సంతానంతోనే సృష్టి పెంపొందింది. (భాగవతం 6-213-224)

ఆ విధంగా సృష్టికి ఆద్యురాలు పంచజనుని కూతురు, అసిక్ని. పంచజనులు అసుర క్షత్రియులు. వారి నాయకుడు ఆర్యగణాలను ఎదిరించిన అసుర నాయకుడు. పంచజనుడు కృష్ణునికి ఇచ్చిన శంఖం "పాంచజన్యం" అంటున్నది భాగవతం.

పంచజనుడిని చంపి కృష్ణుడు శంఖాన్ని తీసుకున్నాడని రామాయణంలో సుగ్రీవుడు చెప్పాడు. వీటిలో దేనిని నమ్మాలి?

పాంచజన్యం గురించి మరింత లోతుకు వెళ్ళి పరిశోధిస్తే పంచజనుడు జలజీవి అనీ శంఖంలో ఉండేవాడనీ తెలుస్తోంది.

Panchajana in the form of conch shell (Sankha) lived under the ocean and from his bones Vishnu's sacred conch was made. Its sound terrifies demons animates Gods and annililates unrighteousness ఇది భాగవత పురాణంలో ఉన్న వివరం అని Dictionary of Hiduism చెబుతోంది. అగ్ని పురాణంలోనూ విష్ణు పురాణం లోనూ ఈ కథ ఉన్నదట.

శంఖంలో ఉన్న పురుషుడు శంఖ పురుషుడు అనీ ఆయుధ పురుషుడు - పంచజనుడు - ఇతడే అనీ జానపద గాథలున్నాయి.

ఈ పంచజనుడే వేదాలను దొంగిలించి సముద్రంలో దాచాడనీ మత్స్యావతారంలో విష్ణువు పంచజనుని చంపి వాటిని తీసుకుపోయాడనీ మత్స్యపురాణ కథ. వేదం అంటే జ్ఞానం - చదువు. అది సమాజంలోని దిగువ వర్గాలకు అందకుండా చేయటానికి ఎన్నో ప్రయత్నాలు జరిగాయి. రామాయణం కిష్కింధాకాండ (4-28)లో పాంచజన్య శంఖం ప్రసక్తి కనిపిస్తుంది. విష్ణుచక్రం గురించీ అక్కడ చెప్పారు. పడమటి దిక్కులో లవణ సముద్రం మూడువంతులు దాటాక నాలుగో భాగంలో చక్రవంతము అనే కొండ ఉన్నదనీ విశ్వకర్మ వేయిరేకులుగల చక్రాన్ని నిర్మించి అక్కడ ఉంచాడనీ దానిని హయగ్రీవుడు అనే రాక్షసుడు రక్షిస్తున్నాడనీ, సుగ్రీవుడు సీతను వెదకటానికి వెళ్తున్న వానరులతో చెప్పాడు. అక్కడే పంచజనుడు అనేవాడు ఒక శంఖాన్ని తన ఆస్తిగా రక్షించుకుంటూ ఉన్నాడనీ

1. చూ. పుట. 45

కూడా చెప్పాడు. విష్ణువు హయగ్రీవుడినీ - పంచజనుడినీ చంపి ఆ రెండింటినీ అపహ రించాడట.

"తత్ర పంచజనం హత్వా హయగ్రీవంచ దానవం
అజహార తతశ్చక్రం శంఖంచ పురుషోత్తమ."

విష్ణువు శంఖచక్రాల కథలు ఇంకా ఎన్ని ఉన్నాయో - పంచజనుడిని చంపి శంఖం తీసుకోవటం - పంచజనుని ఎముకలతో శరీరంతో శంఖం తయారు చేసుకున్నారని చెప్పటం ఒకే వాస్తవానికి భిన్నరూపాలు!

ఈ హత్యలను శూద్రుల/నిమ్నజాతుల విద్యతోనూ వేదాలతోనూ ముడిపెట్టడం వెనక ఒక వర్గపు అణచివేతకు సంబంధించిన లక్ష్యం ఉన్నది.

పంచజనులు దేవగణ విరోధులు. వారికీ పంచములకూ సంబంధం ఉన్నదా? అనేది ప్రశ్న. ఋగ్వేదం పంచజనులు అయిదు వర్గాల వారిని చెబుతోంది. (10.1.11.5) "may the five orders of men may those who were born for the sake of ghi - may those who are untitled to worship... అంటూ వారు పూజకూ, గౌరవానికీ తగనివారని చెప్పింది. పంచజనులలోని అయిదో వర్గంవారు అయిదో వర్ణం అయ్యారా? అనేది ప్రశ్న.

## హయగ్రీవుడు

పురాణాల ప్రకారం అసురులు వేదాలు నేర్చుకోవటం నేరం. మనుధర్మశాస్త్రం ప్రకారం శూద్రులు విద్య నేర్చుకోవటం నేరం. వారు దేవభాష (సంస్కృతం) వినటమూ నేర్చుకోవటమూ నేరాలే. మరణశిక్ష విధింపదగ్గ నేరాలు. పూర్వపు అసురులూ అనంతరకాలపు శూద్రులూ ఒకేస్థాయి గలవారా? అని ప్రశ్నించు కుంటే 'అవును' అనే సమాధానం వస్తుంది. ఆర్యగణాలు దేవగణాలు కలిసి స్థానికులైన అసురులను వంచిస్తూ వచ్చారు. ఆధునిక యుగంలో పాలక, పురోహిత వర్గాలు శూద్ర, అతిశూద్ర కులాలను వంచిస్తూ ఉన్నాయి. విద్య - ఉపాధి మార్గాలు - జీవనశైలి - అన్నింటా కింది వర్గాలను/ కులాలను వంచించే కుతంత్రాలే సాగుతున్నాయి.

చతుర్వర్ణ వ్యవస్థలో వృత్తి కులాలకు వారి వారి వృత్తులకు సంబంధించిన సాధారణ జ్ఞానాన్ని మాత్రమే అనుమతించారు. విశేష విద్యలు బ్రాహ్మణ వర్గాల అధీనంలోనే

---

భారత సమాజంలోని కులవ్యవస్థపై శంఖాన్ని ఊదుతూ బోయి భీమన్న (1911- 2005) శంఖారావం అనే కావ్యం రాశారు. దానికి ఆయన రాసిన పీఠిక పేరు పాంచజన్యం. పంచజనుడు కిందివర్గాల వాడనీ అతడు ఇచ్చిన శంఖం గనుక పాంచజన్యం తమ పూర్వీకులదే పంచములదే అనీ ఆయన వాదం.

"తాము కోలుకోలేనంత నిమ్న మానవులమనీ దళితులమనీ అనుకొంటూ రిజర్వేషన్‌ల భిక్షమీద ఆధారపడుతూ మాల మాదిగల పేటలలో ఇరుకు మురికి గుడిసెలలో ఎంతకాలం మగ్గుతూ ఉంటారో అంతకాలం ఈ శంఖాన్ని ఊదుతూనే ఉంటాను" అన్నారు భీమన్న.

ఉండేవి. ఒక రాజు బాణాలు వేయటం కత్తి పట్టటం నేర్చుకుని ఉండవచ్చు - కాని విశేషమైన ధనుర్విద్య - ఇతర అస్త్ర విద్యలూ బ్రాహ్మణ పురోహితుల అధీనంలోనే ఉండేవి. ఏ విధంగానూ, ఏ వర్గాలూ సమాజంలో తమనుమించి జ్ఞానం ఆర్జించటానికి వారు వీలు కలిగించేవారు కాదు. వసిష్ఠ, విశ్వామిత్రుల విద్యాస్పర్ధ దీనికి ఒక ఉదాహరణ. మహా భారతంలోని ఏకలవ్యుని కథ, కర్ణుడు శాపగ్రస్తుడైన వివరాలూ, వర్ణ వైషమ్యాలను తెలిపేవే. ఒక వర్గం మరో వర్గాన్ని విద్యలపరంగా జ్ఞానం పరంగా అణచిపెట్టి ఉంచటాన్ని ఈ కథలు స్పష్టం చేస్తున్నాయి. అయితే అసలు విద్యలు - వేదాలు - అసురులవే. వారి నుంచి తీసుకున్న ఆర్యులు వాటిని వారి వారసులకు అందకుండా చేశారు. శూద్రుల విషయమూ అంతే - వారి శ్రమ ఫలితం వారికి దక్కకుండా పోతున్నది.

తొలి వేదకాలంలో వేదాలు అసురులవి. మలి వేదకాలానికి ఆ వేదాలను నాశనంచేసి ఆర్యమునులు కొత్త మంత్రాలు రచించారు. వాటిని గొప్ప జ్ఞానంగా దాచుకున్నారు.

వివరాలలోకి వెళ్ళాలంటే మత్స్యపురాణంలోని హయగ్రీవుని కథ చెప్పుకోవాలి. హయగ్రీవుడు వేదాలను దొంగిలించాడంటారు. దొగచాటుగా వేదపఠనాన్ని విన్నాడేమో. వేదాల దొంగతనం సోమకాసురుడు చేశాడని కొందరి ఆరోపణ. వారి వేదాలు పుస్తక రూపంలో అప్పటికిలేవు. ఒక ప్రత్యేకమైన పద్ధతిలో వాటిని పఠిస్తారు. మూడు మూడు పదాలు విరిచి విరిచి ఉచ్చరించటమే ఆ గానకళ. అయినా అవి రాక్షసులకు అందకుండా చేయటానికి అవి విన్న వాళ్ళందర్నీ చంపేశారు. సైన్సు రహస్యాల కోసం జరిగే కిడ్నాపులూ, హత్యలూ ఆ వారసత్వమే. సోమకాసురుని చంపి లోకాన్ని గొప్ప ప్రమాదం నుంచి తప్పించిన రోజు కార్తీక పూర్ణిమ. కార్తీక పూర్ణిమ రోజునే త్రిపురాసురులను చంపారట. ఆబోతులకి అచ్చువేసి విడిచేరోజూ ఇదేనట. అసురులను చంపటమూ ఆబోతులకు పర్మిషన్ ఇచ్చి ఊరిమీద విచ్చలవిడిగా విడవడమూ ఒకలాంటివే - ఆర్యగణాలకు పండగ చేసుకోదగిన సందర్భాలు. ఈ పున్నమిని నూలి పున్నమిగా కొత్త జంధ్యాలు వేసుకునే పండుగగానూ జరుపుకుంటారు. ఇదే రోజు హయగ్రీవ జయంతి కూడా.

హయగ్రీవుడు జ్ఞానానికి కాంతికి చిహ్నం. విద్యలకు అధిదేవుడు. "జ్ఞానానంద మయం దేవం నిర్మలం స్ఫటికా కృతం, ఆధారం సర్వ విద్యానాం హయగ్రీవ ముపాస్మహే॥" అనేది అమరకోశంలో తొలి ప్రార్ధనా శ్లోకం. బ్రహ్మ నోటి నుంచి వెలువడిన వేదాలను మొదట గ్రహించిన దైత్యుడు హయగ్రీవుడు. ఇతడు వేదాలతో సముద్రంలోకి వెళ్ళటం చూసి విష్ణువు చేప రూపంలో సముద్రంలోకి వెళ్ళి హయగ్రీవ రూపంలో ఆ దైత్యుని చంపి వేదాలను తిరిగి బ్రహ్మకు ఇచ్చాడట. హయగ్రీవం అంటే గుర్రపు మెడ/గుర్రపు తల. దీని గురించి ఒక కథ ప్రచారంలో ఉంది.

హయగ్రీవ దైత్యుని పూర్వాపరాలు ఇవి – అతడు ఎన్నో సంవత్సరాలు తపస్సు చేసి మరణంలేకుండా శ్రీదేవిని వరంకోరాడు. అది అసంభవమని దేవి చెప్పింది. అలా అయితే తన పేరుగలవాని వల్లనే తనకు మరణం కలిగేలాగా చేయాలని వరం పొందాడు. విష్ణుమూర్తి హయగ్రీవుడిగా (గుఱ్ఱం తలతో) ఇతన్ని చంపాడు. విష్ణుమూర్తికి గుఱ్ఱం తల రావడానికి ఇంకో కథ కూడా ప్రచారంలో ఉంది. దాన్ని వదలివేయటం ఉత్తమం.

హయగ్రీవ అనేది చాలా పూర్వపు భావన. చైనా, జపాను దేశాలలోని మాంత్రిక విద్యల ప్రభావంతో భారతదేశంలో వ్యాప్తిలోకి వచ్చిన భావన అని కొందరి అభిప్రాయం. గుఱ్ఱం (హయము) యుద్ధశక్తికి, రక్షణకు చిహ్నంగా భావించేవారు. ప్రాచీన శిల్పాలలో గుఱ్ఱపు బొమ్మ శిల్పాలు కన్పిస్తాయి.

భాగవతంలో పోతన ఈ కథను రసవత్తరంగా వర్ణించాడు. దైత్యుడైన హయగ్రీవుడు కాకుండా అతన్ని చంపిన హయగ్రీవుడే (గుఱ్ఱంతలగల విష్ణుమూర్తి) విద్యలకు అధిష్ఠాన దేవత అని వైదికమతం ప్రచారం చేసింది.

> "అలసి సొలసి నిదుర నందిన పరమేష్ఠి ముఖము నందు వెడలె మొదటి శ్రుతులు
> నపహరించె నొక హయగ్రీవుడను దైత్య భటుడు...(తెలుగు భాగవతం 8.712)
> చదువులు తనచేపడెనని చదువుచు బెన్ బయల నుండ శంకించి వడిన్
> జదువుల ముదుకడు గూరుక జదువుల తస్కరుడు సొచ్చె జలనిధి కడుపున్
> (భాగ. 8.713)
> ఇట్లు వేదంబులు దొంగిలి దొంగ రక్కసుండు మున్నీట మునింగిన వాని జయింప
> వలసియు ద్రుమాను దీగెల యందు
> విత్తనంబుల పొత్తరులు పెన్నీటనాని చెడకుండ మనుప వలసియు..." విష్ణువు
> మత్స్యరూపి అయ్యాడు.

ఎంతో కాలంగా చదవాలనుకుంటున్న పుస్తకం చేతికి వస్తే పుస్తక ప్రియులు ఎంత ఆనందపడతారో అంత ఆత్రం, ఆనందం, హయగ్రీవునిలో కనిపిస్తాయి. విన్నదానిని పదే పదే చదువుకున్నాడు. రాసేసుకున్నాడేమో కూడా. అతడు ఏకసంధాగ్రాహి. ఒకసారి వింటే మరచిపోడు. అతని నుంచి ఆ విజ్ఞానం అతని వారికి అందుతుందేమోనని భయ పడ్డారు దేవగణాలు. వారి దుర్మార్గపు ఆలోచనలు హయగ్రీవునికి తెలుసు – అందుకే తత్తరపాటుతో నీళ్ళలో దూకి పాతాళానికి వెళ్ళిపోయాడు. అయినా వదలకుండా వెన్నాడి, 'దొంగ'గా ముద్రవేసి అతనిని చంపారు. "వాణీశుల మోముల వేదంబులు గొన్న దైత్యుని మృతిం బొందించి..." అని భాగవతం 8-738) చెబుతోంది. విద్యల విషయంలో జాతుల మధ్య స్పర్థ ఇంతటిది.

ఆర్య గురువులు తమ విద్యలు స్థానికులకు నేర్పకపోవటం - ఎలాగో వారు నేర్చుకుంటే శపించటం - చంపటం పురాణాలలో ఉంది. అసురుల విద్యలను కుతంత్రాలతో నేర్చుకున్న వారు వాస్తవానికి దేవగణాలే.

"మృత సంజీవనీ విద్య" అసురులది. అసురుల గురువు శుక్రాచార్యుడు ఎంతో ప్రయత్నం మీద ఆవిద్య సాధించాడు. అదొక గొప్ప ఆవిష్కరణ. దానిని దేవగణాలు కుటిల ప్రయత్నాలతో తెలుసుకోవటం ఒక కథ. బృహస్పతి కొడుకు "కచుడు", శుక్రుని దగ్గర విద్యార్థిగా చేరటం - గురు పుత్రి దేవయానిని మంచిచేసుకోవటం, ఆమె అభిమానం పొందటం - ఎలాగో ఆ విద్య సాధించటం, అనంతరం దేవయానిని తిరస్కరించి శపించి, తన లోకానికి వెళ్ళిపోవటం అనే ఆసక్తికరమైన కథాంశాలతో మలుపులతో దీనిని మహాభారతం చెప్పింది.

విద్యారంభానికి ముందు చేయించే గణపతి పూజకు స్ఫూర్తి అసురుల నుండే వచ్చింది. 'గణపతి' అంటే గణాలకు అధిపతి - ఒక తెగ నాయకుడు అని అర్థం. "గణపతి హృదయ" అనేది బౌద్ధ మంత్రం. రాజగృహంలో ఆనందునికి బుద్ధుడు ఉపదేశించిన ఆత్మవిద్య. ఇది అసురులదే అయినా గణపతి పూజలూ/వ్రతకల్పాలూ ఆర్య సంబంధంగా ప్రచారమయ్యాయి. అసురుల విద్యలను వైదికమతం చిన్న చిన్న మార్పులతో తనవిగా ప్రచారం చేసుకున్నది. చదువు అనేది అందరికీ కావలసినదే. అయినా హిందూ మతం విద్యను కొన్ని వర్గాలకే పరిమితం చేసింది. కొందరికి విద్యను తిరస్కరించింది.

"దేవుడు వాక్యమై ఉండెను" అంటున్నది క్రైస్తవం.

"ఆదియందు వాక్యముండెను - వాక్యము దేవుని వద్ద ఉండెను. వాక్యము దేవుడై ఉండెను. ఆ వాక్యము శరీరధారియై కృపా సత్యసంపూర్ణుడుగా మన మధ్య వసించి ఉండెను" పరి యోహాను. 1:1:14.

వాక్యం అంటే జ్ఞానం - చదువు అనే భావం. క్రైస్తవ ధర్మవాక్యంలో, జ్ఞానులు, గొల్లలు - అన్ని వర్గాలవారు సమంగా దేవుని కృపకు పాత్రులే అనే భావన ఉన్నది.

ఇస్లాములో "ఇఖ్రా" అంటే విద్య. ఇది మహమ్మద్ ప్రవక్త ప్రపంచానికి అందించిన సందేశం. 'చదువుకో' అనే నినాదం ఇది. "జ్ఞానం సంపాదించు" అనే ఆజ్ఞాపననూ ఇందులో చూడవచ్చు.

పై మతాలకు భిన్నంగా కొన్ని వర్గాలు విద్యనేర్చుకోకూడదు అని వైదిక మతం శాసించింది. క్రైస్తవులకు బైబిలు, ముస్లిములకు ఖురాన్ పవిత్ర గ్రంథాలుగా ఉన్నట్లుగా హిందువులందరికీ ఒక మతగ్రంథం లేకపోవటాన్ని డా. అంబేద్కర్ ప్రశ్నించారు. హిందువుల పవిత్ర గ్రంథాలుగా భావించబడే వేదాలు కొన్ని వర్గాలకు నిషేధం. శూద్రులు విశేష విద్యలు నేర్చుకోకూడదు అని చెప్పటమే మత్స్యావతార కథ ప్రయోజనం.

మైనారిటీ వర్గాలు తమ తమ కుల విద్యలకే పరిమితమై మెజారిటీ వర్గాలకు సేవచేస్తూ ఉండాలి.

కులవృత్తులు దాటి ఎదగాలనుకోకూడదు. కులధర్మం పాటించాలి. వర్ణ వ్యవస్థకు ఎవరివల్లనైనా హాని కలుగుతున్నదని అనుమానం వచ్చినప్పుడు నారాయణుడు ఏదో ఒక అవతారంలోకి వచ్చి వాళ్ళ తల తీసేస్తాడు.

'పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే.'

అని భగవద్గీతలో చెప్పాడు కృష్ణుడు (నారాయణుడు). ధర్మం అంటే కులధర్మం. కుల ధర్మాన్ని కాదని పెద్ద చదువులు చదవాలనుకోవటం బహుజనుల అత్యాశ. అందుకే వేదం విన్న శూద్రుల చెవుల్లో సీసంపోసి, విజ్ఞానం తమ చేయిదాటిపోకుండా జాగ్రత్తపడ్డారు. ఆ తర్వాతనూ ఉన్నత విద్యలను సామాన్యులు అందుకోకుండా జాగ్రత్త పడుతున్నారు.

"దేవగణాలకూ ఆర్య వర్గాలకూ సమ ఉజ్జీలుగా నిలిచిన అసుర వీరుల గురించి తెలుసుకునే కొద్దీ దేవాసుర స్పర్ధలలోని మర్మాలు అర్థమవుతూ ఉంటాయి. స్థానికత కోసం, అధికారం కోసం, సమాజంలో పైస్థాయిలో నిలవటం కోసం ఎన్నెన్ని కుట్రలూ, కుతంత్రాలూ జరిగాయో మతంపేరిట, ధర్మశాస్త్రాల పేరిట కొన్ని వర్గాలను ఎలా అణచివేశారో ఈ సంగ్రామాల కథలను పరిశీలిస్తే విశదమవుతుంది. తమ నేలను రక్షించుకోవటం కోసం పోరాడిన అసుర వీరులు దేవగణాల కుట్రలకు ఎలా బలి అయ్యారో తెలుసుకునే కొద్దీ ఈ సామాజిక వ్యవస్థలోని వర్గనీతి - సంస్కృతి - అనుకునేంత ఉత్తమమైనవి కావనీ వాటిని సరిదిద్దుకోవలసిన అవసరం ఉన్నదనీ అర్థమవుతుంది. మత్స్య పురాణం చెప్పిన యుద్ధాలు ఇవి -

1. 'నారసింహము' - నరసింహుడు హిరణ్యకశిపుని చంపిన కథ (మత్స్య - 160-162 అధ్యాయాలు).
2. వామనము - వామనుడు బలి చక్రవర్తిని అణచివేసిన కథ (మత్స్య : 243, 244, 245 అధ్యాయాలు).
3. వారాహము - వరాహమూర్తి హిరణ్యాక్షుని చంపిన కథ (మత్స్య 246, 247 అధ్యాయాలు).
4. అమృత మంధనము - నరనారాయణులు అసురులను చంపిన కథ (మత్స్య 248, 249, 250).
5. తారకామయము - (మత్స్య 171, 177)
6. ఆడివధము - విరోచనుని వసువులు బాణాలతో బాధించిన కథ. (మత్స్య. 155 అధ్యాయం).

7. త్రైపురము - త్రిపురాసురులు, దానవులు, శివుని చేతిలో మరణించిన కథ. (మత్స్య 127 - 139 అధ్యా.).
8. అంధకారము - దేవగణాలు అంధకాసురుని చంపిన కథ. (మత్స్య. 178 అధ్యాయం).
9. ధాత్రము - ధాత్రి కోసం జరిగిన యుద్ధం
10. హాలాహలము - విష్ణువు సహాయంతో ఇంద్రుడు అసురులను వంచించటం, యోగవేత్త అయిన ధ్వజుని జయించటం దీనిలో చెప్పారు.
11. వృత్ర ఘాతము - ఇంద్రుడు వృత్రుని చంపిన కథ.
12. కోలాహలము - దేవగణాలు విప్రచిత్తిని చంపిన కథ. (మత్స్య. అధ్యా. 47)

ఇవిగాక ఇంకా చాలా ఘర్షణలు పురాణాలలో కనబడుతున్నాయి. మతస్పర్ధలు - అధికారమూ వీటికి కారణాలు. కశ్యప ప్రజాపతితోపాటు ఇతర ప్రజాపతులూ చాలామంది పురాణ కథలలో కనిపిస్తున్నారు. వారి సంతానమూ రాజులుగా రాజ్యాలు పాలించారు. కశ్యప సంతానంలోని ఆదిత్యులు తాము అధికులమనే భావనతో ఉండేవారనీ. ఆర్యగణాల ప్రజలు ఈ దేవ గణాలకు ఆశ్రితులుగా ఉంటూ వారి అండదండలతో స్థానిక గణ సముదాయాలను చులకనగా చూసేవారనీ చాలా కథలు చెబుతున్నాయి. ఒకప్పటి వ్యవస్థ ఇది.

ప్రజలను ధర్మబద్ధంగా పాలించిన స్థానిక రాజుల పేర్లు కొన్ని పురాణాల నుంచి తెలుస్తున్నాయి. వారిలో దానవ, దైత్య, యక్ష, నాగ వర్గాల రాజులు ఉన్నారు. ఆర్యగణాలు దేవగణాల సహాయంతో తరచుగా వీరి రాజ్యాలను ఆక్రమిస్తూ ఉండేవి. వలసదారులయిన ఆర్యులు తమ పాలననూ సంస్కృతినీ విస్తరించుకునే క్రమంలో స్థానికులతో ఘర్షణలకు దిగేవారు. ఆర్య సంస్కృతిని ప్రశ్నించిన వారినీ, తమ తమ సంస్కృతులను నిలబెట్టుకోవాలని ప్రయత్నించినవారినీ ఆర్యులు నిస్సంకోచంగా హత్యచేస్తూ వచ్చారు. అలా హత్యలకు గురైన వారిలో అంధకాసురుడు, విశ్వరూపుడు, వృత్రుడు, తాటక, హిరణ్యకశిపుడు వంటి వారున్నారు. అయితే, ఈ హత్యలను ప్రజాహిత కార్యాలుగా పురాణకర్తలు చెప్పారు. హత్యలు చేసిన వారిని నాయకులుగా, దేవుళ్ళుగా నిలబెట్టారు. ఈ వివరాలు తెలుసు కోవాలంటే ఆ వీరుల పూర్వాపరాలు తెలుసుకోవాలి.

# అంధకాసుర వధ

అంధకాసుర వధ రామాయణ కాలానికి ముందటిది. దీనిని రామాయణం ప్రస్తావించింది. రామాయణం అరణ్యకాండలో రాముడు ఖరుదు అనే అసురుని చంపిన సందర్భంలో అంధకాసుర వధ పోలిక తెచ్చారు.

"రామేణ ధనురాయమ్య ఖరస్యోరసి ఛావతాత్
రుద్రేణేవ వినిర్దగ్ధ శ్వేతా రణ్యే యథాంధకః"

(పూర్వం శ్వేతారణ్యంలో రుద్రునిచేత దగ్ధమైన అంధకునివలె రాముని బాణాగ్ని చేత ఖరుదు దహించబడ్డాడు. అరణ్య. 30–27).

అంధకాసురుని పూర్వం రుద్రుడు దహించాడు. రామాయణ కాలంలో రాముడు ఖరుడిని తన బాణాగ్నితో దహించాడు. దహింపబడిన వారు అసురులు (రాక్షసులు) రుద్రుడు శైవ మతానికీ, రాముడు విష్ణుమతానికీ ప్రతీకలు అనుకుంటే శైవమూ, వైష్ణవమూ అసురుల మతంతో విభేదించి దానిని అణచివేసినట్టు బోధపడుతుంది. అక్కడ శ్వేతారణ్యం – ఇక్కడ దండకారణ్యం. సురాసుర యుద్ధాలలో "అంధక వధను" "అంధకారము"గా చెప్పారు. ఇది మత యుద్ధం.

వైదికేతర మతాలపట్ల వేద మతపు హింసా ధోరణి ఈ కథలో ప్రస్ఫుటంగా ఉంది. తమను కాదన్నవారినీ తమకు దాస్యం చేయని వారినీ అగ్ర/ఆధిపత్య వర్గాలు దహించటం ఇళ్ళలోనో గడ్డివాముల లోనో పెట్టి కాల్చి వేయటం ఈనాడు చూస్తున్నాం. పూర్వం కూడా ఈ దేశంలో ఇదే ధోరణి నడిచింది. ఆ వారసత్వమే రాజ్యం ధోరణిగా కొనసాగుతున్నది.

అసురులు తమ ప్రాచీన సంస్కృతిని రక్షించుకుంటూ ఉండే ప్రజలు. తొలి అసురుల భావనలు వాస్తవ జగత్తునూ ప్రకృతి ధర్మాలను వాటి పరిణామశీలతనూ నిశితంగా పరిశీలించి ఏర్పరచుకొన్నవి. వారు వేద మతాన్ని అంగీకరించలేదు. వైదికాచారాలను ఎక్కడికక్కడ అడ్డుకొంటూ ప్రశ్నిస్తూ వచ్చారు. భారతీయ దర్శనాలలో అతి ప్రాచీనమైనదిగా చెప్పబడుతున్న చార్వాక మతం వైదిక సంస్కృతిని వ్యతిరేకించిన మతమే. అందువల్లనే అసుర/రాక్షస వాదాన్ని చార్వాక వాదంగా కొందరు చెబుతుంటారు. ఆ క్రమంలో వేద మతాన్ని అంగీకరించని బౌద్ధం కూడా అసుర మతంగానే పరిగణనలోకి వచ్చింది. జైనం బ్రాహ్మణ మతానికి మరీ వ్యతిరేకంగా లేదు. కులవ్యవస్థను తీవ్రంగా ఖండించలేదు. కులవ్యవస్థను నిరసించిన వారు చార్వాకులూ, అసురులూ, బౌద్ధులూను. హేతుబద్ధంగా ఆలోచించటం, ప్రవర్తించటం – నిర్భయంగా మాట్లాడటం చార్వాకుల లక్షణాలు (చరవాక్ చరించే వాక్కుగల వారు చార్వాకులు) 'చర్వణం' అంటే నమలటం – వైదిక ధర్మాలను చర్చించి తర్కించి నమిలి పారేసిన వారు చార్వాకులు అనీ అనుకోవచ్చును.

లోకధర్మాన్ని స్పృశిస్తూ చర్చిస్తూ పెంపొందిన మతంగా దీనిని "లోకాయతం"గా చెబుతుంటారు. ఇంతకూ చెప్పవచ్చేదేమిటంటే వర్ణధర్మాన్ని కాదన్న అవైదికులూ, అవైదిక మతమైన బౌద్ధాన్ని అనుసరించిన వారూ ఒక కాలంలో అసురులు అయ్యారు. "అంధక" పదం బౌద్ధ ధర్మ సంబంధమైనది. "అంధక దేశం" బౌద్ధాన్ని అభిమానించే దేశం.

బుద్ధ ఘోషుడు అనే బౌద్ధ ఆచార్యుడు ఆంధ్రదేశ భౌగోళిక స్వరూపం గురించి చెప్తూ బౌద్ధాన్ని అభిమానించే అంధక దేశం గురించి చెప్పాడు.

అస్పన్, అలక (ములక) భూభాగాలు అంధక ప్రాంతం అన్నాడు ఆయన. ఈ రెండు భూభాగాల మధ్య గోదావరి పాయలు ఉన్నాయన్నాడు. గోదావరి లోయ ఉత్తర దక్షిణాలుగా ఉన్న నిర్మల్ కొండల వరుసలో బాలఘాట్ కొండలకూ మధ్య, తెలంగాణలోని నిజామాబాద్ (బోధన్) మహారాష్ట్రలోని నాందేడ్ జిల్లాల పరిసరాలు అప్పటి అస్పన్ (అస్మక) (అశ్మక) దేశంగానూ, దౌలతాబాద్‌కీ, గోదావరికీ మధ్య ప్రాంతం అలక, (ములక), దేశం గానూ చెప్పబడ్డాయంటారు. అస్మక రాజ్యం క్రీ.పూ. పదవ శతాబ్దం నుంచి క్రీ.పూ. మూడవ శతాబ్దం వరకు ఉన్నత దశలో ఉంది. బుద్ధుని జీవిత కాలంలోనే బౌద్ధం ఆంధ్ర దేశంలో ప్రవేశించింది. బుద్ధుని శిష్యులలో ఒకడైన మహా కాత్యాయనుడు అస్మక రాజుకు దీక్ష (ఉప సంపద) ఇచ్చాడట. అస్మక రాజ్యం క్రీస్తుపూర్వపు పదహారు జనపదాలలో ఒకటి.

. 'అంధక విందు' అనే ప్రదేశం రాజగృహ సమీపంలోను, 'అంధక వనం' శ్రావస్తి సమీపంలోను ఉండేవని చెబుతారు. అవి ఆంధ్రదేశానికి దూరంగా ఉన్నప్పటికీ ఆంధ్ర దేశ బౌద్ధుల సంబంధంగా వాటికి ఆ పేర్లు వచ్చి ఉంటాయనీ చెబుతున్నారు.

ఈ ప్రాంతాలన్నీ అనంతర కాలంలో జైన మతానికి ఆలవాలమయ్యాయి. తూర్పు చాళుక్యుల కాలానికీ ఆ తర్వాతనూ (క్రీ.శ. 7, 8 శతాబ్దాలలో) రాజులు విష్ణుమతాన్నీ బ్రాహ్మణ వాదాన్నీ పాటించగా వారి రాణులు జైనాన్ని ఆదరించినట్లు చరిత్ర చెబుతోంది. అప్పటికి అక్కడ బౌద్ధం క్షీణించింది. ఈ క్షీణతను అంధకాసుర వధ వృత్తాంతం సూచిస్తున్నది. ఈ సందర్భంలో జైన, బౌద్ధాలను గురించి కొంత చెప్పుకోవటం అవసరం.

ఆంధ్రదేశంలో బౌద్ధులు 'అంధకులు'గా పేరుపడటానికి రెండు కారణాలు ప్రచారంలో ఉన్నాయి. 'అంధకుడు' అంటే గుడ్డివాడు. కళ్ళు ఉండి కూడా చూడలేని వాడు, అంధత్వం కలిగించే వాడు అనే అర్థాలలో అంటే వైదిక మతంలోని గొప్పతనాన్ని చూడలేని వాడు అనే భావంతో, దక్కన్‌లోని బౌద్ధులనుద్దేశించి వైదికమతం వారు అంధక పదాన్ని వాడారట. వైదిక మతంలోని గొప్పతనాన్ని అర్థం చేసుకోలేదు కాబట్టి, వారు 'అంధకులు' అంటూ చేసిన హేళన అది. జైన ధర్మాన్ని కాదని, బౌద్ధాన్ని అనుసరించటం వల్ల జైనులు కూడా బౌద్ధులను తిరస్కార భావంతో 'అంధకులు'గా పిలిచారు. బౌద్ధ ధర్మాన్ని వ్యాప్తిచేయటాన్ని అజ్ఞానాన్నీ అంధత్వాన్నీ వ్యాప్తి చేయటంగా వారు పరిగణించారు.

హిందువుల ప్రభావం జైనులపై ఉండటంవల్ల జైనులు వర్ణ ధర్మాన్ని పాటించారు. బౌద్ధం వర్ణ ధర్మాన్ని అంగీకరించలేదు. కనుకనే పురోహిత వర్గం బౌద్ధులపై ద్వేషం పెంచుకున్నది.

మహిషాసికాలు ఒక బౌద్ధ శాఖ. తెలంగాణలో నల్గొండ, మెదక్ ప్రాంతాలు 'మాహిస మండలంగా' గుల్బర్గా (కర్ణాటక) ప్రాంతం మహిసి మండలంగా బౌద్ధాన్ని ఆదరించిన ప్రాంతాలుగా పేరుపడ్డాయి. అంధక బౌద్ధులు దేశం మొత్తంమీద విశిష్టమైనవారు. ఆంధ్ర దేశంలో బౌద్ధం నూతన తాత్వికతను సంతరించుకొన్నదనీ కొత్త సిద్ధాంతాలు ప్రవేశ పెట్టిందనీ "కథావత్థు" అనే గ్రంథం చెబుతోంది. కృష్ణా ముఖద్వారం ప్రాంతాలలోని బౌద్ధులు విశిష్టమైన శిల్పకళా కౌశలం కలిగి ఉండేవారు. వీరు చాలాచోట్ల విశాలమైన చైత్యాలు నిర్మించారు. అందువల్ల వీరిని "చైత్యకులు" గానూ పిలిచేవారు. బౌద్ధ శాఖలలో అంధక చైత్యక శాఖలు ప్రసిద్ధమైనవి. వీరంతా నాగులూ, యక్షులూను. ఆ ప్రాంతంలోని 'గుడివాడ' వీరి కేంద్రంగా ఉండేది.

దక్షిణ దేశంలోని చాలా ప్రాంతాలు – ముఖ్యంగా కర్నాటక, ఆంధ్ర ప్రాంతాలు మొదట్లో జైనమత ప్రాబల్యానికి లోనైనట్లు క్రీ.పూ. 400 ప్రాంతంలో లభించిన శాసనాలు తెలుపుతున్నాయి. ప్రాకృత భాషలో జైన, బౌద్ధ సిద్ధాంతాలను తెలిపే గ్రంథాలు చాలా ఉన్నాయి. జైనంలో తాంత్రిక విద్యలు, యక్షిణి ఆరాధనలు ఉన్నాయి. స్త్రీలు కూడా ఈ మతంలో సముచిత స్థానం పొందారు. అనంతర కాలంలో శ్వేతాంబర, దిగంబర శాఖలలోని వైరుధ్యాలతో జైనం ప్రాభవాన్ని కోల్పోయింది. ఆంధ్రదేశంలో బౌద్ధం ప్రజల జీవితాలకు సన్నిహితంగా వచ్చింది.

జైన మతస్థులు కొందరు (సిద్ధులు, చారణులు) బౌద్ధాన్ని స్వీకరించినప్పుడు జైన మునులు (చారణ రుషులు) కోపించి వారిని అంధులు కమ్మన్నారు. జైనమతాభిమానియైన ధనదుడు సంఘశ్రీ కుమార్తె అయిన కమలశ్రీని వివాహమాడాడని (సంఘశ్రీ కమలశ్రీ బౌద్ధ మతస్థులు) ధర్మామృత కావ్యం చెబుతున్నది. సంఘశ్రీ, కమలశ్రీలు మొదట జైనాన్ని అభిమానించినా తర్వాత ఆ మతాన్ని కాదని బౌద్ధులుగా ఉండిపోయారట. అందుకు చారణ రుషులు (జైన మునులు) కోపించి వారిని అంధులుగా శపించారట. అప్పటి నుంచి ఆ రాజ్యం 'అంధక విషయం' అయిందని ధర్మామృత కావ్యం చెబుతున్నది. ధర్మామృత కావ్యకర్త నయసేనుడు. ఇదే వృత్తాంతం హరిసేనుడు రచించిన 'బృహత్కథాకోశం'లోని 'అష్టభాషణ కథానిక'లోనూ కన్పిస్తున్నది.

అంధకుడు, అంధక రాజ్యాల ప్రస్తావన ఆర్య వాఙ్మయంలో మరొక విధంగా ఉంది. అక్కడ అంధకుడు అసురుడుగా చెప్పబడ్డాడు. ఆ రాజ్యం అసుర రాజ్యం. ఆ రాజ్యంలోని ప్రజలు బౌద్ధంపట్ల మొగ్గుచూపారు.

అశోకుని కాలంలో సింహళ దేశానికి వెళ్ళిన బౌద్ధ పరివ్రాజకులలో యక్షులూ, నాగులూ ఉన్నారు. ఇప్పటికీ శ్రీలంకలో వారి వారసులున్నారనీ లంక చరిత్ర వారితో

ముడిపడి ఉన్నదనీ పాములను, కోతులనూ, నెమళ్ళనూ ఆడిస్తూ తిరగుతున్న దిమ్మరులుగా వారు 21వ శతాబ్దంలోనూ లంకలో కనిపిస్తున్నారనీ కొందరు పరిశీలకులు చెబుతున్నారు.

అశోక చక్రవర్తి కుమారుడైన మహేంద్రుడు అంధక అట్ట కథను సింహళానికి తీసుకువెళ్ళాడనీ అది అక్కడి భాషలలోకి తర్జుమా అయిందనీ చెబుతున్నారు. ఆ ప్రకారం అది క్రీ.పూ. మూడవ శతాబ్దికి పూర్వపుదే.

బౌద్ధుల ప్రామాణిక గ్రంథమైన వినయ పిటకానికి వచ్చిన వ్యాఖ్యానాలలో మహా అట్టకథ, మహాపచ్చర అట్టకథ, కుర్దుని అట్టకథ, అంధక అట్టకథ, సంఖేట అట్టకథ ప్రాచీనాలు. అంధక అట్టకథ అంధక దేశ సంబంధమైనది. ఇది ఒక దక్కను భాషలో ఉన్నదని పాళీ వాఙ్మయ చరిత్ర చెబుతోంది. ఆంధ్రదేశంలోని తెలివాహ (గోదావరి) నది ఒడ్డున అంధక రాజ్యం ఉన్నదని. బౌద్ధ జాతక కథలలోని "సిరివణిజ' జాతక కథ చెప్పటాన్నిబట్టి అంధక రాజ్యం తెలుగువారి రాజ్యమే. 'అంధక' (ఆంధ్ర) పదం జాతి పరంగాను తెలుగు అనే పదం భాషా పరంగాను ప్రచారమయ్యాయి. అంధక అట్టకథ తెలుగు బౌద్ధుల కృషి, అది ఏ భాషలో ఉన్నదోనని పండితులు ఊహాగానాలు చేస్తున్నారు. ఇందుకు తెలివాహ నదీ సంబంధంగా తెల్-తెన్ శబ్దాలు విశ్లేషించవలసి ఉంది. 'తెన్' పలుకు క్రీ.పూ. 3,500 ఏండ్లకు ముందే ఉన్నదని పూర్వ పండితులు మారేపల్లి రామచంద్రశాస్త్రిగారి ఊహ. సంస్కృతం క్రీ.పూ. 500 ఏళ్ళనాటిది అంటారాయన. కృష్ణా, గోదావరీ మండలాలలో స్థానికుల భాష సంపన్నంగా ఉండేది కాబట్టే వారి పేర అది అంధక అట్టకథగా ప్రచారం అయింది.

అంధక అట్టకథ ఉన్న దక్కను భాష ప్రాకృతం కావచ్చుననీ లేదా తెనుగు కన్నడాలు కలిసి ఉన్నప్పటి పూర్వపు భాష కావచ్చుననీ అనుకోవాలి. అట్టకథ జానపద కళారూపం, దాని ఆధారంగానే మోహినీ అట్టం వంటి సంప్రదాయ నృత్యరీతి రూపొందింది. హిందూ దేవాలయాల శిల్ప రీతులకూ బౌద్ధమే ప్రేరణ.

సిరివణిజ జాతక కథలో ఆంధ్రపురం (తెలంగాణ ప్రాంతంలోని కోటిలింగాల రాయపురం) ప్రస్తావన ఉంది. విదర్భ నుంచి కృష్ణాతీరం వరకు భరుకచ్ఛం నుంచి ఆంధ్ర తీరం వరకు అప్పట్లో వాణిజ్య మార్గాలుండేవి. వర్తకులు, వృత్తికులాల వారు బౌద్ధాన్ని, జైనాన్ని విశేషంగా ఆదరించారనీ చరిత్ర చెబుతున్నది.

అంధకుల (ఆంధ్రదేశపు బౌద్ధుల) మతం వైదిక మతాన్ని మించి వ్యాపించటం, సామాన్య ప్రజానీకానికి దగ్గర కావటం వృత్తికులాల వారూ సంపన్న వర్గాలవారూ కూడా బౌద్ధం వైపు మొగ్గు చూపడం పురోహిత వర్గానికి కంటక ప్రాయమైంది. కృష్ణానదికి రెండు వైపులా బౌద్ధం విస్తరించినందువల్ల ఒక కాలంలో అక్కడి వైదికులు తమ 'సంకల్ప మంత్రాలలో, కృష్ణానది పేరునే తొలగించారట.

విదేశీయులైన బ్రౌన్ దొరనూ, కాటన్ దొరనూ స్మరించుకునే సంప్రదాయ పండితులు మత విషయాలలో చాలా కఠినంగా ఉంటారన్నది వాస్తవం. వర్ణ ధర్మాన్ని కాదన్న అంధకుల మీద వారికి మరింత ద్వేషం.

ఈ నేపథ్యంలో అంధకులను వధించటం మొదలయింది. ఆ మారణకాండ అంధకాసుర వధలో ప్రతిఫలిస్తున్నది.

బౌద్ధాన్ని ముఖ్యంగా అంధకుల మతాన్ని రూపుమాపే ప్రయత్నాలలో అంధకులను దుష్టులుగా దుర్మార్గపు ప్రవర్తనగలవారిగా ప్రచారం చేశారు. ఆ ప్రచారంలో అప్పటి మత ద్వేషాల తీవ్రత కనబడుతుంది ఆ కథలు అద్భుత, ఆశ్చర్య రసాల మేళవింపుతో ఆసక్తి కరంగా ఉన్నాయి.

దేవగణాలకు అంధకాసురునితో యుద్ధం జరిగిందనీ అందులో దేవతలు, పిశాచులు, అసురులు, దానవులు పాల్గొన్నారనీ మత్స్య పురాణం (అధ్యాయం 178) చెప్పింది. యుద్ధంలో ఈ జాతులన్నింటికీ నష్టం వాటిల్లింది. అంధకాసుర వధ ఘట్టం లేపాక్షి (అనంతపురం జిల్లా) వీరభద్రాలయం అర్థమంటపంలో వర్ణ చిత్రంగా కనిపిస్తున్నదని చెబుతున్నారు. ఈ చిత్రంలో శివుడు, అంధకాసురుడు, వారిని చూస్తున్న మునులూ ఉన్నారట. పై వర్ణ చిత్రంలోని మునులు బౌద్ధాన్ని మౌనంగా వీక్షిస్తున్నారో? సమర్థిస్తున్నారో? వ్యతిరేకిస్తున్నారో? (ముని అంటే మౌనంగా ఉండేవాడు అని అర్థం.)

మత్స్య పురాణం ప్రకారం అంధకాసురుని కథ ఇలా ఉంది. ఒక వనంలో శివ పార్వతులు విహరిస్తుండగా చూసిన అంధకుడు పార్వతిని అపహరించాలనుకున్నాడట. అప్పుడు శివునికీ అంధకునికీ పోరాటం జరిగింది. శివుడు అంధకుని జయించలేక పోయాడు – పాశుపతంతో అంధకుని చీలిస్తే రక్తం నేలమీదపడి మరింత మంది అంధకులు పుట్టుకొచ్చారట. అంధకుని రక్తం తాగటానికి మాతృకలను సృష్టించ వలసి వచ్చిందట. చివరకు శివుడు విష్ణువు సహాయం కోరాడు. ఆయన 'శుష్క రేవతి' అనే దేవతను సృష్టించాడు. ఆమె అంధకుని రక్తం తాగేసింది. శుష్కించిన అంధకుడినీ కొత్తగా పుట్టుకొచ్చిన అంధకులనూ శివుడు చంపేశాడు.

అంధకులంటే బౌద్ధులు. బౌద్ధాచార్యులను చంపటం, కొత్తగా పుట్టుకొస్తున్న బౌద్ధులనూ వారి శిష్యులనూ చంపటం ఇక్కడ కనిపిస్తుంది. ప్రతి రక్తపు చుక్కా నేలమీద పడి జీవం పోసుకోవటం అనేది అద్భుతమైన వర్ణన, గ్రీకు వాఙ్మయంలోనూ ఇలాంటి భావనలున్నాయి. రక్తపు చుక్కలు విస్తరించటం మత విస్తరణకు ప్రతీక. దానిని అరికట్టడానికి శుష్కరేవతిని ప్రయోగించారు. ఆమె కాళికి ప్రతీక. మాతృకలు కూడా మతవ్యాప్తిని అరికట్టడానికే నియోగించ బడ్డారు. వీరంతా శివుని గణాలే. ఈ కథ ఇంతటితో అయిపోలేదు. అంధకుని రక్తం తాగేసి అతన్ని చంపేశాక మాతృకలు ఈ లోకాన్ని తినేయాలనుకున్నాయట. దేవ అసుర మానవ లోకాలన్నీ తినటానికి వారు శివుని అనుమతి

కోరారు. "అలా చేయవద్దు" మీరు లోకాలను రక్షించాలి" అన్నాడు శివుడు. వారు ఆయన మాటలు వినకుండా లోకాలను తినటం మొదలుపెట్టారు. శైవం కూడా పెడ ధోరణులలో పడిందనే దానికి ఇది సూచన కావచ్చు. తాను చంపిన అంధకునికి గణేశత్వమూ తన సన్నిధీ శివుడు ప్రసాదించాడని చెప్పారు. అయినా రౌద్ర మాతృకలను కట్టడి చేయలేక శివుడు నిస్సహాయ స్థితిలో పడి పోయాడు. తరుచుగా పురాణ కథలలో శివుని గురించి ఇలానే చెబుతుంటారు.

ఆ పరిస్థితిలో ఆయన నృసింహుని తలచుకొన్నాడు. నృసింహుడు తన నుండి నలుగురు శక్తులనూ వారికి పరివార దేవతలుగా మరో 32 మందినీ సృష్టించి లోకాల మీదికి పంపాడు. శివుడు సృష్టించిన రౌద్ర మాతృకలు ఈ నారసింహ మాతృకలను చూసి భయపడి దారికి వచ్చాయి. శివుని మహిమలను ప్రచారం చేయవలసిందిగా వారికి ఆజ్ఞాపించి నృసింహుడూ అతడు సృష్టించిన శక్తులూ వెళ్ళిపోయారు.

బౌద్ధమూ, శైవమూ కింది వర్గాలకు ఒకే ప్రతిపత్తిని ఇచ్చిన మాట వాస్తవం. అయినా వారిలో వారికి స్పర్ధలు పెంచారు. మత కలహాలు పెంచే రాజ్యశక్తులు అప్పటి నుంచీ ఉన్నాయి.

బౌద్ధాన్ని నాశనం చేసిన శైవమూ - దానిని అదుపు చేసి పైకొచ్చిన వైష్ణవమూ పై కథలో స్పష్టంగా కనిపిస్తున్నాయి.

అంధకుని గురించి ఆసక్తికరమైన కథలు చాలా ఉన్నాయి.

1. అంధకుని శివుడు చంపుతున్నప్పుడు అంధకుని రక్తపు చుక్కలతోబాటూ శివుని చెమట కూడా జారి కిందపడింది. ఆ చెమట అంధకుని రక్తపు చుక్కలు తాగేసింది. కాని దానికి తృప్తి కలగలేదు. ఆ చెమట తపస్సుచేసి భూతమై మూడు లోకాలనూ మింగబోయిందట. దేవదానవులంతా కలసి దానిని తొక్కేశారు. అది అక్కడే ఉండి "వాస్తు" అయింది. దాని ఆకలి తీర్చటానికి వాస్తు పూజ చేయాలన్నారు. ఈ కథ ఒక మూఢ నమ్మకానికి దారి చూపింది.

2. శైవ వాఙ్మయంలోని మరో కథ ప్రకారం అంధకుడు శివ పార్వతుల మూడో కొడుకు. శివుడు సరదాగా పార్వతి కళ్ళు మూసినప్పుడు ఏర్పడ్డ చీకటిలో శివుని శరీరం నుంచి పుట్టాడు. పార్వతి, ఇతనిని పెంచవలసిందిగా హిరణ్యాక్షుడికి ఇచ్చింది. అంధకుడు తపస్సుచేసి వరాలు పొందాడు. ఇతని అనుచరులు ఒకసారి పార్వతిని, చూసి ఆమె అందం గురించి అంధకునికి చెప్పారు. అంధకునికి ఆమె పార్వతి అని తెలీదు. తెలియక తల్లి వరుస పార్వతిని చెరబట్టే ప్రయత్నం చేశాడు. ఆ సందర్భంలో దేవ దానవ గణాల మధ్య యుద్ధం జరిగింది. రాక్షస, దానవ గురువు అయిన శుక్రుడిని శివుడు మింగటం - శుక్రం ద్వారా వదలడం వగైరా ఘట్టాలతో అద్భుతంగా ఈ కథ ప్రచారం చేశారు. శివుని శుక్రం ద్వారా వచ్చాడు కాబట్టి ఆయన శుక్రుడు అయ్యాడన్నారు.

3. అంధకుడు స్వర్గంలోని పారిజాతాన్ని దొంగిలించబోతే శివుడు అతడిని చంపాడని మరో కథ.

4. అంధకుని కొడుకు అధి. తండ్రి హత్యకు ప్రతీకారం తీర్చుకోవటానికి పాము రూపంతో శివుని ఇంట్లో చొరబడి పార్వతి రూపంతో శివుడిని సమీపించాడనీ అప్పుడు శివుడు అతడిని చంపాడనీ విష్ణు బ్రహ్మ పురాణాలు చెబుతున్నాయి. పాము రూపం నాగులను దోషులుగా చూపటానికే కల్పించి ఉండాలి.

నాగులూ, యక్షులూ రాక్షసులూ, అసురులూ బౌద్ధధర్మంలో ఉన్నందువల్లనే ఆర్య గణాలకు విరోధులై చంపబడ్డారనేది సారాంశం.

ఇక్కడ మరో కథను కూడా చెప్పుకోవటం అసందర్భం కాబోదు. అది అంతర్వేది నృసింహస్వామి క్షేత్రం గురించి ప్రచారంలో ఉన్న కథ.

కృతయుగంలో వశిష్టునికీ, విశ్వామిత్రునికీ వాదం జరిగింది. విశ్వామిత్రుడు తన మంత్రం బలంతో హిరణ్యాక్షుడి కుమారుడైన రక్తవిలోచనుడిని రప్పించాడట. అతడు వసిష్ఠుని వందమంది కొడుకులనూ చంపాడు. వశిష్ఠుని ప్రార్ధనపై నృసింహుడు వచ్చి రక్తవిలోచనుడిని చంపాడు. రక్తవిలోచనుడి శరీరం నుంచి చిందే రక్తం ఎన్ని ఇసుక రేణువులపై పడితే అంతమంది రాక్షసులు పుట్టుకొస్తారట. అందుకని నరసింహుడు శక్తిని సృష్టించాడు. ఆమె నాలుక చాచి ఆ రక్తం ఎక్కడా పడకుండా అందుకుంది. తర్వాత నాలుక విదలిస్తే అది 'రక్త కుల్య' నదిగా అయింది. ఆ శక్తి గుర్రాలక్క (అశ్వరూఢాంబిక)గా పూజలు అందుకుంటోంది.

రాక్షసుల రక్తపు బొట్లు జీవం పోసుకోవటం మతవిస్తరణకూ దాన్ని అడ్డుకోవటం మత నిరోధానికీ ప్రతీకలు.

వేదమతం అతి ప్రాచీనమైనది. అసురులూ అప్పటివారే. బౌద్ధం క్రీ.పూ. ఆరవ శతాబ్ది నాటి మతం. అది అసురుల మతం ఎలా అవుతుంది? 'అంధక' శబ్దమాత్రంగా ఈ కథను ఆంధ్ర బౌద్ధులకు ముడిపెట్టటం ఏమిటి అనే సందేహం రావటం సహజమే. జనసామాన్యంలోని ఆధ్యాత్మిక అసంతృప్తి వల్లనే కొత్త మతాలు బయలుదేరాయనీ, ఆ అసంతృప్తి వేదకాలం నుంచి ఉన్నదనీ గుర్తుంచుకుంటే ఆ సందేహం రాదు. మునులు చింతనాపరులుగా ఉన్నారనీ దేవగణాల అకృత్యాలను కొందరు మహర్షులు ఖండిస్తూ వచ్చారనీ పురాణాలు చెబుతున్నాయి. సిద్ధార్థుడు 'స్వతంత్రం'గా ప్రత్యేక మతాన్ని స్థాపించ లేదు. పూర్వ తాత్వికుల ఆలోచనలు మథించి తాను గ్రహించిన ఆర్య సత్యాలను పరమార్థాన్నీ అందరకూ బోధించాడు. అసురుల చింతనకూ, భావజాలానికీ ఒక నిర్దిష్టతను ఇచ్చాడు. బుద్ధుని ఆలోచనలకు భూమిక అసురవాదమే. జైనుల మతం కూడా అలా రూపొందినదే. దేవగణాలది యాగ మార్గమైతే బుద్ధునిది యోగమార్గం. యోగ దర్శనం ప్రాచీన భారతీయుల మార్గం. ఆ ప్రాచీనులు అసురులే. క్రీ.పూ. 6వ శతాబ్దినాటికి జైన మత ధర్మాలను

ప్రవచించిన వర్ధమాన మహావీరుడు జైన సంప్రదాయంలో 24వ తీర్థంకరుడు. అతనికి ముందు కూడా జైన సంప్రదాయ భావనలున్నాయి. అవి అసురులవే.

పురాణాలు గ్రంథస్థం కావటం క్రీస్తు శకం మూడవ శతాబ్దం తర్వాతనే జరిగింది. జైన, బౌద్ధాలలోని భావనలు క్రీస్తుపూర్వం 6వ శతాబ్ది కంటె ముందటి అసురుల భావనలు. పురాణ గాథలు, వేదమతాన్ని గొప్పగా చూపించుకోవటం కోసం వాస్తవాలను గజిబిజిగా చెప్పటంవల్ల ఆ కథల ఆధారంగా సామాజిక వ్యవస్థను మతరీతులనూ ఊహించటం కొంచెం కష్టమే.

ఇక్కడే బౌద్ధ సంగీతులను గురించి కూడా ఒక మాట చెప్పుకోవాలి. బుద్ధుడు మరణించిన తర్వాతనే ఆయన బోధనలను గ్రంథస్థం చేయాలన్న ఆలోచన ఆయన శిష్యులకు కలిగింది. ఆయన బోధనలను ప్రచారంచేస్తున్న ప్రముఖులందరూ ఒకచోట చేరి తాము విన్నవి తమకు గుర్తున్నవీ అయిన సూక్తులను వల్లెవేశారు. లయబద్ధంగా వారు గానంచేస్తూ ఉండగా కొందరు వాటిని రాశారు. ఆ తర్వాత అందులో సరియైన పాఠాలు గుర్తించారు. గ్రంథాలు లేనికాలంలో అందరూ కూచుని వల్లించటమే అలవాటు. అందరూ కలసి వల్లెవేసిన సమావేశాలను 'సంగీతులు' అన్నారు. సంగీతి, సమ్యక్ గీతితో ముడిపడి ఉంది. 'సంగీతి' అనే పద్ధతిని తర్వాత కాలంలో వేద విప్రులు అనుకరించారు. ఉపనిషత్తులు అలా వచ్చినవే. ఉప నిషత్ అనేది దగ్గరగా కూచుని వినడం, చర్చించటం అనే దృశ్యాన్ని స్ఫురింపజేస్తుంది. ఆ తర్వాతనే అవి గ్రంధస్థం అయ్యాయి.

ఉపనిషత్తులు క్రీ.పూ. 1000–300 కాలానివి అనీ క్రీ.పూ. 800–600 నాటి వనీ క్రీ.పూ. 600–200 నాటివి అనీ చెబుతున్నారు. అవి గ్రంథస్థం కావటం తర్వాతి కాలంలోనే జరిగింది. సంభాషణ రూపంలో చందోబద్ధమైన విశిష్ట రచనలను "గీత" అనటం హిందూమతపరమైన రచనలలో కనిపిస్తుంది. ఇదీ బౌద్ధ సంగీతి అనుకరణమే. ఇవి పారమార్థిక భావనలను చెబుతుంటాయి. వేద పాఠాలు క్రమపద్ధతిలో లయబద్ధంగా చదవటం (పనస లుగా) శిష్యులు, గురువు చుట్టూ దగ్గరగా కూచుని జీవుడు – ఆత్మ – జనన మరణాల వంటివి చర్చించటం అన్నీ బౌద్ధ సంగీతుల ప్రభావమే.

మొదటి బౌద్ధ సంగీతి మహాకాశ్యపుని నేతృత్వంలో మగధ రాజైన అజాత శత్రువు ఆధ్వర్యంలో రాజగృహంలో క్రీ.పూ. 483లో జరిగింది. ఆ తర్వాత వంద సంవత్సరాలకు వైశాలి దగ్గర వాలుకా రామంలో క్రీ.పూ. 383లో మగధ రాజయిన కాకవర్ణి (కాలాశోకుడు) ఆధ్వర్యంలో జరిగింది. ఇతడు శిశునాగవంశస్థుడు. క్రీ.పూ. 367లో మరొక సమావేశం కౌశాంబి (పాట్నా)లో జరిగిందట. క్రీ.పూ. 257 నాటికి త్రిపిటకాలు క్రోడీకరించారు. మూడో సంగీతి క్రీ.పూ. 247లో పాటలీపుత్రంలో అశోకుని ఆధ్వర్యంలో జరిగింది. అప్పుడే అభిదమ్మపిటకానికి నిర్దిష్ట రూపం ఇచ్చారు. నాలుగో సంగీతి కనిష్కుని కాలంలో క్రీ.పూ. 100లో మూడుచోట్ల జరిగిందట. ఒకదానికి వసుమిత్రుడు అధ్యక్షుడట. క్రీ.పూ.

29-17లలోనూ ఒక సంగీతి జరిగిదంటున్నారు. ఇదీ నాలుగోదే అంటున్నారు. అయిదవ సంగీతి క్రీ.శ. 100 నాటిది. ఆరవది క్రీ.శ. 187లో బర్మాలో జరిగిందట. ఆ తర్వాతవన్నీ ఇతర దేశాలలోనే జరిగాయి.

క్రీస్తు పూర్వమే బుద్ధుని బోధనలు / జాతక కథలు గ్రంథస్థం అయ్యాయి. వాటిని చూశాక వైదిక మత భావనలను గ్రంథస్థం చేయాలనే ఆలోచన బ్రాహ్మణ పండితులకు కలిగింది.

వేదాలు చాలాకాలం మౌఖికంగానే ప్రచారమయ్యాయి. వేద వాఙ్మయం వెలుగులోకి వచ్చినది క్రీస్తు తర్వాతి కాలంలోనే. వేదాలకు మొదటి ఇంగ్లీష్ అనువాదం 1850లో వచ్చింది. రామాయణం క్రీ.పూ. 200, క్రీ.శ. 250ల మధ్యనూ, మహాభారతం క్రీ.పూ. 200 క్రీ.శ. 300ల మధ్యనూ గ్రంథస్థమయ్యాయని పండితులు నిర్ధారించారు.

పురాణాలు క్రీ.శ. 400 తర్వాతనే 300-600 ప్రాంతాలలో గ్రంథస్థమయ్యాయి. 10-11 శతాబ్దాల వరకూ వాటిలో మార్పులు చేర్పులు జరుగుతూనే వచ్చాయి. విష్ణు పురాణం క్రీ.శ. 6వ శతాబ్దం నాటిది. భాగవతం 13వ శతాబ్దం నాటిదని చాలాకాలం అనుకున్నారు. గాని, తర్వాతి పరిశోధనలలో క్రీ.శ. 11-12 శతాబ్దాల నాటికే అది ప్రచారంలో ఉన్నదని తేలింది.

ఈ వెలుగులో పురాణాలన్నీ బ్రాహ్మణ మతాన్ని, కులవ్యవస్థను నిలబెట్టే లక్ష్యంతోనే వచ్చాయి. పూర్వగాథలను తమకు అనువుగా మార్చేసుకున్నాయి. భక్తి, కర్మ సిద్ధాంతాలను ప్రవేశ పెట్టాయి. బౌద్ధంలోని విశిష్ట ఆలోచనలను అనుకరించి తమవిగా చెప్పుకున్నాయి. కొన్నింటిని హేళన చేశాయి.

బౌద్ధంలో మైత్రి విహారం అనేది ఒక ముఖ్యమైన భావన. జీవులపట్ల మనం మైత్రీ భావం చూపితే దుష్ట స్వభావం గల జీవులు కూడా మనపట్ల ప్రేమగా ఉంటాయంటారు. పాళీ భాషలో మైత్రిని 'మెత్త' అంటారు. మెత్త విహారాన్ని వైదిక వాఙ్మయం "మెట్ట వేదాంతం"గా చులకన చేసింది.

గ్రాసాటన, భిక్షాటన అనేవి జైన/బౌద్ధ శ్రమణకుల జీవన నియమాలు. వీటిని కూడా వైదిక మతం అపహాస్యం చేస్తూ గాసట, బీసటలుగా చెప్పింది. మనుస్మృతి చెప్పిన ఆశ్రమ ధర్మాలలో సన్యాసాశ్రమంలో ఈ గ్రాసాటన భిక్షాటన నియమాలున్నాయి. ఇవి శ్రమణకుల నుండి తీసుకున్నవే. క్రీ.శ. 3, 4 శతాబ్దాలకు బౌద్ధంలో అనేక శాఖలు ఏర్పడ్డాయి, బుద్ధ వచనానికి కాలానుగుణంగా రకరకాల వ్యాఖ్యానాలు ప్రచారమయ్యాయి.

చైత్యకులు తెలుగుదేశంలోని బౌద్ధులు, వీరిలో నాలుగు శాఖలుండేవట. పూర్వ శైల, అపరశైల, రాజగిరిక, సిద్ధార్థక అనే ఈ నాలుగు శాఖలనూ కలిపి అంధకులుగా బుద్ధఘోషుడు చెప్పాడు.

అంధకాసురుడు బౌద్ధానికి ప్రతీక అనటం సత్యదూరం కాబోదు. ఈ కథ పురాణాల కాలంలో కల్పితమైన కథ కావచ్చు. అంతకంటే ముందటిదీ కావచ్చు. రామాయణంలో ప్రస్తావనకు వచ్చిందంటే రామాయణ కాలంలో ఒక రూపానికి వచ్చి ఉండాలి.

ఆర్య వాఙ్మయానికి సంబంధించిన చాలా వృత్తాంతాలు, కథలూ బౌద్ధ జైన వాఙ్మయాలలోనూ కనిపిస్తుంటాయి. జాతక కథలలోని దశరథ జాతకం, దేవదమ్మ జాతకాలు రామాయణ కథాంశాలను స్ఫురింపజేస్తాయి. ఏది మూలమో కనిపెట్టలేనంతగా ఆర్య వాఙ్మయం జాతక కథలను తనకు అనుగుణంగా మార్చేసుకున్నది. రామాయణంలో కైక వరాల వృత్తాంతం వంటిది దేవదమ్మ జాతకకథలో ఉంది. మహాభారతంలోని యక్ష ప్రశ్నల ఘట్టానికి మూలం అనదగిన ఘట్టమూ అదే జాతకకథలో చూడవచ్చు.

ఘట జాతక కథ ఘటకుమారుడనే మంత్రికి బుద్ధుడు చెప్పిన కథ. ఇది భాగవత భారతాలలోని కృష్ణుని కథను పోలి ఉంది. దేవగర్భ, ఉపసాగరుడు అనే దంపతులూ, నందగోప, అంధక వెణ్ణు దంపతులూ ఇక్కడ ముఖ్యపాత్రలు. తనకు పుట్టిన మగ పిల్లలను రక్షించుకోవటానికి దేవగర్భ తన పిల్లల్ని అంధకవెణ్ణు దగ్గరకు చేర్చి అక్కడి ఆడపిల్లల్ని తన దగ్గరకు రప్పించుకుంటుంది. (ఇది చాలా సుదీర్ఘమైన కథ) అంధక వెణ్ణు (వెన్నుడు) తన దగ్గర పెరిగిన పిల్లలచేత కంసుని చంపించి జంబూద్వీపం అంతా వాసుదేవుని చేత జయింపచేశాడట.

అంధక వెణ్ణుడే ఆంధ్ర విష్ణువు అయ్యాడా? ఈ కథలు ఎందులోంచి ఎందులో చేరాయో, బౌద్ధగాథలనే ఆర్య వాఙ్మయం తీసుకున్నదా అనే విషయాలు పరిశోధించాల్సిన అంశాలు.

బౌద్ధులను చిత్రహింసలు పెట్టి తలలు నరికి బౌద్ధాన్ని ఈ దేశం నుంచి తరిమి వేసిన చరిత్ర భారతదేశానికి ఉంది. బౌద్ధుల తలలు నరికి చూపిన వారికి వైదిక గురువులు పారితోషికాలు ఇచ్చేవారు. ఎన్ని తలలు చూపితే అంత ఘనంగా వరాలు ఇచ్చేవారు. అదే పద్ధతి గుళ్ళో కొబ్బరికాయ కొట్టడంలో కనిపిస్తుంది. పగిలే కొబ్బరి కాయలు బౌద్ధుల తలలకు ప్రతీకలు. పూజారి ఆ కొబ్బరికాయ దేవునికి చూపాకనే భక్తులకు సగం చిప్ప ప్రసాదంగా ఇస్తాడు. అంతా లెక్క ప్రకారమే జరుగుతుంది. ఎన్ని కొబ్బరి కాయలు కొడితే అన్ని వరాలు.

రోజుకి ఎంతమందిని చంపారో, ఎన్‌కౌంటర్లు ఎన్ని చేశారో, ఏ రోజుకు ఆ రోజు లెక్కలు చెప్పాలి. ఆ ప్రాతిపదికపైనే ప్రశంసాపత్రాలు అందుతాయి. అన్నీ లెక్కల ప్రకారమే. ఆనాడు బౌద్ధుల తలలపై ఉన్న పారితోషికం ఇరవై ఒకటో శతాబ్దం నాటికి ఎన్‌కౌంటర్ల మీదికి వచ్చింది.

బౌద్ధధర్మాలు పాటిస్తూ అందరూ సత్‌ప్రవర్తనతో ఉంటే ఎలాగా? అని ఆనాటి వైదిక, పురోహిత వర్గాలు మథనపడి ఉంటాయి. ఫలితంగా అంధకాసురుని కథ ప్రచారమైంది.

స్త్రీల పట్ల కామదృష్టి కనబరచారనే ఆరోపణ అంధకాసురుని మీదనే కాదు మొత్తం బౌద్ధుల మీదనే చేశారు. లంజెదిబ్బల పేర బౌద్ధాన్ని అప్రతిష్ఠపాలు చేశారు. కథల ద్వారా ప్రచారం చేశారు. బౌద్ధాన్ని తరిమికొట్టారు. స్త్రీలపై లైంగిక వేధింపులు దేవ గురువులకూ దేవతల రాజైన ఇంద్రునికీ కొత్త కాదు. అయితే వారి దోషాలు ఉపేక్షించబడ్డాయి. చిన్న చిన్న శాపాలతో సరిపెట్టుకున్నారు.

సామాన్యులు పాలకవర్గాల దమననీతిని ప్రశ్నించటం అనాడూ – ఈనాడూ నేరమే. అది ఎన్‌కౌంటర్లకూ కాల్చివేతలకూ దారితీస్తుంది. రుద్రుడు అంధకుడిని దహించినట్టే దహించివేస్తారు.

అనాటి అంధకులలాగా, అసురులలాగా ఈనాడు గిరిజన ఆదివాసీ వర్గాలూ, బలహీన వర్గాలూ కేవలం నేరారోపణలతో విచారణ లేకుండానే శిక్షలు అనుభవిస్తున్నారు. న్యాయ నిర్ణయంలో కుల మత వర్గాల వివక్ష బలంగా ఉంది.

మతాతీత రాజ్యంగా భారతదేశాన్ని నిలబెట్టాలనే డా॥ అంబేద్కర్ ఆకాంక్ష ఎప్పటికి రూపుదాలుస్తుందో గాని. పాలకవర్గాల ఆంతర్యాన్ని గుర్తించటంలో కింది వర్గాలు అప్రమత్తంగా ఉండాలనే సాహిత్యమూ పాఠం చెబుతోంది.

"అంధక" పదం ఆంధ్రదేశాన్ని సూచిస్తున్నట్టే హిరణ్యకశిపుని వారసత్వాన్నీ సూచిస్తున్నది. హిరణ్యకశిపుని మునిమనుమడైన బలి చక్రవర్తికి నూరుగురు కొడుకులట. వారిలో ఒకడు 'ఆంధుడు'. ఆంధుడు పాలించిన రాజ్యంగా ఇది ఆంధక/అంధక రాజ్యంగా పేరు పడిందనీ అంటారు. ఆంధుడు, బలికి కొడుకా మనుమడా అనేది నిర్ధారణ కాలేదు గాని అతని వారసత్వం కలవాడనేది స్పష్టం.

హిరణ్యకశిపుని సంతతి బౌద్ధధర్మాన్ని ఆదరించటంవల్లనే "అంధక" సంబంధంగా ఆంధుడు అనే పేరు అతనికి పెట్టారా అనేదీ పరిశీలించాలి...

"ఆంధ్ర" పదం జాతిపరంగా వాడబడిందనీ ఐతరేయ బ్రాహ్మణంలో తొలిసారిగా ప్రస్తావించారనీ చరిత్ర చెబుతున్నది. క్రీ.పూ. 300 సంవత్సరంలో మెగస్తనీసు రాసిన 'ఇండికా' గ్రంథం కూడా ఆంధ్రుల గురించి ప్రస్తావించింది. వారు బౌద్ధమతానుయాయులు.

బుద్ధుని గురించి రామాయణంలో రాముడు ప్రస్తావించాడు. దశరథుని ఆస్థాన పండితులలో ఒకడైన 'జాబాలి' రాముడిని అయోధ్యకు తిరిగి తీసుకువెళ్ళి పట్టాభిషేకం జరిపించేందుకు ఒప్పించే ప్రయత్నంలో చాలా విషయాలు – జీవి ఉత్పత్తి, ప్రత్యక్ష పరోక్ష ప్రపంచాలు మొదలైనవి రామునితో చర్చించాడు. రాముడు వాటిని ఒప్పుకోలేదు. నాస్తికులను దూరంగా పెట్టాలన్నాడు.

"యథాహిచోరస్స తథాహి బుద్ధస్తథాగతం నాస్తిక... ననాస్తికే నాభిముఖో బుధస్యాత్" (అయోధ్య 109–34) పండితులైనవారు దొంగలను దూరంపెట్టే విధంగానే నాస్తికులనూ తథాగత బౌద్ధులనూ దూరం పెట్టాలన్నాడు.

రామాయణం అయోధ్యకాండ 108, 109 సర్గలలో ముని జాబాలికీ రామునికీ జరిగిన వాదోపవాదాల గురించి చెప్పింది. నాస్తిక మత ప్రసక్తీ దాని ఖండనమూ బౌద్ధమత ప్రసక్తీ దాని ఖండనమూ ఇక్కడ ఉండటాన్ని బట్టి రామాయణ కథ మరీ ప్రాచీన గాథ కాదని అనుకోవాలి. అమరకోశం ప్రకారం "సర్వస్థ, సుగత, బుద్ధ, తథాగత, భగవాన్, మారజిత్, ధర్మరాజు, జినః, వినాయక, మునీంద్ర, శ్రీఘన, శాన్త, ముని, దశబల, లోకజిత్, అద్వయ వాది, షడభిజ్ఞ, సమస్త భద్ర అనేవి (18 పేర్లు) బుద్ధదేవుని పేర్లు. రామాయణం ప్రస్తావించినది బౌద్ధధర్మ ప్రవర్తకుడైన తథాగత బుద్ధుడినే. పురాణకర్తలు బుద్ధుడిని రామునికి తర్వాతివానిగా చెబుతున్నారు. బుద్ధుడిని రామునికి తర్వాతవానిగా చెప్పటానికే దశావతారాలలో బుద్ధావతారాన్ని రాముని తర్వాత చేర్చి కళారూపంగా ప్రచారం చేశారు.

ఈ అవతారాల గురించి భిన్నాభిప్రాయాలున్నాయి. బుద్ధుడిని అవతారాలలో చేర్చటం 11వ శతాబ్దంలో జరిగిందని కొందరి అభిప్రాయం. ఇది వైష్ణవాన్ని నిలబెట్టు కోవటానికే జరిగిందని వారి నమ్మకం.

చాలా విషయాలలో బౌద్ధాన్ని వైదిక మతాలు అనుసరించాయి. ముఖ్యంగా అష్టాంగ మార్గం (8) అష్టాదశ (18) సంఖ్యలను బౌద్ధం నుంచే గ్రహించారు. రాముని రూపమూ, కృష్ణుని రూపమూ బుద్ధుని పోలికలతోనే కనిపిస్తాయి. నేపాల్‌లోని నీర్ నారాయణ్ గుడి లోని శేషతల్పశాయి విగ్రహాన్ని నేపాలీయులు "నీలకంఠ బుద్ధ" అని పిలుస్తారు.

బౌద్ధాన్ని భారతదేశం నుండి తరిమివేశారా? దానికదే అంతరించిపోయిందా? అని పండితులు చర్చించుకుంటూ ఉంటారు. అంధకాసుర వధ కథ పరిశీలిస్తే బౌద్ధాన్ని క్రూరంగా అణచివేశారనీ దేశం నుంచి పారిపోయేలా చేశారనీ అర్థమవుతుంది. అలా చేసినది విష్ణువును సర్వోన్నతునిగా నిలబెట్టాలనుకున్న పురోహిత వర్గమేననీ అర్థమవుతుంది. ఈ సందర్భంలో ప్రముఖ విమర్శకుడు యం.యన్. రాయ్ తన "సైంటిఫిక్ పాలిటిక్స్" అనే గ్రంథంలో చేసిన పరిశీలన కూడా గమనించదగ్గది. బౌద్ధం తెచ్చిన విప్లవం గురించి దానిని (రాజ్యం) అణచివేయటం గురించీ ఆయన వివరించారు.

పూర్వపు మత సాంస్కృతికోద్యమాలను సామాజిక ఘర్షణలుగా గమనించగలిగితే వాటి విప్లవ రూపాలను చూడగలుగుతాము. ఈ కోణంలో అసురుల / బౌద్ధుల తాత్విక భావజాలాన్ని అణచివేసిన రాజ్య స్వరూపాన్ని చూడాలి. బౌద్ధాన్ని భారతదేశం తుడిచి పెట్టడంవల్ల దేశం చాలా నష్టపోయిందని అనంతర కాలంలో గుర్తించారు. దానిని తిరిగి భారతదేశంలో ఉజ్జీవింప చేసిన మహనీయుడు డా॥ అంబేద్కర్.

బౌద్ధాన్ని అణచివేసిన చరిత్రను యథాతథంగా చెప్పలేకపోయినా ఆ ఛాయలను సూచిస్తున్న పౌరాణికులనూ, మేధావులనూ అభినందించుకోవాలి. వారు ఏ లక్ష్యంతో ఈ కథలు చెప్పారో?

# విశ్వరూపుడు

విశ్వరూపుని వృత్తాంతం అతి ప్రాచీనయుగాల నాటిది. బలమైన అసుర నాయకులలో వృత్రాసురుని పేరు ఆర్య వాఙ్మయం ప్రస్తావించింది. వృత్రాసురుని గురించి తెలుసుకోవాలంటే విశ్వరూపుని గురించి ముందు తెలుసుకోవాలి.

విశ్వరూపుడు త్వష్ట ప్రజాపతి కొడుకు. ఉదాత్తుడు. శత్రువులతోనూ సఖ్యంగా ఉండేవాడు. సమధర్మం – సమన్యాయం పాటించేవాడు. గొప్ప జ్ఞాని.

(i) ఇతనికి మూడు తలలుండేవట – మూడు ముఖాలు – మూడు నోర్లు – ఒక దానితో సోమపానం, రెండో దానితో సురాపానం చేస్తూ మూడోదానితో అన్నం తినేవాడు. (ప్రజలను రంజింపచేయటానికి అల్లిన అద్భుత కల్పనలు ఇవి).

దానవులూ దేవతలూ దాయాదులే కాబట్టి ఇద్దరి దగ్గరి నుంచీ యజ్ఞభాగాలు తీసుకునేవాడు. ఇరు పక్షాలనూ సమంగా చూసేవాడు. దేవతలు ఇచ్చినవి దానవులకూ ఇస్తుండేవాడు. ఇది సహించని ఇంద్రుడు ఇతని తలలు నరికేశాడట. సురాపానం చేసిన ముఖం నుంచి పిచ్చుకలు, సోమపానం చేసిన ముఖం నుంచి చాతక పక్షులు, మూడో ముఖం నుంచి తిత్తిరి పక్షులు పుట్టాయట. సోమపానం, సురాపానం వేర్వేరు. (మామూలుగా తాగితే సుర, యజ్ఞంలో కూచుని తాగితే అది సోమం. తిత్తిరి పక్షులకూ తైత్తిరీయానికీ సంబంధం చెబుతుంటారు) (ఇది స్కంద పురాణ కథ 1-15).

(ii) విశ్వరూపుడు ఇంద్రపదవి కోరి తపస్సుచేస్తే తపస్సు పాడుచేయటానికి ఇంద్రుడు అప్సరసలను పంపాడనీ అయినా తపస్సు కొనసాగుతుంటే తానే వెళ్ళి తలలు నరికాడనీ మరో కథ.

(iii) బృహస్పతి లేని సమయంలో ఇంద్రుడు విశ్వరూపుడిని పురోహితునిగా చేశాడు. ఈ పురోహితుడు దేవతలతోబాటుగా దైత్య దానవులకూ హవిస్సు/యజ్ఞభాగాలు పంచేవాడు. అది సహించని ఇంద్రుడు విశ్వరూపుని తల నరికాడు.

ఈ కథలన్నీ విశ్వరూపుని సమ దర్శనానికి నిదర్శనాలు. ఈ వ్యవహారం పాలకవర్గానికి నచ్చలేదు. అందుకే విశ్వరూపుని చంపారు. విశ్వరూపుని చంపిన ఇంద్రుడిని బ్రహ్మహత్యా పాతకం వెంటాడింది. దానిని తప్పించుకోవటానికి ఇంద్రుడు నీళ్ళలో మునిగి రెండునూర్ల దివ్య సంవత్సరాలున్నాడు. ఆ సమయంలో నహుషుడు ఇంద్రుని స్థానంలో పదవిలో ఉన్నాడట. పదవికి అనర్హులయిన వారు తమ శిక్షా కాలం పూర్తి అయ్యేవరకూ తమవారిని ఆ పదవిలో కూర్చోబెట్టటం అప్పటి రాజకీయమే.

భాగవతం ప్రకారం (6-296-281) మరోకథ ఉంది. దేవాసుర యుద్ధాలలో దేవగణాలు అసురుల చేతిలో ఓడిపోయి బ్రహ్మ దగ్గరకు వెళ్ళి తమ కష్టాలు వెళ్ళబోసు

కున్నారు. బ్రహ్మ వాళ్లను బాగా కేకలేశాడు. "చిన్నప్పటి నుంచీ మీకు ఎవరూ మంచి బుద్ధులు నేర్పేవారు లేకపోయారు. మంచి గురువును (బ్రాహ్మణుని) పెట్టుకోండి. మీరు ధనమదంతో ఉన్నారు" అన్నాడు. అయినా ఒక ఉపాయం చెప్పాడు. "త్వష్ట అనే మనువు పుత్రుడయిన విశ్వరూపుని గురువుగా చేసుకోండి. అతడు తపోమహత్వ సత్వ స్వభావుడు. అతనిని ఆరాధించండి" అని చెప్పాడు. విశ్వరూపుడు ముని అని చెప్పింది భాగవతం. మంచి శిష్యులే గురువుకు పేరు తెస్తారని నమ్మి విశ్వరూపుడు దేవగణాలకు ధైర్యమూ ఉత్సాహమూ ఇచ్చాడు. "శిలోంఛ వృత్తి" గురించి చెప్పాడు. శిలోంఛవృత్తి మొదట జైన సన్యాసులది. పంటకోత కోశాక మళ్ళలో, జారిపడిన ధాన్యపు గింజలు ఏరుకొని బ్రతుకు సాగించే విధానం. ఇది కోరికలు లేని ఉదాత్త జీవనానికి అది మార్గం - దానిని విశ్వరూపుడు చెప్పాడనటంవల్ల అప్పటికి "జైనమతం" ధార్మిక జీవనానికి ఉత్కృష్టమైన మార్గంగా ఉండేదని చెప్పవచ్చు. దీనినే అసురులూ అనుసరించారు. దీనినే మాయా మతం అనీ అన్నారు. అంటే మాయ గురించి తెలియజేప్పేదని భావం. యా = ఏది, మా = కాదు (వద్దు). ఏది కాదో అది మాయ. యధార్థాన్ని మరుగుపరచి కానిదాన్ని వ్యక్తీకరించటం మాయ అని చెప్పుకోవచ్చు.

విశ్వరూపుడు ఇంద్రునికి "నారాయణ కవచం" మంత్రోపదేశం చేశాడు. ఆ విద్య ఐశ్వర్యాన్నిస్తుందట. ఆ విద్యతో ఇంద్రుడు మహిమాన్వితుడయ్యాడు. విశ్వరూపునకు మూడు తలలు. ఒకటి సురాపానం, ఒకటి సోమపానం చేస్తాయట. యజ్ఞభాగాలు (దేవతల) నుండి తీసుకొని రాక్షసులకు ఇస్తున్నాడనే నెపంతో విశ్వరూపుని చంపారు. ఇంద్రుడే ఆ పనిచేశాడు. విశ్వరూపుని తలలో సోమపానంచేసే తల కపింజల పక్షి అయింది. సురాపానం చేసే తల కలవింకం అయింది (కలివికోడి?) అన్నం తినే తల తిత్తిరి పక్షి అయింది. ఈ మూడు పక్షుల రూపాల తోటీ బ్రహ్మహత్య వచ్చి ఇంద్రుడిని చుట్టుకుంది. ఇంద్రుని కష్టాలు ఎవరూ తప్పించలేకపోయారు. బ్రహ్మహత్యను బతిమాలుకుని ఒక సంవత్సరం ఆ దోషం అనుభవించాడట. అది ఒక సంవత్సరం కఠిన కారాగార శిక్షలాంటిది అయి ఉంటుంది. తర్వాత "నా పాపం పుచ్చుకోండి" అంటూ భూమిని - జలాన్ని - వృక్షాలను- - స్త్రీలను - ప్రార్థించి వారికి ఆ శిక్షను బదిలీ చేశాడు. వాళ్ళు గ్యారంటీదారులుగా ఉన్నా రనుకోవాలి. అందుకుగాను వారికి కొన్ని మినహాయింపులు ఇచ్చాడు. భూమి తనమీద చేయబడ్డ గోతులు అవే పూడిపోయే విధంగా నీళ్ళు తనలో కడగబడ్డవన్నీ స్వచ్ఛంగా అయ్యే విధంగా చెట్లు కొట్టివేసినా తిరిగి మొలకెత్తే విధంగా స్త్రీలకు ఎప్పుడూ కామ సుఖం కలిగే విధంగా వరాలు ఇచ్చాడట. అలా అవి కోరాయనీ రాశారు. ఆ దోషాలు ఈ నలుగురిలోనూ భూమిమీద నెరియలు (ఇరిణలు)గా నీటి మీద బిందువుల నురగగా చెట్ల మీద ఎండుకొమ్మల రూపంలో స్త్రీలలో రజోవికారంగా (ఋతుక్రమంగా) కనిపిస్తూ ఉంటుందని భాగవతం చెబుతోంది (6-316) ఎవరో చేసిన దోషం మరెవరో

అనుభవించటం అంటే ఇదే. "ఎప్పుడూ కామ సుఖం" అనేది అంటగట్టి స్త్రీలను అన్ని విధాలా చులనకగా చూడటానికి, ఇలాంటి కథలు బాగా అల్లారు. విశ్వరూపుని చంపినందుకు బ్రహ్మహత్యా పాతకం చుట్టుకున్నదీ అంటే విశ్వరూపుడు ఎంతటివాడో అర్థమవుతున్నది. జ్ఞానులనూ సజ్జనులనూ చంపటంలో రాజ్యం ఏమాత్రం సంశయించదనే విషయమూ ఇక్కడ స్పష్టమవుతున్నది. సన్మార్గంలో ఉన్న స్థానికులపట్ల ఆర్య నాయకులు అనుసరించిన తీరు ఇది. జైన ధర్మానుయాయులకు "నారాయణ కవచం" వంటివి ఆపాదించటమూ ఈ కథలో చూడవచ్చు. అసుర వీరుల విషయంలో ఇలాంటి వక్రీకరణలు పురాణాలలో ఉన్నాయి. అప్పటికీ ఇప్పటికీ పాలకవర్గపు విధానం ఇదే.

యజ్ఞ భోక్తలుగా దేవ/ఆర్య గణాలవారే ఉండాలి. ముదుపులు వారికే అందాలి. బడుగు వర్గాలు ఎప్పటికీ అలాగే ఉండిపోవాలి అనే వర్గ స్వభావమూ, బలవంతులైన నిందితులు శిక్షల నుంచి ఎలా తప్పించుకుంటారో అమాయకులకు శిక్షలు ఎలా అంటగడతారో అనే దుష్ట పాలన రీతులూ ఈ కథలో చూడవచ్చు.

# వృత్రాసురుడు

విశ్వరూపుని హత్యకు ప్రతీకారం తీర్చుకోటానికి అసురులు హోమంచేసి ప్రత్యేక శక్తులతో వృత్రుని పుట్టించారు. ప్రత్యర్థి వర్గం బలంగా ఉన్నప్పుడు దీటైన వారి కోసం వెదకటం రాజనీతి. వృత్రుడు హోమగుండం నుంచి పుట్టాడు. రోజుకు వంద (100) విల్లుల ప్రమాణంలో పెరిగి విశ్వమంతటా నిండిపోయాడు. ఈ భావనను రకరకాలుగా విశ్లేషించుకోవచ్చు. దేవ/ఆర్య గణాలకు ప్రత్యర్థి కాబట్టి ఇతనిని అసురునిగా, దుష్టునిగా, ఆర్య వాఙ్మయం ప్రచారం చేసింది. రాజ్య విధానాలను నిలదీసిన వారిని ఇప్పుడు మావోయిస్టులూ, నక్సలైట్లూ అంటున్నట్లే అప్పుడు అసురుల గురించీ చెడుగా చెప్పారు. వృత్రుడు, మాయావి అన్నారు.

వృత్రుని ప్రసక్తి వేదాలలో కనిపిస్తుంది. రామాయణంలోనూ ఇతని ప్రసక్తి ఉంది. (బాలకాండ). మాయావి అయిన వృత్రుని ఇంద్రుడు మాయతోనే చంపాడని ఋగ్వేదం కీర్తించింది. (ఋగ్వే. 10-143-1-80-7). "మాయాచారిని మాయతోనే బంధించాలి, సాధువులను సాధుమార్గంతో జయించాలి" అనే నీతి భారతంలో (శాంతి. 109-29) చెప్పారు. కాని, సాధు మార్గంతో జయించిన సందర్భాలు చాలా తక్కువ.

ఋగ్వేద కాలానికి ఆర్యులు పశుపాలనపై ప్రధానంగా ఆధారపడి ఉన్నారు. స్థానిక జాతులు (దస్యులు మొ॥ వారు) వ్యవసాయ నాగకరికత కలిగి ఉన్నారు. వ్యవసాయ అవసరాల కోసం ఆనకట్టల నిర్మాణం ద్రావిడ నాగరికతలో కనిపిస్తున్నది. వీరి ఆనకట్టలను ఆర్యసమూహాలు సహించకపోవటం - నీటి ప్రవాహాలను అడ్డుకుంటున్నారనే కారణంతో అసురులను విరోధులుగా భావించటం వేదసూక్తాలలో ధ్వనిస్తున్నది. రుగ్వేదంలోని వృత్రాసురుని వర్ణన ఈ ఊహకు ఆధారం.

వృత్రుడు 20 వేల సంవత్సరాలు తపస్సు చేసి 'రాత్రిగాని, పగలుగాని, జీవం ఉన్న వారిచేతగాని, లేనివారి చేతగాని, తలంమీదగాని, జలంమీదగాని మరణం లేకుండా" బ్రహ్మచేత వరం పొందాడు. ఇతడు బలవంతుడు. ఇతని బలం యుద్ధ సమయంలో మరింత ఎక్కువవుతుందట. దేవగణాలు యుద్ధంలో ఇతనిని గెలువలేకపోయారు. ఒకప్పటి యుద్ధంలో ఇంద్రుడు దధీచి ఎముకలతో ఆయుధాలు తయారు చేసుకొని వృత్రుని మీదికి యుద్ధానికి వెళ్ళాడు. అయినా వృత్రుని ధాటికి ఆగలేక మూర్ఛపోయాడు. మూర్ఛపోయిన ఇంద్రుడిని వృత్రుడు చంపలేదు, బందీగానూ తీసుకోలేదు. "మీ రాజును అమరావతికి తీసుకుపోండి" అని దేవతలతో చెప్పి ఇంద్రుడిని వదలిపెట్టి పంపేశాడు. ఇంద్రునికి తెలివివచ్చేసరికి ఎదురుగా బ్రహ్మ కన్పించాడు. ఆ తరువాత ఇంద్రుడు వృత్రుడిని చంపేశక్తి కోసం శివుడిని ఆరాధించాడు.

వృత్రాసురుని చంపటం గురించి రకరకాల ఊహలున్నాయి. ఏ విధంగానూ వృత్రుని గెలవడం కష్టమనీ, సమయం కోసం చూస్తూ వృత్రునితో స్నేహంగా ఉండాలనీ విష్ణువు ఇంద్రునికి సలహా ఇచ్చాడు. ఆ సలహా ఇంద్రుడు పాటించాడు. వృత్రుడు ఇంద్రుడిని నమ్మి అతనితో స్నేహంగా ఉన్నాడు. అలా 1000 సంవత్సరాలు గడిచాయి. ఒకనాటి సంధ్యా సమయంలో ఇద్దరూ సముద్రపు ఒడ్డున నడుస్తున్న సమయంలో ఇంద్రుడు సముద్రపు నురుగుతో వృత్రుడిని కొట్టి చంపాడు. అప్పుడు ఇంద్రునికి బ్రహ్మహత్యా పాతకం కలిగింది. ఇది ఒక కథ.

వృత్రుడు సముద్రపు నురుగుకు మూర్తీకరణ అనీ, ఆ నురుగుతో వచ్చే అలలు అందిన వస్తువులను తనలోకి లాక్కొని పోవటం కాసేపటికి మళ్ళీ తెచ్చి విడవటం అనే ప్రకృతికి ఇది ఊహా చిత్రం అనీ కొందరంటారు.

వృత్రుడు గడ్డకట్టిన మంచు రూపమనీ కరిగి ఆవిరై వాయురూపాన్ని ధరిస్తాడనీ దట్టమైన నల్లని పొగగా ఇంద్రుణ్ణి ఆవరిస్తాడనీ, వర్షాలను అడ్డు కుంటాడని ఒక భావన. వృత్రుడు రోజుకు 100 విల్లుల ప్రమాణంలో పెరిగి విశ్వమంతటా నిండిపోవటం ఆ భావనకు మూర్తీకరణం.

వృత్రుడు శివభక్తుడు. ఒకప్పుడు శివపూజ మరచిన సమయంలో తేజస్సు కోల్పోయాడట. అయినా ఒక యుద్ధంలో ఐరావతంతో సహా ఇంద్రుడిని మింగేశాడట. అప్పుడు దేవతలంతా శివుణ్ణి పూజిస్తే అతని అనుగ్రహంతో ఇంద్రుడు వృత్రాసురుని పొట్ట చీల్చుకుని బయటకు వచ్చాడట. వృత్రుని శరీరం గంగా యమునల మధ్య ప్రాంతంలో పడిందనీ, తల మాళవంలో పడిందనీ స్కంద పురాణం చెబుతోంది. దేవతలంతా ఆ తలను ఆరు నెలలు ఛేదించారట.

ఇంద్రుడు వృత్రాసురుని చంపేటప్పుడు, విష్ణువు తనను తాను మూడు భాగాలుగా విభజించుకొన్నాడట. ఒక భాగం శక్తి ఇంద్రుడినీ, రెండోది వజ్రాయుధాన్నీ, మూడోది భూమినీ చేరాయట. ఆ శక్తితోనే ఇంద్రుడు వృత్రుని చంపగలిగాడు. వృత్రుడిని వజ్రాయుధంతో కొట్టి చంపాడని ఒకచోట, సముద్రపు నురుగుతో కొట్టి చంపాడని మరోచోట చెప్పారు. వృత్రుడిని చంపాక ఇంద్రుని బ్రహ్మహత్య వెన్నాడింది. దాని నుండి తప్పించుకోవటానికి ఇంద్రుడు రక్షణ కోసం ముల్లోకాలూ తిరిగాడు. బ్రహ్మహత్య అతనిని ముసలి చండాల స్త్రీ రూపంలో వెన్నాడింది. పాపాలన్నీ చండాల రూపంలో ఉంటాయని ప్రచారం జరిగింది అనటానికి ఇది ఉదాహరణ.

**బ్రహ్మహత్య చండాల రూపంలో ఉండటం :**

బ్రహ్మహత్య అనేది వైదిక వాఙ్మయంలో చాలా ప్రచారంలో ఉన్న పదం. బ్రహ్మజ్ఞానం కలవారిని బ్రాహ్మణులుగా, గుర్తించే సమాజం నాటి పదం అది. బ్రాహ్మణులను (బ్రహ్మజ్ఞానులను) చంపినప్పుడు, చంపిన వారికి (హంతకులకు) బ్రహ్మహత్యా పాతకం

చుట్టుకునేది. అప్పట్లో ఆ పాపం స్పష్టంగా కన్పిస్తూ హంతకులను తరుముతూ ఉండేది. హంతకులు దానిని తప్పించుకోవటానికి తమ ప్రయత్నాలు తాము చేసుకునే వారు. ఇప్పటి లాగానే హంతకుడు పోలీసు రక్షణ ఏర్పాట్లు లేదా తన మాఫియాతో రక్షణ ఏర్పాట్లు చేసుకోవటం అప్పుడూ ఉండేది. ఆ రూపాలు వేరు. తపస్సంపన్నులైన అసురులను చంపినప్పుడు హంతకులకు బ్రహ్మహత్య పాతకం చుట్టుకున్న కథలు పురాణాలలో ఉన్నాయి. మునులను, దేవతలను చంపిన రాక్షసులకు బ్రహ్మహత్య పాతకం చుట్టుకున్న ఉదంతాలు పురాణాలలో చాలా తక్కువ. అసలు లేవేమో కూడా.

వృత్రాసురుని చంపి ఇంద్రుడు ఇంటికి వెళ్తుంటే బ్రహ్మహత్య పాతకం అతన్ని 'వెన్నంటి వెళ్ళింది. అది ముసలి చండాల స్త్రీ రూపంలో ఉంది. కుష్ఠు రోగంతో వణుకుతూ శరీరపు చేపల కంపుతో చుట్టూ ఉన్న ప్రదేశాన్ని దుర్గంధ భూయిష్టంగా చేస్తూ 'ఆగు ఆగు' అని గద్దరిస్తూ ఇంద్రుని వెన్నాడింది. అప్పుడు ఆమెను ఇంద్రుడు గుర్తించాడు... "నొక్క కామినింగని దాని వృత్రవధోద్భవంబగు బ్రహ్మ హత్యగా నెరిగి భయాక్రాంతుడై..." అని పోతన భాగవతంలో చెప్పాడు. చండాలురను - మాల మాదిగ కులాల వారిని వర్ణించేటప్పుడు వికృతాకారం, ఏవగింపు కల్గించే చేష్టలు, విన్యాసాలు, దుర్గంధం వర్ణించటం కవి సంప్రదాయం. చాలా కావ్యాల్లో చండాలురను ఇలాగే వర్ణిస్తుంటారు. గౌరన హరిశ్చంద్రోపాఖ్యానం గానీ, కృష్ణదేవరాయల ఆముక్తమాల్యద గానీ - కింది కులాలను ఏవగింపు కలిగించే వారిగానే చూపాయి. ఆనాటి మురికివాడల జీవితాల వర్ణనలు అవి. బ్రహ్మహత్య నుంచి తప్పించుకోవటానికి ఇంద్రుడు మానస సరోవరంలో బంగారు తామరపూవు లోపల సూక్ష్మాకారంలో వేయి సంవత్సరాలు దాక్కున్నాడట. అంత కాలం ఈ బ్రహ్మహత్య నుంచి ఎలా బయటపడాలా అనే ఆందోళనతో గడిపాడు. తిండి లేక కృశించిపోయాడు. మలినుడూ అయ్యాడు. దేవతలు అతని చేత అశ్వమేధ యాగం చేయించారు. దండకలోని మలద కరూశ దేశంలోనే అతడు బ్రహ్మహత్యా పాతకం నుండి విముక్తి పొందాడు. ఆ ప్రాంతాలు తాటక రాజ్యంలోనివి. అప్పటి నుంచీ ఆ దేశాన్ని ఆర్యులు ఆక్రమించుకొని దానిని ఇంద్రేశ్వర జయంతేశ్వర క్షేత్రంగా ప్రచారం చేసుకున్నారు. ఇంద్రుని పాపం (మలం) అక్కడపోయింది. కాబట్టి ఆ ప్రాంతాన్ని 'మలదము' అన్నారు. అక్కడే అతని కార్శ్యము (కృశత్వము) పోయింది కాబట్టి దానినే 'కరూశము' అన్నారు. ఈ ప్రాంతానికి అంతకుముందు ఏ పేరు ఉండేదో? స్థానిక భాషలను నాశనం చేసి దేవభాషగా సంస్కృతాన్ని ప్రవేశపెట్టడంవల్ల పాత పేర్లు తెలియటం లేదు. మనుషుల పేర్లు దేశాల పేర్లు కూడా సంస్కృతీకరణం చేసేశారు.

ఇంద్రుడు పాపవిముక్తుడయ్యాక బ్రహ్మహత్య వచ్చి "నేనెక్కడ ఉండాలి?" అని అడిగింది.

దేవతల సలహా మీదనే బ్రహ్మహత్య తనను నాలుగు భాగాలుగా చేసుకున్నది. ఒక భాగం వర్షాకాలంలో నదులలోను, రెండోభాగం భూమిలోను, మూడోభాగం యవ్వనవతులైన స్త్రీలలో నెలకు మూడు రోజులు, నాలుగో భాగం బ్రాహ్మణులను అకారణంగా చంపేవారిలోనూ ఉంటానన్నది. దేవతలు సరేనన్నారట. ఇందులో దేవతల ప్రమేయం లేదనీ బ్రహ్మహత్మ తనంతట తనే ఆ నిర్ణయం తీసుకున్నదనీ చెప్పటం దేవతల మీద నిందపడకూడదనే. బ్రాహ్మణులను అకారణంగా చంపకూడదు. అంటే, మిగతావారిని అకారణంగా చంపవచ్చుననటాన్ని ఆమోదించటమూ ఇక్కడ చూడవచ్చు.

వృత్రాసురుడు విశ్వరూపుని హత్యకు ప్రతీకారం తీర్చుకోవటానికి పుట్టాడు. ఇంద్రుడిని (పాలకవర్గాన్ని) జయించాడు. అయినా కుట్రలకూ నమ్మకద్రోహానికీ బలి అయ్యాడు. వ్యవసాయ నాగరికతను/ద్రావిడ నాగరికతనూ నాశనం చేయటంలో ఆర్యుల పాత్రను వృత్రకథ సూచిస్తున్నది. వృత్రునికీ పాలకవర్గాలకూ ఏర్పడ్డ విరోధం నీటి వనరుల ఉపయోగానికి సంబంధించినదిగా అర్థంచేసుకుంటే వ్యక్తిగత సమస్యలను సామూహిక సమస్యలను రాజకీయ స్పర్ధలుగా మలచుకోవటాన్ని ఇక్కడ గమనించవచ్చు. ప్రజల సామాజిక అవసరాలను రాజకీయం చేయటం, బడుగువర్గాలను కాదని సంపన్న శ్రేణులకు నీటి సౌకర్యాలనూ జలవనరులనూ ప్రాజెక్టులనూ కట్టబెట్టడం అడ్డుకున్న వారిని చంపటం ఈనాటికీ నడుస్తున్న రాజకీయమే.

వృత్రునికీ శంఖాలకూ సంబంధం చెప్పే భావనలు అధర్వణ వేదంలో కనబడతాయి. తమను ఎదుర్కొన్న అసురులను చీల్చి తగలబెట్టటం – శంఖాలను భస్మం చేయటం – శంఖాలను అసురుల అస్తులు (ఎముకలు)గా చెప్పటం – వాటితో ఆయుధాలు చేసుకోవటం – చారిత్రక సంకేతాలు కావచ్చు. "దధీచి" మహర్షి ఎముకలతో ఆయుధాలు రూపొందించిన కథ ఈ సందర్భంలో గుర్తుచేసుకోవాలి. దేవగణాలు ఒకప్పుడు తమ ఆయుధాలు (అస్త్రాలు) దధీచి దగ్గర దాచిపెట్టారట. వారు ఎంతవరకూ వచ్చి తీసు కోకపోవటంతో దధీచి వాటిని తాగేశాడు. అవి ఆయన ఎముకలకు పట్టేశాయి. చాలాకాలానికి దేవగణాలు ఎప్పటికో వచ్చి తమ అస్త్రాలు తిరిగి ఇవ్వాలని బలవంతపెడితే దధీచి యోగాగ్నితో శరీరం భస్మం చేసుకున్నాడు. ఆయన ఎముకలతో దేవగణాలు ఆయుధాలు చేసుకున్నారు. వజ్రాయుధం అలా తయారైనదే.

# హిరణ్యాక్షుడు

రామాయణం బాలకాండలో విశ్వామిత్రుడు ప్రస్తావించిన అసురులకు మూల పురుషులనదగిన వారు హిరణ్యాక్ష, హిరణ్య కశిపులు. వీరు తొలి దైత్యులు. వీరిని గురించి తెలుసుకోవలసిన అవసరం ఉంది.

వైష్ణవ మతాన్ని గొప్పగా నిలబెట్టే లక్ష్యంతో నారాయణుని అవతారాలను ప్రచారం చేశారు. అవన్నీ ఇటీవల కల్పించినవే. వాటికి ప్రాచీన ఆధారాలు లేవనే చెప్పాలి. వరాహ, నృసింహ రూపాల ప్రసక్తి వేదాలలో కనబడదు, కాని కొన్ని ప్రాచీన భావనల ఆధారంగా ఆ కథలకు రూపకల్పన జరిగింది. ఈ అవతారాలను ప్రచారంలోకి తెచ్చింది విష్ణు పురాణమే. వైదికేతర మతాల నుంచి విష్ణు మతాన్ని ప్రముఖంగా నిలపట్టం కోసమే ఈ పురాణం పుట్టింది.

పాశ్చాత్య దేశాల ప్రాచీన సాహిత్యంలో వర్గపోరాటాలు, సార్వభౌమత్వమూ, తిరుగుబాట్లూ కనబడతాయి. కులీన ప్రభువులు - బానిస ప్రజలు కనబడతారు. భారతదేశ ప్రాచీన సాహిత్యంలో దేవాసుర పోరాట గాథలు, క్రతు కర్మకాండలు, గోబ్రాహ్మణ వైశిష్ట్యమూ ఉంటాయి. వీటిలోనే వర్గ/వర్ణ పోరాటాలను - సార్వభౌమత్వాన్ని - సామాజిక - రాజకీయ అంశాలనూ వెతుక్కోవాలి. దేవాసుర కలహాలకు కారణం అధికార కాంక్ష మాత్రమే కాదు - సంస్కృతులలోని వైరుధ్యం కూడా కారణం. క్రతు కర్మలకు అనుబంధంగా ఉండే అశ్వమేధాలూ, రాజసూయాలూ, జైత్రయాత్రలూ రాజకీయ ప్రయోజనాలు కలవే. ఒకరకంగా చూస్తే దేవాసుర కలహాలు, మత యుద్ధాలు. స్థానికులపై ఆధిపత్యం కోసం తెచ్చి పెట్టుకున్న ఆచారకాండ ఈ కలహాలకు కారణమైంది. తిరుగుబాట్లు, అణచివేతలు, ఏ దేశ చరిత్రలోనైనా ఉంటాయి. పాలకవర్గంపై అసంతృప్తితో ఆయా రాజవంశాలనే నిర్మూలించటం లోకంలో ఉంది. రాజు మీది కోపంతో రాజును చంపి ప్రజల నుంచి వ్యతిరేకత రాకుండా రాజు కొడుకుకు (ఆ వంశం వారికే) పట్టాభిషేకం చేయటమూ ఉంది.

వీటిలో కొన్ని ధర్మయుద్ధాలుగా, కొన్ని ఉగ్రవాద చర్యలుగా కనిపించటం చరిత్రను అర్థం చేసుకునే క్రమం మీదనే కాకుండా చరిత్ర నిర్మించిన క్రమం మీద కూడా ఆధారపడి ఉంటుంది. అందుకే భారతదేశ సామాజిక చరిత్రను అర్థంచేసుకోవటంలో దేవాసుర యుద్ధ గాథలను నిశితంగా పరిశీలించవలసి ఉంటుంది. భవిష్యత్తును నిర్మించుకోవటానికి గతాన్ని తెలుసుకోవటం అవసరం.

సృష్టిక్రమంలోని తొలి పాలక వంశాలలో దైతేయులు (దితి సంతానం) ముఖ్యులని రామాయణం చెబుతోంది. జటాయువు చెప్పిన సృష్టి క్రమం ప్రకారం భూమి దైత్యులది. దైత్యుల ఆచార వ్యవహారాలు వలసదారులైన ఆర్యుల ఆచార వ్యవహారాలకు భిన్నమైనవి.

గిరిజన/ ఆదివాసీ సంస్కృతికీ మైదాన ప్రాంతాల సంస్కృతికీ ఉన్న అంతరాల వంటివే అవి. ఇండియాకు భిన్న కాలాలలో వలస వచ్చిన ఆర్యులు ఆ ప్రజల సంస్కృతిని గౌరవించక పోగా తమ పద్ధతులు ప్రవేశపెడుతూ స్థానికులపై ఆధిపత్యం చలాయించాలని చూడటం ప్రాచీన సాహిత్యంలో నిబిడీకృతంగా ఉంది. తొలి దైత్యుల పాలనను సహించని స్వభావం దేవ/ ముని గణాలలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

హిరణ్యాక్షుడు ఆది దైత్యులలో ప్రముఖుడైన రాజు. దితివల్ల కశ్యపునికి కలిగిన కొడుకు. ఇతని కాలానికి భూమి దైత్యులది. వీరు కృత యుగంలో దైత్యుల మొదటి తరం వారు.




హిరణ్యాక్షుడు, హిరణ్య కశిపుడు కవల సోదరులు అనీ అంటారు. హిరణ్యాక్షుడు చిన్న వాడనీ హిరణ్య కశిపుడు పెద్దవాడనీ భాగవతం చెప్పింది. వీరి సోదరి సింహిక విప్రచిత్తి భార్య.

హిరణ్యాక్షుని వధ నారాయణుని అవతార గాధలతో ముడిపడి ఉంది. నారాయణుడు వరాహావతారంలో హిరణ్యాక్షుని చంపాడు. ఈ కథ విష్ణు పురాణంలో ఒకలాగ, భాగవతంలో మరొకలాగా ఉంది. దైత్యులు భూమిని సుభిక్షంగా పాలిస్తున్న కాలంలో వారి పాలనను పడగొట్టే ప్రయత్నంలో వరాహరూపంతో నారాయణుడు అవతరించి రాజైన హిరణ్యాక్షుని చంపాడు. ఆ రూపమూ, వేషమూ హిరణ్యాక్షుని చంపటానికి వీలైన/సుఖంగా ఉండే వేషం అని పురాణాలే చెప్పాయి. అడవి పందులు పంటను నాశనం చేయటం, పంట తిని పోవటం ఒక కాలంలో తరచుగా జరిగేది. పంట పొలాలను పాడు చేయటం ద్వారా అసుర పాలకులకు, ప్రజలకు నష్టం కలిగించి వారిని చికాకు పరచిన దేవగణాలు ఈ కథలో కనిపిస్తున్నారు. అసుర రాజ్యాలను దోచుకుంటూ వారిని వేధిస్తూ అసుర రాజులను చంపుతూ ఉండటాన్నీ ఈ కథ సూచిస్తోంది. అయితే ఈ కథను దేవ గణాలకు అనుకూలంగా మార్చి ప్రచారం చేశారు. అందుకోసం ఒక పురాణం (వరాహ పురాణం) రాశారు. విధ్వంసకులనే కీర్తించారు.

ఒక జలప్రళయం తర్వాత తిరిగి సృష్టి మొదలు కావలసి ఉన్న సమయంలో జరిగిన సంఘటన హిరణ్యాక్షునికీ వరాహ రూపంలో ఉన్న విష్ణువుకూ జరిగిన యుద్ధానికి కారణమయిందని ప్రచారం జరిగింది. ఒక ప్రళయం తర్వాత సృష్టిచేసి ప్రజాపాలన చేయవల సిందిగా బ్రహ్మ మనువును ఆదేశించాడు; అప్పటికి భూమి నీటిలో మునిగి ఉంది. దానిని బయటకు తీస్తే పాలిస్తానంటాడు మనువు. దానిని బయటికి తీసేవారెవరు? బ్రహ్మ ఆలోచనలో పడ్డాడు. అతని ముక్కు నుంచి ఒక పందిపిల్ల (వరాహ శిశువు)

ఊడిపడింది. అదే పెద్ద వరాహమై నీటిలో మునిగి ఉన్న భూమిని పైకి తెచ్చింది. ఆ సందర్భంలో వరాహం హిరణ్యాక్షునితో యుద్ధంచేసి అతనిని చంపిందట. అప్పటికి భూమి హిరణ్యాక్షునిదా? హిరణ్యాక్షుడు భూమిని పాలిస్తూ ఉన్నాడా? అందుకే అడ్డుకున్నాడా అనేది ప్రశ్న. ఆ వరాహాన్ని యజ్ఞ వరాహుడుగా వ్యవహరిస్తూ భూమిని స్త్రీగా చెబుతూ వరాహుడు భూమిని వివాహం చేసుకున్నాడని కథ అద్భుతంగా అల్లేశారు. అప్పుడు వాళ్ళిద్దరికీ ఒక కొడుకు కూడా పుట్టాడు. నరకాసురుడు. ఇది చాలా పురాణాలలో ఉన్న కథ. యజ్ఞాల ప్రచారానికీ ఇది ఉపకరించింది.

భూమి నీటిలో మునిగి ఉండటానికి హిరణ్యాక్షుడు కారణం అని పై కథల్లో లేదు. కాని హిరణ్యాక్షుని మీద ఏదో నేరం మోపాలి కాబట్టి భూమిని నీటిలో విసిరేశాడనీ – చాపగా చుట్టి విసిరేశాడనీ చెప్పాడు. భూమి అంటే చాపలాగా ఒక దుప్పటిలాగా చదరంగా ఉంటుందనే ఊహ ఉన్న రోజుల్లోని కథ ఇది. బ్రహ్మ వైవర్త పురాణంలోనూ ఈ విషయం ప్రస్తావించారు. మిథ్యారోపణలతో వైరి వర్గాలను చంపటం అనేది అప్పటి నుంచీ ఉంది.

"హిరణ్యాక్ష, హిరణ్య కశిపులు ఆది పురుషులు. సువ్రతులు" అంటున్నది మత్స్య పురాణం. ఆది పురుషులు అనే పదం లోతైన అర్థం కలది. ఆది ప్రజలు అనే దాన్నీ మత్స్య పురాణం వివరించింది.

**ఆది ప్రజలు :**

నాలుగు యుగాలు ఒకదాని వెనుక ఒకటి వస్తూ ఉండే క్రమంలో గడచిపోయిన (ఆది) కలియుగం నుండి ప్రవేశించిన కృతయుగంలోకి, వారికి, జన్మించిన వారు ఆది ప్రజలు అవుతారని మత్స్య పురాణం చెబుతోంది. (అధ్యాయం 143).

ఆది కలియుగంలో మిగిలిన వారికి జన్మించి కృతయుగంలోకి అడుగుపెట్టిన వారు ఆది ప్రజలు. అదృశ్యంగా ఉండే సిద్ధులూ, సప్తర్షులూ ఈ ఆది ప్రజలకు మార్గదర్శకులుగా ఉంటారట. ఈనాడు భారతీయ సమాజంలో ఉన్న ఆది ద్రావిడ, ఆది ఆంధ్ర, అది జాంబవ వంటి పదాల ప్రాచీనతను పై సూత్రం ప్రకారం అర్థం చేసుకోవలసి ఉంటుంది.

హిరణ్యాక్షుడు తపోబలం, బుద్ధిబలం, భుజబలం కలవాడు. గొప్ప సంపద కలవాడు. దేవగణాలకు ఇతని మీద ద్వేషం ఉండేది. హిరణ్యాక్ష హిరణ్య గర్భుల నగరం హిరణ్య నగరం. ఈ నగరాన్ని మయుడు (విశ్వకర్మ) నిర్మించి వీరికి ఇచ్చాడు. ఆ నగరం గాలిలో తేలుతూ, ఎగురుతూ ఉండేది. దీనిలో ఉండేవారికి వ్యాధులు రావు. దుఃఖం కలుగదు. మహాభారతం (వనపర్వం 172)లో దీని గురించి ఉంది.

'హిరణ్య' పదం గొప్ప జ్ఞానులకు వాడేవారు. బ్రహ్మ హిరణ్యగర్భుడు. అతడొక ప్రజాపతి. హిరణ్యాక్షుడూ అంతటివాడే, దుర్గాధిపతి. జ్ఞాని.

హిరణ్యపురం కాకుండా హిరణ్యాక్షునికి వేరే నగరం ఉండేదా? అది జలదుర్గమై ఉంటుందా? జలదుర్గాలకు చుట్టూ ఉండే అగడ్తలను ఛేదించుకుని శత్రువులు అతన్ని చంపారా? ఈ కథ ప్రతీకాత్మకమా? అనేది ఆలోచించాల్సిన అంశం. రావణుని లంక కూడా జలదుర్గమే. వంతెనలు కట్టిన తర్వాతే అందులోకి ప్రవేశించగలిగారు. నగరాల నిర్మాణమూ, వంతెనల నిర్మాణమూ, ఆర్యేతర ప్రజలకు తెలుసుననీ దీనివల్ల అర్థమవుతున్నది.

తమను మించి వైభవంగా ఉన్న అసుర రాజ్యాలను దేవగణాలు సహించేవి కావు. ఏదో ఒక నెపంతో క్రూరమైన విధానాలతో, ఆకారాలతో, వాటిని నాశనం చేస్తుండేవారు. ఆ ఆకారాలను వారు పూజించారు. వాటిని దేవుళ్ళుగా కింది వర్గాలు కూడా పూజించటం విచారకరం.

తొలి దైత్యుల పాలనను అంతం చేసే కుట్రలో భాగంగా దేవగణాలు చేసిన ఈ హత్యోదంతాన్ని పురాణాలు రకరకాలుగా చెప్పాయి. హతుడైన దైత్యవీరుడు హిరణ్యాక్షుడు.

భాగవతం హిరణ్యాక్షుని మరణాన్ని చాలా సంక్షిప్తంగా చెప్పింది. హిరణ్యకశిప సోదరులలో "చిన్నవాడైన హిరణ్యాక్షుని హరి వరాహరూపంలో చంపాడు" అని మాత్రం చెప్పి ఊరుకున్నాడు పోతన. (భాగ. 7-24). హిరణ్యకశిపునికి తమ్ముని మరణం సంగతి తెలిశాక తన సేనా నాయకులందర్నీ హరిని వెదకడం కోసం పంపాడు. "ఎక్కడ గోబ్రాహ్మణ హితమూ, వేదమూ వర్ణధర్మాలూ ఉంటాయో ఆ స్థలాలలో హరిని వెదకండి" అని చెప్పాడు. హిరణ్యాక్షుని వధ వర్ణ ధర్మంతో ముడిపడి ఉంది.

గోబ్రాహ్మణ హితం – వర్ణ ధర్మం, వైదిక మత లక్షణాలు. వాటిని కాదన్న వారు అసురులు. దైత్యులు శైవులేమో – శివుని కొలిచేవారేమో – అందుకే వైష్ణవం వీరి మీద పగబూనింది అని కొందరు అంటుంటారు. దైత్యులు శివుని కొలిచేవారని పురాణాలు చెబుతున్నప్పటికీ అంతకు మించి వైదికేతర మతాల ప్రభావమూ వారి మీద ఉన్నది.

మత్స్య మహా పురాణం వరాహావతారం గురించి చెప్తూ హిరణ్యాక్ష వధనూ, భూమిని ఉద్ధరించటాన్నీ విడివిడిగా చెప్పింది.

దేవాసుర సంగ్రామాలను చెప్పే అధ్యాయంలో (47) దేవగణాలతో హిరణ్యాక్షుడు యుద్ధం చేసినట్టూ ద్వంద్వ యుద్ధంలో వరాహమూర్తి అతనిని చంపినట్లు చెప్పారు.

"...హిరణ్యాక్షో హతో ద్వంద్వే ప్రతి వాదేతు దేవతైః

దంష్ట్రయాతు వరాహేణ సముద్రస్తు ద్విధాకృతః" (మత్స్య. అధ్యా 47-47)

ఇది నాలుగో దివ్యయుగంలో జరిగిన సంఘటన అన్నారు.

మత్స్యపురాణంలోనే వరాహావతార కథ 246, 247 అధ్యాయాలలో ఉంది. దీనికి దైనందిన ప్రళయ కథనము, ధరణీ సముద్ధరణము అనే పేర్లున్నాయి.

దైనందిన ప్రళయ కథనంలో సృష్టి అంతా విష్ణువుపరంగా జరిగినట్లు చెప్పారు. సృష్టి, ఉత్పత్తి, నాశనం అనేవన్నీ విష్ణువుతోనే ముడిపడి ఉన్నాయన్నారు. సృష్టి జరిగి దివ్యయుగ సహస్రాంతం అయ్యాక అన్నీ విష్ణువులో కలుస్తాయి. విష్ణువు అగ్నియై సృష్టిని తనలో కలుపుకుంటాడు, అన్నారు. భగవద్గీతలోని విరాట్ స్వరూప భావన దీని నుంచే రూపొంది ఉండాలి.

విష్ణువు నిలపుకొన్న జగత్తు మొదట ఒక గుహలాగా ఉంది. అది రెండుగా, తర్వాత ఎనిమిదిగా అయింది. వేలకొలది కొండలు గుట్టలతో ఉన్న ఆ సృష్టిని మోయలేక దుర్బలమైన అవు బురదలో దిగబడినట్లు భూమి కిందకు కుంగి పాతాళంలో పడింది. ఆమెను విష్ణువు పలకరించాడు. (ఆవు పోలిక అతడు చెప్పినదే).

ఆమె అతనిని స్తుతించింది. (ఈ స్తుతులు దండకాలలాగా ఉన్నాయి) ఆమెను పైకి లేవనెత్తటానికి విష్ణువు వరాహరూపం ధరించాడు. తన కోర కొనతో భూమిని మునుపటి స్థానంలో నిలిపాడు. ఇతడు యజ్ఞవారాహుడు. దేవతల స్తుతులతో తిరిగి మునుపటి రూపం ధరించాడు.

ఆదిమ సంప్రదాయాల నుంచి ప్రజలను యజ్ఞాల వైపు మళ్ళించటానికి ఇది సంకేతం. అసురులను చంపి రాజ్యంలో తమదైన ధర్మాలను నియమాలను ప్రవేశపెట్టారనటానికి నిదర్శనం.

ఇదే ధరణీ సముద్ధరణం. ఇక్కడ భూదేవి చేసిన స్తుతిలో యజ్ఞాల గురించీ, వేదాల గురించీ, వర్ణాశ్రమ ధర్మాల గురించీ చాలా వివరంగా చెప్పారు. దేవదానవుల వైరం గురించీ ప్రస్తావించారు. అయితే ఇందులో హిరణ్యాక్షుని ప్రస్తావన లేదు. వరాహ పురాణం ప్రకారం కథ ఇలా ఉంది. హిరణ్యాక్షుడు ఉగ్రమైన తపస్సుచేసి బ్రహ్మవల్ల అపూర్వమైన వరాలు పొందాడు.

విష్ణుచక్రం వల్ల, వజ్రాయుధంవల్ల – దేవదానవ, యక్ష కిన్నర కింపురుషాదులవల్ల తనకు హాని కలగకుండాను, బ్రహ్మ సృష్టించిన దేనివల్లా అపాయం లేకుండానూ వరం పొంది దేవగణాలకు అసాధ్యుడయ్యాడు. ఆ సందర్భంలో భూమిని పాతాళంలో దాచాడు.

ఇతన్ని చంపేందుకు ఇంద్రుడు పన్నెండు నెలలు యజ్ఞం చేశాడట. ఆ యజ్ఞ గుండంలోంచి శ్వేత వరాహం వచ్చింది. చూస్తూండగానే అది పెద్దదై బ్రహ్మాండం నిండింది. పాతాళంలో దాచబడిన భూమిని పైకెత్తి పూర్వస్థానంలో నిలిపింది. ఆ సంగతి తెలిసి హిరణ్యాక్షుడు కోపంతో వచ్చి వరాహాన్ని గదతో కొట్టాడు. దానితోక పట్టుకుని ఆడించాడు. వరాహం తోకతోనే అతనిని దూరం పడేటట్టు విసిరేసింది. తర్వాత కోరలతో కుమ్మి చంపింది. జంతువులవల్ల మానవులు మరణించటం అనే సంగతితోబాటు ఒక సంస్కృతిని నాశనం చేయటం అనే వాస్తవం కూడా ఇక్కడ ఉంది.

భూమిని పాతాళంలో దాచటం అలా దాచిన దానిని వరాహం వశపరచుకోవటం భూమి యాజమాన్య సమస్యను సూచిస్తున్నాయి. తొలి పాలకులైన దైత్యుల నుండి భూమిని దౌర్జన్యంగా లాక్కోవటం – ఇక్కడి వాస్తవం. సొంతదారు నుంచి భూమిని లాక్కోవటంలో తమకు సహకరించిన వరాహమూర్తిని ఆర్యగణం అవతార మూర్తిగా ప్రచారం చేసింది.

పేదవారి భూములు సంపన్నులకు కట్టబెట్టి వారికి యాజమాన్య హక్కులను ధఖలు పరచే సంస్కృతి మూలాలు ఈ అవతార గాథలలో ఉన్నాయా?

అవతార గాధను కళారూపాలుగా మలిచి చిరస్థాయిగా నిలిపిన చరిత్ర ఉద్దేశ్య పూర్వకమే. ఈ హత్యలనూ, అణచివేతలనూ నృత్యరీతులలో నిక్షిప్తంచేసి భద్రపరచుకొని దానిని ఉత్తమ సంస్కృతిగా ప్రచారం చేసింది సంప్రదాయ సాహిత్యం.

హిరణ్యాక్ష, హిరణ్య కశిపులు పూర్వ జన్మలో విష్ణువు ద్వారపాలకులు అనీ (వారి పేర్లు జయ, విజయులు) శాపం వల్ల వీరు మూడు (3) జన్మలు విష్ణువుకు విరోధులుగా రావణ, కుంభకర్ణులుగా, శిశుపాల దంతవక్త్రులుగా, హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగా జన్మించి శాపానంతరం విష్ణువుని చేరుకున్నారని భాగవతం ప్రచారం చేసింది. (సప్తమ స్కంధం).

ప్రచారంలో ఉన్న దశావతార కథల ప్రకారం రావణుని చంపిన రామావతారం, హిరణ్యాక్ష, హిరణ్యకశిపులను చంపిన వరాహ, నృసింహావతారాలకు చాలా తర్వాతది. దశావతార నృత్యాలలో వరాహ, కూర్మ నరసింహావతారాల తర్వాతే రామావతారం. శిశుపాలుని చంపిన కృష్ణావతారమూ చెప్పారు.

భాగవతం ప్రకారం హిరణ్యాక్షునికి నలుగురు కొడుకులు. శకుని, శంబర, కాలనాభ, ఘటోత్కచ అనేవారు. తండ్రి రాజ్యాన్ని సమంగా పంచుకొని పాలించారు.

కొన్ని పురాణాలు హిరణ్యాక్షునికి 14 మంది భార్యలు చాలామంది సంతానం అని చెప్పాయి. కొన్ని ఇద్దరు భార్యలు అని చెప్పాయి.

మరణాన్ని గురించీ ఆత్మను గురించీ దైత్యులు చాలా ఆలోచించారు. వారి ఆలోచనలు జైన, బౌద్ధ ధర్మాలలో సిద్ధాంత రూపం ధరించాయి. విస్తరించాయి. ఆ భావాలనే హిందూతత్వవేత్తలు తమదైన శైలిలో ప్రచారం చేసుకున్నారు.

హిరణ్యాక్షునికి "రక్తవిలోచనుడు" అనే కొడుకు ఉన్నాడనీ అతని రక్తం ఎక్కడైనా పడితే దాని నుండి అతనిలాంటి వీరులు పుట్టుకొస్తారనీ ఒక కథ ఉంది. అంతర్వేది నరసింహస్వామి క్షేత్రానికి సంబంధించి విశ్వామిత్ర వసిష్ఠుల వైరాన్ని చెప్పేకథలో రక్తవిలోచనుని గురించి చెబుతారు. అతని గురించి మరికొన్ని కథలూ ఉన్నాయి.

విశ్వామిత్రుని ప్రోద్బలంతో రక్త విలోచనుడు వసిష్ఠుని నూరుగురు కొడుకులను చంపాడట. వసిష్ఠుని ప్రార్థనపై అంతర్వేది నరసింహుడు రక్త విలోచనుని చంపాడు. అతని రక్తం ఎక్కడా చిందకుండా "శక్తి" నాలుక చాపి నాకేసింది. అసురుల వంశమూ భావజాలమూ వ్యాప్తిచెందకుండా నిరోధించటం ఇక్కడి లక్ష్యం. దీనికి ఆంధ్రదేశం నేపథ్యం

కావటం ఆలోచించదగ్గది. గోదావరీ/కృష్ణా పరీవాహక ప్రాంతాలలోనూ తూర్పుగోదావరి - పశ్చిమ గోదావరి, కృష్ణా జిల్లాలలోనూ ఉన్న రాక్షసుల నాగరికతను నాశనం చేయటం ఇక్కడ లక్ష్యం.

హిరణ్యాక్షుని రాజ్యం ఏ ప్రాంతంలో ఉండేదో. హిరణ్యాక్షుడు తపస్సు ఏ అడవుల్లో చేశాడో?... అతనిది రాజకీయ హత్య అయి ఉంటుందా అనేది ఎవరు నిర్ధారణ చేస్తారు?

మహాత్మా జోతిరావ్ పూలే ప్రకారం ఆర్యులను (ఇండో ఆర్యన్లు, ఇరానీయులు) ప్రతిఘటించిన దైత్య రాజులు హిరణ్యాక్ష హిరణ్యకశిపులు. వారిచేతిలో ఓడిపోయిన ఆర్య బ్రాహ్మణులు అడవులలో తలదాచుకుని దైత్యుల నగరాలపై దొంగదాడులు చేస్తూ ప్రజలను చీకాకుపెట్టారు. నగరాలలోని హిరణ్యం (బంగారం) దోచుకొనటానికి పన్నాగాలు పన్ను తుండేవారు. రకరకాల రూపాలతో మారువేషాలతో ప్రవర్తించేవారు. వాటి మూర్తీకరణమే వరాహ, నృసింహ రూపాలు అని పూలే చెప్పారు.

వరాహమూర్తిని యజ్ఞ వరాహునిగా ఉగ్ర నరసింహమూర్తిని యోగ నరసింహునిగా ఆర్యులు ప్రచారం చేసుకున్నారు. ఆ ప్రచార బలం ఈనాటికీ ప్రజలను మభ్యపెడుతూనే ఉన్నది.

# హిరణ్య కశిపుడు

హిరణ్య కశిపుడు కశ్యప ప్రజాపతికి దితివల్ల కలిగిన పుత్రుడు. ఇతని సోదరుడు హిరణ్యాక్షుడు. సోదరి సింహిక. ఆమె విప్రచిత్తి భార్య. రాహువు మొదలైన వారు ఆమె కుమారులు.




హిరణ్యాక్ష, హిరణ్య కశిపుల కాలానికి భూమి దైత్యులది. వీరు చాలా సంపన్నులు. 'హిరణ్య' పదం విశేషణంగా ఉండటం అందుకు సూచన. హిరణ్యం అంటే బంగారం. విశ్వకర్మ హిరణ్య కశిపునికీ హిరణ్యాక్షునికీ ప్రత్యేకంగా హిరణ్య పురం తయారుచేసి ఇచ్చాడు. విశ్వకర్మకు ఇష్టులైన వీరు జైన ధర్మాన్ని ఆదరించి ఉంటారు.

జైనమూ, బౌద్ధమూ అప్పట్లో సామాన్యుల ఆలోచనలను ప్రభావితం చేశాయి. ఆ సామాన్యులలో అసురులూ ఉన్నారు. దుఃఖాన్ని గురించిన చర్చ హిరణ్య కశివుని పరంగా కనబడటం ఇందుకు నిదర్శనం. ఆ భావజాలాన్ని తుడిచిపెట్టి వైష్ణవాన్ని ప్రజలలో ప్రతిష్ఠించటం అప్పటి ఆర్య వర్గాల ధ్యేయం. ఆ ధ్యేయంతోనే దైత్యులపై, స్థానిక అసురులపై దాడులు జరిగాయి.

హిరణ్య కశిపుడు పూర్వ సాహిత్యంలో ముఖ్యంగా జానపద కళారూపాలలో సుప్రసిద్ధుడు. భాగవతం ఇతనిని విష్ణుద్వేషిగా చిత్రించింది. మత్స్య పురాణం చెప్పిన కథలో విష్ణు ద్వేషం ప్రస్తావనే లేదు. దేవగణాలకూ, దైత్యులకూ ఉన్న రాజకీయాధికార సంబంధిత వైరమే హిరణ్యకశిపుని వధకు కారణం అని అది సూచిస్తున్నది. ఆదివాసీల సంస్కృతికీ, ఆర్యజాతుల సంస్కృతికీ జరిగిన ఘర్షణల కళారూపాలే దశావతార గాథలు.

జానపద కళారూపాలలో హిరణ్య కశిప పాత్ర ప్రవేశానికి ఉన్న రాజసం ఇంకెవరికీ కన్పడదు. ఆ కళారూపాలు అంతరించిపోతున్న ఈ రోజుల్లో ఆ పాత్రనూ, దాని నేపథ్యాన్నీ ఈతరం వారు అర్థం చేసుకోలేకపోవచ్చు. పరిశోధకులు, ముఖ్యంగా దళిత వర్గాలు గమనించవలసిన ఎన్నో సామాజిక అంశాలు హిరణ్య కశిపుని హత్యా సంఘటనలో దాగి ఉన్నాయి. ఈ హత్య నృసింహావతారంతో ముడిపడి ఉంది.

అసలు సంఘటనలకు మసిపూసి అసత్య కల్పనలతో నివేదికలు తయారుచేసి ప్రజలను మభ్యపెట్టే 21వ శతాబ్దపు రాజకీయ చరిత్రకు శతాబ్దాల పునాది - పురాణాలలో హిరణ్యాక్ష, హిరణ్యకశిపుల వధలో కనిపించటం ఆశ్చర్యకరమే. పురాణ కథలలోని చాలా పోరాటాలు భూమి కోసమూ, అధికారం కోసమూ జరిగాయి.

దైత్యుల నుంచి భూమి లాక్కొని దేవగణాలకు అప్పగించటం కోసం, మూడడుగుల నేలకోసం అసుర రాజులను అణచివేసిన చరిత్ర పురాణాలలో ఉంది. ఆ క్రమంలో దేవ గణాలకు సహకరించిన వారు అవతార మూర్తులు అయ్యారు.

జాతుల వైరాలూ, సంస్కృతి వైరుధ్యాలు, రాజ్యాధికారంతో ముడిపడి ఉండటాన్ని పురాణాలు చెప్పాయి. హిరణ్య కశిపుని కథ చాలా జనరంజకంగా ప్రచారమైన కథ. నారాయణుని అవతార గాథల ప్రకారం రామావతారం అసుర సంహారంతో, భృగుశాపంతో ముడిపడి ఉంది. దేవాసుర యుద్ధాల కాలంలోనే నారాయణునికి భృగు శాపం తగిలింది. వివరాలలోకి వెళితే హిరణ్య కశిపుడూ, బలి అనే అసురులు మూడు లోకాలను పాలిస్తున్న కాలంలో పది దివ్య యుగాలపాటు దేవాసురులకు యుద్ధం జరిగింది. ఆ సందర్భంలో ఒకసారి దేవగణాలు అసురులను తరుముతుండగా వారు భృగు మహర్షి ఆశ్రమానికి వెళ్ళి దాక్కున్నారు. భృగువు భార్య వారికి ఆశ్రయం ఇచ్చింది. వారిని తరుముతూ వెళ్ళిన దేవగణాలను ఆమె ఆశ్రమంలోనికి రానివ్వలేదు. దాంతో విష్ణువు (నారాయణుడు)కు కోపం వచ్చి ఆమెను చక్రంతో చంపేశాడు. ఆశ్రమానికి వచ్చిన భృగువు భార్య మరణం గురించి తెలుసుకుని క్రుద్ధుడై "నీవు కూడా భార్యా వియోగం పొందుతావు" అని విష్ణువును శపించాడు. ఆ శాపం రామావతారంలో ముడిపడింది. భృగువు కోపానికి కారణం భార్య మరణమేనా, సిద్ధాంతపరమైన భేదాలూ ఉన్నాయా అనేది ఆలోచించదగ్గ అంశమే.

దేవగణాల ప్రవర్తన - వారి విధానాలూ జ్ఞాన సంపన్నులయిన మహర్షులకు నచ్చేవి కావని ఈ ఉదంతం ద్వారా తెలుసుకోవచ్చు. అది సిద్ధాంతాల పరమైన వైమనస్యం.

అవతారాల విషయానికి వస్తే చాలా పురాణాల ప్రకారం ధర్మావతారం మొదటిది. అప్పుడే వైదిక కర్మకాండకు యజ్ఞాలకు అంకురార్పణ జరిగింది. హిరణ్యాక్షుని చంపిన యజ్ఞ వరాహావతారమూ ఆ కోవలోనిదే.

కొన్ని పురాణాలు దేవాసుర యుద్ధాల క్రమంలో మొదటిది నారసింహం అంటున్నాయి. కాని నృసింహావతారానికి ముందటిదే వరాహావతారం. ఈ అవతార గాధలూ, దేవాసుర యుద్ధగాథలూ ఒక క్రమంలో లేవు. ఇవి కాల గణనకు అందేవీ కావు. అయినా వీటి ప్రయోజనం మాత్రం స్పష్టంగానే ఉంది. అది పాలనాధికారం. భూమి ఆక్రమణ, అధికార విస్తరణ, బడుగువర్గాల అణచివేత అందులోని భాగాలే.

హిరణ్యకశిపుని వధ ఆదివాసీలతోనూ ముడిపెట్టారు. హిరణ్య కశిపుని చంపిన నృసింహుడు చెంచులకు అల్లుడయ్యాడని కథలు ప్రచారం చేశారు. ఈ ప్రచారాలలోని

అంతర్యం ఏమిటి? ఇలాంటి సందేహాలు లేవనెత్తకుండా ఉండాలనే పురాణకర్తలు పురాణాలను ప్రశ్నించకూడదన్నారు.

హిరణ్య కశిపుని వధ వృత్తాంతం భాగవతంలో ఒక విధంగా, మత్స్య పురాణంలో మరో విధంగా కనిపిస్తున్నది. హిరణ్య కశిపుని కొడుకు ప్రహ్లాదుడు, విష్ణుభక్తుడన్న విషయం మత్స్య పురాణం ప్రస్తావించనే లేదు.

గిరిజన/ఆదివాసీ వర్గాలనూ, అంత్యజాతులనూ విష్ణు మతంవైపు ఆకర్షించటానికే నృసింహుడు చెంచు కన్యను వివాహమాడాడా? వసిష్ఠుడు మాతంగ కన్య అయిన అరుంధతిని వివాహమాడాడని చెప్పటంలోనూ అలాంటి కుట్ర ఏమైనా ఉన్నదా అనేది ఇప్పుడైనా ఆలోచించాలి.

**1) మత్స్య పురాణం ప్రకారం హిరణ్యకశిపుని కథ ఇది :**

హిరణ్య కశిపుడు 11 వేల (పదకొండువేల) సంవత్సరాలు తపస్సుచేసి, దేవ అసుర, గంధర్వ, యక్ష, పన్నగ, రాక్షస, మానవ, పిశాచ జాతులెవ్వరూ తనను చంపకుండా బ్రహ్మ నుంచి వరం పొందాడు. 'బ్రహ్మ' పదం ఆర్య బ్రాహ్మణుల నాయకుడిని సూచిస్తుందని "పూలే" విశ్లేషణ. పై జాతులన్నీ అప్పుడు బలంగా ఉన్న జాతులు. ఆ జాతులన్నింటిపైనా హిరణ్యకశిపుని అధికారం సాగింది. అతని పాలన వైభవోపేతంగా ఉండటం దేవగణాలు సహించలేకపోయాయి. హిరణ్యకశిప సోదరులు తాము చేసే యజ్ఞాలలో దేవగణాలకు భాగం ఇవ్వలేదు. వారిని మన్నించనూలేదు. అదీ వారికి కోప కారణం అయింది.

యజ్ఞం సమష్టి కృషి, ఆర్య బ్రాహ్మణుల యజ్ఞాలలో సమష్టి కృషి తాలూకు సంపద, ఫలమూ కేవలం దేవగణాలే తీసుకుంటూ ఉండేవారు. హిరణ్యకశిపుడు ఆ పద్ధతి రద్దు చేశాడు. దేవగణాలు ఆ అవమానాన్ని సహించలేకపోయారు. సామ, దాన, భేద దండో పాయాలు ప్రయోగించి చివరకు మాయచేసి హిరణ్య కశిపుని చంపారు.

వ్యక్తిగత కక్షలతో, పట్టపగలు – నడిరోడ్డు మీద – జనం అందరూ చూస్తుండగా ఒక మనిషి మరో మనిషిని చంపటం ఈనాడు వింటున్నాం. హిరణ్యకశిపుని చంపటం కూడా అలాగే జరిగింది. విష్ణువు నరసింహ రూపంతో హిరణ్య కశిపుని సభలోకి సరాసరి వెళ్ళిపోయాడు. ఆ సభలో దైత్య దానవ ప్రముఖులున్నారు. ప్రహ్లాదుడూ ఉన్నాడు. వారందరూ అడ్డుపడినా వింత రూపంలో విభ్రమంగా రాజును చంపేశాడు.

నృసింహ రూపాన్ని సభలోని ప్రహ్లాదుడు మొదట గుర్తించాడు. "ఈ రూపం ఇంతవరకు విన్నదీ/కన్నదీ కాదు. ఇదేదో అపూర్వంగా ఉన్నది" అని హిరణ్య కశిపునితో (తండ్రితో) చెప్పాడు. "ఎప్పుడూ చూడని కొత్త జంతువు ఇది. దీన్ని పట్టుకోండి" అన్నాడు హిరణ్య కశిపుడు. పట్టుకునే ప్రయత్నమే జరిగింది అక్కడ.

ఆ జంతువు ఎవరికీ లొంగలేదు. యమునిలాగా నోరుతెరచి అందర్నీ చికాకు పెట్టింది. హిరణ్య కశిపుడు దానిపై రకరకాల అస్త్రాలు వేశాడు. అవి దానిని ఏమీ చేయలేకపోయాయి.

దానవులంతా కలిసి దానిని వారించలేకపోయారు. హిరణ్య కశిపుడు తానే ఆ మృగాన్ని సమీపించి పట్టుకునే ప్రయత్నం చేశాడు. అది వాడి గోళ్ళతో అతనిని చీల్చి చంపేసింది. అందుకు దేవతలంతా ఆనందించారట. తృప్తిపొందారట. ఆ విచిత్ర రూపాన్ని పొగిడారు. "ఈ నృసింహ రూపం పూజించదగినది" అని అన్నారు. బ్రహ్మ కూడా వచ్చి పొగిడి వెళ్ళాడు. ఆ నరసింహ రూపాన్ని అక్కడే ఉంచి విష్ణువూ వెళ్ళిపోయాడట. దేవగణాల ఆధిపత్యానికి అడ్డు తొలగిపోయింది. ఇది మత్స్య పురాణం కథ (అధ్యా 161-162). విష్ణువునూ, దేవగణాలనూ కాదన్న వారికి ఏ విధంగా శిక్షపడుతుందో చూపిన కథ. తమతో సమంగా యజ్ఞభాగాలు, హోదా కావాలనుకున్న వారిని సహించని అగ్ర-ఆధిపత్య వర్గాల/కులాల అహంకారం కథ.

నిండు సభలోకి ఒక వింత వేషంతో ప్రవేశించి రాజునే చంపారంటే ఆ వ్యూహం ఎంత పటిష్ఠంగా సాగిందో. కృష్ణుడు కంసుని చంపటమూ నిండుకొలువులోనే జరిగింది. అందరూ చూస్తుండగా జరిగింది. ఇక్కడా అంతే. పట్టపగలు కత్తులు, బరిసెలతో మాల మాదిగ పేటపై జరిగే దాడులు ఈ అహంకారానికి కొనసాగింపు. వాటిని ఖండించకపోగా స్తుతించటం, ఆదరించటం, సమర్థించటం శోచనీయమే.

**2) భాగవత కథ**

హిరణ్య కశిపునికి దేవగణాల మీద, విష్ణువు మీద ఉన్న కోపాన్ని భాగవతం విష్ణు ద్వేషంగా చూపింది: హిరణ్యకశిపుని కోపానికి బలమైన కారణం ఉంది. హిరణ్యకశిపుని తమ్ముడైన హిరణ్యాక్షుని విష్ణువు వరాహ రూపంలో చంపాడు. అందుకు ప్రతీకారంగా హిరణ్య కశిపుడు విష్ణువును చంపాలనుకున్నాడు. అది తెలుసుకుని ముందుగానే విష్ణువు నృసింహ రూపం ధరించి వచ్చి హిరణ్యకశిపుని చంపేశాడు. ఈ కథ ప్రకారం విష్ణువు అవతారాలలో ముందు వరాహావతారం రావాలి. తర్వాత నృసింహావతారం రావాలి. కాని అలా లేదు. ముందు నరసింహావతారం తర్వాత వామనావతారం. ఆ తర్వాత వరాహావతారం చెప్పారు. అవతారాల కథలు ఒక్కో పురాణమూ ఒక్కో క్రమంలో చెప్పటం కూడా వాస్తవాలను మరుగుపరచేందుకే.

అసుర మతాన్ని నాశనంచేసిన విష్ణువును సర్వోన్నతునిగా చూపటం భాగవతం లక్ష్యం. భాగవతమూ విష్ణు పురాణమూ తర్వాతి కాలంలో రూపొందిన పురాణాలు. క్రీ.శ. 10-11 శతాబ్దాల వరకూ వాటిలో మార్పులు - చేర్పులు జరుగుతూనే వచ్చాయంటారు డా॥ అంబేద్కర్. ప్రహ్లాదుని విష్ణుభక్తి అనంతర కాలపు కల్పన. విష్ణువు తన భక్తులను రక్షించుకునేందుకు ఎలాంటి అవతారమైనా ఎత్తుతాడనీ పిలవగానే పరుగెత్తుకు వస్తాడనీ (గజేంద్రమోక్షం) వాటికి పూర్వ జన్మల కథలు కూడా చేర్చి మరీ ప్రచారం చేశారు. హిరణ్యాక్షునీ, హిరణ్యకశిపునీ చంపిన వరాహ రూపమూ, నృసింహ రూపమూ సాధు రూపాలు కావు, సాత్వికమైనవీ కావు. అవి విధ్వంసక శక్తులు. అయినా ప్రచార బలంతో

ప్రజలు ఆ రూపాలను పూజిస్తున్నారు. దేవగణాలకు సహకరించిన ఆ శక్తులు ఇప్పటి కిరాయి హంతకుల పాత్ర పోషించాయనటం సత్యదూరం కాదు.

వరాహం హిరణ్యాక్షుని చంపిన విషయం విని హిరణ్యకశిపుడు ఎంత చలించి పోయాడో తెలుగు భాగవతంలో పోతన వర్ణించాడు.

"నాకుం దమ్ముడు మీకు నెచ్చెలి రణన్యాయైక దక్షుండు బా
హా కుంఠీకృత దేవయక్షుడు హిరణ్యాక్షుండు వానిన్ మహా
సౌకర్యాంగము దాల్చి దానవ వధూ సౌకర్యముల్ నీరుగా
వైకుంఠుండు వధించి పోయెనట యీ వార్తాస్థితిన్ వింటిరే!" (భాగ. 7-30)

"వధించి పోవటం" అనేది ఇక్కడ ముఖ్యంగా గమనించాలి. జాతుల వైరం, చంపుకోవటాలూ - న్యాయం ధర్మం అంటూ విచారణ లేని హత్యలూ ఇక్కడ సూచితమవు తున్నాయి. ఈ ఒక్క పద్యంలో హిరణ్యాక్షుని గొప్పతనమూ తెలుస్తున్నది.

అతడు అందరితోనూ సఖ్యంగా ఉండేవాడనీ - దేవ, యక్ష గణాలను కలుపుకున్న వాడనీ ఇక్కడ అర్థం. ఆదిమ గణాలలో ఒక్కో సందర్భంలో కొన్ని కొన్ని గణాలు కలుస్తూ ఉండేవి. ఇప్పటి రాజకీయ పార్టీల కూటముల లాగా. అప్పట్లో దేవగణాల్పూ, యక్షులూ కలిసి ఉన్నారేమో. ఈ మాటలు చెబుతున్నప్పుడు హిరణ్యకశిపుని సభలో త్రిమస్తక, త్రిలోచన, శకుని, శంబర, శతబాహు, నముచి, హయగ్రీవ, పులోమ, విప్రచిత్తి మొదలైన వీరులున్నారట. వీరంతా దైత్యులు - దానవులూను.

విష్ణువు వరాహ రూపాన్ని "మహా సౌకర్యాంగము"గా వర్ణించాడు పోతన. శత్రువును చంపటానికి అనువుగా ఉన్న వేషం అది. ఆయుధ సంపత్తి గలది.

అప్పటికి ఆర్య బ్రాహ్మణులు దైత్య/దానవ పాలనతో అసహనంగా ఉన్నారు. వారిని పడగొట్టే ప్రయత్నాలు చేస్తూ ఉన్నారు. ఆ విషయం గ్రహించిన వాడు కాబట్టి తమ్ముని హత్యకు ప్రతీకారం చేయటానికీ, ఆర్య దేవగణాలను సమర్థంగా ఎదుర్కోవటానికీ తగిన శక్తుల కోసం హిరణ్య కశిపుడు తపస్సు చేశాడు. "విష్ణువును వెదకండి" అని తనవారికి చెప్పాడు.

తపస్సు అనేది ఒక ప్రయత్నం. హక్కుల కోసమూ, అదనపు సౌకర్యాల కోసమూ చేసుకునే విజ్ఞాపన లాంటిది. పూర్వం అతీత శక్తుల కోసం ఎవరైనా సరే బ్రహ్మనో, శివుడినో, విష్ణువునో ఆశ్రయించవలసి ఉండేది. వారు అధిష్ఠాన వర్గం. అధిష్ఠాన వర్గాన్ని ప్రసన్నం చేసుకునే మార్గం అసురులకు తపస్సు ఒక్కటే.

హిరణ్యకశిపుని తపస్సుకు బ్రహ్మ ప్రత్యక్షమయ్యాడు. వరం కోరుకోమన్నాడు. "మృత్యువు లేని జీవనం కావా"లన్నాడు హిరణ్యకశిపుడు. అది సాధ్యం కాదన్నాడు బ్రహ్మ. "దుర్లభం" అన్నాడు. దళితులు భూమి కోరితే 'దుర్లభం' - అనే అలవాటు ఇప్పటి ప్రభుత్వాలకీ ఉంది. అప్పుడూ అంతే. హిరణ్యకశిపుడు పట్టుదలతో తపస్సు కొన సాగించాడు. ఈసారీ బ్రహ్మను గురించే చేశాడు. బ్రహ్మ తప్పనిసరిగా వరాలు యిచ్చి

వెళ్ళవలసి వచ్చింది. బ్రహ్మ ఆర్య బ్రాహ్మణుల నాయకుడు, అయినా స్థానిక అసుర క్షత్రియులకు లోబడి అంగీకారానికి రావలసి వచ్చింది.

జీవం ఉన్నవాని చేతగాని జీవం లేనివానిచేత గాని దేవ అసుర మనుష్య జాతుల వల్లగాని రాత్రిగాని పగలు గాని, నీళ్ళలో గాని నేలపై గాని మరణం లేకుండా హిరణ్యకశిపుడు వరం పొందాడు. ఇంకా అనేక శక్తులు సాధించాడు.

శివుడు హిరణ్యకశిపునికి లక్షల సంవత్సరాలు మూడు లోకాలమీద ఆధిపత్యం ఇచ్చాడు... దీంతో దైత్యులకు, దానవులకు, కొత్త ఉత్సాహం వచ్చింది. హిరణ్య కశిపుని పాలనలో అందరికీ సమన్యాయం అందింది. గోబ్రాహ్మణుల ప్రాభవం తగ్గింది. దేవ గణాలకు యజ్ఞభాగాలూ ప్రత్యేక సదుపాయాలూ రద్దు అయ్యాయి. దాంతో దేవగణాలు విలవిలలాడాయి. విష్ణువుకు చెప్పుకుంటే ఆయన అభయం ఇచ్చాడు. "సమయం రానీయండి చూద్దాం" అన్నాడు. ఇది, ఇప్పటి రాజకీయ నాయకుల వాగ్దానాల లాగానే ఉంది. హిరణ్యకశిపుని హత్యకు ఆలోచనలు మొదలయ్యాయి. ముందుగా హిరణ్యకశిపుని దేవ ద్వేషిగా ప్రచారం చేశారు.

అతని కొడుకులలో ఒకడైన ప్రహ్లాదుడు విష్ణుభక్తుడని ప్రచారం చేశారు. ప్రహ్లాదుని తమవైపు తిప్పుకున్నారు. తండ్రిమాట వినకుండా చేశారు. కొడుకును చిత్రహింసలు పెట్టిన తండ్రిగా హిరణ్యకశిపుని చిత్రించారు.

ఈ కథనం భాగవతం ద్వారా విస్తృతంగా ప్రచారమై ప్రజల సానుభూతి పొందింది.

హిరణ్య కశిపునికి లీలావతివల్ల కలిగిన నలుగురు కొడుకులలో ఒకడు ప్రహ్లాదుడు. అతడు "విష్ణుభక్తుడ"నీ - అతనిని బాధించినందువల్ల అతనికి రక్షణగా విష్ణువు నరసింహ రూపంతో ఒక స్తంభం నుండి బయటపడి హిరణ్యకశిపునికి బ్రహ్మ ఇచ్చిన వరాలకు భంగం రాకుండా రాత్రీ పగలూ కాని వేళ, ఇంటా బయటా కాని సభా ద్వారంలో తన తొడమీద పెట్టుకుని మనిషీ జంతువూ కాని రూపంతో జీవం ఉన్నదో లేదో తెలియని గోళ్ళతో చీల్చి చంపాడని భాగవతం జనరంజకంగా చెప్పింది. (స్తంభం విష్ణు స్థానం అనీ, స్తంభాన్ని కొట్టడం విష్ణుమతంపై జరిగిన దాడి అనీ చెబుతారు.) ప్రహ్లాదుని కథ శతాబ్దాలుగా తల్లుల చేత కన్నీళ్ళు కార్పిస్తూ రాక్షసుల క్రూరత్వాన్ని నిందిస్తూ విష్ణువు భక్త వాత్సల్యాన్ని ప్రకటిస్తూ ఉంది. నృసింహావతారానికీ ప్రహ్లాదుని కథకూ భాగవతం ఇచ్చిన ప్రచారం అంతాయింతా కాదు. నృసింహుని ఉగ్రరూపాన్ని చూసి అందరూ భయపడ్డారనీ. రకరకాల స్తుతులతో అతనిని వేడుకున్నారనీ చివరకు ప్రహ్లాదుడే అతనిని శాంతపరచాడనీ చెప్పారు. "దేవ ద్వేషులకు ఇలాంటి వరాలు ఇవ్వకు" అని బ్రహ్మకు నృసింహుడు చెప్పాడట.

తమ స్వార్థ ప్రయోజనాల కోసం యజ్ఞ ధర్మాలను ప్రవేశపెట్టిన పురోహిత వర్గానికి బాసటగా నిలిచిన వాడు నరసింహుడు. ఆ నరసింహుని ఈనాడు భక్తితో కొలిచే వారు కింది వర్గాలవారే కావటం దురదృష్టకరం.

ఈ కథంతా చెప్పిన భాగవతం హిరణ్యకశిపుని మూర్తిమత్వాన్ని గొప్పగా చిత్రించటం విశేషం. మానవతావాదిగా, తత్వవేత్తగా ఇతని స్వభావాన్ని ఆవిష్కరించింది. హిరణ్యాక్షుని మరణంతో విలపిస్తున్న తల్లినీ బంధుమిత్రులను ఓదార్చుతూ హిరణ్యకశిపుడు చెప్పిన మాటలు బుద్ధుని బోధనలను తలపిస్తాయి." లోకం మంచినీటి సరస్సు వంటిది. ప్రాణులు అక్కడ దాహం తీర్చుకోవటానికి వచ్చే బాటసారుల వంటివారు. శాశ్వతంగా ఎవరూ కలిసి ఉండరు. ఎవరి త్రోవ వారిది. ప్రాణులపట్ల చింత, దుఃఖం అనవసరం. కదులుతూ ఉన్న నీటి ప్రవాహంలో ఒడ్డున స్థిరంగా ఉన్న చెట్లు కూడా కదులుతున్నట్లు కనిపిస్తాయి. కాని అవి కదలవు...అదంతా మన భ్రమ - భావ వికారాలు లేని ఆత్మ స్థిరమైనది." అంటూ ఒక కథ కూడా చెప్పాడట. "ప్రేత బంధు - యమసంవాదం" అనేది ఆ కథ.

సుయజ్ఞుడు అనే రాజు యుద్ధంలో చనిపోతే బంధువులు ఏడుస్తున్నారు. అప్పుడు యముడు ఒక బాలుని రూపంలో అక్కడకు వచ్చి ఈ శరీరం గురించీ చావు గురించీ చెప్పాడు.

"...ఎవరెవరో చనిపోతే ఏడ్చే వారంతా తాము ఎప్పటికీ చావకుండా ఉంటామను కుంటున్నారా?" అని ప్రశ్నించాడు. "ఎక్కడి నుంచి వచ్చామో అక్కడికి పోవటం ప్రాణులకు సహజం. దేహికీ దేహానికీ ఉన్న తేడా తెలుసుకోవాలి. వినేవాడు, చెప్పేవాడు, ఎప్పుడో వెళ్ళిపోయాడు - ఇంకా ఎవరికి చెప్పుకుంటున్నారు, ఇవన్నీ. భవబంధాలన్నీ కలలోని సంఘటనల లాంటివి. అవి నిజం అవుతాయా..." అంటూ చెప్పి ఆ బాలుడు మళ్ళీ ఒక ఎరుకల వాని కథ చెప్పాడు.

"పిల్లల ఆహారం కోసం బయటకు వెళ్ళిన పక్షుల జంటలో ఆడ పక్షిని ఒక వేట గాడు పట్టుకుని వలలో వేసుకున్నాడు. మగపక్షి ఏడుస్తూ "రెక్కలు రాని పిల్లలు తల్లి కోసం చూస్తూ ఉంటారు. అయ్యో - ఎలాగా" అని అంటూ ఉండగానే వేటగాడు దానినీ బాణంతో కొట్టాడు. మగపక్షి ఏడుపూ ఆగిపోయింది. కాలం సమీపిస్తే ఎవరైనా పోవలసిందే. - చనిపోయిన వాళ్ళు తిరిగి వస్తారా?" అని బాలుని రూపంలో ఉన్న యముడు - రాజు భార్యలకు చెప్పాడట.

ఈ కథ హిరణ్యకశిపుడు తన వారికి చెప్పి వారిని ఓదార్చాడు. దైత్యులు - దానవులు గొప్ప తత్వజ్ఞానం కలిగి ఉండే వారనటానికి ఇది ఒక ఉదాహరణ.

బౌద్ధ ధర్మంలో మరణాన్ని గురించీ - దుఃఖాన్ని గురించి ఉన్న చర్చల లాంటిదే హిరణ్యకశిపుని మాటలలోనూ కనిపించటం విశేషం. వీరి ఆలోచనలు తర్వాతి వారికి మార్గదర్శకంగా ఉన్నాయా? ఆ భావనలతోనే జైన, బౌద్ధ ధర్మాలు పరిపుష్టమయ్యాయా? అనేది పరిశీలించాల్సిన అంశం. జైన, బౌద్ధ ధర్మాలు ప్రచారం అయిన తర్వాతనే ఈ కథలు ప్రచారమయ్యాయా అనేది ఆలోచించవలసిన విషయమే.

ఆలోచనలలోనూ సంస్కృతిలోనూ ఉన్న వైరుధ్యమే దేవ దానవ కలహాలకు మూల కారణం అయిందనుకోవాలి. హిరణ్యాక్ష సోదరులను క్రూరంగా చంపటానికీ అదే కారణం

అయింది. వీరి హత్యల తర్వాత తిరుగుబాట్లు జరిగే ఉంటాయి. హత్యలపై విచారణ జరిపించే అవకాశాలు కూడా లేకుండా ఆర్యగణం వ్యవహరించిందా? ఆ వివరాలు గ్రంథస్థం కాకుండా తమ వాదాన్నే బలంగా వినిపిస్తూ పురాణాలు రాయించిందా అనేది ఆలోచించాలి.

హిరణ్యకశిపుని చంపేశాక దేవగణాలు నృసింహుని కీర్తించటాన్ని తెలుగు భాగవతం వివరంగా చెప్పింది. తమ బాధలన్నీ తీరినట్లు వారు భావించారట.

గతంలో తమ కొడుకులు పెట్టే శ్రాద్ధాలను, పిండాలను, తిలోదకాలనూ తమకు ఇవ్వకుండా ఆ దైత్యులు తామే తీసుకునేవారనీ ఇప్పుడు ఆ బాధ తొలగిందనీ పితృదేవతలు సంతోషించారు. ఆ దైత్యుని చంపిన నృసింహుని గోళ్ళను కీర్తించారు.

తమ సిద్ధులన్నీ తీసేసుకున్న దైత్యుడు చనిపోయినందుకు సిద్ధులూ, (భాగ. 7-314) తమ విద్యలు తమకు తిరిగి ఇచ్చినందుకు విద్యాధరులూ సంతోషించారట. సిద్ధులు విద్యలూ అవేవో వ్యాపార వస్తువుల లాగా వర్ణించారు. అవన్నీ వ్యాపార యాజమాన్యాలూ, గనుల తవ్వకాల హక్కులూ లైసెన్సులూ అయి ఉంటాయా?

వర్తమాన కాలంలో గిరిజన, ఆదివాసీ ప్రజలపై కాల్పులు జరుపుతున్న ప్రభుత్వ బలగాలు, ఆర్య దేవగణాల ప్రతినిధులే. నృసింహుడు హిరణ్యకశిపుని చీల్చి చంపినట్లు వారూ అమాయకులైన ప్రజల జీవనాలను చీలుస్తున్నారు.

నృసింహుని దౌర్జన్యకాండను ఆనాడు ఎవరైనా నిరసించి ఉంటారా? నిరసన కారులను దేవగణాలు అణచివేశారా అనేవి ఆలోచించవలసిన విషయాలు.

శైవమతపరమైన పురాణాలు ఉన్నా అసుర సంహారాలను అవి ఖండించటం లేదు. అందుకు బలమైన రాజకీయ కారణం ఉండి ఉంటుంది.

హిరణ్యకశిపుని రాజ్యపాలన కాలం '29,80,000' దివ్య సంవత్సరాలు. ఇతని అనంతరం ఇతని వంశం వారే అసుర రాజ్యాలు పాలించారు. వారు దేవగణాలతో విరోధం పెట్టుకోలేదు, మత సహనం పాటించారు. నివాత కవచులనే నాలుగుకోట్ల మంది రాక్షసులు ప్రహ్లాదుని కులంవారే. ప్రహ్లాదుడు విష్ణుభక్తుడు అవునో కాదో నిర్ధారించ లేము కాని, అతడు విష్ణువును నిందించిన వారిని మందలిస్తూ ఉండేవాడని రాశారు. తండ్రి మరణాన్ని కళ్ళారా చూశాడు కాబట్టీ, దేవగణాలు రకరకాల వేషాలతో అసుర వీరులను చంపించటం గమనించాడు కాబట్టీ, వారితో విరోధ పడకుండా తనవారిని ఆపుతూ వచ్చాడనుకోవాలి.

బలి పాలన కాలానికి అసురులు బలాఢ్యులుగా రూపొందారు.

హిరణ్యకశిపుడూ బలీ సమకాలికులని అన్నారు. హిరణ్యకశిపునికి బలి ముని మనుమడు అనీ వీరు చెప్పారు. వీరు సమకాలికులయ్యే అవకాశాలున్నాయా అనేది నిర్ధారించలేము. దైత్య వంశంలో ఇవే పేర్లు చాలామందికి ఉండి ఉండవచ్చునేమో. ఈ

పేర్లు వేర్వేరు వ్యక్తులకూ ఉండి ఉండవచ్చును. ఒక "బలి" హిరణ్యకశిపుని మునిమనుమడు. బలి కొడుకులూ బలమైన వారే. అంగ, వంగ, కళింగ, పుళింద, సింహళ రాజ్యాలు వారు పాలించారనీ వారిలో ఆంధుడు అనేవాడు ఉన్నాడనీ పురాణాలు చెబుతున్నాయి. ఆంధుడు/అంధకుడు అనే పేర్లు అంధకదేశ సంబంధమైనవీ కావచ్చు.

ప్రముఖ హేతువాది, పాత్రికేయులూ, మేధావీ అయిన నార్ల వెంకటేశ్వరరావు గారు 'హిరణ్యకశిపుడు' అనే ఏడు రంగాల రూపకం రాశారు. ఇది 1990లో ఒక పత్రికలో ధారావాహికంగా వచ్చింది. ఇందులోని హిరణ్యకశిపుడు ఉదాత్త నాయకుడు, ఉత్తమ పాలకుడు. ఋషులు హిరణ్యాక్ష హిరణ్యకశిపులపై హత్యాప్రయత్నాలు చాలాసార్లు చేశారన్నారు ఆయన. దేవ గణాలకు చెందినవారు ఆత్మాహుతి దళాలలాగా వెళ్ళారనీ, అనార్య పాలకులపై వారికి ద్వేషం అంతగా ఉన్నదనీ, దైత్యుల వైభవాన్ని వారు ఓర్వలేక పోయారనీ, మరణించిన దైత్యులను శుక్రాచార్యుడు బతికిస్తాడనే భయంతో శవాలను కూడా గల్లంతు చేశారనీ నార్లవారు ఆ రూపకంలో చెప్పారు.

హిరణ్యకశిప, హిరణ్యాక్షుల వృత్తాంతాలు వక్రీకరింపబడటమూ ప్రహ్లాదుని విష్ణు భక్తి అనంతర తరాల వారిని అపరిమితంగా ప్రభావితం చేయటమూ గమనిస్తే వైష్ణవ మతాన్ని నిలబెట్టటం కోసమే భాగవతం రాయించారని అర్థమవుతుంది.

మహాత్మా జోతిరావ్ పూలే విశ్లేషణ ప్రకారం ద్విజులు (ఆర్య ఇరానీయులు) ప్రహ్లాదుడిని తండ్రిని వ్యతిరేకించేవానిగా తయారుచేశారు. 'హరహర' అనే బదులు అతని చేత "హరి హరి" అనిపించారు. నారాయణుడు నృసింహ రూపం ధరించి అది కనపడ కుండా పైన చీరకట్టుకుని స్త్రీ వేషంలో ప్రహ్లాదుని మంచిచేసుకుని రాజాంతఃపురంలో ప్రవేశించాడు. ఒక స్తంభంచాటున దాక్కుని రాత్రివేళ హిరణ్యకశిపుడు గాఢనిద్రలో ఉన్నప్పుడు అతనిపై పడి చంపేశాడు. వెంటనే పారిపోయాడు. అసురులు ఈ మాయా దాడిని ఆలస్యంగా గుర్తించారు. ప్రహ్లాదుడు అప్రమత్తుడై ద్విజులను ఎదుర్కొన్నాడు. అప్పటి నుండి అసుర పాలకులు ద్విజులను (వి.ప్రియ) విప్రులుగా పిలవటం మొదలుపెట్టారు. తమ రాజ్యాలు ఆర్యుల నుండి కాపాడుకుంటూనే వచ్చారు.

# ప్రహ్లాదుడు

హిరణ్యకశిపుని కొడుకు. అసురులలోని వాడయినా నారాయణుని భక్తుడని భాగవతం చెబుతున్నది. ఇతని తల్లి లీలావతి. హిరణ్య కశిపుడు బ్రహ్మను గురించి తపస్సు చేయటానికి వెళ్ళినప్పుడు దేవగణాలు రాక్షసులపై దండెత్తి వారందర్నీ భయపెట్టారు. గర్భిణిగా ఉన్న లీలావతిని ఇంద్రుడు పట్టుకుని చంపబోయాడు. నారదుడు అడ్డుపడితే "గర్భంలో ఉన్న శిశువును చంపుతాను - ఆమెను వదిలేస్తాను" అన్నాడట. (అప్పటికి వైద్యవిజ్ఞానం అంత వికసించిందా?) గర్భంలో ఉన్నవాడు మనవాడే - భక్తుడు - అని ఇంద్రునికి నచ్చచెప్పి నారదుడు లీలావతిని తన ఆశ్రమానికి తీసుకువెళ్ళాడు. నారదుని పాటలూ, బోధలూ వినటంవల్ల ప్రహ్లాదుడు పుట్టుకకు ముందునుంచే విష్ణు భక్తుడయ్యాడంటారు. హిరణ్యకశిపుడు బ్రహ్మచేత వరాలు పొంది వచ్చి దేవగణాలను తరిమికొట్టి సింహాసనాధిష్ఠితుడయ్యారు. ప్రహ్లాదుడు తన తండ్రికి విరోధి అయిన విష్ణువును కీర్తిస్తూ ఉండేవాడు. అందుకుగాను తండ్రిచేత శిక్షలు కూడా అనుభవించాడు. తండ్రి కోపంతో "హరి ఎక్కడున్నాడు? ఈ స్తంభంలో ఉన్నాడా" అని ఒకసారి ఒక స్తంభాన్ని కొట్టగా అందులోంచి నరసింహాకారంలో విష్ణువు బయటకువచ్చి హిరణ్యకశిపుని చంపేశాడు. ఇది భాగవత పురాణ కథ. ప్రహ్లాదుడు తండ్రి మరణానికి దుఃఖించకపోగా నరసింహుని కీర్తిస్తూ అతనిని శాంతపరచాడని చెప్పారు. తండ్రులకు వ్యతిరేకంగా కొడుకులను తయారు చేసిన పద్ధతి అది. భాగవతం ఇలాంటి కథలు ప్రచారం చేసింది. విష్ణుభక్తి ప్రచారమే ఇక్కడ లక్ష్యం.

(i) ప్రహ్లాదుని గురించి చాలా కథలున్నాయి. ప్రహ్లాదుడు ఒకప్పుడు విష్ణుభక్తి మరపుకువచ్చి విష్ణువుతో పోరాడాడట. అయితే ఆ కథను పైకి రానివ్వలేదు. (ii) మరోసారి ప్రహ్లాదుడు నరనారాయణులను చూసి అపహాస్యంగా మాట్లాడాడట. వారు కోపంతో యుద్ధానికి తలపడి ఇతనిని ఓడించారు. అప్పుడు విష్ణువు వచ్చి 'మనవాడే' అని చెప్పి రక్షించాడు (దేవీభాగవతం.) (iv) ప్రహ్లాదుడు స్వర్గాధిపత్యం కోరి దేవగణాలతో పోరాడాడు గాని ఓడిపోయాడు. ప్రహ్లాదుడు శాంత చిత్తుడుగా ఎవరి గురించీ చెడుగా ఆలోచించని మనస్విగా కనబడతాడు. ప్రహ్లాదుని మనమడు బలి చక్రవర్తి ఒకనాడు విష్ణువును గురించి అప్రియంగా మాట్లాడితే ప్రహ్లాదునికి కోపం వచ్చిందట. 'ఆ విష్ణువు చేతనే అణగదొక్క బడతావు' అని మనుమని శపించాడట.

ప్రహ్లాదుని ధర్మతత్త్వం, విష్ణుభక్తి అతని పక్షానికే చేటు తెచ్చినట్టు చెబుతున్న కథలన్నీ అసంబద్ధంగానూ హేతువుకు అందనివిగానూ ఉండటానికి కారణం ఎక్కడికక్కడ విష్ణు భక్తులు కథలు అల్లి ప్రచారం చేయటంవల్లనే.

మత్స్య పురాణం ప్రకారం ప్రహ్లాదుడు తండ్రికి విధేయుడు. తండ్రితోపాటు రాజసభలో ఉండేవాడు. సభలో నరసింహ మృగాన్ని మొదటగా చూసినదీ తండ్రికి చెప్పినదీ ప్రహ్లాదుడే. (చూ. హిరణ్యకశిపుడు)

అసుర వీరుల కథలను ఇలాగే వక్రీకరించి చెప్పి విష్ణువు గొప్పతనాన్ని నిరూపించే ప్రయత్నాలు జరిగాయి. మహాత్మా జోతిరావ్ పూలే విశ్లేషణ ప్రకారం ప్రహ్లాదుడు తండ్రి హత్యను చూసి క్రుద్ధుడయ్యాడు. ద్విజులను ఎక్కడికక్కడ కట్టడి చేశాడు. వారితో యుద్ధాలూ చేశాడు. దేవగణాలతో ప్రహ్లాదుని యుద్ధాలను హిందూ పురాణాలూ చెప్పాయి.

దేవాసుర యుద్ధ గాథలు చూస్తే బలి, ప్రహ్లాదుడు అనేపేర్లు గలవారు అన్ని తరాలలోనూ ఉన్నారేమో అనిపిస్తుంది.

ప్రహ్లాదుని భార్య దేవి. కొడుకు విరోచనుడు...విరోచనుని కొడుకు బలిచక్రవర్తి.

# కోలాహలము

దేవాసుర సంగ్రామాలలో 'కోలాహలము' అనేది ఒకటి. యుగధర్మం తలక్రిందు లయినప్పుడు నారాయణుడు భూమిమీద అవతరిస్తాడన్నారు. ఈశ్వరుడైన హరి అవతరిస్తాడు అని అక్కడే మరోచోట చెప్పారు. దేవుళ్ళ పేర్లు యధాలాపంగానే వాడారా? ఆ దేవుళ్ళు ఆయా జాతుల నాయకులుగా ఉన్నారా అనేది ఆలోచించవలసినదే. (అనార్యుల దేవుడు శివుడు).

హిరణ్యకశిపుడు, బలి అనే అసురులు లోకత్రయాన్నీ పాలిస్తున్నప్పుడు ఆయా కాలాలలో పది దివ్యయుగాలపాటు దేవాసురులకు మహాయుద్ధం జరిగిందట. మూడు లోకాలూ అసురుల పాలన కింద ఉన్నాయంటే దేవగణాలు దేశంలో ఎక్కడో ఒకచోట అల్లర్లు లేవదీస్తుండేవారనీ అలా పది దివ్యయుగాలపాటు జరిగిందనీ ఆ తర్వాతనే అధికారం, దేవ/ఆర్యగణాలకు ఎక్కడో అక్కడ వచ్చి ఉంటుందనీ అనుకోవచ్చు.

కోలాహలము అనే యుద్ధంలో విప్రచిత్తిది ప్రధాన పాత్ర అంటున్నది మత్స్య పురాణం. (అధ్యా. 47) దేవాసురులలో రాజ్యాధికారం ఒకసారి దేవగణాలకు మరోసారి అసురులకు పర్యాయ క్రమంలో వస్తుండేది. ఒకసారి అసురులు ఓడిపోయినప్పుడు శుక్రుడు దేవగణాల దగ్గరకు వెళ్ళాడట. విజయోత్సవాలు చేసుకుంటున్న వారిని చూడటానికి వెళ్ళాడు. అది చూసి అసురులు బాధపడ్డారు. "మేము బతికి ఉండగానే మమ్మల్ని వదలి, మా రాజ్యం విడిచి దేవతల యజ్ఞానికి వెళ్ళారేమిటి? మేము ఇక్కడ ఉండలేం. రసాతలానికి పోతాం" అని శుక్రునితో అన్నారు. (రసాతలం అంటే అజ్ఞాతం లేదా అండర్ గ్రౌండు అయి ఉంటుంది.) శుక్రుడు అసురులను ఓదార్చాడు. "భయపడకండి. నా తేజస్సుతో మిమ్మల్ని మళ్ళీ మంచిస్థితికి తెస్తాను - మంత్రాలు, ఓషధులు, రసద్రవ్యాలు నా దగ్గర చాలా ఉన్నాయి. అవి మీ కోసమే దాచిపెట్టాను మీకు ఇస్తాను" అన్నాడు. తన దగ్గర ఉన్న సంపదలో నాలుగో వంతు మాత్రమే దేవగణాలకు ఉన్నదనీ చెప్పాడు.

ఈ సంగతి దేవగణాలకు తెలిసింది. వారు భయపడ్డారు.

శుక్రుని దగ్గర ఉన్న సంపద అసురులకు చేరకముందే "శుక్ర శిష్యులను చావగొట్టి పాతాళానికి పంపుదాం" అనుకున్నారు. అదే ఆచరణలోపెట్టారు. అసురులు తాళలేక శుక్రుని దగ్గరకు వెళ్ళారు. శుక్రుడు వారికి రక్షణ కల్పించాడు. వాళ్ళని వదిలేసి దేవగణాలు వెనక్కి వెళ్ళిపోయారు.

అలా ఉండగా శుక్రునికి పాత విషయం ఒకటి జ్ఞాపకం వచ్చింది. అప్పుడు తన శిష్యులతో ఇలా అన్నాడట. "యుద్ధాలలో మనవారెందరో మరణించారు. ఇప్పుడు శత్రువులతో యుద్ధం వద్దు. విజయం ఇప్పించేవాడు మహేశ్వరుడు. అతనిని ప్రార్థించి

ఎదురులేని మంత్రాలు నేర్చుకొని అప్పుడు యుద్ధానికి వెళదాం". ప్రహ్లాదుడు, ఇతర దానవులూ ఈ మాటలకు ఆనందపడ్డారు. "మేమంతా ఆయుధాలు వదిలేస్తాం. రాత్రుళ్ళు ఆహారం తీసుకోం. నియమంగా ఉంటాం. నారబట్టలతో అడవులలో తపస్సు చేస్తాం" అని శపథం చేశారు.

ఈ సంగతి తెలిసి దేవగణాలు సంతోషించాయి. శుక్రుని వల్ల ఏమి జరగబోతున్నదో అని ఇంద్రునికి భయం పట్టుకున్నది. ఆలోచించి, ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాడు. తన కూతురు జయంతిని పిలిచాడు. "బిడ్డా, శుక్రుడు నా నాశనం కోసం దారుణమైన తపస్సు చేస్తున్నాడు. అతడు మహా బుద్ధిశాలి. నీవు అతని దగ్గరకు వెళ్ళి అతనికి శుశ్రూష చెయ్యి. అతనిని సంతోషపెట్టు. నేను నిన్ను అతనికి ఇస్తున్నాను. నా పక్షంలో ప్రయత్నించు" అని చెప్పాడు. శుక్రుని తపస్సు పాడుచెయ్యాలనే ఆలోచన అది. రాజ్యం కోసం, అధికారంకోసం కన్న కూతుళ్ళనే శత్రువుల దగ్గరకు పంపే వ్యవహారాన్ని పురాణాలు చెప్పాయి.

శుక్రుని తపస్సు ధూమవ్రతంతో కూడినది. కుండధారణ యాతనను సహించి అతడు తపస్సు చేశాడు. అగ్నికుండంలో నిప్పులు కణకణలాడుతూ ఉంటే పైన యక్షుడొకడు ఇతడిని (శుక్రుడిని) తలకిందులుగా వేలాడదీసి ఇందులో పడేస్తానని యాతన పెడుతూ ఉంటే ఆ నిప్పుకణాల పొగ (ధూమం) పీలుస్తూ సెగకు తట్టుకుంటూ చేసే వ్రతం. అది వెయ్యి సంవత్సరాలు శుక్రుడు అలా చేశాడు.

జయంతి అతనికి పరిచర్యలు చేస్తూ ఉండిందట. "శరీరం ఒత్తుతూ స్పర్శ సుఖం కలిగిస్తూ సేవించింది" అన్నారు. శివుడు ప్రసన్నుడయ్యాడు. "తపస్సు, బుద్ధిబలం, శాస్త్ర జ్ఞానం, బలం, తేజస్సులలో నీవొక్కడివే దేవతలను మించినవాడవు. ఈ విషయం ఎవరికీ చెప్పకు – నీవు ఏది కోరితే అది జరుగుతుంది" అని చెప్పాడు. (అప్పుడు శుక్రుడు చేసిన శివస్తవం గొప్పగా ఉంది. దేవగణాల/అవతారాల గొప్పతనాన్ని అంగీకరించిన భక్తులు చేసే విధంగానే పురాణకర్తలు రాశారు).

శివుడు వరం ఇచ్చి వెళ్ళిపోయాక శుక్రుడు తన సమీపంలో ఇంతకాలం తనకు సపర్యలు చేస్తూ ఉన్న జయంతిని గమనించి ఆమెకు ఏంకావాలని అడిగాడట. "నా కోరిక మీరే తెలుసుకోండి" అన్నది జయంతి. తండ్రి ఆమెను శుక్రునకు ఇచ్చాననటం ఆమె మరచిపోలేదు. పది సంవత్సరాలపాటు శుక్రునితో ఏకాంతంగా ఉండాలనే ఆమె కోరికను శుక్రుడు దివ్యవద్దృష్టితో గ్రహించాడట. ఆమెను ఇంటికి తీసుకువెళ్ళాడు. పెళ్ళి చేసుకున్నాడు. వారు ఏకాంతంగా ఎవరికీ కనబడకుండా ఉన్నారు.

ఆ సమయంలో అసురులు శుక్రుని దర్శనం కోసం వస్తే ఆయన వారికి కనబడ లేదు. ఈ సంగతి అంతా బృహస్పతికి తెలిసింది. ఆయన ఇంద్రునికి విషయం చెప్పాడు. ఇంద్రుని ప్రేరణతో ఆయన శుక్రుని రూపం ధరించాడు. దైత్యులను పిలిచాడు. "నేను

సంపాదించి తెచ్చిన విద్యలు ఇవిగో మీకు నేర్పుతాను రండి" అంటూ వారిని చేరదీశాడు. ఆ సమయంలోనే ఆయన (బృహస్పతి) వారికి చార్వాక వాదం నేర్పాడట.

పది ఏళ్ళు గడిచాక శుక్రుడు బయటకు వచ్చి తనవారి గురించి ఆలోచిస్తూ వారి దగ్గరకు వెళ్ళాడు. దైత్యులు ఈ శుక్రుని గుర్తించలేదు. మాయా శుక్రునితోనే ఉన్నారు. అతడే తమ గురువు అనుకున్నారు. బృహస్పతి మాయను శుక్రుడు వివరించి చెప్పినా వారు, ఇద్దరిలో ఎవరెవరు అనేది గుర్తించలేకపోయారు. మాయా శుక్రుడు గత పదేళ్ళుగా తమతో ఉన్నాడు – అతనే తమ గురువు అని నమ్మారు. కొత్తగా వచ్చినవాడు మోసగిస్తున్నాడను కున్నారు. బృహస్పతితోనే ఉండిపోయారు. శుక్రుడు ఎంత చెప్పినా వారు వినలేదు. శుక్రుడు విసిగిపోయి "మీరు తెలివి కోల్పోయి ఉన్నారు. పరాభవం పొందుతారు" అని శపించాడు. అసురులకు శాపం తగిలాక బృహస్పతి తన అసలు రూపం ప్రదర్శించి తన దారిన తాను వెళ్ళిపోయాడు. అప్పుడు అసురులకు నిజం బోధ పడింది. అప్పుడు శుక్రుని దగ్గరకు వెళ్ళి ఆయన ముందు తల వంచుకుని నిలబడ్డారు. ప్రహ్లాదుడు కన్నీటితో శుక్రుని శరణు కోరాడు.

దైత్యుల ప్రార్థనలతో శుక్రుడు ప్రసన్నుడయ్యాడు. "ఇది ఇలా జరగవలసి ఉంది. మళ్ళీ మరో కల్పంలో మీకు రాజ్యం వస్తుంది. ప్రహ్లాదుడు రాజవుతాడు. బలి రాజ్యమూ మళ్ళీ వస్తుంది. నా శిష్యులిద్దరు శండుడు, మర్కుడు అనేవారు బృహస్పతి దగ్గర ఉండి, వారి ప్రయత్నాలు వారిస్తూ మీకు కీడు జరగకుండా చూస్తారు" అని చెప్పి అసురులను పంపేశాడు. దైత్యులు తాము గతంలో వదిలేసిన ఆయుధాలు ధరించి మళ్ళీ దేవగణాల మీదికి యుద్ధానికి వెళ్ళి గెలిచారు. ఆ యుద్ధం నూరేళ్ళు జరిగింది.

అసురులు పదేళ్ళు రాజ్యంచేశాక దేవగణాలు శండామర్కుల చేత యజ్ఞం చేయించి యుద్ధానికి వచ్చి గెలిచారు. యజ్ఞంవల్ల గెలిచిన ఈ యుద్ధం కోలాహలం అన్నారు.

ఈ యుద్ధాలు రెండు వర్గాల మధ్య సాగుతున్న కలహాలు. ఆ వర్గాలు ఆర్య ఇరానీయులు – స్థానిక జాతులూను.

# విప్రచిత్తి

విప్రచిత్తి దనువుకూ, కశ్యపునికీ పుట్టిన కొడుకు. దానవుడు. హిరణ్యకశిపుని సోదరి సింహిక ఇతని భార్య. శల్యుడు, సభుడు, వాతాపి, ఇల్వలుడు, అంధకుడు, నరకుడు, దంభుడు, స్వర్భానుడు ఇతని కొడుకులు. మహిష్మతి అనే కూతురు కూడా ఉంది. శివ, విష్ణు, వరాహ పురాణాలు ఇతని గురించి చెప్పాయి. ఒక ముని శాపంవల్ల ఇంద్రుని ఐశ్వర్యం సముద్రంలో పడిపోయినప్పుడు ఇంద్రుడు రాజ్యాన్ని పోగొట్టుకున్నాడు. అప్పుడు ఇంద్రుని రాజ్యం 'విప్రచిత్తి' అధీనంలోకి వచ్చింది. అమరావతి పాలకునిగా ఇతడు వైదిక క్రతువులలో దానవులకూ భాగస్వామ్యం ఇచ్చాడు. తమ వాటాలు తగ్గుతున్నందుకూ – విపక్షాలు లబ్ది పొందుతున్నందుకూ సహజంగానే దేవగణాలు, ఆర్యులు ఇతని మీద విరోధం పెంచుకున్నారు. ఇతని ప్రస్తావన చాలాచోట్ల ఉంది.

ఇతని కుమారులలో అంధకుడు, అంధక దేశ సంబంధం కలవాడేమోననీ, బౌద్ధ ధర్మ భావాలను విశ్వసించినవాడు కావచ్చుననీ ఊహించటానికి ఆస్కారం ఉంది.

వాతాపి ఇల్వలులను అగస్త్యుడు జీర్ణం చేసుకొన్న కథలు గుర్తుతెచ్చుకుంటే విప్రచిత్తి కొడుకులు అసుర సంప్రదాయ పరిరక్షకులనీ ఆర్య ధర్మాలను – పురోహిత వ్యవస్థనూ చాతుర్వర్ణ ధర్మాన్ని కొనసాగనివ్వకుండా చేశారనీ అందుకే పురోహిత వర్గం వారిని హత మార్చిందనీ అనుకోవాలి.

వాతాపి, ఇల్వలుడు, నరకుడు అనే పేర్లు దైత్య, దానవ కుటుంబాలలో చాలా మంది చాలా తరాల వరకూ పెట్టుకొని ఉండవచ్చు. ప్రచారంలో ఉన్న కథలు ఏ తరానికి సంబంధించినవైనా స్థానిక అసుర క్షత్రియుల బలశౌర్యాలను ప్రతిఫలిస్తున్నాయి. స్వదేశ రక్షణకూ, స్వీయ సంస్కృతి నిలబెట్టుకోవటానికీ వారు పోరాటాలు చేశారు. విప్రచిత్తి యోగవేత్త అయిన ధ్వజుని రూపం ధరించీ ఒక యుద్ధంలో పాల్గొన్నాడట. "కోలాహలము" అనే యుద్ధంలో ఇతనిదే ప్రధాన పాత్ర అంటున్నది మత్స్యపురాణం.

# దుర్గముడు

ఇతడు హిరణ్యాక్షుని వంశంలోని అసుర వీరుడు. 'రురుడు' అనే వాని కొడుకు. బ్రహ్మ సృష్టిచేయడానికి సంబంధించిన కథల్లో ఇతనినీ ప్రస్తావించారు. వేదజ్ఞానం అసురులకు నిషేధించిన కాలంలోని కథ ఇది. దుర్గముడు బ్రహ్మ నుద్దేశించి వెయ్యి సంవత్సరాలు తపస్సుచేసి వేదజ్ఞానం పొందాడట. దుర్గముడికి వేదజ్ఞానం ఇవ్వటంతో దేవగణాలు దీనస్థితిలో పడ్డారు. 'వేదజ్ఞానం' అనేది ఒక వస్తువుగా ఈ కథ చెబుతున్నది. అది ఒక గ్రంథం కావచ్చు - రిఫరెన్స్ పుస్తకం కావచ్చు. ఇయర్ బుక్ (Year Book) లాంటిదో విజ్ఞాన సర్వస్వమో అయి ఉండవచ్చు. దానికి మరో కాపీ (ప్రతి) లేదు. మత్స్యావతార కథలోనూ వేదాలంటే దొంగిలించటానికి వీలయ్యే వస్తువుల లాగానే చెప్పారు.

వేదాలలో విజ్ఞానం ఉందీ అనుకుంటే ఆ విజ్ఞానాన్ని దేవగణాలలో అంతవరకు ఎవరూ నేర్చుకుని ఉండలేదా? ఆ విజ్ఞానం తమ శత్రువులకు అందనీయక పోవటమే వారి లక్ష్యమా? వేదాలు పోగొట్టుకుని దేవగణాలు చాలా కష్టాలు పడ్డారు. ఆకలితో అలమటించారట. అంటే చదువులు లేక అజ్ఞానులై సంపదలు, రాజ్యం పోగొట్టుకున్నారన్న మాట. తర్వాత దేవిని ఉపాసించి ఆవిడ అనుగ్రహం పొందారు. ఆవిడ 'శతాక్షి'గా 'శాకంబరి'గా వారి ఆకలితీర్చి వారికి అభయం ఇచ్చింది. దుర్గముడితో 10 రోజులు యుద్ధంచేసి అష్టమి తిథినాడు అతనిని చంపిందట. అందువల్ల 'దుర్గ' అయిందని చెప్పారు. వేదజ్ఞానం తిరిగి దేవగణాలకు చేరింది. ఆశ్వయుజ మాసపు దసరా నవరాత్రుల కథల్లో ఇదీ ఒకటి.

దుర్గముడు ఎవరిని ఎలా బాధించాడో వివరాలు లేవు. అసురులను చంపాలంటే, "మునులను, బ్రాహ్మణులను దేవతలనూ బాధించారు" అనే ఒక్కమాట చాలు. వారి మీద నేరం నిర్ధారణ అయిపోతుంది. ఇక్కడ దుర్గముడి విషయంలో వేదజ్ఞానం దేవతలు తిరిగి తీసుకోవటం అనే అంశం ఉంది. పురుష దేవుళ్ళు అందరూ తమ సమస్త శక్తులూ ఒక మహిళలో నిక్షేపించి ఆమెచేత దుర్గముని చంపించి అతని సంపద, జ్ఞానమూ తాము తీసుకుని అనుభవించారు. అది తాము పోగొట్టుకున్న సంపద, జ్ఞానమూ (పుస్తకాలూ) అని చెప్పారు. అది ఎంతవరకు నిజం?

21వ శతాబ్దపు ప్రత్తి రైతుల లాగా, భూములు కోల్పోయి శరణార్థ శిబిరాలలో చేరిన వేలాది గ్రామీణ వ్యవసాయదారుల లాగా, ఆదివాసీ బాలలలాగా దేవగణాలు బాధలు పడ్డారా? అయితే ముందు నుంచీ వేద జ్ఞానంలేని అసుర వర్గాలు ఎలా ఉండేవారో? ఆలోచనకు చిక్కదు. దైత్యులు, అసురులు అన్న పానీయాల కంటె ప్రాణశక్తినే ప్రధానంగా చేసుకుని బతికినట్టున్నారు. అద్వైత భావన - తత్వచింతనలతో వారు తిండిమీద అంతగా

ధ్యాస పెట్టలేదేమో. అందుకు ఆదివాసీ/గిరిజన జీవితాలే నిదర్శనం. దుర్గముడు అనే పేరుతో స్కంద పురాణం బ్రహ్మాండం - సేతు మాహాత్మ్యంలో నాలుగవ అధ్యాయంలో ఒక కథ ఉంది. దుర్గముడు ఒక గంధర్వుడు. అతడు భార్యలతో ఒక కొలనులో విహరిస్తున్నాడు. మునులు సంధ్యావార్చటానికి అక్కడికి వచ్చారు. వారికి అంతరాయం కలిగింది గనక అతనిని శపించారు. స్థానిక చెరువులు యక్షులవో, గంధర్వులవో అయి ఉండటాన్ని (మహాభారతం) పురాణ కథలే చెప్పాయి. అయినా ఇక్కడ ఆర్యమునులనూ వారి దురాగ్రహాన్నీ సమర్థించారు. 16 సంవత్సరాలు రాక్షసునిగా ఉండి గాలవుడనే మునిని మింగబోగా విష్ణుచక్రం వచ్చి రాక్షసుని చంపింది. అ విధంగా దుర్గమునికి శాపవిముక్తి అయింది. ఆర్యుల దురాక్రమణలూ స్థానిక నీటి వనరుల మీద అనుష్ఠానాల పేరుతో అధిపత్యం వహించటాలూ అంతరాయం కలిగించిన వారిని శపించటాలూ/ చంపటాలూ చాలా కథలలో కనిపిస్తాయి. తగాదాలన్నీ నీటి వాడకాల దగ్గరా నీటివనరుల పంపిణీలోనూ రావటం ఇప్పటికీ ఉన్నది.

స్థానిక ప్రజలకు అన్యాయం జరిగినా దాన్ని కప్పిపుచ్చి ఆధిపత్యవర్గాన్నే సమర్థించటం పురాణ కథలు చూపిన మార్గమే.

ప్రాచీన కావ్యాలలో కవులు సంపన్న వర్గాల ఆకలినీ - భోజనాలనూ, విందులనూ, వర్ణించినంతగా సామాన్య ప్రజల ఆకలిని పట్టించుకున్న దాఖలాలు లేవు. రామాయణంలో భరద్వాజుని విందును ఎంతో అతిశయంగా వర్ణించారు. విశ్వామిత్రునికి వసిష్ఠుడిచ్చిన విందూ అలాంటిదే. మునులు ఇచ్చిన విందులు అవి.

వ్యాసుని ఆకలి సంగతి వచ్చేసరికి కాశీఖండంలోని కథ చెప్పుకోవాలి. వ్యాసునికి కాశీ నగరం విందు కాదు గదా భిక్ష కూడా పెట్టలేదు. ఆకలితో మాడిమాడి, చివరకు శపించాలనుకునే సరికి కాశీ అన్నపూర్ణ లాంటి గృహిణి ఆతిథ్యం ఇచ్చింది. అ తర్వాత శాపమూ ఇచ్చింది. "కాశీనే శపిస్తావా? మళ్ళీ ఈ నగరానికి రాకు" అని ఆగ్రహించింది. ఇందులో వర్గ, వర్ణ స్వభావం లేదని అనుకుందామా?

ఇంతకూ వేదాలు - వేద జ్ఞానం అనేవి వస్తు రూపంలో ఉన్నాయా? ఇచ్చి పుచ్చుకునే/దాచుకునే వస్తువులుగా వాటిని వర్ణించటం హయగ్రీవుని కథలోనూ (మత్స్యావ తారం కథ) కనిపిస్తుంది. బ్రహ్మ నోటి నుంచి వెలువడ్డ వేదాలను హయగ్రీవుడనే దైత్యుడు గ్రహించి వాటినెవరైనా లాక్కుంటారని భయపడి సముద్రంలో దూకితే మత్స్యుడు హయగ్రీవుని వెన్నంటి చంపి వాటిని బ్రహ్మకు తెచ్చి ఇచ్చాడు. అవి అందినాకనే బ్రహ్మ సృష్టి చేయగలిగాడు. మత్స్యునికి బదులు హయగ్రీవ రూపం వేసుకున్న నారాయణుడే హయగ్రీవుడనే దైత్యుని చంపాడన్నారు. ఆ వేషం ఎందుకూ అంటే అలా జరగాలని రాసిపెట్టి ఉందన్నారు. పూర్వజన్మల కథలూ శాపాల కథలూ చెబుతారు.

హయగ్రీవ రూపం అనగానే ఆర్య సంబంధం స్ఫురిస్తుంది. హయం (గుర్రం) ఆర్యుల చిహ్నం. ఆర్యులు - వేదాలను సొంతం చేసుకోవటం వంటివన్నీ దీని నుండే అర్థం చేసుకోవాలి.

దసరా నవరాత్రుల నేపథ్యంలో మహిషాసురుని కథ ప్రసిద్ధం. దేవి ఆశ్వయుజ శుద్ధ నవమినాడు మహిషాసురుని చంపింది. మహిషాసుర రూపంపై గ్రీకు పురాణాల ప్రభావం ఉన్నదంటారు. మనిషి శరీరమూ, దున్నపోతు తలా ఉన్న గ్రీకువీరుడు 'మినోటార్'. మినోటార్ తల్లి మానవకాంత, తండ్రి తెల్లదున్నపోతు. మినోటార్‌కు ఏడాదికి ఏడుగురు యువకులను ఏడుగురు యువతులను ఆహారంగా పంపే ఒప్పందం (ఆ ఊరి రాజుతో) ఉంది. ఈకథలోనే పద్మవ్యూహం గురించి కూడా ఉంది. ఈ మినోటార్‌ను ఎథెన్స్ నగరపు రాజకుమారుడు 'థీసస్' చంపాడు. ఈ కథ అద్భుత వీర రసాల మేళవింపుతో ప్రపంచ సాహిత్యంలో ప్రసిద్ధమైంది. వీడియోగేమ్స్ కూడా వచ్చాయట. మహాభారతంలోని బకాసురుని కథకూ ఇలాంటి మూలాలతోనే రూపొంది ఉండాలి.

పై గ్రీకు కథ భారతదేశ సారస్వతంలో ప్రవేశించి ఉండాలి. ప్రపంచ సాహిత్యంలోని చాలా గాథలు భారతీయ సాహిత్యంలో పురాణాలుగా ఒక మతపు సంప్రదాయాలను సమర్థించేవిగా రూపొందాయి. ఇతర మతాల వారిని దుష్టులుగా చూపటానికి ఆయా కథలను వాడుకున్నారు.

# నముచి

ఋగ్వేదంలో నముచి గురించి ఉంది (6-2-56). పురాణాలలోనూ ఇతని ప్రస్తావన ఉంది. రామాయణం అరణ్యకాండ ఇతనిని గుర్తుచేసుకున్నది. జనస్థానంలోని రాక్షస వీరులను రాముడు చంపుతున్నప్పుడు, 'పూర్వం నముచిని ఇంద్రుడు వజ్రాయుధంతో చంపినట్టుగా' అని పోలిక (పురాహి నముచిం సంఖ్యే వజ్రేణేవ పురందపి) తెచ్చారు. సీతను అపహరించటానికి రావణుడు మారీచుని సహాయం కోరినప్పుడు మారీచుడు రాముని పరాక్రమం గురించి చెబుతూ బలినీ, నముచినీ చంపగల వీరుడు రాముడు అంటూ పొగిడాడు.

"బలివాం నముచిం వాపి హన్యాద్ధి రఘునందన" అన్నాడు (అరణ్య - 39-18). అంటే, నముచి చారిత్రక వీరుడే అనుకోవాలి. నముచి గొప్ప పరాక్రమమూ తపశ్శక్తి ఉన్నవాడు, ఇంద్రుడిని చాలాసార్లు ఓడించాడు. ఇంద్రుని నుంచి సోమరసం తీసేసుకుని అతనిని బంధించాడు. ఇంద్రుడు బతిమాలితే, ఒక షరతు మీద నముచి అతనిని వదలి పెట్టాడు" "పగలు గాని, రాత్రి గాని బాణాలతోగాని కత్తితోగాని, తడిదానితో గాని పొడి దానితో గాని నిన్ను కొట్టను" అని ఇంద్రునిచేత వాగ్దానం చేయించుకున్నాడు. ఇంద్రుడు వాగ్దానం పాటిస్తాడని నముచి నమ్మాడు. ఇంద్రుడిని వదలిపెట్టాడు.

సోమరసమే ఇంద్రుని శక్తి. సోమాన్ని తిరిగి పొందటానికి, రక్షించుకోవటానికీ ఇంద్రుడు నానా తిప్పలూపడ్డాడు. అశ్వినులనూ, సరస్వతినీ ప్రాధేయపడ్డాడు. పని జరిగితే సోమరసంలో వాటా ఇస్తానన్నాడు. పనులు చేసి పెడితే కొంత పర్సంటేజి ఇచ్చే పద్ధతీ, తీసుకునే పద్ధతీ అర్యులకు అలవాటే. "మళ్ళీ నీ జోలికి రానన్న" ఇంద్రుడు, నముచిని చంపే ఆలోచనలు చేస్తూనే ఉన్నాడు. నముచితో కలిసి తిరుగుతూనే ఉన్నాడు.

1. ఇంద్రుడు నముచితో విరోధం లేనట్టే కనిపిస్తూ సఖ్యం నటిస్తూ సరస్వతి తోనూ, అశ్వినులతోనూ కలసి నముచిని చంపే ఉపాయాలు ఆలోచించాడు. సరస్వతి నది, అశ్వినులూ నీటిని ఇంద్రుని వజ్రాయుధంపై ధారగా పోస్తూ నురుగు ఏర్పడేలా చేశారు. ఇంద్రుడు ఒక సాయంత్రం నముచిని అటువైపు షికారు తీసుకువచ్చి, ఆ నురుగుతో నముచి తల నరికాడు. నురుగు చాటున కత్తి ఉంది. వడగండ్ల వానలాంటిదో వర్షాలలో పడే పిడుగుపాటు లాంటిదో నముచి మరణానికి కారణమై ఉండాలి. పిడుగులూ ఇంద్రుని ఆయుధాలే.

నముచిని చంపినప్పుడు అతని తలలోంచి రక్తమూ, సోమమూ బయటపడ్డాయట. అప్పటి నుంచి అశ్వినులను యజ్ఞ క్రతువులలో సోమం తాగటానికి (మందు పార్టీలకు) అర్యులు, సురులు పిలుస్తూండేవారు. ఇది విష్ణుపురాణం కథ.

2. నముచిని విష్ణువు తన చక్రంతో ఎదుర్కొన్నాడనీ, ఆ తర్వాతే ఇంద్రుడు నముచిని వజ్రాయుధం (పిడుగుపాటు)తో చంపాడనీ పద్మపురాణం చెబుతోంది.

3. మృత్యువు విషయంలో నముచికి ఒక వరం ఉన్నదనీ అందువల్ల నురుగుతో గాని చావడనీ ఆకాశవాణి ఇంద్రునికి ఉపాయం చెప్పిందని భాగవతంలో ఉంది.

4. కొన్ని పురాణాల ప్రకారం నముచి కశ్యపునికీ, దనువుకూ పుట్టినవాడు. దానవుడు. నముచి భార్య ప్రభ.

5. ఒక 'నముచి' హిరణ్య కశివుని మేనల్లుడు. హిరణ్య కశిపుని సభలో ప్రహ్లాదుడు మొ॥ వారితోపాటు కీలక స్థానంలో ఉన్నాడు. నార్ల వెంకటేశ్వరరావు రాసిన 'హిరణ్య కశిపుడు' రూపకంలో నముచి పాత్రను ధీరోద్ధాతునిగా చూపారు.

నముచిని చంపినందుకు ఇంద్రునికి పాపం తగిలింది. ఇంద్రసేనా నదీ తీరంలో యజ్ఞంచేసి, అరుణ/ సరస్వతీ నదుల సంగమంలో స్నానాలు చేసీ, ఆ పాపం నుంచి విముక్తి పొందాడట. ఈ సంగతి వేదాలలోనే ఉంది. అధికారం కోసం ఏదైనా చేయగల రాజ్య తత్వానికి ఇంద్రుడు ప్రతీక. రాజ్యపు కుతంత్రాలను ఎదిరించిన అసుర వీరులలో 'నముచి' ప్రసిద్ధుడు. అందువల్ల కూడా ఆ పేరు తర్వాతి తరాలలో చాలామంది పెట్టుకుని ఉండవచ్చు. శత్రువును క్షమించగలగటం అసుర లక్షణం. పగ మనస్సులో పెట్టుకుని ప్రతీకారం తీర్చుకోవటం దేవ లక్షణం. పురాణాలు గ్రంథస్థం చేసిన చాలా గాథలలో ఈ లక్షణాన్ని చూడవచ్చు. చాణక్య నీతిలోగాని, మనుస్మృతిలో గాని కఠోరమైన నిబంధనలూ శిక్షలేతప్ప కరుణ కనబడదు. వర్గ స్వభావంగల రాజ్యాల రాజనీతి కూడా ఇదే. శత్రుశేషం ఉండకూడదంటూ గర్భస్థ శిశువులను కూడా చంపటం భారత దేశంలో చొరబడిన వలసవాదుల నీతి.

ఇరవయ్యొకటో శతాబ్దంలోనూ అదివాసీ, మూలవాసీ ప్రజలపట్ల అగ్ర ఆధిపత్య కులాల రాజ్యం ఇదే ధోరణిలో ఉంది. ఎప్పటికీ ఆదివాసీలు/గిరిజనులు రాజ్యపు ప్రధాన స్రవంతికి దూరపువారే. రాజ్యానికి శత్రువులే, విమానాలతో సైన్యాన్ని దింపి బాంబులు వేయదగిన ప్రజలు వారు.

అసుర వీరులు ఇంద్రుడిని చాలాసార్లు క్షమించి వదిలిపెట్టారు. కిడ్నాప్ చేసిన అధికారులను మావోయిస్టులు చాలాసార్లు వదిలిపెట్టారు. ఇంద్రుడు మాత్రం వాగ్దాన భంగాలు చేశాడు. మాయో పాయాలతో వారిని చంపుతూనే వచ్చాడు. పురాణాలు చెబుతున్న వాస్తవాలు ఇవి.

బడుగు వర్గాలపట్ల రాజ్యం ఎప్పుడూ ఔదార్యం చూపలేదు. చర్చలకు పిలిచినట్లే పిలుస్తూ వారి రహస్యాలు మరింతగా తెలుసుకుంటూ వారిని మట్టుపెడుతూ వచ్చింది. రాయబారాలు, శాంతి చర్చలు రాజ్యకుతంత్రంలోని భాగాలే.

# బలి

బలి దానవ చక్రవర్తి. మహా బలిగా ప్రసిద్ధుడు. ఇతడు ప్రహ్లాదుని మనుమడు. హిరణ్యకశిపునికి మునిమనుమడు. బలిని గురించి స్కందపురాణం, భాగవతం, అగ్ని పురాణం, మహాభారతం చాలా గొప్పగా చెప్పాయి.

బలి తండ్రి విరోచనుడు. తల్లి సురుచి. విరోచనుడు గొప్ప దాత. మహానుభావుడు. అతని వైభవాన్ని దేవ/ఆర్య గణాలు సహించలేకపోయాయి. కపటంగానే అతనిని అడ్డు తొలగించుకున్నారు. ఆ హత్యోదంతం పరిశీలించదగ్గదే.

బలి తల్లి గర్భంలో ఉండగా ఇంద్రుడు బ్రాహ్మణ వేషంలో విరోచనుని దగ్గరకు వెళ్ళి స్తోత్రాలు చేశాడు. ఏమి కావాలని రాజు అడిగాడు. "కిరీటంతో సహా నీ తల కావాలి" అన్నాడు ఇంద్రుడు. విరోచనుడు "అలాగే" అంటూ తన కత్తితో తన తల నరుక్కుని ఇచ్చాడు. అందువల్ల ఇది హత్య అనిపించుకోలేదు. "తల"లపై వెలకట్టటం అప్పటి నుంచీ ఉంది. ఇది గమనించాల్సిన అంశం.

విరోచనుని బంధువులు – మంత్రులు పరివారం ఈ వ్యవహారాన్ని ఖండించినట్లు ఎక్కడా వినబడదు. బ్రాహ్మణులు అడిగితే ఏదైనా ఇవ్వాల్సిందే. దానిపై నిరసన కూడా వ్యక్తంచేయకూడదు. చర్చించకూడదు. ఆ బ్రాహ్మణుడు ఆ తల ఏమి చేసుకున్నాడో, వివరాలు లేవు.

విరోచనుని అలా హత్య చేశారు దేవతలు. అన్నీ హత్యా రాజకీయాలే. విరోచనుని భార్య సురుచి. బలిని ప్రసవించి ప్రాణత్యాగం చేసింది. బలి పెద్దవాడై అసుర రాజ్యం (తండ్రి రాజ్యం) అధిష్టించాడు. అప్పటి సమాజపు సంప్రదాయాలు – బ్రాహ్మణ భక్తి విరోచనుని వృత్తాంతం నుండి తెలుసుకోవచ్చు. తండ్రివలెనే బలి కూడా దానశీలి. బ్రాహ్మణవర్గం పట్ల గౌరవం చూపేవాడు. బ్రాహ్మణవర్గం పట్ల విధేయత, పురాణాలన్నీ ఏకగ్రీవంగా చెప్పే నీతి.

ఇంద్రుడు వృత్రాసురుని చంపిన సంగతి విని బలి కోపంతో రగిలిపోయాడు. శుక్రుని సలహాపై ఒక యజ్ఞం చేశాడు. యజ్ఞగుండంలోంచి అద్భుతమైన రథం వచ్చింది. దాని పేరు 'జయరథం'. నాలుగు తెల్లని గుర్రాలతో సింహధ్వజంతో ఉంది. అది ఎక్కి బలి సేనాసమేతంగా అమరావతిపై దండెత్తాడు. దేవ గణాల వారంతా కుటుంబాలతో సహా అమరావతి నుంచి పారిపోయారు. మారువేషాలతో దానవుల నుంచి తప్పించుకున్నారు. ఇంద్రుడు నెమలిగా, యముడు కాకిగా, కుబేరుడు తొండగా, అగ్ని పావురంగా రకరకాల రూపాలు ధరించి ప్రాణాలు దక్కించుకున్నారు. బలి అమరావతి పాలకుడయ్యాడు. బలి భార్య పేరు వింధ్యావళి. బలి రాజ్యపాలన కాలం 3750 దివ్య సంవత్సరాలట.

'బలి' పేరుతో చాలామంది రాజులున్నారా?. అనేదీ ఆలోచించవలసిన విషయమే. వృత్రాసురుని హత్యకు ప్రతీకారం తీర్చుకున్న బలి వామనునికి మూడడుగుల నేల దానం చేసిన బలి ఒకరై ఉండవచ్చును, కాకపోవచ్చును. కాని సంఘటనలు మాత్రం సామాజిక వ్యవస్థకు అద్దం పడుతున్నాయి గనుక వాటిని విశ్లేషించుకోవలసి ఉంటుంది. రామాయణం అరణ్యకాండలో మారీచుడు రావణునికి రాముని గురించి చెబుతూ రాముడు పరాక్రమ వంతులైన బలినీ, నముచినీ చంపగలిగే శక్తివంతుడని అన్నాడు "బలింవా సముచింవాపి హన్యాద్ధి రఘునందనః" (39–18). కాబట్టి ఒక బలి చక్రవర్తి పరాక్రమవంతుడు అని దీని ద్వారా తెలుస్తున్నది.

బలి గొప్పతనాన్ని దేవగణాలు కీర్తించాయి. స్కంద పురాణం ప్రకారం కథ ఇది –

దేవగణాల తల్లి 'అదితి' తన సంతానం సుఖంగా ఉండాలనీ తిరిగి రాజ్యాధికారం పొందాలనీ ఆశించింది. బలి నుంచి అమరావతిని విడిపించుకోవటం ఎలాగా అని ఆలోచించింది. నీవే ఆ పని చేయాలని విష్ణువును కోరింది. భర్తనూ సలహా అడిగింది. బలిని చంపి రమ్మని విష్ణువు తన గదకు చెప్పాడట. బ్రాహ్మణుడైన బలిని తాను చంపలేనని గద అన్నదట. చక్రం, ధనుస్సు కూడా అలానే అన్నాయట. "నీవెలాంటి వాడవో అతడూ అలాంటివాడే." (బ్రహ్మణ్యోసి యథా విష్ణో తథాసౌ దైత్య పుంగవః ధనుషా చ తథైవోక్తః (స్కంద. 1–18–34) అన్నాయి. బలిపట్ల అందరికీ పూజ్యభావం ఉంది.

బలిని నిరోధించటం తపశ్శక్తి చేతనే సాధ్యమవుతుందని అదితికి భర్త (కశ్యపుడు) చెప్పాడు. అందుకు శ్రావణ ద్వాదశీ వ్రతం చాలా నిష్ఠగా చేయాలన్నారు. ఫలితంగా పుట్టిన వామనుడు బలిని పాతాళానికి అణచివేసి అమరావతిని ఇంద్రునికి ఇప్పించాడు.

వామనుడు విష్ణువు అవతారమే అని పురాణాలు ప్రచారం చేశాయి. వామనుడు బలి యజ్ఞంచేస్తున్న చోటికి వెళ్ళి అతనిని పొగడి ఒకటి రెండు అడుగుల నేల చాలునని చెప్పి మూడడుగుల నేల వాగ్దానం చేయించుకున్నాడు.

–"బలినడిగి మహిం బరిగ్రహించి తనకు నన్నయయిన అమరేంద్రునకు త్రిదివంబు సదయుండై యిచ్చెను." అంటున్నది తెలుగు భాగవతం (8–679). వామనుడు బలినడిగి భూమి తీసుకుని అన్న అయిన ఇంద్రునికి ఇచ్చాడు. అలాంటి తమ్ముళ్ళున్నారా అని అంతా ఆశ్చర్యపోయారట.

బలి యజ్ఞంచేసిన చోటును రామాయణం పేర్కొన్నది. అనంతర కాలంలో అది 'ఇలా వృత వర్షం'గా పేరు పడిందనీ ప్రాచీన ఆర్యులు దీనిని తమ యజ్ఞ భూమిగా చేసుకున్నారనీ ప్రతీతి. ఈ కథలు చరిత్ర పూర్వయుగపు వృత్తాంతాలయి ఉంటాయేమో పరిశీలించాలి.

బలి చక్రవర్తి కథను తెలుగు భాగవతం రసవత్తరంగా చెప్పింది. బలి చక్రవర్తి యజ్ఞం చేస్తున్నప్పుడు వామనుడు వచ్చి ద్వారం దగ్గర వేదపఠనం చేశాడని, బలి ఆ

బాలుని చూచి ముచ్చటపడి పిలిపించి "ఏమి కావాలో కోరుకో ఇస్తాను" అని అన్నప్పుడు బలి గురువైన శుక్రాచార్యులు అడ్డుపడబోయాడని, గురువు మాట వినకుండా బలి వామనునికి మూడు అడుగుల నేలను దానమిచ్చాడని అగ్ని పురాణం కూడా చెప్పింది. దాన జలధారకు శుక్రాచార్యులు అడ్డుపడితే వామనుడు పుల్లతో పొడిచి నందువల్ల శుక్రుని ఒక కన్ను పోయిందంటారు. వామనుడు మూడు అడుగుల నేల తన గురువుకోసం (దేవేంద్రుడు) అడిగాడట. దాన జలం చేతిలో పడగానే పెద్ద శరీరంతో భూలోక, భువర్లోక, స్వర్లోకాలను మూడు అడుగులుగా గ్రహించి బలిని పాతాళానికి తొక్కేశాడు. ఆ మూడు లోకాలు దేవేంద్రునికి ఇచ్చాడని అగ్ని పురాణం చెబుతోంది.

బలి చక్రవర్తి కథ భూమి సమస్యతో ముడిపడి ఉన్నది. మూడు అడుగుల నేల చుట్టూ తిరిగింది.

బలి పాతాళానికి వెళుతూ, ఏడాదికి ఒకసారి భూలోకాన్ని సందర్శించే అవకాశం కలిగించవలసిందిగా కోరాడట. కేరళ దేశస్థుల నమ్మకం ప్రకారం బలి చిరంజీవి. ఓణం పండుగ రోజున ఆయన భూలోకానికి వస్తాడు. ఆ రోజు కేరళీయులు బలి చక్రవర్తికి ఘనంగా స్వాగత సన్నాహాలు చేసి ఆయనను పూజిస్తారు. బలి చక్రవర్తి వేషధారణతో ఒకరిని అలంకరించి ఆయనకు దీపాలతో స్వాగతం పలుకుతూ తీసుకురావడం ఓణం వేడుకలలో ప్రధానంగా ఉంటుంది. కులమతాలకు అతీతంగా బలి చక్రవర్తి స్మృతులతో ఆ పండుగను జరుపుకుంటారు.

బలి కథను స్కంద పురాణం కొన్ని మార్పులతో మరోలాగ చెప్పింది. విష్ణువు ఒక అడుగుతో విశ్వాన్ని ఆక్రమించి తిరిగి వామనుడై బలి ఇంట్లో ఆసనం మీద కూచుని మూడో అడుగు నేల కోసం అడిగాడు. "ఇతడు వాగ్దానం చేసి ఇవ్వలేదు" అని బలిని గురించి ప్రక్కనున్న గరుడునితో చెప్పాడు. గరుడుడు బలిని నిందించాడు. గురువు 'వద్దు' అని చెప్పినా వినకుండా దానం ఇచ్చావు – అని బలితో పోట్లాటకు దిగాడు. బలిని కట్టి పడేశాడు. ఇదంతా చూస్తూ ఉన్న బలి భార్య వింధ్యావళి వారిని సమీపించి "నీకు ఏమీ ఇవ్వలేదా?" అని వామనుని గద్దించి అడిగింది. తర్వాత "సరే ఇలా చేద్దాం" అని ఒక పద్ధతి చెప్పింది. ఒక అడుగు తన శిరస్సుపైనా రెండో అడుగు తన కుమారుని శిరస్సుపైనా, మూడో అడుగు తన భర్త శిరస్సుపైనా పెట్టి వాగ్దానం తీర్చుకోవచ్చునన్నది. (స్కంద 1-19-144).

వామనుడు తన చర్యకు తానే సిగ్గుపడ్డాడు. దేవగణాల కోసం ఇదంతా చేసినందుకు పశ్చాత్తాపపడినట్టే కనిపించాడు. బలిని విడిపించి కౌగలించుకొన్నాడట. "వైకుంఠంలో ఉండే వారితో ఇక చాలు. నీ వెంట సుతలానికి వస్తాను" అని బలితో ఉండటానికి నిర్ణయించుకున్నాడు. సుతలంలో బలిద్వారం దగ్గర ఉండి ఎవరేది కోరితే అది వారికి ఇస్తాడని స్కందపురాణం చెబుతోంది.

భూ వివాదాలలో తలదూర్చి అమాయకులను బాధించి దౌర్జన్యపరులకు సహాయం చేసిన వారి పశ్చాత్తాపం పై కథలో గమనించవచ్చు.

దేవగణాలు భోగలాలసులు. అధికార కాంక్ష తప్ప సమధర్మం అనే భావన వారి ఆలోచనలలో లేనట్టే పురాణాలు ధ్వనిస్తున్నాయి. విశ్వరూపుడు, వృత్రాసురుడు, పాలించి నట్లుగా ప్రజలందర్నీ సమంగా చూసిన దాఖలాలు లేవు. ముఖ్యంగా సంపద వినియోగంలో అంటే జాతీయ సంపద ప్రజలందరికి అందుబాటులోకి తేవటంలో వారు అనుసరించిన మార్గాలు వివక్షతో కూడినవి. కుల వివక్షను పెంచిపోషించిన వ్యవస్థ అది. గోబ్రాహ్మణ ప్రాధాన్యక్రమం, వర్ణ ధర్మం, యజ్ఞభాగాల పంపకం వంటివి దీనికి ఉదాహరణ. దానిని వ్యతిరేకించిన అసురులు తరుచుగా దేవగణాలను పదవీచ్యుతులుగా చేస్తుండేవారు. ఇంద్రుని ఓడించి ముల్లోకాలకు ప్రభువైన కాలంలో బలి అనుసరించిన రాజనీతి, పాలనా విధానాలు దేవగణాలకు కూడా ఆదర్శమైనాయనీ బలి ప్రవేశపెట్టిన పాలనా విధానాన్ని ఆ తర్వాత దేవగణాలు అనుసరించాయనీ మత్స్య పురాణం చెబుతోంది.

ఈ సందర్భంలో జోతిరావ్ చెప్పిన విషయాలూ గుర్తుతెచ్చుకోవటం అవసరం. బలి రాజ్యం తొమ్మిది విభాగాలుగా (ఖండాలు) ఉండేది. 'జోతిబా' అనేవాడు ముఖ్య నాయకుడు. విభాగాధిపతులలో 'ఖండోబా' మల్లారి, మార్తాండ్, మహా సుబాన్యాసీ, భైరోబా, భరాది అనేపేర్లు వినిపిస్తున్నాయి. విభాగాధిపతులలో ఖండోబాకు కొంత సైన్యం – మల్లయోధులు ఉండేవారు. రాజ్యం మొత్తంమీద ఆర్థిక, న్యాయ వ్యవహారాలు చూసే ఉన్నతాధికారులు 'మహాసుభా'లుండేవారు. బలి రాజ్యం కొల్హాపూర్, రత్నగిరి – కొంకణం – శ్రీలంక – అక్కడి దీవులు – అన్నింటినీ కలుపుకొని ఉండేది. కాశీ, అయోధ్య కూడా బలి పాలనకిందే ఉండేవి. ఏడు క్షత్రియ రాజ్యాలు బలికి కప్పం చెల్లించేవి.

ఖండోబా, భైరోబా, జోతిబా అనేవి దండనాయక పదవులు. "హర హర మహాదేవ్" వంటి నినాదాలు అప్పటివే. మరాఠాలకూ, మహర్లకూ, మాంగ్‌లకూ, కున్బీలకూ (రైతులు), మాలీలకూ హరుడే (శివుడే) నాయకుడు అంటాడు జోతిరావ్.

ఆర్య నాయకుడైన వామనుడు బలి మీదికి దండెత్తివచ్చినప్పుడు బలి అతనితో యుద్ధం చేశాడు. బలి రాణి నిరాహారంగా ఎనిమిది రోజులు రాత్రింబవళ్ళు బలి విజయం కోసం శివుని ప్రార్థించిందట. ఎనిమిదవ రోజున బలి పరాజయమూ మరణవార్తా ఆమెకు చేరాయి. ఆమె అగ్నిలో దూకి ప్రాణత్యాగం చేసింది. అది ఆశ్వయుజ మాసం బహుళ పక్షపు ఎనిమిదోరోజు. బలి (కుమారుడు?) సేనానాయకుడైన బాణాసురుడు, అతని సైన్యమూ వామనుని ఎదిరించి పోరాడినా ఫలితం లేక పోయింది. తొమ్మిదో రోజున బాణాసురుని సైన్యం వెనక్కు తగ్గింది. పదో రోజున వామనుని సైన్యం బలినగరంపైపడి దోచుకున్నది. నగరంలోని సంపద – బంగారమూ వారు పంచు కున్నారు. దసరా రోజున జమ్మి ఆకులను 'బంగారం' అంటూ బంధుమిత్రులకు పంచుకునే ఆచారం అప్పటి స్మృతిగానే వచ్చి ఉండాలి.

బలి నగరంలోని సంపదను దోచుకుని వామనుడు తన నివాసానికి వెళ్ళినప్పుడు వామనుని భార్య పిండితో బలి ప్రతిమను చేసి "ఇదుగో బలి మళ్ళీ నీతో యుద్ధానికి వచ్చాడు" అని చూపించింది. వామనుడు ఆ ప్రతిమను కసితో తోసేసి ఇంటిలోకి వెళ్ళాడు. ఇప్పటికీ విజయదశమి రోజున కొన్ని విప్ర కుటుంబాలు ఈ సన్నివేశాన్ని అనుకరిస్తుంటాయి. ఆ రోజున ఇంటి యజమాని శమీవృక్షం దగ్గరికి వెళ్ళి ఒక కొమ్మతో ఇంటికి వస్తాడు. గుమ్మం బయటే పిండితో బలి ప్రతిమచేసి ఉంచుతారు. యజమాని చేతిలోని కొమ్మతో ఆ ప్రతిమ పొట్టలో పొడిచి అప్పుడు ఇంట్లోకి ప్రవేశిస్తాడు.

విజయదశమి సందర్భంగా ఇంటి యజమాని శుచిగా జమ్మిచెట్టు దగ్గరకు వెళ్ళి ఆకులు కొమ్మలు తేవటం - ఇంటివారు బలి ప్రతిమనుచేసి అతనికోసం ఎదురు చూస్తూండటం, ఆ ఆకులతో ప్రతిమను పూజించటం, 'బలి రాజ్యం రావాలి' అంటూ హారతులు ఇవ్వటం శూద్రుల ఇళ్ళలో జరిగే వేడుక.

"బలి రాజ్యం రావాలి" అనే ఆకాంక్షను పూలే స్ఫూర్తిగా తీసుకున్నాడు. "జీసస్ క్రైస్తు తిరిగివస్తాడు. పరలోక రాజ్యం రానున్నది" అనే క్రైస్తవమతంలోని విశ్వాసానికి బలి కథను అన్వయించాడు. జీసస్ క్రీస్తు తిరిగి వస్తాడన్న విశ్వాసం క్రైస్తవులకు ఉన్నట్లే బలిరాజ్యం రావాలన్న ఆకాంక్ష ఈ దేశపు అసుర క్షత్రియులకు (శూద్ర అతి శూద్ర కులాలకు) ఉన్నది అంటారు జోతిబా.

బలి అనుయాయులు మొదట వామనునికి ఓడినా తర్వాత అతనిని హిమాలయాల వరకు తిప్పికొట్టారు. బాణాసురుడు అతని సైన్యమూ నగరానికి విజయులై తిరిగి వచ్చినప్పుడు క్షత్రియ స్త్రీలు వారికి "ద్విజ వామనుని పాలన పోవాలి - బలి రాజ్యం రావాలి" అంటూ హారతులతో స్వాగతమిచ్చారు. అప్పటి నుండి విజయదశమి సందర్భంగా రాత్రి క్షత్రియ స్త్రీలు తమ భర్తలనూ పుత్రులనూ మంగళహారతితో ఆశీర్వదించుకోవటం సంప్రదాయమయింది. "బలిరాజ్యం రావాలి" అనే ఆశంసన మొదలయింది.

'బలి రాజ్యం రావాలి' అనే కోరిక భారతదేశంలో చాలాచోట్ల వ్యక్తమవుతూ ఉంటుంది. మహారాష్ట్రలో బలిరాజ ఉత్సవాలు మతసామరస్యానికి, సంఘీభావానికి సంకేతంగా జరుగుతాయి. "ఈడా పీడా జావో బలికా రాజ్య్ ఆవో" (బాధలు, దుఃఖాలు పోయి బలిరాజ్యం వస్తుంది) అని సంతోషంతో బలికోసం మహారాష్ట్ర ప్రజలు ఎదురు చూస్తుంటారు.

బలి మొదట పాలించిన ప్రాంతం ఇప్పటి మహారాష్ట్ర ప్రాంతం. రాజ్యం వామనుని పరమైనాక బలి పాతాళానికి వెళ్ళాడు. అది కేరళ దేశం - అక్కడ బలి పాలన సాగించాడు. అదే పాతాళంగా సుతలంగా చెప్పారు. లోకాలను గురించి చెప్పేటప్పుడు చతుర్దశ లోకాలు అంటూ14 లోకాల పేర్లు చెబుతారు. ఒక్కోసారి ముయ్యేడు జగాలు అంటూ 21 లోకాల పేర్లు చెబుతారు. ఈ లోకాలనే స్వర్గ, మర్త్య, పాతాళ లోకాలుగా మూడు ప్రసిద్ధం చేశారు.

స్వర్గం అంటే పైన ఉంటుందని మర్త్యలోకం అంటే భూలోకం అనీ పాతాళం, సముద్రం లోపల అనీ సామాన్యులు అర్థం చేసుకునేవారు.

ఇండియా పటాన్ని ఆధారంగా చేసుకుని చూస్తే పైన ఉత్తరంగా హిమాలయాల కింద ఉండే రాజ్యాలు దేవ/ఆర్య రాజ్యాలు. ఇంకొంచెం కిందకు దిగితే వింధ్యకు అటూ ఇటూ - దండక ప్రాంతం మనుష్యలోకం. ఇంకా కింద దక్షిణంగా ఉన్నవి అధోలోకాలు. అదే పాతాళం కింద లెక్క. అతల, సుతల, రసాతలాలన్నీ గారడీలే.

భాగవతం ప్రకారం వామనుడికి మూడు అడుగుల నేల దానం చేసే సందర్భంలో బలి చక్రవర్తికి అతని కులగురువు శుక్రుడు అడ్డుపడ్డాడు. 'ఎదుట నిలుచున్న వాడు మాయా వటువు - విష్ణువే ఆ రూపంలో వచ్చాడు - దానం ఇవ్వకు' అని చెప్పాడు - అయినా బలి వినలేదు. "అంత గొప్పవాడైన విష్ణువు చేయికింద ఉంటే దానంచేసే నా చెయ్యి పైన ఉంటుంది. అంతకంటే నాకు సౌభాగ్యమేముంది" అన్నాడట. అలా అనుకున్నాడో లేదో గాని పురాణాలు అలా ప్రచారం సాగించాయి. మహాకవి పోతన తెలుగు భాగవతంలో బలిని వర్ణిస్తూ "ఇతడే దానవ చక్రవర్తి, సురలోకేంద్రాగ్ని కాలాది దిక్పతి గర్వాపనయ ప్రవర్తి" - అని వామనుడు అన్నాడని రాశాడు. ఆర్యులను నిలువరించిన అసుర చక్రవర్తిగా బలిని ఆర్య బ్రాహ్మణులు ప్రస్తుతించారు.

"స్వస్తి జగత్రయీ భువన శాసనకర్తకు, దానవలోక భర్తకున్" అంటూ వామనుడు ఆశీర్వదించాడు. బలి ఆ వటువును చూసి ముచ్చటపడ్డాడు. "ఏంకావాలో కోరుకో" అంటూ తానే ఒక పెద్ద జాబితా ఇచ్చాడు. వామనుడు గడుసుగా ముందు బలి వంశాన్ని పొగిడాడు. హిరణ్యాక్ష, హిరణ్యకశిపులనూ, విరోచనునీ మెచ్చుకున్నాడు. బ్రాహ్మణ వేషంతో వచ్చి అడిగితే మీ తండ్రి ప్రాణాలే ఇచ్చాడన్నాడు. "నీ గుణం చాలా గొప్పది - నేను ఒంటి వాడను. ఒకటి రెండడుగుల మేర ఇవ్వు చాలు నాకు" అన్నాడు. "దాత గురించి కూడా ఆలోచించాలి - మరీ తక్కువగా అడుగుతున్నావు - పసిబాలుడవు - అడగటం కూడా నీకు చేతకావటం లేదు" అన్నాడు బలి. "ఆశకు అంతంలేదు - నేనడిగిన మూడడుగులు ఇస్తే అదే నాకు బ్రహ్మాండం" అన్నాడు వామనుడు.

గురువైన శుక్రుడు "అంతా మోసం ఇవ్వవద్దు" అంటున్నా, "వారిజాక్షులందు వైవాహికములందు అడినమాట తప్పవచ్చునని" చెబుతున్నా (భాగ. 8-584) వినకుండా బలి దానం ఇచ్చేశాడు. వామనుడు ఇంతింతై ఎదిగి బ్రహ్మాండం ఆక్రమించాడు. బలి భూమిమీద సర్వహక్కులూ కోల్పోయి పాతాళానికి వెళ్ళిపోవలసి వచ్చింది.

కింది వర్గాలు భూములు పోగొట్టుకున్నట్టే ఉంది ఈ కథ. అగ్ర/ఆధిపత్య వర్గాలకున్న దళారీ సంస్థలూ - ప్రత్యక్షంగా పరోక్షంగా రైతులు తమ భూములు వారికి ధారాదత్తం చేయటమూ వంటి వ్యవహారాలలో బెదిరింపులకు భయపడి కొన్ని జరిగినా కొన్ని విధేయతా భావంతోనూ జరిగాయి. అడ్డుకున్నవారు శుక్రునిలాగే నష్టపోయారు.

ఆధునిక కాలంలో ప్రభుత్వం కార్పొరేట్ సంస్థలకు భూములు ధారాదత్తం చేయటాన్ని అడ్డుకున్న వారికీ ఇలాగే గాయాలు మిగిలాయి. సుపరిపాలనలో ఇలాంటి వైరుధ్యాలు తప్పవు అనే నీతి అప్పటిదే.

'బలి' అంటే 'బలి ఇవ్వటం' అనే అర్థం ఉంది. మొదట్లో 'సుంకం' ఇవ్వటం అనే అర్థం (ఋగ్వే. 1-70, 1-5-10, 8-100.9) ఉండేది. దేవతకు చెల్లించే సుంకం (ఋ. 7-6,5) అనీ ఒక రాజుకు చెల్లించే సుంకం అనీ (ఋ. 10-173,6) అర్థాలు చెప్పారు. సుంకం విధానాన్ని వ్యతిరేకించే ప్రజల తిరుగుబాటును బలి కథకు కొందరు అన్వయిస్తుంటారు. యజ్ఞాలలో దేవతకు చెల్లించే సుంకాన్ని దైత్యులూ, స్థానికులూ అడ్డుకుని ఉంటారు. (అలా వసూలు చేసిన సుంకం గోబ్రాహ్మణులకు, దేవతలకు వెళ్ళేది) అవే హవిస్సులు. సమధర్మం పాటించే పాలకునిగా బలి ఆ విధానాన్ని మార్చి ఉంటాడు.

ఆదిమ సమాజంలో గ్రామాలలో ప్రత్యేక సందర్భాలలోను, పండుగలలోనూ, జాతరలలోను - అందరూ తలా కొంత వేసుకుని సమష్టిగా కార్యక్రమం జరుపుకోవటం - ఫలాలను ఫలసాయాన్ని సమష్టిగా పంచుకోవటం అనే పద్ధతి ఉండేది. అసురులు సామూహిక జీవన ప్రియులు అని రామాయణం చెబుతున్నది. అందరూ సమాన భాగస్వాములుగా ఉండే పద్ధతిని దేవగణాలు పాటించలేదు. బ్రాహ్మణులకు ప్రాధాన్యం ఇచ్చాయి. రాజులు ప్రత్యేక సందర్భాలలో అధికారులకు బహుమతులు ఇవ్వటం, ప్రజలు రాజుకు కానుకలు సమర్పించుకోవటం సాధారణ విషయం. అలాంటి వాటిలో తరతమ భేదాలు తీవ్రంగానే ఉంటాయి.

నాగరికతా వికాస క్రమంలోని వివిధ దశలలో మానవ సముదాయాలలో సంఘర్షణలూ, సర్దుబాట్లూ అనివార్యం. ఆయా సముదాయాల సంప్రదాయాలూ సంస్కృతీ, ఆర్థిక పరిస్థితులపైనా జ్ఞానాన్వేషణ అవకాశాలపైనా ఆధారపడి వుంటాయి. మతం పేరిట ఆయా సముదాయాల జీవన విధానాన్ని క్రమబద్ధం చేసే వ్యవస్థలను ఇప్పటికీ చూడవచ్చు.

క్రీస్తు పూర్వపు సుమేరియన్ నాగరికతలో నగర రాజ్యాలుండేవి. పాలనా యంత్రాంగం ఎంత పటిష్ఠంగా నడచినా నగరాలలోని సామాజిక, ఆర్థిక వ్యవస్థలు ఆలయాల ఆధీనంలోనే ఉండేవి. మతాధిపతులకిందా ఆధిపత్య వర్గాలకిందా కిందివర్గాలు నలిగిపోయాయి.

భారతదేశంలోనూ అలాంటి పరిస్థితే ఉన్నది. ఇక్కడ వర్గ విభజనతో పాటు వర్ణ విభజన కూడా ఉండటం వల్ల ఇది మరింత జటిలంగా, క్రూరంగా రూపొందింది. ఎంత సంపద ఉండినప్పటికీ వృత్తి కులాల వారు వర్ణాధిక్యత ముందు తలవంచవలసి వచ్చేది.

ఆర్యులు తమ వర్ణమే గొప్పదనీ తమ మతాన్ని సంప్రదాయాలను అందరూ అనుసరించాలని చెప్పే నిరంకుశ నిర్బంధ వ్యవస్థను ప్రవేశపెట్టారు. దైత్యులు, దానవులు,

నాగులు దానిని వ్యతిరేకించారు. ఆ క్రమంలో వారి ఘర్షణలు వ్యక్తిగత కక్షలుగా పెరిగి హత్యల వరకూ వెళ్ళాయి. హిరణ్యాక్ష, హిరణ్య కశిపుల హత్యలు అందుకు తార్కాణం.

బలి దానగుణం గురించి, ధర్మవర్తన గురించి ఎన్నెన్నో విషయాలు పురాణాలలోనే ఉన్నాయి. అసురులు విశాల మనస్కులు, నిష్ఠా గరిష్ఠులు, ధ్యానతత్పరులు. దేవగణాలు వీరిని ఎదుర్కోలేక మాయోపాయంతో కుట్రలతో అణచివేయటం తమను గొప్పగా ప్రచారం చేసుకోవటం జరిగింది. పురాణాల కథలన్నీ పరిశీలించిన జోతిరావ్ పూలే ఈ వక్రీకరణలను బహిర్గతం చేశాడు, ప్రశ్నించాడు. శూద్రకులాలు వైదిక పురాణాలను భక్తితో నమ్మి గౌరవించటమూ, వాటిని తర్కించక పోవటమూ జోతిరావ్‌ని అసహనానికి గురిచేసింది. అందుకే ఆయన అసుర రాజుల గురించి ప్రత్యేకంగా అధ్యయనం చేశాడు. ఈనాటి శూద్రులు ఒకప్పటి క్షత్రియులే అనీ శూద్ర అతి శూద్ర కులాలకు అసురుల వారసత్వం ఉన్నదనీ జ్యోతిరావ్ పూలే, అంబేద్కర్లు వివరించారు.

బలి గురించి స్కందపురాణం ఎన్నో గాథలు చెబుతున్నది. ఇంద్రుడు అన్ని సంవత్సరాలు స్వర్గం పాలించినా ఏ ఒక్కడికీ దాన ధర్మాలు చేసినట్లు వినలేదు. బలి దాన ధర్మాలలో పేరు పొందాడు. బలి స్వర్గం ఆక్రమించినప్పుడు చాలా దానాలు చేశాడు. ఆ సంగతి ఒప్పుకోలేక దానికి పూర్వజన్మ కథ ఒకటి జతచేశారు.

బలి పూర్వజన్మలో చాలా పాపాలు చేశాడట. బ్రాహ్మణ నింద, పరకాంత, పరధనాల పట్ల వ్యామోహం వంటి వ్యసనాలన్నీ అతనికి ఉండేవి. ఒక రాత్రి ఒక యింట్లో కన్నం వేసి (దొంగతనం చేసి) వస్తూ సుగంధ ద్రవ్యాలు, పూవులు, తాంబూలం పట్టుకుని వేశ్య యింటికి బయలుదేరాడట. దార్లో రాయి తగిలి బోర్లాపడిపోయాడు – తెలివి తప్పిపోయాడు. కాస్సేపటికి స్పృహ వచ్చింది. దేవుడి దయ, అనుకుంటూ దగ్గరే ఉన్న ఒక లింగం ఆకారపు రాయికి మొక్కి పూలు పళ్ళు సమర్పించాడు. భక్తితో ఆ పనిచేసినందువల్ల చనిపోయాక ఆ ఒక్క మంచిపనికీ మూడు గడియల పాటు ఇంద్ర సింహాసనాధిపత్యం ఇచ్చారట. ఆ మూడు గడియలలోను అతడు ఇంద్రలోకంలోని ఐరావతం (ఏనుగు) ఉచ్చైశ్రవం (గుర్రం), కామధేనువు, కల్పవృక్షం, చింతామణి మొ॥నవి, దివ్యాభరణాలూ అగస్త్యుడు మొ॥ మహామునులకు దానం చేశాడట. ఇంద్రుడు తిరిగి వచ్చేసరికి అతని సంపద మిగలలేదు. ఇంద్రుడు కోపగించుకున్నాడు. తగాదా యమధర్మరాజు వరకూ వెళ్ళింది. ఆ మూడు గడియలూ అతని ఆధిపత్యమే కాబట్టి అతనికి దానం చేసే హక్కు ఉందన్నారు. పైగా దానం తనవాళ్ళకే, మునులకే చేశాడు కాబట్టి సర్ది చెప్పారు. ఇంద్రుడు అవన్నీ మళ్ళీ మునులను అడిగి తీసేసుకున్నాడట. ఆ వ్యసనపరుడే తర్వాతి జన్మలో విరోచనునికీ, సురుచికీ కొడుకుగా పుట్టాడు. అతడే బలి. అని పూర్వగాథ చెప్పారు.

బలి శివభక్తుడు. ఆయన ప్రతిష్ఠించిన శివాలయాలు భారతదేశంలో చాలా ఉన్నా యంటారు. ఆంధ్రదేశంలో కృష్ణా జిల్లా జగ్గయ్యపేట మండలం ముక్తేశ్వర పురంలో బలి

చక్రవర్తి ప్రతిష్ఠించిన శివలింగంతో ఆలయం ఉన్నదనీ దానిని అభివృద్ధిచేసి కోటిలింగ హరిహర మహాక్షేత్రంగా పిలుస్తున్నారనీ చెబుతున్నారు. బౌద్ధ ఆరామాలు / అసురుల విహారాలు అంచెలంచెలుగా శైవక్షేత్రాలూ, వేంకటేశ్వరుని మందిరాలవటం చూస్తున్నదే.

బలి చక్రవర్తి మహాత్ముడు. బ్రహ్మ అతని వల్ల సంతుష్టుడై అతనికి చాలా వరాలు ఇచ్చాడు. 1. మహాయోగిత్వం, 2. కల్ప పరిమాణపు ఆయువు, 3. యుద్ధంలో ఓటమి లేక పోవటం, 4. ధర్మంలో స్థిరమైన బుద్ధి, 5. మూడు లోకాలలోని అన్ని విషయాలూ తెలిసి ఉండటం, 6. తన జాతివారిలో ప్రాధాన్యం, 7. యుద్ధంలో సాటిలేని గెలుపు, 8. ధర్మ తత్త్వార్థ దర్శనం, 9. ఆయా వర్ణాల వారిని వారి వారి పనులలో నిలపటం అనే యోగ్యతలు తన ప్రవర్తన ఫలితంగా బలి సాధించాడని మత్స్య పురాణం (48–27–30) చెబుతోంది. బలి పేరు వృత్రాసురుని కాలం నుంచీ వినవస్తూనే ఉంది.

మత్స్య మహా పురాణంలోనే మరోచోట కింది విధంగా చెప్పారు. యయాతి కొడుకులలో తుర్వసుని వంశంలో చాలా తరాలు గడిచిపోయాక సుతవుడు అనే రాజు 'బలి'ని పెంచుకున్నాడట. ఈ బలి మహాయోగి, దైత్యుడు. పూర్వం విష్ణువుచేత బంధించ బడిన బలి ఇతడే (ఇది తర్వాతి జన్మ కాబోలు) అని చెప్తున్నది మత్స్య మహాపురాణం. ఈ కథలో బలి భార్య సుధేష్ణ.

ఈ బలి మానవుడు 'జాతో మనుష్య యోన్యాంతు క్షీణే వంశే ప్రజేచ్ఛయా....' (మత్స్య – 48–23) మానవ జాతిలో తన వంశం నశిస్తూ ఉన్న సమయంలో వంశాన్ని నిలబెట్టటం కోసం మానవస్త్రీ అయిన తన భార్యవల్ల ఐదుమంది క్షత్రియ కుమారులను క్షేత్రజులుగా పొందాడు. వారు – అంగుడు, వంగుడు, సుహ్ముడు, పుండ్రుడు, కళింగుడు. అంగ, వంగ, సుహ్మ, పౌండ్రక, కళింగ జనపదాలు బలి కుమారుల పేరు మీదుగా ఏర్పడిన జనపదాలు. వీరు గాక బలి సంతతిలోని వారు కొందరు బ్రాహ్మణులు అయి విప్రవంశాలు వృద్ధి చేశారట.

బలిని గురించే మరో కథ ఇలా ఉంది. వంశాన్ని వృద్ధిచేయడం కోసం బలి మానవస్త్రీ అయిన తన భార్య సుధేష్ణను దీర్ఘతముడు అనే మునికి అప్పగించాడు. గుడ్డివాడూ, వృద్ధుడూ అయిన దీర్ఘతముని దగ్గరకు పోలేక ఆమె తన దాది కూతురైన శూద్ర స్త్రీని పంపిందట. (ఇది మహాభారతంలో వ్యాసుడు – అంబిక/అంబాలికల వృత్తాంతం లాగానే నడిచింది). ఆమె వల్ల కలిగిన కొడుకులు కక్షీవాన్ మొ॥వారు జాతి చేత శూద్రులయినా అధ్యయనపరులై – మునుల స్థాయిని పొందారు. బ్రాహ్మణులయ్యారు.

బలి తన భార్యను ఒప్పించి మళ్ళీ ముని దగ్గరకు పంపాడు. ఆ ముని తన ఒంటికి పెరుగు, ఉప్పు, ఇప్పతేనె పూసి దానిని నాకవలసిందిగా ఆమెకు చెప్పాడు. ఆమె తప్పనిసరిగా ఆ పనిచేయవలసి వచ్చింది. అపాన ప్రదేశంలో నాకకుండా వదలిపెట్టింది. అందువల్ల అపానం లేని కొడుకు మొదట పుడతాడనీ తర్వాత మామూలుగా నలుగురు

పుడతారనీ ముని చెప్పాడట. వాళ్ళ అంగ, వంగ, కళింగ, పుండ్ర, సుహ్మలు, బలి కొడుకు అంగరాజు అనీ అంగరాజు కొడుకులు వంగ, కళింగ, పుళింద, మొ॥వారనీ మహాభారతం చెబుతున్నది. అంగరాజుకు బాలయోగి అనే పేరున్నదట. ఇవన్నీ మానవ జాతిలోని వర్ణధర్మాలను అగమ్యగోచరం చేయటానికి అల్లిన కథలు. బలి ఇంకా జీవించి ఉన్నాడని ఎవరికీ కనబడకుండా అన్నీ గమనిస్తూ ఉంటాడనీ నమ్మేవారున్నారు. మానవ జాతులు (వర్ణ భేదాలు) వృద్ధిచేయటంలో బలి పాత్ర ఉన్నది.

పై కథలోని దీర్ఘతముడు శాపగ్రస్తుడు. ఆయన కథ జుగుప్సాకరమైనదే. వివరాల లోకి పోకుండా చెప్పాలంటే కామధేనువు అనుగ్రహంతో ఆయన తన దోషాలు తొలగించు కొన్నాడు. బృహస్పతి శాపంచేత సంక్రమించిన తమస్సు (వ్యాధి/అజ్ఞానం) గోవు చేత తీసి వేయబడింది గనుక అప్పట్నించీ ఆయన గో-తముడు అయ్యాడు. అతనికి శూద్ర దాసి వల్ల కలిగిన కుమారులు బ్రాహ్మణత్వం పొందారు. వారి సంతానం గౌతములు అయ్యారు. అప్పటి వరకూ గోమాంసం తిన్న పురోహితవర్గం గోవును పూజించదగిన పశువుగా చెప్పటానికి ఈ కథ అల్లారేమో. వామనావతారం గురించి భారతంలో ప్రస్తావించిన కథ కూడా ఈ సందర్భంలో చెప్పుకోవచ్చు. వామనుడు అదితి గర్భంలో ఉండగా అసురులకు దుశ్శకునాలు కనబడ్డాయి. బలి తన తాతగారైన ప్రహ్లాదునితో ఆ విషయం ప్రస్తావించాడు, ఆయన దివ్య దృష్టితో అదితి కడుపులో ఉన్న నారాయణుని చూశాడు. (ఇక్కడంతా నారాయణుని స్తుతి ఉంది). హరి కీర్తనం మొదలుపెట్టాడు. "మన అసురుల ముందు అతడెంత" అని బలి ప్రహ్లాదునితో అన్నాడు. "హరిని తిరస్కరించిన నీవు రాజ్యం కోల్పోతావు" అని ప్రహ్లాదుడు బలిని కోప్పడ్డాడు. తాతగారి కోపం గమనించి బలి ఆయనను శాంతపరచాడు.

యజ్ఞంచేస్తున్న బలికీ అతని గురువైన శుక్రునికీ కొన్ని అశుభ సూచనలు కనిపించాయి. శుక్రునికీ పరిస్థితి అర్థమైంది. 'వామనావతారంలో విష్ణువు రాబోతున్నాడు - అతడు ఏమి అడిగినా ఎంత చిన్నదైనా సరే - "నేను దానం చేసేంతశక్తి గలవాడను కాను" అని చెప్పి తప్పించుకో, అని శుక్రుడు బలితో చెప్పాడు. (ఈ సంభాషణలోనూ హరి స్తుతి నిండి ఉంది. ఇదంతా ప్రజలను వైష్ణవం వైపు మళ్ళించటానికే).

వామనుడు రావటమూ అగ్నిశాల కోసం మూడు అడుగులు కోరటమూ, దానం తీసుకొని పెరగటమూ జరిగిపోయింది. ఆయన భూమి అంతా నిండి చేతులతో, కాళ్ళతో అసురులను నలగగొట్టాడట. మూడు లోకాల ఆధిపత్యాన్నీ 71 చతుర్యుగాల వరకూ ఇంద్రునికిచ్చాడు. వైవస్వత మన్వంతరం తర్వాత సావర్ణిక మన్వంతరంలో బలి ఇంద్రు డవుతాడన్నాడు. అంతవరకూ 'సుతలము' అనే పాతాళ లోకంలో ఉండవచ్చునని చెప్పాడు. "దేవ బ్రాహ్మణులతో విరోధం లేనంత వరకు నీవు వైభవంగా ఉంటావు. వాళ్ళతో విరోధం పెట్టుకున్నావా ఇక అంతే" అన్నాడు. శూద్ర కులాలకు హెచ్చరికగా ఈ కథ చెప్పారా?

ఆ విష్ణువే ఈ కృష్ణుడు అని అర్జునుడికి శౌనకుడు అర్జునుని తీర్థయాత్రల సందర్భంలో చెప్పాడట. (మత్స్య 243-245).

ప్రజారంజకంగా పాలిస్తున్న ఒక చక్రవర్తిని కుతంత్రంతో రాజ్య భ్రష్టుని చేయటం ఈ కథలలో కనబడే సామాన్యాంశం. యజ్ఞాలలో భాగం తమకే కావాలనటం, రాజ్య సంపదతో తామే లాభపడాలనుకోవటం. దేవగణాల ప్రవృత్తిగా ఈ ఉదంతం తెలియ పరుస్తున్నది. పురోహిత గణానికి విధేయంగా ఉండాలనే హితబోధ కూడా వీటికి జోడించారు. ఇవన్నీ ఒక వర్గాన్ని అణచిపెట్టి ఉంచటానికి మానసికంగా వారిని లోబరచుకునే కథలే. బ్రాహ్మణ మత క్రౌర్యానికి ఇవి ఉదాహరణలు.

వైదిక క్రతు కర్మలను నిరసించిన జైనం బ్రాహ్మణ మతాన్ని పూర్తిగా అంగీకరించక పోయినా వర్ణ ధర్మాన్ని పాటించి వారికి దగ్గరైంది. అనంతర కాలపు జైనులలో సంఘ, గణ, బలి, అన్వయ అనే విభాగాలుండేవి. ఆ విధంగానూ "బలి" పదం వాడుకలో ఉండింది.

బలి పేరు చాలా ప్రసిద్ధంగా ఉండటం వల్ల చాలామంది ఆ పేరు పెట్టుకొన్నట్లు కనిపిస్తుంది. (1) బలి పేరుతో ఒక రుషి హస్తినాపురంలో ఉండేవాడని భారతంలో ఉంది. (2) శివుని అవతారంగా బలి పుట్టాడని, సుధామ, కశ్యప, వసిష్ఠ, విరాజసులు ఇతని కొడుకులని మరోచోట ఉంది. (3) ఒక యాదవ రాజైన కృతవర్మ కొడుకు పేరు కూడా బలి. అతని భార్య చారుమతి. ఆమె రుక్మిణి కూతురు అని భాగవతం చెప్పింది. (4) సగరుని సమకాలికుడయిన ఒక వానర రాజుకు బలి అనే పేరు ఉంది (భారతం).

సూర్యసావర్ణి కాలంలో విష్ణుమూర్తి బలిని ఇంద్రపీఠం మీద ఉంచుతాడని భాగవతం చెబుతున్నది. బలి చక్రవర్తిని మహాబలి అంటారు. "మహాబలి" అనేది చక్రవర్తులకు వాడే విశేషణం. బలి చక్రవర్తి భార్య అశన. ఆమె వల్ల ఇతనికి బాణుడు అనే కొడుకు, రత్నమాల అనే కూతురు కలిగారు. బాణుడికి నివాత కవచులు అనే 4 కోట్ల మంది రాక్షసులు పుట్టారు. వారు దేవేంద్రుని ధనాన్ని అపహరిస్తే అది సముద్రంలో పడిందని మరో కథ ఉంది.

ఈ అన్ని కథలలోనూ ప్రస్తావనకు వచ్చిన 'బలి' ఒకడు కావచ్చు, కాకపోవచ్చు. కాని ప్రజారంజకులుగా సమధర్మాన్ని ప్రవేశపెట్టిన రాజులుగా 'బలి' పేరుగల రాజులు పేరొందారు. పురోహిత వ్యవస్థను గౌరవించటం, బ్రాహ్మణులకు ఇచ్చిన మాటకు కట్టుబడి ఉండటం ఈ రాజుల ప్రత్యేకతలు.

హరప్పా సంస్కృతిలో గ్రామ దేవతలను అమ్మతల్లిని కొలిచేవారు. ఆర్యసమాజం వర్గ, వర్ణ భేదాలు ప్రవేశపెట్టాక పురుష దేవుళ్ళకు ప్రాధాన్యం పెరిగింది. గ్రామదేవతలను, ఆర్య దేవుళ్ళకు భార్యలుగా చేశారు. పురుషస్వామ్యమూ నెలకొన్నది. ఈ విధమైన వ్యవస్థనూ

మత విశ్వాసాల పరిణామ శీలతనూ సామాజిక కోణంలో అధ్యయనం చేసిన వారిలో మహాత్మా జోతిరావు పూలే, డా॥ బి.ఆర్. అంబేద్కర్‌ల పరిశీలనలు మార్గదర్శకంగా ఉన్నాయి.

పురాణగాథలలో ముఖ్యంగా బలి రాజ్యాన్ని గురించిన పరిశీలన జ్యోతిరావు పూలే సిద్ధాంతానికి ప్రాతిపదికగా ఉంది. మహారాష్ట్రలోనూ కేరళలోనూ 'బలిరాజా' ఉత్సవాలు జరగటం పూలేలో ఆలోచనలు రేకెత్తించింది. బలిచక్రవర్తిని గురించిన కథలన్నీ పరిశీలించాక బలి గొప్పతనం ఆయనకు అర్ధమైంది. అప్పటికే పురాణ గాథలను తర్కదృష్టితో చూడటానికి అలవాటు పడిన పూలే "బలి" రాజ్యాన్ని తన సిద్ధాంతానికి ప్రతీకగా ప్రతిపాదించాడు.

భారతదేశంలో మొదట నివసించిన వారు. అసురులు : సురులు కాదు. ఆ అసురులనే సురులు (దేవగణాలు/ఆర్యులు) అణచివేస్తూ వచ్చారు. అసురులు బలమైన వారైనా సురుల మాయోపాయాల వల్ల అణచివేతకు గురవుతూ వచ్చారు అని చెప్పాడు పూలే. దేవ దానవ యుద్ధాలను పురాణాలు వక్రీకరించాయనీ దానవులే ధర్మపరులు అనీ భాష్యం చెప్పాడు. పురాణ గాథలకు కొత్త అర్థాలు వివరించాడు. కింది కులాలను దోచుకోవటానికే పురోహితులు ఈ వ్యవస్థను మూఢ నమ్మకాలతో నింపారన్నాడు. ఆ నమ్మకాలకు ఉదాహరణగా కథలు కల్పించారన్నాడు. వారి కథల ప్రకారమే అయినా. బలిచక్రవర్తిలోని సుగుణాలు, ఆర్తులను ఆదుకునే గుణమూ, అసురేతరులకూ ఇచ్చిన మాట నిలబెట్టుకునే తీరు, ధర్మప్రవర్తన పరిగణనలోకి తీసుకుని "కింది కులాలను నిర్లక్ష్యం చేసిన రామరాజ్యం వద్దు. బలిరాజ్యం రావాలన్నాడు" పూలే.

వామనుని సైన్యాలకూ, బలికీ జరిగిన యుద్ధంలో ఇరుపక్షాల సైనికులూ ఎక్కువ సంఖ్యలో మరణించారనీ, మరణించినవారినందరినీ భాద్రపద మాసం రెండో పక్షంలో సామూహికంగా దహనం చేశారనీ, సామూహికంగా వర్ధంతిని జరపటం ఆ పక్షంలో అలా మొదలయిందనీ పూలే చెప్పారు.

# బాణాసురుడు

పురాణాలలో బాణాసురుని గురించి ప్రస్తావనలు చాలా ఉన్నాయి. ఒక బాణాసురుడు మహాబలిగా పేరుపొందిన బలి చక్రవర్తి కొడుకు. ఇతని తల్లి అశన. శోణితపురం ఇతని రాజధాని. శివుని గురించి తపస్సుచేసి తనకు శత్రుభయం లేకుండా శివుడిని తన నగరంలో నివాసముండమని కోరాడట. పార్వతి కొడుకుగా వరంపొందాడు. ఈ బాణుడికి వెయ్యి చేతులున్నాయనీ అంటారు. ఋగ్వేదంలో 'బాణ' పదం ఇంద్రుని వజ్రాయుధాన్ని సూచించేదిగా ఉంది.. దీనికి 1000 అంచులున్నాయని చెబుతారు. రామాయణంలోను, మహాభారతంలోను బాణాలు ఆకాశంలో దూసుకుపోయేవిగా వర్ణించారు. కాంతితో కూడిన వజ్రాయుధపు తీవ్రతను ప్రతిబింబించే బాణాలకు బాణుడు రూపకల్పన కావచ్చు. బాణాలకు అధిదేవత ఇంద్రుని భార్య ఇంద్రాణి. ఇతని జెండా నెమలి చిహ్నంతో ఉంటుంది.

బాణుడు దేశ దేశాలు తిరిగి వేదాంత చర్చలు చేసేవాడని, ఇతర ధర్మాలను ఆదరించేవాడని సామాన్యజనంతోనూ, కింది కులాలతోనూ కలిసి ఉండేవాడని కథలు ప్రచారంలో ఉన్నాయి. (The wonder that was India - A.L. Basham)

ఈ పేరుతో (బాణాసుర) చాలమంది అసురులు ఉన్నారు.

1. ఒక బాణుడు శ్రీరాముని కాలంలో ఉన్నట్టు కంబ రామాయణం చెబుతున్నది.
2. ఒక బాణుడు సుబ్రహ్మణ్యస్వామి అనుచరుడు. (భారతం) బాణుడు శివభక్తుడు కాబట్టి శివుని కుమారుడైన సుబ్రహ్మణ్యుని అనుయాయిగా చెప్పారు.
3. ఒక బాణుడు సూర్యవంశపు రాజులలో ఒకడు. వికుక్షి కొడుకు. ఇతని పుత్రుడు అనరణ్యుడు (రామాయణం).

బాణుని సంతానం నివాత కవచులనే రాక్షసులు. వీరు నాలుగుకోట్ల మంది. వీరు దేవతలను తరిమేసి వారి నగరాలు ఆక్రమించారట. వీరిని అర్జునుడు చంపాడని భారతం అంటున్నది. నివాత, కవచులు రావణునితోనూ పోరాడారనీ బ్రహ్మ వచ్చి వారికి మైత్రి చేశాడనీ మరో కథ ఉంది. రామాయణంలోనూ, భారతంలోనూ బాణాసురుల ప్రసక్తి ఉంది. రామావతార కాలం, కౌరవ యుద్ధం కాలం ఎప్పటికీ చర్చనీయాంశాలే.

రామాయణ కథాంశాలు కొన్ని వాల్మీకి కంటే ముందటివి. రామావతార కాలం త్రేతాయుగం – క్రీ.పూ. 102 ప్రాంతం – అని కొందరి అభిప్రాయం. కృష్ణావతారం ద్వాపర యుగంనాటిది అంటారు.

బాణాసురుడు శైవ సంప్రదాయానువర్తి. మహావీరుడు. యుద్ధప్రియుడు. ఒకప్పుడు శివుడినే తనతో యుద్ధానికి పిలిచాడట. శివుడు ఏదో కారణం చెప్పి తప్పుకున్నాడు. తనకు తగ్గ వీరులతో యుద్ధం చెయ్యాలని బాణాసురుడు కోరుకుంటూ ఉండేవాడు.

"నీ ధ్వజం ఎప్పుడు క్రిందపడుతుందో అప్పుడు నీతో యుద్ధం చేయటానికి నీకు సాటి అయినవాడు రాగలడు" అని శివుడు చెప్పాడట. బాణుని కూతురు ఉష, శ్రీకృష్ణుని మనుమడయిన అనిరుద్ధుని వరించిన సందర్భంలో బాణునికి శ్రీకృష్ణునితో యుద్ధం సంభవించింది. శ్రీకృష్ణుడు బాణుని 1000 చేతులు నరికినట్లు శివుడువచ్చి వారికి సంధి చేసినట్లు భాగవతంలో ఉంది. బాణుడు తన కుమార్తె ఉషను అనిరుద్ధునికిచ్చి వివాహం చేశాడట. ఆర్య – అనార్య అనార్యులలో భిన్నజాతుల మధ్య వివాహ సంబంధాలను ఈ కథ సూచిస్తున్నది.

మతపరమైన శైవ, వైష్ణవ, ఘర్షణలకూ సర్దుబాట్లుకూ ఈ కథ ప్రతీక. "ఉషా పరిణయం" ఘట్టం నృత్య రూపకంగా ప్రసిద్ధం. వర్గ వైషమ్యాలను తెరవెనుకకు నెట్టి ప్రజలను వినోదాలతో మరపించే సంస్కృతిలో ఇదీ తనవంతు నిర్వహించింది.

బలి కుమారుడైన బాణుని గురించి జోతిరావ్ పూలే విశ్లేషణ ఈ సందర్భంలో తప్పక గర్తుచేసుకోవాలి. బలి అనుయాయులు, దండనాయకులూ వామనుని వర్గాన్ని ఓడించి హిమాలయాల వరకు తరిమివేశారనీ వారికి ఆహార పదార్థాలు అందకుండా చేశారనీ వామనుడూ అతని పరివారమూ ఆహారంలేక నశించారనీ పూలే అన్నారు. వామనుని గొప్ప 'ఉపాధి'గా భావించిన విప్రులు 'ఉపాధ్యాయులు' అయ్యారని పూలే చెప్పారు.

వామనుడు బలిరాజ్యంపై దండెత్తి వచ్చినప్పుడు బాణాసురుడు బలంగా వారిని ప్రతిఘటించాడు. బాణాసురుడు ఒక ప్రాంతంలోనూ బలి మరొక ప్రాంతంలోనూ యుద్ధం చేస్తూ ఉండిపోయారు. బాణాసురుని ధాటికి రాజ్యంలోని విప్రులందరూ పారిపోయి వామనుని చేరారట. వారంతా బాణాసురుని సేనలను ప్రతిఘటించటానికి ఎదురు చూస్తుండగా బాణుడు మరోవైపు నుంచి ఆకస్మికంగా ముట్టడించి వారిని హిమాలయాల వరకు తరిమేశాడు. బలి యుద్ధంలో మరణించిన తర్వాత బాణుడే రాజు అయ్యాడు. తమ విజయానికి తోడ్పడిన వీరులను బహుమానాలతో సత్కరించాడు. అది కార్తీకమాసం లోని బలి ప్రతిపద రోజు.

ఆ విజయోత్సవాల సందర్భంలో స్త్రీలు తమ సోదరులకు హారతి ఇచ్చి సత్కరించే వేడుక జరుపుకున్నారట. "చెడు అంతా నశించి బలిరాజ్యం వస్తుంది" అని కోరుకుంటూ జరుపుకునే ఆ పండగ ఇప్పటికీ జరుపుకుంటున్నారు. ఆ మరుసటి రోజు అన్నదమ్ములు అక్క చెల్లెళ్ళను సత్కరించే వేడుక ఉంటుంది.

కార్తీక మాసంలో భగినీ హస్తభోజనం, బలి ప్రతిపద పాడ్యమి వేడుకలు ఇలా వచ్చినవే. బాణాసురుడు రాజ్యం చేసినంత కాలం ఆర్య బ్రాహ్మణులు నిశ్శబ్దంగానే ఉండి పోయారనీ అనంతర కాలంలోనే మళ్ళీ విజృభించారనీ పూలే అభిప్రాయం. వామనుని అనంతరం వారిలో మరో నాయకుడు (బ్రహ్మ) బయలుదేరి తన వారందరినీ కూడగట్టుకుని

రాజ్యాధికారం చేజిక్కించుకునే ప్రయత్నాలు చేశాడట. తాళపత్రాలపై ఏదో రాయటం - తమకంటూ కొన్ని నియమాలు పెట్టుకోవటం - తమ వారిని గుర్తించటానికి మెడలో జంధ్యం వేయించటం, పశుమాంసం తినాలంటే యజ్ఞక్రతువు లాంటిది నిర్వహించటం - తమ జాతివారిని గుర్తుపట్టడం కోసం ఒక శ్లోకం తప్పనిసరిగా బట్టీ పట్టించటం (గాయత్రి) వంటివన్నీ ఉపాధ్యాయులు (ఆర్య బ్రాహ్మణులు) అప్పటి నుంచీ అలవాటు చేసుకున్నారంటారు పూలే. బాణుని తర్వాత రాజులు అంతశక్తిమంతులు కాక పోవటంవల్ల బ్రహ్మ అనుయాయులు 'భట్'లుగా బలపడ్డారు. స్థానిక అసుర క్షత్రియులను రాక్షసులుగా, క్షుద్రులుగా (శూద్రులు) చూశారు. ప్రతి గ్రామంలోనూ తమవారిని కీలక పదవులలో నిలుపుకున్నారు. శూ(క్షు)ద్రులకు గాయత్రి ఎట్టి పరిస్థితులలోనూ నేర్పకూడదని తమవారిని కట్టడి చేశారు. మహర్ (మహా+అరి) క్షత్రియులను, మహర్లుగా పిలవటం - వారికి విద్యలు నిషేధించటం వారిని తమ సేవకవర్గాలుగా చేసుకోవటం అనంతర పరిణామాలు. 'భట్'లు గ్రామాలలో ఆర్థిక వ్యవహారాలు చూసే కులకర్ణి (అసలు రూపం ఖులకర్మి) ఉద్యోగులయ్యారు. శూద్రులు 'కులంవాడి' (కులాంబి, కున్బీ) వృత్తుల వారయ్యారు. కున్బీ స్త్రీలు భట్‌ల యిళ్ళలో పనికత్తెలుగా కుదురుకోవలసి వచ్చింది.

హీన వృత్తులను కొందరికి అంటగట్టి వారిని అతి శూద్రులుగా (మహర్, మాంగ్, చమర్ మొ॥) దూరంపెట్టే వ్యవస్థ మొదలయింది. సమాజ పరిణామక్రమాన్ని చాలా నిశితంగా అధ్యయనం చేసి పూలే వెల్లడించిన సత్యాలు ఇవి.

చరిత్రకు తెలుస్తున్నంతవరకు పాలనాధికార క్రమంలో రాజు సర్వోన్నతుడు. క్షత్రియ, బ్రాహ్మణ, వైశ్య అనేది కులాల క్రమం. బ్రాహ్మణులు రాజులకు సలహాదారులు గాను, వైశ్యులు ధన సహాయం చేసేవారుగాను ఉండేవాడు. పురాణాల కాలానికి ఈ శ్రేణీ క్రమంలో బ్రాహ్మణులు ముందుకు వచ్చారు. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర అతి శూద్ర కులాలు వ్యవహారంలోకి వచ్చాయి.

# త్రిపుర దహనం

రుద్రుడు (శివుడు) అసురుల త్రిపురాలను నాశనంచేసిన వృత్తాంతం పురాణాలలో ఉంది. మత్స్యపురాణంలో దీనిని రెండుచోట్ల చెప్పారు. కథనంలో తేడాలున్నాయి. అసురుల (రాక్షసుల) పేర్లూ వేరేగా ఉన్నాయి. అలాంటి సంఘటనలు చాలా జరిగి ఉండవచ్చును. (మాల మాదిగ పేటలు తగలబెట్టటం శత్రువర్గాల మనుషుల్ని ఇళ్ళలోనే ఉంచి బయట గొళ్ళెంపెట్టి ఇళ్ళు తగలబెట్టటం వంటివి ప్రాచీన సమాజాలలోనూ ఉన్నాయనటానికి ఈ కథలు ఉదాహరణగా నిలుస్తాయి. అక్కడ తగలబడినవి రాక్షసుల నగరాలు. ఇప్పుడు తగలబడుతున్నవి మాల మాదిగ పేటలు. ఈ నేపథ్యంలో ఈ కథలు పరిశీలించుకోవాలి.)

ఒక కథనం ధర్మరాజుకు మార్కండేయుడు చెప్పినట్టుగా ఉంది. త్రిపురం అనేది బాణాసురుని నగరం. త్రిపురంలో వెండి, బంగారు, లోహపురాలు మూడు ఉండేవి. వాటిని చూసి ఆర్య/దేవ గణాలు సహించలేకపోయాయి. జ్వాలేశ్వరతీర్థ మాహాత్మ్యాన్ని చెప్పే సందర్భంలో ఈ కథ ఉంది. (మత్స్య పురాణం - అధ్యాయం. 186, 187) "రాక్షస రాజైన బాణునికి త్రిపురం అనే నగరం ఉంది. అతని తేజస్సు చేత ఆ నగరం ఆకాశంలో తిరుగుతూ ఉంటుంది. దాన్ని చూసి మేము భయపడుతున్నాం. మమ్మల్ని ఆ మహా దుఃఖం నుండి రక్షించు" అంటూ దేవగణాలు/ఆర్యులూ శంకరుని దగ్గరకు వెళ్ళారు. ఆ నగరాన్ని ఎలా ధ్వంసం చేయాలా అని ఆలోచించారు. నర్మదా తీరంలో కూచుని శంకరుడు కూడా ఆలోచించాడు. బాణుని నగరం ఆకాశంలో తిరుగుతున్నదీ అంటే అందుకు ఆ నగరం లోని స్త్రీల పతిభక్తి, సద్వర్తనమూ కారణం. వారి తేజస్సువల్లనే ఆ నగరం శోభాయమానంగా ఉంది అని గ్రహించాడు. వారికి బుద్ధిభ్రంశం కలిగించే పని నారదునికి అప్పగించాడు.

నారదుడు ఎక్కడికైనా వెళ్ళగలడు. త్రిపురం మూడు యోజనాల వెడల్పు, రెండు వందల యోజనాల పొడవుగల నగరం. ప్రణాళికాబద్ధమైన నగర నిర్మాణం హరప్పా నాగరికత లక్షణం అని చరిత్ర చెప్తున్నది.

బాణుడు తేజశ్శాలి. నారదుని చూసి ఆసనం నుండి లేచివచ్చి ఆహ్వానించాడు. 'చాలాకాలానికి వచ్చారు' అంటూ మర్యాదలు చేశాడు. బాణుని భార్య 'అనౌపమ్య'. ఆమె కూడా నారదుడిని పలకరించింది.

"నారదా - ఏ ధర్మంచేత ఏ వ్రతాల చేత దేవతలు సంతోషిస్తారు - చెప్పండి" అని అనౌపమ్య నారదుడిని అడిగింది. 'ఇక్కడ దేవతలు అంటే దేవగణాలు కాదు. దేవతలు Gods అని.'

ఇదే అవకాశంగా నారదుడు ఆమెకు రకరకాల వ్రతవిధానాలు చెప్పాడు. దైనందిన కృత్యాల నుంచి వారి మనస్సులను మళ్ళించాడు, పెడత్రోవ పట్టించాడు. అంతవరకు సుఖంగా ఉన్న స్త్రీలంతా తాము ఇంతవరకూ అవన్నీ చేయనందుకు చింతిస్తూ అసంతృప్త హృదయాలతో వికల మనస్కులయ్యారు. స్త్రీల అశాంతి గృహ కల్లోలాలకు దారి తీసింది. గృహాలలోని అశాంతి నగరంలోనూ ఆవరించింది. రకరకాల అరిష్టాలూ ఉత్పాతాలతో నగరం తల్లడిల్లింది. శివుని ప్రేరణతో అగ్ని విజృంభించి నగరాన్ని కాల్చటం మొదలు పెట్టింది. అగ్ని ప్రమాదాలలో మృతులైన కొడుకులనూ భర్తలనూ తలచుకొని స్త్రీలు రోదిస్తుంటే బాణునికి ఇదంతా దేవగణాల కుట్ర అని తెలిసింది - శివునికి నామీద దయ తప్పింది. ఎవరో నా మీద లేనిపోని మాటలు చెప్పి ఉంటారు - అనుకొని శివస్తుతి చేశాడు. ఆ స్తుతిలో "అంధకుని చంపినవాడవు, శూలధరుడవు - త్రిపుర నాశకుడవు" అని ఉండటం ఆలోచించదగ్గదే. హరప్పా నగరాల విధ్వంసం ఈ కథకు స్ఫూర్తి అయిందా అనేదీ ఆలోచించాలి.

దానవ స్త్రీలు సద్వర్తనం వదలిపెట్టారనీ వైదిక క్రతువులు చేస్తున్నారనీ ఆ పురాలు నాశనమయ్యే దశ వచ్చిందనీ దేవగణాలు చెప్పుకుని ధైర్యం తెచ్చుకున్నాయి. మూడు నగరాలలోని సంపద - శాంతిపూర్వక వాతావరణం అదృశ్యమయ్యాయి.

పుష్య యోగంలో ఈ త్రిపుర దుర్గం ఒకటైనప్పుడు రుద్రుడు (లయకారుడు) దీనిని ఒకే బాణంతో కూలగొట్టటానికి సన్నాహాలు జరిగాయి. "ఈ సృష్టిలో ఏది ఎంత కాలం ఉండాలో ఏది ఎలా జరగాలో అంతా ముందే నిర్ణయమై ఉంటుంది" అని బ్రహ్మ నోట పలికించారు. కాలమహిమ సిద్ధాంతం ముందుకు తెచ్చారు. దానినే ఈనాటి ఆధునిక తాత్వికులూ విజ్ఞాన వేత్తలూ చెబుతున్నారు.

దేవగణాలు సర్వశక్తులూ సమీకరించాయి. మందర పర్వతం ధనువు - వాసుకి అల్లె త్రాడు - కుమారస్వామి బాణం నిలిపే స్థానం - విష్ణువు బాణం - బాణపు మొన పైన అగ్ని, ఆపైన వాయువు - దేవతలంతా రథం అయ్యారు - నాలుగు వేదాలూ గుర్రాలు - అశ్వినులు పగ్గాలు, ఇంద్రుడు ఇరుసు - కుబేరుడు ప్రధాన ద్వారం దగ్గర నిలిచాడు. కుడిచేతివైపు యముడు ఎడమ వైపు కాలదేవుడు నిలిచారు. కోట్లకొలది దేవతలు గంధర్వులు చక్రాలలో ఉన్నారు. బ్రహ్మసారథి. ఇంత ప్రయత్నం చేసుకుని వేయి సంవత్సరాల కాలం వారు నిరీక్షించారు. మూడు పురాలూ ఒకటిగా ఉన్నప్పుడు శివుడు బాణం ప్రయోగించాడు. అపశకునాలు, ఉత్పాతాలు, రకరకాలుగా వర్ణించారు. రుద్రుని బాణానికి ఉన్న మూడు మొనలూ త్రిపురాలను దహించటం మొదలయింది. నగర ప్రజల హాహాకారాల మధ్య బాణుడు శివుని స్తుతించటం మొదలుపెట్టాడు. బాణుని స్తుతికి శివుడు ప్రసన్నుడయ్యాడు. "నీవు నీ బంధువులతో సువర్ణపురంలో ఉంటావు" అని అభయమిచ్చాడు.

'నిన్ను దేవతలు ఎవరూ చంపలేరు - నీవు అక్షయమైన లోకంలో విహరిస్తావు, అని మరో వరం కూడా ఇచ్చాడు. అగ్నిని ఉపసంహరించి సువర్ణపురాన్ని రక్షించాడు. కాలిపోయిన లోహ రజత పురాల జ్వాలలు ఒకటి శ్రీశైలం దగ్గర త్రిపురాంతకంలోనూ రెండోది నర్మదా తీరంలో అమరకంటక పర్వతం మీదనూ పడ్డాయట. అవీ పుణ్యస్థలాలు అయ్యాయి.

రుద్రుడు అనార్యుల (స్థానిక జాతుల) నాయకుడు. ఆర్యుల నాయకులు బ్రహ్మ, నారాయణుడు. వీరు స్థానిక జాతులతో విరోధపడినా కొన్ని కొన్ని సమయాలలో వారితో సమాధానపడవలసి వచ్చింది. రుద్రునికి కూడా నాయకత్వం ఇచ్చి తమతో కలుపుకున్నారు. త్రిమూర్తులుగా ప్రసిద్ధం అయ్యారు. బాధ్యతలు పంచుకున్నారు. సృష్టి, స్థితి, లయాలలో లయకారునిగా శివునికి పనులు అప్పగించారు. లయంచేసేదంతా స్థానిక జాతులైన అసురులనే. అతని చేతనే అతని జనాన్ని చంపించారు. ఈనాటికీ ఇదే రాజనీతి.

# దితి కడుపుకోత

ఇంద్రుడు దితి గర్భంలోని పిండాన్ని ఏడు ముక్కలు చేయటాన్ని రామాయణం ప్రస్తావించింది. ఈ వివరాలు ఇంద్రుని ఘన కార్యాలుగా పురాణాలు ప్రచారం చేశాయి. రామాయణం బాలకాండలో రామలక్ష్మణులను మిథిలా నగరానికి తీసుకువెళ్తూ వారికి దారిలో విశ్వామిత్రుడు చెప్పిన కథలలో ఇదొకటి.

దీనినే సప్తమరుత్తుల కథగా చెబుతుంటారు. (బాల. 46వ సర్గ) ఈ వృత్తాంతాన్నీ దేవదానవుల వైరాన్నీ విశ్వామిత్రుడు కథలుగా వివరించాడు.

దితి గర్భశోకాన్ని చాలా పురాణాలు చెప్పాయి. సారాంశం ఇది. దితి కశ్యపుని భార్య. ఆమెకు పుట్టిన సంతానం దైత్యులు. ఆమె సవతి అదితికి పుట్టిన వారు (దేవగణాలు) ఆదిత్యులు. వారిలో విష్ణువు, ఇంద్రుడూ ఉన్నారు. ఈ భూమి దితి సంతానానిది. అంటే దైత్యులది. అయినా దేవగణాలు ఎప్పుడూ దైత్యుల నుండి రాజ్యం లాక్కోవాలని చూసేవారు. దాడులు చేసేవారు. ఒక దేవాసుర యుద్ధంలో దైత్యులు మరణించారు. తన సంతానం 'ఇంద్రుని చేతిలోనో, విష్ణువు చేతిలోనో మరణించడం చూసి దితి క్షోభపడింది. ఇంద్రుడిని చంపగల ఒక కొడుకు కావాలని భర్తను కోరింది. "వెయ్యి సంవత్సరాలు నియమంగా ఉండు" అంటూ కశ్యపుడు దితికి ఒక వ్రతం చెప్పాడు. ఏవేవో నియమాలు చెప్పాడు. ఈ సంగతి ఇంద్రునికి తెలిసింది. నెమ్మదిగా దితిని మంచి చేసుకోవటం మొదలుపెట్టాడు. రాకపోకలు సాగించాడు. దితి ఇంద్రుడి కపట ప్రేమను నమ్మింది. ఆదరించింది. తనకు పుట్టబోయే బిడ్డతో ముల్లోకాల ఆధిపత్యాన్ని పంచుకొని సుఖంగా ఉండమని ఇంద్రుని ఆశీర్వదించింది. వ్రత నియమాలు ఆచరిస్తూనే ఉంది. ఇంద్రుడు ఆమెను గమనిస్తూనే ఉన్నాడు. ఎప్పుడు నియమోల్లంఘనం జరుగుతుందా అని ఎదురుచూస్తూ ఉన్నాడు. ఒకరోజు ఆమె అశుచిగా నిద్రపోయిందట. వెంటనే ఇంద్రుడు ఆమె గర్భంలో ప్రవేశించాడు. పిండాన్ని ఏడు ముక్కలు చేశాడు. వారి రోదనకు దితి మేల్కొన్నది. "మా రుద" (రోదించవద్దు) అంటూ ఇంద్రుడు ఆ పిండాలను బెదిరించాడు.

దితి వారించే లోపలే ఇంద్రుడు ఏడు ఖండాలనూ ఒక్కొక్క ముక్కనూ ఏడేసిగా నరికాడు. దితి దీనంగా ఏడుస్తూ ఇంద్రుడిని బతిమాలుకుంది. అప్పటికి ఆమె గర్భంలోని పిండం 49 ముక్కలు అయింది. ఇంద్రుడు దితితో "పగలు అశుచిగా నిద్రపోయావు ఇది నీ దోషమే" అన్నాడు. ఆ ఖండాలను నాశనం చేయకుండా వదిలాడు. ఆ 49 మందికీ స్వర్గంలో స్థానం ఇస్తానన్నాడు. వారే మరుత్తులు (వాయువులు). దితి పరిస్థితి మనం ఊహించుకోవచ్చు. ఇదీ ఆమె కడుపుకోత.

ఇంతకూ ఆమె అశుచిగా ఎలా నిద్రపోయిందంటే నిద్రలో ఆమె జుట్టు–తల వెంట్రుకలు కాళ్ళకు తగిలాయట. ఆ నిద్రా భంగిమ అమంగళకరం. ఆ దోషంతో ఆమె

వెయ్యేళ్ళ వ్రతమూ నిష్ఫలమయింది. ఇంద్రుడు ఆమెపై దాడిచేయడానికి అవకాశం చిక్కింది. స్త్రీలకు ఆచార హింస, గృహహింసలో భాగమే. వాళ్ళని సుఖంగా ఉండనివ్వరు. – హాయిగా నిద్ర కూడా పోనివ్వరు. పిల్లల కోసమూ భర్త కోసమూ కుటుంబం కోసమూ నియమంగా వ్రతాలు, ఉపవాసాలు చేస్తూ ఉండవలసిందే, నియమంగా ఉండవలసింది ఆడవాళ్ళే. ఆడవాళ్ళకి గర్భధారణలూ, గర్భస్రావాలూ, గర్భ విచ్ఛిత్తులూ ఇప్పుడు మామూలు విషయాలు.

వైదిక కాలంలో గర్భస్రావాన్ని ఘోరమైన అపరాధంగా భావించేవారని చరిత్రకారులు చెబుతున్నారు. ఇంద్రుడు – దితి వైదిక యుగానికి చెందినవారే. శత్రువుల నగరాలను నాశనం చెయ్యాలనీ, శత్రు శిబిరాలలోని గర్భస్థ పిండాలను కూడా నాశనం చెయ్యాలనీ దేవగణాలను (దేవతలను) కోరుతూ ఆర్యులు రాసిన సూక్తులు వేదాలలో ఉన్నాయి. ఈ కోణంలోనూ చరిత్రను అవలోకించవలసి ఉంటుంది. గర్భిణీ స్త్రీలపై అత్యాచారాలు ఆర్య సమాజంలో కనబడతాయి. గర్భస్రావాలను వారు తమ గణంలో నిషేధించి ఉండవచ్చును. తమ సంతతిని వృద్ధి చేసుకునేందుకూ జనాభా పెంచుకునేందుకూ వారు గర్భస్రావాలను నిషేధించి దానిని అపరాధంగా పరిగణించి ఉంటారు. కాని శత్రు స్త్రీల విషయంలో అందుకు భిన్నంగా వ్యవహరించారు. ఇంద్రుడిని ఎవరూ ఏమీ అనలేదు. అతని చర్యను ఖండించ లేదు. దితి ఆశీర్వచనం ప్రకారం ఇంద్రుడు రాజ్యాధికారాన్ని మరుత్తులతో పంచుకున్నాడు. మరుత్తులు వికలాంగులయ్యే ఉంటారు. వారికి వికలాంగుల కోటాలో ఏమైనా ఇచ్చాడేమో.

గర్భశోకాన్ని దిగమింగుకొని, దితి మళ్ళీ భర్తను సమీపించింది. ఇంద్రుడిని చంపే శక్తిగల కొడుకు కావాలన్నది. ఈసారి పదివేల సంవత్సరాలు నియమంగా ఉండాలన్నాడు ఆయన. సంవత్సరాలు 'యుగాల' లెక్క అప్పట్లో వేరేలా ఉండేది. యుగం అంటే అయిదు సంవత్సరాలని ఒక లెక్క ఉంది. మూడు నెలలని మరో లెక్క ఉంది.

తమకు అడ్డువస్తారని భావిస్తే పాలకవర్గం ఎవరినీ బతుకనివ్వదు. గర్భం లోనే చంపి పారేస్తుంది. రాజ్యాధికార కాంక్షతో ఇంద్రుడు సవతి తల్లిపైననే ఇంత అకృత్యం జరిపాడంటే పూర్వ సమాజాన్ని ఏమనుకోవాలి; 'ఇంద్రుడు' అనేది ఒక పదవి. అది వ్యక్తి నిష్ఠంకాదు. ఆ పదవిలో ఎవరెవరో ఉండవచ్చు. ఎవరు ఉన్నా వారి వ్యవహారశైలి అలానే ఉండేదన్నమాట. అందుకే ఇంద్రుని చర్యను ఎవరూ ఖండించలేదు. రాజ్యాన్ని ప్రశ్నించటం నేరం. రాజ్యహింసను ప్రశ్నించటం ప్రాణాలకే ముప్పు. నిరసన ఉద్యమాలు వచ్చినా అవేవీ ఫలించేవి కావు. రాజ్యాన్ని ఎదుర్కోలేక దితిలాంటి స్త్రీలు అది 'విధి' సంఘటనగానో 'కర్మ'గానో సరిపెట్టుకునేవారు. అయినా, ప్రతిఘటిస్తూనే ఉండేవారు. తమ ప్రయత్నం తాము చేస్తూనే ఉండేవారు. స్త్రీల పట్ల సమాజపు అమానుష వైఖరికి పైకథ నిదర్శనం. స్త్రీలను సంతానోత్పత్తి సాధనాలుగానూ, భోగ వస్తువులుగానూ చూశారు.

వేదాలలో స్త్రీల గురించీ, గర్భవిచ్ఛిత్తుల గురించీ వర్ణనలున్నాయి. ప్రాచీన భారతీయ సమాజాన్ని తలచుకుని గర్వపడవలసిందేమీ లేదనేదే స్త్రీలకు అందే సందేశం.

దితి ఓటమిని ఒప్పుకోలేదు. ఈసారి మరింత నిష్ఠగా అత్యంత కఠినంగా దేహాన్ని, మనసునూ లగ్నంచేసి - ఎవరి మాయలూ పనిచేయని రీతిలో మసలుకుంది. అప్పుడు కలిగిన పుత్రుడు వజ్రాంగుడు.

---

దితి మొదటి నుంచీ నిష్ఠాపరురాలు. సరస్వతీ నది ఒడ్డున శమంత పంచక తీర్థంలో నూరేళ్ళు తపస్సు చేసిందని మత్స్య పురాణం (అధ్యాయం 7) చెబుతోంది. ఆమె మదన ద్వాదశీవ్రతం కూడా చేసిందంటూ ఆ వ్రతం వివరాలూ ఇచ్చింది. ఆ వ్రతం చేశాక మళ్ళీ పుత్రేష్టి చేసిందట. ఆ తర్వాత గర్భిణీగా పాటించవలసిన నియమాలు పాటించింది. అప్పుడు పుట్టిన దైత్యులు పాలకవర్గం అయ్యారు. శత్రువుల చేతిలో వారు మరణించాక దితి మళ్ళీ నిష్ఠగా వ్రతాలూ, అనుష్ఠానాలూ చేస్తే తీరా ప్రసవానికి ముందు వ్రతలోపం ఏదో చూపి ఇంద్రుడు ఆమె సంతానాన్ని అంగవికలురుగా చేశాడు. స్త్రీల వ్రతానుష్ఠానాలను నొక్కి చెప్పటం ఈ కథలోని నీతిగా కనిపించినా గమనించవలసింది వేరే ఉంది.

# వజ్రాంగుడు

వజ్రాంగుని వృత్తాంతం దితి కథకు పొడిగింపు. వజ్రాంగుడు దితి, కశ్యపుల కొడుకు. దేవగణాల చేతిలో దితి తొలి సంతానం మరణించింది. మలి సంతానం వికలాంగులై "మరుత్తుల" పేరిట దేవగణాల నియంత్రణ లోకి వెళ్ళారు. దితికి గర్భశోకమూ కొడుకుల పరాధీనతా మిగిలాయి. జాతుల కలహాలలో ఎందరు స్త్రీలు ఇలాంటి క్షోభనూ, వేదనను అనుభవించారో.

ఆ తర్వాత దితి, ఎన్నో వ్రతాలు అనుష్ఠానాలు చేసి శత్రువుల కుతంత్రాలను తట్టుకుని వారిని ఎదుర్కోగల పుత్రుని పొందింది. స్థానిక ప్రజలకూ, పాలక వర్గానికి జరిగే సంఘర్షణలలో స్త్రీలే ముఖ్య బాధితులు. సమస్యను ఎదుర్కొనటానికే వారు ఎప్పుడూ ప్రయత్నిస్తూనే ఉండటం అనే అంశం ఈ కథలో కనిపిస్తుంది. ఇది మూడో తరం దైతేయుల పోరాట గాథ.

దితి గర్భం ధరించి ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నదో గాని ఈసారి ఆమెకు బలిష్ఠుడూ గుణశాలీ అయిన వజ్రాంగుడు పుట్టాడు.

పురాణాలు రాసిన వారంతా తాము విన్న కథలలోని అసలు పేర్లను సంస్కృతీక రించటమూ విశేషణాలతో జోడించి చెప్పటమూ చేశారు. స్థానిక ప్రజలనూ వారి భాషలనూ అణచి వేసే పథకంలో భాగమే ఇది. వజ్రం కఠినమైనది, శక్తిమంతమైనదీను. ఇంద్రుని ఆయుధం వజ్రాయుధం దృఢమైనది. దితికి పుట్టిన కొడుకు దృఢకాయుడు కాబట్టి "వజ్రాంగుడు" అన్నారు. వజ్రాంగుడు, వజ్రహస్తుడు వంటి అసురుల పేర్లు గమనిస్తే వారి బలశౌర్యాలు అర్థ మవుతాయి. ఆర్యగణాల చేతిలో క్షోభకు గురైన స్త్రీలు స్వయంగా రంగంలోకి దిగి తమ పిల్లలకు అంతటి యుద్ధ శిక్షణ ఇచ్చి ఉంటారా! ఈ ఇరవయ్యొకటవ శతాబ్దంలో కార్పొరేట్ వ్యవస్థకు, అవినీతిమయంగా ఉన్న ప్రభుత్వ పథకాలకూ, సెజ్‌లకూ ఎదురు తిరిగి వారిపై యుద్ధం ప్రకటించే దశకు చేరుకున్న గిరిజన ఆదివాసీ స్త్రీలను చూశాక ఆ నేపథ్యంలో పురాణ కథలను నెమరువేసుకుంటే అప్పటి సామాజిక చరిత్రను స్పష్టంగా చూడగలుగుతాం. స్త్రీలకు సంబంధించినంత వరకు ఆర్యగణం నిర్దయగా, నిరంకుశంగా ఉంది. వారు తమ స్త్రీలను ఎలా చూశారో ఇప్పటివారు ఊహించగలరు. తమపై జరుగుతున్న హింసకు అవమానాలకూ ఆర్యేతర స్త్రీలు ప్రతిస్పందించారు. దేవాసుర యుద్ధాలలో చాలావాటికి స్త్రీలపట్ల దేవగణాల అమానుష ప్రవర్తన కారణంగా కనిపిస్తుంది.

వజ్రాంగుని జననం అపూర్వమైనది. పుట్టగానే అతడు శస్త్ర, అస్త్ర విద్యలలో నిష్ణాతుడయ్యాడు. తల్లి ఎదుట నిలిచి భక్తితో నమస్కరించి, 'అమ్మా నీ కోసం నేనేమి

చెయ్యగలను?' "మాతః కిం కరవాణ్యహం" (మత్స్య 145-44) అని అడగగానే దితి సంతోషంతో తలమునకలయింది. "ఇంద్రుని వల్ల నా కొడుకులు చనిపోయారు. దానికి ప్రతీకారంగా నీవు ఇంద్రుడిని చంపి రా" అన్నది. వజ్రాంగుడు స్వర్గలోకానికి వెళ్ళి ఇంద్రుడిని తాడుతో కట్టేసి వేటగాడు ఒక చిన్న జంతువును లాక్కువచ్చే విధంగా ఈడ్చుకుంటూ తల్లి దగ్గరకు తెచ్చాడు.

అప్పటికి ఈ విషయం అందరికీ తెలిసింది. కశ్యపుడు, బ్రహ్మ పరుగెత్తుకుంటూ వచ్చారు. "నాయనా ఇప్పుడు వీడితో ఏం ప్రయోజనం? వీడిని వదలిపెట్టు. గౌరవంగా బతికే వాడికి అవమానం చావు వంటిదే. శత్రువు చేతిలోపడి విడిపించబడినవాడు మరణించిన వాడేను. అలాంటివాడు రోజు రోజుకూ అవమాన భారంతో జీవన్మృతుడవు తాడు. నీకు వశపడిన వానితో వైరం ఎందుకు? వాడు చచ్చినవాడే. వాడిని వదిలిపెట్టు" అన్నారు. "నాకు వీనితో పనిలేదు. తల్లి ఆజ్ఞ నెరవేర్చాను. అంతే. నీవు నా తండ్రివి - నీవు పితామహుడవు - మీ మాట ప్రకారం ఇంద్రుడిని వదిలేస్తాను" అన్నాడు వజ్రాంగుడు. పెద్దల మాట మన్నించి ఇంద్రుడిని వదలిపెట్టాడు. ఆ విధంగా బ్రహ్మ, కశ్యపుడు ఇంద్రుడిని విడిపించుకు వెళ్ళారు.

"నా మాట మన్నించావు నీ జన్మ సఫలమైంది" అన్నాడు బ్రహ్మ. వెంటనే ఒక చక్కని కన్యను సృష్టించి వజ్రాంగునికి భార్యగా ఇచ్చాడు. ఆమె పేరు వరాంగి. వజ్రాంగుడు రాజభోగాలు కోరుకోలేదు. "ఒకరు అనుభవించిన రాజ్యం, ఒకరు అనుభవించిన స్త్రీ లాంటిది. అది నాకు వద్దు" అన్నాడట. అతనికి స్వర్గమూ భోగాలూ రుచించలేదు. తపస్సు కోసం బయలుదేరాడు. మౌనం, బ్రహ్మచర్యం, శరీరాన్ని తపింపచేయటం, నిరాహారం తపస్సు స్వరూపాలు.. వరాంగి, వజ్రాంగుడు కూడా తపోదీక్షలోనే ఉన్నారు. వజ్రాంగుడు చేతులు పైకెత్తి నిలుచుని వెయ్యేళ్ళు, పంచాగ్నుల మధ్య వెయ్యేళ్ళు, నీటిలో నిలుచుని వెయ్యేళ్ళు, తలకిందులుగా వెయ్యేళ్ళు, తపస్సు చేశాడు. ఇవన్నీ నిరాహారంగానే.

అనంతర సన్నివేశాలు 'వరాంగి'ని గురించిన వివరాలలో చూడవచ్చు.

# వరాంగి

వజ్రాంగుని కథ వరాంగితో ముడిపడి ఉంది. వరాంగి వజ్రాంగుని భార్య. దితికి తగిన కోడలు. వజ్రాంగునితోపాటుగా ఆ పరిసరాలలోనే ఆశ్రమంలో తన రీతిలో తాను తపస్సు, ధ్యానం చేస్తుండేది. ఈ సమయంలో దేవరాజు ఇంద్రుడు ఆమెను భయపెడుతుండే వాడు. వజ్రాంగుడు ఎనిమిదివేల ఏళ్ళు తపస్సు చేశాడు. అంతకాలమూ వరాంగిని ఇంద్రుడు బాధలు పెడుతూనే ఉన్నాడు. కోతిలాగా ఆశ్రమంలోనివన్నీ చెల్లా చెదరుచేయటం, రకరకాల రూపాలతో భయపెట్టడం, పాములాగా కాళ్ళకు చుట్టుకుని ఈడ్చుకుపోవటం, వెకిలిచేష్టలతో చికాకు పరచటం, ఆమె అడవిలో దారి తప్పి తిరిగేలా చేయటం, నక్కలాగా కూతలుపెట్టడం, మేఘంలాగా వర్షించటం వంటివి చేస్తుండేవాడు. ఈ బెదిరింపులన్నీ చూసి ఆమె అదంతా సమీపంలోని పర్వతం చేస్తున్న చేష్టలు అని అనుకొని దానిని శపించాలనుకున్నది. అప్పుడు ఆ కొండ మానవ రూపంలో వచ్చి తన నిర్దోషిత్వాన్ని చెప్పుకుంది. ఇంద్రుని దుశ్చర్యలనూ చెప్పింది. స్త్రీలను బాధించే రాజ్య స్వభావం ఇంద్రునిలో చూపించారు. కొంతకాలానికి వజ్రాంగుడు బ్రహ్మ నుంచి వరాలు పొంది వచ్చాడు. ఏదైనా తినాలనుకుంటూ వరాంగి కోసం చూశాడు. ఆశ్రమంలో వరాంగి లేదు. అంతటా వెదకిచూస్తే పర్వత వన ప్రదేశంలో చెట్టు చాటున ముఖం కప్పుకుని ఏడుస్తూ కనిపించింది.

"ఇంద్రుడు చేసిన చేష్టలతో బాధపడుతున్నాను. ప్రాణాలు వదలాలనుకున్నాను. ఈ శోక సముద్రం నుండి తరింపచేసే తారకుడైన కుమారుడు కావాలి నాకు" అని అడిగింది. "పుత్రమే తారకం దేహి. అస్మాద్దుఃఖ మహార్ణవాత్" (మత్స్య 146-14). వజ్రాంగుడు ఆహారం మాట వదలిపెట్టి శక్తి శాలి అయిన కొడుకు కోసం మళ్ళీ తపస్సుకు వెళ్ళాడు. ఈసారి బ్రహ్మ అతనికి వెంటనే సాక్షాత్కరించాడు. కోరిన వరమూ ఇచ్చాడు. వరాంగి వెయ్యేళ్ళు గర్భం మోసి తారకునికి జన్మ ఇచ్చింది. ఆమె నీటిలో తడుస్తూ గర్భం భరించిందని మత్స్యపురాణం చెప్పింది. దాని అంతరార్థమేమిటో!

కొడుకుని చూసుకొని వరాంగి అతడు ఇంద్రుడిని జయించినట్టే సంతోషపడింది. (స్కంద. 2-15 అధ్యాయం) పాలక వర్గాల నుండి ఒంటరి స్త్రీలు బలహీన వర్గాల స్త్రీలు, పొందే అవమానాలకూ, క్లేశానికీ వరాంగి ప్రతీక. ఆమె వారి సహనానికీ, క్షమకూ కూడా ప్రతినిధి. అదే సమయంలో వారిలో రగిలే ప్రతీకారేచ్ఛకూ ఆమె ప్రాతినిధ్యం వహిస్తున్నది. వరాంగి భర్త వజ్రాంగుడు కూడా తల్లి కోరికపైనే దేవగణాలతో తలపడ్డాడు. దితి, ఆమె కోడలు (వరాంగి), పాలకవర్గం చేత బాధలుపడ్డవారే. ఇంద్రుడు దితి గర్భంలోని పిండాలను ముక్కలు ముక్కలు చేశాడు. ఆ ఇంద్రుడే వరాంగిని భయపెట్టాడు. దైత్య స్త్రీలపట్ల శిష్ట సమాజపు పాలకవర్గం వ్యవహరించిన తీరును ఈ కథలు నివేదిస్తున్నాయి.

పాలకుల కుట్రపూరిత చర్యలకు తరణోపాయాలు బాధితులే వెదుక్కోవలసి వచ్చింది. ఇంద్రుని రాజ్యపు దుశ్చర్యలను పురాణాలు తక్కువగానే చెప్పి ఉంటాయి. కిందివర్గాల స్త్రీల మీదనే అత్యాచారాలు, మానభంగాలూ ఎక్కువ జరగటం ఇప్పటికీ లోకంలో ఉన్నదే.

వజ్రాంగుడు మొదటిసారి తపస్సు చేసినప్పుడు బ్రహ్మ నుంచి వజ్రాంగుడు కోరినది ఏమిటంటే ధర్మం మీద ఆసక్తి. "స్వర్గమూ వద్దు. భోగాలూ వద్దు, అసుర భావమూ వద్దు, ధర్మం మీదా తపస్సు మీదా ఆసక్తిపోకుండా ఉండేలాగ అనుగ్రహించమని" కోరుకున్న తాత్వికుడు వజ్రాంగుడు. ఆర్యేతర సమాజాలలో ఇటువంటి వారు చాలామంది కనబడతారు. వరాంగిని ఇంద్రుడు బాధించటంవల్ల రెండోసారి తపస్సుకు వెళ్ళిన వజ్రాంగుడు శక్తిశాలి అయిన కొడుకును కోరుకున్నాడు. ఆ కొడుకు తారకుడు.

కర్కశుడు, గుణహీనుడూ అయిన దేవరాజు వరాంగిని భర్తలేని సమయంలో భయపెట్టాడు, కొట్టాడు, ఎన్నో విధాల పీడించాడు అని మత్స్యపురాణకర్త చెప్పాడంటే స్త్రీలపై ఆధిపత్య వర్గాల అకృత్యాలు ప్రాచీన కాలం నుండీ సాగుతుండేవని తెలుస్తున్నది. ఈ కథ అప్పటి రాజకీయ వైషమ్యాలనే గాక సామాజిక పరిస్థితినీ – మానవ మనస్తత్వాలనూ చిత్రించింది. కొడుకులు తమ బాధలు తీరుస్తారని ఆశపడే తల్లుల మనోభావాలను దితి విషయంలోను ఆమె కోడలు వరాంగి విషయంలోనూ గమనించవచ్చు.

దేవరాజు ఇంద్రుడు రాజ్యానికి ప్రతీక. రాజ్యహింస స్త్రీలపట్ల ఎలా ఉండేదో ఇలాంటి కథల ద్వారా పురాణాలు స్పష్టం చేస్తున్నాయి. పురాణాలను నిశితంగా పరిశీలిస్తే మానవ సంబంధాలు మనస్తత్వాలు ఎంత సంకుచితంగా ఉండగలవో అర్థమవుతుంది. వాటిని దాటి తమ దృష్టిని విశాలం చేసుకోవాలనే ఉద్దేశంతో ఈ గాథలు మొదట్లో ప్రచారం చేసి ఉంటారు. అయితే వర్గస్వభావపు వ్యాఖ్యాతల ప్రయోజనాల పరిధిలో ఇవి సామాజిక వైరుధ్యాలను పెంచాయి. వాస్తవాలను వక్రీకరించటాలూ జరిగాయి. ఫలితంగా ఈనాటికీ మానవ సమాజం స్వార్థ సమాజంగానే మిగిలిపోయింది. దేవగణాల రాజైన ఇంద్రుడిని దేవతల రాజుగా పురాణాలు ప్రజలను నమ్మించాయి. కాని దైవ లక్షణాలు అతనిలో అణుమాత్రమైనా చూపలేకపోయాయి. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలకు ఇంద్రుడు ప్రతీకగా నిలిచాడు. చింతించవలసిన మరో విషయం ఏమిటంటే ఇంద్రుని ప్రత్యర్థులయిన దైత్యులూ, ఇతర సామాజిక వర్గాలూ, – సాధు స్వభావులూ, శాంత మూర్తులూ, తపోనిష్ఠులు, భోగ విముఖులూ అధికారకాంక్ష లేనివారూ అయి ఉండి కూడా దుష్టులుగా చిత్రీకరించబడటం.

దితికి పుట్టబోయేవాడు పాలకుడవుతాడని ఆమె గర్భాన్ని ఛేదించి ఆ పిండాన్ని ఛిద్రం చేయటం సామాజిక దుర్మార్గానికి, వైరుధ్యాలకు, శత్రుద్వేషానికి మాత్రమే ఉదాహరణ కాదు. పాలకవర్గాల కర్కశత్వానికి అధికార కాంక్షకు ఉదాహరణ. వరాంగిని బాధించటం, మరో సందర్భంలో గెలుపుకోసం జలంధరుని భార్య తులసిని వంచించటం,

గౌతముని భార్య అహల్యను వంచించటం వంటివి దేవతల పరంగా చెప్పటం మతానికి చేటు తెస్తుందని పూర్వ పౌరాణికులు ఎందుకు ఊహించలేదో! దేవతల పరంగా ఈ గాథలు అన్వయించటంవల్ల భారతీయ ధర్మానికే నష్టం జరిగింది. మహాత్ములుగా పూజించదగ్గ వారుగా, ఉపదేశాలు ఇచ్చేవారిగా, చిత్రీకరించవలసిన వారిని ఇలా చూపిన కథలవల్ల భారతదేశ సమాజం చాలా నష్టపోయింది. స్వశక్తిమీద పనులు చేసుకోవటం మాని పూజా పురస్కారాలతో దైవంమీద ఆధారపడే మనస్తత్వాన్ని ప్రజలకు అలవాటు చేయటంవల్ల కొన్ని వర్గాలు నిర్వీర్యమైపోయాయి. ఆలోచన, సృజనాత్మకత లోపించి ప్రజలు సేవక ధర్మానికే అలవాటుపడ్డారు. హేతుబద్ధంగా ఆలోచించగలవారిని ధర్మశాస్త్రాలు నిరుత్సాహ పరిచాయి. పాలకవర్గ, పురోహితవర్గాల ప్రయోజనాలకే పరిమితమైన ధార్మిక వ్యవస్థవల్ల జాతి పురోగమనం కుంటువడింది. ఆలోచించి ప్రశ్నించగల సమాజాన్ని ఈనాడు రాజ్యశక్తులు అడ్డగిస్తున్నాయి. సురాసుర యుద్ధాల నేపథ్యాన్ని మానవ సంబంధాలనూ ఇప్పటికైనా సామాజిక కోణంలో అర్థం చేసుకోగలిగితే మతపరమైన మూఢనమ్మకాలను వదలిపెట్టగలిగితే సామ్రాజ్యవాద శక్తులను ఎదుర్కోగల సమాజం ఆవిర్భవించగలదు. వరాంగి, వజ్రాంగులు వేల సంవత్సరాలు తపస్సు చేసిన వన ప్రాంతాలు ఛత్తీస్‌గడ్ లోనివా? శ్రీకాకుళం కన్నెధార కొండల ప్రాంతాలా? ఒరిస్సా మల్కన్‌గిరి ప్రాంతాలా? ఏ నేపథ్యంలో ఈ సాహిత్యం వెల్లివిరిసిందో.

# తారకాసురుడు

దేవాసుర సంగ్రామాలలో దేవగణాలకు తారకాసురునితో జరిగిన యుద్ధాలు సుదీర్ఘమైనవి. తారకాసురుని పేరు పురాణ కథలతో పరిచయమున్న వారికి తెలిసినా వివరాలు తెలిసి ఉండకపోవచ్చు. తారకాసురుడు తన తల్లికి జరిగిన అవమానాలకు ప్రతీకారం తీర్చుకోవటానికే ఇంద్రునిపై యుద్ధానికి దిగాడు. ఇంద్రుడినీ, దేవగణాలనూ, విష్ణువునూ కటికవాడు పశువులను కట్టిపడేసే విధంగా కట్టిపడేశాడు.

దైత్య స్త్రీలను అవమానించిన ఇంద్రునిపై పగతీర్చుకోవటానికే ఇంద్రుని నగరాన్ని వశపరుచుకొని దేవగణాలను తరిమికొట్టాడు. ఈ విషయాలు పురాణాలు దాచిపెట్టలేదు. కాని, ప్రచారం కాకుండా చూశాయి. తారకాసురుని లోకకంటకునిగా ప్రచారం చేశాయి. శివుని కుమారుడైన కుమారస్వామి ఇతనిని చంపాడన్నాయి. ఈ రెండూ అసత్య కథనాలే. తమ తప్పులను తమలోనే దాచుకుని ఎదుటివారిపై నేరారోపణలు చేస్తూ తారకుని దుష్టునిగా లోక కంటకునిగా చెప్పటానికి కారణాలు రాజకీయమైనవే.

తారకుని కథను మత్స్య పురాణమూ, స్కంద పురాణమూ వివరంగా చెప్పాయి. మత్స్య పురాణంలో 145-159 అధ్యాయాలు తారకాసురుని గురించినవే.

తారకాసురుని జననం తల్లికి జరిగిన అవమానాలకు ప్రతీకారం చేయటం కోసమే జరిగింది. తారకుని తండ్రి వజ్రాంగుడు దైత్య ప్రభువులలో ముఖ్యుడు. వీరుడూ, తత్త్వవేత్తా కూడా. అతని భార్య వరాంగి. బ్రహ్మ ప్రత్యేకంగా ఆమెను సృష్టించి వజ్రాంగునికి భార్యగా ఇచ్చాడు. బ్రహ్మ ఒక స్త్రీని ప్రత్యేకంగా సృష్టించాడంటే ఆమెపై అందరి దృష్టి పడుతుంది. దేవరాజు ఇంద్రుడు ఆమెను వేధించటం మొదలుపెట్టాడు. స్త్రీలపై కాముక దృష్టి ఇంద్రుని స్వభావం. ఇంద్రుడంటే రాజ్యమూ అధికార యంత్రాంగమూను. స్త్రీలపై రాజ్యం సాగించే హింస అప్పటికీ ఇప్పటికీ అలానే సాగుతోంది.

వజ్రాంగుడు తపస్సు చేస్తున్న సమయంలో ఒంటరిగా ఉన్న వరాంగిని ఇంద్రుడు ఎంతగా విసిగించాడంటే ఆమె ఇక ఆత్మహత్య చేసుకుందామని అనుకున్నదట. భర్త తపస్సు ముగించుకుని రాగానే తన దుఃఖాన్ని తీర్చే కొడుకు కావాలని అడిగింది.

"పుత్రం మే తారకం దేహి

అస్మాద్దుఃఖ మహార్ణవాత్" లోకంలో తల్లులకు కొడుకులు ఒక గొప్ప ఊరట. వారు తమ కష్టాలు తీరుస్తారనీ, ఆదుకుంటారనీ ఆశపడతారు. ఇంద్రుని జయించగల కొడుకు కోసం వజ్రాంగుడు తపస్సు చేశాడు. ఆ విధంగా తల్లి దుఃఖాన్ని తరింపచేసేందుకు పుట్టినవాడు తారకుడు. పురాణాలు విశేషాంశాలన్నీ వరాలకు జతపరచి చెబుతాయి. కాబట్టి, తారకుడు బ్రహ్మ వర ప్రభావంతో పుట్టాడన్నాయి.

తారకుని కథ శివపార్వతుల కొడుకూ, దేవగణాల సేనానీ అయిన కుమారస్వామితో ముడిపడి ఉంది. కుమార జననాన్ని గురించి విశ్వామిత్రుడు రామలక్ష్మణులకు చెప్పటం రామాయణంలో ఉంది. ఈ సంఘటనలు రామాయణ కాలానికి పూర్వపువే.

తారకుడు పుట్టగానే అసురులు, దానవులూ, దైత్యులూ అతనిని తమ ప్రభువుగా అభిషేకించారు.

"దేవతలు మనకు వంశక్షయకరులు. జాతిధర్మంగా మనకు వారితో వైరం ఉన్నది. మనలను నశింపచేయటమే వారి స్వభావంగా ఉన్నది. వారితో యుద్ధం చేయాలంటే భుజ బలంతోపాటు తపశ్శక్తి పొందాలి. స్థిరమైన ఉపాయం ఉంటేనే స్థిరమైన సంపద వస్తుంది. లక్ష్మి చంచలమైనది" అంటూ తన వారికి నచ్చజెప్పి, తారకుడు తపస్సుకు వెళ్ళాడు. (మత్స్యపురాణం అధ్యాయం-147).

అతీత శక్తుల కోసం, తనతో సమానమైన వారెవరూ సృష్టిలో లేకుండా ఉండడం కోసం, పారియాత్ర పర్వత గుహలో పశుపతి దీక్ష వహించి పంచమంత్రాలు పరిస్తూ పంచాగ్నుల మధ్య దీక్ష సాగించాడు. రకరకాలుగా నూరేసి ఏళ్ళు తపస్సు చేశాడు. ప్రతి రోజు తన శరీరంలోంచి కొంత మాంసం కోసి అగ్నిలో వేస్తూ అర్పించేవాడట.

అలా చేస్తూ చేస్తూ చివరికి అతని శరీరంలో మాంసం లేకుండా పోయిందని కవులు వర్ణించారు. అప్పుడు ప్రత్యక్షమైనవాడు బ్రహ్మ. తారకుడు దీక్ష వహించినది పశు పతి కోసం అంటే శివుని కోసం. అయితే వచ్చిన వాడు బ్రహ్మ.

పురోహితవర్గ ప్రతినిధి బ్రహ్మ. ఎవరి గురించి తపస్సు చేసినా ముందు బ్రహ్మే ప్రత్యక్షమవుతూ ఉంటాడు. ఎవరి పనులైనా సరే పురోహితుల ప్రమేయం ఉండవలసిందే. తారకాసురుని జననమే తల్లికి జరిగిన అవమానానికి ప్రతీకారం కోసం. పురాణాలు ఆ సంగతిని పక్కకుపెట్టి తారకుని ఎదుర్కోవటానికి దేవగణాలకు సరైన సేనా నాయకుడు లేకపోవటం గురించీ, శివునికీ, పార్వతికీ జన్మించే కుమారుడే వారికి సరైన సేనాధిపతి కాగలడన్న జోస్యం గురించీ జనరంజకంగా కథలు అల్లి శివ, పార్వతుల ప్రణయం, వివాహం ప్రధానంగా కథ చెప్పాయి. పెళ్ళి వేడుకల వంటివాని వైపు పాఠకుల దృష్టి మళ్ళించాయి. శివుని వీర్యాన్ని పార్వతి నుంచి వరుసగా అగ్నికీ, రెల్లుగడ్డికీ, సప్త మాతృకలకూ బదిలీచేస్తూ అద్భుతంగా ఆశ్చర్యకరంగా కుమారుని పుట్టించారు. వైష్ణవం శైవంతో రాజీపడినట్టు నటించడం శైవమతం సహాయంతోనే శివుని నమ్ముకున్న ఆర్యేతరులను నాశనం చేయటం మతపరమైన వ్యూహం. మూల భారతీయ మతంలో పశుపతి (శివుడు) ఆరాధన ఉంది. ఆ మతాన్నీ సంస్కృతినీ ఆర్య మతం నాశనం చేసి బ్రహ్మను ముందుకు తెచ్చింది.

దక్షయజ్ఞం - సతీదేవి పార్వతిగా పుట్టటం - కుమారస్వామి జననం, అతనిని ముందుంచుకుని దేవగణాలు తారకుని ఓడించి చంపటం అనే రాజకీయ మంత్రాంగం

ఇక్కడ చూడవచ్చు. అధికారం కోసం పడే తాపత్రయాలు ఎప్పటికీ సమాజంలోని అట్టడుగు వర్గాలనే లక్ష్యంగా చేసుకుంటాయి. ఇవన్నీ తారక సంహార గాథలో కనిపిస్తున్నాయి.

ఎదుటి పార్టీ నుంచి బలమైన ప్రత్యర్థి రానున్నాడని ఊహించి ముందే జాగ్రత్తపడి ప్రత్యర్థి వర్గానికి చెందినవారిని తనవైపు తిప్పుకోవటం లేదా ప్రత్యర్థిని మించిపోయే బలాన్ని కూడగట్టుకోవటం అనే ఆలోచనలు అక్కడ సాగాయి.

తారకాసురుడు తల్లిదండ్రుల మూర్తిమత్వాన్ని పుణికి పుచ్చుకున్న ధీశాలి. శాంతి కాముకులూ, ధ్యానయోగాభ్యాస పరులూ అయిన తల్లిదండ్రుల వారసత్వం అతనికి ఉంది. అందుకే తపస్సుకు వెళ్ళాడు. బ్రహ్మ ప్రత్యక్షమై వరం కోరుకోమంటే తారకుడు అతనిని వరం అడిగిన తీరు అతని నిజాయితీకీ, ఆలోచనా ధోరణికి తార్కాణం.

తాము జాతిధర్మంగా దేవగణాలతో వైరం కలవారమనీ వారిచేత బాధలు పడుతున్నామనీ చెప్పి, తారకుడు తనకు దేవతలచేత, ఏ అస్త్రాలచేత, ప్రాణులచేత, మరణం లేకుండా వరం కోరాడు. "మరణం జీవికి సహజ ధర్మం. దాన్ని కాదనలేము. అందువల్ల ఎవరిమీద నీకు అనుమానం ఉందో ఆలోచించుకుని వారివల్లనూ, ఇతరుల వల్లనూ వధింపబడకుండా వరం కోరుకో" అని బ్రహ్మ సలహా ఇచ్చాడు. ఏడు రోజుల శిశువు వల్ల, భయం ఉండదని తారకుడు అనుకున్నాడు. ఏడు రోజుల శిశువు చేత తప్ప, ఇతరుల చేత చావు లేకుండా వరం పొందాడు. అప్పటి నుంచి శక్తి సంపన్నుడై విహరిస్తూ దేవగణాలను ఎన్నోసార్లు ఓడించాడు. లోకపాలకులు అతనికి సేవకులయ్యారు. చాలాసార్లు దేవగణాలు ముచికుందుని (బాలునిగా ఉన్న విష్ణువు) ముందు పెట్టుకుని ఓటమి తప్పించుకున్నారు. విష్ణువు బలితో పాతాళంలో ఉండిపోయినప్పుడు దేవతలు తారకుని చేతిలో ఓడిపోయారు. తారకుని చంపే ఉపాయాల కోసం అన్వేషించారు. తారకాసురునికి, దేవగణాలతో జరిగిన యుద్ధాలు ఒక్కో పురాణమూ, ఒక్కోరకంగా చెప్పింది.

తారకాసురుని పట్టణం మహీసాగర తీరంలో 12 యోజనాల విస్తీర్ణంలో ఉండేది. ఇంద్రుడు వజ్రాంగుని భార్యను బాధించినందువల్ల త్రైలోక్యలక్ష్మి ఇంద్రుని వదిలిపెట్టి తారకాసురుని చేరిందట. దేవతలు తారకుని ద్వారపాలకులుగా ఉన్నారు. దేవగణాలు కోతుల్లాగా, కొంగల్లాగా రూపాలు ధరించి దైత్యులను వినోదపరచారు. విష్ణువు కోతి రూపంలో, తారకుని ఎదుట నర్తించి అతని అనుగ్రహం పొందాడు. ఇదంతా కాల ప్రభావం అనీ , కాల ప్రభావం వల్లనే దేవగణాలు ఇలా ఉన్నాయనీ తత్వం తెలిసి ప్రవర్తించాలని విష్ణువు తారకాసురునికి ఉపదేశం చేసి వెళ్ళిపోయాడు. తారకాసురుని కాలంలో దిక్పాలకులుగా దైత్యులే ఉన్నారు. అగ్నిగా కాలనేమి, యమునిగా స్తంభుడు, నిరుతిగా మహిషుడు, వరుణుడిగా మేఘుడు, వాయువుగా ప్రజంభుడు, దిక్పాలక పదవులలో ఉన్నారట. స్కందపురాణం కూడా తారకుని వైభవాన్ని విపులంగా పేర్కొన్నది. (మొదటి మహేశ్వర ఖండం కౌమారికా ఖండం – కుమారేశుని మహాత్యం 15, 16,

17, 18 అధ్యాయాలు). అధికారంలో ఉన్నవారు చేసే అకృత్యాలకు శిక్ష తప్పకుండా ఉంటుందన్న నమ్మకం ఇలాంటి కథనాల వల్ల బలపడుతుంది.

ధర్మమూ, సత్యమూ తాత్కాలికంగా ఓటమి పొందినా వాటిని అవే కాపాడుకుంటా యంటారు. పూర్వపు రాజుల కథలలో కనబడేది అదే. శిక్షలు పడినా అధర్మం ప్రబలుతూనే ఉంది. ధర్మాన్ని అడ్డుకుంటూనే ఉంది. ధర్మాధర్మాల సమరం సాగుతూనే ఉంది.

తారకుడు బ్రహ్మను కోరిన వరం ప్రకారం, 'ఏడు సంవత్సరాల బాలుని వల్ల తప్ప అతనికి మరణం లేదు' అని చాలా పురాణాలు చెప్పాయి. మత్స్యపురాణం "ఏడు రోజుల బాలుని వల్ల" అని అంటున్నది. "శిశోర్వై సప్తవాసరాత్..." వాసరము అంటే రోజు అనీ అర్థం ఉంది. అంటే ఏడు రోజులు అనే. ఒక్కో పదానికీ సంస్కృతంలో నానార్థాలుంటాయి. అవి కొన్ని సందర్భాలలో పరస్పర వైరుధ్యంతోనూ ఉంటాయి. వాటిని సందర్భాన్నిబట్టి అర్థం చేసుకోవలసిందే. సవ్య అనే పదానికి కుడి, ఎడమ అని కూడా అర్థాలు. 'నాగ' శబ్దాన్ని కూడా నానార్థాలతో విస్తరించి, పాములుగా మానవజాతులనే చెప్పేశాయి. సంస్కృతాన్ని జటిలంగా రూపొందించుకోవటంలో సామాన్యులను వంచించే ఉద్దేశం కూడా ఉంది.

తారకుడు దేవగణాల మీదికి దండెత్తడాన్ని (అతని సేన - రథాలు - జెండాలు) విపులంగా వర్ణించారు. దానవసేనలో, వేయి గుర్రాలు, ఎనిమిది చక్రాలు కలిగిన రథా లున్నాయి. నాలుగు దంతాల మదపు టేనుగులు, నల్లని గుర్రాలూ, ఎక్కువ.

జెండాలపై మొసలి, పద్మం, పిశాచం - నక్క - గాడిద - కాకి వంటి రూపాలు చిహ్నాలుగా రాయించారు. ఏనుగులు - సింహాలు, గాడిదలు, చిరుత పులులూ రథాలు లాగేందుకు కట్టారట. ఉష్ట్రములు, చిరుత పులులు, ఒంటెలు, పొట్టేళ్ళనూ వాహనాలుగానూ చేసుకున్నారు. ఉత్తరీయాలు, తలపాగాలూ కొందరు ధరించారు. ఈ వర్ణనలన్నీ కాల క్రమంలో ఈ కథలో చేరినవే అయి ఉండాలి. సమకాలిక యుద్ధరీతులు ఇందులో చేర్చి ఉంటారు. అద్భుత భయానక రసాలు పండించటం కోసం అతిశయోక్తులూ ధారాళంగా చెప్పారు. ఇవన్నీ సామాన్య జనులను ఆకర్షించటానికీ - మభ్యపెట్టటానికీ.

తారకునికి దేవగణాలతో జరిగిన యుద్ధాలలో యక్ష, నాగ, కిన్నర, రాక్షస, పిశాచ గంధర్వ గణాలు, దేవగణాల పక్షాన ఉన్నారన్నారు. తారకుని సేనానులు గ్రసనుడు, జంభుడు, మహిషుడు, కాలనేమి, మథనుడు, జంభకుడు, శుంభుడు మొదలైనవారు. అసురసేన పదికోట్లు.

తారకాసురుని గురించి అన్ని పురాణాలూ చెప్పాయి. కథనాలలోని తేడాలనుబట్టి తారకాసురునికి దేవగణాలతో వైరం మతపరమైనది అనుకోవచ్చు. తారకుని సేనాని మహిషుడు బౌద్ధుడుగాని జైన ధర్మానుయాయి గాని కావచ్చు. "మహిషాసికాలు' అనేది ఆంధ్రలోని ఒక బౌద్ధశాఖ, తెలంగాణలోని నల్గొండ మెదక్ ప్రాంతాలు మహిష మండలంగా,

గుల్బర్గా (కర్నాటక) ప్రాంతం మహిసి మండలంగా పూర్వం వ్యవహారంలో ఉండేవి. ఇవి ఆర్యేతర మత ధర్మాలు వెలసిన ప్రాంతాలు. తారకునితో జరిగిన యుద్ధాలలో "గోబ్రాహ్మణ హితాయ గోవిందా" అంటూ ఆర్యగణాలు చాలా తరచుగా దేవగణాలను తలచుకోవటం, ప్రార్థించటం గమనిస్తే ఇది మత సంస్కృతుల పరమైన వైషమ్యమే అని స్పష్టపడుతుంది.

తారకుడు మొదటి నుంచీ యుద్ధ విముఖుడుగానే కనిపిస్తాడు. అయితే "దేవతలు యజ్ఞభాగాలను ఇంకా అనుభవిస్తూనే ఉన్నారు. స్వర్గంలో సుఖంగానే ఉన్నారు" అనే వాస్తవం అతనిని యుద్ధానికి పురికొల్పింది.

తల్లిదండ్రుల కోరిక తీర్చాలి కాబట్టీన్నీ బంధువులను సంతోషపెట్టాలి కాబట్టీన్నీ అతడు స్వర్గంపై దండెత్తాడు. ఈ యుద్ధంలో దానవులూ, దైత్యులూ, ఒక పక్షంగా ఉన్నారు. తారకుని రథం నాలుగు యోజనాల వైశాల్యం కలిగి ఇంద్రుని విమానంలాగా ఉన్నదట. అందులోనే క్రీడా గృహాలు, గీత వాద్యపు ఏర్పాట్లు ఉన్నాయట. ఆటలమీదా. సంగీతం మీదా అసురులకు మక్కువ ఎక్కువ. యుద్ధాలమీద వారికి ఆసక్తి తక్కువ. దైత్య స్త్రీలను వేధించటమూ, దైత్యులను చంపటమూ, యజ్ఞ భాగాలు తామే గ్రహించటమూ వంటి దేవగణాల చర్యలు అసురులను యుద్ధాలకు పురికొల్పుతూ వచ్చాయి. యుద్ధ వర్ణనలో అతిశయోక్తులు చాలా ఉంటాయి. అందులోనూ తారకాసురునికి దేవగణాల తోడి యుద్ధం అంటే కవులు మరింత విజృంభించి రాశారు. ఇంద్రుని రథానికి పదివేల గుర్రాలు కట్టారట. కొందరికి మేక, గొర్రె, లేడి మొ॥నవి వాహనాలు. వరుణుని వాహనాన్ని పాములు లాగాయి. అతని పాశం పాములాంటిదే. దేవతల జెండాల మీద హంస, గద్ద, గుడ్లగూబ గుర్తులున్నాయి. దేవసేన 33 కోట్లు. యుద్ధాలలో గారుడాస్త్రం, సావిత్రము అనే అస్త్రం, భుజంగాస్త్రం, ఆగ్నేయాస్త్రం, సోమాస్త్రం, వాయవ్యాస్త్రం, శైలాస్త్రం, త్వాష్ట్రాస్త్రం, ఐషీకాస్త్రం, శంబరాస్త్రం, మౌసలాస్త్రం, నారసింహాస్త్రం మొ।నవి ప్రయోగించారు.

ఒక దశలో 'కాలనేమి' విజృంభణకు దేవగణాలు జడిసి విష్ణువును తీసుకువచ్చారు. విష్ణువు జంభాసురుని చేతిలో ఓడి వెనక్కు వెళ్ళిపోయాడు. కాలనేమి, మహిషుడు మొ॥వారు అసంఖ్యాకంగా కోట్ల కొలది దేవగణాలను చంపారట. తారకుని సేనాని మహిషుడు స్త్రీ చేతిలోనూ, తారకుడు ఏడు రోజుల బాలుని చేతిలోనూ చావవలసి ఉంది కాబట్టి దేవ గణాలు వారిని జయించలేకపోయాయి.

తారకునితో జరిగిన యుద్ధాలలో చాలాసార్లు దేవగణాలు విష్ణువునో, బ్రహ్మనో సాయం తెచ్చుకున్నాయి. స్కందపురాణం అలాంటి సందర్భాలు చెప్పింది. అంతేకాకుండా 'గోబ్రాహ్మణ హితాయ-గోవిందా' అనే మాటలు చాలా తరచుగా ప్రయోగించింది. (స్కంద 19-48). ఈ యుద్ధాలలోని అసలు ఆంతర్యం వర్ణధర్మపాలన. దేవసేనలో ఇంద్రుని రథానికి కట్టిన గుర్రాలకు బంగారు గంటలు కట్టారు. అందరూ బంగారు నగలు అలంక రించుకున్నారు. యక్షులు, గంధర్వులు బంగారు సొమ్ములు ధరించారు. రాక్షసులు మాత్రం ఇనుప సొమ్ములు ధరించారు. విలువైన లోహాల నగలు ధరించకూడదనే ఆంక్ష వారిపై

అప్పటికే ఉన్నది. ఎముకల ఆభరణాలు కూడా కొందరు ధరించారు. శంఖాలు, గవ్వలు, పూసలూ, ఆభరణాలుగా ధరించవలసిన కులాలు అప్పుడు ఉన్నాయి, ఇప్పటికీ ఉన్నాయి.

ఇది నిశ్చయంగా జాతి, కుల వివక్ష లక్షణమే.

గ్రసనుడు తన పంచెతో యముడిని మూట కట్టి, పిల్లవాడిని తిప్పినట్టు గిరగిర తిప్పాడట. జంభుడు కుబేరుని రథాన్ని ముక్కలు ముక్కలు చేశాడు. కుజంభుడు నిర్ఋతి మీద - మహిషుడు వరుణుని మీద చేసిన పోరాటాలను చాలా వివరంగా వర్ణించారు. (మత్స్యపురాణం). ఇదంతా అద్భుత హాస్య రసాలు పుట్టించడానికే. ఎదుటివాడి దుఃఖాన్ని ఆనందించే మనస్తత్వం ఉన్న ఆర్య జనాలకోసమే కాబట్టి అవన్నీ సంస్కృతంలో (ఆర్యుల భాషలో) రాశారు.

ఈ యుద్ధంలో దేవగణాల పక్షాన సూర్యుడూ, చంద్రుడూ పాల్గొన్నారు. సూర్యుడు రెండు బాణాలను ఒకటి శంబరాస్త్రంతో, మరొకటి ఇంద్రజాలంతో అనుసంధించి వదిలాడట. వాటి ప్రభావంవల్ల దేవతలు దానవులుగా, దానవులు దేవతలుగా కన్పబడ్డారట. దాంతో కలకలం రేగింది. కాలనేమి భ్రమలో తనవారినే చంపటం మొదలుపెట్టాడు. చనిపోయేవారికి మరణ సమయంలో అసలు రూపం వచ్చేది. ఆ విషయం 'నేమి' అనే దానవుడు గ్రహించి కాలనేమికి చెప్పి బ్రహ్మాస్త్రం వేయించాడు. దాంతో పరిస్థితి కొంత సర్దుకుంది. కాలనేమి గొప్ప వీరుడు. పదివేల గంధర్వులనూ, ఐదు లక్షల యక్షులనూ అరవైవేల మంది రాక్షసులనూ, మూడు లక్షలమంది కింకరులనూ, ఇంకా అనేక దేవగణాలనూ చంపాడు. తర్వాత కాలనేమి విష్ణువుతో యుద్ధం చేశాడు. విష్ణువు నెగ్గలేకపోయాడు; కాని గ్రసనుడిని చంపాడు. శుంభునీ చంపాడు.

విష్ణువు మహిషునితో యుద్ధం చేశాడు కాని అతనిని చంపలేకపోయాడు. "స్త్రీ చేతిలో మరణిస్తావనే శాపం నీకు ఉంది కాబట్టి నిన్ను నేను చంపను" అన్నాడు.

గజాసురునితో, మథనునితో విష్ణువు యుద్ధం చేశాడు. ఇదంతా 6 అధ్యాయాలలో చెప్పారు. జంభాసురుని మరణంతో క్రుద్ధుడైన తారకుడు యుద్ధరంగానికి వచ్చి దేవగణాలను చెల్లా చెదరుచేసి, విష్ణువునూ, దేవగణాలనూ లోకపాలకులనూ కటికవాడు పశువులను కట్టివేసే విధంగా కట్టిపడేశాడు. ముల్లోకాలూ అతనికి వశపడ్డాయి.

తారకాసురుని కాలంలో దేవతలంతా కోతుల రూపంలోనే సంచరించారట. "ముల్లోకాలలోనూ ఉండండి. యజ్ఞాలలో భాగం అనేది మరచిపోండి" అని తారకుడు వారికి చెప్పాడు. యజ్ఞభాగాలు ఇక్కడ వివాద కారణాలు. (స్కందపురాణం)

తారకుని తత్వజ్ఞానాన్ని విష్ణువే మెచ్చుకున్నాడు.

బ్రహ్మ దగ్గరకు కూడా దేవతలు కోతుల రూపాలతోనే వెళ్ళితే ఆయన ఆశ్చర్యపడి "ఇక్కడ మీకు భయంలేదు మీ మీ రూపాలతో నిలవండి" అని చెప్పాడు. ఆయనే వారి గురించి ఒక పథకం వేశాడు. పథకం అంటే కుట్ర. మత్స్యపురాణంలో తారకుని

పరాక్రమం అయిదు అధ్యాయాలలో (147-152), వరకు ఉంది. 153 నుండి 159 వరకూ దేవగణాల వ్యూహం గురించి చెప్పారు. 159లో తారక సంహారం చెప్పారు.

దేవతల గోడు విన్నాక బ్రహ్మ విభావరిని తలచుకొన్నాడు. విభావరి అంటే ఆదిశక్తి. నిశాదేవి, కాళరాత్రి, మహామాయ అన్నీ ఆమెనే. ఆమె వెళ్ళి హిమవంతుని భార్య అయిన మేన శరీరంలో ప్రవేశించింది. పార్వతి పుట్టింది. శివుని వరించింది. వారి సమాగమం వేయి సంవత్సరాలు సాగింది. దేవతలు ఆత్రుతతో అగ్నిని లోపలకు పంపారు. ఆయన చిలుక రూపంలో లోపలకు వెళ్ళాడు. అప్పటికి శివుని వీర్యం సగం పార్వతిలో పడింది. సగం బయటే ఉంది. చిలుక (అగ్ని) అంతరాయంతో పార్వతి విముఖురాలయింది. ఆ సగం వీర్యాన్ని అగ్ని మింగాడు. వేడి భరించలేక దేవతలకు ఇచ్చాడు. వారూ భరించలేకపోతే అది బయటకు వచ్చేసింది. దానిని సరస్సులో రెల్లుగడ్డిలో ఉంచారు. అదే సరస్సులోకి పార్వతి స్నానానికి వెళ్ళింది. వీర్యం ఆమెలో ప్రవేశించింది. ఆ సమయంలోనే అక్కడికి మునుల భార్యలూ వచ్చారు. పార్వతి వాళ్ళని తాగటానికి నీళ్ళు అడిగింది. "నీ గర్భంలోని కొడుకు మాకూ కొడుకు అయ్యేలా ఒప్పుకుంటే నీళ్ళిస్తామన్నారు," వారు. ఇలాంటి కథలతో కుమారుడు ఆరు ముఖాలతో, ఆరు భాగాలుగా పుట్టాడు. అతనిని ఒకే బాలునిగా చేశారు. అతనిని "షణ్ముఖుడు" (ఆరు ముఖాలవాడు) అన్నారు.

ఆ బాలుడిని ముందు పెట్టుకుని దేవగణం తారకుని మీదికి వెళ్ళి అతనిని చంపింది. ఆ శిశువు ఆయుధాలు ప్రయోగించాడన్నారు. అదెంత నిజమో. ఇదీ తారక సంహారగాథ.

తమకు విధేయంగా ఉండని వారిని లోక కంటకులుగా ప్రచారంచేసి చంపటం రాజనీతి. దుష్టుల బారి నుంచి ప్రపంచ రాజ్యాలను రక్షించవలసిన బాధ్యత తమపై ఉన్నదంటూ ఇరవై ఒకటవ శతాబ్దంలో అగ్రరాజ్యాలు చిన్న రాజ్యాలపై చేస్తున్న దాడులు ఇలాంటివేను.

అతి దీర్ఘకాలం సాగిన యుద్ధాలు ఈ కథలో చాలా ఉండటంవల్ల యుద్ధరీతులు, నీతులు, వీరుల మనోభావాలు వివరంగా చెప్పే అవకాశం కవులకు లభించింది. ఆయా సందర్భాలలో తరచుగా వినబడే కొన్ని సూక్తులు ఇవి.

1. సేన చతురంగమయినట్టే నీతికీ చతురంగాలున్నాయి. రాజనీతిని, యుద్ధనీతినీ చర్చించిన సందర్భం.

2. దేవదానవులలో ముఖ్యులైన వారి మధ్య జరిగిన ద్వంద్వ యుద్ధాలలో వీరుల మనోభావాలు చెప్పారు. "నావంటి పనికిమాలిన వానివల్ల ప్రభువుకు అవమానం జరగకూడదు" అనుకుంటూ వీరులు తమ శౌర్యం ప్రదర్శించేవారట.

3. తన ఇష్టం ఇచ్చినట్టు ప్రవర్తించే వానికి గౌరవం ఉండదు. బలవంతుని అందరూ సేవిస్తారు. ప్రాణికి మరణం స్వాభావికం. వ్యర్థుడు ఆనందంతో బతికి లాభమేమిటి? వంటి మాటలతో యుద్ధరంగంలో వీరులను ప్రోత్సహించేవారు.

4. శోకం కలిగినప్పుడు శోకించకు, హర్షం కలిగినప్పుడు ఆనందపడకు. కామ భోగాలలో కోరిక వద్దు, వంటి సూక్తులు జైన బౌద్ధ ధర్మాల ప్రభావంగా కనపడతాయి.

5. కర్మఫలితం గురించీ, కర్మ గురించీ, సుఖదుఃఖాల గురించీ బోలెడన్ని చర్చలున్నాయి.

ప్రధాన కథలు లోకరీతిని చెబుతూనే హితోపదేశమూ, కర్తవ్య బోధ చేశాయి. వర్గ సమాజపు దౌష్ట్యాలనూ చెప్పాయి.

ఈ కథలో చాలా వృత్తాంతాలు, సంఘటనలు ఉన్నాయి. పార్వతి శరీర వర్ణం గురించి (నల్లనిదని) శివుడు పరిహసించటం, పార్వతి తెల్లదనం పొందటం - 'ఆది' అనే అసురుని కథ ఆసక్తికరమైనవి. తారకుని పక్షాన పోరాడిన దైత్య, దానవ వీరుల పేర్లు యుద్ధాల వివరాలు, ద్వంద్వ యుద్ధాలు, ఆయుధాలు, వీరులు ఒకరినొకరు ఎదుర్కోవటం వంటివన్నీ వివరంగా వర్ణించారు.

అసుర స్త్రీల విషయంలో ఆర్యులూ, దేవగణాలూ అమానుషంగా కర్కశంగా ప్రవర్తించిన సంఘటనలు, పురాణాలు చిన్నగా ప్రస్తావించాయి. స్త్రీలపై జరిగే అత్యాచారాలను తేలికగా పరిగణించటం అప్పుడూ ఇప్పుడూ ఒకే విధంగా ఉంది.

అసుర స్త్రీలు తమకు జరిగిన పరాభవాలను దిగమింగి ఊరుకోకుండా ప్రతీకారం తీర్చుకునే ఆలోచన చేయటం చాలా పురాణ కథలలో గమనించవచ్చు. దితి, వరాంగి తమ కొడుకుల ద్వారా కొంతలో కొంత శత్రువుపై పగతీర్చుకోగలిగారు. ఆ ప్రయత్నంలో అసుర వీరులు ప్రాణాలు పోయినాగాని ఆత్మగౌరవం కోసం నిలబడ్డారు. జాతి గౌరవాన్ని తమ స్త్రీల మానమర్యాదలనూ ప్రతిష్ఠాత్మకంగా తీసుకున్నారు.

రామాయణంలో శూర్పనఖ పాత్ర కూడా అదే తరహాలో నడిచింది. రామలక్ష్మణుల చేతిలో అవమానం పొంది ముక్కు చెవుల కోతతో గాయపడిన ఆమె కోసమే జనస్థాన యుద్ధం జరిగింది. జనస్థానంలో జరిగిన దురాగతానికి ప్రతీకారం చేసే లక్ష్యంతోనే రావణుడు సీతను ఎత్తుకు వెళ్ళటం, అది రామరావణ యుద్ధానికి దారితీయటమూ జరిగాయి.

అసుర స్త్రీలు రాజనీతి నైదుష్యం కలవారు. రామాయణ కథలో శూర్పనఖ రావణునికి బోధించిన రాజధర్మాలు సార్వకాలికమైనవి. (అరణ్యకాండ 33వ సర్గలో 24 శ్లోకాలు).

"రాజు సరైన సమయంలో సరైన పనిచెయ్యాలి. రాజ్యంలో జరుగుతున్న విషయాలు ఎప్పటికప్పుడు తెలుసుకోవాలి. నీకు ఎప్పుడూ అపకారాలు చేస్తుండే దేవ గంధర్వ దానవులతో విరోధపడి కూడా సరైన చారులు లేకుండా ఎలా ఉన్నావు? దండకలో రాముడు ప్రవేశించిన విషయమూ అతడు మునులకు అభయం ఇచ్చిన విషయమూ నీకు తెలియనే లేదు." అంటూ, శూర్పనఖ రావణుని చివాట్లు పెట్టింది. 34వ సర్గలో రావణునితోడి సంభాషణలోనూ ఆమె సునిశిత బుద్ధి వ్యక్తమవుతుంది.

# త్రిపురాసుర సంహారం

శివుడు అసురుల నగరాలను దహించివేసిన కొన్ని సంఘటనలు పురాణాల నుండి తెలుస్తున్నాయి. మత్స్య పురాణంలోనే రెండుచోట్ల రెండు రకాలుగా ఈ కథ చెప్పారు. బాణుడు నిర్మించిన త్రిపురాన్ని నాశనం చేయటం ఒకచోటా ((186-188 అధ్యాయాలు) మయాసురుడు నిర్మించిన నగరాలు నాశనం చేయటం మరోచోటా (127-139 అధ్యాయాలు) చెప్పారు. ఇవి కాకుండా తారకాసురుని కొడుకులు తారకాక్షుడు, విద్యున్మాలి, కమలాక్షుడు అనేవారు నిర్మించిన నగరాలూ శివుడు కూల్చివేశాడట.

అసుర నగరాల విధ్వంసాన్ని పురాణాలు ఇన్ని విధాలుగా చెప్పటాన్ని చారిత్రకంగా పరిశీలించాలి. సింధు నగరాల విధ్వంసం క్రీ.పూ. 2000-1500 మధ్య జరిగిందని చరిత్ర చెబుతున్నది. క్రీ.పూ. 2200-2000 ప్రాంతంలో సింధు నగరాలు ఉన్నత స్థితిలో ఉన్నాయనీ ఆ కాలంలోనే దక్షిణ దేశంలోనూ ఆ సంస్కృతి విస్తరించిందనీ కొందరు చరిత్రకారుల అభిప్రాయం. క్రీ.పూ. 2000-1500 మధ్యకాలానికి ఈ సంస్కృతి ధ్వంస మయింది. ప్రకృతి వైపరీత్యాలవల్లనో సింధునది వరదల వల్లనో సరస్వతి అంతర్ధానం వల్లనో ఆర్యుల దండయాత్రలవల్లనో ఆ విధ్వంసం ఎందువల్ల జరిగిందోగాని ఆ జ్ఞాపకాలు జానపద గాథలుగా రకరకాల కల్పనలతో ప్రచారమయ్యాయి. త్రిపురాల నిర్మాణ చాతుర్యమూ వైవిధ్యమూ గమనిస్తే హరప్పా నగరాలు గుర్తుకువస్తాయి. ఈ కథలు మొదట స్థానిక భాషలలో గ్రంథస్థమై ఉంటే వాటిని ఆర్యులు సంస్కృత భాషలో రాసుకున్నారేమో.

అన్ని సందర్భాలలోనూ శివుడు (స్థానిక అసుర గణాల దైవతం) లయకారుడుగా కనిపించటం ఆర్యుల కూటనీతి ఫలితంగానే అనిపిస్తుంది.

తారకాసురుడు చనిపోయేనాటికి అతని పిల్లలు చిన్నవాళ్లు. తల్లి వీరిని తీసుకుని పాతాళ లోకంలో తలదాచుకున్నది. వారు శుక్రాచార్యుని దగ్గర చదువుకున్నారు. పిల్లలు పెద్దవాళ్ళయ్యాక తల్లి వారికి తండ్రి గురించి చెప్పింది. దేవ/ఆర్యగణాలకు అసురులతో ఉన్న వైరం గురించి వారు తెలుసుకున్నారు. దేవగణాల మీద ద్వేషమూ కలిగింది. అన్న దమ్ములు ముగ్గురూ మేరు పర్వతంమీద నిరాహారంగా నిశ్చలంగా తపస్సు చేశారు. పది వేల సంవత్సరాలు గడిచాక బ్రహ్మ వచ్చాడు. ముగ్గురూ మూడు అమోఘమైన నగరాలు - ఆకాశగమన శక్తి గలవాటిని - కోరుకున్నారట. ధ్యాన బలంతో వారు తమ కోరికలు సాధించారు. ఎన్నెన్నో శక్తులూ పొందారు. (అసురులు) బలపడటం ఆర్య/దేవగణాలు సహించలేకపోయారు.

ఈ దేశానికి వలసలుగా వచ్చిన ఆర్యగణాల నాయకుడు బ్రహ్మ. నారాయణుడు వారిని పోషించే బాధ్యత తీసుకున్న ఆర్య నాయకుడు. బ్రహ్మ సృష్టికర్తగాను, నారాయణుడు

స్థితికారుడుగాను బలపడిన దశలో స్థానిక నాయకుడైన శివుడినీ (రుద్రుని) తమ కార్యకలాపాలలో కలుపుకున్నారు. అతనిని లయకారునిగా (విధ్వంసకునిగా) చేశారు. స్థానిక నాయకుడైన రుద్రుడు బ్రహ్మ విష్ణువుల మాయలకు లోనవుతూనే తన వర్గం వారిని కాపాడుకోవటానికి ప్రయత్నిస్తూ ఉంటాడు. అయితే లయకారునిగా ఆయనకు బాధ్యతలు ఇచ్చారు గనక సంహారం అతనికి తప్పనిసరి పని అయింది. ఇక్కడ సంహారానికి గురయ్యే వారు ఎక్కువగా అసురులే. శివుని మనుషులే.

సాధారణంగా పురాలను తగలబెట్టేవాడు ఇంద్రుడు. అతనికి పురందరుడు అని పేరు. అయితే త్రిపురాలు ఒక్కసారిగా కూల్చటం అతనికి సాధ్యంకాదు.

త్రిపురాసురుల నగరాలను ఏవిధంగా పడగొట్టాలా అని దేవగణాలంతా ఆలోచించి పథకాలు సిద్ధంచేశారు. రుద్రునిచేతనే ఆ పనిచేయించారు. రెండు వర్గాల మధ్య వైషమ్యాలున్నప్పుడు ఏదో విధంగా ఒకరొకరిపై కక్ష సాధిస్తుంటారు. ఇళ్ళూ, పొలాలూ, వాడలూ, తగులబెట్టటం కింది వర్గాల పేటలు తగలబడుతూండడం సాధారణ విషయం. స్థానికులు బలపడినప్పుడల్లా ఇలాంటి దహనాలు జరుగుతుంటాయి.

త్రిపురాసురులు గొప్పశక్తి గలవారు. వారిని ఏవిధంగానూ జయించలేము - అని దేవగణాలు తెలుసుకుని వారిని జ్ఞాన శూన్యులుగా, కర్మ శూన్యులుగా చేయటానికి కుట్రలు పన్నారట. మహా విష్ణువే బౌద్ధమతం ఉద్భవింపజేసి బుద్ధమత గ్రంథాలు తయారుచేసి శిష్యులను త్రిపురాలకు పంపాడట. బౌద్ధం తీసుకోవటంవల్ల వారి పుణ్యమూ శక్తీ అంతా పోయిందట. అసురులు బలహీనులయ్యాక దేవగణాలు గొప్ప ప్రయత్నంతో వారిని శివుని చేత చంపించారు. శివుడు ఆయుధాలు సమకూర్చుకునే వివరాలు జాంబవ మహాపురాణం చాలా వివరంగా చెప్పింది. అసురుల రక్తపు చుక్కలు ఎన్ని నేలపై పడితే అంతమంది రాక్షసులు పుడతారు కాబట్టి ఆ రక్తం కిందపడకుండా మహారూపంతో ఆదిశక్తి నేల అంతా నాలుక చాపి ఉంచిందట. శంకరుడు త్రిపురాసురులను నారాయణాస్త్రంతో సంహరించాడు. బౌద్ధంపై శైవమూ, వైష్ణవమూ కలిసికట్టుగా దాడులు చేయటం ఈ కథలో స్పష్టమవుతున్నది.

శైవాచార పరాయణులైన అసురులను బౌద్ధంతో సంపన్నమైన వారి సంస్కృతినీ నాశనం చేయటం ఈ కథలో స్పష్టంగా తెలుస్తున్నది. ఈ పనిలో వైష్ణవులు శివుడిని తమతో కలుపుకున్నారు. బౌద్ధం భారతదేశంలో సామాన్యుల మతంగా ఎదిగిన దశలో ఈ కథ ప్రచారంలోకి తెచ్చి ఉంటారు.

# తారకా మయ యుద్ధం

తారకాసుర వధ తర్వాత మరోకల్పంలో తారకా మయ యుద్ధం జరిగిందని మత్స్యపురాణం (170-177 అధ్యాయాలు) చెబుతోంది. దేవాసురుల మధ్య జరిగిన పన్నెండు యుద్ధాలలో ఇది ఒకటి. ఇదీ మత, రాజకీయ సాంస్కృతిక నేపథ్యం కలదే.

ఈ యుద్ధంలో తారుడు, మయుడు, కాలనేమి అనే అసుర ప్రముఖులు ప్రధానంగా పాల్గొన్నారు. వారి పేర్లలోని మొదటి అక్షరాలను కలిపి సంక్షిప్తంగా ఈ యుద్ధాన్ని "తారకా మయము" అన్నారట. సంక్షిప్త రూపాలు వాడటం – భారతదేశంలో చాలా పాతదే. విషయాన్ని సంక్షిప్తంగా సంకేత రూపాలతో చెప్పటమూ కనిపిస్తుంది.

తారకామయ యుద్ధం కృతయుగంలో వృత్రుని వధ తర్వాత జరిగిందని కొన్ని పురాణాలు చెప్పాయి. ఎప్పుడు జరిగినా ఇది ఆధిపత్యం కోసం జరిగినదే. ఈసారి పోరాటాలలో దైత్య, దానవ గణాలు ఒకపక్షంగా ఉన్నారు. యక్షులు పన్నగులు రాక్షసులు వీరితో కలవలేదు. వారు దేవగణాలకు మద్దతు ఇచ్చారు. ఇందులోని రాజకీయ ప్రయోజనాలు ఏమిటో? ఈ ఇరవయ్యొకటో శతాబ్దపు రాజకీయ పార్టీల సీట్ల సర్దుబాటు లాంటిదేదో అప్పుడూ అక్కడ ఉండి ఉండాలి. ఇది పూర్వకాలం నుండీ ఉన్న కుటిలనీతి. తారకామయ యుద్ధంలో మొదట దేవగణాలు ఓడిపోయాయి. వారు నారాయణుని శరణు వేడారు." మంచి రోజులు వస్తాయి; మీరు మళ్ళీ అధికారంలోకి వస్తా"రని హామీ ఇచ్చాడు అయన. (అధ్యాయం 170). తానే వారిని గెలిపించే బాధ్యత వహిస్తానన్నాడు.

నారాయణుడు రంగంలోకి దిగుతాడని తెలిసి దానవులు తామూ ఇంకొంచెం శ్రద్ధగా, పటిష్ఠంగా యుద్ధానికి సన్నాహాలు చేసుకున్నారు. బలాల సమీకరణ జరిగింది. పాదయాత్రలూ రథయాత్రలూ మొదలయ్యాయి.

దేవదానవుల యుద్ధ సన్నాహాలను పురాణకర్తలు అతిశయంగానే వర్ణించారు. మయుని రథం బంగారంతో తయారుచేశారట. అది నాలుగు చక్రాలతో విశాలంగా సముద్రంలాగా ఉన్నదట – రథ వైశాల్యం 1200 చదరపు మూరలు. వెయ్యి ఎలుగు బంటులు దాన్ని లాగుతున్నాయి.

విరోచనుని రథం వైశాల్యం ఒక కోసు. దానిని వేయి గాడిదలు లాగుతున్నాయి. హయగ్రీవుని రథాన్ని వేయి గుర్రాలు – త్వష్ట రథాన్ని ఎనిమిది ఏనుగులు – లాగుతున్నాయి. సింహాలు, పందులు, ఒంటెలు, మేఘాలు, ఏనుగులు, గుర్రాలు వాహనాలుగా చేసుకుని దానవ సైన్యం కదిలింది. హయగ్రీవుడూ, తారుడూ, మయుడూ విప్రచిత్తి కొడుకు శ్వేతుడూ, బలికొడుకు అరిష్టుడూ, ఖరుడూ, కిశోరుడు, లంబుడూ యుద్ధ వీరులలో ఉన్నారు. (అధ్యాయం 172). దేవగణాలలో ద్వాదశాదిత్యులు (12), వసువులు (8), రుద్రులు

(11), అశ్వినులు (2) మొత్తం 33 మంది దేవ ప్రముఖులున్నారు. వారి వారి సైన్యం - పరివారం అమితంగా ఉంది. యక్ష, గంధర్వ గణాలూ వారితో ఉన్నాయి. (అధ్యాయాలు 173, 174). దైత్యులను కలవరపెట్టటానికి ఇంద్రుడు తమస్సును (చీకటి) సృష్టించాడు. ఆ చీకటిని మయాసురుడు ఔర్వాగ్నితో పటాపంచలు చేశాడు.

ఔర్వాగ్నిని గురించి ఇక్కడ కొంచెం చెప్పుకోవాలి. ఊర్వుని పూర్వ వృత్తాంతమూ ఇక్కడ అవసరమే. ఔర్వుడు, ఊర్వుని కొడుకు. ఊర్వుడు గొప్పతపశ్శాలి. యోగాభ్యాస నిరతుడు. బ్రహ్మచారిగా ఉండిపోయాడు. పెళ్ళిచేసుకొని వంశాభివృద్ధి చేయవలసిందిగా అతనికి దేవగణాలు చెప్పాయి. తపస్సు మానేయాలన్నాయి. ఊర్వుడు అందుకు ఒప్పుకోలేదు. స్త్రీ సంపర్కం లేకుండానే తన శరీరం నుంచి కుమారుడిని పుట్టిస్తానన్నాడు. తనతొడ (ఊరువు)ను మథించి ఒక బాలుని పుట్టించాడు. పురాణాలు అతడిని ఔర్వుడుగా చెప్పాయి. మథనంవల్ల వేడి పుడుతుంది. ఆ బాలుడు ఉష్ణశక్తితో జన్మించాడు. ఉష్ణశక్తి కాబట్టి ఆ కుర్రవాడికి పుట్టగానే ఆకలి (జఠరాగ్ని) వేసింది. లోకాలన్నీ తినేస్తానన్నాడు. అందరూ అతనిని ఆపారు. అగ్ని చల్లారాలంటే నీళ్ళుండాలి. బ్రహ్మ ఉపాయంగా ఆ కుర్రవాడిని నీళ్ళలో ఉంచాడు. సముద్రం లోపల "బడబ" (ఆడు గుర్రం) ముఖం ఆకారంలో ఉండే ప్రదేశంలో ఆ బాలుడికి నివాసం ఏర్పాటుచేసి జలహవిస్సు (నీళ్ళు) ఆహారంగా ఏర్పాటు చేశాడు. సముద్రంలో ఉండే అగ్ని బడబాగ్ని - ఉప్పెనల్లాంటివి వచ్చినప్పుడు సముద్రంలోంచి పైకి ఎగసే జ్వాల గుర్రపు ముఖం ఆకారంలో ఉండటాన్ని ఆధునిక శాస్త్రవేత్తలు గుర్తించారు. ఇది శాస్త్రీయమైన అంశమే.

తన కాంతినీ తేజస్సునూ తండ్రి దగ్గర ఉంచి ఔర్వుడు సముద్రంలోకి వెళ్ళిపోయాడు. హిరణ్యకశిపుడు ఈ అద్భుతాన్ని చూసి ఊర్వుని శక్తి సామర్థ్యాలకు ముగ్ధుడయ్యాడు. దేవ గణాలు వెళ్ళిపోయాక ఊర్వునికి సాష్టాంగపడి అతనికీ అతని కుమారునికీ సేవకుడిగా ఉంటానన్నాడు. ఇతరుల శక్తి సామర్థ్యాలను గుర్తించటం, అభినందించటం అసుర లక్షణం.

ఊర్వుడు దైత్య గణాలకు ప్రసన్నుడయ్యాడు. వారికి అభయం ఇచ్చాడు. ఆ ఔర్వాగ్నినే ఇప్పుడు మయాసురుడు దేవగణాల మీద ప్రయోగించాడు. ఈ విషయాలు మత్స్య మహాపురాణంలో ఉన్నాయి.

ప్రకృతి ఉత్పాతాలకు మూర్తీకరణలు చేయటం వాటికి అనుగుణంగా రూపాలు ఊహించటం - వాటి గురించి కథలు అల్లటం లోకంలో ఉంది. ఔర్వాగ్ని కథ అలాంటిదే. దావాగ్ని, బడబాగ్ని వంటి రకరకాల అగ్నులు వ్యవహారంలో ఉన్నవే.

హిరణ్యకశిపుని కాలం నుంచీ ఔర్వాగ్ని దైత్యులకు సహకరిస్తూ ఉంది. ఔర్వాగ్ని సముద్రాలలోని వాయుపీడనం వల్ల సాధారణంగా బయటకు వస్తుంటుంది. దానివల్ల అపార జననష్టమూ ప్రకృతి సంపద నాశనం కావటమూ జరుగుతుంది - అలాంటి ఔర్వాగ్ని దైత్యులకు ప్రసన్నంగా ఉండేదీ అంటే వారి రాజ్యాలలో ఎలాంటి ఉత్పాతాలూ

జరిగేవి కాదన్నమాట. వారి దేశమూ రాజ్యాలూ సస్యశ్యామలంగా ఉండేవని అర్థం చేసుకోవాలి. అలాంటి రాజ్యాలు వశపరచుకోవాలని పక్క రాజులు ప్రయత్నించటం సహజమే. అసుర రాజ్యాలను ఆశించిన దేవగణాలదీ అదే లక్ష్యం. దేవగణాల అలసత్వమూ, భోగలాలసత పురాణాలలోనూ, వేదాలలోనూ స్పష్టంగానే ఉంది.

అసురులకు ధైర్యాన్నిస్తున్న ఔర్వాగ్నిపై దేవగణం దృష్టి సారించింది. ఔర్వాగ్నిని ఎదుర్కోవటానికి దేవతలు మంచు ఆయుధంగాగల చంద్రుడినీ వరుణుడినీ పంపారు. మంచు వానలతో ఔర్వాగ్ని చల్లబడింది. సముద్రం పొంగింది. వరుణుడు పాశం (తాడు)తో అసురులను చికాకు పెట్టాడు. (కట్టేశాడా?) అసురులను రక్షించటానికి మయుడు పర్వతాలు సృష్టించాడు. ఆ రాళ్ళతో వారు దేవగణాలను కొట్టారు. రాళ్ళదెబ్బలు (లాఠీ దెబ్బలు) తింటున్న దేవగణాలను అగ్నీ వాయువూ దూరంగా లాక్కుపోయి కాపాడుకున్నారు.

ఇక్కడ మయాసురుని గురించి కొంచెం చెప్పుకోవాలి. మయుడు అసురుడు. గొప్ప శిల్పి. ప్రతిభావంతుడు. అసురులకూ దేవగణాలకూ కూడా మిత్రుడు. వారికి చిత్ర విచిత్రమైన భవనాలూ, వస్తువులూ సమకూర్చేవాడు. "మయసభ" భారతంలో ప్రసిద్ధం. అలాంటి మయుడు దేవగణాలకు విరోధిగా ఉన్నాడంటే అది వృత్తి కులాలకూ ఆధిపత్య వర్గాలకు జరిగిన సంఘర్షణగా గ్రహించాలి. ప్రజలు – పాలకులు తమ తమ అస్తిత్వాల కోసం ఘర్షణలుపడుతూ ఉండటాన్నే పురాణాలు చిత్రీకరించాయి. మయుడు గొప్ప వీరుడు కూడా.

మయుడు, కాలనేమి దేవగణాలను భయ భ్రాంతులను చేశారు. తారకామయ యుద్ధ వర్ణన మత్స్యపురాణం 174–176 అధ్యాయాలలో ఉంది. ప్రత్యేకించి కాలనేమి నారాయణునితో యుద్ధం చేయటాన్ని 177వ అధ్యాయం చెబుతున్నది.

కాలనేమి నారాయణుని నిందిస్తూ, "స్త్రీలపట్ల, బాలురపట్ల దయలేనివాడు" అన్నాడు. అతని ధైర్యంతోనే దేవగణాలు అక్రమాలకు పాల్పడుతున్నారనీ యజ్ఞారంభాలలో నేతినీ హవ్య పదార్థాలనూ దక్షిణలనూ తీసుకుంటున్నారనీ ఆరోపణలు చేశాడు. సామాన్య ప్రజలను వంచిస్తూ ప్రయోజనాలు పొందుతున్న వర్గమూ, ఆ వర్గాన్ని కాపాడుకుంటూ వస్తున్న అధిష్ఠానమూ ఇక్కడ సూచితమవుతున్నాయి. పూర్వ సంఘటనలను కూడా కాలనేమి ప్రస్తావించాడు. మధుకైటభుల వధ, హిరణ్యకశిపుని వధ మొ॥ నవి గుర్తుచేశాడు. వీటిని "నారాయణుని" దుర్మార్గపు చర్యలుగా అసురులు ఖండిస్తూ వచ్చారు. ఆ హింసకు ప్రతీకారం గానే వారి యుద్ధ ప్రయత్నాలు సాగినట్లు కనిపిస్తాయి. సంప్రదాయ సాహిత్యం దేవగణాల కృత్యాలను సమర్థిస్తూ కథలు ప్రచారం చేసింది. అసురులను దుర్మార్గులుగా చూపింది. ఇప్పటి రాజకీయాల నేపథ్యంలో అర్థంచేసుకుంటే ఏవి ఆక్రమణ చర్యలో ఏవి దురాక్రమణ చర్యలో – ఏవి ఆత్మరక్షణ చర్యలో – ఏవి హత్యాకాండలో అర్థమవుతాయి. మౌలికంగా వీటి వెనక సిద్ధాంతపరమైన విభేదాలు. వర్గమూ, మతమూ, కులమూ ఉన్నాయి. ప్రకృతి

వనరులను చేజిక్కించుకోవాలనే దురాశ ఉన్నది. మతపరంగా లోకంలోని అన్ని తత్వాలనూ కాదని వైష్ణవాన్ని నిలబెట్టటం అనే లక్ష్యమూ ఉంది. జైన, బౌద్ధ, శైవ తత్వాలను నాశనం చేయటం అనే లక్ష్యమూ ఉంది. ఈ ప్రక్రియలో దౌర్జన్యాలు జరిగాయి, హింస జరిగింది. మతవ్యాప్తి కోసం ప్రపంచ దేశాలలోజరిగిన పోరాటాలను మతయుద్ధాలుగా చెబుతారు. కాని భారతదేశంలో వైష్ణవ/భాగవత మతవ్యాప్తి కోసం జరిగిన పోరాటాలు మతోద్యమాల స్థాయి దాటి విజృంభించాయనటానికి దేవాసుర సంగ్రామాలలోని ప్రతి కథా నిదర్శనంగా నిలుస్తుంది.

తారకామయ యుద్ధంలో కాలనేమిని విష్ణువు ఎదుర్కొన్నాడు. చక్రంతో అతని చేతులు నరికాడు. ఆ చక్రంతోనే అతని నూరు ముఖాలూ నరికాడు. కాలనేమికి నూరు ముఖాలున్నాయా? అవి దేనికి ప్రతీకలు? తలలు నరికినా కాలనేమి మొండెం నిలిచే ఉన్నదట. అప్పుడు గరుడుడు మహావేగంతో వచ్చి కాలనేమి మొండాన్ని పడగొట్టాడు. తలలు, మొండెము ఏ శక్తులకు ప్రతీకలుగా ఉన్నాయో. కాలనేమి నూరు ముఖాలూ, మొండెమూ సమతౌల్యంతో ఉన్నాయా? నూరు ముఖాలను ధరించగలిగిన ఆ శరీరం గరుడుని రెక్కల గాలికే పడిపోయిందా? ఇది ఎలాంటి వ్యవస్థకు ప్రతీకగా ఉన్నదో? అనేవన్నీ సమాధానాలు రాని ప్రశ్నలు.

నూరు ముఖాలు గల కాలనేమిని కాల పురుషునితో సమానంగా మత్స్యపురాణం వర్ణించింది. కాలనేమిని చంపేశాక విష్ణువు (నారాయణుడు) మిగిలిన దైత్యులను చంపేశాడు. ఆ రాజ్యాన్ని ఇంద్రునికి అప్పగించాడు. వామనావతారంలోనూ విష్ణువు చేసిన పని అదే. బలి నుండి రాజ్యం గ్రహించి ఇంద్రునికి ఇచ్చాడు.

ఇంద్రుడు రాజ్యాధిపతి కావటమే ఆ వర్గాలకు కావలసినది. ఇంద్రుని పాలనలో వర్ణధర్మం ఉంటుంది. బ్రాహ్మణులకు అగ్రకులాలకు అవకాశాలు ఉంటాయి. అగ్రహారాలు, భూములు, సన్మానాలు - సేవకగణం - యజ్ఞ యాగాలు - యాజమాన్య హక్కులు - అన్నీ వారివే. ఈ సుఖ జీవనం కోసమే వారు ఇంద్రుని పాలన కోరుకుంటారు. ఇది వర్గ సమాజం. ఈ వర్గ సమాజం కూలిపోవటంగాని - శిథిలం కావటంగాని వారు సహించరు. గోబ్రాహ్మణ హితం పేరుతో ఎంతయినా చేస్తారు.

గోబ్రాహ్మణులు అంటే - మత్స్యపురాణం వివరణ ఇచ్చింది. దాని ప్రకారం వేదం చదివిన విప్రులు గోబ్రాహ్మణులు. "గాశ్చ సూర్యో రసాంత్‌సోమో..." అనే శ్లోకంలో సూర్యుడు గోవులను చంద్రుడు రసద్రవ్యాలను తృప్తిపరుస్తారు అని చెప్పారు. ఇక్కడ గోవులు అంటే 'ఆవులు' అనే అర్థం కాదు. 'గో' శబ్దానికి గోవుల వంటి పశువులు, గ్రహాలు, తేజఃకిరణాలు, వేదాత్మక వాక్కు అనే అర్థాలున్నాయి. సూర్యుడు తృప్తిపరచేది గ్రహాలను - తేజః కిరణాలను. ఈ రెండింటిలో ఏ అర్థమయినా ఇక్కడ నప్పుతుంది. 'గో' శబ్దం బ్రాహ్మణులకు జతపరచినప్పుడు 'వేదవాక్కు' అనే అర్థంతో సమన్వయం

కుదురుతుంది. వేదాలు వల్లించే బ్రాహ్మణులు, లేదా తేజస్వంతులయిన బ్రాహ్మణులు అని చెప్పుకోవచ్చు.

'గో' అంటే "ఆవులు" అనే అర్థమూ బ్రాహ్మణ సమాజంతో జతపడి ఉంది. ఆవులు ఒకప్పటి వారి ముఖ్య ఆహారం – ఆస్తి కూడా ఆవులే. ఆవులు ఆహారంగాగల బ్రాహ్మణులు అనీ చెప్పుకోవచ్చు. వారికి ధనరాసులూ ధాన్యరాసులూ అవే. వేదాలూ సాధారణంగా పురాణాలలో బలమైన ఒక వర్గ సమాజమూ దానికి భిన్నమైన కొన్ని స్థానిక సమాజాలూ కనిపిస్తాయి. దేవగణాలది వర్గ సమాజం. ఆ సమాజంలో సుఖజీవనులూ, శ్రామికులూ, వృత్తులను కులధర్మాలుగా స్వీకరించిన/ఆచరించ వలసిన వర్గాలూ స్పష్టంగా కనబడతాయి. స్థానిక అసుర రాజ్యాలలో ఈ విభజనలు స్పష్టంగా కనబడవు. వర్ణ ధర్మాలను గురించి నిర్బంధాలూ భూస్వామ్యం ఒక వారసత్వ హక్కుగా స్థిరపరచుకునే ధోరణి దేవగణాల వర్గ సమాజంలో కనబడుతుంది.

తాత్విక ఆలోచనలలోనూ దేవ, ఆర్య, అసుర వర్గాలలో తారతమ్యం ఉన్నది. ఇహలోక సుఖాలను మరణానంతరం కూడా ఆశించే వర్గం దేవ – ఆర్య వర్గం. స్వర్గ సుఖాలూ, నిత్యయవ్వనమూ వారి ఊహలు. మరణం గురించీ మరణానంతర జీవనం గురిచీ తర్కించే అసురవర్గం అందుకు భిన్నమైనది. వారిది మరణాన్ని జయించాలనే ఆలోచన. అసుర రాజులు కొందరు అందుకోసం తపస్సులు చేశారు. వారిలో చాలామంది భౌతిక సుఖాలపట్ల విముఖులై ధ్యానతత్పరులై ఉండటమూ గమనించవచ్చు. శ్రమజీవనం – సమధర్మం – సమాన బాధ్యత – వారి విధానాలు. ఇటువంటివి నచ్చని దేవ/ఆర్య సమాజాలు భోగాలను అందించే ఇంద్రుని పాలననే కోరుకోవటంలో ఆశ్చర్యంలేదు. వర్తమాన రాజకీయాలలో కనిపించే ఈ వైఖరి ఉంది. అధికారకాంక్ష అధికార దుర్వినియోగమూ, సంపద/సుఖ జీవనం తమకే ఉండాలను కోవటమూ ఆ వైఖరి లక్షణాలే. ఆ లక్షణాలుగల పార్టీలనే అవకాశవాదులు అధికారంలోకి తెస్తుంటారు. ఎవరి ప్రయోజనాలు వారికి ఉంటాయి.

# త్రైపురము

అసురుల ప్రాంతాలను ఆక్రమించే పనిలో దేవ/ఆర్య గణాలు అసురుల నగరాలను తగలబెట్టటం చాలాసార్లు జరిగింది. వాటిలో కొన్ని పురాణాలలో నమోదు అయ్యాయి. దేవ గణాల విజయాన్నీ బలాన్నీ చాటుకోవటం కోసం వాటిని ప్రచారం చేశారు. విజేతలే చరిత్ర రాస్తారు.

దేవాసుర సంగ్రామాల్లో 'త్రైపురము'గా ప్రసిద్ధమైన యుద్ధం ఏడవదట. శివుడు త్రిపురాలను నాశనం చేయటం మత్స్య పురాణంలో 127 నుంచి 139వ అధ్యాయం వరకు చెప్పారు. మయుడు నిర్మించిన త్రిపురాన్ని దేవగణాలు ఎంతో ప్రయత్నంమీదనే కూల్చగలిగారు. ఇది తారకామయ యుద్ధం తర్వాత జరిగిన సంఘటన.

మయాసురుడనే అసురుడు దేవగణాలతో జరిగిన ఒక యుద్ధంలో ఓడిపోయాడు. అసురులు కష్టాలలో ఉన్నారు. వారిని బలశాలురుగా చేయాలన్నది మయుని సంకల్పం. ఆ సంకల్పంతోనే తపస్సు ఆరంభించాడు. అతనితోపాటు విద్యున్మాలి, తారకాక్షుడు అనే వారు కూడా తపస్సు చేయటం మొదలుపెట్టారు. వారి తపస్సు అతి తీక్షణంగా ఉంది. తపస్సు చేసి చేసి వారి శరీరాలలో మాంసం అంతా కరిగిపోయి రక్తనాళాలు కనిపిస్తున్నాయట. తపో తీవ్రతకు లోకాలు తగలబడిపోయే పరిస్థితి వచ్చింది. అప్పుడు వారి మధ్య బ్రహ్మ ప్రత్యక్షమయ్యాడు. మీ కోరిక ఏమిటో చెప్పండి అని అడిగాడు. మయుడు అతనికి ఇలా సమాధానం చెప్పాడు.

"యుద్ధంలో దైత్యులు దేవగణాల చేతిలో ఓడిపోయి దెబ్బలు తిన్నారు - కొందరు మరణించారు. కొందరు భయపడుతూ దిక్కుతోచకుండా ఉన్నారు. వారి కోసం నేను ఒక దుర్గం నిర్మించాలనుకుంటున్నాను నేను నిర్మించే ఆ త్రిపురం దేవతలకు చొరరానిదిగా ఎట్టి దుష్టశక్తులకు లొంగనిదిగా అభిచారక శక్తులకు - జల దోషాలకు - అగ్ని తేజస్సులకు - దేవతల ఆయుధాలకు చేరరానిదిగా ఉండాలి" అన్నాడు.

ఈ కోరిక విని బ్రహ్మదేవుడు నవ్వాడట. 'సద్వర్తనం లేనివానికి ఎవరికీ సర్వామరత్వం లభించదు. అమరత్వం కోరకుండా దుర్గ నిర్మాణం చేసుకో' - అన్నాడు.

"అలా అయితే, ఒకేసారి విడిచిన ఒకే బాణంతో మాత్రమే నేను నిర్మించే దుర్గం కాలిపోయే లాగనూ మేమూ ఆ దుర్గంతోనే కాలిపోయేలాగనూ అనుగ్రహించవలసింది" అని మయుడు కోరాడు - అలాగే అంటూ బ్రహ్మ (కలలో చూసిన ధనంలాగా) అదృశ్యమై పోయాడు.

త్రిపుర దుర్గంలో మూడు దుర్గాలు - కలిసి ఉండేటట్టుగా ఏర్పాటు చేశారు. నల్లని ఉక్కుతో చేసిన నగరం తారకాక్షునిది. వెండితో చేసిన దానికి విద్యున్మాలి, బంగారు

దుర్గానికి మయుడు అధిపతులు. ఒక్కొక్క నగరానికీ మధ్య దూరం శతయోజనాలు. అద్భుతమైన నిర్మాణం - కనీవినీ ఎరుగని యంత్ర సాధనాలు - సౌకర్యాలు - మహా ద్వారాలు - ప్రాకారాలు - గోపురాలు, మందిరాలు కలిగి ఉన్న ఆ నగరాలు తమ రాజు ఇష్ట ప్రకారం కదులుతుండేవి. ఒక పురాన్నుండి మరొక పురాన్ని వెలుపలికి తీసే ఏర్పాటూ ఉంది. పుష్యయోగంలో దానిని నిర్మించాడు. ఆ పురాలలో అసురులకు వేలకొద్దీ భవనాలు కట్టారట.

మత్స్యపురాణ 128, 129 అధ్యాయాలంతా నగర వైభవ వర్ణనమే ఉంది. ఆ నగరాలలో అధర్మం, అసత్యం అనేవిలేవు. అందరూ శివుని ఆరాధించేవారు. ధ్యానయోగ తత్పరులుగా సుఖసంతోషాలతో ఉన్నారు.

ఇక్కడి సుదీర్ఘ వర్ణనలు చూస్తే ఆ సంస్కృతి జైన, బౌద్ధాల సంస్కృతిగా కనిపిస్తుంది. వరుస యుద్ధాలతో అలసిన అసురులకు విశ్రాంతిగా ఈ దుర్గ నిర్మాణం జరిగిందంటే శ్రమణకుల "ఆరామాలుగా, బౌద్ధులు" విహారాలుగా ఆ నగరాలు నిర్మించారనుకోవచ్చు.

అసురులు సుఖంగా ఉండటాన్ని ఆర్య/దేవగణాలు సహించలేకపోయాయి. త్రిపుర నగరాలు ఎప్పుడు మీద పడతాయో అని భయపడుతున్నామనీ అసురులు తమను బాధిస్తున్నారనీ వారి భయంతో ఇళ్ళు వదిలి పారిపోయామనీ, భార్యాబిడ్డల పేర్లు కూడా మరచిపోయామనీ, ఎంతో వేదనలో ఉన్నామనీ బ్రహ్మకు ఫిర్యాదులు చేశారు. అసురులను అణచే ప్రయత్నం ఆరంభమైంది.

ఒక సంధ్యాకాలంలో లోభం, కోపం, కలహం అనే మూడు కలి లక్షణాలు నగరంలో ప్రవేశించాయట. అదే రోజు మయునికి చెడ్డకల వచ్చింది. ఆయన సభలో ఆ మాటచెప్పి ప్రజలందర్నీ సద్గుణాలతో ఇంద్రియ నిగ్రహంతో ధైర్యంగా ఉండాలని ఆదేశించాడు. ఆ మాటలు దైత్యులకు రుచించలేదు. కోపంతో అకార్యాలు/చెడ్డ పనులు చేయటం మొదలుపెట్టారు. వారిని చూసి మయుడు కూడా ఆలోచనలో పడ్డాడు.

త్రిపుర విధ్వంసం చేయగల శక్తిశాలి శివుడొక్కడే అని బ్రహ్మ చెప్పాడు. అంతా కలిసి శివుడి దగ్గరకు వచ్చి అతనిని స్తుతించారు. తమ సంపద అంతా అసురులు ఎత్తుకుపోయారనీ, స్త్రీలనూ తీసుకుపోయారనీ మొరపెట్టుకున్నారు. శివుడు వారికి అభయ మిచ్చాడు. శివునికి కావలసిన ఆయుధాలు - రథం - సారథీ ఎంత పటిష్ఠంగా సమకూర్చారంటే ఆర్య/దేవగణాలు తమ సర్వశక్తులూ అందుకే వినియోగించారు. రథం బాగానే తయారయింది. సారథిగా ఉండదగిన విష్ణువు బాణాన్ని ఆశ్రయించి ఉన్నాడు. సారథిగా ఇక ఎవరుంటారు అని ఆలోచిస్తుంటే బ్రహ్మ వచ్చి తానే సారథిగా ఉంటానని పగ్గాలు పట్టుకొన్నాడట - అలా బయలుదేరటాన్ని నారదుడు మయునికి చెప్పాడు. మళ్ళీ శివుని దగ్గరకూ వెళ్ళాడు. భీకరంగా యుద్ధం మొదలయింది. అసురులు ఓడిపోతున్నారు, మరణిస్తున్నారు. సేనా నాయకులు గాయపడుతున్నారు.

మయుడు ఈ పరిణామాన్ని ఊహించలేదు. యుద్ధరంగం నుంచి ఇంటికి వచ్చాడు. "అమృతరసంతో కూడిన పెద్ద బావిని నిర్మిస్తాను. గాయపడినవారినీ మరణించినవారినీ ఆ జలాలతో రసాలతో ఆరోగ్యవంతులుగా చేస్తాను" అని ఆలోచించాడు. వెంటనే నగరంలో 'అమృతరసా' అనే పేరుతో దిగుడుబావిని ఏర్పాటుచేశాడు. ఆ సంగతి తనవారందరికీ చెప్పాడు. ఆసురులు ఉత్సాహంతో రణరంగానికి వెళ్ళారు.

దేవగణాలు ఎంత ప్రయత్నించినా అసురులను జయించలేకపోతున్నారు. అసంఖ్యాకంగా అసుర సేనలు యుద్ధరంగంలో నిలుస్తున్నాయి. కారణాలు అన్వేషించటానికి మాయారూపాలతో నగరంలో ప్రవేశించి దిగుడుబావిని కనుక్కున్నారు. అగ్ని నగరంలో కల్లోలం సృష్టించాడు. విష్ణువు ఎద్దు రూపంలో కలకలం సృష్టిస్తూ వచ్చి బావి లోని రసాన్నంతా తాగేశాడు. బావిలో నీరులేకపోవడం భటులు గమనించి మయునికి చెప్పారు. నగర నిర్మాణం చేసేటప్పుడు బ్రహ్మ వైముఖ్యాన్ని మయుడు గ్రహించాడు. ఇదంతా వారి పన్నాగమే అని తెలుసుకుని ధైర్యంగా యుద్ధరంగానికి వెళ్ళాడు.

ఇంతలో పుష్యయోగం ఏర్పడింది. నగరాలు ఒకటిగా అయ్యాయి. శివుని బాణంతో వాటికి నిప్పు అంటుకుంది. నగరాలు కాలిపోతూ ఉన్నాయి. విద్యున్మాలి, కమలాక్షుడు యుద్ధంలో కూలిపోయారు. నగరాల శకలాలు నేల కూలుతున్నాయి. మయుడు దాక్కున్న నగరం కాలకుండానే సముద్రంలో పడిపోయింది. ఇంద్రుడు ఆ నగరాన్ని మయునీ శపించాడు. అయినా మయుధు సురక్షితంగా ఉన్నాడు. శివుని ప్రార్థించి ఆయన అనుగ్రహం పొందాడు.

శిలామయమైన ఒక ఇల్లు నిర్మించుకుని సుఖంగా ఉండవలసిందిగా శివుడు మయునికి చెప్పాడు. దేవతలు అప్పుడప్పుడూ అతనిని చూడటానికి వెళ్తుంటారని మత్స్యపురాణం చెబుతోంది. త్రైపుర యుద్ధానికి అసురుల భావజాలం ఒక కారణమై ఉండవచ్చు. మయుడు విశ్వకర్మ – విశ్వకర్మ కులాలవారు జైనాన్ని అభిమానిస్తారు. జైన సిద్ధులు రస విద్యలలో పారీణులు. మయుడు నిర్మించిన 'అమృత రసా' అనే బావి జైనుల సిద్ధ విద్యల వల్ల సాధ్యమై ఉండవచ్చు. నగర నిర్మాణమూ అపురూపమైనదే. అందువల్లనే ఆర్యులు పట్టుదలతో అసురుల నగరాలు కూలుస్తూ వచ్చారు. అసురుల మతాన్ని తుడిచిపెట్టటం వారి లక్ష్యం.

# అమృత మంథనము

పాల సముద్రాన్ని దేవగణాలూ దానవ దైత్య గణాలూ కలిసి చిలికిన కథ చాలా పురాణాలలో ఉంది. రామాయణంలోనూ ఈ కథ ఉంది. రామలక్ష్మణులను మిథిలకు తీసుకువెళ్తూ దారిలో విశ్వామిత్రుడు వారికి ఈ కథ చెప్పాడు. (బాలకాండ 45వ సర్గ). విషయం ఒకటే అయినా ఈ కథను ఒక్కో పురాణమూ ఒక్కోరకంగా చెప్పింది. అన్నింటి లోనూ ప్రధానాంశం ఒకటే, దేవతలూ అసురులూ కలిసి పాల సముద్రాన్ని చిలకటం - వచ్చిన అమృతాన్ని దేవతలు తీసుకోవటం.

లౌకిక దృష్టితో ఈ కథ పరిశీలిస్తే - శ్రమ - శ్రమ విభజన - శ్రామికుల విభజన - శ్రమ ఫలితాలు అందరకూ దక్కకపోవటం - శ్రమ ఫలాలను పంచటంలో మోసపూరిత ప్రవర్తన - వస్తు వినిమయ లోపాలు - చాలా చాలా కనిపిస్తాయి. పాల సముద్ర ప్రాంతాన్ని ఆధునిక గుజరాత్‌లోని కచ్ సముద్రపు మలుపుగా కొందరు పురాతత్త్వ వేత్తలు భావిస్తున్నారు. ఇది హరప్పా క్షేత్రమనీ అంటున్నారు. ముందుగా పురాణ కథలను పరిశీలిద్దాం.

పాల సముద్రం చిలికారు - అందులోంచి వచ్చిన శ్రేష్ఠమైన వస్తువులన్నీ దేవ గణాలలోని వారే తీసుకున్నారు. అమరత్వాన్ని ప్రసాదించే అమృతాన్ని సమంగా పంచుకోవాలనే నిర్ణయం జరిగినా అసురులను మోహపెట్టి మోసంతో అమృతం దేవగణాలే దక్కించుకున్నాయి. ఒక అసురుడు దేవగణాల పంక్తిలో చేరి అమృతం తాగాలనుకోవటం నేరం అయింది. అందుకు శిక్షపడింది. వర్గ స్వభావం ఇక్కడ స్పష్టంగానే ఉంది. అమృత మథనం కథను ఏ పురాణం ఎలా చెప్పిందో పరిశీలిద్దాం.

మత్స్య పురాణం (అధ్యా. 248-250) ప్రకారం కథ ఇలా ఉంది. అసురులు విద్యాబల సంపన్నులు. వారి గురువైన శుక్రాచార్యునికి మృతసంజీవనీ విద్య తెలుసు. శంకరుని అనుగ్రహంతో ఆ విద్యను ఆయన సాధించాడు. దేవ, యక్ష, రాక్షస, నాగ గణాలకు, ఇంద్రునికీ ఉపేంద్రుడైన విష్ణువుకూ కూడా ఆ విద్య తెలియదట. సురాసుర యుద్ధాలలో గాయపడిన తన వారిని శుక్రుడు ఆ విద్యతో ఆరోగ్యవంతులను చేస్తూ బ్రతికిస్తూ ఉండేవాడు. ఆర్య దేవగణాలు వందలు - వేలు - గాయపడుతూ ఉండేవారు. మరణిస్తుండేవారు. ఈ పరిస్థితి ఎదుర్కోవటానికి వారు అమరత్వం పొందాలనుకున్నారు. 'అమృతం తాగితే అమరత్వం సిద్ధిస్తుంది' అని బ్రహ్మ చెప్పాడు. "అమృతం సాధించే శక్తి మీకు లేదు. దానవులతో సఖ్యంగా ఉండండి. వారి సహాయంతో పాల సముద్రాన్ని మథిస్తే అమృతం పైకి రాగలదు." అనీ సలహా ఇచ్చాడు.

అప్పటికి బలి ముల్లోకాలకూ అధిపతిగా ఉన్నాడు. దేవగణాలు అప్పటికే ఆయన చేతిలో అపజయం పొంది ఉన్నాయి. అయినా "బలిని స్వామిగా చేసుకొని సేవించి అతని సహాయం పొందండి" అని చెప్పిన బ్రహ్మ సలహా ప్రకారం దేవగణాలు 'బలి' దగ్గరకు వెళ్ళి సఖ్యంగా ఉందామని ప్రతిపాదించాయి. శాంతి చర్చలు జరిగాయి. "మీరు చెప్పినట్టే చేద్దాం" అన్నాడు బలి. "నేనొక్కడినే పాల సముద్రాన్ని మధించగలను. అమరత్వం కోసం అమృతాన్ని తేగలను. శత్రువులైనా గాని మీరు చాలా దూరం నుండి చాలా కాలానికి వచ్చారు. ఆశ్రితులను భక్తితో పూజించనివాడు (ఇహానికీ పరానికీ) నాశనమైపోతాడు. కాబట్టి మీ మాట మన్నిస్తాను" అన్నాడు. బలి అంతటి స్నేహశీలి.

పాల సముద్రాన్ని మధించే ప్రయత్నాలు మొదలయ్యాయి. శేషుడు మందర పర్వతాన్ని చుట్టుకుని పెకలించి సముద్రంలో పడేశాడు. దానికింద విష్ణువు తాబేలుగా కుదురు కున్నాడు. సర్పరాజు కవ్వపుతాడుగా అయ్యాడు. అతని ముఖంవైపు పట్టుకుంటే విషం తమమీద పడుతుందేమో అని దేవగణాలు భయపడ్డాయి. తోకవైపు పట్టుకున్నారు. దానవులు ముఖంవైపు పట్టుకున్నారు. ఈ చిలకడం దివ్య శత సంవత్సరాలు సాగింది. దేవగణాలు అలసిపోయినప్పుడల్లా బ్రహ్మవారిని ప్రోత్సహిస్తూ వచ్చాడు – "ఉద్యోగ వంతులకే సంపదలు లభిస్తాయి ప్రయత్నించండి" "(...అవశ్యముద్యోగ వతాం శ్రీ రపారాభవేత్సదా...") అంటూ చెప్పేవాడట.

ఈ క్రమంలో మందర పర్వతం మీద ఉన్న జంతువులు – చెట్లు అన్నీ సముద్రంలో పడి చూర్ణమవుతూ వచ్చాయి. అదంతా వారుణి (మద్యం) అయిందట. ఆ వాసనకే వీరంతా బలవంతులయ్యారట.

చాలాకాలానికి సముద్రంలోంచి పాములూ రకరకాల రౌద్రప్రాణులు బయటికి వచ్చాయి. తర్వాత విషరాజమైన కాలకూటం (భయంకరాకృతి, భయంకరమైన కళ్ళు ఉన్న పురుషాకృతి) కనబడింది. 'నీవెవరవు' అని నారాయణుడు ఆ విషాన్ని అడిగాడు.

"నేను కాలకూటాన్ని. పరస్పరం చంపుకునే దేవదానవులు సఖ్యంగా కలిసి ఉండటం – ఒకటై సాగరాన్ని మధించటం నేను సహించను. అందర్నీ వధిస్తాను" అన్నది ఆ విషం. ఏ ఇద్దరూ కలిసి ఉండటాన్నీ సహించలేని సామాజిక స్వభావానికి ఈ మాటలు అద్దంపడుతున్నాయి. "అందర్నీ మింగేస్తాను. నేను మిమ్మల్ని మింగనా? మీరు నన్ను మింగుతారా?" అని కూడా కాలకూటం అడిగింది.

దేవదానవులు భయపడ్డారు. పని ఆపేసి శంకరుని దగ్గరకు పరుగెత్తారు. ఆ విష జ్వరం నుంచి రక్షించవలసిందిగా స్తుతించారు. "రక్షాస్మాన్...విషజ్వరాత్" అంటూ. కాల కూటం విషజ్వరానికి సంకేతమా? అనేది ఆలోచించాలి. శివుడు వచ్చి దాన్ని మింగుతానన్నాడు. కాలకూట విషం నీడ ఉన్నచోట నిలబడి ఎడమచేతితో దానిని తీసుకుని తాగి వెళ్ళిపోయాడు. ("ఛాయా స్థానం సమాస్థాయ సోఽపిబద్వామ పాణినా...") ఆ విషాన్ని కంఠంలోనే ఉంచుకోవలసిందిగా దేవదానవులు శివుడిని కోరారు.

ఆ తర్వాత ఆయుర్వేద ప్రజాపతి ధన్వంతరి, మదిర, కామధేనువు పాల సముద్రంలోంచి వచ్చారు. సంపదనంతా దేవగణాలే అందుకున్నాయి. అంతకు ముందు వచ్చిన లక్ష్మినీ కౌస్తుభమణినీ విష్ణువు తీసుకున్నాడు. ఐరావతమనే ఏనుగును, తెల్లని గుర్రాన్నీ, కుండలాలనూ ఇంద్రుడు తీసుకున్నాడు. ధన్వంతరిని సూర్యుడూ, గొడుగును వరుణుడూ; పారిజాత వృక్షాన్ని వాయువూ దగ్గర పెట్టేసుకున్నారు.

అమృతం నిండిన కమండలంతో ధన్వంతరి రాగానే దానవులు అందుకోవటానికి ఆతృతపడ్డారు. అదే సమయంలో నారాయణుడు అందమైన స్త్రీరూపం ధరించి అక్కడికి వచ్చాడు. దానవులు దైత్యులూ తాము లాక్కున్న అమృతాన్ని ఆమె చేతికి ఇచ్చి తాము దేవ గణాల మీదకు ఆయుధాలతో పరుగెత్తారట. ఆ సమయంలో మోహిని రూపంలోని నారాయణుడు అమృతాన్ని దేవతలకు అందించేశాడు.

దేవతలు అమృతం తాగుతుండగా రాహువు అనే అసురుడు గమనించి దేవతల వైపు వెళ్ళి అమృతం తాగబోయాడనీ సూర్యచంద్రులు అది గమనించి చెప్పగానే నారాయణుడు చక్రంతో రాహువు కంఠం నరికేశాడనీ మత్స్యపురాణం చెబుతోంది. ఒక వైపు యుద్ధం జరుగుతూనే ఉంది. విష్ణువు మోహిని రూపం వదలి యుద్ధంలోకి దిగాడు. అప్పుడు నరుడూ వచ్చాడు. నరనారాయణులు కలిసి అసురులను సముద్రంలోకి తరిమేశారు.

ఇంకా అమృతం మిగిలి ఉంది. దాన్ని భద్రపరచవలసిందిగా విష్ణువుకు అప్పగించారు. మత్స్య పురాణం ఇంతవరకు చెప్పింది.

విష్ణువు జగన్మోహినిగా అవతరించి అసలు అమృతాన్ని దేవగణాలకూ నకిలీ మద్యాన్ని రాక్షసులకూ పంచాడని ఆదిజాంబవ పురాణం చెబుతోంది. దేవాసురులు కలిసి పాల సముద్రం చిలకటం – వచ్చిన వస్తువుల పంపకం వంటివన్నీ ఇతర పురాణాలు చెప్పినట్టే ఉన్నాయి. రాహువు దేవగణాల పంక్తిలో కూచుని అమృతం గ్రహించటం చూసి సూర్య చంద్రులు విష్ణువుకు సైగచేశారనీ, మోహిని తన కొప్పున దాచిన చక్రంతో రాహువు శిరసు ఖండించిందనీ ఒక పాము తలను ఆ మొండానికీ, అతని తలను పాము శరీరానికీ అతికించిందని జాంబవ పురాణం చెబుతోంది. పరబ్రహ్మ స్వరూపుడే నవగ్రహాలు నిర్ణయించి రాహువునూ, కేతువునూ స్థానాలలో నిలిపాడనీ గ్రహణాలు నిర్ణయించాడనీ అందులో ఉంది.

అమృత మథనం కథ స్కంద పురాణంలో మరిన్ని విశేషాలతో ఉంది. (అధ్యాయం-9).

దేవరాజయిన ఇంద్రుడు కొలువై ఉండగా దేవగురువు బృహస్పతి అక్కడకు వెళ్ళాడు. అందరూ ఆయనకు నమస్కారాలు/ప్రణామాలు చేశారు. ఇంద్రుడు గర్వంతో ఆయనను గమనించనట్టే ప్రవర్తించాడు. గురువును అవమానించిన ఫలితంగా ఇంద్రుడి సంపద సముద్రంలో పడిపోయింది. దానవేంద్రుడయిన బలి చేతిలో ఇంద్రుడు ఓడిపోయాడు. ఇంద్రుడు తన సంపద తిరిగి పొందటం కోసం సముద్రం చిలకవలసి వచ్చింది.

ఇది స్కందపురాణం గనక శివునిపరంగా కథ నడిపారు. ఆదిశేషునికి బదులు వాసుకి కవ్వపు తాడు అయ్యాడు. మందర పర్వతాన్ని విష్ణువే లేపి తెచ్చి సముద్రంలో ఉంచాడు. కాలకూటానికి ముందు బడబాగ్ని పుట్టింది. కాలకూటం సెగకు విష్ణువు నల్ల బడ్డాడు. లోకాలన్నీ ఆ సెగలో కప్పుకుపోయాయి. ఆ దశలో శివుడు వారిని రక్షించాడు.

"మృత్యుంజయుడనైన నన్ను కాదని అమృతం కోసం సాగర మథనం చేస్తారా? అందుకే అందరూ మృత్యువు పాలబడ్డారు" అన్నాడట శివుడు. ఇక్కడ శివతత్వాన్ని విశేషించి చెప్పారు. ఆత్మ, లింగజ్ఞానం – యోగం వంటి విషయాల చర్చ చాలా ఉంది. బ్రాహ్మణ ప్రశంస, కులాల ప్రసక్తీ ఉన్నాయి.

శరణుజొచ్చిన బ్రాహ్మణుని, రోగిని, వృద్ధుడిని తప్పక రక్షించాలట. అలా రక్షించని వానికి బ్రహ్మహత్యా దోషం తగులుతుంది. ఇలా చెప్పి కొన్ని కులాల ఆధిపత్య భావజాలాన్ని సమర్థించారు. శివ ప్రశస్తి గణేశపూజ వంటివి ప్రవేశపెట్టారు.

ముందుగా కార్యసిద్ధి కోసం గణేశుడిని పూజించవలసి ఉండగా మీరు అలా చేయలేదు. "గణేశునీ దుర్గనూ పూజించని వారికి కష్టాలు తప్పవు" అంటూ శివుడు అందర్నీ మంద లించాడు. దేవగణాలు గణేశ పూజా విధానం – తెలుసుకొని పూజచేసి వచ్చారట. దైత్యులు అలా చెయ్యలేదు.

తిరిగివచ్చి మళ్ళీ సముద్రాన్ని చిలికారు – అందులోంచి చంద్రుడు బయటకు వచ్చాడు – ఇక్కడ ఇంద్రుని పూర్వ కథ చెప్పారు. చంద్రుడు పుట్టిన ముహూర్తం, గ్రహ బలాలు చూడటం – వంటి కర్మకాండ చెప్పారు. పాల సముద్రంలోంచి వచ్చిన వస్తువుల జాబితాలోనూ మార్పులున్నాయి. అవి తీసుకున్న వారంతా దేవగణాలే. దైత్యులకేమీ రాలేదు. ధన్వంతరి అమృత కలశంతో రాగానే "ఇది మాకు" అని దైత్యులన్నారు. వారి నాయకుడు వృషపర్వుడు. ఆ పాత్రతో పాతాళానికి బయలుదేరాడు – దేవగణాలు పోట్లాటకు దిగాయి. "మీరు స్వార్థపూరితంగా మాతో మైత్రి చేశారు" అని బలి అన్నాడు. దేవతలను బెదిరించి పంపేశాడు.

దేవతలు విష్ణువుని ఆశ్రయించారు. ఆయన అందమైన స్త్రీ రూపంతో దైత్యుల దగ్గరకు వెళ్ళాడు. ఆమెను చూసి అంతా ఒకరకమైన భ్రాంతిలో పడిపోయారు. బలి ఆమెను గౌరవంగా చూశాడు. అప్పటికి దైత్యులు తమలో తాము వివాదపడుతున్నారు. అందరికీ అమృతం పంచేపని బలి ఆ స్త్రీకి అప్పగించాడు.

"బుద్ధిమంతులు స్త్రీలను నమ్మరు. ఈ పనికి నన్ను ఎలా నియోగిస్తున్నారు" అని ఆ స్త్రీ (మోహిని) బలిని అడిగింది. స్త్రీల చంచల స్వభావాన్ని చెప్పటానికి కవులు ఈ ఘట్టాన్ని ఉపయోగించుకున్నారు.

స్త్రీల దుర్గుణాల గురించి మోహిని చేతనే చెప్పించి, స్త్రీల స్వభావాన్ని వక్రీకరించి ప్రచారం చేశారు. స్త్రీల దుర్గుణాలు చాలా విస్తారంగానే చెప్పారు. ఆ మాటల ద్వారా స్త్రీలకు అప్పటి సమాజం ఇచ్చిన స్థానం ఎలాంటిదో తెలుసుకోవచ్చు.

"బుద్ధిమంతుడు స్త్రీలపై నమ్మకం ఉంచడు. అబద్ధం, సాహసం (అనాలోచితంగా పనిచేయటం), మాయ, కపటం, మూర్ఖత్వం, అతిలోభం, ధూర్తత, శుచిలేకపోవటం, దయ లేకపోవటం, స్త్రీల స్వభావ గుణాలు.

క్రూరమృగాలలో తోడేళ్ళు ఎలా హింసా స్వభావం కలిగి ఉంటాయో పక్షులలో కాకి, జంతువులలో నక్క ఎలా ధూర్తులో, మనుషుల్లో స్త్రీ కూడా అంతే" అన్నాడట, విష్ణువు (మోహిని రూపంలో) – "ఆలోచించకుండా నా గురించి తెలియకుండా, ఈ పని నాకు అప్పగిస్తున్నారు" అనీ అన్నది మోహిని.

"అవన్నీ పామర – గ్రామ్య జనాల మాటలు. అవి నీకు వర్తించవు. నేను చెప్పినట్టు చెయ్యి" అన్నాడు బలి. "మీకు శుభం కలగాలంటే ఈ రోజు ఉపవాసం ఉండి రేపు అమృతాన్ని సేవించండి" అని సలహా యిచ్చింది మోహిని. ఆమె అందానికి ముగ్ధులయి ఉన్న దైత్యులు అన్నింటికీ ఒప్పుకున్నారు. మయుడు మంచి భవనం ఏర్పాటు చేశాడు – మర్నాడు అందరూ శుచిగా అక్కడ సమావేశమయ్యారు. వరుసగా కూర్చున్నారు.

బలి, వృషపర్వుడు, నముచి, శంబుడు, సుదంష్ట్రుడు, సంహ్లాది, కాలనేమి, విభీషణుడు, వాతాపి, ఇల్వలుడు, కుంభుడు, నికుంభుడు, ప్రచ్ఛదుడు, సుందుడు, ఉప సుందుడు, శుంభుడు, నిశుంభుడు, మహిషుడు, మహిషాక్షుడు, బిడాలాక్షుడు, జృంభణుడు, వృషాసురుడు, బాహుకుడు, ఘోరుడు – ఇంకా ఎందరో ఉన్నారు. రాహువు కేతువు కూడా వారిలో ఉన్నారు. ఆ వరుసల్లో – దైత్యులు అమృతపానానికి కలశాలు (గ్లాసులు) పట్టుకుని సిద్ధంగా ఉండగా అక్కడికి వడ్డించేవారి వేషాలతో దేవతలు ప్రవేశించారు. "వీరంతా మన అతిధులు" అన్నది మోహిని. "వీరికి కూడా ఏమైనా ఇవ్వవలసిందే – కేవలం తన కడుపు నింపుకునేవాడు దుఃఖాల పాలవుతాడు. ఇతరులకు ఉపకారం చేసేవాడే ధన్యుడు." అంటూ ధర్మపన్నాలు వల్లించి దైత్యులను భ్రమింపచేసింది. బలి కూడా 'సరే' అన్నాక వారినీ అమృతం తాగటానికి పిలిచారు.

"అతిధులను ముందు గౌరవించాలన్న"ది మోహిని. "నీకెలా ఇష్టమైతే అలాగే చెయ్యి" అన్నాడు బలి. అమృతం ముందుగా వారికి (దేవతలకు) వడ్డించటం మొదలు పెట్టింది. లోకపాలురు – గంధర్వులు – యక్షులు – అప్సరసలు మారువేషాలతో ఉండి కడుపారా అమృతం తాగుతున్నారు. అమృతం దైత్యులవరకూ రావటం లేదు.

అభిమానంతో బలి – ఇతర దైత్యులు అలా చూస్తూ ఉండిపోయారు. రాహువు, కేతువు గుట్టుగా వేరే రూపాలు ధరించి అవతలి పంక్తిలోని వెళ్ళారు. సూర్యచంద్రులు అది గ్రహించి మోహినికి చెప్పారు. అమృతం గొంతు దిగకుండానే రాహువు తల తెగిపడింది.

అప్పటికి దైత్యులు మోహం నుంచి బయటపడ్డారు. దేవగణాలను తరమటం మొదలుపెట్టారు. అమృతం తాగిన ఉత్సాహంతో దేవ సైన్యాలు నిలబడి యుద్ధం చేశాయి. బలి సహకారంతో లాభపడిన ఇంద్రుడు బలి వివేకాన్ని అపహసించాడు. "శత్రువును నమ్మటం నీ అవివేకం" అని ఎత్తి పొడిచాడు. ఈ ఘట్టమంతా రాజనీతి సూక్తులతోనూ

యుద్ధ వర్ణనలతోనూ నిండి ఉంది. ఎవరు ఎవరిని ఎలా ఎదుర్కొన్నారో, పీడించారో అద్భుత భయానక రసాలతో వర్ణించారు. దైత్యుల వాహనాలు, పులులూ, గుర్రాలూ, ఏనుగులూ, శార్దూలాలు, నెమళ్ళు, కోళ్ళు, రాజహంసలు, ఒంటెలు, గాడిదలు మొ।నవి. ఆయుధాలూ అంతే - కత్తులు, పరిఘలు, శూలాలు మొ।నవి. రాజులు విమానాలు ఎక్కి యుద్ధం చేశారు.

దేవతలు కొత్త కొత్త బాణాలు వాడారు. ఇది శైవ పురాణం కాబట్టి శివుని స్తుతించారు. లింగపూజ గురించి చెప్పారు. (13, 14 అధ్యాయాలు) మొదట దేవగణాలు ఓడినా శివుడిని స్తుతించి తమవైపు తిప్పుకుని చివరకు విజయం సాధించారు.

ధర్మం - అధర్మం - అనేవాటిని పక్కన పెట్టేసి బలవంతులయిన నాయకుల అండతో నెగ్గే రాజకీయ పార్టీల వ్యవహారం ఇక్కడ కనిపిస్తుంది. దైత్య నాయకులలో కాలనేమి విష్ణువును ఎదిరించి పోరాడాడు. అతడు చివరకు విష్ణుభక్తుడయినట్టు చెప్పారు. "యుద్ధాలు - మరణాలు అశాశ్వతం. యుద్ధంలో మరణించినవారు దేవతలవుతారు... ఈ జన్మలో ఏమీ వద్దు కాని నీవు నాకు వేరొక జన్మలో వైరభావంతో కైవల్యం ఇవ్వాలి" అని విష్ణువును కోరాడట. విష్ణు శరణాగతిని చెప్పటం, విష్ణువు పరమ పురుషుడని ప్రజలను భ్రమింపచేయటం మూఢ భక్తిని ప్రచారం చేయటం వంటివి ఇలాంటి ఘట్టాలలో పురాణాలు వినిపించాయి. విష్ణువు, శివుడూ కూడా దేవగణాలవైపు ఉండి వారిని గెలిపించారు.

ఒక పని సాధించటంలో సమాన భాగస్వామ్యం ఉన్నప్పటికీ కొన్ని వర్గాలకు ఫలాలు నిరాకరించబడటాన్నీ - కుతంత్రాలనూ - ఉత్పత్తి శక్తులకూ, ఉత్పత్తిని అనుభవించేవారికీ గల సంబంధాలనూ - దోపిడీ వ్యవస్థనూ ఈ కథలలో దర్శించవచ్చు. వర్గ దృక్పథంతోబాటు, వర్ణ దృక్పథం కూడా ప్రతి సన్నివేశంలోనూ కనిపిస్తుంది. తమ ప్రయోజనాల కోసం రాజ్యం ప్రజలను సమీకరించటం ముఖ్యంగా ఉత్పత్తి కులాలను వాడుకోవటం - సంపద తయారు అయ్యాక ఉత్పత్తి కులాలను ఆ సంపదకూ, ఫలాలకూ దూరం పెట్టటం స్పష్టంగా కనిపిస్తున్న ఈ కథలో సామ్రాజ్యవాదాన్నీ చూడగలం. సమకాలిక, రాజకీయ సాంస్కృతిక ఆధిపత్య ధోరణిని పురాణకర్తలు ఇంత స్పష్టంగా చూపటంలోని దార్శనికతను అభినందించ వలసిందే.

గుజరాత్‌లోని కచ్ సముద్రతీరపు మలుపును ఉపగ్రహ ఛాయా చిత్రాల ద్వారా పరిశీలించినప్పుడు ఆ క్షేత్ర పరిసరాలలో ప్రాచీన నాగరికతా స్థావరాలు కనిపించాయట. హరప్పా నాగరికతకు చెందిన 'కీర్‌సార్' అనే అక్కడి స్థావరాన్ని "క్షీరసాగరం"గా పురాణాలు గ్రంథస్థం చేశాయనీ సముద్ర మథన కార్యక్రమంలో అక్కడ కుదురుకున్న తాబేలు (కచ్ఛపం) జ్ఞాపకంగా అది 'కచ్'గా వ్యవహారంలోకి వచ్చిందనీ పండితులు ఊహిస్తున్నారు. 'మందర్' అనే నది కూడా (మందర పర్వతం గుర్తుగా) అక్కడ ఉన్నదట. హిమాలయాలలో పుట్టి గుజరాత్ ప్రాంతాలలో ప్రవహించి సముద్రంలో కలసిన 'సరస్వతి' నది ఆనవాళ్ళనూ అక్కడ గుర్తించారు. అసురులు సరస్వతీ నదీ తీరంలో తపస్సు చేయటాన్ని

పురాణాలు ప్రస్తావించాయి. సింధునది మరొక పాయ కూడా అక్కడ సమాంతరంగా ప్రవహించిందనటాన్ని బట్టి ఆ ప్రాంతం జల రవాణాకు సముద్ర వ్యాపారానికి అనువైనదిగా ఉండిందనీ ఆ క్షేత్రం మీద ఆధిపత్యం కోసం ఆర్యులూ అసురులూ తరచు కలహిస్తూ ఉండేవారనీ భావించవచ్చు. పాలసముద్రంలో నుండి వచ్చిన అమూల్య సంపద వాణిజ్యం ద్వారా వచ్చిన సంపద. అయితే అప్సరస్త్రీల మాట ఏమిటి? అప్పుడు స్త్రీలు అంగడి బొమ్మలుగా ఉన్నారా? అనేది ఆలోచించవలసిన ప్రశ్న.

అమృతం దక్కని దైత్యవర్గాలు తమ వాటాకోసం పోరాటాలు సాగిస్తూనే వచ్చాయి. అనంతర ఘర్షణలలో వారు తమ నాయకులతో సహా పాతాళానికి అణచివేయబడ్డారు. దండక ప్రాంతాలు దక్షిణ దేశం – కొంకణం – వీరికి స్థావరాలయ్యాయి. నారాయణుడు మోహినీ రూపంతో అమృతాన్ని ఒక వర్గానికే అందించిన ఘట్టమూ, క్షీరసాగర మథనమూ ఈ దేశపు గొప్ప కళారూపాలు..

మరో సందర్భంలో అదే విష్ణువు మోహినిగా భస్మాసురుని దహించివేసిన కథ కూడా గొప్ప నృత్య కళారూపం. వర్గ ప్రయోజనాలనూ, కుతంత్రాలనూ వక్రీకరించి కళారూపాలతో ప్రజలను భ్రమింపచేయటం ఇక్కడ సంస్కృతి. పాలకవర్గాల కళాపోషణ మాటున ఉన్న సామాన్య ప్రజల చరిత్రను బయటికి తీయవలసిందే.

# మృత సంజీవనీ విద్య

ఒకప్పుడు అసురులకు మాత్రమే తెలిసిన మృత సంజీవనీ విద్య దేవగణాలకు చేరటాన్ని గురించి పురాణాలలో చెప్పారు. మత్స్య మహాపురాణం ఈ కథను వివరంగా చెప్పింది. మహాభారతంలోనూ ఈ వృత్తాంతం ఉంది.

అసురులకు దేవగణాలకు గల స్పర్థలు - వాటిలో స్త్రీలు బలి పశువులు కావటం - వంచించబడటమూ - ఈ వృత్తాంతంలో స్పష్టంగా ఉంది. కచ దేవయాని కథగానూ ఇది ప్రసిద్ధం. మూలగాథ వేదాలలోనూ వెతుక్కోవచ్చు.

ముల్లోకాల మీద ఆధిపత్యం కోసం స్థానిక అసురులు, ఆర్యులు పోటీపడుతున్న విషయమే ఇందులోనూ ఉంది. ఆర్యులకు (దేవగణాలకు) బృహస్పతి, అసురులకు శుక్రుడూ ఆచార్యులుగా (పురోహితులు) ఉండేవారు. యుద్ధాలలో మరణించిన అసురులను శుక్రుడు తన విద్యాబలంతో జీవింపచేస్తూ ఉండేవాడు. శుక్రునికి తెలిసిన సంజీవనీ విద్య బృహస్పతికి తెలియదు. దేవగణాలలో మరణాలు ఎక్కువైపోతూ ఉండటంతో వారంతా అధైర్యపడ్డారు. ఆ విద్య నేర్చుకోవటానికి ఒక ఉపాయం ఆలోచించారు. బృహస్పతి పెద్ద కొడుకైన కచుని దగ్గరకు వెళ్ళారు. "మాకు నీవొక సహాయం చెయ్యాలి. శుక్రుని దగ్గర ఉన్న సంజీవనీ విద్య సంపాదించి తెచ్చి మాకు ఉపకారం చేస్తే నీకు మాతోపాటు యజ్ఞభాగం ఇస్తాము. శుక్రుడు ఇప్పుడు రాక్షస రాజైన వృషపర్వుని దగ్గర ఉన్నాడు. ఇంత వరకు శుక్రుని మెప్పించిన వార్తెవరూ లేరు. నీవు ఆ పని చెయ్యగలవు" అని అడిగి ఇంకా ఇలా చెప్పారు.

"శుక్రునికి ఒక కూతురు ఉంది. ఆమె అంటే అతనికి ప్రాణం. ఆమెను మెప్పించ గలవారెవరూ లేరు. నీ శీలం, తియ్యని నడవడి, ప్రీతి భావం, ఆచారం, ఇంద్రియ నిగ్రహం వంటి వానితో ఆమెను ఆరాధించి సంతుష్టురాలను చేసి మా పని సాధించిపెట్టు" అని అతనికి చెప్పి ఒప్పించారు. విద్య సాధించాలనుకోవటం మంచిదే గాని అందుకు ఒక ఆడపిల్ల మనసుతో ఆడుకోవలసిందిగా చెప్పిపెట్టటం ఎంత దుర్మార్గం.[1]

కచుడు శుక్రుని దగ్గరకు వెళ్ళాడు. శిష్యునిగా చేరాడు. బ్రహ్మచర్య వ్రతం వేయి సంవత్సరాలైనా ఆచరిస్తానన్నాడు. గురువు చెప్పినట్టు విధేయంగా ఉంటూ, గురు పుత్రినీ ఆరాధించినట్టు నటిస్తూ ఆమెకు నమ్మకం కలిగించాడు. ఇలా 500 సంవత్సరాలు గడిచాయి. కచుని ఉద్దేశం రాక్షసులు పసిగట్టారు. సంజీవనీ విద్య కోసమే కుట్ర జరుగు తోందని అనుమానించారు. కచుడు ఒంటరిగా ఆవులను తోలుకు వెళ్ళినప్పుడు అడవిలో అతన్ని చంపి ముక్కముక్కలు చేసి ఆ ముక్కలు జంతువులకు ఆహారంగా వేశారు.

---

1. (మత్స్య మహాపురాణం అధ్యాయాలు 25-34)

సాయంత్రం ఆవులు ఇంటికి వచ్చేశాయి గాని కచుడు రాలేదు. దేవయాని ఆరాటపడింది. తండ్రిగారితో ఆ సంగతి చెప్పింది. అతడు లేకపోతే బతకలేనన్నది.

శుక్రుడు సంజీవనీ విద్య ప్రయోగించాడు. రమ్మని పిలవగానే కచుడు వచ్చాడు. రాక్షసులు రెండోసారి కచుడిని చంపి చూర్ణంగా చేసి దానిని శుక్రుడు తాగే మద్యంలో కలిపారు.

కచుడు ఆశ్రమానికి రాకపోవటంతో దేవయాని ఆందోళనపడింది. "పువ్వులు తెమ్మని పంపాను. ఆతడింకా రాలేదు ఏమైందో మరణించాడేమో..." అని తండ్రి దగ్గర బాధపడింది. ("మృగ పన్నగ రాక్షస బాధనొందెనో" అని విలపించిందని తెలుగు భారతం చెబుతోంది). రాక్షసులకు కచునిమీద ప్రేమలేదని ఆమెకు తెలుసు.

"అతనిని మళ్ళీ జీవింపచేసినా నీకు నేను చేసే ఉపకారం ఏమి ఉంది" అన్నాడు శుక్రుడు. "నీకేం తక్కువ. ఇంద్రుని సేవించేవారంతా నన్ను నిన్ను సేవిస్తున్నారు. ఒక మర్త్యుని కోసం నీవు ఇలా బాధపడకు. (కచుడు –బృహస్పతి కొడుకు. మానవుడే అంటున్నాడు శుక్రుడు – మరణించే స్వభావంగల జాతివాడే కచుడు. అతని తండ్రి బృహస్పతీ మానవుడే నన్నమాట) – ఆ బ్రాహ్మణున్ని బతికించటం కష్టం" అన్నాడు. ఈ సందర్భంలో తండ్రీ కూతుళ్ళ సంభాషణ చాలా ఉంది. అన్నం మానేసింది దేవయాని. కచుడు వచ్చేవరకూ ఆహారం ముట్టనన్నది. శుక్రుడికి రాక్షసుల మీద కోపం వచ్చింది. తన శిష్యుడిని పగతో చంపుతున్నందుకు వారినీ అనుమానించాడు. బ్రాహ్మణుని చంపితే బ్రహ్మహత్యా దోషం ఎవరినైనా నశింపచేస్తుంది. అది రాక్షసులకూ శుభంకాదు – అనీ ఆలోచించాడు. (ఈ భావాలను శుక్రుని నోట చెప్పించారు పురాణకర్తలు).

ఇలా ఆలోచించి శుక్రుడు విద్యతో కచుని పిలిచాడు. కచుడు బతికాడు. కాని శుక్రుని కడుపులోనుండే మాట్లాడాడు. "నీవు అక్కడికెలా వెళ్ళావ"ని శుక్రుడు ఆశ్చర్య పోయాడు. సంగతి తెలుసుకున్నాడు.

"కచుడు బయటకు వస్తే నేను మరణిస్తాను. కచుడు కావాలా నేను కావాలా ఈ రెండింటిలో నీకు ఏది ఇష్టం" అని కూతుర్ని అడిగాడు.

"కచుడు మరణిస్తే నా ప్రతిజ్ఞ (ధర్మం) పోతుంది. నీవు మరణిస్తే నేను బతకనే బతకను" అన్నది దేవయాని. గత్యంతరం లేని స్థితిలో శుక్రుడు తన విద్యను కచునికి నేర్పి దానిని బాగా భావన చేయవలసిందిగా చెప్పాడు. అది బాగా వచ్చాకనే తన కడుపు చీల్చుకుని బయటికి రమ్మన్నాడు. కచుడు అలాగే చేశాడు. తాను బయటకు వచ్చి కుప్పలాగా పడి ఉన్న గురువుగారిని బతికించాడు.

శుక్రుడు ఆ విద్యను తనవారికో, కూతురికో నేర్పి ఉండవచ్చును కదా అనే ఆలోచనగాని సందేహంగాని ఎవరికీ రాలేదు. పురాణాలను ప్రశ్నించకూడదు కాబట్టి ఎవరూ ఆ ప్రశ్న వేయలేదు.

సురాపానం వల్ల ఇంతటి అనర్థం కలగటం, తన విద్య శత్రువర్గానికి తెలిసిపోవటం - తలచుకుని శుక్రుడు బాధపడ్డాడు. "ఇది మొదలు ఏ బ్రాహ్మణుడైనా సురాపానం చేస్తే బ్రహ్మహత్యా పాతకం పొందుతాడు. అందరూ వినండి ఈ ప్రకారం ప్రవర్తించండి" అని హెచ్చరిక చేశాడు.

సంజీవనీ విద్య పొందాడు కాబట్టి కచుడిని ఇక ఎవరూ ఏమీ చేయలేరని దానవులకు చెప్పాడు. వైద్య విద్యలో అగ్రగాములుగా ఉన్న రాక్షసులను (దానవులు) దేవగణాలు ఆ విధంగా వంచించాయి.

ఈ కథలోనే స్త్రీలను పురుషులు తమ ప్రయత్నాలలో పావులుగా ఎలా వాడుకున్నారనేదీ ఉంది. కచుడు వచ్చిన పని నెరవేరింది. తన అధ్యయనం అయిపోయాక గురువు గారి అనుమతితో తన యింటికి (లోకానికి) ప్రయాణమయ్యాడు. దేవయాని తనను విడిచి వెళ్ళవద్దన్నది. శాస్త్రబద్ధంగా తనను పాణిగ్రహణం చేసుకోవలసిందిగా కోరింది. కచుడు "నీవు గురు పుత్రివి. నీ పట్ల నాకు అలాంటి ఆలోచనే లేదన్నా"డు. "రాక్షసులు చంపినప్పుడు నేనే కదా నిన్ను రక్షించాను. నీపట్ల నాకున్న అనురాగం నీకు తెలుసు కదా" అన్నది దేవయాని. "ఇది ధర్మం కాదన్నాడు" కచుడు. ఇలా వాగ్వాదం జరిగాక ఆమె, "నీకు ఈ విద్య సిద్ధి ఇవ్వదు" అని శపించింది. "నాకు సిద్ధించకపోతే నేను ఉపదేశించిన వారికి సిద్ధిస్తుంది" అంటూ, "కామ దృష్టితో నన్ను శపించావు - నీ కామ పురుషార్థం ఫలించదు. నిన్ను బ్రాహ్మణుడెవరూ వివాహం చేసుకోడు" అన్నాడు. బ్రాహ్మణ ప్రతిష్ఠను పురాణాలు అడుగడుగునా ప్రస్తావించాయి. కచ దేవయాని సంవాదం - యమ యమీ సంవాదం వేదసూక్తాలలో ఉన్నాయి. ఆ భావాలే ఈ పురాణాలు విస్తరించి చెప్పాయి.

ఈ గొడవలో శుక్రుడు జోక్యంచేసుకోలేదు. అనంతర కాలంలో దేవయాని యయాతి మహారాజును పెళ్ళి చేసుకుంది. అది కులాంతరమే. దానికీ వెనక ఒక కథ ఉంది.

కచుడు విద్య సాధించుకుని రావటంతో దేవతల శిబిరం ఆనందించింది. ఇక శత్రువులపై దండెత్తుదాం అని వారు ఉత్సాహపడ్డారు. ఆ దశలో ఇంద్రుని దృష్టి జల క్రీడలలో ఉన్న రాక్షస కన్యలపై పడింది. అతడు వాయువుగా మారి గట్టు మీద పెట్టిన వారి బట్టలు చిందర వందర చేశాడు. నీళ్ళ నుండి బయటకి వచ్చిన వారు ఎలాగో తమ దుస్తులు వెతుక్కుని కట్టుకున్నారు. శుక్రుని కూతురు దేవయాని బట్టలూ వృషపర్వుని కూతురు శర్మిష్ఠ బట్టలూ కలిసిపోయాయి. శర్మిష్ఠ తొందరలో దేవయాని బట్టలు కట్టేసుకుంది. దానితో దేవయానికి కోపం వచ్చింది. "నీవు రాక్షస కన్యవు. నా శిష్యురాలవు అయి ఉండీ నా బట్టలు కట్టుకున్నావు నీకు ఇది మంచిది కాదు" అన్నది. "మీ నాయన - మా నాయన కింద ఉండేవాడు. మా నాయనను స్తుతిస్తూ యాచించుకుంటూ బతుకుతున్నాడు. నేను ఇచ్చేవాడి కూతుర్ని, నువ్వేమో తీసుకునేవాడి కూతురివి. నీవు నన్ను

కోప్పడతావేమిటి?" అన్నది శర్మిష్ఠ. దేవయాని తన బట్టల కోసం పట్టుదలగా ఉంది. రాజు కూతురు గనుక శర్మిష్ఠ ఆమెను ఒక బావిలో తోసి తన చెలికత్తెలతో వెళ్ళిపోయింది. ఆమె బతికి ఉన్నదా లేదా అని వారెవరూ చూడలేదు.

బావిలో నీ ్ళలేవు. తీగలతోనూ గడ్డితోనూ నిండి ఉంది. నహుషుని కొడుకైన యయాతి వేటకోసం అటువైపుగా వచ్చి నీళ్ళకోసం వెదకుతూ ఆ బావిలోకి చూశాడు. అందులో దేవయాని కనిపించింది. యయాతి వివరాలు తెలుసుకున్నాడు. "నీవు నన్ను ముట్టుకున్నా దోషం లేదు. నా చేయి పట్టుకుని పైకి లాగు" అంటూ ఆమె తన కుడిచేయి అందించింది. దేవయానిని బయటికి తీసి ఆయన వెళ్ళిపోయాడు.

ఇంత అవమానం జరిగాక వృషపర్వుని నగరంలో అడుగుపెట్టనన్నది దేవయాని. అలా తండ్రికి కబురుపెట్టింది. రాజుగారు కూడా వచ్చి క్షమాపణ కోరాడు. శుక్రుడు అతని రాజ్యంలో ఉండనన్నాడు. "మీరు లేకపోతే రాక్షసులు దిక్కులేనివారవుతారు. వారంతా సముద్రంలోకి వెళ్ళి దాక్కోవలసిందే. ఈ రాక్షస రాజ్యమంతా మీదేను, నగరానికి రండి అన్నాడు" వృషపర్వుడు. "ఆ మాట దేవయానికి చెప్పి ఆమెను ఒప్పించండి" అన్నాడు శుక్రుడు. నగరం బయట ఉన్న దేవయానికి అంతా చెప్పారు. "శర్మిష్ఠ తన వెయ్యి మంది దాసీలతోనూ నాకు దాసిగా ఉండాలి. నా పెళ్ళయ్యాక ఆమె కూడా నాతో రావాలి" అని దేవయాని పెట్టిన షరతుకు వృషరూపుడు ఒప్పుకున్నాడు. తండ్రికోసం రాక్షస కులం శ్రేయస్సు కోసం శర్మిష్ఠ కూడా ఒప్పుకున్నది.

మరొకసారి దేవయాని తన చెలికత్తెలతోనూ శర్మిష్ఠతోనూ వనవిహారం చేస్తూండగా అక్కడికి యయాతి వచ్చాడు. అందమైన ఇద్దరు కన్యలు – ఒక్కొక్కరికీ వేయిమంది చొప్పున దాసీ జనాలు. రాజు (యయాతి) మనసు శర్మిష్ఠ మీదే లగ్నమైంది. అయినా ఆయన దేవయానితోనే సంభాషణ మొదలుపెట్టాడు. వారి వృత్తాంతాలు తెలుసుకున్నాడు. ఆ సంభాషణల్లో లోకవృత్తమూ బ్రాహ్మణ ధర్మ ప్రశస్తీ చాలా ఎక్కువగా చెప్పారు.

రాజువైనా బ్రాహ్మణుని లాగా మాట్లాడుతున్నావు అన్నది దేవయాని. బ్రహ్మచర్య వ్రతంలో వేదం అధ్యయనం చేశానన్నాడు యయాతి. క్షత్రియులకూ, వైశ్యులకూ కూడా వేదం (జ్ఞానం) తెలుసుకునే వెసులుబాటు అప్పటికి వచ్చింది.

"ఈ రెండువేల దాసీ జనంతోనూ నా దాసి అయిన శర్మిష్ఠతోనూ నీ అధీనం అవుతున్నాను. నాకు మిత్రుడుగా భర్తగా ఉండు" అని దేవయాని కోరింది.

స్త్రీలకు వరుని ఎంచుకునే హక్కు ఉండటం – శాపం కారణంగానే అయినా ప్రత్యేక సందర్భాలలో కులాంతర వివాహాలకు అనుమతి ఉండటం ఆ సమాజంలో కనిపిస్తుంది. వారసత్వ హక్కులు సవర్ణ సంతానానికే స్థిరపడటం ఈ కథలో సూచన ప్రాయంగా గమనించవచ్చు. యయాతిని వివాహం చేసుకోవటానికి దేవయాని సిద్ధపడినా యయాతి ఒప్పుకోలేదు. "నీవు బ్రాహ్మణ కన్యవు. ఈ వివాహానికి నీ తండ్రి ఒప్పుకోడు"

అన్నాడు. "నాలుగు వర్ణాలు, ధర్మాలూ వేర్వేరు. శ్రేష్ఠవర్ణపు స్త్రీని తక్కువ వర్ణపు పురుషుడు పెళ్ళిచేసుకోకూడదు" అంటూ బ్రాహ్మణ ప్రశస్తిని చెప్పాడు. అప్పటికి కులధర్మాలు వ్యాప్తిలోకి వచ్చాయి "పాము ఒక్కడినే కరుస్తుంది. కత్తి ఒకరినే చంపుతుంది. కోపించిన బ్రాహ్మణుడు రాష్ట్రాలనూ పురాలనూ నాశనం చేస్తాడు. నీ తండ్రి స్వయంగా ఇస్తేనే నిన్ను గ్రహిస్తాను" అన్నాడు రాజు యయాతి.

బ్రాహ్మణులు తమను గురించి ఎంతగా ప్రచారం చేసుకున్నారో సమాజంలోని ఇతర వర్ణాలను ఎలా భయపెట్టారో దీని నుంచి తెలుస్తున్నది.

శుక్రునికి విషయాలన్నీ తెలిశాయి. దేవయానికి కచుడు ఇచ్చిన శాపం ఉంది. కాబట్టి బ్రాహ్మణుడు ఆమెకు భర్త అయ్యే అవకాశం లేదు. శుక్రుడు స్వయంగా వచ్చి యయాతితో తాను ఈ వివాహానికి అంగీకరిస్తున్నానని చెప్పాడు. అయినా యయాతి వర్ణ సంకరానికి భయపడ్డాడట. "అధర్మ దోషంగాని వర్ణ సంకర పాపంగాని నాకు అంటకుండా వరం ఇవ్వండి" అని అడిగి వరం పొందిన తర్వాతనే ఆమెను గ్రహించాడు. "శర్మిష్ఠను ఆదరించు, కాని శయనానికి గ్రహించకు" అని శుక్రుడు యయాతికి చెప్పాడు.

వివాహానంతరం యయాతి తన రాజధానికి వెళ్ళి దేవయానిని అంతఃపురంలో పెట్టుకున్నాడు. ఆమె అనుమతిలో శర్మిష్ఠకు ఆమె దాసీలకూ వేరే అశోకవనం దగ్గర భవనం కట్టించాడు.

దేవయానికి కుమారుడు కలిగాడు. ఆ తర్వాత వేయి సంవత్సరాలకు శర్మిష్ఠ యవ్వనవతి అయి పుత్ర సంతానం కోసం యయాతిని వరించి ఎలాగో ఒప్పించింది. యయాతివల్ల ఆమెకూ ఒక కుమారుడు కలిగాడు. ఆ సంతానం ఒక ఋషి ప్రభావం వల్ల కలిగినట్లు ఆమె దేవయానిని నమ్మించింది. (ఇక్కడా బ్రాహ్మణ ప్రశస్తిని గురించి చర్చ ఉంది.)

ఈ క్రమంలో దేవయానికి ఇద్దరు కొడుకులు ,శర్మిష్ఠకు ముగ్గురు కొడుకులు కలిగారు. చాలా కాలం తర్వాత దేవయానికి వాస్తవం తెలిసింది. ఆమెకు చాలా కోపం వచ్చింది. "నీ అసుర ధర్మం పోనిచ్చుకున్నావు కాదు" అని శర్మిష్ఠను నిందించింది. (కులం పేరు ఎత్తి నిందించటం పురాణాల నుండే మొదలయింది.) కోపంతో తండ్రి దగ్గరకు వెళ్ళి జరిగిందంతా చెప్పింది.

"ధర్మజ్ఞుడవై ఉండి కూడా ఇలా ఎందుకు చేశావు. త్వరలోనే ముసలితనం నిన్ను బాధిస్తుంది" అని శుక్రుడు యయాతిని శపించాడు. యయాతి తన నిర్దోషిత్వాన్ని సమర్థించుకునే లోపలే వయసు అతనిని ఆవరించింది. దేవయానితో ఇంకా సుఖాలు అనుభవించాలని ఉన్నదంటూ యయాతి శుక్రుని వేడుకున్నాడు. ముసలితనం ఎవరికైనా ఇవ్వవచ్చు – అని కొంత మినహాయింపు ఇచ్చాడు, శుక్రుడు. "నా ముసలితనం తీసుకున్న కొడుకు నా రాజ్యానికి, కీర్తికి, పుణ్యానికి పాత్రుడు అయ్యేలాగ వరం ఇవ్వండి"

అని కోరి శుక్రుని దగ్గర అభయం తీసుకుని అప్పుడు యయాతి తన కొడుకులను పిలిచాడు.

రాజ్యాధికారం ఇవ్వటంలోనూ ఆ తర్వాత గొడవలు రాకుండా చూడటంలోనూ అతడు తీసుకున్న జాగ్రత్తలు రాజనీతిజ్ఞతను తెలుపుతున్నాయి. తండ్రి కష్టాన్ని పంచుకోవటం పుత్రుల బాధ్యతగానూ ఈ కథ సూచిస్తున్నది.

ముసలితనం పుచ్చుకోవటంలో యయాతి కొడుకులకూ యయాతికి జరిగిన సంభాషణలు లోకవృత్తాన్ని తెలుపుతున్నాయి.

మత్స్య పురాణం 33వ అధ్యాయం అంతా ఇదే. వెయ్యి సంవత్సరాలు తన ముసలి తనం తీసుకుని వారి యవ్వనం తనకు ఇవ్వవలసిందనీ ఆ తర్వాత తాను తన ముసలితనం తీసేసుకుని వారి యవ్వనం వారికి ఇచ్చేస్తాననీ యయాతి కొడుకులను అడిగాడు. నిరాక రించిన వారందరికీ శాపాలు పెట్టాడు.

"నీ సంతతికి రాజ్యాధికారం ఉండదు" అని పెద్దకొడుకు యదువును శపించాడు. రెండో కొడుకైన తుర్వసునికి ఇచ్చిన శాపం వర్ణ ధర్మాల విషయంలో కీలకమైనది. "నీ సంతతి తుదివరకు కొనసాగదు. ప్రతిలోమ జాతులవారూ, పచ్చిమాంసం తినేవారూ, సంకీర్ణమైన ఆచారాలు/ధర్మాలు పాటించేవారూ అయిన అంత్యవర్ణాల వారికి రాజుగా ఉంటావు" అని శాపంపెట్టాడు. "ఈ వర్ణాలవారు పాపాలకు వెరవరు. మ్లేచ్ఛులు - పశువుల లాగా ప్రవర్తిస్తారు" అలాంటి వారి నడుమ ఉంటావు అనీ అన్నాడట. (ప్రతిలోమ జాతులు అంటే తక్కువ వర్ణపు పురుషునికి అతనికంటే పై వర్ణపు స్త్రీతో కలిసిన సంగమం వల్ల పుట్టినవారు). ఇవన్నీ మనువు క్రోడీకరించిన వర్ణధర్మాలే.

మూడో కొడుకు (శర్మిష్ఠ పెద్ద కొడుకు) ద్రుహ్యుడు. అతడిని స్థిరత్వం లేనివానిగా శపించాడు. "నిత్యమూ పడవలతో దాటవలసి ఉండే దేశంలో రాజ్యభ్రష్టుడవై తిరుగుతూ ఉండు. నీ సంతానమూ అంతే" అన్నాడు.

"నీ వంశం వాళ్ళంతా యౌవనం రాగానే నశిస్తారు" అని అనువుకు (శర్మిష్ఠ రెండో కొడుకు) శాపం ఇచ్చాడు.

మూడో కొడుకు పూరువు తండ్రి ముసలితనాన్ని తీసుకుని తండ్రి తర్వాత రాజ్యానికి అర్హుడయ్యాడు - పెద్దవాళ్ళుండగా చివరివాడికి రాజ్యం ఎలా ఇస్తావు? అని బ్రాహ్మణులు ప్రశ్నించారట. ఇక్కడ పుత్రుల బాధ్యతల గురించిన చర్చలున్నాయి. "మాతా పితరులకు మేలుచేసేవాడే కొడుకు" - అని పౌరులను జానపదులను (జనపదాల ప్రజలు) అంగీక రింపజేసి పూరునికి రాజ్యం ఇచ్చాడు.

**యయాతి**

యయాతి తన చివరిరోజులలో కొన్నాళ్ళు వానప్రస్థంలో ఉన్నాడు. తర్వాత స్వర్గానికి వెళ్ళాడు. బ్రహ్మచర్యం, గార్హపత్యం, వానప్రస్థం, సన్యాసం అనేవి మానవుడు తన వయస్సు

దృష్ట్యా ఆచరించవలసిన ధర్మాలు. వీటిని ఆశ్రమ ధర్మాలంటారు. వర్ణాశ్రమ ధర్మాలను కలిపి వ్యవహరిస్తుంటారు. వర్ణధర్మాలు ఒక్కో వర్ణానికీ ఒక్కొక్క రకంగా చెప్పారు. అవి తప్పక ఆచరించాలి. ఆశ్రమ ధర్మాల సంగతి ఎప్పుడో మరచిపోయారు.

స్వర్గంలో యయాతితో పాటు అష్టకుడు, వసుమాన్, ప్రతర్దనుడు, శిబి ప్రభృతులున్నారు. వారితో యయాతి చేసిన చర్చలు రాజకీయ, సామాజిక, ఆర్థిక వ్యవహారాలలో అతని వైదుష్యాన్ని తెలుపుతున్నాయి. అప్పటి క్షత్రియ రాజులకు ఆయన ప్రతినిధిగా కనిపిస్తాడు. యయాతి ఒక రాజుగా రాజనీతి విశారదుడుగా ప్రఖ్యాతి చెందాడు. పూరునికి రాజ్యం ఇచ్చేముందు యయాతి అతనికి ఏమి ఉపదేశించాడో తెలుసుకోవాలని ఇంద్రుడు కుతూహలపడ్డాడు. ఆ విషయం అడిగినప్పుడు యయాతి చాలా విషయాలు చెప్పాడు. ఆయన చెప్పిన రాజనీతులు మహాభారతంలోనూ ఇతర కథలలోనూ ప్రస్తావించారు. మంచి చెడు వివేచన ముఖ్యం అన్నాడు యయాతి. "పరుషమైన మాటలు బాణాలవంటివి. అవి ఎవరి మీదా వదలకూడదు. ఇతరులను తనవైపు తిప్పుకోవటానికి మధురమైన వచనాలు అమోఘంగా పనిచేస్తాయి."

"సత్యవాదిత్వం గొప్పది. చేయలేని పనులు, వ్యర్థ విషయాలు చెప్పకూడదు. సత్యమైన వాటినే చెప్పాలి. సత్యంతోనే లోకాలు పూజింపబడుతున్నాయి."

మానవులు ఎలాంటి ప్రవర్తనతో ఏయే లోకాలు పొందుతారు అనే విషయాలూ అక్కడ చర్చకు వచ్చాయి.

బ్రాహ్మణుడు తప్ప ఎవ్వరూ దైన్యంతో దానం తీసుకోకూడదట.

(దైన్యస్థితిలో ఉన్న ఇతర కులాల వారిని దానాలు తీసుకోకుండా నియంత్రించే శాసనం ఇది. వారు ఆత్మహత్యలైనా చేసుకోవచ్చు గాని ఇతరులెవరూ వారికి దానాలు ఇవ్వకూడదు అనీ సూచిస్తున్నది).

చాలా చాలా విషయాలు మాట్లాడుకున్నాక చాలా రోజులు గడిచాక ఒకనాడు ఇంద్రుడు యయాతిని "నీతో సమానులెవరో చెప్పు" అని అడిగాడు.

"నాకు నేనే సమానం. నాకు సరి ఎవరూ లేర"న్నాడు యయాతి. "ఇంత అహంకారమా" అంటూ ఇంద్రుడు యయాతిని స్వర్గం నుంచి తోసేశాడు. 'ముఖ్యమంత్రులు తమ మంత్రులను తీసేసినట్లే.'

అష్టకుడు, వసుమాన్, ప్రతర్దనుడు, శిబి తమ తమ పుణ్యలోకాలు యయాతికి ఇస్తామన్నారు. కాని యయాతి ఒప్పుకోలేదు. "ఎవరి కర్మఫలాలు వారే అనుభవించాలి" అన్నాడు. శాశ్వత లోకాలకు తీసుకువెళ్ళటానికి వారందరికీ బంగారు రథాలు వచ్చాయి. అందరిలోనూ శిబి రథం ముందున్నది. శిబి దానశీలి. శమదమాలు కలిగిన వాడు. తనకు ధనం ఉన్నంత వరకూ దానం చేశాడు కాబట్టి అతని రథం ముందున్నది అని యయాతి చెప్పాడు.

యయాతి స్వర్గం నుంచి కిందికి జారాడు గాని భూమికి చేరలేదు. మధ్యలో మరెన్నో లోకాలున్నాయి. (అవన్నీ ఉత్తరాపథానికీ, దక్షిణాపథానికీ[1] మధ్య ఉన్న రాజ్యాలు కావచ్చు) ఒక ప్రత్యేక లోకంలో శిబి, ప్రతర్దనుడు మొ వారున్నారు. వీరికి తమకంటూ ఒక ప్రత్యేకత ఉన్నది. యయాతి వారిని చేరుకుని వారితో కొన్నాళ్ళున్నాడు. వారికి ఎన్నెన్నో విషయాలు భౌతిక పారలౌకిక అంశాలు చెప్పాడు. సత్యవాదిగా మళ్ళీ స్వర్గానికి వెళ్ళాడు.

యయాతి కొడుకులలో పూరుడు గంగా యమునా నదుల మధ్యదేశం పాలించాడు. ఆ రాజ్యపు అంచులలోనూ వాటికి అవతలగానూ ఉండే దేశాలు అతని అన్నలవి.

యదువు సంతతివారు యాదవులు, తుర్వసుని వంశం వారు యవనులు, ద్రుహ్యుని సంతతి వారు భోజ జాతీయులు. అనువు సంతతి వారు మ్లేచ్ఛ జాతివారు అయ్యారు. పూరుని సంతతి వారు పౌరవులు.

మనుస్మృతి వర్గీకరించిన అవిలోమ వివాహాలు "అవాంతర కులాలు" మ్లేచ్ఛజాతుల మూలాలు దేవయాని కథలో ఉన్నాయి. దేవయానిని భ్రమలో ఉంచి విద్యలు నేర్చుకున్న కచుని కపటంవల్లనూ అతడు దేవయానికి ఇచ్చిన శాపంవల్లనూ ఏర్పడిన కులాలు ఇవి.

యయాతికి కామ సుఖాలపై ఉన్న వ్యామోహమూ, ఆయన కొడుకులకు ఇచ్చిన శాపాలూ ఈ జాతుల విభజనను పటిష్ఠంగా వర్గీకరించాయి. ఏ రంగంలోనైనా ఎంత కృషిచేసినా శూద్రులను "అతి శూద్రులను" పైకి రానీయని సమాజం అణచి ఉండే పురోహిత వ్యవస్థ పునాదులు దేవగణాల వంచనలో అసురుల భంగపాటులో కనిపిస్తాయి. వాటిని విశ్లేషించుకోగలిగితే అవమానాల పరంపరలే కళ్ళకు కడతాయి.

యదు వృష్ణి భోజ కుకుర అంధక జాతులను (రాజులను) భారతం (శిశుపాల వధ ఘట్టంలో) ప్రస్తావించింది. యదువు వంశంలోని వారు యాదవులు, హైహయులు.

కార్త వీర్యార్జునుడు హైహయ వంశంలోనివాడు. క్రోష్టు వంశంలోని వారే వృష్ణి వంశీయులు. కృష్ణుడు వృష్ణి వంశంవాడు కూడాను. శూరవంశంలోనే ఇతర కులాల భార్యల వల్ల కలిగిన సంతానాన్ని వివరంగా చెప్పారు. దత్తత వెళ్ళిన వారినీ చెప్పారు. ఇతర కులాల భార్యలవల్ల కలిగిన సంతానాన్నీ చెబుతూ అందులో నిషాదులనూ పేర్కొన్నారు.

కృష్ణుడి భార్యలు 16 వేలమంది. అతని సంతానం మొత్తం 1 లక్ష 80 వేల మంది. వాళ్ళ సంతానం మరింత మంది.

---

1 ప్రాచీన భారతదేశ జాతులలో దూరప్రాంతాల వారితో వాణిజ్యం చేసేవారు కొందరుండే వారు. విదేశాలతోనూ వర్తకం సాగేది. వ్యాపారం కోసం కొన్ని రహదారులుండేవి. వాయవ్యాన తక్షశిల నుంచి తూర్పున మగధ వరకు ఏర్పడిన రహదారిని ఉత్తరపథం అనేవారు. ఈ మార్గంలో హస్తినాపురం, శ్రావస్తి, వైశాలి, రాజగృమం చెప్పుకోదగ్గ పెద్ద నగరాలు.
శ్రావస్తి నుంచి అయోధ్య, కౌశాంబి, భిల్సా (విదిశ) ఉజ్జయినిల మీదుగా దక్షిణాన ప్రతిష్ఠానపురం (పైఠాన్) వరకు ఉన్న రహదారిని దక్షిణావథం అన్నారు.

మొత్తం యాదవులు మూడు కోట్లమంది. వీరు నూటొక్క ప్రధాన వంశాలవారట. వీరు దేవాంశలో పుట్టారట. ఈ వంశం వైష్ణవ వంశం. విష్ణువు వీరి నాయకుడు అని మత్స్య పురాణం చెబుతోంది.

సమాజంలోని వివిధ వర్ణాలు, జాతులు ఎలా ప్రచారంలోకి వచ్చారో సుతారంగా సముదాయిస్తూ చెప్పిన కథలు ఇవి.

ప్రతిలోమ జాతులూ, అంత్యవర్ణాలవారూ, నిషాదులూ అందరూ యయాతి కొడుకులకు ఇచ్చిన శాపాలవల్ల భిన్న కులాలుగా ప్రచారమైనవారే. ఎవరి 'కర్మ'నో వీరు అనుభవిస్తున్నానుకోవాలి. కౌశాంబి ఒకప్పుడు చాలా ప్రసిద్ధంగా ఉన్న నగరం. "బృహత్కథ"లో దీని ప్రస్తావన ఉన్నది. సమకాలిక సామాజిక విషయాలూ వాణిజ్యాల వివరాలూ పౌరుల చిత్తవృత్తులూ విశదపరుస్తున్న బృహత్కథ లాంటి గ్రంథాలెన్నో సంస్కృత వాఙ్మయం స్థిరపడినాక నిరాదరణకు లోనై ప్రచారం లేక నశించాయి. ప్రజల సామాజిక జీవనాన్ని తెలుసుకునే ఆధారాలు లేకుండా పోయాయి.

# పరశురాముడు

పరశురాముని కథ చాలా పురాణాలలో కనిపిస్తుంది. ఇది చాలా సుదీర్ఘమైనదీ అనేకానేక సంఘటనలతో ముడిపడి ఉన్నదీను. రామాయణం నుంచి భారతం వరకూ పరశురాముని ప్రస్తావనలున్నాయి. ఆ పేరుతో చాలామంది ఉన్నారా అనేదీ పరిశీలించాలి.

పురాణాల ప్రకారం ఒక పరశురాముడు రేణుక, జమదగ్నుల కొడుకు. ఋచీకుని మనుమడు. ఇతని చరిత్ర బ్రాహ్మణ క్షత్రియ వైరుధ్యాలతో ముడిపడి ఉంది. కారణాల కోసం ముందుగా ఇతని తాత ఋచీకుని గురించి తల్లి రేణుక గురించీ చెప్పుకోవాలి.

## ఋచీకుడు

ఒక ముని. ఔర్వుని కొడుకు. ఇతడు గాధి అనే రాజు కూతురు సత్యవతిని వివాహం చేసుకున్నాడు. (అది వేరే కథ) సత్యవతి తనకు ఒక కొడుకూ, తన తల్లికి ఒక కొడుకూ కలిగేలాగ భర్తను వరం అడిగింది. అతడు 'సరే' అన్నాడు. సత్యవతి మేడిచెట్టునూ, ఆమె తల్లి రావిచెట్టునూ కౌగలించుకోవాలన్నాడు. పొరపాటున సత్యవతి రావిచెట్టునూ ఆమె తల్లి మేడిచెట్టునూ కౌగలించుకున్నారు. పొరపాటు గుర్తించాక ఈసారి ఆయన రెండు రొట్టెలూ మంత్రించిన నీళ్ళూ ఇచ్చాడు. అక్కడా పొరపాటు జరిగింది. రొట్టెలు తారుమారయ్యాయి. ఈ విపరీతాలు చూసి సత్యవతికి పుట్టేవాడు బ్రాహ్మణుడైనా క్షత్రియ స్వభావం కలిగి ఉంటాడనీ, ఆమె తల్లికి పుట్టేవానికి బ్రాహ్మణ స్వభావం వస్తుందనీ ఋచీకుడు చెప్పాడు. సత్యవతి ఈ స్వభావం తన కొడుకుకు కాకుండా మనవడికి వచ్చేలాగ కోరింది. ఆ విధంగా బ్రాహ్మణ క్షత్రియ స్వభావాల తికమకలు ఏర్పడి గాధి భార్యకు విశ్వామిత్రుడూ గాధి కూతురు సత్యవతికి జమదగ్ని పుట్టారు. సత్యవతి విశ్వామిత్రుని అక్క. సత్యవతి కొడుకు జమదగ్ని – జమదగ్ని కొడుకు పరశురాముడు. అతనికి ఉగ్ర భావం/క్షత్రియ స్వభావం వచ్చింది. (భారతమూ, విష్ణుపురాణమూ ఈ కథ చెప్పాయి.) అప్పటికి కులాంతర వివాహాలూ క్షత్రియ బ్రాహ్మణ సంబంధాలూ ఉన్నాయి. అయినా వాటిని ప్రశ్నించకూడదు.

## రేణుక

పరశురాముని తల్లి రేణుక. ఈమె గురించీ చెప్పుకోవాలి. జమదగ్ని నిత్య కార్యక్రమాల కోసం ఈమె దగ్గరే ఉన్న సరస్సు నుంచి కడవలో నీరు తెస్తుండేది. (సరస్సు దగ్గరే తడి మట్టితో కడవచేసి అందులో నీరు నింపుకుని వచ్చేదని ప్రతీతి) ఒక రోజు సరస్సులో చిత్రరథుడనే రాజు అంతఃపుర కాంతలతో చేస్తున్న జలక్రీడలు చూస్తూ కొంత ఆలస్యం చేసిందట. (ఆ దోషంవల్ల తడి మట్టితో కుండచేయటం కుదరలేదని జానపద

కథల్లో ఉంది) ఆమె రాజుతో వ్యభిచరించిందని భర్త ఆరోపించాడు. ఆమెను చంప వలసిందిగా కొడుకులకు చెప్పాడు. తల నరకాలన్నది ఆజ్ఞ.

నలుగురు కొడుకులు తండ్రి మాట వినలేదు. అయిదోవాడు పరశురాముడు. తండ్రి మాట ప్రకారం తల్లిని చంపాడు. తండ్రి సంతోషించి "ఏం కావాలో కోరుకో"మంటే తల్లిని బతికించాలని కోరాడు. ఆ విధంగా తల్లిని బతికించుకున్నాడు. ఈ సందర్భంలో రేణుకా ఎల్లమ్మ కథ చెబుతారు. పరశురాముడు తల్లిని చంపబోతే ఆమె అక్కడి మాల మాదిగ వాడలలోకి పరుగెత్తిందట. ఒక స్త్రీ రేణుకను దగ్గరకు తీసుకుని ఓదార్చుతూ ఉన్నది. సరిగ్గా అప్పుడే పరశురాముని కత్తి రేణుక మెడపై పడింది. రెండు తలలు తెగి పడ్డాయి. తండ్రి ఇచ్చిన వరం ప్రకారం పరశురాముడు తల్లిని బతికించుకునే తొందరలో తల్లి తలను ఒక మొండానికి అతికించాడు. ఆ మొండెం మాదిగ స్త్రీది. తర్వాత రెండో తలనూ అతికించాడు. ఆ శరీరం రేణుకది. ఈ సంఘటన రెండు విభిన్న సంస్కృతుల మేళవింపుకు చిహ్నంగా భావిస్తున్నారు. రేణుకా ఎల్లమ్మ దేవతగా పూజలందుకుంటున్నది.

రేణుక జమదగ్నుల కథలో చనిపోవటాలు బతకటాలు రెండుసార్లు జరిగాయి. పరశురాముని వివరాలకు వెళ్తే అదొక పెద్ద కథ. పరశురాముడు గొప్ప గొప్ప మునుల దగ్గర శిక్షణ పొందాడు. ఇతని తేజస్సును మునులే చూడలేకపోయే వారట. అసురులను జయించటానికి దేవగణాలు ఇతని సహాయం కోరారు. అప్పటికి బాణాసురుని ఆధ్వర్యంలో సంఘటితమైన అసుర క్షత్రియులు ఆర్య దేవగణాలను తిప్పి కొట్టి బలపడి రాజ్యాధికారంలో ఉన్నారు.

వారిని జయించటం కోసం శివుడు "పరశువు" అనే ఆయుధాన్ని ఇతనికి ఇచ్చాడు. పరశురాముడు అసురులను తరిమేసి ఇంద్రుడి పట్టణాన్ని తిరిగి ఇంద్రునికి అప్పగించాడు. శివునివల్ల భార్గవాస్త్రం కూడా పొందాడు - పరశురామునిలో తీవ్రస్వభావంతోబాటు దయ కూడా ఉన్నట్టు పురాణాలు చెప్పాయి.

ఒకప్పుడు హైహయరాజు ఒకడు జమదగ్నిని చంపాడట. పరశురాముడు వచ్చి చూసేసరికి తల్లి గుండెలు బాదుకుంటూ తండ్రి శవం మీదపడి ఏడుస్తూ కనిపించింది. ఆమె 21 సార్లు గుండెలు బాదుకున్నది. ప్రతీకారంగా 21 సార్లు ఈ భూమిమీది క్షత్రియులను వధిస్తానని పరశురాముడు ప్రతిజ్ఞ చేశాడు. ఈలోపల భృగు మహర్షి వచ్చి జమదగ్నిని బతికించాడు. అయినా పరశురాముడు తన శపథం ప్రకారం 21 సార్లు భూమండలమంతా వెదికి రాజులను చంపాడు. కార్తవీర్యుని చంపే క్రమంలో మత్స్య, మగధ, నిషాద రాజులను, మిథిల, విదర్భ, అవంతి, కన్యాకుబ్జ, సౌరాష్ట్ర, రాజులను చంపాడు. 'కాళి' పరశురామునికి సహకరించింది. కార్తవీర్యుడు హైహయ (యాదవ) వీరుడు. జమదగ్ని ఆశ్రమంలోని కామధేనువును ఒకప్పుడు బలవంతంగా తీసుకు వెళ్ళబోయి భంగపడ్డాడు. అతనికీ జమదగ్నికీ వైరం ఉంది. అతడు పరశురాముడిని ఎదుర్కొన్నాడు. కార్తవీర్యుని దెబ్బకు

పరశురాముడు కిందపడ్డాడట. అప్పుడు శివుడు సంజీవనితో ఇతనిని బతికించాడు. ఆ తర్వాత అస్త్రాలతో కార్తవీర్యునీ అతని కొడుకులనూ చంపాడు. శత్రు సంహారం అయ్యాక నర్మదలో స్నానంచేసి శివుని చూడటానికి కైలాసానికి వెళ్ళినప్పుడు ద్వారం దగ్గర వినాయకుడు ఇతనిని ఆపాడు. ఇద్దరికీ యుద్ధం జరిగింది. వినాయకుడు తన తొండంతో పైకెత్తినప్పుడు పై ఏడు లోకాలూ కనిపించాయట. ఆ అవమానంతో వినాయకుడిని పరశువుతో కొట్టాడు. వినాయకుని దంతం ఒకటి విరిగింది. ఈ గొడవకు శివపార్వతులు బయటకు వచ్చారు. 'నా కొడుకును కొడతావా' అని పార్వతి కోప్పడింది. శివుడు ఏమీ చేయలేక కృష్ణుణ్ణి తలచుకున్నాడట. కృష్ణుడు వచ్చి సర్ది చెప్పాడు.

పరశురాముడు ఇంటికి వెళ్ళి తాను చేసిన క్షత్రియ సంహారం గురించి తండ్రికి చెప్పాడు. తండ్రి విచారించాడు. ఆ పాపం పోవటానికి తపస్సు చేయవలసిందిగా చెప్పాడు. ఇతడు తపస్సుకు వెళ్ళాక కార్తవీర్యుని సంతానంలోని ఒక రాజు వచ్చి జమదగ్నిని చంపాడు. ఆ సంగతి తెలిసి పరశురాముడు మళ్ళీ క్షత్రియులను చంపాడు. ఈసారి కార్తవీర్యుని పట్టణం తగలబెట్టేశాడు. అదంతా అయ్యాక మళ్ళీ తపస్సుకు వెళ్ళాడు. అక్కడకు ఒక రాజు వచ్చి "క్షత్రియులకు భయపడి ఇక్కడ దాక్కున్నావా?" అన్నాడట. దానితో కోపంవచ్చి మళ్ళీ రాజులమీదికి వెళ్ళి వారిని వెదికి వెదికి చంపాడు.

పరశురామునికి జడిసి కొందరు స్త్రీల మధ్యన, కొందరు పశువుల కొట్టాలలోను దాక్కుని ప్రాణాలు దక్కించుకున్నారు. బ్రాహ్మణులు క్షత్రియ స్త్రీలకు సంతానాన్ని పుట్టించారని విని మళ్ళీ వెళ్ళి ఆ శిశువులను కూడా చంపాడట. ఇలా ఇరవై యొక్కసార్లు క్షత్రియ సంహారంచేసి కురుక్షేత్రంలో అయిదు మడుగులు తవ్వించి వాటిని రాజుల రక్తంతో నింపి పితృతర్పణం చేశాడు. (ఈ మడుగులను "శ్యమంత పంచకము" అంటారు. వీటిని భారతం ప్రస్తావించింది.)

పితృదేవతలకు తర్పణాలు ఇస్తుంటే వారు, "నాయనా నీవు చేసిన పాపం ఇంకా పోలేదు, ఇంకా వ్రతాలు – తపస్సు చెయ్యి" అని చెప్పారట. ఆ క్రమంలో ఇతని గురించి (రామాయణం నుంచి భారతం వరకూ) మరికొన్ని కథలున్నాయి.

కర్ణుడు తన కులం దాచిపెట్టి పరశురాముని దగ్గర బ్రహ్మాస్త్ర ప్రయోగం నేర్చుకున్నాడట. తర్వాత పరశురామునికి అసలు సంగతి తెలిసి అసత్యం చెప్పాడు గనుక అతని అస్త్రవిద్యా వైభవం విఫలమవుతుందని శపించాడు.

పరశురాముని కథను భీష్మునితోనూ అంబతోనూ కూడా కలిపారు. హోత్ర వాహనుడనే రాజర్షి కూతురు, అంబ. ఆమెను స్వయంవరంలో భీష్ముడు తీసుకు పోయాడు. తన తమ్ముళ్ళకు వివాహం చేద్దామనుకున్నాడు. ఆమె అంతకుముందే సాళ్వుని వరించి ఉంది. ఆ సంగతి తెలిసి భీష్ముడు ఆమెను సాళ్వుని దగ్గరకు పంపేశాడు. ఆమె చూస్తుండగానే భీష్ముని చేతిలో తాను ఓడిపోయాను గనుక ఆమెను తాను స్వీకరించ లేనన్నాడు

సాళ్వుడు. అంబను చేసుకోవటానికి భీష్ముడూ ఒప్పుకోలేదు. అంబ జీవితం ఎటూ కానిదయింది. తండ్రీ కూతురూ పరశురాముని దగ్గరకు వచ్చారు. భీష్ముడు పరశురాముని శిష్యుడేనట. అతని మాట వింటాడేమో అనుకున్నారు. "భీష్ముని వంచించాలా సాళ్వుని వంచించాలా" అని పరశురాముడు అంబను అడిగాడట. ఇది చాలా వింత ప్రశ్న. ఒక స్త్రీకి న్యాయం జరగటం అవతలి వారికి వంచనగా కనిపించిందా?

పరశురాముడు భీష్ముడి దగ్గరకు అంబను తీసుకువెళ్ళి ఆమెను పరిగ్రహించవలసిందిగా కోరాడు. ఇతరులను ప్రేమించిన దానిని తాను స్వీకరించలేనన్నాడు భీష్ముడు. పరశురాముడు భీష్మునితో యుద్ధం చేశాడు. వారు ఇరవై నాలుగు(24) రోజులు పోరాదారు. చివరకు మునులు, దేవగణాలూ వచ్చి పోట్లాట ఆపారు. తాను చేసేదేమీలేదని పరశురాముడు వెళ్ళిపోయారు. అంబ అవమానంతో కోపంతో రగిలిపోయింది. అంబ తపస్సూ ఆమె భీష్మునిపై ప్రతీకారం తీర్చుకోవటమూ వేరేకథ. భారతంలో ఈ వృత్తాంతాలన్నీ ఉన్నాయి. బ్రహ్మాండ పురాణంలోనూ మరిన్ని కథలున్నాయి.

పరశురాముడు కృష్ణ స్తోత్రం పఠించినప్పుడు కృష్ణుడు ప్రత్యక్షమై తన తేజస్సు ఇతనికి ఇచ్చాడట. రామావతారంలో ఆ తేజస్సును తిరిగి తీసుకుంటానన్నాడట. కృష్ణ స్తోత్రాన్నీ, విష్ణు స్తోత్రాన్నీ పౌరాణికులు ఒకేలాగ చూశారు. సీతను వివాహం చేసుకుని శ్రీరాముడు అయోధ్యకు వెళ్తుండగా దారిలో పరశురాముడు వారిని అడ్డగించినట్లూ రాముడు విష్ణువే అని గ్రహించి తొలగిపోయినట్లూ రామాయణం చెబుతోంది. మాతృస్వామ్యాన్ని కాదని పితృస్వామ్యాన్ని బలపరచటం పరశురాముని కాలపు సామాజిక లక్షణం.

గోకర్ణ క్షేత్రం సముద్రంలో మునిగిపోయినప్పుడు పరశురాముడు సముద్రుని బెదిరించి అతడు ఆక్రమించిన తీరాన్నుండి వెనక్కు తగ్గేలాగ చేశాడని ఒక కథ.

క్షత్రియులను వధించి వశపరచుకున్న భూమినంతా పరశురాముడు కశ్యపునికి దానం చేశాడు. తనకు దానం చేసిన భూమిమీద ఉండవద్దనీ దక్షిణ సముద్రం దాటి పొమ్మనీ కశ్యపుడు పరశురామునికి చెప్పాడు. అప్పుడు సముద్రుడు కొంత వెనక్కు తగ్గి ఇతనికి ఉండటానికి చోటు ఇచ్చాడని మరో కథ.

పరశురాముని కథ నిశితంగా పరిశీలించవలసిన కథ. రాజకీయ సామాజిక అంశాలెన్నో ఇందులో ఉన్నాయి. ఆర్య - అనార్య సంఘర్షణలను పురాణాలు క్షత్రియ - బ్రాహ్మణ స్పర్థలుగా చూపారంటారు మహాత్మా జోతిరావు పూలే. పరశురాముడు బ్రాహ్మణ క్షత్రియ స్వభావాలతో పుట్టాడని కథలెన్ని చెప్పినప్పటికీ అక్కడ జరిగినది అసుర క్షత్రియుల సంహారం.

మహాత్మా జోతిరావ్ పూలే విశ్లేషణ ప్రకారం పరశురాముడు చంపినది అసుర క్షత్రియులను. అంటే ఇండియాలోని స్థానిక రాజులనూ, - ఆదివాసీ మూలవాసీ

నాయకులనూ ప్రజలనూ. ఇరానియన్ ఆర్యవర్గాల ప్రతినిధిగా ఇక్కడ పరశురాముడిని చూడాలి.

ఈ ఉదంతాన్ని మరో కోణంలోనూ చూడాలి. పురాణాలు చెప్పే నారాయణుని అవతార గాథలలో దశావతారాల క్రమంలో వామనావతారం తర్వాతది పరశు రామావతారం. వామనుడు ముల్లోకాలూ ఆక్రమించి భూమినంతా ఇంద్రునికి కట్టబెట్టాక దేవగణాల రాజ్యం కొంతకాలం సాగింది. అయితే బలి పుత్రుడు బాణాసురుడూ, బలి ఇతర పుత్రులు అంగ, వంగ, కళింగ రాజులూ – వారి వారసులూ ఆర్యులను బలంగా తిప్పికొట్టారు. దేశమంతటా తిరుగుబాట్లు తలెత్తి ఉంటాయి. అసుర రాజులు ఎక్కడికక్కడ బలపడ్డారు. వారిని అణచటం కష్టమయింది. బాణాసురుని కూతురు ఉష యాదవ వీరుడైన అనిరుద్ధుడిని ప్రేమించటం – బాణుడు అనిరుద్ధుని బంధించటం – చివరకు వారి వివాహాన్ని ఆమోదించటం పురాణాలు చెప్పాయి. ఆ విధంగా స్థానికులతో బాంధవ్యాలు నెలకొన్నాయి. అనిరుద్ధుడు యాదవుడు. బాణుడు అసుర క్షత్రియుడు. కులాలువేరయినా శివుడు బాణునికి సహాయపడటం – విష్ణువు అవతారంగా భావించే కృష్ణుడు అనిరుద్ధునికి సహాయపడటం వంటివి ఆర్యేతర జాతులు కలిసి బలపడటాన్ని సూచిస్తున్నాయి. అందుకే వారిని అణచటానికి పరశురామావతారం అవసరమయింది.

కులాల ఏర్పాటుకు పరశురాముడే కారణం అంటారు పూలే. పరశురాముని కాలంలోనే శూద్రులలోనుండే అతిశూద్ర కులాలు ఏర్పరచారని ఆయన విశ్లేషించారు. తమను ఎదుర్కొన్న గొప్ప శత్రువులను – (అసుర క్షత్రియులను) ఆర్యులు మహా+అరి= మహర్‌గా భావించారు. పరశురాముడు వారిని ఓడించి క్షుద్రులుగా (శూద్రులుగా)[1] చూశాడు. తనను చాలా బలంగా ఎదుర్కొన్న మహర్ నాయకులను అతి క్షుద్రులు – అతి శూద్రులుగా వేరుచేసి వారిని కఠిన శిక్షలకు గురిచేశాడు. వారితో ఇతర శూద్రులు కలవకూడదనీ వారిని వెలిగా ఉంచాలనీ ఆజ్ఞాపించాడు. వారికి వేరే నియమాలు ఆంక్షలు జారీ చేశాడు. శూద్ర రాజులనూ – అతి శూద్రరాజులనూ పరశురాముడు హింసించిన తీరు దారుణ మైనదే. ఇళ్ళ పునాదులలో బలి ఇవ్వటం – కుటుంబాలను మొత్తంగా వరుసగా నిలబెట్టి వారిపై కట్టడాలు నిర్మించటం – వంటివి చేశాడన్నారు. ఇరవైఒక్క పర్యాయాల వెదకు లాటలో తప్పించుకున్నవారు చాలా తక్కువ. వారిలో కొందరు రావణుని ఆశ్రయించి బ్రతికారంటారు. పరశురాముని ప్రకారం మహర్, మాంగ్, భంగీ వంటివి అంటరాని కులాలు. తమకు విధేయులైన మహర్లను ఆర్యులు చేర్చుకుని వైశ్య క్షత్రియ హోదాలు ఇచ్చారు. అవిధేయులను మహర్లుగానే ఉంచేశారు. తిరుగుబాటుదార్లను అంటరాని కులాలుగా వర్గీకరించి వారికి నీచ వృత్తులు అంటగట్టారు. వారినే పూలే అతిశూద్ర

1. "క్షుద్రక" అనే గణరాజ్యం అలెగ్జాండర్ దండయాత్ర కాలంనాటికే ఉన్నది.

(అంటరాని) వర్గాలుగా చెప్పాడు. పరశురాముడు[1] చిరంజీవి అనీ ఇంకా ఎక్కడో ఉన్నాడనీ చెప్పే కథలను పూలే ఖండించాడు.

భారతదేశ చరిత్రలో ఈనాడు ఇన్ని సంఘటనలు జరిగాక కూడా పరశురాముడు ప్రతిస్పందించి బయటకు రాలేదేమిటి? అని ప్రశ్నించాడు పూలే. ఆదినారాయణుని కొడుకూ చిరంజీవీ అయిన పరశురామునికి పూలే (1-8-1872న) ఒక బహిరంగలేఖ రాశాడు. బయటికి వచ్చి అందరికీ కనబడి తన ఉనికిని నిరూపించుకోవాలని కోరాడు. సవాలు విసిరాడు. (పరశురాముడు రాలేదు కాని, పూనే నగరంలోని ఆర్య పురోహితవర్గం అంతా ఆ లేఖకు ప్రతిస్పందించి కదలివచ్చింది.)

---

1. ఉత్తరప్రదేశ్‌లో జలాలాబాద్ సమీపంలో పరశురామపురంలో పరశురాముని ఆలయం ఉంది. ఆలయం ముందు భాగంలో ఒక గండ్రగొడ్డలి కూడా ఉంది. పరశురాముడు చారిత్రక పురుషుడని అక్కడి వారు నమ్ముతున్నారు.

# రామకథ - వర్గస్వామ్యం

ప్రస్తుత భారతదేశంలో వైదిక ధర్మాన్ని నమ్మే ప్రజలలో చాలామంది రాముడినో కృష్ణుడినో ఇలవేల్పుగా కొలుస్తుంటారు. ఆంధ్రదేశంలో బహుశః రాముడికే ఎక్కువ జనాదరణ ఉన్నది. దాదాపు ప్రతి ఊళ్ళోనూ రామాలయం ఉంటుంది. ఉత్తరప్రదేశ్‌లోని రామ జన్మభూమి నుండి దక్షిణాన శ్రీలంకవరకూ అన్నీ రాముడు తిరిగిన ప్రదేశాలే అంటూ ఆనవాళ్ళు చూపిస్తుంటారు. ఇరవై ఒకటో శతాబ్దంలో (సమకాలీన) రాజకీయాల లోని పాదయాత్రలూ రథయాత్రలూ చూశాక రాముని ప్రయాణాలమీదా అనుమానం వస్తుంది. కొంచెం ఆలోచిస్తే రాముని పాదయాత్ర వెనుకా రాజకీయ ఉద్దేశాలున్నట్టు స్పష్టమవుతుంది. అనార్యుల, స్థానిక అసురుల అణచివేత లక్ష్యంగా సాగిన జైత్రయాత్ర అది. దాని వెనక సామాజిక మత ధార్మిక ప్రయోజనాలున్నాయి.

వాస్తవానికి రామాలయాల కంటే హనుమంతుని గుడులే దేశంలో ఎక్కువ. హను మంతుడూ, జాంబవంతుడూ ఈ దేశంలోని ఆదిమ నాయకులు. అయినా హనుమంతుని శక్తి అంతా రామునివల్లనే వచ్చిందనే నమ్మకం ప్రజలకు కలిగిస్తూ అనార్యులకు ఆర్య నాయకుల వల్లనే శక్తులు చేకూరతాయనే ప్రచారానికి రామకథ నాంది పలికింది.

వర్తమానంలోనూ అంతే. అగ్ర/ఆధిపత్య కులాలవారు నాయకులు. దళితులూ/ బహుజనులూ, వారి అనుచరులు.

వైదిక క్రతు కర్మకాండలతో విసిగిపోయి ప్రజలు జైన, బౌద్ధాలను ఆదరిస్తున్న సమయంలో వేదాల ప్రామాణికతను నిలబెట్టటానికీ పురోహిత వర్గానికి పూర్వ వైభవం తేవటానికీ వర్ణధర్మాన్ని ప్రతిష్ఠించటానికీ బ్రాహ్మణేతర వర్గాలను అణచిపెట్టటానికీ, స్త్రీల స్వేచ్ఛను నియంత్రించటానికీ జరిగిన బహుముఖ బృహత్ ప్రయత్నాలలో భాగంగా రామాయణ కావ్యం రూపుదిద్దుకున్నది. జైన తీర్థంకరులకూ, బుద్ధునికీ దీటుగా ఒక మహా పురుషుని సృష్టించి అతనిని అవతారమూర్తిగా ప్రచారం చేయవలసిన అవసరం ఆనాటి ఆధిపత్య వర్గాలకు ఏర్పడింది. ఫలితంగానే రాముడు అవతరించాడు.

"కావ్యం రామాయణం కృత్స్నం సీతాయాశ్చరితం
మహత్ పౌలస్త్య వధ మిత్యేవ చ కార చరిత వ్రతః"

అని రామాయణం బాలకాండ 4-7 చెబుతున్నది.

సీత చరిత్రకూ పౌలస్త్య (రావణ) వధకూ సంబంధించిన ఆయా సంఘటనలలోని అనుకూల ప్రతికూల భావజాలాన్ని ఒక నాయకునికి అనుసంధానం చేయటం రామాయణంలోని కావ్య శిల్పం-వర్గ మత ప్రయోజనమూను. ఆర్యమతాన్ని ప్రతిష్ఠించే మత గ్రంథంగా నిత్యపారాయణ గ్రంథంగా రామాయణాన్ని నిలబెట్టటం వెనుక ఎంతో

మంత్రాంగం ఉన్నది. రాముని బంటుగా చెప్పబడుతున్న ఆంజనేయుడు రామునికంటే ప్రభావ సంపన్నుడు. అయినా రామునికి విధేయుడు. ప్రాచీన సమాజంలో అసుర/ద్రావిడ వీరులెందరో ఉన్నారు. ఆ వీరులను అనార్యులుగా (వానరులుగా) చిత్రించి రామ భక్తులుగా చేసుకోవటం ఆదిమ సమాజాల నమ్మకాలను తమవిగా చెప్పుకోవటం, జాంబవంతుడు, హనుమంతుడు వంటి శక్తిశాలురను శాసించగల నాయకునిగా రాముని నిలబెట్టడం ఆధిపత్య రాజకీయాల ఫలితంగా జరిగింది.

మతం ఆధిపత్య వర్గాలకు అనుకూలంగా ఉండాలన్నదే రామాయణ కావ్య లక్ష్యం. "విధేయత" అనేది కావ్యంలో అడుగడుగునా పితృభక్తి, భ్రాతృభక్తి, పతిభక్తి వంటి రూపాలలో ప్రచారం చేశారు.శూద్రులకూ, స్త్రీలకూ సేవాధర్మం, స్త్రీ ధర్మం వంటి ఉపదేశాలు నిక్షేపించారు.

మానవ జీవితంలో దుఃఖాన్ని నివారించుకోవాలనీ జీవికి మరణం తప్పదనీ బుద్ధుడు చెప్పాడు. బుద్ధుని కంటే రాముడిని గొప్పగా నిలబెట్టాలి గనక మరణించిన బ్రాహ్మణ బాలకుని తిరిగి బతికించిన అలౌకిక పురుషునిగా రాముడిని చూపారు. మనిషి చేసే పాపాలన్నీ పూజలతో మొక్కులతో పోతాయనే నమ్మకాన్ని ప్రజలలో కలిగించటంవల్ల మనిషి ప్రవర్తనా రీతులపై నియంత్రణ పోయి సమాజంలో అవినీతి పెరిగింది. ఇందుకు మతమే కారణమైంది. పర్సంటేజీలతో, కానుకలతో, స్తుతి వచనాలతో దేవుడిని తమకు అనుకూలంగా చేసుకోవచ్చుననే ప్రబోధమే సామాజిక అవినీతికీ, లంచ గొండితనాలకూ దారితీసింది. ఈ మత ధోరణులను ఎప్పటికప్పుడు పరిశీలించి సంస్కరించుకోవలసిందే.

'రామ' అంటే అందమైన అని అర్థం. భారతదేశంలో శివాలిక్ కొండలలో సంచరించిన పూర్వ మానవునికి 'రామా పితికస్' అని శాస్త్రవేత్తలు పేరుపెట్టారు. మెదడు నిర్మాణం పరిపుష్టమైన దశలోని జీవికి "సుగ్రీవో పితికస్" అని పేరుపెట్టారు. రామ, సుగ్రీవ అనేవి సంస్కృత పదాలు. ఇవి రామకథలో చేరాయి. చరిత్రపరంగా మౌర్య రాజులలో కడపటి రాజు 'దశరథుడు' (నాగార్జునకొండ గుహలోని శాసనం). రామాయణంలో రాముని తండ్రి దశరథుడు. సింధు, సౌవీర, సౌరాష్ట్రాలు - అంగ, వంగ, మగధ, మత్స్య, కోసల, కాశీ రాజ్యాలు దశరథుని అధీనంలో ఉన్నట్టు రామాయణ కవులు చెప్పారు. (అయో. 10-37). త్రేతాయుగపు రామావతార కాలం క్రీ.పూ. 102 అని కొందరి అభిప్రాయం. అది కుషానుల కాలం.

రామాయణం ఒక పాటగా మొదలై సంస్కృత భాషలో ఆదికావ్యంగా ఆవిర్భవించింది. పాట గొప్ప ప్రచార సాధనం. జనసామాన్యానికి అర్థమయ్యే భాషలోనే మొదటిపాట ఉండి ఉండాలి. సామాజిక ప్రయోజనం కోసం రాశారు కాబట్టి దానిని ప్రజల భాషలోనే ప్రచారం చేసి ఉంటారు. సంస్కృతంలో కావ్యంగా వచ్చిన కాలం క్రీ.శ. 250 ప్రాంతం.

వారసత్వ కలహాలు, కుటుంబ సంబంధాలు ప్రవర్తనా నియమాలు దీనిలో ఉన్నాయి. ఇది కొన్ని వర్గాల ప్రయోజనాన్నే దృష్టిలో పెట్టుకున్నది.

రామాయణ రచయిత వాల్మీకి కొన్ని సంఘటనల కారణంగా రుషిగా ఎదిగి రామాయణ కావ్యాన్ని సంస్కృతంలో రాయగలిగాడు. సామాన్య మానవునిగా ఉన్న వ్యక్తి అత్యున్నత స్థాయికి ఎదగడం అనే అంశాన్ని ఇక్కడ చూడవచ్చు. కాని రామాయణ కథలో దిగువ వర్గాలవారు ఉన్నత స్థాయికి ఎదిగిన సంఘటనలు అంతగా కన్పడవు. ఎదగాలనుకునే వారిని నిరుత్సాహపరచడం కన్పిస్తుంది. సమాజాన్ని నియంత్రించే క్రమంలో సామాజిక ప్రయోజనం కోసం వర్ణధర్మాన్ని సమర్థించటం, అందులోనే దేశం సుఖం ఉన్నదనటం, గోబ్రాహ్మణ హితం కోసం కింది వర్గాలను చంపవచ్చుననటం, స్త్రీలను కూడా చంపవచ్చుననటం రామాయణంలో చూడవచ్చు. సామాజిక ప్రయోజనం కోసం స్త్రీలను, శూద్రులను చంపటం తప్పుకాదని రామాయణం హామీ ఇస్తున్నది. రామాయణం బాలకాండలో తాటక వధ వృత్తాంతం ఉంది. ఉత్తరకాండలో శంబుక వధ వృత్తాంతం ఉంది. ఈ రెండు ఘట్టాలలో గోబ్రాహ్మణ హితం, నాగరాజ్యాలను నాశనం చేయటం, వర్ణ ధర్మాన్ని ఉల్లంఘించిన వారిని రాజ్యం శిక్షించటం ఉన్నాయి. స్త్రీవధ నిందార్హమైనదైనా తాటకను చంపారు. తాటక వధను ఘనకార్యంగా ప్రచారం చేశారు.

ఒక కుక్కను చంపాలంటే దానిని పిచ్చికుక్కగా ముద్రవేసి చంపటం లోకరీతి. భారతీయ పురాణాలలో ముఖ్యంగా రామాయణంలో ప్రత్యర్థులను చంపటానికి వారికి "రాక్షసులు" అని ముద్రవేయటం కనిపిస్తుంది. యక్షిణీ, నాగరాణీ అయిన తాటకనూ జనస్థానంలోని స్థానిక రాజులనూ చంపటంలో రాజ్యం అనుసరించిన నీతి ఇదే. నాగజాతులపై ఆర్యజాతులకు గల వైరం మతపరమైనది. మతం అంటే జీవన విధానం.

బౌద్ధంలో 'నాగ' పదం ధార్మిక జీవనానికీ అది ఇచ్చే సత్ఫలితాలకూ సంకేతం. బౌద్ధుల దమ్మపథంలో నాగవర్గం ప్రత్యేకంగా చెప్పబడింది. ఆ జీవన రీతులు ఆర్యులకు సరిపడలేదు; నచ్చలెదు. దమ్మపదంలో బ్రాహ్మణుల గురించీ ఉంది. అవీ ఆర్యులకు సమ్మతం కాలేదు. "బ్రాహ్మణ్యం సుఖప్రదం" అని నాగవర్గం – 13 చెప్పింది. అప్పటి బ్రాహ్మణ సమాజం సుఖజీవనానికి అలవాటు పడిందన్నమాట. దశరథుని ఆస్థానం – కౌసల్య బ్రాహ్మణ బ్రహ్మచారులను పోషించటం వంటివి ఇందుకు తార్కాణాలు.

శంబుక వధ శూద్రుల జ్ఞానార్జనను కట్టడి చేసేందుకోసం జరిగింది. మత, రాజకీయ సామాజిక సంబంధాల గురించిన జ్ఞానం అగ్ర/ఆధిపత్య వర్గాలకు మాత్రమే అందాలనే సమాజం అది. దిగువ వర్గాలు చైతన్యవంతులు కాకుండా వారిని నిర్దాక్షిణ్యంగా అణచివేయటం, చంపటం (హత్య చేయటం) జరిగింది. ఈ హత్యలకు విచారణ లేదు. నేరాల స్వభావాన్ని నేపథ్యాన్నీ కారణాలనూ విచారించి శిక్షలు వేయటం అనే పద్ధతి లేదు. అదే రామరాజ్యం.

రామావతారానికి ముందు ప్రణాళిక కట్టుదిట్టంగానే వేశారు. ఇప్పటి ఎన్నికల ప్రణాళికల లాగానే ముందస్తు సన్నాహాలు జరిగాయి.

దశరథుడు పుత్ర కామేష్టి తలపెట్టే నాటికే విష్ణువు రామునిగా పుట్టాలనే ఆలోచన ఉన్నది. రాముడికి సహాయంగా పరివారమూ పుట్టారు. అంతకు ముందే బ్రహ్మ జాంబవంతుడిని సృజించి ఉంచాడు. బ్రహ్మ ఆజ్ఞ చేతనే దేవగణాలు గంధర్వ, కిన్నర, అప్సరస స్త్రీలకు వానరులుగా పుట్టారట. జనసమీకరణ అంతా హైకమాండు ఏర్పాటు. వానర యోధులు నూరు లక్షలట.

దక్షిణ దేశంలోని జనులను - దండకలోని వారినీ (వారు వైదికమతాన్ని పాటించటం లేదు గనక) నిర్మూలించటానికి ఇంత ప్రణాళిక వేసుకున్నాయి, దేవగణాలు. దండకలో అసుర సంస్కృతి ఉన్నది. వారు జైన, శైవ, బౌద్ధ ధర్మాలు ఇష్టపడేవారు. వారిని వైష్ణవ మతానుయాయులుగా చేయటమే రామావతార లక్ష్యం.

పుత్ర కామేష్టి యజ్ఞం జరిగాక యజ్ఞ పురుషుడు వచ్చి "ఇదిగో పాయసం, దీన్ని తాగితే పుత్రులు కలుగుతారు" (ఇదం తు నృపశార్దూల పాయసం దేవ నిర్మితం ప్రజాకరం. గృహాణత్వం ధన్య మారోగ్య వర్ధనం) అని దశరథునికి ఇచ్చాడు. ప్రజాకరం అంటే పుత్రులను ఇచ్చేది అని అర్థం. ప్రజ అంటే కొడుకు. "కౌసల్యాసు ప్రజా రామా" అంటే కౌసల్య కొడుకైన రాముడా అని అర్థం. దేవగణాలు తమ శత్రువైన అసురులను చంపటానికి ఆర్యరాజైన రాముడిని సాధనంగా చేసుకున్నాయి. అసురులను రాముడు చంపిన ప్రతి సందర్భంలోనూ దేవగణాల ప్రోత్సాహం ఉన్న విషయం వాల్మీకి వర్ణించాడు. భారతదేశంలో తమ మతాన్ని సంస్కృతిని వ్యాపింపచేయటం ఆర్యుల లక్ష్యం. 'కృణ్వంతో విశ్వ మార్యం' అంటూ విజృంభించిన ఆర్య ప్రభంజనానికి ఆర్య రాజు రాముడు ప్రతీక. అతనికి అడుగడుగునా దేవగణాల/మునుల సహాయం అందింది; విద్యల ద్వారానూ, ఆయుధాల రూపంలోనూ అందింది. తాటకను చంపటానికి ముందు విశ్వామిత్రుడు నేర్పిన విద్యలూ, ఇచ్చిన ఆయుధాలూ, దండకలో ఖర దూషణాదులతోడి యుద్ధంలో అక్షయంగా అందిన బాణాలూ. అగస్త్యుడిచ్చిన ఆయుధాలూ - రావణ వధకు ముందు ఇంద్రుడిచ్చిన రధమూ, ఆయుధాలూ ఇందుకు తార్కాణాలు.

దేవగణాలు, మునులు రాజ్యశక్తులు. రావణాసురుడిని ఇతర అసురులనూ రామునిచేత చంపించే ఆలోచన శరభంగ ముని ఆశ్రమంలో జరిగింది. (అరణ్య-సర్గ 5). సుతీక్ష్ణ మహర్షి అందుకోసం తాను ఆర్జించిన పుణ్యం రామునికి ధార పోయటానికి సిద్ధపడ్డాడు. కాని రాముడు తీసుకోలేదు. తన పుణ్యాలు తాను సంపాదించు కుంటానన్నాడు (సర్గ-8). పాలకవర్గం కార్పొరేట్ శక్తులకు సహకరించటం అంటే ఇలాంటిదే. పరస్పరం సహకరించుకున్నారు. ప్రయోజనాలు పొందారు.

ఆర్యమతంలో వర్ణధర్మం ప్రధానమైనది. దానిని స్థిరంగా నిలబెట్టే ప్రయత్నమూ అక్కడ జరిగింది. ఆ లక్ష్యాలతో రామాయణ కథ ప్రచారమైంది. మతోన్మాదం పెచ్చుపెరిగి పోతున్న ఈ రోజులలో రామాయణాన్ని మానవతా దృక్పథంతో పరిశీలించుకోవటం ఒక అవసరం. మునుల రక్షణ కోసం రాక్షసులను చంపుతాననటం రాముని హింసా ప్రవృత్తికి నిదర్శనం. (అరణ్యకాండ. 7.25) ఇది పాలకవర్గ ప్రవృత్తి.

అరణ్యవాసం చేయటం అంటే బాణాలు పట్టుకుని తిరగటంకాదని సీత రామునికి చెప్పింది. "దండకలో రాక్షసులు కనిపిస్తే నీవు వారిని చంపుతావు. అందువల్ల మనం దండకలో ఉండటం నాకు ఇష్టంలేదు" అనీ స్పష్టంగా చెప్పింది.

ఆయుధం, అరణ్యవాసం; క్షత్రియ ధర్మం - తపస్సు అనేవి పరస్పర విరుద్ధాలు (అరణ్య 9-27, 28) అనీ చెప్పింది. ఆయుధాలవల్ల బుద్ధి కలుషితమవుతుందని ఒక కథ కూడా చెప్పింది. అయినా రాముడు వినలేదు. తాను ఆయుధం పట్టుకుని తిరగటం మునుల రక్షణ కోసమే - అన్నాడు. ఇప్పుడు ప్రభుత్వాలూ అలానే అంటున్నాయి.

రాముని పాత్ర చిత్రణ గురించి ఆలోచిస్తే పురుషస్వామ్యానికి అనుగుణంగా అతనిని మలిచినట్లు తెలుస్తుంది. తాను వ్యవహార దక్షుడిననీ రాజనీతివేత్తననీ ఆయన నమ్మకం. పైకి వినయంగా కనిపించటం మంచిపేరు తెచ్చుకోవటానికే. ఇంటికి పెద్ద కొడుకు గౌరవింపబడాలనీ బాధ్యతలు తీసుకోవాలనీ భావించే వ్యవస్థను ప్రతిబింబిస్తూ రాముని పాత్రను తీర్చిదిద్దారు. విధేయుడైన కొడుకుగా తల్లులను గౌరవించినా ఇతర స్త్రీల విషయంలో అతడు దురుసుగానే ఉండేవాడు. సహధర్మచారిణిగా భార్య ఇచ్చిన సలహాలు ఎప్పుడూ పాటించలేదు. స్త్రీలు కేవలం సేవాధర్మంతో మెలగాలనుకునేవాడు. అరణ్య వాసంలో అతడు భార్యను చాలా ప్రేమగా చూసుకున్నాడని కొన్ని రామాయణాలు చెప్పి నప్పటికీ స్త్రీలపట్ల రాముడు గౌరవంగా మర్యాదగా వ్యవహరించాడని చెప్పలేదు. తండ్రి మాట, మునుల ఆజ్ఞ దాటరానివిగా భావించినా స్వంత నిర్ణయాలు తీసుకునేటప్పుడు కఠినుడుగానే స్వార్థపరుడిగానే కనిపిస్తాడు. అరణ్యవాసానికి సీత కూడా తన వెంట వస్తానన్నప్పుడు లోపల సంతోషించినా పైకి మాత్రం ఆమెను తనతో రావద్దన్నాడు. అయోధ్యలోనే ఉండి అత్తలను చూసుకోవలసిందిగా రాజైన భరతుని సేవించవలసిందిగా హితబోధ చేశాడు. భరతుని పట్ల ఎలా నడుచుకోవాలో చెప్పాడు. రాముని అనుమాన ప్రవృత్తిని అర్థం చేసుకున్నది గనకనే సీత ఎలాగో ఒప్పించి అతని వెంట వెళ్ళింది.

వనవాసంలో ఆయుధాలు ధరించి తిరగకూడదని సీత చెప్పినా రాముడు వినలేదు. మునులు వచ్చి రామునితో మంతనాలు జరపటాన్ని గ్రహించిన సీత అప్పుడు కూడా రామునికి సలహాలు ఇచ్చింది. వాటినీ రాముడు లక్ష్యపెట్టలేదు. ఈ కోణంలో చూస్తే పురుషస్వామ్యం ఎలా నిలబెట్టుకోవాలో చెప్పే ఆదర్శమూర్తిగా రాముడు కనబడతాడు - ఇప్పటికీ ఆయన పురుష లోకానికి ఆదర్శంగానే ఉన్నాడు. స్త్రీలపట్ల రాముని వ్యవహారం

శూర్పనఖ పట్ల అమర్యాదగా ప్రవర్తించిన తీరులో అప్పటి పురుషాహంకారమూ ఆధిపత్య వర్గాల ధోరణీ తెలుస్తున్నాయి.

పెద్దలను ప్రసన్నం చేసుకోవటం కోసం వారి మాట పాటించటం అనే విధేయతా లక్షణం రామునిలో ఉంది. తండ్రినీ - మునులనూ సంతోషపెట్టటం కోసం స్త్రీలను చంపరాదనే ధర్మాన్ని అతిక్రమించి రాముడు తాటకను చంపాడు. అందులోనూ దారుణంగా హింసించి చంపాడు. ముక్కు, చెవులు కోసి - చేతులు నరికి - గుండెల్లోకి బాణాలువేసి చిత్రహింసలు పెట్టి మరీ చంపాడు. నక్సల్స్‌నూ, మావోయిస్టులనూ, అనుమానితులనూ పోలీసులు చంపే విధంగా, దళితులపై అగ్రవర్ణాలు చేసే దాడులలోని హింసలలాగా కారంచేడులో దళిత యువకుల నోళ్ళలో గునపాలు దించి చంపినట్లుగా, నోటిలో తుపాకిపెట్టి కాల్చినట్టుగా ఈ చిత్ర హింసలున్నాయి.

స్త్రీలను అనుమానించే ప్రవృత్తి - వారికి శీలపరీక్షలు పెట్టటం, నిర్దయగా పుట్టింటికో అడవులకో తరిమేయటం వంటి ధోరణి అప్పటి సమాజం స్త్రీస్వామ్యం నుండి పురుషస్వామ్యానికి మారుతున్న దశను సూచిస్తున్నది. దశరధుని కాలంలో కైక దశరధుని వెంట యుద్ధరంగానికి వెళ్ళింది. పురుషులతోపాటుగా స్త్రీలూ విద్యలు నేర్వగలిగిన సమాజం అప్పటికి ఉంది. రాముని కాలానికి స్త్రీల ప్రతిపత్తి తగ్గింది. ఆడపిల్ల పుట్టిందంటే విచారించటం - పొలాలలోనో రోడ్లపక్కనో వదలివేయటంలాంటివీ ఉన్నాయి. అలాంటి వారిని చేరదీసిన కథలూ ఉన్నాయి. సీత, ద్రౌపది అయోనిజలు.[1] స్పష్టంగా చెప్పాలంటే తలిదండ్రులు వదలిపెట్టిన ఆడపిల్లలు. వీరిని యజ్ఞపుత్రికలనీ అగ్ని పుత్రికలనీ అప్పటి సమాజం చేరదీసింది.

వనవాసంలో 10 సంవత్సరాలు గడిచాక సీతారాములు సుతీక్ష్ణ మహర్షి ఆశ్రమానికి వెళ్ళారు. అక్కడ కొన్నాళ్ళుండి అగస్త్యుని ఆశ్రమానికి వెళ్ళారు. అగస్త్యుడు రాముని కోసం ఎదురు చూస్తున్నాడు. బ్రహ్మ ఇచ్చిన ధనుస్సూ, ఇంద్రుడు ఇచ్చిన అంబుల పొదీ, కత్తీ అగస్త్యుని దగ్గర ఉన్నాయి. "వాటితోనే పూర్వం అసురులను చంపటం జరిగింది - అవి నీకు అవసరమౌతాయి నీ దగ్గర ఉంచు" అని అగస్త్యుడు వాటిని రామునికి ఇచ్చాడు.

ఎక్కడ ఆశ్రమం నిర్మించుకోవాలో కూడా సలహా ఇచ్చాడు. ఈ నేపథ్యం చాలా అవసరం. వారు జనస్థానంలో పంచవటి దగ్గర ఆశ్రమం నిర్మించుకున్నారు. జనస్థానం రాక్షసుల రాజ్యం. రామాయణ కథా కాలంనాటికి దండకారణ్యంలో ఆంధ్రులు గొప్ప నాగరికతతో ఉన్నారు. వారిది దస్యు వారసత్వం. నాగులుగా రాక్షసులుగా చెప్పబడ్డది వారే.

---

1 ఏ కులపు యోని నుండి పుట్టారో తెలీదు. గనక అయోనిజ అన్నారు.

రాముడు చాలాకాలం నివసించిన "పంచవటి" మహారాష్ట్రదేశంలో ఉన్నదని మహారాష్ట్రులు వాదిస్తున్నారు. మహారాష్ట్రులు పర్వదినాలలో సంకల్పం చెప్పేటప్పుడు "దండకారణ్యే" అని సంకల్పం చెప్పేవారట. దౌలతాబాదు (దేవగిరి) దండకారణ్యంలోనిదే. పారియాత్ర పర్వతం మహారాష్ట్ర నుంచి పశ్చిమ మార్గంలో ఉన్నది. ఇవన్నీ పంచవటిని తమదిగా చెప్పు కునేందుకు ఉదాహరణలుగా వారు చూపుతున్నారు.

భద్రాచల ప్రాంతపు పర్ణశాల పంచవటి అని ఆంధ్రుల వాదన. గోదావరి ప్రాంతం వారూ భద్రాచలం ప్రాంతంలోని వారూ "దండకారణ్యే" అని సంకల్పం చదువుతున్నారు.

రామసేతువును గురించి ఇప్పటికీ భిన్నాభిప్రాయాలున్నాయి. ధనుష్కోటి దగ్గర తాను నిర్మింపజేసిన సేతువును రాముడే ఛేదించివేశాడని స్కంద పురాణం (అధ్యా. 3-30) చెబుతున్నది. ఈ సేతువు నీటిపై తేలే రాళ్ళతో నిర్మించిన తాత్కాలిక వంతెన. (నీటిపై తేలే రాళ్ళు ఇప్పటికీ చాలాచోట్ల వరంగల్ రామప్ప దేవాలయం, ఘనపూర్ ఆలయాలు మొ॥ చోట్ల కనిపిస్తాయి. ప్రాచీన వాస్తు కళా రహస్యాలు ఇప్పటికీ నిగూఢంగానే ఉన్నాయి.) రావణుని చంపిన తర్వాత ఆ బ్రహ్మహత్యా పాతకాన్ని పోగొట్టుకోవటానికి రాముడు చాలాచోట్ల యజ్ఞాలూ, పూజలూ చేశాడు. గుజరాత్‌లోని "మొధేరా"లో ఒక యజ్ఞం చేశాడట. అక్కడ అనంతర కాలంలో సూర్యదేవాలయం నిర్మించారు.

ఆంధ్రప్రదేశ్‌లోని అంతర్వేది తీర్థంలోనూ రాముడు పూజలు చేశాడు. తర్వాత అక్కడ నరసింహుని ఆలయం వెలిసింది. రామేశ్వరంలోనూ ఇంకా అనేకచోట్ల శివలింగాలు ప్రతిష్ఠించాడు. (తూర్పు గోదావరి జిల్లాలోని శివకోదులో చివరిది ప్రతిష్ఠించటంతో కోటి సంఖ్య పూర్తి అయింది. అందుకనే ఆ ఊరికి శివకోదు అనేపేరు వచ్చిందని జిల్లా గెజిట్ చెబుతోంది.)

అసురులను చంపి ప్రాయశ్చిత్త కర్మలు చేసుకున్న తర్వాత కూడా రాముడు గోబ్రాహ్మణ హితంపైనే దృష్టి నిలిపాడు. దండకారణ్యాన్ని ధర్మారణ్య క్షేత్రంగా అభివృద్ధి చేశాడు. 444 మంది బ్రాహ్మణులకు 13 గ్రామాలు పూజ కోసం ఇచ్చాడట. (స్కంద, బ్రాహ్మణ ఆగమనం 2-1-36). వారిని సేవించటానికి 36 వేలమంది (36,000) వైశ్యులను ఏర్పాటుచేశాడు. వీరు "గోభూజులు" గోవు నుంచి సృష్టించబడ్డారట. ఈ గోభూజుల సేవకు ఒక లక్షా పాతిక వేలమంది (1,25,000) శూద్రులను ఏర్పాటు చేశాడు.

ఇది రాముడు ఏర్పాటుచేసిన సామాజిక నిర్మితి. ఈ శూద్రులలో మోఢ, మాండవీయ, అండాలజ అనే మూడు రకాలవారున్నారట. ఒక్కొక్క వర్గంలోనూ 18,000 మంది చొప్పున 54,000 మందిని రాముడు అక్కడ నిలిపాడు. వారందరికీ అన్ని ఏర్పాట్లతోనూ వసతి కల్పించాడు. ఈ విషయాలతో ధర్మారణ్య క్షేత్రంలో శాసనం వేయించాడట. రాముని శాసనం వర్ణ ధర్మాలను స్థిరీకరించిందనే విషయం ఇక్కడ

స్పష్టమౌతుంది. శ్రమచేసే వర్గాలు - శ్రమ ఫలితాలను ఆస్వాదించే వర్గాలు - ఈ శాసనంలో కనబడుతున్నాయి. బ్రాహ్మణ వర్గాల ఆధిపత్యాన్ని ఇతర వర్గాలు ఆమోదించి తీరవలసిన నిర్బంధమూ ఇక్కడ ఉంది. ఇదే బ్రాహ్మణీకం. అనంతర కాలంలో జైనులూ, బౌద్ధులూ ఆ శాసనాన్ని (విలుప్తం చేశారనే) పాటించలేదనే విషయమూ ఉంది. రాముని జైత్రయాత్రను నిశితంగా పరిశీలిస్తే అప్పటి సంఘర్షణల రూపం స్పష్టపడుతుంది. రాముడు సంహరించిన అసుర వర్గాలు బౌద్ధ, జైన భావజాలం గల వర్గాలు.

ఆర్య రాజులు ఆర్యేతరుల సంప్రదాయాలనూ భాషా పాటవాన్ని అసహనంగా చూసేవారు. మొదటిసారి హనుమంతుని కలిసినప్పుడు అతని భాషనూ ఉచ్చారణ రీతినీ గమనించి రాముడు ఆశ్చర్యపోయాడట. ఆర్య రాజ్యాలలో స్త్రీల విద్యపైనా శూద్రుల చదువుపైనా, వారు తపస్సు చేయటంపైనా ఆంక్షలుండేవి. ఈ వర్గాలను చదువుకోకపోనివ్వడంవల్ల అనంతర కాలంలో అక్షరాస్యత క్షీణించింది. క్రీస్తుపూర్వపు భారతదేశంలో అక్షరాస్యత 80% ఎనభై శాతం ఉండేదనీ క్రీ.శ. పదవ శతాబ్దంనాటికి అది నాలుగు శాతానికి పడిపోయిందనీ భాషా పరిశోధకుల (పూనే భండార్కర్ పరిశోధనా కేంద్రం) అధ్యయనాలు తెలుపుతున్నాయి.

జాతక కథలలోని రామ పండితుని కథ - దశరథుని గురించిన జాతక కథలూ, గ్రీకు పురాణ గాథలూ గ్రీకు సైనికులు భారతదేశానికి వచ్చినప్పుడు వారి ద్వారా ప్రచారమైన జానపద కథలూ అన్నింటినీ తమకు అనుకూల రీతిలో మలచుకుని ఆర్య పురోహిత వర్గం రామకథ తయారు చేసింది. కర్తృత్వాన్ని వాల్మీకికి ఆపాదించడమూ రాజకీయమే.

జైన, బౌద్ధ ధర్మాలలోని ఆచరణలను ప్రబోధాలను అహింసాతత్వాన్నీ రామునికి జోడించి వర్ణించారు. అయోధ్యకాండలో దశరథుడు కైకకు రాముని గురించి చెప్పే మాటలలో రాముని అహింసాతత్వం చాలా విపులంగా చెప్పారు. 12, 13 సర్గలలోనూ, 16, 17 సర్గలలోనూ ఈ పొగడ్తలే ఉన్నాయి.

ఒకానొక కాలంలో రాముడిని ఆర్యరాజుగా, వైదిక ధర్మాలను నిలబెట్టిన రాజుగా గోబ్రాహ్మణ హితం కోసం కిందివర్గాలను అణచివేసిన రాజుగా ప్రజలు చూశారు. (రాముడిని రాజుగా పూజించే "రామరాజు ఆలయం" బుందేల్‌ఖండ్ రాజధాని అయిన ఓర్చాలో ఉన్నది. బుందేల్‌ఖండ్ రాజపుత్రుల తొలి నివాసం.)

రాముని తమ్ముళ్ళకూ ఆలయాలు కట్టారు. కేరళలో తిరుపురయార్‌లో రామునికి, కూడలి మానిక్యంలో భరతునికి, మాయిక్కుళంలో లక్ష్మణునికి, పాయమ్మాళ్‌లో శత్రుఘ్నునికి ఉన్న ఆలయాలు ద్వాపర యుగానివనే ప్రచారం ఉంది. కేరళలో కొట్టాయం, ఎర్నాకులం, మలప్పురం జిల్లాలలోనూ వీరికి ఆలయాలున్నాయంటారు.

"నా విష్ణుః పృథివీ పతి" (రాజు సాక్షాత్తూ విష్ణువే) అంటూ రాముడిని విష్ణువుగా దేవునిగా చేయటం రాముని చర్యలను సమర్థించటానికే. జైన, బౌద్ధ సాహిత్యాలలో రాముని

కథ భిన్నంగా ఉన్నది. విమలసూరి (4వ శతాబ్దం) మొదలుకొని 19వ శతాబ్దం వరకు వచ్చిన రామాయణాలన్నీ గ్రంథకర్తల మత భావాలను పరోక్షంగా ప్రతిబింబించాయి. తెలుగులో అసంఖ్యాకంగా రామాయణాలున్నాయి. జానపద రామాయణాలు, అధ్యాత్మ రామాయణాలు, రామాయణం పాటలు – హరికథలు – బుర్రకథలు, ఇతర కళారూపాలు లెక్కకు మించి వచ్చాయి.

ఒక రామాయణం ప్రకారం రావణుడిని చంపినవాడు రాముడు కాదు, లక్ష్మణుడు. రాముడిని అహింసాపరునిగా చూపటానికి అలా చెప్పారట. ఈ మార్పు జైన, బౌద్ధాలను ఎదుర్కోవటానికే జరిగింది, బుద్ధుడు ఇక్ష్వాకు వంశీయుడు. రాముడూ ఇక్ష్వాకు వంశీయుడే. భారతదేశ చరిత్రలో ఇక్ష్వాకు రాజవంశం ఉంది. వారు బౌద్ధంతోపాటు వైదిక మతాలనూ ఆదరించారు. ఆ వరుసలోనే బుద్ధుడినీ దశావతారాలలో చేర్చేసుకున్నారు.

ఇండోనేషియాలో రాముడిని వీరునిగా నాయకునిగా ఆరాధిస్తారు. ఇళ్ళల్లో శుభ కార్యాలు జరిగినప్పుడూ పండగలకూ వినోద కాలక్షేపాలకూ రాముని కథను జానపద కళారూపంగా (తోలుబొమ్మలాట) ప్రదర్శిస్తుంటారు.

అక్కడ ప్రచారంలో ఉన్న రామకథ ప్రకారం సీత రావణుని కూతురు. ఏ కారణం చేతనో ఆమెను చిన్నప్పుడే వదలిపెట్టేస్తారు. దశరథునికి ఇద్దరు భార్యలు. మండోదరి, బాల్యాదరి. దశరథుని కూతురు కైకేయీదేవి. సీతను వదిలిపెట్టటానికి ఆమె కారణమవుతుంది. ఈ కథలో హనుమంతుడు రాముని కొడుకు.

జావాలోనూ రామకథ ప్రసిద్ధంగా ఉంది. అక్కడా దీనిని కళారూపంగా ప్రదర్శిస్తారు. మాస్క్ (Mask) (ముఖాలకు రకరకాల తొడుగులు) తగిలించుకొని అభినయించే నృత్యరూపం ఇది.

మరో కథ ప్రకారం రాముని కొడుకు బట్లావ. ఇతడు ఇంద్రజిత్తు కూతురిని పెళ్ళిచేసుకుని రాముని వారసుడుగా రాజ్యం చేస్తాడు. సీత (సింతా) తర్వాతి జన్మలో రామునికి చెల్లెలిగా పుట్టే షరతు మీద అగ్ని ప్రవేశానికి ఒప్పుకున్నదని మరో దేశపు రామకథ చెబుతోంది. "బట్లావ" పేరు "లవుని" పేరుకు దగ్గరగానే ఉంది.

రామాయణ మహాభారతాలపై తెలుగులోనూ సంస్కృతంలోనూ ఎన్నో పరిశీలనలు వచ్చాయి. అవి మత పరిధిని దాటిపోలేదు. రామాయణం కావ్యమైనా దానిని మత గ్రంథంగానే చూశారు.

ప్రస్తుతం ప్రచారంలో ఉన్న రామాయణం మూల ప్రతి 6వ శతాబ్దంలో లభించింది. ఎన్నో రాతప్రతులు పరిశీలించి దానిని నిర్ధారించారు. ఇది ఆరు కాండలు సుమారు 500 సర్గలు 2,400 శ్లోకాలు గల కావ్యం. కథ ఎప్పుడు జరిగినదైనా కాలానుగుణమైన మార్పులు చేర్పులు ఈ రచనలో చోటుచేసుకున్నాయి.

అగస్త్య మహర్షి దక్షిణాదికి వచ్చి స్థానిక జాతులను నియంత్రణ చేసినట్టు రామాయణం చెబుతున్నది. ఆ వర్గ వైషమ్యం ఏనాటిది? అతడు యక్షులకు రాక్షసులకు ఇచ్చిన శాపాలు గోబ్రాహ్మణ హితం కోసం ఇచ్చినవే. రామాయణం నాటికి వర్ణధర్మం ఉన్నదా? శూద్రుల జ్ఞానార్జనకు అవకాశాలు ఉన్నాయా అని ప్రశ్నించుకుంటే వచ్చే సమాధానాలు స్పష్టంగా లేవు.

డా. అంబేద్కర్ విశ్లేషణ ప్రకారం శూద్రుల జ్ఞానార్జనలకు సంబంధించిన దశలు నాలుగు. 1. వేదకాలం 2. బౌద్ధయుగం 3. హిందూయుగం 4. బ్రిటిష్ పాలన కాలం.

1. వేదకాలంలో చరిత్ర పూర్వయుగం - వైదిక వాఙ్మయ కాలమూ ఉన్నాయి. వైదిక వాఙ్మయ కాలం క్రీ.పూర్వం నుండి క్రీ.శ. 10, 11 శతాబ్దాల వరకూ విస్తరించింది. మనుస్మృతి రూపొందినది ఈ కాలంలోనే.
2. బౌద్ధయుగం వర్ణ వ్యవస్థను నిరసించిన కాలం.
3. హిందూ యుగం వర్ణవ్యవస్థను బలపరచిన కాలం. అష్టాదశ పురాణాలు రకరకాల ధర్మశాస్త్రాలూ ఈ యుగంలో వెలువడ్డాయి.
4. బ్రిటిష్ పాలన కాలం. వర్ణవ్యవస్థ నుంచి సమాజం బయటపడిన కాలం.

రామకథలో అద్భుత ఘట్టాలు ప్రజలను ఆకట్టుకునే దృశ్యాలు చాలా ఉన్నాయి. రాముడు, రాక్షసుడైన మారీచుని ఒక బాణంతో సప్త సముద్రాల అవతల పడవేయటం, జనస్థానంలో పద్నాలుగువేల మంది రాక్షసులను ఒక ముహూర్త కాలంలోనే చంపటం, అయిదువేల మంది మోయలేని శివధనుస్సును సునాయాసంగా ఎత్తి విరవటం - బంగారు లేడి వృత్తాంతం, రావణుని పదితలలు - రావణుడు సీతను ఎత్తుకుపోవటం - జటాయు పక్షితో పోరాటం - వానరుల విహారాలు - హనుమంతుని అద్భుత లీలలు - సముద్రం ఇవతలి ఒడ్డునుంచి అవతలి ఒడ్డుకు దూకటం - తనను మింగబోయిన సురస నోట్లో ప్రవేశించి తిరిగి బయటకు రావటం - సంజీవని పర్వతాన్ని తేవటం, లంకా దహనం - కుంభకర్ణుని నిద్ర - అతనిని నిద్రలేపే అట్టహాసం - సీత అగ్ని ప్రవేశం - పుష్పక విమాన ప్రయాణం - వంటి ఘట్టాలు అప్పటికే ప్రచారంలో ఉన్న జానపద గాథల రూపాంతరాలై ఉండాలి. అటువంటి ఘట్టాలను పౌరాణికులు వినోదంగా ఆసక్తికరంగా అభినయిస్తూ ప్రజల మనస్సులలో రామునికి చెరగని స్థానం సంపాదించిపెట్టారు. ఆర్య రాజుగా, అసుర సంహారకునిగా, వైదిక ధర్మాన్ని నిలబెట్టిన రాజుగా ప్రచారమైన రాముడు చివరకు దేవుడుగా స్థిరపడ్డాడు.

రాముని కథతో వివిధ భాషలలో వందల సంఖ్యలో రచనలు వచ్చాయి. ఋగ్వేదం లోనూ రామకథ సూత్రప్రాయంగా కనిపిస్తున్నది. వాల్మీకి రామాయణం, అధ్యాత్మ రామాయణం, హనుమద్రామాయణం వంటివి వాఙ్మయంలో ప్రసిద్ధమైనవి. రామకథ లోని వివిధ ఘట్టాలతో నాటకాలు వచ్చాయి.

రాముడు ధనుష్కోటిలో రావిచెట్టు నీడలో కూచుని ధ్యానమగ్నుడై ఉన్న దృశ్యం తమిళ సాహిత్యంలో తొలిదశలో వచ్చిన 'సంగం' వాఙ్మయంలో కనిపిస్తుంది. ఇది బుద్ధుని తలపించే మూర్తి. బౌద్ధధర్మ సంబంధిగానూ జైనమతపరంగానూ కన్నడ భాషలో రామాయణాలు రాశారు.

రామాయణ యుద్ధంలో వానరులకు రాక్షసులకు జరిగిన యుద్ధాన్ని ఎంత అతిశ యోక్తిగా వర్ణించారంటే వినడానికి కూడా ఆశ్చర్యంగా ఉంటుంది.

వానరసేనా నాయకులు 60 కోట్లు. వారు ఒక్కొక్కరు నూరేసి కోట్ల బలగంతో కదిలారట. అంటే 6 వేల కోట్ల వానరులు యుద్ధంలో పాల్గొన్నారన్నమాట. మొత్తం జనాభా ఎంత ఉండేదో.

రావణుని బలం మరింతగా ఉంది. విభీషణుడు రామునికి చెప్పిన ప్రకారం రావణుని నగరంలో ఒక్కొక్క గవని వాకిట ఏ నూరు కోట్లు దైత్యులున్నారు. రావణుని కుమార వర్గం లక్ష పదివేలు. వారికి ఒక్కొక్కరికి లక్షమంది బంట్లు: వీరి సైన్యం వేలకోట్ల సంఖ్యలోనే ఉంది. వాస్తవానికి ఇది మహాసంగ్రామం కాదు. రెండు వర్గాల మధ్య జరిగిన కొట్లాట. అయినా ఇంత గొప్పగా వర్ణించారు – మత ప్రచారానికేనా?

లంకా నగరం చేరటానికి సముద్రంమీద వంతెన $1^{1/2}$ రోజులోనే తయారైందట. వారధి కట్టడం కోసం వానరులే పెద్ద పెద్ద కొండలు రాళ్ళు సముద్రంలో వేస్తూ వచ్చారు. అవన్నీ తిమింగలాలు మింగేస్తూ వచ్చాయట. ఆ తర్వాత నలుడు వంతెన కట్టడానికి ఆలోచన జరిగింది. ఇక్కడ కూడా అతిశయోక్తులు బాగానే ఉన్నాయి. అప్పటికప్పుడు 10 యోజనాల వంతెన తయారైందని రాత్రంతా వానరులు కాపలాగా ఉన్నారని చెప్పారు. సూర్యోదయం అయినాక హనుమంతుడు సువేలాద్రికి వెళ్ళి పక్కనే ఉన్న హేమకూటం, నాగపర్వతం, సింహాచలం అనే మూడు కొండలు తెచ్చి నలునికి అందించాడు. ఆ మూడు 90 యోజనాల పొడవుగలవి. ఆ విధంగా రెండో రోజుకు 100 యోజనాల పొడవు 10 యోజనాల వెడల్పుగల వంతెన తయారైంది.

ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రంతో రామలక్ష్మణులను, వానర సైన్యాన్ని కట్టిపడేసి వెళ్ళి పోయాడు. విభీషణుడు, హనుమంతుడు తప్ప అందరూ మూర్ఛలో ఉన్నారట. అప్పుడు హనుమంతుడు సంజీవని మొదలైన దివ్య ఔషధాలు తెచ్చి వారందరి ప్రాణాలు నిలిపాడు. ఈ సందర్భంలో లవణ సముద్రం, హిమవంతం, నిషధాచలం, మేరు పర్వతం, వెండి కొండ, శ్వేతపర్వతం, ఘృతసాగరం, ద్రోణగిరి మొదలైనవి – అతడు దాటిన నదులు, కొండలు, సముద్రాలు చాలా ఉన్నాయి. ఇవన్నీ రామాయణంపట్ల ఒక అద్భుతమైన అనుభూతిని పాఠకులకు కల్గించేవి. జనసామాన్యాన్ని భ్రమలలో ఉంచుతూ తమ ప్రయోజనాలు నెరవేర్చుకునే రాజకీయాలలో ఇవన్నీ భాగం.

బ్రాహ్మణ పురోహిత, పాలకవర్గాల ఆధిపత్యాన్నీ స్త్రీలు విధేయంగా మెలగాలన్న సందేశాన్నీ రామాయణం అందించింది.

రామాయణంలో కొన్ని వర్గాల ప్రయోజనం కోసం పాలకులు వర్ణధర్మం పేరుతో కొన్ని వర్గాలను అణచివేశారు, చంపారు. ఆనాడూ ఈనాడూ అదే హింస. గ్రామీణ ప్రజలను, ఆదివాసీలను గిరిజనులను మరింత దారిద్ర్యంలోకి నెడుతూ వారు ఆత్మహత్యలు చేసుకోవలసిన దుర్భర పరిస్థితిని కల్పిస్తున్న ఈనాటి పాలకవర్గాలు (21వ శతాబ్దంలోనూ) రామాయణ కాలపు పాలకవర్గాల విధానాలనే అనుసరిస్తున్నాయి.

సెజ్‌ల పేరుతో పేదల భూములు తమ వారికి ధారాదత్తం చేయటం, ప్రజలకు చెందాల్సిన సహజ వనరులను ఎవరెవరికో కేటాయించటం, గిరిజనుల అటవీ భూములను సంపదను ఆక్రమించుకుని వారిని నిరాశ్రయులను చేయటం వంటివి కింది వర్గాలను ఆత్మహత్యల వైపు నెడుతున్నాయి.[1] ఎదురుతిరిగిన వారు పోలీసు కాల్పుల్లో మరణిస్తున్నారు.

1 కోస్టల్ కారిడార్లూ, వాన్‌పిక్ సంస్థలూ ఎంఒయూలూ సోంపేట కాల్పులూ వడ్డి తాండ్ర మత్స్యకారులపై (25-1-2011) జరిగిన దాడులూ (2011 ఫిబ్రవరిలో జరిగిన) కాకరాపల్లి కాల్పులూ, పాలకవర్గ స్వభావం ఎంత కర్కశంగా ఉంటుందో నిరూపిస్తున్నాయి. ఇది రామరాజ్య స్వభావమే.

# రామాయణంలో గ్రీన్‌హంట్

పురాణ వాఙ్మయాన్ని చరిత్రనూ సమన్వయపరచి చూస్తే రామాయణంలోని రాజ్యహింస స్వరూపం స్పష్టమవుతుంది. ఈనాటి బడుగువర్గాల ప్రజలూ ఆదివాసీలూ రాజ్యం చేతిలో అనుభవిస్తున్న హింస రామాయణ కాలం నాటిది; ఇంకా ముందటిదే కావచ్చు. ఆదివాసులు ఈ దేశపు మూలవాసులనీ వారి పునాదులు అత్యంత ప్రశస్తి గలవనీ మహాత్మాగాంధీ వంటి వారు కూడా గుర్తించారు. వారిని ప్రధాన స్రవంతిలోకి తేవాలన్నారు. కాని జరుగుతున్నది అందుకు పూర్తిగా విరుద్ధం. దక్షిణాపథంలోని చాలా రాజ్యాలు పూర్వం ఆదివాసులవే. స్థానిక ఆదివాసీ తెగలను రామాయణం పేర్కొన్నది. వారిని గుర్తించటానికీ కొంత శ్రమపడాలి; ఎందుకంటే రామాయణంలోని భాష సంస్కృతం. స్థానిక భాషలలోని పదాలను తమకు అనువైన రీతిలో మార్చుకుని తయారుచేసుకున్న భాష అది.

అప్పటి గణ సముదాయాలలో దేవ, దానవ, యక్ష, నాగ, మతంగ, కిన్నర, వానర, గంధర్వ, రాక్షస, అసుర, సిద్ధ గణాల పేర్లు రామాయణం ప్రస్తావించింది. వారిలో ఇప్పటి ఆదివాసుల పూర్వులు ఎవరెవరో గుర్తించలేకపోయినా చాలా తెగలను కలిపి నాగులుగా వ్యవహరించేవారని నిఘంటువులు చెబుతున్నాయి. ఆర్యులు తమను తాము గొప్పగా భావించుకునే గణం. దేవగణాలు (సుర గణాలు) వారి మిత్ర పక్షం. ఆర్యుల ప్రయత్నాలన్నింటికీ దేవ గణాలు సహకరించాయి. దేవ గణాలను దేవతలుగా పురాణాలు ప్రచారం చేయటం వల్ల దేశ చరిత్రను అర్థం చేసుకోవటం జటిలంగా మారిందని డా. అంబేద్కర్ అన్నారు.

ఆదివాసీల పట్ల ఆర్య, దేవ గణాలు వ్యవహరించిన తీరు రామాయణం చాలా వివరంగానే చెప్పింది. ఆర్య మునులూ, రాజులూ ఆదివాసీలను స్థానిక జాతులను వశపరచుకోవటానికి సామ దాన భేద దండోపాయాలు అవలంబించారు.

దక్షిణాపథంలోకి ఆర్యుల విస్తరణను అడ్డుకున్నవారు స్థానిక తెగల ప్రజలే. వారిని అసురులుగా పురాణాలు ప్రచారం చేశాయి. అసురులను అస్సీరియన్ మూలం గల జాతులుగా చరిత్రకారులు గుర్తించారు. వారు ఆర్యుల కంటె ముందరే ఇక్కడికి వచ్చి స్థిరపడిన ప్రజలు. కొత్తగా వచ్చిన ఆర్యులు అసురులపై ఆధిక్యత కోసం కొత్త కొత్త సంప్రదాయాలు ప్రవేశపెట్టారు. తమ ధర్మం ఉత్తమ ధర్మం అని ప్రచారం చేస్తూ 'కృణ్వంతో విశ్వమార్యం' అంటూ ఉద్యమాలు నడిపారు.

స్థానిక తెగలు కొంతకాలం ఆర్యుల సంప్రయదాయాలను సహించినట్టే కనిపిస్తుంది. ఆర్యధర్మానికి ఆలంబనగా ఉన్న రాముడు ఇరుగు పొరుగు స్థానిక తెగలతో సఖ్యంగా

ఉండటం - బోయరాజు గుహుడిని తన మిత్రునిగా చెప్పుకోవటం, వానరులతో మైత్రి చేసుకోవటం వంటివి ఇందుకు ఉదాహరణలు వర్ణాశ్రమ ధర్మాల పేరిట యజ్ఞ క్రతువులతో ఆర్యులు అటవీ ప్రాంతాలలోనికి, రాక్షసుల / నాగుల రాజ్యంలోకి చొచ్చుకు రావటం మొదలుపెట్టటంతో స్థానిక తెగల నుండి ప్రతిఘటన వచ్చింది. నాగుల ప్రతిఘటనను రాజ్యం నిర్దాక్షిణ్యంగా అణచివేసింది. ఆక్రమణదారులు తమవారైనప్పుడు సమర్థించటం రాజ్యం స్వభావం.

ఈ రాజ్యహింస స్వరూపాన్ని అర్థం చేసుకోవాలంటే రామాయణం బాలకాండ (సర్గ - 24-26)లో 'తాటక వధ'ను చదవాల్సిందే. సహస్ర నాగ బల సమన్విత అయిన తాటక భర్తను అగస్త్యుడు (ముని) శాపంతో దహించాడు. అదేమిటని అడగటానికి వెళ్లిన తాటకనూ తాటక కొడుకునూ చిత్రహింసల పాలు చేశారు. పోలీసు రాణాలోని హింస సరిపోక రాజధాని నుండి రాకుమారులు (రామలక్ష్మణులు) వచ్చారు. ఒంటరిగా చేతిలో ఆయుధం లేకుండా ఉన్న సమయంలో తాటకను చేతులు నరికి ముక్కు చెవులూ కోసి ఆపైన గుండెల్లోకి బాణం వేసి చంపారు. ఈ ఎన్‌కౌంటర్ ఎందుకు జరిగిందంటే దేశం సుఖం కోసం, గోబ్రాహ్మణ హితం కోసం, చాతుర్వర్ణ హితం కోసం జరిగిందని రామాయణం సంజాయిషీ ఇచ్చింది. చేతులకు కాళ్ళకు సంకెళ్ళువేసి ఉన్న నిందితులను పోలీసు వాహనంలోనే కాల్చిచంపుతున్న సంఘటనలు ఇలాంటివే.

'రాజ్యభార నిర్వహణ కోసమే రాజులు నియుక్తులయ్యారు. కాబట్టి నా మాట ప్రకారం చెయ్యి' అన్నాడు విశ్వామిత్రుడు రామునితో. అదేమాట ఈనాడు శాంతి భద్రతల పేరుతో ప్రజా ప్రభుత్వాలు చెబుతున్నాయి. రాజ్యభారం ప్రజాప్రభుత్వాలదే. అవి అగ్ర / ఆధిపత్య వర్గాల చేతిలో ఉన్నాయి. వారి చేతిలోనే పోలీసు యంత్రాంగం ఉన్నది. కార్పొరేట్ వ్యవస్థ బలపడడం కోసం ఆదివాసీలపై కాల్పులు జరుగుతున్నాయి. పైనుంచి అదనపు బలగాలు ఆధునిక ఆయుధాలతో వస్తూ ఉన్నాయి. ఈనాడు రాజ్యం స్వరూపం మారింది గాని స్వభావం మారలేదు. ప్రజల పట్ల అదే క్రూరత్వం కొనసాగుతూ ఉంది. అది రాజ్యం తన అధికారాన్ని నిలుపుకునేందుకు జరుపుతున్న హింస.

తనది కాని రాజ్యాన్ని రాముడు ఎలా వశపరచుకున్నాడనేది రామాయణంలో తరచి చూడవలసిన అంశం.

రాజ్యాధికార నిర్ణయంలో పురోహితులదీ మునులదీ కీలక పాత్ర. రాజ్యాధికారం కోసం మునుల సహకారాన్ని రాముడు ఆశించాడు. వారు తపోధనులు గనుక తపస్వి జనుల శత్రువులైన రాక్షసులను చంపుతానన్నాడు. సిద్ధాశ్రమంలో రాక్షసులను చంపాడు. సిద్ధాశ్రమం పూర్వపు బలి చక్రవర్తి పాలనలోని ప్రాంతం. అంటే, రాక్షసుల రాజ్యం. రాక్షసుల రాజ్యంలో ప్రవేశించి అక్కడి రాక్షసులను చంపటం రాజ్యహింసలో మారణకాండ కాదు, అది ఉగ్రవాదమే. ఆ తర్వాత రాముడు అరణ్యవాసం పేరుతో దండకలో

ప్రవేశించాడు. దండక రాక్షసుల రాజ్యం. అక్కడ వారి అనుమతి లేకుండా ఆశ్రమం నిర్మించుకున్నాడు. అంతకు ముందే అతనికి మునులు ఆయుధాలు సరఫరా చేశారు. తాను కూడా ఆయుధాలు ధరించే ఉన్నాడు. “దండకలోని ప్రజలు నిన్నూ ఆయుధాలనూ చూసి భయపడతారు. ముని వృత్తిలో ఉండవలసిన వాడికి ఆయుధాలు ఎందుకు?” అంటూ సీత చాలా చెప్పి చూసింది. శాంతి చర్చలు రాజ్యహింసలో పేరుకు మాత్రమే జరుగుతాయి.

'దండకలోకి ప్రవేశించిన కొత్తవాళ్లు ఎవరు? ఆయుధాలతో ఎందుకు తిరుగుతున్నారు' అనే సందేహాలు వచ్చేసరికే శూర్పనఖ ముక్కూ చెవులూ తెగిపోయాయి. ఆదివాసీలు తమ స్త్రీలనూ భూములనూ రక్షించుకోవటానికి సన్నద్ధం కాక తప్పని పరిస్థితి ఏర్పడింది. ఫలితంగా జనస్థానంలో పోరాటం. ఎక్కడా జనం మిగలకుండా పోయారు. ఖర దూషణాది వీరులు 14 వేల మందిని రాముడు ఒక్కడే చంపాడు. ఆ యుద్ధంలో రాక్షస వీరులకు ఆయుధాలు వెంటవెంటనే అందలేదు; రామునికి మాత్రం ఒకదాని వెనుక ఒకటి పరంపరగా ఆయుధాలు అందాయి. సురుల పొగడ్తలూ ప్రశంసలూ వెల్లువగా ప్రవహించాయి. ఈ ఘట్టాన్ని రామాయణం విపులంగా వర్ణించింది. పూర్వం ఇలాంటి ఘటనలలో హతులయిన అసుర వీరులనూ గుర్తు చేసింది. అవి దేవాసుర యుద్ధాలలోని సంఘటనలే.

రాజ్యహింస రూపాలలోని దాన, భేద ఉపాయాలూ రామాయణంలో ఉన్నాయి. దాన ధర్మాలతోనూ పొగడ్తలతోనూ మిత్రులుగా చేసుకుని స్థానిక ప్రజలలో విభేదాలు కల్పించి తమ పనులు నెరవేర్చుకుంటూ అధికారాన్ని నిలుపుకోవటం, విస్తరించుకోవటం రాజ్యం విధానం. రామాయణంలోని వాలి వధ, సుగ్రీవునితో మైత్రి, విభీషణునితో సఖ్యం, రావణ వధ – ఇందుకు ఉదాహరణలు, ఇందులో పరస్పర సహకారం ఉన్నా అంతిమంగా అది రాముని పట్టాభిషేకానికే దారి తీసింది.

'రాముడు' రాజ్యం రూపం. 'రామ' అంటే అందమైన అని అర్థం. రాముని మూర్తీకరణం అందంగా కనిపిస్తుంది. అది ఆదివాసీలపై ఆధిపత్య సాధనకే కల్పించారు. రాజ్యం ఒక్కోసారి తన ప్రయోజనాల కోసం కింది వర్గాలలో కొందరిని చేరదీస్తూ ఉంటుంది. రాముడు సుగ్రీవుని చేరదీయటం అదే. అంత గొప్ప రామునికి సీతను వెదకటంలో ఆర్య మునులు గాని రాజులు గాని ఎవరూ సాయం రాలేదా? వానర రాజుతో మైత్రి ఆదివాసీ వర్గాలను విడదీసే కుట్ర. వానర సైన్యంలో అధిక సంఖ్యాకులు నాగులు. వారు సుగ్రీవుని మాట ప్రకారం రామునికి సహాయంగా అసురులతో పోరాడారు. రాముడు గతంలో 'సహస్ర నాగబల సమన్విత' అయిన తాటకను చంపి యక్షులకూ నాగులకూ రాక్షసులకూ విరోధి అయినవాడు. అయినా సుగ్రీవుని శరణు వేడాడు కాబట్టి

('... సుగ్రీవం శరణం గతః - కిష్కింధాకాండ 4-20) సుగ్రీవాజ్ఞ నిరంకుశమైనది కాబట్టే నాగసైనికులు నిస్సహాయస్థితిలో రావణ సైన్యంతో పోరాడవలసి వచ్చింది. అదీ రాజ్యహింసా విధానం. ఈ విధానం ఈనాడూ సాగుతున్నది.

రామాయణ కాలంలో ఆదివాసీల జీవన విధానాన్నీ, ఆహార విహారాలనూ వస్త్రధారణనూ రాజ్యమే నిర్ణయించిందంటే చాలామందికి ఆశ్చర్యంగా ఉండవచ్చు. రామ రావణ యుద్ధంలో వానరులు కోతుల రూపాలలో ఉండాలని రాముడు చెప్పాడు. యుద్ధంలో ఏడుగురు మాత్రమే మానవ రూపాలలో (వస్త్రధారణతో) ఉండాలనీ వానరులు మానవ రూపాలు ధరించకూడదనీ రాముడు ఆజ్ఞాపించాడు. రామాయణం యుద్ధకాండ సర్గ. 37 లో ఈ సంగతి ఉంది.

'న చైవ మానుష రూపం కార్యం హరిభిరాహవె' వానరులకు మానుష రూపం వద్దు. 'హరి' రూపంలో ఉండాలి. హరి అంటే విష్ణువు, కోతి మొదలైన అర్థాలు చాలా ఉన్నాయి. రామ రావణ యుద్ధంలో వానరులు విష్ణువు రూపాలలో లేరు. కోతుల వేషాలలోనే ఉన్నారు. రామాయణ కర్తలు మొదటి నుండీ వానరులను కోతులుగానే ప్రచారం చేశారు. అది అద్భుత హాస్య రసాల కోసం చేసిన కల్పన. కాని ఆదివాసీల వస్త్రధారణనూ, జీవితాలనూ నియంత్రించేదిగా తయారైంది.

'యుద్ధంలో మానవ రూపాలలో ఏడుగురే ఉంటారు. నేను, నా తమ్ముడు లక్ష్మణుడు, మిత్రుడు విభీషణుడు - అతని నలుగురు మంత్రులూను' అని ఆజ్ఞాపించాడు రాముడు. సంస్కృతం కృతక భాష కావటం వల్లనేమో తెలుగు అనువాదాలు ఆ ఏడుగురి పేర్లు భిన్నంగా చెబుతున్నాయి. శ్రీరామ చరితామృతంలో పై పేర్లే ఉన్నాయి దాశరథి రంగాచార్య తమ అనువాదంలో విభీషణుని నలుగురు మంత్రులకూ బదులు 'అంగదుడు, నీలుడు, హనుమంతుడు, సుగ్రీవుడు మానవ రూపాలలో ఉన్నార'ని రాశారు.

(సీతను రావణుని చెరనుండి విడిపించడానికి సహకరించిన నలుగురు వానర ముఖ్యులకూ ఆయన కొంత రాయితీ ఇచ్చినట్టున్నారు.)

వానరులు కోతులు కాదనీ మానవులే అనీ ఇప్పటికీ కొందరు నమ్మరు. ఇలాంటి నిజాలు చెప్పినందుకే రామానుజన్ వ్యాసాల మీద ఢిల్లీ విశ్వవిద్యాలయంలో గొడవ జరిగింది.

రామ రావణ యుద్ధంలో తనకు సహాయంగా నిలిచిన విభీషణునికీ అతని మంత్రులకూ మానవ రూపాలు అనుమతించిన రాముడు వానరులకే ఈ ఆంక్షలు పెట్టాడు. భల్లూక జాతుల వారికీ ఇవే ఆంక్షలు వర్తించాయి. వీరంతా ఇప్పటి గోండి, కోయ, చెంచు, ఏనాది, సవర వంటి గిరిజన తెగల మూల పురుషులు.

A Tribe of Savaras is called Arsi or Arisi which means a monkey 'n the language of Savaras. By their Oriya neighbours they are called Lambo Lanjia (long tailed) which is the Oriya equivalent of Arisi. They got the name from a longp'ece of cloth which the ma es al ow to hangdown.

(Castes and Tribes of Sounth India - Thurston)

సవరలలో అర్సి అనేది ఒక తెగ. సవర భాషలో అర్సి అంటే కోతి అని అర్థం. అర్సి తెగలో పురుషులు వెనుక తోకలాగా వేళ్లాడే బట్ట కట్టుకుంటారు. పొరుగువారైన ఒరియా ప్రజలు వారిని 'లంబో లాంజియా' (పొడుగు తోకలవారు) అని పిలిచేవారట లంబో లాంజియా నుండి 'లాంగూలము' వచ్చిందేమో. సంస్కృతంలో 'లాంగూలము' అంటే 'తోక'. ఏ భాష నుంచి ఏది వచ్చిందో పండితులు తేల్చాలి.

రాజ్యం విధించిన ఆంక్షల వల్ల వానరులు తమ సహజ వస్త్రధారణను వదలిపెట్టి కోతుల, కొండముచ్చుల, ఎలుగుబంట్ల రూపాలతో పోరాడారు. రామకథకు హాస్యం అందించారు.

శతాబ్దాల రాజ్యహింసకు ప్రతీక రామాయణం. ఎందరెందరు తాటకలు, ఎన్ని వేలమంది ఖర దూషణులు, ఎందరు శంబూకులు ఈ వ్యవస్థలో ప్రాణాలు అర్పించారో తెలీదు. ఎందరు శూర్పనఖలు అవమానాల పాలయ్యారో లెక్కలు లేవు. ప్రశ్నించిన వారి సంగతులు అంతే.

కొంత విధేయత ప్రకటించిన శబరి వంటి వారి చరిత్రలు వక్రీకరణలతో ముందుకు వచ్చాయి. మతంగుని శిష్యురాలయిన శబరి రామ భక్తురాలిగా ప్రచారమైంది. మతంగుని వంటి మహర్షులు వెనక్కుపోయారు. ఆయుధాలూ అస్త్రాలూ అందించిన అగస్త్యులు అగ్రశ్రేణిలో నిలిచారు. తమ వర్గాన్ని వెన్నుపోటు పొడిచిన విభీషణులు రాజ్యం అండతో రాజ్యాధిపతులయ్యారు.

వేషభాషలలో ఆహార విహారాలలో రాజ్యం కింది వర్గాలను అణచిపెట్టి ఉంచింది. అందంగా అలంకరించుకోవటం, బట్టలు కట్టుకోవటం, చదువుకోవటం, విజ్ఞానం పొందటం, సాత్వికాహారం అన్నీ కింది వర్గాలకు నిషేధించబడ్డాయి. వర్ణధర్మం పేరిట ఆర్యులు ఈ వ్యవస్థను రూపొందించారు. రామకథ ఈ వ్యవస్థ కథ. ఇది రాజ్యహింస మచ్చుతునకల సమాహారం. ప్రకృతి వనరులు – తమ శ్రమశక్తి – అన్నింటినీ పై వర్గాలకు అధీనం చేసి వారి నియంత్రణలోనే ఉండాలని రాజ్యం / రామాయణం ఆదేశిస్తున్నది. ఈ విధి నిషేధాలన్నీ కింది వర్గాల ప్రజలకు – ఆది వాసులకూను. ఇవన్నీ చీకటి నుంచి వెలుగులోకి తీసుకువెళ్లేవి కావు. వెలుగులోంచి చీకటిలోనికి తరిమికొట్టేవే.

రాజ్యహింస రూపాలు మార్చుకుంటున్నది, స్వభావాన్ని కాదు. ఆదివాసులూ కింది వర్గాలూ విముక్తం కావాలంటే పోరాటం బహుముఖాలుగా సాగటమే కాదు, మత శృంఖలాలనూ ఛేదించాలి.

---

ఈ వ్యాసం ఆంధ్రజ్యోతి దినపత్రిక (13-12-2012)లో వచ్చింది.

# వాల్మీకులు ఎందరు?

భారతీయ సంస్కృతికి మకుటాయమానంగా ప్రచారం చెయ్యబడిన రామకథ మూలాలపై భిన్నాభిప్రాయాలున్నాయి. ప్రస్తుతం ప్రచారంలో ఉన్న సంస్కృత రామాయణం మూల ప్రతి క్రీ.శ. 6వ శతాబ్దంలో లభించిందట. దీనిలో ఆరు కాండలు, సుమారు 500 సర్గలు, 2,400 శ్లోకాలు ఉన్నాయి. సంస్కృతంలో ఇది ఆదికావ్యం. దీనిని రాసిన వాల్మీకి ఆదికవి అనీ ఆయన తన శిష్యుల ద్వారా దీనిని ప్రచారం చేయించాడనీ చెబుతూ ఈ కావ్యాన్ని ప్రామాణికం చేశారు. ఆరవ శతాబ్దానికి పూర్వం ప్రచారంలో ఉన్న రామకథ ఎలా ఉండేదో, ఏ భాషలో ఉండేదో. రామాయణాన్ని మొదట పాటగా కుశలవులు పాడారట. ఆ పాట సంస్కృత భాషలో ఉన్నదా? అనేది అనుమానమే. తెలుగులో గేయ రామాయణాలూ, జానపదుల పాటలూ చాలా ఉన్నాయి. అవి ఎప్పటి నుండి ప్రచారంలో ఉన్నాయో.

రామాయణం మూలకథ ఎప్పటిదైనాగాని అది ఒక రూపానికి రావటానికి కొన్ని శతాబ్దాలు పట్టిందని పండితులు ఒప్పుకుంటున్నారు. రామాయణ రచన క్రీ.పూ. 200 నుండి క్రీ.శ. 250 వరకు సాగిందట. ఈ క్రమంలో మొత్తం రచన ఒక చేతి మీదుగా జరగలేదనటం స్పష్టం. ఈ కావ్యం ఒక స్థాయికి రావటానికి సుమారు 500 సంవత్సరాలు పట్టిందన్నమాట. తర్వాత కూడా అది అనుకున్నంతగా వ్యాప్తిలోకి రాలేదు.

క్రీ.శ. ఆరవ శతాబ్దంలో ఒక సామాజిక వర్గం వారు తమకు అనుకూలమైన వ్యవస్థను ఏర్పాటుచేసే లక్ష్యంతో రామకథను బయటికి తీశారు. అనేకానేక మార్పులు చేర్పులతో దానిని ఒక ఉద్యమంగా ప్రచారం చేశారు. దీని వెనక ఉన్న అప్పటి రాజకీయ కారణాలు ఊహించుకోవటం కష్టమేమీ కాదు.

ఈ సందర్భంలో అప్పటికి ముందున్న బౌద్ధ జైన గాథలలోని రామకథలనూ తెలుసుకోవలసి ఉంటుంది.

అసలు రామకథ ఇప్పటి భారతదేశంలోనిది కాదనీ ఆఫ్ఘన్ దేశానికి సంబంధించినదనీ కొందరు చరిత్రకారులంటున్నారు. రాముని అయోధ్య ఇప్పటి అయోధ్య కాదనీ, ఆఫ్ఘన్ దేశంలో హొరయు నది (హరి-మద్) తీరంలోని పట్టణమనీ చెప్పారు. "హొరయు"నే "సరయు"గా చెప్పారట. ఇప్పటి ఉత్తరప్రదేశ్‌లోని అయోధ్యను గౌతమబుద్ధునికి 5, 6 తరాల పూర్వపువాడైన ఒక ఇక్ష్వాకు రాజు నిర్మించాడట.

రాజేశ్ కొచార్ రాసిన 'ద వేదిక్ పీపుల్' అనే ఆంగ్ల గ్రంథంలో ఈ వివరాలున్నాయి.

రామాయణ కథ గురించి గతంలో చాలా పరిశోధనలు జరిగాయి; కాని, భారతదేశంలోని మత శక్తులవల్ల అవి వెలుగులోకి రాకుండా మేధావుల పరిధిలోనే ఉండిపోయాయి. మత మౌఢ్యం విజ్ఞాన విస్తృతిని అడ్డుకుంటూ ఉంది.

రామాయణంలో వర్ణించిన అనేక సంఘటనలు నమ్మశక్యం కానివి అనీ ఆ అద్భుత కథనాలన్నీ ఒక వర్గాన్ని నిర్వీర్యం చేసేందుకే కల్పించారనీ మహాత్మా జోతిరావ్ పూలే చెప్పారు. రావణుని పదితలలు, కుంభకర్ణుని తిండి, నిద్ర వంటివన్నీ ప్రజల వినోదానికే రాసినవి. ఇవన్నీ కింద కులాల వారిని మోసగించటానికే జరిగాయని డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్ కూడా స్పష్టంగా చెప్పారు. 19వ శతాబ్దం నాటి చాలామంది హేతువాదుల అభిప్రాయం ఇదే. 'రిడిల్స్ ఇన్ హిందూయిజం'[1] అనే గ్రంథంలో డా॥ అంబేద్కర్ పురాణ కథనాల వాస్తవికత గురించి చర్చించిన వ్యాసాలున్నాయి. ఈ సంపుటం బయటకు రాగానే మహారాష్ట్రలో శివసేన వారూ మరాఠా మహా సంఘం వారూ పెద్ద అలజడి సృష్టించారు. దేశవ్యాప్తంగా ఆందోళన చేశారు.

ఇటీవల ఢిల్లీ విశ్వవిద్యాలయం వారు తమ విశ్వవిద్యాలయం బి.ఏ. (ఆనర్సు) చరిత్ర శాఖ విద్యార్థులకు ఎ.కె. రామానుజన్ రామాయణం గురించి రాసిన ఒక వ్యాసాన్ని పఠనీయ అంశంగా చేర్చినప్పుడూ అలజడి వచ్చింది.

"మూడు వందల రామాయణాలు అయిదు ఉదాహరణలు. అనువాదాలపై మూడు ఆలోచనలు" అంటూ ఆయన రాసిన వ్యాసం 1968లో మొదట వచ్చింది. ఎ.కె. రామానుజన్ చరిత్రకారులు కాదు. మేధావి వర్గపు రచయిత. రామాయణంపై ఆయన ఆలోచనలు నవతరాల వారికి అవసరమనే భావనతో ఢిల్లీ విశ్వవిద్యాలయం ఆయన వ్యాసాన్ని చరిత్ర విద్యార్థులకు పరిచయం చేయాలనుకున్నది.[2] రాజకీయ మతశక్తులు దాన్ని అడ్డుకునే ప్రయత్నాలు చేశాయి. ఎబివిపి ఆందోళన 2008 నుంచి 2011 వరకూ సాగింది.

రామాయణం ఆర్య ధర్మ విస్తరణ కాలంలో రూపొందిన కావ్యం. అప్పటికి స్థానిక జాతులలో ఆర్య ధర్మాన్ని అనుసరించిన వారూ ఉన్నారు. అనుసరించనివారూ ఉన్నారు. ఆర్య ధర్మాలను అనుసరించకుండా తమ సంప్రదాయాన్నే కాపాడుకుంటూ వచ్చిన అసుర జాతుల ప్రజలను హిందూ వాఙ్మయం రాక్షసులుగా, ప్రచారంచేసి శిక్షించింది. ఆ గాథలు పురాణాల కథా వస్తువులయ్యాయి.

---

1 రాముని గురించీ, కృష్ణుని గురించీ అంబేద్కర్ రాసిన వ్యాసాల తెలుగు అనువాదాన్ని జనపద విజ్ఞాన కేంద్రం 1988లోనే ప్రచురించింది.

2 వాల్మీకి రాసిన అద్భుత కథనాలను ఏ.కె. రామానుజన్ హేతు దృష్టితో పరిశీలించి వాస్తవాలు చెప్పే ప్రయత్నం చేశారు. ఆయన ఆలోచనా సరళిని గౌరవించిన విశ్వ విద్యాలయాల మేధావి వర్గం అంతకు ముందే అదే పంథాలో వచ్చిన పూలే అంబేద్కర్ల ఆలోచనలను ఎందుకు గౌరవించలేకపోయింది? నవతరానికి వారి ఆలోచనలు అవసరమని ఎందుకు గుర్తించ లేదో ప్రశ్నించవలసిందే. అందులో వివక్ష, కులతత్వం అసూయ లేవనే అనుకోవాలా!

రామచరిత్ర నెపంగా సమస్త ధర్మాలు వర్ణాశ్రమ విభాగాలు నానాదేశ చరిత్రలు శత్రువుల మిత్రుల ఉదంతాలూ ఇతిహాస రూపంగా రామాయణంలో వాల్మీకి చెప్పాడని బృహద్ధర్మ పురాణం చెబుతోంది.

"రామాయణం మహాకావ్యం కృతం వాల్మీకినా స్వయః
తత్ర రామచరిత్ర స్య వ్యపదేశేన సర్వశః
సర్వే ధర్మాః సముద్దిష్టా వర్ణాశ్రమ విభాగశః
నానాదేశ చరిత్రాణి శత్రుమిత్ర కథా అపి
ఇతిహాస స్వరూపేణ సర్వేధర్మా నిరూపితాః"

ఆర్య ధర్మాన్ని పతిష్ఠం చేసే లక్ష్యంతోనే రామకథ రాయించారన్నది స్పష్టం. అసురుల మతాన్నీ, సంస్కృతినీ నాశనం చేయటం, అప్పటికి ప్రముఖంగా ఉన్న జైన, బౌద్ధ ధర్మాల నుండి ప్రజలను మళ్ళించటం, వర్ణాశ్రమ ధర్మాల ఆచరణ కోసం ప్రజలను కర్మకాండ వైపూ, గోబ్రాహ్మణ హితం వైపూ తరలించడం రామకథలోని అంతర్యం. అష్టను రాకుమారుడైన రాముడిని తీసుకువచ్చి నాయకుడిని చేసి సిద్ధార్థుని లోకోత్తర గుణగణాలన్నీ ఆపాదించి ఎక్కడెక్కడో జరిగిన ఎన్నో సంఘటనలు మేళవించి ఇక్కడ రామకథ తయారు చేశారు. దీనిని వాల్మీకి చేత రాయించినట్లు ప్రచారం జరిగింది.

రామాయణ కావ్యం ఆరంభంలోనే బాలకాండలో నారదుడు వాల్మీకికి రాముని కథను చెప్పిన వృత్తాంతం ఉంది. వాల్మీకి శిష్యబృందంతో కలిసి ఉన్న ఒక సమయంలో నారదుడు వారి దగ్గరకు వచ్చాడట. "భూలోకంలో సకల సద్గుణాలతో శోభిల్లుతున్న వాడెవడు" అని వాల్మీకి ఆయనను అడిగాడు. నారదుడు రాముని గురించి చెప్పి వెళ్ళి పోయాడు. (హరిశ్చంద్రుని గురించిన కథా కావ్యం కూడా ఇలాగే ఆరంభమౌతుంది. "ఆడి తప్పని రాజు ఎవరు" అని అడగటమూ వసిష్ఠుడు హరిశ్చంద్రుని పేరు చెప్పటమూ జరిగింది. వర్ణాశ్రమ ధర్మాల ప్రచారంలో ఈ కథలు గొప్ప పాత్ర వహించాయి.)

వాల్మీకి నారదుడు చెప్పిన రామకథనే తలచుకుంటూ శిష్యునితో తమసా నదీ తీరానికి వెళ్ళాడు. అక్కడ చెట్టుమీద ఆనందంగా ఉన్న క్రౌంచ పక్షుల జంట కనిపించింది. సరిగా అప్పుడే ఒక వేటగాని బాణం తగిలి ఆ జంటలోని మగపక్షి నేల కూలింది. ఆడ పక్షి భయంతో ఆర్తనాదాలు చేస్తున్నది. వాల్మీకిని ఆ దృశ్యం కలచివేసింది. ఆయన నోట అప్రయత్నంగా ఒక శ్లోకం వెలువడింది. "మా నిషాద ప్రతిష్ఠాం..." అంటూ శోకంతో ఆ నిషాదుని శపిస్తున్నట్లుగా ఉన్న ఆ మాటలు ఒక కొత్త ఛందస్సుతో లయాత్మకంగా ఉండటం వాల్మీకి - ఆయన శిష్యుడైన భరద్వాజుడూ గమనించారు. ఆ మాటలనే మననం చేసుకుంటూ వారు ఆశ్రమానికి తిరిగి వచ్చారు. అప్పుడే బ్రహ్మదేవుడు వాల్మీకి ఆశ్రమానికి వచ్చి ఆ ఛందస్సులోనే రామకథ రాయాలని అడిగాడట. (సంస్కృతంలో కొత్త ఛందస్సు

నిషాదుని శపించటంతోనే ఆరంభమయింది.) రాయటం మొదలుపెడితే విషయాలన్నీ వాటంతట అవే స్పష్టమవుతాయనీ చెప్పాడట. ఆ విధంగా 24,000 శ్లోకాలతో రామకథ (సీతకథ) సిద్ధమయింది. ఇలా రాసిన ఆ కథను ఎలా ప్రచారం చేయాలా అని ఆలోచిస్తుండగా ఆయనకు లవకుశులు కనబడ్డారు. వారు ఆయన సంరక్షణలోనే పెరుగుతున్న సీత పిల్లలు అనీ వారి ద్వారా రామాయణ కావ్యం ప్రచారమయిందనీ బాలకాండ చెబుతున్నది. నాట్యశాస్త్ర పరిభాషలో కళారూపాల ప్రయోక్తలను కుశీలవు లంటారు. వాల్మీకి రాసిన సీత చరిత్ర ఆయన శిష్యులయిన కుశీలవులు ప్రచారం చేశారని అనుకోవచ్చు.

రాముని కాలమూ, వాల్మీకి కాలమూ - రాముని పుత్రులైన కుశలవుల కాలమూ నిర్ధారించటం ప్రయాసతో కూడినదే. రామాయణంలోని ఘట్టాలన్నీ ఒకే రామునికి సంబంధించినవి కావచ్చు, కాకపోవచ్చు. ఆర్యులు దక్షిణానికి సాగుతున్న కాలంలో వారికి ఎదురైన ప్రతిఘటనలెన్నో ఉన్నాయి. అలాంటి వాటినన్నింటినీ గుదిగుచ్చి రావణుని ప్రతి నాయకునిగా చేసి "పౌలస్త్య వధ" (రావణ వధ) రాయించారని కొందరి అభిప్రాయం. ఆర్యుల విషయాన్ని తెలిపే ఈ ఘట్టాలన్నీ ఒకే వాల్మీకి రాసి ఉండదనీ అంటారు. స్థానిక ప్రజలను అణచివేసినట్లు స్థానిక భాషలనూ అణచివేసి సంస్కరించబడిన (సంస్కృత) కృతక భాషలో రాముని ప్రయాణాన్ని వర్ణించారు. స్థానిక జాతులను అణచివేసేందుకు సాగిన యాత్ర అది.

మొదటి వాల్మీకి రాసిన కథలో ఆర్య అనార్య సంఘర్షణలు ప్రధానంగా ఉండేవనీ, అనంతర కాలంలో బౌద్ధధర్మాన్ని ఎదుర్కొనేందుకు అహింసాతత్వం జోడించి బుద్ధుని గుణగణాలతో రాముని మలచారనీ అంటారు. హింసాత్మక వర్ణనలు మూలంలో మరెంతగా ఉన్నాయో ఈ క్రమంలో ఈ కావ్య రచనలో చాలామంది పాలుపంచుకుని ఉండాలి.

చుట్టూ పుట్టలు పెరిగేటంత గాఢంగా తపస్సులో నిమగ్నమైన మునులు చ్యవనుని వంటివారు పురాణాలలో ఉన్నారు. కాని వారెవరూ వాల్మీకిలాగా గొప్ప కావ్యం రాయ లేకపోయారు అని "బుద్ధ చరితం" రాసిన "అశ్వఘోషుడు" అనే కవి అన్నాడు. (బుద్ధ చరితం 1-48). అందుకే బోయవాడైనా వాల్మీకిని అగ్రవర్ణాలు బ్రాహ్మణోత్తమునిగా ప్రకటించుకున్నాయా?

వాల్మీకి బోయవాడిగా ఉన్నప్పటి కథకు అయిదారు రూపాంతరాలున్నాయి. ఆ విషయాలు వాల్మీకి రామాయణంలో చేరలేదు. వాల్మీకి చెప్పని గాథలెన్నో రామాయణంలోనివిగా ప్రచారంలో ఉన్నాయి. (కుశలవులు యజ్ఞాశ్వాన్ని బంధించటం వంటివి).

రామాయణంలో మొత్తం ఏడు కాండలూ వాల్మీకి రాయలేదని కొందరూ, ఎందరో ఎప్పుడెప్పుడో రాసినవన్నీ వాల్మీకి పేరిట కూర్చటం జరిగిందని మరికొందరూ

చెబుతున్నారు. వాల్మీకులు చాలామంది ఉన్నట్టే వాల్మీకి ఆశ్రమాలుగా గుర్తించిన స్థలాలు రెండు మూడు తెలుస్తున్నాయి. ఒక వాల్మీకి ఆశ్రమం నేపాల్ సరిహద్దుల్లో ఉన్న గోరఖ్‌పూర్ ప్రాంతపు అడవులలో ఉండేదట. సోనభద్ర, పంచనది, గండకి నదులు ప్రవహించే అటవీ భూములలో పంచనది తీరాన ఒక కొండమీద వాల్మీకి ఆశ్రమం గుర్తించారు. ఉత్తరప్రదేశ్‌లోని చితూర్ ప్రాంతాన్ని వాల్మీకి ఆశ్రమంగా కొందరు చెబుతున్నారు. ఇది కాన్పూరుకు 24 కి.మీ. దూరంలో గంగానదీ తీరాన ఉన్నది. శంకర మఠాలు చాలా ఉన్నట్టుగానే వాల్మీకి ఆశ్రమాలూ[1] చాలా ఉండేవి. ఇందులోని వాల్మీకులు ఈ రచనను కొనసాగించి ఉంటారు.

వాల్మీకి తక్కువ కులానికి చెందినవాడని తులసీ రామాయణం చెబుతున్నది. దీని ప్రకారం వాల్మీకి శ్వపచుడు; శివభక్తుడు. మహాభారతంలో ఒక వాల్మీకి గురించి ఉంది. ఆ వాల్మీకిని బ్రహ్మఘ్నుడుగా మునులు దూషించారట. ఆయన శివుని దయతో ఆ పాపాన్ని పోగొట్టుకున్నాడు. ఇతడూ రామాయణకర్తలలో ఒకడై ఉంటాడా? సీతకు ఆశ్రయమిచ్చిన వాల్మీకి సీత జీవితంలోని సంఘటనలకు ప్రత్యక్ష సాక్షి. ఆమె నుండే ఆయన రావణుని గురించీ విని ఉండాలి. అందుకే సీతాచరితం - పౌలస్త్య వధ, ప్రధాన ఘట్టాలుగా ఆయన పరిగణించాడు. సీత అభిమానంతో భూమిలో కలిసి పోవటాన్నీ (భూదేవి తనతోపాటు సీతను తీసుకెళ్ళిందనే కథ) ఆయన చూశాడు. ఈయన దశరథుని మిత్రుడు.

రామాయణం ఉత్తరకాండలో సీతనూ ఆమె కొడుకులనూ రాముని దగ్గరకు తీసుకు వచ్చి అప్పగించే సమయంలో వాల్మీకి తన గురించి చెప్పుకున్నాడు. రాముడు ఆయనను "బ్రాహ్మణోత్తమా" అని సంబోధించాడు.

వాల్మీకి పూర్వం దారి దోపిడీలు చేస్తుండేవాడట. ఒకప్పుడు సప్త రుషులు ఆ దారిని వస్తుంటే వారిని దోచుకోబోయాడు. అప్పుడు వారు "ఈ దోపిడీల వల్ల వచ్చే పాపం నీ కుటుంబం పంచుకుంటుందా? నీ ధనం పంచుకున్నట్టే నీ చర్యల ఫలాన్నీ వారు పంచుకుంటారా" అని ప్రశ్నించి ఆ విధంగా అతనిలో ఆలోచన రేకెత్తించి అతనికి జ్ఞానోపదేశం చేశారు. అతనికి రామమంత్రం ఉపదేశించారు. అతడు పాపాత్ముడు కాబట్టి 'రామ' అని కాకుండా దానిని తిరగేసి "మరా" అని జపించవలసిందిగా చెప్పారు. అతడు

---

1 తైత్తిరీయ ప్రాతిశాఖ్య ఒక వాల్మీకిని పేర్కొంటున్నది. అతడు వ్యాకరణవేత్త. అతని సూత్రాలను క్రీ.శ. 11వ శతాబ్ది నాటి హేమచంద్రుడు ఉటంకించాడు.
మహాభారతం ఉద్యోగపర్వం ఒక సుపర్ణ వాల్మీకిని ప్రస్తావించింది. అతడు విష్ణు భక్తుడు. గరుడ వంశానికి చెందినవాడు. మహాభారతం ద్రోణపర్వం ఒక భార్గవ వాల్మీకిని గురించి చెప్పింది. అతడు భృగు వంశీయుడని అంటున్నారు.

తపస్సులో మునిగిపోయి ఉంటే చుట్టూ మట్టి పుట్టలుగా పేరుకుపోయిందట. కొంతకాలానికి ఆ మునులు తిరిగి వచ్చి వల్మీకం (పుట్ట) నుంచి ఆ బోయవానిని పైకితీసి 'వాల్మీకి' అని పిలిచారు. ఈ వాల్మీకే రాముని చరిత్రను రాశాడు. వేదాలు చదవకుండా వ్యాకరణం నేర్చుకోకుండా కొత్త ఛందస్సులో మాట్లాడి ఇతడు ఆదికవి అయ్యాడు.

వాల్మీకి బోయవాడు అని చెప్పే కథ, స్కాంధ పురాణం ధర్మఖండంలో ఉన్నదట. బదరికావనంలోని మునులకు పర్వతుడు ఆ కథ చెప్పాడని అనంతర రచనల వల్ల తెలుస్తున్నది. తంజావూరును పాలించిన రఘునాధనాయకుడు (1575-1633) వాల్మీకి చరిత్రను పద్యకావ్యంగా రాశాడు. అనంతర కాలంలో మహామహోపాధ్యాయ హర ప్రసాద శాస్త్రిగారు వాల్మీకి చరిత్ర రాశారని నిరుక్త భారతము (1915) పేర్కొన్నది. వాల్మీకి రామ నామ జపంతో మహర్షిగా ఎదిగాడని ఆ చరిత్రలు స్పష్టం చేస్తున్నాయి.

స్వయంకృషితో పండితుడైన ఒక బోయవాని కథను పండితులు ఇలా మార్చి ప్రచారం చేశారు.[1]

మొదటి వాల్మీకి రాసిన పాట పేరు "సీతాచరితం" సీత చరిత్ర - సీత వంటి అప్పటి ఇల్లాళ్ళ చరిత్రలు అందులో ప్రధానంగా ఉండి ఉంటాయి. సీత జనకునికి పెంపుడు కూతురు. పొలంలో దొరికిన బిడ్డ. ఆడపిల్లలు వద్దు అనుకునే అప్పటి సమాజం తీరు, ఆ పిల్లలు పెరిగిన తర్వాతనూ నిరాదరణను ఎదుర్కోవటం - అపహరణలు - లైంగిక వేధింపులు - అత్యాచారాలు - శీల పరీక్షలు - అపవాదులు - భర్తలు వదలిపెట్టిన స్త్రీల అగచాట్లు ఇలాంటివన్నీ వర్ణిస్తూ ఆయన ఆ కథను కరుణరస ప్రధానంగా పాటగా రాసి ఉంటాడు.

అనంతర కాలంలో ఈ కథను "పౌలస్త్య వధ"గా ప్రసిద్ధం చేశారు. అది జైన బౌద్ధ ధర్మాల అణచివేతకు సూచకం. పౌలస్త్యుడు అంటే రావణుడు. పులస్త్యుని మనుమడు శివభక్తుడుగా ప్రసిద్ధుడు. అతనిపై జైన బౌద్ధ ధర్మాల ప్రభావమూ ఉంది. జైన బౌద్ధ ధర్మాలనూ శైవాన్నీ కూడా వైష్ణవం అణచివేస్తున్న దశను ప్రతిబింబించేటట్టుగా పౌలస్త్య వధ రాశారు. ఆరవ శతాబ్దం నాటికి అసుర రాజ్యాలను నాశనంచేసి ఆర్య రాజులు తమ అధికారాన్ని సుస్థిరం చేసుకొన్నారు. ఆ ప్రశస్తితో రాముడిని ప్రధాన నాయకునిగా చూపుతూ ఈ కథను రామాయణంగా ప్రసిద్ధం చేశారు.

---

1 'వాల్మీకి చేత రామాయణం ఎందుకు రాయించారు' అంటూ వజ్రపు సాంబమూర్తి గారు గొప్ప విశ్లేషణ గ్రంథం ప్రచురించారు (1992). ఆర్య ఆర్యేతర జాతుల సామాజిక వైరుధ్యాల గురించి వివరాలు అందులో చూడవచ్చు.

# దండకారణ్యం

రామాయణం ప్రస్తావించిన దండకారణ్యం భారతదేశపు దక్షిణ భాగంలోనిది. దక్షిణ దేశాన్ని 'దక్కన్'గా భారతదేశ చరిత్ర వ్యవహరిస్తున్నది. బీహార్, ఒరిస్సా, జార్ఖండ్, ఛత్తీస్‌గఢ్, మహారాష్ట్ర, కర్నాటక, మధ్యప్రదేశ్, తెలంగాణ, ఆంధ్రప్రదేశ్‌లలోని కొన్ని భాగాలను పూర్వపు దండకగా చెప్పవచ్చు. దక్కన్ పీఠభూమి ఆగ్నేయ భాగం ఆంధ్ర పీఠభూమిగాను దక్షిణ భాగం కర్ణాటక పీఠభూమిగాను వ్యవహరించబడేది. నర్మదానది పగులులోయ వెంబడి తూర్పు పడమరలుగా వింధ్య పర్వత శ్రేణి ఉంది. మాల్వా, ఛోటా నాగపూర్, బుందేల్‌ఖండ్, బాగేల్‌ఖండ్ ప్రాంతాలు గిరిజన/ ఆదివాసీల రాజ్యాలు.

గంగా సింధు మైదానాలకు దక్షిణంగా సుమారు 16 లక్షల చదరపు కి.మీ. వైశాల్యంతో ఉన్న ఈ ప్రాంతం ఒకప్పుడు గోండ్వానా భూమిలో భాగం. కోట్ల సంవత్సరాల క్రితం ఇప్పటి ఖండాలన్నీ కలిసే ఉండేవనీ భౌగోళిక మార్పులవల్ల ముక్కలుగా చీలిపోయి ఒకదాని నుంచి మరొకటి దూరంగా జరుగుతూ విడివడ్డాయనీ శాస్త్రవేత్తలు గుర్తించారు. ఇండియాలోని దక్షిణ ప్రాంతం గోండ్వానా మహాఖండంలో భాగంగా ఆఫ్రికా ఖండంతో కలిసి ఉండేదనీ ఉత్తర ప్రాంతం సముద్రంగా ఉండేదనీ భూవిజ్ఞాన శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. 12 కోట్ల ఏళ్ళ కిందట భూగర్భంలో సంభవించిన అనేక మార్పులవల్ల జలప్రళయాలవల్ల ఈ భూభాగం ఆఫ్రికా నుండి విడివడి ఏడాదికి 5 సెంటీమీటర్ల వేగంతో ఉత్తరదిశగా కదులుతూ 4 కోట్ల ఏళ్ళకు 15 సెంటీమీటర్లకు వేగం పెంచుకుని యురేషియా భూఫలకాన్ని ఢీకొన్నది. అప్పుడు సముద్రం మాయమై హిమాలయాలు ఆవిర్భవించాయి. దక్షిణ ఇండియాలోని ప్రాచీన జాతులు ఈ విధంగా ఆఫ్రికావాసుల భాషల వారసత్వం కలిగి ఉన్నారంటారు.

గోండ్వానా ద్వీపం ముక్కలైనప్పటి రెండు భూభాగాలను (ముక్కలను) ఆస్ట్రేలియా దగ్గరలోని ఇండియన్ సముద్రం లోపల 8,200 అడుగుల లోతున ఇటీవల (క్రీ.శ. 2010) శాస్త్రజ్ఞులు కనుగొన్నారు.

దక్కన్ భూభాగం భౌగోళికంగా విశిష్టత కలది కావటంవల్ల అక్కడి సంస్కృతి కూడా అనితరమైనదే. దీనిని ద్వీపకల్ప పీఠభూమిగా చెబుతారు. ఇది సముద్ర మట్టం కంటే పైకి నెట్టివేయబడిన పురాతన బృహత్ భూఖండం. ఈ పీఠభూమి ఉత్తర ప్రాంతాన్ని మాల్వా అనీ, దక్షిణ ప్రాంతాన్ని దక్కన్ అనీ పేర్కొంటున్నారు. ఈ రెండు ప్రాంతాలకూ నడుమ వింధ్య పర్వతాలున్నాయి.

దక్కన్ ప్రాంతం మానవ నాగరికతకు మూలస్థానం అనీ ఈ నాగరికత వికాసానికి స్థానికుల సంస్కృతి మూల కారణమని నిమియన్ స్మార్ట్ అనే శాస్త్రవేత్త అభిప్రాయం.

అక్కడి స్థానికులు యక్ష, నాగ, కిరాత, రాక్షస, వానర జాతుల సముదాయమే. ఈ కోణంలో రామాయణంలో ప్రసక్తమైన దండకారణ్య ప్రజలను అర్థం చేసుకోవాలి.

క్రీ.పూ. 7వ శతాబ్దంలో ఒక అగస్త్యుడు వింధ్య దాటి దక్షిణ భారతదేశానికి వచ్చాడంటారు. ఆయనతో 18 మంది రాజ కుటుంబీకులూ, వారి పరివారమూ ఉన్నారట. అప్పటికే అక్కడ స్థానిక మునుల ఆశ్రమాలు (మతంగాశ్రమాలు) ఉన్నాయి. వారిని మరింత లోపలికి ఆర్యమునులు తరిమేశారు.

ఉత్తర భారతదేశంలో కొన్ని గణరాజ్యాలు, కొన్ని రాచరిక రాజ్యాలు ఉండేవి. ఇవి చాలావరకు అసురుల రాజ్యాలు. రాముడిని గంగ దాటించిన గుహుడు కిరాతరాజు. సీతను చంకను ఇరికించుకొన్న కబంధుడు దండకలో దుర్గ పాలకుడు.

క్రీ.పూ. 1000-700 ప్రాంతానికి దక్షిణ దేశంలో పెద్దనగరాలు, దుర్గాలు ఉన్నాయి. దక్షిణ ప్రాంతాలవారు తక్షశిల వంటి (ఉత్తర భారతదేశపు) విద్యాకేంద్రాలకూ వెళ్ళి విద్యలు నేర్చుకునేవారు. అప్పటికి తక్షశిలలో ఉదార ధోరణి ఉండేదట. వేద విద్యలూ, ఇరానియన్ విద్యలూ కూడా బోధించేవారట. బ్రాహ్మణేతరులు వేదవిద్య నేర్చుకోవటానికి అక్కడ అవకాశాలుండేవి.

రామాయణం అరణ్య, కిష్కింధాకాండలలో దండక రంగస్థలంగా జరిగిన సంఘటనలున్నాయి. వాటిని ప్రాచీన కవులు వ్యతిరేక దృక్పథంతోనే వర్ణించారు. స్థానికుల సంప్రదాయాలనూ, జీవితాలనూ, సంస్కృతినీ చులకన భావంతోనూ ఆర్యమునుల ఆశ్రమ జీవితాలనూ, ఆర్య ప్రజల వ్రత అనుష్ఠానాలనూ, నాగరికతనూ గౌరవంతోనూ చెప్పారు.

రామాయణంలో ప్రస్తావనకు వచ్చిన చాలా కథలు అప్పటికి జరిగిపోయిన వృత్తాంతాలు. వృత్రుని కథ, బలిచక్రవర్తి కథ, శిబి కథ మొదలైనవన్నీ అప్పటికి ప్రజల జ్ఞాపకాలలో ఉన్నాయి. జానపద గాథలుగా, పూర్వీకులు పరంపరగా చెప్పుకునే గతవైభవ చరిత్రలుగా అవి మిగిలి ఉన్నాయి. రామాయణ కవులు వాటిని ఆర్య సంస్కృతిని గొప్పగా చెప్పే దిశలో ఉపయోగించుకున్నారు.

పైశాచీ భాషలో గుణాఢ్య మహాకవి రాసిన 'బృహత్కథ' దండక ప్రాంతపు రాజ్యాల గురించీ, ప్రజల జీవనం గురించీ చెప్పింది. సంస్కృత భాషా వ్యామోహంతో ఆర్యులు ఆ గ్రంథాన్ని నాశనం చేశారు. అందులోని అతి తక్కువ భాగమే లభ్యమైంది. ఆధునిక నిర్మాణాలలో గత సంస్కృతి చిహ్నాలు నాశనమవుతుండటం ఈనాడూ ఉన్నది.

జైన, బౌద్ధాల కారణంగానూ అనంతర కాలంలో దేశంలో ప్రవేశించిన విదేశీ మతాల కారణంగానూ వైదిక వాఙ్మయాన్నీ, సంప్రదాయాన్నీ పునరుద్ధరించుకోవలసిన స్థితి ఏర్పడి పురోహిత వర్గం భక్తి మార్గాన్నీ కర్మకాండలనూ తీవ్రంగా ప్రచారం చేసింది. అందుకు రాముని కథ ఉపయోగించుకున్నారు. ఆరవ శతాబ్దినాటికి రామాయణం ఈ ధ్యేయంతోనే పరిష్కరించబడి మార్పులకులోనై ప్రస్తుత రూపాన్ని పొంది ఉంటుంది.

దండక అప్పుడూ ఇప్పుడూ రగులుతూనే ఉంది. మైదాన ప్రాంతపు ప్రజలకూ, అరణ్య ప్రాంతాల ప్రజలకూ ప్రచ్ఛన్నంగా కాదు, బాహాటంగానే పోరాటాలు జరుగుతున్నాయి. భారతదేశ ఆదివాసులు శతాబ్దాలుగా తమ వనరుల రక్షణ కోసం, తమ సంస్కృతిని కాపాడుకోవటం కోసం, తమ భూములు అన్యాక్రాంతం కాకుండా ఉండటం కోసం పోరాడవలసే వస్తున్నది.

ఆదివాసులు నివసించే ప్రాంతాలలో అపారమైన ఖనిజ సంపద, వృక్షసంపద ఉన్నది. దండకలో దాదాపు 39 రకాలకు పైగా ఖనిజ విశేషాలున్నాయట. దీనికోసం ఆధునిక యుగంలోనూ విదేశీ సంస్థలు పోటీపడుతున్నాయి. శతాబ్దాల క్రితం రామాయణ కాలంలోనూ అదే జరిగింది. ఖనిజ వనరుల కోసం. వృక్ష సంపద కోసం దండకలోని ప్రజలనందర్నీ సమూలంగా తుడిచిపెట్టటానికి ప్రయత్నాలు జరిగాయి.

"దండకలో వారంతా చస్తే అక్కడ ఆర్యమునులు నిర్భయంగా ఉంటార"న్నాడు రాముడు. అలాగే వేలాది మందిని చంపాడు. ప్రతీకారంగానే సీతాపహరణం జరిగింది. ఎదుటి పక్షంలోని కీలక వ్యక్తులను తనవైపు తిప్పుకొని రాముడు అక్కడ కూడా విరోధులను తుడిచిపెట్టాడు. తనకు విధేయంగా ఉండే వారినే బతకనిచ్చాడు. తనవారిని అక్కడ పెట్టి అరణ్య సంపదను ఆర్య పురోహితులకు కట్టబెట్టాడు. స్కంద పురాణం ఈ వివరాలు అందిస్తున్నది. ఆధిపత్య వర్గాలకు రాముని మార్గం నచ్చినందువల్లనే రామాయణం ఇంతగా ప్రచారాన్ని పొందింది.

రావణుని చంపిన తర్వాత అంతకుముందు రాక్షసుల భయంతో దండక నుండి వెళ్ళిపోయిన బ్రాహ్మణ, కుటుంబాలన్నింటినీ వెదకి రప్పించి రాముడు వారికి దాన శాసనాలు రాయించి ఇచ్చాడని స్కంద పురాణం చెబుతోంది. లోహాసురుని గురించి కూడా అక్కడ వివరాలున్నాయి. (లోహాసురుని కథ ఎందువల్లనో అంత ప్రచారం కాలేదు.)

రాముని విధానం - ఒక వర్గం వారిని పోషించటం ఒక వర్గాన్ని నాశనం చేయటం, ఆపరేషన్ గ్రీన్ హంట్ లాంటి ప్రస్తుత విధానాలకు ఇదే స్ఫూర్తినిచ్చి ఉండాలి. దళిత బహుజన గిరిజన వర్గాల పరంగా బీద దేశంగానూ ప్రపంచ సంపన్నుల జాబితాలో రెండవ స్థానంలో ఉన్న దేశంగానూ భారతదేశం ఈనాడున్నదంటే దాని వైఖరి స్పష్టమవుతూనే ఉంది.

రామాయణ కాలంనాటికే రసవిద్యలు దండకారణ్య ప్రాంతంలో ప్రచారంలో ఉన్నాయి.[1]

---

1 'కాలనాధుడు' అనే ఋషి దగ్గర శ్రీరాముడు రస విద్య నేర్చుకున్నాడట. ఆ తర్వాత రామరాజీయము, రసేంద్రము అనే గ్రంథాలు రాశాడట. (1956 బుద్ధ జయంతి సంచిక - ఆచార్య విస్సా అప్పారావు గారి వ్యాసం) రావణుడు 'అర్క ప్రకాశము' అనే గ్రంథం రాశాడట. ఇందులో అనేక వ్యాధులకు చికిత్సలున్నాయట.

దండకలో రాముడు తాటకను చంపటం, విశ్వామిత్రుని యజ్ఞం ముగిశాక సిద్ధాశ్రమంలో మారీచునీ, సుబాహునీ కొట్టటం, జనకుని ఇంట శివ ధనస్సు విరిచి, తన 15వ ఏట ఆరేళ్ళ వయసున్న సీతను పెళ్ళిచేసుకోవటం వంటివి స్కంద పురాణంలో (ధర్మారణ్య క్షేత్ర మాహాత్మ్య సందర్భంగా) చాలా సంక్షిప్తంగా చెప్పారు. 12 సంవత్సరాలు అయోధ్యలో ఉండినాక 27వ ఏట రాముడిని యువరాజుగా చేయదలచినప్పుడు కైకేయికి ముందే వాగ్దానం చేసిన వరాలవల్ల ఆ ప్రయత్నం భగ్నమయింది. 14 సంవత్సరాలు సీతారామ లక్ష్మణులు అరణ్యవాసం చేయవలసి వచ్చింది.

దండకలో రాక్షస గణాల వధ ఆరంభమవటం దగ్గర్నుంచి – విరాధుని చంపటం, శూర్పనఖ అనే ఆమెను వికృతంగా చేయటం మొ॥వన్నీ స్కందపురాణం చెప్పింది.

రామునికి పూర్వపుదండక, సుభిక్షంగా ఉన్న ప్రాంతం. ప్రజలు ప్రకృతిని ప్రేమించే వారు. నదులనూ, చెట్లనూ పూజించారు. కొత్తగా వచ్చిన ఆర్యులు కూడా స్థానికుల ఆచారాలు కొన్ని పాటించారు. అరణ్యవాసానికి వెళ్ళేముందు గంగను దాటుతూ సీత గంగానదిని ప్రార్థించటం "క్షేమంగా తిరిగి వస్తే కల్లు బిందెలతో, మాంసాహారంతో, వ్రతాలతో నిన్ను పూజిస్తాను" (అయోధ్యకాండ 52–89) అని మొక్కుకోవటం మిశ్ర సంస్కృతి లక్షణాలే. ఆ సందర్భంలోనే 'గోబ్రాహ్మణులకు దానాలిస్తాను' అని కూడా సీత చేత అనిపించడం ఆర్య సంస్కృతి ప్రచారం కోసమే.

దండకలోని నదులు – ఇంద్రావతి, శబరి వ్యక్తుల పేర ప్రసిద్ధమయ్యాయి. వానరుల కిష్కింధ, రావణుని లంకాపురి, ఆర్య రాజుల నగరాల కంటే సంపన్నంగా, కళాత్మకంగా ఉండేవని రామాయణ కవులు వర్ణించారు. పంపా సరోవర వర్ణన అత్యంత మనోహరంగా చేశారు. అవన్నీ జ్ఞాపకాలుగానే మిగిలాయి. సమ్మక్క, సారలమ్మ పోరాటాలలో, బ్రిటిష్ పాలకులను ధిక్కరించిన రాంజీ గోండులో, గడీల దుర్మార్గాలను ప్రశ్నించిన బందగీలో చాకలి ఐలమ్మ, కొమరంభీం, దొడ్డి కొమురయ్యలలో దండక వీరుల వారసత్వం చూడవచ్చు.

పూర్వపు దండకలో శైవ, జైన, బౌద్ధ ధర్మాలు బలంగా వ్యాప్తిలో ఉన్నట్టు ఇటీవలి పురావస్తు శాఖ తవ్వకాలు నిరూపిస్తున్నాయి.

ఛత్తీస్‌గడ్ నయా రాయపూర్ పరిసరాలలో బయల్పడ్డ బౌద్ధ విహారాలు, ఆరామాలలో ఒకటి నలందా విశ్వవిద్యాలయం కంటే పెద్దదట. చైనా యాత్రీకుడు హుయాన్‌త్సాంగ్ తాను పదివేలమందికి పైగా బౌద్ధ సన్యాసులున్న ఆరామాలను చూసినట్టు చెప్పాడు. పురావస్తు శాఖ తవ్వకాలలో బయల్పడుతున్నవి అలాంటివే. సిర్పూరు తవ్వకాలలో 'తీవర దేవ మహావిహారం' అన్నింటి కంటే పెద్ద ఆరామం. నాగ, యక్ష ప్రతిమలు, బుద్ధ విగ్రహాలూ ఇక్కడ లభించాయి.

చిత్రకూట్ జలపాతం, తీర్థగిరి, చంపారన్, మాయామయ, బమలేశ్వర క్షేత్రాలు - మహానది - ప్రగ్యగిరి మీది బుద్ధ విగ్రహం - ఇవన్నీ దండకకు అలంకారాలుగా విలసిల్లాయి. ఆర్యుల దురాక్రమణలు ఈ వైభవాన్ని నాశనం చేశాయి.

ఇప్పటి దండక రామాయణ కాలపు స్థితిలోనే మందుతూ ఉన్నది. స్థానికుల సంపద, వనరులు విశృంఖలంగా దోపిడీ చేయబడుతూ ఉన్నాయి.

దొర్లాలు, గోండులు, రాజ్ గోండులు, మరియాలు, బైసన్ కొమ్ము మరియాలు, డన్‌డమి మరియాలు, కొండ మరియాలు (మోటాకిటూ), హర్బీలు మొదలైన జాతులవారు తమ ఉనికి కోసం, మానవ హక్కుల కోసం ఇక్కడ పోరాడుతున్నారు. రాముడు వారికి నిరాకరించిన హక్కులు అవి. ఇప్పుడూ నిరాకరించబడుతున్నాయి. ప్రతిఘటన ఇప్పుడూ బలంగానే ఉంది. పోస్కో, మిట్టల్, జిందాల్, ఎస్సార్, వేదాంత లాంటి దేశవిదేశీ కంపెనీలకు ప్రయోజనం చేకూర్చే విధంగా రాజ్యం అనుసరిస్తున్న విధానాలను స్థానికులు ప్రతిఘటిస్తున్నారు

దక్షిణపథాన్ని ఆర్యులు ఆక్రమించటాన్ని తెలిపే వర్ణనలు రామాయణంలో కనిపిస్తాయి.

చిత్రకూట ప్రాంతాన్ని వర్ణిస్తూ "పూర్వం ఈ ప్రదేశం జనసంచారం లేక నిశ్శబ్దంగా ఉండేది. ఇప్పుడు అసంఖ్యాకులైన మన వారితో నిండి ఉండటంవల్ల కలకలలాడుతోంది" అని భరతుడు వసిష్ఠునితో అనటం, దక్షిణదేశ నారీమణుల ప్రసక్తి తేవటం అయో. 93వ సర్గలో కనిపిస్తుంది.

అప్పటికే దండకలో ఆర్యమునులు ప్రవేశించి స్థిరపడ్డారు. కులీన, అకులీన, అనార్య పదాలూ రాముని నోట వినిపించాయి (అయో. 109-2, 3)

# శంబరాసురుడు (తిమిధ్వజుడు)

దేవ/ఆర్య గణాలకు శంబరాసురునితో జరిగిన యుద్ధాలలో దశరథుడు పాల్గొన్న ఒక యుద్ధాన్ని రామాయణం ప్రస్తావించింది. (అయో. 9-13) ఆ యుద్ధంలో ఇంద్రునికి సాయంగా దశరథుడు వెళ్ళాడట.

"దిశమాస్థాయ వైదేవి దక్షిణాందండాన్ ప్రతి వైజయంత మితిఖ్యాతం పురం యత్ర తిమిధ్వజః" (అయో. 4-12) దక్షిణ దిక్కులో దండకారణ్యంలో తిమిధ్వజుడు అనే రాజున్నాడు. అతని పట్టణం 'వైజయంతపురం' తిమిధ్వజుడే శంబరాసురునిగా ప్రఖ్యాతుడట. "స శంబర ఇతి ఖ్యాతః శతమాయో మహాసురః దదౌ శక్రస్య సంగ్రామం దేవ సంఘైర నిర్జితః" (అయో. 9-13)

శంబరాసురుడు దేవతలను జయించి ఇంద్రుని మీదికి యుద్ధానికి వచ్చినప్పుడు దశరథుడు ఇంద్రునికి సహాయంగా వెళ్ళాడు. దశరథుడు యుద్ధంలో మూర్ఛపోయినప్పుడు రథం నడుపుతున్న కైకేయి రథాన్ని ఇంకో చోటికి తీసుకుపోయింది. అక్కడా ఆయన రాక్షసుల శస్త్రాలకు గాయపడ్డాడు. కైకేయి ఉపచారాలతో అతనిని కాపాడింది. ఆ సందర్భంలోనే దశరథుడు కైకేయికి రెండు వరాలిచ్చాడు.

శంబరాసురుడు ఆర్యులను నిలువరించిన స్థానిక అసుర నాయకుడు. ఇలాంటి వీరులను ఋగ్వేదం (కరువును) క్షామాన్ని కలిగించే అసురులుగా పేర్కొన్నది. (1-59-6) వీరు ఆర్యుల వలసలను తిప్పికొట్టి వారికి ఆహార పదార్థాలు అందకుండా చేసి ఉంటారు.

ఈ అసురుల నగరాలు ఇంద్రుడు ధ్వంసం చేశాడన్నారు. ఒక శంబరుని కథ కృష్ణునితో ముడిపడి ఉంది. శ్రీకృష్ణునికి రుక్మిణికి పుట్టిన శిశువు (ప్రద్యుమ్నుడు) వల్ల తనకు ప్రమాదం అని శంబరుడు గ్రహించి ఆరు రోజుల పిల్లవాడిని అపహరించి నీళ్ళలో విసిరేస్తే అతనిని చేప మింగింది. ఆ చేపను జాలర్లు శంబరుని ఇంట్లోనే అమ్మారు. శంబరుని భార్య మాయాదేవి చేపను కోస్తే శిశువు కనబడ్డాడు (వాయు పురాణం) ఆమె విషయం నారదునితో చెప్పింది. నారదుడు సంగతిచెప్పి ఆ పిల్లవాడిని ప్రేమతో పెంచవలసిందిగా చెప్పాడు. తమ రహస్య విద్యలన్నీ ఆమె ఆ బాలునికి నేర్పింది. ఇంట్లో ఇంత జరుగుతున్నా శంబరునికి ఈ విషయాలు తెలియనేలేదు. ప్రద్యుమ్నుడు పెద్దవాడై శంబరుని గురించి తెలుసుకుని శంబరుని చంపాలనుకున్నాడు. ఏడుసార్లు అతని మీద దాడిచేసి ఓడిపోయాడు. ఎనిమిదోసారి మాయాబలంతో శంబరునీ - అతని వర్గాన్నీ అనుయాయులనూ నాశనం చేయగలిగారు. ప్రద్యుమ్నుడు మన్మథుని అవతారం అనీ మాయాదేవి మన్మథుని భార్య అయిన రతీదేవి అంశంలో పుట్టిందనీ శంబరుని భార్యగా

ఉండటం భ్రమ అనీ నారదుడు అప్పుడు చెప్పాడు. ఇదొక వినోదాత్మకమైన ఒక అద్భుత కథ.

మన్మథుడు శివుని కంటి మంటతో భస్మమైనాక రతీదేవి శంబరుని ఇంట్లో ఆశ్రయం పొందిందనీ ప్రద్యుమ్నుడుగా పుట్టిన మన్మథుని సంరక్షించుకున్నదనీ మరో కథ.

ఆర్యులు స్థానిక అసురులను మంత్రబలంతో మాయబలంతో జయించారనటానికి దీనిని ఉదాహరణగా తీసుకోవచ్చును. కాని ఆ మాయాలు - మంత్రాలు శంబరునికే రాక్షసులకూ ఆపాదించి ప్రచారం చేయటం వక్రీకరణే. వైజయంతపురాన్నీ ఆర్యులు అనంతర కాలంలో వశపరచుకున్నారు.

# 'నాగరాణి తాటక'

ఆర్యుల పాలనను ఎదిరించిన మొదటి మహిళా నాయకురాలిగా పాలకవర్గపు ఎన్‌కౌంటర్లకు బలి అయిన తొలి ఉద్యమకారిణిగా తాటకను పేర్కొనాలి. చరిత్రలో నాగుల తిరుగుబాట్లు చాలా ఉన్నాయి. చరిత్రకు అందనిదీ, పురాణాలు నమోదు చేసినదీ అయిన తాటక వృత్తాంతం రామాయణం బాలకాండలో ఉంది. యజ్ఞాలను అడ్డుకునే ఉద్యమం నడిపిన తాటకను క్రూరంగా చంపారు. ఆ సంఘటన ఎప్పటిదో కాని వాల్మీకి దానిని నమోదు చేశాడు. రామాయణం ఉత్తరకాండలో శంబూక వధ ఉంది. శూద్రుడు తపస్సు చేయకూడదనే నియమం అమలు అవుతూ ఉన్న కాలపు సంఘటన అది. దానినీ వాల్మీకే నమోదు చేశాడు. వర్ణధర్మాన్ని వ్యతిరేకించిన వారిని, పాటించని వారిని చంపటం అక్కడ జరిగింది. ధర్మ సంస్థాపన కోసం అవతరించాడంటారు గాని, రాముడు చేసినది అసుర సంహారం; వర్ణధర్మ సంస్థాపనం. ఇది వ్యక్తి నిష్ఠంకాదు. యుగాలపాటు జరుగుతూ వస్తున్న సామాజిక ధర్మ నియంత్రణ.

అసురులను, రాక్షసులను చంపటం అనేది గో బ్రాహ్మణ హితం కోసమూ చతుర్వర్ణ హితం కోసమూ జరిగిందని రామాయణం గట్టిగానే చెప్పింది. తాటకను పరిచయంచేసే శ్లోకాలలో 'యజ్ఞ విఘ్నకరీ యక్షీ' - 'దుష్ట పరాక్రమా' అనే పదాలు కనిపిస్తున్నాయి. యజ్ఞాలకు విఘ్నం కలిగిస్తున్న తాటకను చంపవలసిందిగా రాముడిని ప్రేరేపిస్తూ విశ్వామిత్రుడు చెప్పిన మాటలలో "గోబ్రాహ్మణ హితార్థాయ", "చతుర్వర్ణ హితార్థాయ" అనే పదాలున్నాయి. తాటక ఈ వర్గాలకు చెందినదా? ఆ వ్యవస్థను వ్యతిరేకించే వర్గాలకు చెందినదా? తాటక వ్యతిరేకించిన యజ్ఞాలూ గోబ్రాహ్మణ - చతుర్వర్ణ వ్యవస్థా ఎవరివి? అవి స్థానికులను ఎలా బాధించాయి? ఎవరికి మేలు చేశాయి? అనే అంశాలు తెలుసుకోవాలంటే 'తాటక వధ' ఘట్టం వివరంగా చదవాలి.

వాల్మీకి తాటక పేరును 'తాడకా' అని చెప్పాడు. సంస్కృతంలో తాడనం అంటే కొట్టటం అని అర్థం. యజ్ఞాలు చేసేవారిని కొడుతూ ఉండేది కాబట్టి ఆమెను మునులు 'తాడకా' అని సంబోధించారేమో. నాగులు, యక్షులు పాళీ, పైశాచీ, మాగధి వంటి ప్రాకృత భాషలు మాట్లాడేవారు. అవే స్థానిక భాషలు - దేశభాషలు. రామాయణాన్ని కావ్యంగా రాసిన వాల్మీకి వాడిన పదాలూ, నామవాచకాలూ, చాలావరకు సంస్కృతీకరింప బడిన పదాలు.

సంస్కృతం అనంతర కాలంలో ఎదిగిన భాష. రాముని కాలంనాటికి ఉన్నదా? అనేది అనుమానమే. ఒక రాముని కాలం త్రేతాయుగం. అది క్రీ.పూ. 102 క్రీ.శ. 867 మధ్య కాలం అయి ఉంటుందంటున్నారు.

రామాయణ రచన క్రీ.పూ. 200 నుండి క్రీ.శ. 250 వరకూ సాగిందంటారు. అది సీత కథగా మొదలై రామాయణంగా ముగిసింది. వాశిష్ఠ రామాయణం ప్రకారం సృష్టిలో ఎందరో రాముళ్ళు – ఎన్నో జన్మలు – అదొక చక్రభ్రమణం. ఎందరో రాముళ్ళ కథలు కలిసి రామాయణం అయిందా? రామాయణ కాలానికి అనేక జాతులున్నాయి, వర్ణాలున్నాయి. భిన్న జాతులమధ్య, వర్ణాలమధ్య వివాహాలున్నాయి. చారిత్రకంగా చూస్తే క్రీ.పూ. 4200 ప్రాంతాల నుండీ వర్ణాల సంకరీకరణ జరుగుతూ వచ్చింది. వర్ణాలు, కులాల విభజన రేఖలు పటిష్ఠంగా లేవు. బాహ్య వివాహాలు నిషేధించటం క్రీస్తు శకారంభంలో జరిగింది. వర్ణాలను ఎక్కడికక్కడ కట్టడి చేయటానికే రాముడు ఉద్యమించాడు.

వర్ణధర్మం, శీలం, స్త్రీత్వం అనేవాటికి రామాయణం ప్రాధాన్యం ఇచ్చింది. ఆ కోణంలో సమాజాన్ని నియంత్రించింది. స్త్రీ స్వామ్యాన్నీ, మాతృవంశానుక్రమాన్నీ, స్త్రీల స్వేచ్ఛా ప్రవృత్తినీ తగ్గించటానికే తాటకను శపించారు; కురూపిని చేశారు. అయినా లక్ష్యం నెరవేర నందున ఆమెను చంపారు. తాటక ఒక వ్యవస్థకు ప్రతీక. ఆమెను కురూపిని చేయటం, చంపటం అన్నీ ఆ వ్యవస్థను అంతం చేయటాన్ని సూచిస్తున్నాయి.

వాల్మీకి రాసిన రామాయణం బాలకాండలో 24, 25, 26 సర్గలలో 'తాడక' గురించి ఉంది. విశ్వామిత్రుడు అనే ముని తాను చేస్తున్న యజ్ఞానికి రక్షణగా రాకుమారులను తన వెంట పంపవలసిందిగా దశరథ మహారాజును కోరాడు. అప్పటికి రాకుమారులు చిన్న వయసువారే. వారికి పదహారేళ్ళు కూడా నిండలేదట. ఒక ఫలసిద్ధి కోసం తాను యజ్ఞం తలపెట్టాననీ దానికి కామరూపులయిన మారీచుడు సుబాహువు అనే ఇద్దరు రాక్షసులు విఘ్నం కలిగిస్తున్నారనీ, వారి నుంచి రక్షణ కావాలనీ విశ్వామిత్రుడు చెప్పాడు. తాను స్వయంగానే వారిని చంపగలిగినా యజ్ఞ దీక్షలో ఉంటాడు కాబట్టి యజ్ఞకర్తలు కోపం తెచ్చుకోకూడదు కాబట్టి, రాముని సహాయం కావాలన్నాడు. రాముడిని పంపటానికి దశరథుడు మొదట ఒప్పుకోలేదు. యజ్ఞ రక్షణకు తానే వస్తానన్నాడు. కుదరదన్నాడు విశ్వామిత్రుడు. రాజగురువు వసిష్ఠుడు రాజుకు నచ్చచెప్పాక రాముడినీ అతనికి తోడుగా లక్ష్మణుడినీ విశ్వామిత్రుని వెంట పంపారు.

విశ్వామిత్రుడు దారిలో రామలక్ష్మణులకు కొన్ని అస్త్ర విద్యలు నేర్పాడు. బల, అతిబల అనే ఆ విద్యలు ఆకలి దప్పులను నివారించి బలం చేకూరుస్తాయట. ఇంకా ఎన్నెన్నో ప్రయోజనాలు చేకూరుస్తాయట. వారు సరయూ నదీ తీరంలో ఒకటిన్నర యోజనాలు నడిచి అంగదేశంలోంచి వెళ్ళారు. క్రీ.పూ. 600–400 ప్రాంతాల నాటికి చరిత్రలో కాశీ కోసల మద్ర విదేహ అంగరాజ్యాల పేర్లు వినిపిస్తున్నాయి. అంగదేశం అంటే ఇప్పటి బీహార్ ప్రాంతం. అక్కడ కామాశ్రమం ఉండేదట. కామాశ్రమం గురించీ దండకారణ్యం గురించీ మలద కరూశ దేశం గురించీ విశ్వామిత్రుడు రామలక్ష్మణులకు వివరించాడు. ఈ కథలు దేవగణాలకు, అసుర గణాలకు గల వైరాన్ని చెబుతున్న కథలే.

ఆ వైరం సామాజిక వైరం. సంస్కృతిపరమైనది. కామాశ్రమం కథ శివ పార్వతుల కథతో తారకాసురుని కథతో ముడిపడి ఉంది. తారకాసురుడు రాజుగా ఉన్న కాలంలో వర్ణధర్మం సాగనివ్వలేదు. అందువల్ల ఆర్యగణాలూ వారు పోషించే దేవగణాలూ భోగాలకూ, విలాస జీవనానికి దూరమై కష్టాలు పడ్డారట. ఆ కాలంలోనే తారకాసురుని చంపగల సేనాని కోసం వారు ప్రయత్నాలు సాగించారు.

శివునికీ, పార్వతికీ పుట్టే కుమారుడు తారకాసురుని జయించగల శక్తిమంతుడవు తాడని వారికి తెలిసింది. హిమవంతుని కూతురైన పార్వతి శివునికి పరిచర్య చేస్తూ ఉండగా శివునిపై మోహపు బాణాలు వేయవలసిందిగా వారు మన్మథుని కోరారు. ఆ ప్రయత్నంలో శివుని కంటి మంటకు మన్మధుడు మాడి, బూడిద అయిపోయిన స్థలం అదేనని విశ్వామిత్రుడు కామాశ్రమం గురించి చెప్పాడు. దీన్నిబట్టి స్థానిక జాతులకూ, దేవగణాలకూ, (దేవ గణాలను ఆశ్రయించి ఉండే ఆర్యగణాలకూ) మధ్య శత్రుత్వం ఉండేదని తెలుస్తున్నది.

రామ లక్ష్మణులు కామాశ్రమం దాటి ప్రయాణించారు. గంగానది దాటి వెళ్ళారు. దండకారణ్యం చేరారు. దేవ, ఆర్యగణాలు స్థానికులతో ఎప్పుడూ ఘర్షణలుపడే చోటు అది. అక్కడే మలద కరూశ దేశం ఉన్నది.

**మలద కరూశ దేశం :**

ఇది చాలా సంపన్నమైన సుందరమైన దేశం. "వృత్రాసురుని చంపి అనేక రోగాలతో బ్రహ్మ హత్యాపాతక దోషంతో బాధపడిన ఇంద్రునికి ఈ దేశంలోనే ఆరోగ్యం చేకూరింది.. అది ఇప్పుడు రాక్షసుల ఆధీనంలో ఉన్నది" అని చెప్పాడు విశ్వామిత్రుడు.

రాముడిని వెంట తీసుకువెళ్ళి తాటకను చంపించటానికి ఆర్యులకు అనేక కారణాలు. మలద కరూశ దేశం తాటక అధీనంలో ఉంది. దండకారణ్య ప్రాంతాలన్నీ యక్షులు, నాగులు పాలిస్తున్నారు. అవి ఖనిజ సంపదకూ, ఓషధులకూ, అటవీ సంపదకూ నిలయాలు. వాటిని వశపరచుకోవటం తాటక జీవించి ఉండగా సాధ్యంకాదు. పైగా తాటక యజ్ఞ విరోధి. ఆర్య ధర్మ విస్తరణకు అడ్డు తగులుతున్నది. అందుకే ఉపాయంగా ఆమెను చంపాలనుకున్నారు. రాక్షసిగా ప్రచారం చేశారు. చప్పుడు చేయకుండా ఆమె రాజ్యంలోకి జొరబడ్డారు.

మలద, కరూశ రాజ్యంలో ప్రవేశించాక విశ్వామిత్రుడు రామలక్ష్మణులను కావాలనే తాటక వనంలోనికి తీసుకువెళ్ళాడు. తన యజ్ఞవాటికకు తీసుకు వెళ్ళకుండా "ఇటు వెళ్ళాలి" అంటూ తాటక వనంవైపు దారితీశాడు. అప్పుడు 'తాటక' గురించి చెప్పటం మొదలుపెట్టాడు.

"తాటక సుందుడు అనేవాని భార్య. 'సుకేతుడు' అనే యక్షుని కూతురు. రూప యౌవన శాలిని, యశస్విని. సహస్రనాగ బల సమన్విత. ఆమె కొడుకు మారీచుడు.

ఇంద్రుని వంటి పరాక్రమం గలవాడు. వారు ప్రజలను బాధిస్తున్నారు," అన్నాడు. ఈ మాటలు వినగానే 'యక్షులు అల్ప పరాక్రములు అని వింటూ ఉంటాం. ఒక అబల సహస్ర నాగ బలం కలిగి ఉండటమేమిటి?' అని రాముడు ఆశ్చర్యంతో అడిగాడు. "ఆమె బ్రహ్మ వరప్రభావంవల్ల కలిగిందని" అప్పుడు విశ్వామిత్రుడు చెప్పాడు. (బాల. 25-2,7).

రామాయణ కథకులు "సహస్ర నాగ బలం" అంటే వెయ్యి ఏనుగుల బలం అని అర్థాలు చెప్పారు. అది సరికాదు. ఆమెకు వెయ్యి మంది నాగ సైనికుల బలం ఉన్నది అని అర్థం. వాల్మీకి తాటక గురించి చెప్పిన ప్రతిచోటా "సహస్ర నాగబల సమన్విత" అని ఎంతో గౌరవంగా విశ్వామిత్రుని నోటనే పలికించాడు.

ఆర్యులు స్థానిక జాతులను, గిరిజనులను అందర్నీ కలిపి 'నాగులు'గా వ్యవహరించే వారు. వీరందరూ అసుర గణాలలోనివారే. కొత్తగా వలస వచ్చిన వారికీ, స్థానికులకూ వివిధ రంగాలలో జరిగిన ఘర్షణలు ఇలాంటికథల రూపంలో తెలుస్తున్నాయి.

తాటక గురించి ఇంకా ఇలా చెప్పాడు, విశ్వామిత్రుడు - "తాటక భర్త సుందుడు. అగస్త్యుని శాపంతో మరణించాడు. భర్త మరణానికి క్రుద్ధురాలయిన తాటక, కొడుకును వెంటబెట్టుకుని అగస్త్యుని మీదికి వెళ్ళింది. అప్పుడు ఆ ముని వారిద్దరినీ శపించాడు"

"రాక్షసుడవు అవుతావు" అని మారీచుడినీ "మనుష్య మాంసం తింటూ వికృతమైన ముఖంతో విరూపంతో పడి ఉండు" అని తాటకనూ శపించాడు. తాటక అగస్త్యుని మింగటానికి వెళ్ళిందని రామాయణకర్తలు ప్రచారంచేసి అతడు ఇచ్చిన శాపాన్ని సమర్థించారు. ఇలాంటి సమర్థనలతోనే ఈనాడూ బలహీనులపై శిక్షలు అమలు జరుగు తున్నాయి.

"నా భర్తను ఎందుకు చంపారు?" అని అడగటమే తాటక చేసిన అపరాధం. మునిపుంగవులను - ఆర్య మునులను - పురోహిత వర్గాన్ని ప్రశ్నించటమా? ఎన్ని అకృత్యాలు చేసినా అగ్రవర్ణాల వారిపై కింది వర్గాలు ఫిర్యాదులు చేయకూడదు. అలాంటి సాహసం చేసిన వారిని పాలకవర్గాలు ఏదోవిధంగా శిక్షిస్తాయి. అదే భారతీయ సంస్కృతి - అదే రామాయణం బోధిస్తున్నది. రూపవతి అయిన తాటకను వికృతపరచారు. తల్లి ఎదుట కొడుకునూ, కొడుకు ఎదుట తల్లినీ హింసించారు. ఇలాంటి హింసా రూపాలు కిందికులాల వారు ఈనాడూ చవిచూస్తున్నారు.

సాత్వికురాలైన తాటకను నరమాంసం తిని బతకాలని చెప్పారు. ఆమె అప్పటి స్థితిని దయనీయంగా వాల్మీకి వర్ణించాడు. (సర్గ 25, 12-14) ఆమె కోపంతో వివశురాలైంది. నిస్సహాయురాలయింది. హింసించటాలూ, వెలివేయటాలు వర్గ సమాజానికి అలవాటు. వారిలో వారికి ప్రాయశ్చిత్త కర్మలుంటాయి. దిగువ వర్గాలకి అలాంటి వెసులు బాట్లు, మినహాయింపులు ఉండవు. అగస్త్యుని మాట రాజశాసనం. ఆహార విహారాలలో

రాక్షసులుగా శిక్ష పొందినా తాటక, మారీచుడు తమ ఆలోచనా రీతిని మార్చుకోలేదు. సామాజిక న్యాయం కోసం పోరాటం సాగిస్తూనే వచ్చారు. ఆ మార్గంలో తమ వారిని సన్నద్ధం చేస్తూనే వచ్చారు.

ఈ క్రమంలో వర్ణధర్మానికి వ్యతిరేకంగా పోరాడిన తొలి ఉద్యమకారిణిగా మానవ హక్కులను కాపాడేందుకు ధైర్య సాహసాలు ప్రదర్శించిన తొలి మహిళగా "తాటక"ను చెప్పుకోవాలి. స్వీయ సంస్కృతిని రక్షించుకునే ప్రయత్నంలో ఆర్యుల దురహంకారానికి బలి అయిన నాయకురాలిగానూ ఆమెను గుర్తించవలసి ఉంది.

తాటకను చంపటానికి పన్నిన పథకం చాలా కట్టుదిట్టంగానే అమలు పరిచారు. ఒకనాటి సాయంకాలం మొదలైన దాడి కొన్ని గంటలలోనే ముగిసింది. తాటక వనంలోనికి ప్రవేశించిన విశ్వామిత్రుడు తాటక స్థావరాన్ని రామునికి చూపించి "ఇదే ఆ యక్షి స్థావరం, గో బ్రాహ్మణ హితం కోసం నీవు ఆమెను చంపాలి" అన్నాడు.

"ఏనాం రాఘవ దుర్వృత్తాం యక్షీం పరమదారుణా
గోబ్రాహ్మణ హితార్థాయ జహి దుష్ట పరాక్రమాం" (బాలకాండ సర్గ – 25–15)

రాముడు అతి కర్కశంగా వింటినారి మోగించాడు. ఆ ధ్వనికి తాటక వనంలోని జీవులన్నీ ఉలిక్కిపడ్డాయి. ప్రశాంతంగా ఉన్న వనంలో ఆ కఠోర శబ్దం విని తాటక కోపంగా బయటకు వచ్చింది. ఆమె చేతిలో ఆయుధం లేదు. వెంట అనుచరులూ లేరు. ఒంటరిగా బయటకు వచ్చి, ధ్వని వినవచ్చిన దిక్కుగా నడిచింది. బాలురైన రామలక్ష్మణులు ధనుర్బాణాలతో కనిపించారు.

"బాణం వేసి చంపు" అంటూ విశ్వామిత్రుడు రాముడిని తొందరపెడుతున్నాడు. తాటక వారిని అడ్డుకునే ప్రయత్నం చేసింది. చేతికి దొరికిన రాళ్ళు విసిరి భయపెట్టి వారిని తరిమివేయాలనుకున్నది. వాల్మీకి ఆమె చర్యలను అలాగే వర్ణించాడు. రాముడు బాణం వేయబోతుంటే అడ్డుకోవటానికి ఒక అడుగు ముందుకు వేసింది. బాణం వేయటానికి రాముడు సందేహిస్తూ ఉన్నాడు. అకారణ వైరం – స్త్రీలను చంపకూడదనే నీతి, వెనక్కి లాగుతున్నాయి. తాను చేస్తున్న పని సబబుకాదని అతనికి తెలుసు.

తాటక అతనిని ఆపే ప్రయత్నంలో రాళ్ళు రువ్వుతున్నది. ఈ ఘట్టాన్ని పౌరాణికులు శిలావర్షంగా గొప్పగా చెబుతుంటారు. సినిమాలలో మరీ భయంకరంగా చూపిస్తారు. తాటక విసిరిన రాయి రామునికి తగిలింది. కోపంగా ముందుకు వెళ్ళి ఆమె భుజాలు నరికాడు. లక్ష్మణుడు వచ్చి ముక్కు చెవులు కోశాడు. అయినా ఆమె ప్రతిఘటించిందట. ఇంకా ఆలస్యం చేస్తే సంధ్యాకాలంలో రాక్షసుల బలం పెరుగుతుందని విశ్వామిత్రుడు తొందర పెట్టాడు. "స్త్రీ అని జాలిపడకు – పూర్వం మహాత్ములయిన రాజపుత్రులు అధర్మ నిరతులయిన స్త్రీలను చంపారు" అని నిదర్శనాలు చెప్పాడు. (25–17, 21)

"రాజులు ప్రజా రక్షణలో, పాపులు - మంచి వారు అని చూడకూడదు. పవిత్రమైనదైనా, దోషపూరితమైనదైనా కర్తవ్యం పాటించాలి" అన్నాడు. (సర్గ 25-18). "ఈ ధర్మ పాలన కోసమే రాజులు నియుక్తులయ్యారు. నేను చెప్పినట్టు చెయ్యి. ఆమెను చంపు" అన్నాడు (25-22).హుంకారంతో ఆమెను బెదిరించాడు.

విశ్వామిత్రుని మాట ప్రకారం నడుచుకోవలసిందిగా తండ్రి చెప్పాడు గనక, రాముడు తండ్రి మీది గౌరవంతో ముని మాట పాటించాడని వాల్మీకి రాశాడు.

"పితుర్వచన నిర్దేశాత్, పితుర్వచన గౌరవాత్

వచనం కౌశికస్య..." (సర్గ. 26-2) రాముడు తాటకను చంపటానికి నిశ్చయించుకున్నాడు.

"కరిష్యామి న సందేహస్తాటకా వధ ముత్తమం
గోబ్రాహ్మణ హితార్థాయ దేశస్యాస్య సుఖాయచ
తవ.....కర్తు ముద్యతః" (సర్గ. 26-5)

గోబ్రాహ్మణ హితం కోసమూ దేశం సుఖం కోసమూ ఆమెను చంపాడు. దానినీ ఘనంగానే వర్ణించారు. రాముడు శబ్దవేధి విద్యతో ఆమె గుండెల్లోకి బాణం వేశాడట. కత్తితో ముక్కూ చెవులూ, భుజాలూ నరికేంత దగ్గరగా వెళ్ళిన వారు శబ్దాన్ని బట్టి బాణం వేయాల్సిన అవసరం ఏమున్నది? రాముని బాణ కౌశలం చూపటానికే ఆ వర్ణన. బాణం గుండెల్లో గుచ్చుకుని తాటక నేలకు ఒరిగింది. "సాధు సాధు" మంచి పనిచేశావు అని దేవతలు పొగిడారు. "ఈ రాముడు ఇంకా దేవకార్యాలు ఎన్నో చేయవలసి ఉంది. అందుకు ఇతడు సమర్థుడే" అనీ పొగిడారు. ఇది దేవగణాల ప్రోద్బలంతో జరిగిన హత్య. దేవగణాలు రాముని అనుసరించే వస్తున్నారన్నమాట. అప్పటికి సంధ్యా సమయం దాటింది. తాటకను చంపే పని సంధ్యా సమయానికి ముందు మొదలై సంధ్య దాటేసరికి ముగిసింది.

ఇది చాలా పకడ్బందీగా అమలు జరిగిన పథకం.[1] అమలు చేయించినవారు మునులు - చేసినవారు రాకుమారులు. తాటకను చంపిన ప్రాంతం ఇప్పటి బక్సర్ దగ్గరి ఘాజీపురం ప్రాంతం. ఒక శతాబ్దం కిందటి వరకు అక్కడ చక్కని ఉద్యానవనాలుండేవని ఏనుగుల వీరస్వామయ్య గారు తమ కాశీయాత్రా చరిత్రలో రాశారు.

తాటక వధ మామూలు ఘర్షణల లాంటిది కాదు. ఒక వ్యవస్థను అంతం చేయటానికి జరిగిన కుట్రల పరంపరలో భాగం. ఒకానొక ఆదర్శంతో, లక్ష్యంతో సాగుతున్న ప్రయత్నాలను నిర్వీర్యం చేయటానికి బెదిరిస్తారు. మొదట చిన్న చిన్న శిక్షలు వేస్తారు.

1 బలమైన శత్రువును చంపటానికి సామ్రాజ్యవాద దేశమైన అమెరికా వేసిన ఎత్తుగడ లాంటిదే ఇదీను. అల్‌ఖైదా అధినేత ఒసామాబిన్ లాడెన్ భవంతిపై ఆదివారం (1-5-2011) అర్ధరాత్రి అమెరికా హెలికాప్టర్లు చక్కర్లు కొట్టాయట. భవంతిపై దాడి - కాల్పులు - ఒసామా మరణం అన్నీ 40 నిమిషాలలో జరిగిపోయాయి. అమెరికా అధ్యక్ష భవనంలోంచి వ్యూహకర్తలు దానిని చూస్తూనే ఉన్నారట. ఈ పోలిక సమంజసమో కాదో గాని జరిగింది మాత్రం అలాగే -

శాపాలు ఇస్తారు. దానికీ లొంగకపోతే చంపుతారు. తమ ప్రయోజనాల కోసం ఎంతవరకైనా పోగల పాలక వర్గం – వారికి దన్నుగా నిలిచే సంపన్న మాఫియా ముఠాలు ఈనాడు ఎక్కడ చూసినా కనిపిస్తాయి. వారికి ఇలాంటి కథలు ధైర్యాన్నిస్తాయి.

దళితులకు, ఆదివాసీలకూ భూములు పంచినప్పుడూ – ఎవరి భూములు వారికే ఉండాలన్నప్పుడూ, అటవీ భూములను ఇతరులు ఆక్రమించుకోకూడదని అన్నప్పుడూ ఇలాంటి పోరాటాలు, హత్యలు ఇప్పుడు జరుగుతున్నాయి. అప్పుడూ జరిగాయి.

దండకారణ్యం సుక్షేత్రం, సుసంపన్నమైన క్షేత్రం. స్కాంద పురాణంలో దీనిని ధర్మారణ్య క్షేత్రంగా పేర్కొన్నారు. ఈ క్షేత్రంలోని పుణ్య తీర్థాల గురించి బోలెడన్ని కథలు చెప్పారు. ఇంద్రుని పాపాన్ని పోగొట్టిన మలద కరూశ దేశాన్ని స్కాందపురాణం ఇంద్రేశ్వర జయంతేశ్వర క్షేత్రంగా చెప్పింది (2-1-19). వృత్రాసురుని చంపిన పాపాన్ని పోగొట్టు కున్న తర్వాత తండ్రీ కొడుకులు ఇద్దరూ ఆ ప్రాంతాన్ని కబ్జా చేసి తమ పేర్లు ఆ క్షేత్రానికి పెట్టేశారు. జయంతుడు ఇంద్రుని కొడుకు.

ఈశ్వరుడు (శివుడు) అనార్యుల దైవం. నాగులు అనార్యులు. వారి నుండి అభయం పొందాలంటే శివుడిని స్తుతించాల్సిందే. ఇంద్రుడూ అతని కొడుకు జయంతుడూ శివుడిని కాకాపట్టి ప్రసన్నుడిగా చేసుకొని ఉండాలి. తాటక కాలం నాటికి ఆ క్షేత్రంపై అంటే మలద కరూశ ప్రాంతంపై ఇరువర్గాలకూ, నాగులకూ – దేవ/ఆర్య గణాలకూ ఘర్షణ సాగుతున్నది. రాముడివల్ల ఆ ప్రాంతం దేవగణాలకు దక్కింది. తమ పేర్లతో బాటు ఈశ్వరుని పేరూ కలిపి పెట్టారు.

స్కాందపురాణం దాదాపు 81,000 శ్లోకాల గ్రంథం. ఏడు ఖండాలు – ఒక్కో ఖండంలో మళ్ళీ చాలా విభాగాలు ఉన్నాయి. మూడోదైన బ్రహ్మఖండంలో 1. సేతు మాహాత్మ్యం 2. ధర్మారణ్య ఖండం. 3. బ్రాహ్మణోత్తర ఖండం ఉన్నాయి. వీటిలో చాలా అంశాలు రాముని సంబంధం గలవి.

"వధి ప్రవ్రజితో యావత్ తాడకానామ రాక్షసీ తావదా గమ్య పురతః తస్థౌవై విఘ్న కారణాత్" (స్కాంద 2-1-30) యజ్ఞాలు విఘ్నం చేస్తూ తాడక రామునికి ఎదురు పడితే అప్పుడు అతడు ఆమెను చంపాడని స్కాంద పురాణంలో చెప్పారు. రాముడే ఆమెను వెతుక్కుంటూ వెళ్ళిన సంగతి చెప్పటంలేదు. వాస్తవాలు దాచిపెట్టి ఒక జాతిని హీన పరచటంలో ఆర్య వాఙ్మయం గొప్పదే.

"తాటక వధ" తర్వాత జరిగిన చిన్న చిన్న తిరుగుబాట్లను పాలకులు అణచివేస్తూ వచ్చారు. కొన్ని సంవత్సరాల తర్వాత రాముడు రాక్షసులను చంపటానికి జనస్థానానికి వచ్చాడు. అడవిలోనే మకాంపెట్టాడు. రాక్షసులందర్నీ చంపేశాడు. నాగవీరుల తిరుగుబాట్లు చాలా జరిగినా అవి చరిత్రలో ఇదమిత్థంగా నమోదు కాలేదు. ఆ ఉద్యమాలను రాజ్యం క్రూరంగా అణచి వేసింది. రాముని అరణ్యవాసం ఆర్యేతరులను తుడిచిపెట్టటానికే.

తాటకను కురూపిగా చేసి ఆమె ఆహారంపైన ఆంక్షలు విధించిన తీరు గమనిస్తే అనంతర కాలపు అతి శూద్ర కులాలపై ఉన్న ఆంక్షలకు ఇది ప్రాతిపదిక అనిపిస్తుంది. వికారంగా కనిపించాలి. అందంగా ఉండకూడదు. విలువైన ఆభరణాలు ధరించకూడదు. తెల్లని పరిశుభ్రమైన బట్టలు కట్టుకోకూడదు. శవాలమీది బట్టలు కట్టుకోవాలి. చనిపోయిన జంతువుల మాంసాన్ని తినాలి. డబ్బు ఉన్నా అనుభవించకూడదు. మనుధర్మ నియమాలు ఇలాగే రూపొందాయి.

హరిశ్చంద్రుని కథలో హరిశ్చంద్రుని కొనుక్కున్న కాటి కాపరి ప్రవీరుని విషయం లోనూ ఇలాంటి వర్ణనే కనిపిస్తుంది. కింది కులాలవారు ఎంత ధనవంతులయినా వేష భాషలలో ఆహార విహారాల్లో దైన్యంతోనే ఉండాలి.

తెల్లబట్టలు కట్టుకుని నిమ్న వర్గాలవారు వీధులలో కనిపించకూడదు. అలా కనిపించిన వారిని చంపేసిన సంఘటనలు కోకొల్లలు.

సహస్ర నాగబల సమన్విత అయిన తాటక హత్య నాగవీరులను తిరుగుబాటుకు ప్రేరేపించే ఉంటుంది. శూర్పనఖకు జరిగిన అవమానం (ముక్కు, చెవులు కోయటం) జనస్థానంలో యుద్ధానికి దారితీసిందని చెప్పారే గాని తాటక హత్యానంతర పరిణామాలు రామాయణకర్తలు చెప్పటంలేదు.

తాటకను చంపినందుకు దేవతలు సంతోషించారట. ఆకాశం నుండి హర్షధ్వనులు వినిపించాయట. దేవతలు నాట్యాలు చేశారట. మహర్షులు రాముని అభినందించారు. అతడు సాధించవలసిన పనులు ఇంకా చాలా ఉన్నాయన్నారు. విశ్వామిత్రుడు రామునికి అనేక అస్త్రవిద్యలు ఉపదేశించాడు. అవన్నీ సాకారంగా (రూపాలతో) రాముడి ముందు నిలిచాయి. "నేను తలచినప్పుడు వచ్చి నాముందు నిలవండి" అని రాముడు వాటికి చెప్పాడు. తర్వాత సిద్ధాశ్రమానికి వెళ్ళారు. సిద్ధాశ్రమం అంటే విశ్వామిత్రుని ఆశ్రమం. ఆ సిద్ధాశ్రమానికి ఎంతో చరిత్ర ఉన్నది. రాముడు అడగటమూ విశ్వామిత్రుడు చెప్పటమూ అనే పద్ధతిలో ఇక్కడ బలి చక్రవర్తి గురించీ వామనుని గురించీ వివరించారు. ఆ తర్వాత కూడా దేవాసురుల కథలు అదే పద్ధతిలో రామాయణం చెప్పింది.

రామలక్ష్మణులు వచ్చినది విశ్వామిత్ర యాగరక్షణ కోసం – సిద్ధాశ్రమంలో విశ్వామిత్రుడు యాగం చేశాడు. ఆరవ రోజున రాక్షసులు మారీచ, సుబాహులు తమ అనుచరులతో యజ్ఞం జరగకుండా అడ్డుపడ్డారు. (ఇది ఈ కాలపు ధర్నాలలాంటిదే.) రాముడు వారిని అడ్డుకున్నాడు. మారీచుడిని దూరంగా విసిరేశాడు. అతడు ఇంకా జీవించవలసి ఉన్నదనీ అందువల్ల అతనిని చంపననీ లక్ష్మణునితో చెప్పాడు. సుబాహుడిని చంపాడు. ఇతర రాక్షసులను తరిమేశాడు. పోలీసు బలగాలు ప్రదర్శనకారులపై లాఠీఛార్జీ చేయటం – కాల్పులు జరపటం – అప్పుడప్పుడు కొందరు మరణించటం అదంతా దుష్ట శిక్షణ, ఆత్మ రక్షణగా ప్రభుత్వాలు ప్రకటించుకోవటం రాజ్య వ్యవహారాలలో అతి మామూలు

విషయం. రాక్షసులను తరిమివేయటం వల్ల ఆ ప్రాంతంలో శాంతి నెలకొన్నదనీ సిద్ధాశ్రమం నుంచి వెళ్ళిపోయిన మునులు తిరిగివచ్చి రాముని పొగిడారనీ రామాయణం చెబుతోంది.

విశ్వామిత్రయాగం పూర్తి అయ్యాక అక్కడి మునులు జనక మహారాజు చేస్తున్న యజ్ఞం చూడటానికి వెళ్తూ రామలక్ష్మణులనూ తమతో రమ్మన్నారు. జనకుని దగ్గర ఉన్న శివధనుస్సును చూడవచ్చుననీ చెప్పారు. విశ్వామిత్రుడూ, మునులూ, రామలక్ష్మణులూ జనకుని పట్టణానికి వెళ్ళటం ఒక యాత్రలాగానే వర్ణించారు. మార్గమధ్యంలో విశ్వామిత్రుడు ఆయా క్షేత్రాల చరిత్ర కధలుగా చెబుతుండేవాడు. ఆ కథలన్నీ చాలావరకు దేవాసుర ఘర్షణల కథలే. అవన్నీ రామాయణ కధకు ముందటికాలానివి. ఆర్యుల వైదిక సంప్రదాయాలకూ అసురుల విశ్వాసాలకూ జరిగిన సంఘర్షణ అప్పటి రాజకీయ సామాజిక రంగాలలో ఎలాంటి కల్లోలం సృష్టించిందో ఆ కథల నుండి గ్రహించవచ్చు. ప్రాచీన అసురుల భావజాలంతోనే అనంతర కాలంలో జైన, బౌద్ధ ధర్మాలు రూపుదిద్దు కున్నాయి. రామాయణ కాలానికి అవి బలంగా ఉన్నాయి. వాటిని ఛేధించటానికే నారాయణుని గొప్పతనాన్ని తెలిపే రామకథలతో రామాయణం వచ్చింది.

అశోకుని (క్రీ.పూ. 272–232) మరణానంతరం బ్రాహ్మణ మతం విజృంభించింది. అశోకుని వంశంలో దశరథుడు అనే రాజున్నాడనీ ఆ కాలంలోనే పురాణాలకు బీజం పడిందనీ చెబుతారు. పురాణాల సంకలనం క్రీ.పూ. 300 – క్రీ.శ. 600 అని చరిత్ర కారులు అంటున్నారు గాని, గుప్తుల కాలంలోనే అవి పూర్ణ రూపాన్ని సంతరించుకున్నాయి.

# వర్ణ ధర్మం

కృతయుగంలో ఒకటే కులం అనీ వర్ణభేదం లేదనీ వాయుపురాణం (అధ్యా. 8) చెప్పింది.

వర్ణం అంటే రంగు. దేహచ్ఛాయను బట్టి వర్ణాలను మహాభారతం (శాంతిపర్వం) చెప్పింది.

"బ్రాహ్మణానాం సితోవర్ణః క్షత్రియాణాంచ లోహితః
వైశ్యానాం పితురో వర్ణః శూద్రాణాం అసితస్తథాః"

బ్రాహ్మణులకు తెల్లవర్ణం క్షత్రియులకు ఎర్రన, వైశ్యులకు పచ్చవర్ణం, శూద్రులకు నల్లవర్ణం చెప్పారు. బ్రాహ్మణులలో నల్లవారూ శూద్రులలో తెల్లనివారూ ఉండటం లోకంలో కనిపిస్తున్న వాస్తవం. వర్ణాలు వేదాలవల్ల కలిగాయని తైత్తిరీయ బ్రాహ్మణం చెప్పింది. వైశ్యులు ఋగ్వేదంవల్ల, క్షత్రియులు యజుర్వేదంవల్ల, బ్రాహ్మణులు సామవేదంవల్ల కలిగారట. దేవతల వల్ల బ్రాహ్మణ వర్ణమూ, అసురులవల్ల శూద్రవర్ణమూ వచ్చాయని మరోచోట ఉంది.

వీటన్నింటినీ చూస్తే ఈ కల్పనలకు అంతులేదా అని ఆశ్చర్యం కలుగుతుంది.

బ్రాహ్మణులు బ్రహ్మ ముఖం నుంచి పుట్టారా? కశ్యపునికి పుట్టారా? మనువుకు పుట్టారా, ధ్వనివల్ల (భూఃస్వః) పుట్టారా. దేవతలవల్ల పుట్టారా, సామవేదంవల్ల పుట్టారా. ఎలా నిర్ధారించటం? అంటూ గతంలో చాలా చర్చలు జరిగాయి. జనన ధ్రువీకరణ పత్రాలు అప్పుడూ అవసరమయ్యాయా?

ఎవరికి నిర్దేశించిన వర్ణధర్మాలు వారు పాటించే పాలనలోనే గోబ్రాహ్మణ హితమూ, దేశం సుఖమూ ఉన్నాయని విశ్వామిత్ర ముని రామునికి చెప్పటం 'తాటకవధ'లో ఉంది.

"నహితే స్త్రీ వధ కృతే ఘృణా కార్య నరోత్తమ
చాతుర్వర్ణ హితార్థాయ కర్తవ్యం రాజసూనునా। " (బాల - 25-17)

(రాజనందనా! స్త్రీని చంపటం అల్పకార్యమని అనుకోవద్దు. చతుర్వర్ణాల హితం కోసం అది నీ కర్తవ్యం.) అనీ ముని రామునికి చెప్పాడు. చతుర్వర్ణాల ప్రజలూ వారి వారి విధులు నిర్వహించేటట్టు చేయటం రాజుల కర్తవ్యంగా అప్పటి వ్యవస్థ స్థిరపడి ఉంది. వర్ణాలు మూడే అనీ కాదు నాలుగు అనీ ధర్మశాస్త్రాలు చెబుతున్నాయి. రామాయణ కాలం నాటికి నాలుగువర్ణాలున్నాయి. అవి మొదటినుంచీ లేవు. మధ్యలో వచ్చాయి గనక వాటిని అమలుపరచే పని రాజులకు బాధ్యతగా అప్పగించారు.

ఇండియాలో ఆర్య - స్థానిక జాతుల ఘర్షణల నేపథ్యంలో ఈ వర్ణాలు ఏర్పడ్డాయని జోతిరావ్ పూలే అభిప్రాయం. బ్రహ్మ అనబడే ఆర్య జాతుల నాయకుని గురించీ అతని

వారసుల గురించీ పూలే చెప్పారు. స్థానిక జాతుల నాయకులు అసుర క్షత్రియులు, బ్రహ్మ ఆర్య జాతుల నాయకుడు

వామనుని ద్వారా భూమినంతా వశపరచుకొని తనవారిని బ్రాహ్మణులను సామాజిక శ్రేణిలో అగ్రభాగాన నిలబెట్టాడు స్థానిక అసుర క్షత్రియులలో కొందరిని తనకు విధేయులుగా చేసుకున్నాడు. మిగతావారిని క్షుద్రులుగా శూద్రులుగా పరిగణించాడు. ఆ ప్రకారం వర్ణాలు మూడే (బ్రాహ్మణ, క్షత్రియ, శూద్ర వర్ణాలు) అన్నారు జోతిరావ్.

వామనుని తర్వాత అతనిని 'ఉపాధి'గా స్వీకరించిన ఆర్యవర్గంలో 'ఉపాధ్యాయ' వర్గం ఏర్పడింది. బలి చక్రవర్తి మరణించాక బలి వారసులలో బాణాసురుడు బలవంతుడై ఆర్యులను తరిమికొట్టాడు. ఈ కాలంలో ఈ ఉపాధ్యాయ వర్గాలు అడవుల్లో తలదాచుకుని తాళపత్రాలపై గోళ్ళతో/మొనదేలిన రాళ్ళతో ఏవో రాతలు రాస్తూ తమ శత్రువులను చంపవలసిందిగా దేవగణాలను అర్థిస్తూ మంత్రాల్లాంటివి వల్లిస్తూ గడిపారట. గుర్రాల మాంసమూ, కుక్కల మాంసమూ తింటూ వారు భ్రష్టులయ్యారనీ దానిలోంచే 'భట్' పదం వ్యవహారంలోకి వచ్చిందనీ పూలే ఊహ. ఆ దశలోనే వారు మంత్రాలలాంటివి రాశారు. వాటినే విద్యలుగా చెప్పుకున్నారంటారు పూలే. గుర్రాల మాంసం తినటానికే పశు యజ్ఞాలు ఏర్పరచారంటారు ఆయన.

ఆర్యులు తమ వర్గాన్ని గుర్తుపట్టడానికి కొన్ని ప్రత్యేక గుర్తులు పెట్టుకున్నారు. జంధ్యం, గాయత్రీ మంత్రం అలా వచ్చినవే. ఆ మంత్రాలు శూద్రుల ఎదుట చదవకూడదన్నారు. వామనుని తర్వాత వచ్చిన బ్రహ్మ (ప్రజాపతి/ఆర్య నాయకుడు) ఈ ఏర్పాట్లన్నీ చేసి తనవారిని కూడగట్టుకున్నాడు. నెమ్మది నెమ్మదిగా బాణాసురుని వారసులను జయిస్తూ వచ్చాడు. ఓడిన వారిని క్షుద్రులుగా (శూద్రులు) పరిగణిస్తూ గ్రామాలలో తమ వర్గాన్ని అధికార పదవులలోకి తెచ్చాడు. చదవనేర్చిన భట్‌లకు బలి (సుంకం) వసూలుచేసే కులకర్ణి (కులకామి) పదవులు స్థిరపరచారు. భూముల అసలు హక్కుదారులైన శూద్రులు కున్బీలు (కులవాదులు) అయ్యారు. శూద్ర స్త్రీలు భట్‌ల ఇళ్ళల్లో పనిచేయవలసిన పరిస్థితి ఏర్పడింది. భట్‌లు ఇంటింటా తిరిగి (విద్యావంతులు కాకపోయినా) మంత్రాలు వల్లిస్తూ ఉదరపోషణ కోసం ఆహారం తెచ్చుకునే పద్ధతి గౌరవప్రదమైన ఆయవార వృత్తిగా అయింది. భట్‌లు బ్రాహ్మణులుగా వ్యవహారంలోకి వచ్చారు.

అనంతర కాలంలో మహర్లు (అసుర క్షత్రియులు) బలపడి ఆర్యుల్ని ఎదిరించటమూ తమ రాజ్యాలు తిరిగి తీసుకోవటమూ జరిగింది. అప్పుడే పరశురాముడు 21 పర్యాయాలు క్షత్రియులను వెదికి వెదికి చంపాడు. బ్రాహ్మణ క్షత్రియ సంఘర్షణలలో జననష్టం జరిగింది. బ్రాహ్మణ స్త్రీలు ఎందరో వితంతువులయ్యారు. క్రూరుడైన పరశురాముడు స్త్రీలపట్ల నిర్దయగా ఉండేవాడు. వితంతువులైన బ్రాహ్మణ స్త్రీలకు పునర్వివాహం నిషేధించాడు. ఓడిన మహర్లను (క్షత్రియులు) భార్యలతో సహా క్రూరంగా చంపాడు. వారిని ప్రాణాలతోనే భవనాల

పునాదులలో నిలబెట్టి వారి మీద భవనాలు కట్టించేవారట. శూద్రులపై సలసలమరిగే నూనెనుపోసి హింసించటం - వారిని చూసి ఎవరూ జాలిపడరాదని ఆజ్ఞాపించటం వంటివి మహమ్మదీయ పాలనలోనే అంతమయ్యాయట. పరశురాముడు గర్భవతులనూ పసిపిల్లలనూ బతకనివ్వలేదు. ఏదో విధంగా అతని నుండి తప్పించుకున్న వారి వారసులు రకరకాల వృత్తులతో జీవనం సాగించారు. ఈ వృత్తి కులాలన్నీ మహర్ల (అసుర క్షత్రియుల) నుండి వచ్చినవే. వీరిలో అతి సాహసవంతులైన వారికి అతి శూద్రులుగా పేరుపెట్టి మహర్, మాంగ్, పరయా, చమర్, చండాల వంటి కులాలుగా చేసి వారిచేత హీనమైన పనులు చేయించటం కష్టమైన వారిని అంటరాని కులాలుగా చేయటం అప్పుడే జరిగిందంటారు పూలే. అసుర క్షత్రియులలో నుండే క్షత్రియ, శూద్ర, అతి శూద్ర కులాల విభజన జరిగింది. అసుర క్షత్రియుల రాజ్యాలను/భూములను ఆర్యులు ఆక్రమించిన తరుణంలోనే గ్రామాల నుంచి నగరాలకు నిత్యావసర వస్తువుల సరఫరాకు వర్తకుల అవసరం ఏర్పడింది. అసుర క్షత్రియుల నుండే వైశ్యవర్గమూ ఏర్పడింది. బ్రాహ్మణులు వైశ్యవర్గాన్ని ఆదరంగానే చేర్చుకున్నారు.

మనుధర్మశాస్త్రం బ్రాహ్మణ, వైశ్య, క్షత్రియ, శూద్ర వర్ణాలను ఒక క్రమంలో చెప్పింది. వారికి వారి వారి విధులూ నిర్దేశించింది. ఆర్యుల అవసరాలనుబట్టే ఆయా విధులు నిర్వర్తించే కులాలు వ్యవహారంలోకి వచ్చాయి.

తాటక నాటికి గణ రాజ్యాలున్నాయి. అక్కడ వర్ణ ధర్మ వ్యవస్థలేదు. వైదిక ధర్మాన్ని అవలంబించే ఆర్య బ్రాహ్మణ రాజ్యాలలోనే (ఆర్యావర్తం) వర్ణధర్మ వ్యవస్థ ఉన్నది. ఆర్య రాజులు తమ రాజ్యాలు నిలబెట్టుకోవటానికి చాతుర్వర్ణ హితం కోసం తాటకను చంపవలసిన అవసరం ఏర్పడింది.

అతి శూద్రకులాల ఏర్పాటు గురించి ఆది జాంబవ మహాపురాణంలో చెప్పిన విషయాలనూ విశ్లేషించుకోవాలి. అంటరాని కులాలు శాపంవల్ల ఏర్పడ్డాయనీ, ఆ శాపం వెయ్యి సంవత్సరాల వరకు ఉంటుందనీ ఆ పురాణం చెప్పింది. ఇది ఆ కులాలను నమ్మించే ఏర్పాటు. తిరుగుబాటు చేయకుండా వారిని ఆపి ఉంచే ఏర్పాటు అని అనుకోవచ్చు.

రామాయణ కాలానికి ముందు వర్ణధర్మం మరీ అంత క్రూరంగా లేదు. దశరథుడు వేటకువెళ్ళి తమసా నదీతీరంలో ప్రబ్బలి చెట్ల చాటు నుండి వచ్చిన నీటి ధ్వని ఏనుగు చేసిన ధ్వనిగా పొరబడి ఆ దిక్కువగా బాణం వేశాడు. ఆ బాణం అక్కడ కడవతో నీళ్ళు నింపుకుంటున్న ముని కుమారునికి తగిలింది. అతని ఆర్తనాదం విని వెళ్ళిచూస్తే బాణం గుచ్చుకుని మరణస్థితిలో ఉన్న ముని కుమారుడు కనబడ్డాడు. అతనిని చూడగానే దశరథుడు తన గుండెల్లోనే బాణం గుచ్చుకున్నట్లు బాధపడ్డాడట. గుర్రం దిగి, "నీ కులమేమిటి" అని అడిగాడు. (రఘువంశం 9-76) "పృష్టాన్వయః" చనిపోబోతున్నవాడు బ్రాహ్మణుడేమో అని భయపడ్డాడు. తనకు బ్రహ్మహత్యా పాతకం చుట్టుకుంటుందేమో అని భయపడ్డారు.

"ద్విజేతర తపస్వి సుతం" అని విన్నాక గాని దశరథుని మనసు కుదటపడలేదు. వైశ్యునికి శూద్ర స్త్రీవల్ల కలిగిన వాడను, అని మునికుమారుడు చెప్పాడు. ఈ విషయం రామాయణం ఇలా చెప్పింది.

"బ్రహ్మహత్యాకృతం పాపం హృదయా దపనీయతాం
నద్విజాతి రహం రాజన్ మా భూత్తే మనసోవ్యథా
శూద్రాయా మస్మి వైశ్యేన జాతో జనపదాధిప।"

(బ్రహ్మహత్య చేశానని బాధపడకు – నేను ద్విజాతివాడను కాను. శూద్రుడను అని...)

బ్రాహ్మణాధిపత్యాన్ని చతుర్వర్ణ వ్యవస్థ బలంగా నిలబెట్టింది. ఈ సామాజిక వ్యవస్థ ఇంతగా పాతుకుపోయి ఉన్నదంటే అన్ని కోణాలలోనూ కావ్యాలూ, పురాణాలూ, శాస్త్రాలూ దీనిని ప్రచారం చేయటం ఒక కారణం. రామ రాజ్యమే వర్ణవ్యవస్థను బలంగా నిలబెట్టింది.

శూద్ర, అతి శూద్ర కులాలపై ఆంక్షలు రాముని పాలనలో బలపడ్డాయి. విద్య నేర్చుకోవటంపై ఆంక్షలూ వచ్చాయి. చదువుకోవటాన్ని ప్రపంచవ్యాప్తంగా అన్ని ధర్మాలూ ప్రోత్సహిస్తాయి. ఇస్లాం మతానికి ఆధార గ్రంథమైన ఖురాన్ జ్ఞానాన్ని సూచిస్తుంది. "ఖురా" అంటే చదవటం. ఖురాన్ చదవటంపై ఎవరికీ ఆంక్షలులేవు.

క్రైస్తవమతంలో బైబిలు జ్ఞానాన్నిచ్చే గ్రంథం. దేవుడు వాక్యమై ఉన్నాడని బైబిలు చెబుతోంది. బైబిలు క్రైస్తవులందరికీ చెందిన గ్రంథం. అది ఏ వర్ణానికీ కులానికీ నిషేధించబడ లేదు. అన్ని ధర్మాలూ విద్యను జ్ఞానార్జనను ప్రోత్సహించాయి. భారతదేశంలో వైదికమతం ఇందుకు భిన్నంగా శూద్రులకూ స్త్రీలకూ వేదాధ్యయనాన్ని నిషేధించింది. వేదం అంటే జ్ఞానం తెలుసుకోదగినది. అందుకు రకరకాల శాపాల కథలు సృష్టించింది. దక్షుని శాపం శూద్రుల అవిద్యకు కారణమని స్కంద పురాణంలో ఒక కథ ఉంది.

అంటరానితనమూ రామరాజ్యంలో ఉంది. "యజ్ఞ వేదికను చండాలుడు అంటరాని విధంగా..." వంటి వర్ణనలు రామాయణంలో ఉన్నాయి.

ప్రపంచమంతా జ్ఞానార్జనతో జ్ఞానాన్వేషణలో పురోగమిస్తుంటే భారతదేశంలోని వైదిక సమాజం దేశ జనాభాలో ఎక్కువ భాగాన్ని పురోగమనానికి దూరం పెట్టింది. అందుకోసం మతపరంగా పురాణ కథలు ప్రచారం చేసింది.

కులాల ఏర్పాట్లకు సంబంధించి స్కందపురాణం చాలా కథలు చెప్పింది. శూద్రునికి విద్యలు ఉపదేశించటం నేరం (పాపం). సుమతి అనే ఒక బ్రాహ్మణుడు తన విద్యను శూద్రునికి ఇచ్చాడట. శూద్రునికి వైదిక కర్మలు ఉపదేశించాడట. ఫలితంగా నరకంలో కల్పకోటి సహస్రముల కాలం శిక్షలు అనుభవించాడట – (స్కంద – సేతు మహాత్మ్యం అధ్యా 10–79). ఇంకొక బ్రాహ్మణుడు ఇలాగే శూద్రులకు విద్యనేర్పి నరకంలో శతకోటి/ కల్పకోటి సంవత్సరాలు శిక్ష అనుభవించి ఆ తర్వాత గాడిదగా, పందిగా, కుక్కగా,

కాకిగా జన్మించి తర్వాత చండాల యోనిలో పుట్టాడట. వైశ్యుడై తర్వాత క్షత్రియుడుగా ఆ తర్వాత బ్రాహ్మణుడుగా పుట్టాడు. (స్కంద -10-70) ఇలాంటి కథలు విన్నాక శూద్రులకు విద్యనేర్పటానికి ఎవరు ముందుకు వస్తారు?

బ్రాహ్మణుల అధికారం (ఆర్య రాజ్యాలు) స్థిరపడినాక రాజులు ఆర్యమునుల ఆశ్రమాలలో సేవలకు ఏర్పాట్లు చేశారు. స్థానికులైన వారందరినీ రకరకాల పనులకు నిర్దేశించారు. కామధేనువును స్తుతించి ఒక్కొక్క బ్రాహ్మణునికి ఇద్దరిద్దరు మంచి ఆత్మకల నరులను ఇవ్వాల్సిందిగా కోరారు. అప్పుడు ముప్పది ఆరువేల వణిజులు పుట్టుకు వచ్చారు - వారికి విధులు అప్పగించారు. ఆ ఆరువేలమందికీ భార్యలు లేరు. కామధేనువు ఆ ఏర్పాటు మరచింది. అప్పటికి విశ్వావసువు అనే గంధర్వుని ఇంట్లో 60 వేల కన్యలున్నారట. ఎప్పుడో రుద్రుని అనుచరులు నంది, భృంగి అనేవారు వారిని చూశారట. వాళ్ళని బలవంతంగా తీసుకువచ్చి ఈ గోభూజులకు ఇవ్వాలనుకున్నారు. రాయబారాలు జరిగాయి. "దేవతలనూ గంధర్వులనూ వదిలి ఈ నరులకు కన్యలను ఎలా ఇస్తాను" అన్నాడు, విశ్వావసువు. ఈ నరులు గోభూజులు - గోవుకు పుట్టినవారు - బ్రాహ్మణుల సేవల కోసం ఏర్పాటై వచ్చారని చెప్పినా ఆయన వినలేదు. యముడూ, రుద్రుడూ విశ్వావసువు మీదికి యుద్ధానికి వెళితే ఆయన నగరం వదలి వెళ్ళిపోయాడట. ఆ కన్యలను తీసుకువచ్చి గోభూజులతో వివాహాలు జరిపించారు. క్రతువివరాలూ బోలెడున్నాయి.

నరులను సృష్టించిన కామధేనువు వారికి భార్యలను ఎందుకు సృష్టించలేక పోయింది? గంధర్వ కన్యలను బలవంతంగా తేవటం ఏమిటి? ఆ కన్యల మానసిక పరిస్థితి ఏమిటి - స్త్రీలపట్ల అంత క్రూరంగా వ్యవహరించేవారా? కన్యలను బలవంతంగా తేవటమే గాంధర్వ వివాహమా? అనే ప్రశ్నలు అడగ కూడదు. ఇది స్కందపురాణం ధర్మారణ్య ఖండం పూర్వభాగంలో పదో అధ్యాయంలో ఉన్న వివరం.

వేదోక్త విధిలో గోభూజులు - గంధర్వునికి, దేవతలకు, పూర్వజులకు, చంద్ర సూర్యులకు, మృత్యువుకూ ఆజ్య భాగం ఇవ్వటం అలా మొదలయిందట. స్త్రీలను అస్వతంత్రులుగా చూపే ఎన్నో కథలు పురాణాలనిండా ఉన్నాయి. అవన్నీ వ్రత విధానాల కథల్లో కనిపిస్తుంటాయి, వినిపిస్తుంటాయి. ఆధునిక సమాజం వాటిని ప్రశ్నించకపోగా ప్రోత్సహిస్తూ ఉంది.

చతుర్వర్ణ వ్యవస్థను బలంగా ఉంచేందుకు ఈనాడూ సమాజం తపన పడుతోంది. వర్ణాంతర వివాహాలనూ సహించటంలేదు. నిమ్న వర్ణాలు చదువుకోవటాన్నీ సహించటం లేదు. కారంచేడు, చుండూరు, ఖైర్లాంజీ సంఘటనలు ఇందుకు బలమైన ఉదాహరణలు.

"..చాతుర్వర్ణ హితార్థాయ కర్తవ్యం రాజసూనునా" అంటూ రాముని ప్రబోధించిన పురోహిత వర్గం ఇప్పటికీ అదే తీరులో ఉంది. ఈ వర్గం పాలకవర్గంగా రాజ్యధర్మాన్ని శాసించింది. శాతకర్ణులు, శుంగులు, కాణ్వాయనులు, కదంబుల దగ్గర నుంచి పీష్వాల

వరకూ చాలా వంశాల వారంతా బ్రాహ్మణ వంశీయులూ, బ్రాహ్మణాధీనులూను - బ్రాహ్మణ వర్గం అధికార వృత్తులను తన స్వాధీనంలో ఉంచుకున్నది. బ్రాహ్మణ వర్గాలు కొందరు అనంతర కాలంలో మాంసాహారం మానేశామని చెప్పుకున్నారు. మాంసాహారం తినటం పాపంగా చెప్పారు. కాని అసురులకు ఇచ్చే శాపాలలో నరమాంస భక్షణ శిక్షగా నిర్దేశించారు. ఇదొక నాటకీయ పరిణామం.

పూర్వం బ్రాహ్మణులు అన్ని రకాల మాంసాలూ తినేవారు. మాంసం తిననివాడు మంచి హిందువు కాడని ప్రాచీన శాస్త్ర గ్రంధాలు చెబుతున్నాయని స్వామి వివేకానందుడే అంగీకరించాడు. (వివేకానందుని సమగ్ర రచనలు సం. 3 పుట. 536) ఉత్తముడైన హిందువు గోమాంసం తినాలన్నారు. గోమాంసం తిన్న బ్రాహ్మణుడే గోబ్రాహ్మణుడు. వారే ఉత్తమ బ్రాహ్మణులుగా పరిగణింపబడిన రోజులున్నాయన్నారు ఆయన (పుట. 174 అదే పుస్తకం). అందుకే వారిని గోబ్రాహ్మణులుగా చెప్పటం జరిగింది.

గోమాంసం యజ్ఞాలలో పుష్కలంగా దొరికేది. "గో" శబ్దానికి ఆవుతోబాటు వేదం - సూర్యకిరణం - వంటి అర్థాలను తర్వాత చేర్చారు. గోబ్రాహ్మణులంటే వేదం తెలిసినవారు, అని సమర్థించుకున్నారు కాని గోవులను తినేవారు అనేదే అసలు అర్థం.

అనంతర కాలంలో తమను గొప్పగా చెప్పుకోవటం కోసం బ్రాహ్మణ వర్గం గోమాంస భక్షణను వదలిపెట్టింది. అప్పటి మతధార్మిక పరిణామాల దృష్ట్యా జైన, బౌద్ధ మతాలను ఎదుర్కొవటానికే వైదికమతం తన ఆచార వ్యవహారాలలో మార్పులు చేసుకుంటూ వచ్చింది. జైన/బౌద్ధ ధర్మాలను విశ్వసిస్తూ అహింసాపరురాలయిన తాటకకు నరమాంస భక్షణ శిక్షగా విధించటం దారుణం. వర్తమాన కాలంలోనూ వ్యవస్థలో ఇలాంటి జుగుప్సాకరమైన వివిధ రకాల హింసారూపాలు వినిపిస్తున్నాయి, కనిపిస్తున్నాయి. మలం తినిపించటం, మూత్రం తాగించటం వంటివి విన్నప్పుడు మానవత్వం ఎటుపోతున్నదోననే భయం ఆవహిస్తుంది.

వర్ణ వ్యవస్థ వైదిక ఆర్యులతో ముడిపడి ఉండటం ఎవరూ కాదనలేని వాస్తవం. ఆర్యులు ఉండే ప్రాంతాలు ఆర్యావర్త ప్రాంతాలు. అక్కడ వర్ణ వ్యవస్థ ఉంటుంది అని మనుధర్మశాస్త్రం చెప్పింది. ఆర్యులు వేల ఏళ్ళ క్రితం దశలు దశలుగా యూరప్ ప్రాంతాలకు వలస వెళ్ళారనీ ఆ క్రమంలో ఆ తెగనుండే అనేక తెగలు రూపొందాయనీ చరిత్ర చెబుతోంది. క్రీ.పూ. 2300 ప్రాంతంలో కాస్పియన్ సముద్ర ప్రాంతంలో ఉండే ప్రజలలో ఒక భాగం ఇరాన్‌వైపు మరో భాగం సింధునదీ పరీవాహక ప్రాంతాలకూ వెళ్ళారు. పురాణాలు పేర్కొనే కశ్యపుడు కాస్పియన్ సముద్ర ప్రాంతపు జనుల వారసత్వం కలవాడై ఉండవచ్చు. వారికి భారతదేశంలోని స్థానిక జాతులతో జరిగిన ఘర్షణల ఫలితంగా యజమాని - సేవక సంబంధాలూ, ఆర్య - శూద్ర వర్గీకరణలూ సమాజంలో ఏర్పడ్డాయి. అంతకు ముందటి సమాజంలో (అసుర ధర్మంలోనూ, జైన, బౌద్ధ ధర్మాల నాటికీ)

వర్ణాలుండేవి గాని అవి సామాజిక చలనానికి అడ్డుగా ఉండేవి కావు. ఉత్తరాది నుంచి వచ్చే బ్రాహ్మణ కుటుంబాలను దక్షిణాపథంలోని రాజులు ప్రత్యేకంగా ఆదరించటంతో వర్ణధర్మం దక్షిణ దేశంలోనూ పటిష్ఠంగా కుదురుకున్నది. ఆంధ్రదేశాన్ని పాలించిన పల్లవుల కాలంలో ఇలాంటి పరిణామాలు చూడవచ్చు. ముక్కంటి త్రినయన పల్లవుడు క్రీ.శ. 5వ శతాబ్దంలో గంగాతీరం నుంచి వచ్చిన ఏడువందల మంది బ్రాహ్మణులకు ఏడువందల అగ్రహారాలు దానంచేశాడట. ఇవి కర్మ రాష్ట్రం (కమ్మనాడు ఇప్పటి నరసరావుపేట తాలూకా, బాపట్ల, ఒంగోలు, మార్కాపురం తాలూకాలు) లోనివి. అనంతర కాలంలో వీటిలో తేడాలు వస్తే కోట కేతరాజు (12వ శతాబ్దం) వాటిని సరిచేసి మళ్ళీ కొత్త శాసనం రాయించాడు.

సప్త మహర్షుల పేర ఏడు అగ్రహారాలు (గుంటూరు జిల్లా ఇనగల్లు, ఉప్పుటూరు, సంకురాత్రిపాడు మొదలైన గ్రామాలు) ఇచ్చినట్లు వల్లభాభ్యుదయ కావ్యం చెబుతోంది. బ్రాహ్మణులకు ఇచ్చిన ఇలాంటి అగ్రహారాలు ప్రతి జిల్లాలోను ఉన్నాయి. వీటి నుండే వర్ణధర్మం బలపడి ప్రచారమైంది.

హిమాలయాలలో మంచు గడ్డకట్టి - నగరాలూ - ఆలయాలూ మంచులో సంవత్సరాల తరబడి ఉండిపోయి మంచు కరిగిన తర్వాత బయటపడిన ఉదంతాలు చరిత్రలో ఉన్నాయి. భారతదేశంలోని కేదార్‌నాథ్ ఆలయం విషయంలో ఇలా జరిగిందంటున్నారు. దేవభూమిగా పేరొందిన ఉత్తరాఖండ్‌లోని చాలా ప్రాంతాలలో హిమనదాలు కరిగి వరదలురావటం చాలా తరచుగా జరిగేది. అలాంటి సమయాలలో అక్కడి ప్రజలు కచ్చితంగా దక్షిణానికే తమ వలసలు సాగిచేవారు. వారిని రాజులు ఆదరించేవారు. ఆ విధంగా వర్ణధర్మం ఎప్పటికప్పుడు దక్షిణ ప్రాంతాలలో విస్తరిస్తూ వచ్చింది.

సమకాలీన రాజకీయ, సామాజిక వ్యవస్థపై అసంతృప్తి ప్రకటించి, తిరుగుబాటు చేసి, తమదైన సంస్కృతినీ మతరీతులనూ కాపాడుకొనటానికి రాజ్యంతో తలపడిన వారు పురాణాలలోనే కాదు, చరిత్రలోనూ ఉన్నారు. ఇలాంటి ప్రతిఘటనలు గిరిజనులలో ఆదివాసీలలో ఎక్కువగా కనిపిస్తున్నాయి. వరంగల్ జిల్లా తాడువాయి అభయారణ్యంలో రెండేళ్ళ కొకసారి జరిగే మేడారం జాతరను ఇందుకొక ఉదాహరణగా చెప్పుకోవచ్చు. ఆత్మాభిమానంతో రాజ్యాన్ని ప్రతిఘటించిన సమ్మక్క, సారలమ్మ, జంపన్న, గోవిందరాజుల నేతృత్వమూ ఆదివాసీల చైతన్యమూ ఇప్పటికీ కోయ, గోండు, భిల్లు, సవర, లంబాడీ, నాయక్, ఎరుకల జాతులవారూ చెంచు, యానాది తదితర ఆదివాసీ తెగల ప్రజలూ తలచుకుంటూనే ఉన్నారు. కొమరం భీం, చాకలి ఐలమ్మ వంటివారూ సామాజిక అణచి వేతను ప్రతిఘటించారు. అణచివేతలను ఎదుర్కొన్న ఆర్యేతర/ద్విజేతర వర్ణాలు ఎంతటి ప్రతిఘటనశీలత చూపినా చరిత్రలో వాస్తవాలు నమోదు కాలేదు. పురాణాలు చెప్పే అతిశయోక్తులతో వాస్తవాలు మరుగునపడ్డాయి.

# శూర్పనఖ

శూర్పనఖ వృత్తాంతం రామాయణం అరణ్యకాండలో 17వ సర్గలో ఉంది. శూర్పనఖ తల్లి కైకసి. తండ్రి విశ్రవసుడు. భర్త విద్యుజ్జిహ్వుడు. కొడుకు జంబుమాలి.

రామలక్ష్మణుల చేత క్రూరంగా అవమానింపబడిన స్త్రీలలో శూర్పనఖ పేరు ప్రసిద్ధం. ఆమె మూర్తిమతాన్ని రామాయణం వక్రీకరించింది. శూర్పనఖ రాక్షస రాజయిన రావణుని సోదరి. జనస్థాన పాలకులయిన ఖర దూషణులు ఆమెకు పినతల్లి కొడుకులు. ఒకానొక యుద్ధంలో శూర్పనఖ భర్త విద్యుజ్జిహ్వుడు మరణించాడట. చీకట్లో అతనిని శత్రువు అనుకుని పొరపాటుపడి అతని మనుషులే అతనిని చంపేశారనీ అంటారు. భర్త మరణించిన శూర్పనఖను రావణుడు దండకలో ఉండవలసిందిగా కోరి పంపించాడు.

ఆమె దండకకు ఏలిక వంటిదే. అరణ్యవాసం కోసం సీతారామలక్ష్మణులు పంచవటిలో ఉన్న కాలంలో యాదృచ్ఛికంగా శూర్పనఖ అక్కడకు వచ్చింది. శూర్పనఖ కామరూపిణి గనక అందమైన రూపంతో రాముని సమీపించిందని కంబ రామాయణం చెబుతోంది. ఇది ఆమెకు దురుద్దేశాన్ని అంటగట్టే ప్రయత్నం. వాల్మీకి రామాయణంలో ఆ విషయం లేదు. ఆమె తన సహజ రూపంతోనే రాముని సమీపించినట్లు చెప్పారు.

తాపస రూపంలో ఆయుధాలు పట్టుకుని తిరుగుతూ ఉన్న రామలక్ష్మణులను చూసి ఆమె అనుమానపడింది. "మీరెవరు? ఎందుకు వచ్చార"ని అడిగింది. దండక రాక్షసుల రాజ్యం. పరాయివారు తమ రాజ్యంలో ప్రవేశించినప్పుడు బాధ్యతగల పౌరులు వారిని ప్రశ్నించటం సహజం. శూర్పనఖ అలాగే రాముని ప్రశ్నించింది. అందులోనూ ఆమె ఆ రాజ్యపు పాలకుల సోదరి. బాధ్యతగల వ్యక్తి.

"జటీ తాపస రూపేణ సభార్యశ్శర చాప ధృత్,
ఆగతస్త్వ మిమందేశం కథం రాక్షస సేవితమ్
కిమాగమన కృత్యం తే తత్త్వ మాఖ్యాతు మర్హసి" (17-13)

("ఇది రాక్షసుల దేశం. తపస్వుల రూపంతో ఆయుధాలు ధరించి భార్యతో కూడా ఇక్కడికి ఎందుకు వచ్చావు? సమాధానం చెప్పు" అని నిలదీసింది). ఇలా అడగడం శూర్పనఖ నేరంగా రామాయణం ధ్వనించింది.

"ధర్మ పరిపాలనార్థం ఇలా వచ్చాను. ఈమె నా భార్య సీత" అని చెప్పాడు రాముడు.

"ధర్మార్థం ధర్మకాంక్షీ చ వనం వస్తు మిహాగతః"...అంటూ

'ధర్మ' పద ప్రయోగాలు మరీ ఎక్కువగానే చేశాడు. అలా చెప్పి ఊరుకోకుండా "నీవెవరవు? మనోజ్ఞంగా లేవు కాబట్టి రాక్షసివి అనిపిస్తోంది" అనీ అన్నాడు.

"నహి తావన్మనో జ్ఞాంగీ రాక్షసీ ప్రతిభాసిమే... ఇహ వాకిన్నిమిత్తం త్వమాగతా బ్రూహి తత్త్వతః"

"నీవెందుకు ఇక్కడికి వచ్చావు" అనీ అడిగాడు. రాక్షసులపట్ల అప్పటికే రామునికి శత్రుభావం ఏర్పడి ఉంది. రాక్షస స్త్రీలంటే చులకన భావమూ ఉంది. శూర్పనఖ ఎంత మర్యాదగా అడిగిందో గమనించి కూడా రాముడు ఆమెకు అంత మర్యాదగానూ సమాధానం ఇవ్వలేదు. పరాయి దేశం నుంచి వచ్చినవాడు అక్కడి వారిని స్థానికులను "మీరెందుకు ఇక్కడ ఉన్నారు" అని అడగటం అసంగతమే. కాని రామాయణ కవులు రాముడిని సర్వాధికారిగా చూస్తున్నారు కాబట్టి అలా అడిగించారు. ఇక్కడ రాముడి అందాన్ని నాలుగు శ్లోకాలలోనూ శూర్పనఖ అనాకారితనాన్ని మూడు శ్లోకాలలోనూ వర్ణించారు. చొరవ చూపిందీ, కూతూహలపడిందీ రాముడే. ఎంతటి అందవికారినైనా మొహంమీదే "నీవు అందంగా లేవు" అని ఎవరూ అనరు. అలా అనటం అమర్యాద. అయినా రాముడు అలా అడిగాడు. అయినా అతడిని మర్యాదా రాముడన్నారు. నిజానికి రాక్షస స్త్రీలు చాలా అందగత్తెలు అని రామాయణం చాలాచోట్ల చెప్పింది.

శూర్పనఖ అందగత్తె. అమాయకురాలు. తన అందం గురించిన వ్యంగ్యాన్ని, ఆమె హాస్యంగా భావించిందేమో. రాముని మాట పట్టించుకోలేదు. తన గురించి చెప్పుకుంటూపోయింది.

"–అవును నేను రాక్షసిని. కామరూపిణిని. నా పేరు శూర్పనఖ. రాక్షసేశ్వరుడు రావణుడు నా అన్న. అతడు వీరుడయిన విశ్రవసుని కొడుకు. వారి గురించి నీవు వినే ఉంటావు." అంటూ గొప్పగా వివరాలన్నీ చెప్పుకుంటూ పోయింది.

"అహం శూర్పనఖా నామ రాక్షసీ కామరూపిణీ......అని చెప్పింది. (17-22)

ప్రభావ సంపన్నా...స్వచ్ఛంద బలగామినీ..." అనీ చెప్పుకుంది. (17-26)

రాముని చూసి ఆమె మోహించిందనీ అతనిని తనతో ఉండి పొమ్మని అడిగిందనీ రామాయణ కవులు రాశారు. ఇక్కడ నిజానిజాలు ఎలా ఉన్నా రాముని అంతరంగంలో రాజకీయ ప్రయోజనాలున్నాయి. అప్పటికే రాక్షసులను చంప వలసిందిగా రాముడిని మునులు కోరి ఉన్నారు. వారి కోరిక నెరవేర్చే ఉద్దేశంతోనే ఆయన ఉన్నాడు. ఏదో విధంగా రాక్షసులను కవ్వించాలని చూస్తున్న రామునికి శూర్పనఖ అమాయకత్వం అవకాశం ఇచ్చింది. ఆమెను ఆకర్షించే విధంగా వ్యవహరించి, మాటలు కలిపాడు. "నాతో ఉండిపో" అని శూర్పనఖ అడిగేవరకూ వ్యవహారం నడిపి ఉంటాడా? రాముని గొప్పతనానికి మచ్చరాకుండా రామాయణ కవులు కొన్ని వాస్తవాలు దాచిపెట్టి ఉంటారా? అనేది ఆలోచించవలసినదే.

గిరిజన/ఆదివాసీ స్త్రీలను ఆకర్షించటంలోనూ వంచించటంలోనూ నాగరకులు - మైదాన ప్రాంతాల పురుషులూ ప్రవర్తించే తీరు, చూపే చొరవ, జగద్విదితమే. ఆ కోణంలో ఆలోచిస్తే శూర్పనఖ ఆర్య పురుషుల వంచనకు లోనయిందా అనిపిస్తుంది. ఆ కోణంలో ఈ ఘట్టాన్ని అర్థం చేసుకోగలిగితే స్థానిక స్త్రీలపట్ల ఆర్య పురుషుల చులకన భావం, ప్రవర్తనా రీతి స్పష్టంగా కనబడుతాయి.

రాముడు కూడా తనంటే ఇష్టపడుతున్నట్టు శూర్పనఖ అనుకున్నది. రాముడు ఆ విధంగా చతురంగా మాట్లాడాడు. చొరవగా వ్యవహరించీ ఉండవచ్చును. శత్రు సంహారం లక్ష్యంగానే అగ్నిలోపడే మిడతల్లాగా వారిని చంపటానికే రాముడు పంచవటిలో ప్రవేశించాడని రామాయణం (అరణ్య 15-35) స్పష్టంగానే చెప్పింది. ఆ ప్రయత్నంలో శూర్పనఖనూ మిడతలాగానే రాముడు ఆకర్షించే ప్రయత్నం చేశాడు.

శూర్పనఖ 'కామమోహిత' అని పదే పదే రామాయణ కవులు చెప్పారు. ఆర్య పురుషుల అందానికి, ఆర్యేతర స్త్రీలు 'దాసోహం' అంటారనే అహంకారంతోనే అలా రాశారు. రాముడు కూడా ఆ అహంకారంతోనే ఆమెతో పరిహాసమాడాడు. రాముడు ఆర్య క్షత్రియుడు. వారిలో బహుభార్యాత్వం ఉంది. రాముడి తండ్రికి ముగ్గురు పట్టపు రాణులూ అనేకమంది భోగకాంతలూ ఉన్నారు. మరో వివాహం లేదా భార్య కాకుండా మరో స్త్రీతో ఉండడం ఆర్య పురుషులకు అలవాటే. శూర్పనఖ భర్త మరణించాడు. మరో వివాహం చేసుకోవటం వారిలో నిషిద్ధం కాదు. స్థానిక జాతుల సంప్రదాయాల ప్రకారం స్త్రీ తనకు నచ్చిన పురుషుని ఎంచుకోవచ్చును. 'నీవు నాతో ఉండిపో' అని శూర్పనఖ రాముడిని కోరిందనేది ప్రసిద్ధంగా ఉన్న కథ. రాముడు ఆమెను తిరస్కరించలేదు. భార్య దగ్గరే ఉన్న కారణంగా తాను ఆమెను అంగీకరించలేకపోతున్నట్టు మాట్లాడాడు.

"నాకు భార్య దగ్గరే ఉంది. ఆమెకు సవతిగా నీవు రావటం బాగుండదు. నా తమ్ముడు శీలవంతుడు, అందమైనవాడు. అతడు నీకు తగినవాడు, అతన్ని చేసుకుంటే సవతిపోరు లేకుండా ఉంటావు" అంటూ ఆమెను లక్ష్మణుని దగ్గరకు పంపాడు.

గుణవంతుడైన పురుషుడయితే తనకు ఇష్టం లేనప్పుడు (తనను కోరి వచ్చిన స్త్రీని) మొదటే నిరాకరిస్తాడు. "నీవంటే నాకు ఇష్టంలేదు" అనో మరీ అంత కటువుగా కాకపోతే మరో కారణం ఏదో చెప్పి తప్పించుకుంటాడు. "నేను ఏకపత్నీవ్రతుడిని" అని రాముడు చెప్పి ఉండవచ్చు. కాని అలానూ చెప్పలేదు. ఆమెతో పరాచికాలు మొదలు పెట్టాడు. రాముడు అసత్యం చెప్పడని ఇక్కడ రెండు శ్లోకాలు రాశారు.

"...అకృత దారశ్చ...అ పూర్వీ భార్యయాచార్థీ..."

అంటూ (18-4) లక్ష్మణుడు భార్యలేని వాడనీ భార్య కావాలనుకుంటున్నవాడనీ రాముడు శూర్పనఖకు చెప్పిపెట్టాడు. ఈ స్వభావం రామునికి తగినదేనా? రామాయణంలోని ఈ మాటలవల్ల చాలామంది పండితులకు లక్ష్మణునికి పెళ్ళి అయిందా లేదా అని సందేహం కూడా వచ్చిందట. ఎందుకంటే రాముడు అసత్యం చెప్పడు కదా. బాలకాండలో లక్ష్మణునికి జనకుని కూతురు ఊర్మిళతో పెళ్ళి జరిగినట్లు ఉంది, కాని ఆ తర్వాత ఎక్కడా ఆమె ప్రసక్తి కనబడదు. ఊర్మిళాదేవి నిద్ర వంటివన్నీ జానపదుల పాటలు. లక్ష్మణుడు భార్య లేనివాడిగానే వ్యవహరించాడు. రాముడూ అలానే చెప్పాడు. శూర్పనఖ కపటం తెలియని మనిషి. రాముడు చెప్పినట్టు విని లక్ష్మణుని దగ్గరకు వెళ్ళింది. లక్ష్మణుడు అన్నకు తగ్గ

తమ్ముడు. శూర్పనఖ అందాన్ని పొగిడాడు. "నీవు అందమూ దర్పమూ ఉన్నదానివి. రామునికే భార్యగా ఉండటానికి తగినదానివి. నేను రాముని దాసుడిని. దాసునికి భార్యగా ఉండటం నీలాంటిదానికి తగదు" అన్నాడు. "సీత అందంగా లేదు. వేలాడే పొట్టతో వికారంగా ఉంది. వృద్ధురాలు కూడాను. రాముడు నిన్నే కోరుకుంటాడు" అని కూడా చెప్పాడు. సీత లేకపోతే రాముడు తననే కోరుకుంటాడన్న నమ్మకం శూర్పనఖకు కలిగించాడు. లక్ష్మణుని పరిహాసాన్ని వృద్ధురాలూ, వికారీ, వేలాడే పొట్టగలదీ అయిన శూర్పనఖ అర్థంచేసుకోలేక పోయిందని రామాయణ కవులు రాశారు. (18-13) సీత దగ్గర లేకపోతే అన్నదమ్ములిద్దరూ శూర్పనఖతో ఎలా ప్రవర్తించి ఉండేవారో? శూర్పనఖ "కామమోహిత" అందుకే వారి మాటలు నమ్మిందట. సీత ఈ పరిహాసాన్ని చూస్తూనే ఉంది. అయినా వారిని వారించినట్టు లేదు. అన్నదమ్ములిద్దరూ వేళాకోళంగా చూస్తూంటే శూర్పనఖ దృష్టి సీత మీదికి వెళ్ళింది. "ఈ సీత వల్లనే కదా నన్ను కాదంటున్నావు సీతనూ నీ తమ్ముడినీ తినేస్తాను. నీవు నాతో ఉండిపో" అని రాముడిని అడిగిందట. ఆమె సీతను మింగబోయిందనే రాశారు.

అప్పుడు రాముడు "లక్ష్మణా, క్రూరులైన అనార్యులతో పరిహాసాలేమిటి? ఈ రాక్షసికి విరూపం కల్పించు" అన్నాడు.

"క్రూరై రనార్యై సౌమిత్రే పరిహాసం కథంచన
రాక్షసీం...విరూపయితు మర్హసి..." (18-19, 20)

వెంటనే లక్ష్మణుడు కత్తిదూసి ఆమె ముక్కు చెవులు కోశాడు. హఠాత్తుగా జరిగిన ఈ దాడి నుంచి శూర్పనఖ తప్పించుకోలేకపోయింది. రక్తం ఓడుతున్న గాయాలతో పరుగెత్తి పోయింది.

ప్రభావ బల సంపన్నురాలూ, ఆకాశగామిని, అయి ఉండి కూడా ఆమె రామ లక్ష్మణుల చేతిలో హింసకు గురి అయింది. పరిహాసాలు మొదలుపెట్టిన వారు ఆర్య పురుషులు. పరిహాసాల పాలయినవారు అనార్య స్త్రీలు. (ఈనాటికీ పాలకవర్గాల ప్రతినిధులు గిరిజన ఆదివాసీ మహిళలపట్ల ఎలా ప్రవర్తిస్తున్నారో అర్థం చేసుకోవటానికి వాకపల్లి లాంటి సంఘటనలు చాలా కనబడతాయి.) ఆర్య రాజుల లక్ష్యం జనస్థానం. శూర్పనఖను అవమానించటం కవ్వింపు చర్య. ఈ ధోరణి ఇప్పటికీ కొనసాగుతోంది.

"శూర్పనఖ" అంటే చేటల వంటి గోళ్ళు కలది అని అర్థం చెబుతుంటారు. అంతంత గోళ్ళతోనూ ఆమె ఆత్మరక్షణ చేసుకోలేక పోయిందీ అంటే ఆమె గోళ్ళు చేటల లాగా లేవనో లక్ష్మణుని వేగం ముందు ఆమె అశక్తురాలు అయిందనో అనుకోవాలి. గోళ్ళతో ఆత్మరక్షణ చేసుకోవాలనే సూచన ఇందులో ఇమిడి ఉన్నదా అనీ ఆలోచించాలి.

రాముడూ లక్ష్మణుడూ "వాక్యకోవిదులు" అంటున్నది రామాయణం. వాక్చాతుర్యంతో అమాయక స్త్రీలను లొంగదీసుకునే పురుష ప్రవృత్తి ఇక్కడ స్పష్టంగా కనిపిస్తుంది. విరూప,

కరాళ, నిర్ణతోదరి అంటూ శూర్పనఖను వర్ణించటానికి వాడిన విశేషణాలే సీతకూ వాడారు. అన్నదమ్ములు. ఈ వ్యవహారమంతా ఒక నాటకం చూపినట్లు చూపాడు వాల్మీకి. స్త్రీలపట్ల ఇలాంటి ధోరణి పురుషలోకాన్ని ఆకట్టుకునేది కావచ్చు. ఇలాంటి ఘట్టాలు అప్పటికి చాలా జరిగి ఉన్నాయేమో కూడా. సవతుల ప్రసక్తి ఇప్పటికీ జనాన్ని బాగా ఆకట్టుకునే అంశం. సవతుల కొట్లాట గొప్ప వినోదాంశం. సార్వకాలికం కూడానూ. రామాయణాన్ని జనంలో ప్రచారం చెయ్యటానికి ఇలాంటి దృశ్యాలు చొప్పించి ఉంటారు. ఇవి లోకవృత్తానికి దగ్గరగా ఉన్న చిత్రీకరణలు.

హఠాత్తుగా మీదకు వచ్చి ముక్కు చెవులు కోయటాన్ని శూర్పనఖ ఊహించలేదు. ఆమె దిగ్భ్రాంతికి లోనయింది. ఆ పురుషులిద్దరూ అందంగా ఉన్నారు. మంచివాళ్ళలాగానే కనిపించారు - నవ్వుతూ మాట్లాడారు - వారిలో ఇంత కాఠిన్యం, క్రూర ప్రవృత్తి ఉన్నాయని ఆ (గిరిజన) యువతి పసిగట్టలేకపోయింది. తనంటే ఇద్దరికీ ఇష్టమే అనుకున్నది.

"శూర్పనఖ" అనేది సంస్కృత భాషాపదం. ఆ యువతి పేరు వేరే ఏదో ఉండి ఉంటుంది. కక్షకొద్దీ ఆమెను శూర్పనఖగా పిలిచారు. శూర్పము అంటే చేట. గిరిజన వర్గాలలో చాలామంది చేటను జాతి చిహ్నంగా కొలుస్తారు. చేటను లక్ష్మీస్థానంగా పవిత్రంగా భావిస్తారు. పంటలకు చిహ్నంగా పూజిస్తారు. చేటకు ఎప్పటికప్పుడు పసుపు రాసి, కుంకుమబొట్టు పెట్టి అలంకరిస్తూనూ ఉంటారు. ముత్తైదు చిహ్నంగానూ భావిస్తారు. ఈ విధంగా, శూర్పనఖ పవిత్రతకు ప్రతీక. 'శూర్పము' అనేది గంధర్వులకు ప్రతీక. ఈ కోణంలోనూ దీనిని చూడాలి. రాక్షసులుగా ఆర్య వాఙ్మయం పేర్కొన్న వారందరూ మౌలికంగా గంధర్వులూ యక్షులూను.

శూర్పనఖకు కలిగిన అవమానాన్ని గిరిజన తండాలకు జరిగిన అవమానంగానే అర్థంచేసుకోవాలి. ఈ చర్య గిరిజనుల పవిత్ర స్థానాలను, చిహ్నాలను అవమానించటానికి సంకేతం. ఈ విధంగా రాక్షస స్త్రీలను అవమానించి రాక్షసులను యుద్ధానికి ప్రేరేపించటం వారి స్థావరాలు వశపరచుకోవటం ఆర్యుల ఆలోచన.

గాయాలతో రక్తధారలతో వచ్చిన శూర్పనఖకు చూసి ఖరుడు కలవరపడ్డాడు. (అరణ్య. 19 సర్గ) "నీ స్థితికి ఎవరు కారణం. కృష్ణసర్పాన్ని కదిలించిన వాడెవడు? కాలపాశం కంఠానికి చుట్టుకున్న వాడెవడు. నీకు హాని కలిగించి నాకు అప్రియం చేసిన వాడెవడున్నాడు ఇక్కడ" అంటూ గర్జించాడు (మొత్తం 18 శ్లోకాలు).

ఏదైనా అపరాధానికి శిక్షగా ముక్కు చెవులు కోయటం అనేది ఆదిమ సమాజాలలో ఉండేది. ఎవరికైనా సౌందర్యాన్నిచ్చేది కనుముక్కు తీరు. ముక్కు ముఖానికి అందం. అలాంటి ముక్కుకోసి శిక్షించటం మధ్యయుగాలలో కనిపిస్తుంది. స్త్రీలు వ్యభిచారం చేస్తే ముక్కు కోసేవారు. ఈజిప్టులోనూ ఇలాంటి శిక్షలుండేవి. పురుషులకు వ్యభిచారం నేరం కాదు. వారికి ఎటువంటి శిక్షా పడేది కాదు. స్త్రీలకే ఈ శిక్షలు. అస్సీరియాలో ముక్కుతో

పాటు చెవులు కూడా కోసేవారట. ఈ విషయంలో రామాయణం కొంచెం ముందుకు వెళ్ళి "అయోముఖి" అనే ఆమెకు స్తనాలు కూడా కోయించింది.

అయోముఖి గురించి రామాయణం అరణ్యకాండ 69వ సర్గలో ఉంది. సీతను రావణుడు ఎత్తుకుపోయాక రామలక్ష్మణులు సీతను వెదకుతూ తిరుగుతున్నప్పుడు మతంగా శ్రమ సమీపంలో ఒక గుహను చూశారట. అక్కడ 'అయోముఖి' అనే స్త్రీ వారికి కన్పించింది. ఆమె లక్ష్మణుని మోహించింది. "నీవు నాకు నచ్చావు; నాతో ఉండిపో. ఈ వనంలో మనం హాయిగా విహరించవచ్చు" అని లక్ష్మణుని అడిగింది.

"అహం త్వయోముఖి నామ..." (69-15). అంటూ గౌరవంగానే తనను తాను పరిచయం చేసుకున్నది. ఆమె కోరిక వినగానే లక్ష్మణుడు సమాధానం చెప్పకుండా కత్తితీసి ఆమె ముక్కు చెవులు స్తనాలు కోశాడు. ఎంత పాశవిక చర్య.

"...కర్ణ నాసౌ స్తనౌ చాస్యానిచ కర్తారి సూదన..." (69-17)

అయోముఖి బాధతో అరుస్తూ పరుగెత్తిపోయింది. అనార్య స్త్రీల ముక్కు, చెవులు, స్తనాలు కోయటం, ముఖం వికృతపరచటం - రామలక్ష్మణుల ఆర్యమతాన్ని కళంకపరచే చర్యలే. అయినా రామాయణ కవులు ఆ చర్యలను దాచిపెట్టకుండా వర్ణించారంటే అవి చాలా సాధారణంగా - తరచుగా - జరుగుతుండే సంఘటనలు అయి ఉండాలి. తమను చూడగానే స్త్రీలు మోహించి వెంటపడతారనే భ్రమలో ఉండే పురుషుల మనస్తత్వాలను వాల్మీకి ఇలా చెప్పాడా? అత్యాచారాలను సూచించాడా?

ఇలాంటి ధాష్టీకాల వెనక ఉన్న అత్యాచారాల స్వరూప, స్వభావాలు ఎలాంటివి? స్త్రీలను నియంత్రించటానికే ఇలాంటివి ప్రవేశపెట్టారా? తమను నిరాకరించినందుకు శిక్షించారా? తమ చర్యలను సమర్ధించుకోవటానికే ముక్కు, చెవులు కోయటం వంటి హానిని శిక్షలుగా ప్రచారం చేశారా? ఆర్య పురుషుల చేత ఇవి చేయించటం ఉద్దేశపూర్వకమే.

గిరిజన/ఆదివాసీ మహిళల మీద జరిగే అత్యాచారాలు పోలీసులు చేసినా ఇతరులు చేసినా అవి నమోదు కావు. పైగా గిరిజన స్త్రీల అనుమతి/ఆహ్వానంతోనే తాము అత్యాచారాలు చేసినట్టు చెప్పే కథలు ఈ యుగంలో ఇరవై ఒకటో శతాబ్దంలోనూ వినిపిస్తున్నాయి.

స్థానిక గిరిజన ఆదివాసీ స్త్రీలపట్ల ఆర్య సమాజానికి ఏమాత్రం గౌరవం ఉండేది కాదు. వారిని చులకనగా చూసేవారు. ఇప్పటికీ అదే పరిస్థితి.

రావణుడు సీతను ఎత్తుకుపోయాడని జటాయువు ద్వారా తెలుసుకొన్న రామ లక్ష్మణులు రావణుని నగరంవైపు పోకుండా దండకలోనే ఎందుకు తిరిగారో? అయోముఖి వంటి అనార్య స్త్రీలను ఎందరిని ఎందుకు వికృతపరచారో ఊహించటం కష్టంకాదు.

మునుల యజ్ఞాలు ఆటంకపరచినందుకూ స్వతంత్ర రాజ్యంగా నిలబడినందుకూ తాటకను చంపారు. చంపే ముందు ముక్కు చెవులు కోశారు. మాతృస్వామ్యాన్నీ స్త్రీ

స్వేచ్ఛనూ వ్యతిరేకిస్తూ జరిపిన దాడి అది. తాటకకు పడిన శిక్ష విన్నాక మరే స్త్రీ కూడా నాయకత్వం జోలికి రాదనే నమ్మకంతోనే ఆర్యరాజులు ఆ పనిచేశారు. శూర్పనఖ, అయోముఖిల విషయంలో వారి వ్యక్తిగత స్వేచ్ఛ అరికట్టటానికీ, సమాజంలో పదిమంది ముందూ తిరగలేని స్థితి కల్పించటానికీ వారిని వికృత పరచారు. వర్ణధర్మాన్ని అతిక్రమించి వేరే జాతి స్త్రీలను వివాహం చేసుకోలేక వారు తిరస్కరించారా? ఆ స్త్రీలను బలాత్కరించి వివాహేతర సంబంధానికి వారు అంగీకరించనందు వల్ల హింసకు లోను చేశారా? స్త్రీ స్వయంగా భర్తను ఎంచుకోరాదనీ కుటుంబ పెద్దల నియంత్రణలోనే ఉండాలనీ శాసిస్తూ శిక్షించారా? అనే ఎన్నో ప్రశ్నలకు రాముని చర్యలు అవకాశమిస్తున్నాయి.

ఇక్కడ గమనించదగిన మరో ముఖ్యమైన విషయం ఏమిటంటే ముఖాన్ని వికృత పరచటం అనేది బౌద్ధ జైనాల విషయంలోనూ జరగటం. జైన, బౌద్ధ ధర్మాలకు సంబంధించిన అందమైన విగ్రహాలపై దాడిచేసి వాటి ముక్కులు విరగ్గొట్టిన సందర్భాలూ, విగ్రహాలను నాశనంచేసి కూలగొట్టిన ఉదంతాలూ చరిత్రలో కనిపిస్తాయి.

శ్రమణులను శిక్షించటం గురించి రామాయణం ప్రస్తావించింది. మాంధాత కాలంలో తప్పు చేసిన శ్రమణులు దండింపబడినట్లు రాముడు 'వాలి'తో చెప్పాడు. శ్రమణులు అంటే జైన/బౌద్ధ సన్యాసులు. వారిపై ఆర్య పాలకవర్గం కక్ష వహించింది. తమ మునులకు ప్రత్యేక ప్రతిపత్తి కల్పించిన ఆర్య పాలకులు ఇతర మతాల వారిని అంత గౌరవంతోనూ చూడకపోగా వారిని ఏదో ఒక నెపంతో దండించారు. మతద్వేషాలూ, శిక్షలూ మాంధాతల నాటి నుంచీ ఉన్నాయి.

కాకాసురుని గురించి చెబుతూ "అంత్య జాతులు, విష్ణుద్వేషులు" అన్నది రామాయణం. అసురులు అంత్యజాతులా? ఎవరెవరు ఆ కోవలోకి వస్తారు? అనేదీ పరిశీలించవలసిందే.

రామాయణ కాలం నాటికి అంత్యజాతులు విష్ణుద్వేషులుగా ఉన్నారంటే అందుకు కారణాలు ఏమై ఉండవచ్చు. సామాజిక అసమానతలేనా? దండకలోని వారు విష్ణు ద్వేషులై ఉంటారా? అనేదీ తెలుసుకోదగినదే.

వ్యక్తి స్వేచ్ఛనూ – మతస్వేచ్ఛనూ, నియంత్రించే పాశవికమైన క్రూరమైన ధోరణికి పై కథలు అద్దంపడుతున్నాయి.

21వ శతాబ్దంలోనూ భారతదేశపు ఆదివాసీ/గిరిజన అక్కచెల్లెళ్ళ కథలలో వెతలలో మార్పురాలేదు. శూర్పనఖను చుప్పనాతి అనీ ఒకరి బాగు చూసి ఓర్వలేనిదనీ ప్రచారం చేశారు. సీతారాముల అన్యోన్యతను సహించలేక, రావణునితో చెప్పి సీతను ఎత్తుకుపోయే పన్నాగం చేసిందనీ చెప్తుంటారు. ఇవన్నీ ఆర్య రాజుల దురాగతాలను కప్పిపుచ్చటానికి చేసినవే. ఆర్య పురుషుల కాముకదృష్టి గురించి చెప్పుకోవటానికి రామాయణంలోనే బోలెడు ఆధారాలు కనిపిస్తాయి. మాయలేడిని వెంటాడుతూ రాముడు వెళ్ళినప్పుడు లక్ష్మణుడు

సీతకు కాపలాగా ఉన్నాడు. 'హా సీతా! హా లక్ష్మణా' అంటూ మారీచుడు రాముని గొంతును అనుకరిస్తూ చేసిన ఆర్తారావం విని సీత లక్ష్మణుడిని అటువెళ్ళి చూడమంటుంది. "అదంతా రాక్షసుల మాయ" అంటూ లక్ష్మణుడు కొట్టిపారేశాడు. తన అన్నగారిని ఎవరూ ఏమీ చేయలేరు - అంటాడు. అప్పుడు సీత లక్ష్మణుడిని అనుమానిస్తుంది. "నా మీద కోరికతో ఉన్నావేమో నీ కోరిక నెరవేరదు" అనీ "నీవు అన్నగారి మరణాన్ని కోరుకుంటున్నావేమో" అనీ రకరకాలుగా నిందిస్తుంది. అన్న చనిపోతే అన్న భార్యను తమ్ముడు వివాహమాడే ఆచారం కొన్ని కులాలలో ఉంది. "మైలీ చాదర్" పేరిట వదినా, మరుదుల సంబంధాన్ని సంప్రదాయంగా కచ్చితంగా అమలుపరచటం ఇప్పటికీ ఉత్తర దేశంలోని చాలా ప్రాంతాలలో కొన్ని కుటుంబాలలో కనిపిస్తుంది. (అది స్థానిక జాతుల ఆచారం అనీ కిందికులాలకే వర్తిస్తుందనీ అనుకోవటానికి ఆధారాలు లేవు. శిష్ట సమాజంలోనూ ఆ రకపు వివాహాలు ఉండేవి) అయోధ్య రాజ్యంలోనూ అలాంటి ఆచారం రామాయణ కాలంనాటికి ఉండేదేమో. రామునికి ఇతర స్త్రీలతో సంబంధాలున్నాయేమోనని సీత అప్పుడప్పుడు అనుమానిస్తుండేది. ఇలాంటి అంతర్గత సూచ్యార్థాలవల్ల శూర్పనఖ విషయంలో రామలక్ష్మణుల శీలం అనుమానించ దగినదేను.

శూర్పనఖ గొప్ప రాజనీతిజ్ఞురాలు. రాజ్యపాలన విషయంలో సోదరులకు సలహాలు ఇచ్చేది. రాజ్యంలోకి కొత్తవారు ప్రవేశించిన విషయం రాజుకు వెంటనే తెలియాలనీ అలా తెలియకపోవటం రాజధర్మ నిర్వహణ లోపం అనీ ఆమె ఖర దూషణులను, రావణునీ కూడా మందలించింది. రామలక్ష్మణులను రాక్షస రాజ్యంలో మొదట గమనించినదీ ప్రశ్నించినదీ శూర్పనఖ. ఆర్య వాఙ్మయపు పాక్షిక ధోరణివల్ల ఆమె పాత్ర వక్రీకరణకు గురి అయింది. రావణునితో ఆమె సంభాషించిన తీరులోనూ ఆమె వైదుష్యం, సమయజ్ఞత ప్రతిఫలిస్తున్నాయి. మిత్రులపట్ల ఎంత ప్రసన్నగా ఉంటుందో శత్రువులపట్ల అంత కఠినంగా ఉండగల గంభీరమూర్తిగా ఆమె కనబడుతుంది. అయితే ఆ పాత్రను వ్యతిరేక దృష్టితో ప్రచారం చేశారు.

ఖరదూషణులు మరణించాక శూర్పనఖ రావణుని దగ్గరకు వెళ్ళి సీత గురించి చెప్పిందనీ ఆమెను ఎత్తుకు రమ్మని ప్రోత్సహించిందనీ పౌరాణికులు చెబుతుంటారు. కానీ వాల్మీకి రామాయణం ప్రకారం 'అకంపనుడు' రావణునికి ఖర దూషణుల మరణం గురించి చెప్పాడు. సీతను అపహరించి తేవాలన్న ఆలోచన కూడా అకంపనునిదే.

శూర్పనఖను 'మధుర లంబాడా'లు తమ మూలదేవతగా ఇప్పటికీ ఆరాధిస్తున్నారట. ఆదిలాబాద్‌లో లంబాడాల తీజ్ సంబరాలు 15 రోజులపాటు జరుగుతాయి. ఆ ఉత్సవాలలో మధుర లంబాడా తెగ యువతులు 'శూర్పనఖ'ను కొలుస్తారని తెలుస్తున్నది. వీరు ఉత్తరప్రదేశ్ నుంచి వచ్చి ఇక్కడ ఆదిలాబాద్‌లో స్థిరపడ్డ తెగ.

రాక్షస స్త్రీల మనోభావాలనూ ప్రవర్తనా రీతులనూ, పురాణ కవులు పక్షపాత దృష్టితో చూశారు. వారిని అమానవీయంగా చిత్రించారు. "నీ తమ్ముడినీ, నీ భార్యనూ మింగేస్తాను నీవు నాతో ఉండిపో" అని ఏ స్త్రీ అయినా అనగలుగుతుందా – ఆర్య స్త్రీల చేత అలా అనిపించగలుగుతారా? తమ్ముడిని తినేసిన స్త్రీతో అన్న సుఖంగా ఉండగలుగుతాడా? భారతంలో హిడింబి పాత్ర చిత్రణ కూడా ఇలాగే ఉంటుంది. అన్నను చంపిన వాడిని చెల్లెలు ప్రేమించి పెళ్ళాడటం అక్కడ ఉంది. వాస్తవానికి అది బలాత్కారం ఇటువంటి బలాత్కారాలు చరిత్రలో కనబడతాయి. యుద్ధాలలో రాజులు శత్రురాజులను చంపి వారి కూతుళ్ళనూ, అక్కచెల్లెళ్ళనూ తమ అంతఃపురాలకు తరలించటం బలాత్కారమే. అలాంటి ఘట్టాలు సమాజమూ కవులూ రసవత్తరంగా వర్ణిస్తూ ఆనందించుకోవటం – స్త్రీలు ఆ స్థితిని మౌనంగా ఆమోదించవలసి రావటం దౌర్భాగ్యమే. వాటిని ఖండించే/ఎదిరించే పరిస్థితి లేక అప్పటి స్త్రీలు నిస్సహాయులుగా ఉండిపోయారు. అయితే ఆ చరిత్ర నుండి ఆధునిక స్త్రీ పాఠాలు నేర్చుకుంటున్నది.

# రాముని ఏకపత్నీవ్రతం

రామాయణంలోని దశరథ రాముడు ఏకపత్నీవ్రతుడుగా ప్రసిద్ధుడు. శూర్పనఖ తనతో ఉండి పొమ్మని రాముడిని కోరిననప్పుడు రాముడు ఆమెతో తాను ఏకపత్నీ వ్రతుడనని చెప్పి తిరస్కరించి ఉండవచ్చు. కాని ఆయన ధైర్యంగా అలా చెప్పలేక పోయాడు - కారణం ఆయన ఏకపత్నీవ్రతుడు కాదు గనక. అయినా ఆయనను ఏకపత్నీవ్రతుడు గానే గౌరవిస్తున్నారు.

వైష్ణవధర్మ ప్రచారానికి రాముడినీ, కృష్ణుడినీ ప్రతీకలుగా పౌరాణికులు ముందుకు తెచ్చారు. వైదికేతర మతాల నుంచి ప్రజలను మళ్ళించటానికి జరిగిన ప్రయత్నాలలో ఇది ముఖ్యమైనది. రాముడిని ఏకపత్నీవ్రతునిగా, కృష్ణుని బహుపత్నీకునిగా ఏవిధంగానైనా తమ మతాన్ని సమర్థించుకునే చాతుర్యం, ఆకర్షణ చూపుతూ సృష్టించిన పాత్రలు అవి.

సకల గుణాభిరామునిగా ప్రచారం చేసే క్రమంలో రాముడిని ఏకపత్నీ వ్రతునిగా చూపారు. ఈ విషయంలో పండితుల మధ్య వాదోపవాదాలు జరిగాయి.

1. శ్రీరామునికి 129 మంది భార్యలు అని బ్రహ్మాండ పురాణంలోని బ్రహ్మ నారద సంవాదం నుంచి తెలుస్తున్నది.

   "శ్రీ భూమీ నీళా సహితం శ్రీరామం జగదీశ్వరం
   పత్నీ శత సమాయుక్తం పద్మనాభం చతుర్భుజం"

   అని అక్కడ ఉంది. సీతాదేవి అనుమతితోనే వారిని గ్రహించాడనీ ఉంది. పాంచ రాత్రములలో పద్మ సంహితలో శ్రీరాముని భార్యలపేర్లు కొన్ని చెప్పి "ఇత్యాది..." అని ముగించారు.

   "సీతా శీతాంశుక సంకాశా, భూమీ నీళామహోయశాః
   భద్రా సుభద్రా ప్రీతి, రతీ కాంతీ ప్రభావతీ
   మహీ బలా మధుమతీ భద్రాంగీ పద్మినీ హ్యూషా
   లజ్జా ప్రభాసా వసుధా రేవతీ సుబలా కలా
   ఇత్యాది పుణ్య నారీణాం నవ వింశోత్తర శతం"

   (129 మంది అని భావార్థం) ఇవన్నీ విశేషణ పదబంధాలే కాబట్టి వీరిని భార్యలుగా అంగీకరించలేకపోయినా "పత్నీశత సమాయుక్తం" అనేది ఒప్పుకోవలసిందే. వారంతా పద్మనాభుని (విష్ణువు) భార్యలు.

2. అగస్త్య రామాయణం ప్రకారం రాముడు అడవికి వెళ్ళేటప్పుడు తన ఇతర భార్యలను కౌసల్య పరిచర్య కోసం ఆమె దగ్గరే ఉంచుతున్నట్టు చెప్పాడు.

3. "బహు స్త్రీలు భార్యలుగా ఉన్నా రాముడు ఏకపత్నీ వ్రతుడే" అంటున్నది వాసిష్ఠ రామాయణం.

"ఉద్వహనం" అంటే వివాహం అని సామాన్యార్థం. అయితే, "ఉత్కృష్ట వహనం' అంటూ సేవలకూ పరిచర్యకూ గ్రహించిన కన్యలుగా అర్థంచెప్పి వారు రాముని భార్యలు కారు, పరిచర్య కోసం గ్రహించినవారే అంటూ కొందరు పండితులు సమర్థించారు.[1] దూర్వాస రామాయణం, స్కంద పురాణం, బ్రహ్మాఖండం మొ।నవి అలా చెప్పాయి.

సంస్కృత భాషలోని సంక్లిష్టత ప్రజల విషయావగాహనను జటిలం చేసింది. వాస్తవాలకు భిన్నమైన కధనాలు మత మౌఢ్యాన్ని వీలైనంతగా ప్రచారం చేశాయి. రాజకీయ ధార్మిక ప్రయోజనాలను తమకు అనువుగా మలచుకోవటానికి రాజ్యశక్తులు పౌరాణికులను ప్రోత్సహించి, ప్రజలలో మతమౌఢ్యం పెంచాయి. పరిచర్యల పేరుతో స్థానిక స్త్రీలను లైంగిక అవసరాలకు వాడుకోవటం వర్గ సమాజంలో ఉంది. ఎదురు తిరిగిన వారిని శిక్షించటమూ ఉన్నది. శూర్పనఖ విషయంలో రాముని సౌందర్య దృష్టినీ, రాజనీతినీ మరింత లోతుగా పరికించాలి.

---

1 ('శ్రీరామునికి భార్యలెందరు' అనే వ్యాసం భారతి పత్రికలో వచ్చింది. (మే నెల 1960.) రచయిత శ్రీ గొట్టిముక్కల కృష్ణమూర్తిగారు.)
శ్రీరాముని భార్యల విషయంలో హేతువాదులూ చర్చించారు. దాసరి వేంకటేశ్వర్లు (10-6-1908 - 5-12-2003) గారు 'అరుణరేఖ' అనే పత్రికలో 1948 నవంబరు లోనే ఈ విషయాలు తెలియజేశారు. హనుమంతునికి 18 మంది భార్యలనీ, సీతకు నలుగురు (ఆరుగురు) భర్తలనీ ఆగస్త్యుడు, వశిష్టుడూ నరమాంసాహారులనీ ఇంకా ఇలాంటివే ఎన్నో విషయాలు అప్పట్లోనే తర్కించారు.

# జనస్థానంలో యుద్ధం

దండకారణ్యంలో జనులుండే ప్రాంతాలను జనస్థానాలు అనేవారు. దండకారణ్యం అతి విశాలమైన భూభాగం. అక్కడి జనులు ఆది భారతీయులు - ఆదివాసీలు - గిరిజనులు - వారి జీవన విధానం, మైదాన ప్రాంతాల వారికంటే భిన్నమైనది. వారు ఉండే ప్రాంతాలు ఖనిజ వనరులతో వృక్షసంపదతో ఔషధ వృక్షాలతో ఉండేవి. ఈ ప్రాంతాలను ఆర్యరాజులు దేవగణాల సహకారంతో వశపరచుకొనటాన్ని రామాయణం చెప్పింది.

జనస్థాన యుద్ధం క్షణాలమీద జరిగిన యుద్ధం అంటున్నది రామాయణం. వాస్తవానికి అది కొన్ని తరాలపాటు సాగిన వైరానికి దర్పణం. దేశంలో జనస్థానాలు చాలా ఉన్నాయి. వాటిపై ఆర్యుల దాడులు చాలా జరిగాయి. రామాయణం ఒక దాడినే వర్ణించి చెప్పింది. దండకారణ్యంలో ఈ దాడులు ఇప్పటికీ ముగిసిపోలేదు. ఇంకా సాగుతూనే ఉన్నాయి.

రాముని తండ్రి దశరథుడు అనేక పర్యాయాలు దేవగణాలకు (ఇంద్రునికి) యుద్ధాలలో తోడ్పడి రాక్షసులను చంపాడనీ తూర్పు దిక్కునుండి పశ్చిమం వైపుగా వారు స్థానిక రాక్షస రాజ్యాలు వశపరచుకొంటూ వచ్చారనీ కాళిదాసు రఘువంశం (9-19, 9-23) చెబుతోంది. నముచిని చంపిన వృత్తాంతాన్నీ కాళిదాసు ప్రస్తావించాడు.

మహాకవి కాళిదాసు రచించిన "రఘువంశం" శ్రీరాముని వంశాన్ని గురించీ ఆ వంశం వారి ఘనతను గురించీ వివరించే సంస్కృత కావ్యం. ఒక రాజవంశాన్ని గురించి చెప్పే రచన కాబట్టి దీనిని నిజానికి చరిత్రగానే పరిగణించాలి. కవుల అతిశయోక్తులనూ, వర్ణనల పరదాలనూ తొలగించుకుని లోనికి ప్రవేశిస్తే అందులో రాజకీయ, సామాజిక చారిత్రక అంశాలూ కనబడతాయి. రఘువంశంలో రావణుని గురించీ జనస్థానం గురించీ ప్రస్తావనలున్నాయి. కథానాయకుడైన శ్రీరాముని పూర్వీకుల చరిత్రను కాళిదాసు తన కావ్యవస్తువుగా స్వీకరించాడంటే అది అప్పటికి చారిత్రక అంశంగా ప్రజల మనస్సులలో నిలిచి ఉన్నదని అర్థం.

రఘువంశం ప్రకారం దిలీపుడు అయోధ్య రాజు. దిలీపుని కొడుకు రఘువు - రఘువు కొడుకు అజుడు. అజుని భార్య ఇందుమతి, విదర్భరాజు కూతురు. ఈమె స్వయంవరం నాటికే దండకలోని జనస్థానాన్ని దేవ/ఆర్య గణాలు ఆశిస్తున్నాయని రఘువంశం చెబుతోంది. జనస్థానాల రక్షణకు రాక్షసులు - రావణుడు తగిన జాగ్రత్తలు తీసుకుంటూనే ఉన్నారని కూడా చెబుతోంది. రావణుడు అప్పటికే ఉన్నాడు. రావణ నామధేయులు చాలామంది ఉన్నారేమో.

అజునికీ ఇందుమతికీ పుట్టినవాడు దశరథుడు - దశరథుని కొడుకు రాముడు - రాముని కాలానికి జనస్థానం రాక్షసుల అధీనంలోనే ఉంది. అన్ని సంవత్సరాలుగా

అంటే అజునికి పూర్వం నుండీ జనస్థానం కోసం యుద్ధాలు జరుగుతూనే ఉండి ఉండాలి.

జనావాస ప్రాంతాలపై దాడులు జరగటాన్ని ఈ రోజుల్లో టెర్రరిస్టు చర్యలుగా ప్రభుత్వాలు ప్రకటిస్తూ ఉంటాయి. కారుల్లోనో, టిఫిన్ డబ్బాలలోనో బాంబులుపెట్టి రిమోట్లతో పేల్చటం – ఒక్కోసారి మానవ బాంబులు ప్రయోగించటం అనేవాటిని విధ్వంసక చర్యలుగా అందరూ అంగీకరిస్తున్నారు. జనం ఎక్కువగా తిరిగే ప్రదేశాలలోనూ రైల్వే స్టేషన్ల దగ్గరా ఇలాంటి మారణకాండలు తరచూ వింటున్నాం. వేల సంవత్సరాల క్రితం జనాభా ఇంతగాలేని రోజుల్లో అడవులు, కొండలు, నదులు విస్తరించి ఉన్న భూభాగాల్లో జనావాస ప్రాంతాలు అక్కడక్కడా చెదురు మదురుగా ఉండేవి. వాటిని "జనస్థానాలు"గా పూర్వ సాహిత్యం చెప్పింది. వాటిపై జరిగిన దాడులనూ ప్రస్తావించింది. ఆ దాడులు టెర్రరిస్టు చర్యల వంటివే. జనస్థానాల పాలకులు స్వతంత్ర రాజులుగా, గణ నాయకులుగా తమ తమ భూభాగాలలో తమ ప్రాచీన సంప్రదాయాలనూ జీవన రీతులనూ కాపాడుకుంటూ ఉండేవారు. ప్రకృతి సంపదను అనుభవిస్తూ సుఖ సంతోషాలతో గడుపుతున్న ప్రజా సమూహాలు అవి. ప్రాచీన భారతదేశంలో ఇలాంటి జనస్థానాలు చాలా ఉండేవి. వీటిలో కొన్ని నగరాలుగానూ, పట్టణాలుగానూ, నగర రాజ్యాలుగానూ ప్రసిద్ధి పొందాయి.

రాజ్యాలను విస్తరించుకోవలసిన అవసరాలు ఏర్పడినప్పుడు బలవంతులైన రాజులు సరిహద్దులోని స్థానిక భూభాగాల ఆక్రమణకు పాల్పడటం చారిత్రక సత్యం. అలాంటి సంఘటనలను భారతీయ పురాణాలు రసవత్తరంగా చెప్పాయి. అవి ఎంత చమత్కారంగా చెప్పాయంటే ఆక్రమణదారులే మహానుభావులనే భ్రమ కల్పించే విధంగా చెప్పాయి. వలసదారులయిన ఆర్యగణాలు స్థానిక ప్రజల స్థావరాలు ఆక్రమించుకోవటాన్ని దేవాసుర యుద్ధాలుగా మలచి చెప్పిన ఆ కథనాలు పరిశీలించే కొద్దీ సంభ్రమాశ్చర్యాలకు లోనవుతాం.

మహాకవి వాల్మీకి రాసిన రామాయణంలోని జనస్థాన యుద్ధం ఘట్టం ప్రఖ్యాతమైన సన్నివేశం. అనంతరకాలపు వాడైన మహాకవి కాళిదాసు రచించిన 'రఘువంశం' కావ్యం లోనూ 'జనస్థానం' ప్రసక్తి ఉంది. ఆ వివరాలు ఆసక్తికరమైనవి. శ్రీరాముడు ఇక్ష్వాకు వంశంలోనివాడు. ఆ వంశపు మూలాలలోకి వెళితే ఇక్ష్వాకుడు మనువు కొడుకు. ఆ వంశంలో విష్ణుమూర్తి అవతారంగా పురంజయుడు అనే రాజు పుట్టాడట. ఆయన దేవగణాల మిత్రుడు. వారి కోరిక ప్రకారం రాక్షసులను చంపాడు. రాక్షసులంటే స్థానిక జాతులు. నాగులూ ద్రావిడులూను. వీరు దక్షిణ ప్రాంతం వారు. దేవగణాలంటే ఆర్యజాతులు – ఉత్తర భారతదేశంలో ఎక్కువగా ఉండేవారు. ఆర్యావర్తం వారి నివాస ప్రాంతం.

పురంజయుడు ఎద్దు మీద కూర్చుని రాక్షసులతో యుద్ధం చేశాడట. ఎద్దును సంస్కృతంలో 'కకుది' అంటారు. కకుది మీద కూచుని యుద్ధం చేశాడు గనుక అతడిని కకుత్థ్సుడు అన్నారు. 'కకుది తిష్ఠతి ఇవ కకుత్థ్సః' అని అర్థం. ఇంతకూ ఆ ఎద్దు ఎవరూ

అంటే ఇంద్రుడట. దేవతల కోరిక ప్రకారం ఇంద్రుడు ఎద్దు రూపం ధరిస్తే పురంజయుడు (విష్ణువు) ఆ ఎద్దుమీద ఎక్కి ఇంద్రుని శత్రువులను అంటే రాక్షసులను చంపాడు. ఇంద్రునికి సహాయపడటాన్ని ఆ విధంగా ప్రతీకాత్మకంగా చెప్పారు. ఎద్ల పందాలు ఈ సంఘటనకు చిహ్నంగా మిగిలాయా అనేది పరిశీలించవలసిన అంశం. ఎద్దు సంబంధంగా ఇక్ష్వాకులు కాకుత్థులుగానూ పిలవబడ్డారు. ఈ వంశంలో దిలీపుడు అనే రాజు ప్రసిద్ధుడు. దిలీపుని కొడుకు రఘువు. రఘువు కొడుకు అజుడు. అజుని కొడుకు దశరధుడు. దశరథుని కొడుకులు రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు. ఇది రఘువంశం చెబుతున్న వంశక్రమం.

ఈ వంశంలోని రాజులందరూ మొదటి నుండీ దేవగణాలకు సహాయపడుతూ స్థానిక గణాలను అణచివేస్తూ వచ్చినవారే. అందరూ ఇంద్రునికి యుద్ధాలలో సహాయపడిన వారే.

పాలకవర్గాలు ఈనాడు ఆదివాసీ/గిరిజన/మైదాన ప్రాంతాల బలహీన వర్గాలపై జరుపుతున్న దాడులకూ ఆక్రమణలకూ గ్రీన్‌హంట్‌లకూ భూమిక శతాబ్దాల నాటిది. దీనిని చరిత్ర నమోదు చేయకపోయినా సాహిత్యం నమోదు చేసింది. రఘువంశ కావ్యమూ, రామాయణమూ నమోదు చేశాయి. రాజులు రాజ్యం విస్తరించుకోవటం కోసం యుద్ధాలు చేయటం అనేదాన్ని వైదిక మతం అనుమతించింది. పాలకవర్గాలకు అది అనుసరణీయమైన విధి అని చెప్పింది. దానికి ప్రోత్సాహకంగా అశ్వమేధయాగం - రాజసూయ యాగం వంటి వాటిని ముందుకు తెచ్చింది. ఇరుగు పొరుగు రాజ్యాల మధ్య శాంతి సహృద్భావాలను కాకుండా హింసను, బలాత్కారాన్నీ మారణకాండనూ ప్రోత్సహించిన మతం వైదిక మతం, రఘువంశ రాజులు యాగాలు, దిగ్విజయాలూ చేశారు. దేవగణాలతో మైత్రి పాటించారు. స్థానికుల సిరిసంపదలు దోచుకున్నారు. వారికి సుఖశాంతులు లేకుండా చేశారు.

రఘువంశం దిలీపుని గురించి చాలా గొప్పగా చెప్పింది. దిలీపునికి చాలాకాలం వరకు సంతానం కలగలేదట. రాజ పురోహితుడైన వసిష్ఠుడు తన దివ్య దృష్టితో చూసి అందుకు గల కారణాన్ని తెలుసుకున్నాడు. పరిష్కారమార్గమూ చెప్పాడు. అదీ ఒక పెద్ద కథే. ఒకప్పుడు దిలీపుడు దేవగణాల తాలూకు రాచకార్యాలలోనే పాల్గొని ఇంటికి తిరిగి వెళ్తున్నాడు. భార్య సుదక్షిణను కలవానే తొందరలో దారిలో పక్కనే ఉన్న కామధేనువును గమనించలేదు. దానికి ప్రదక్షిణం చేయకుండా, నమస్కరించకుండా వెళ్ళిపోయాడు. ప్రజల నమస్కారాలకూ, పూజలకూ, ప్రదక్షిణలకూ అలవాటుపడ్డ కామధేవును బాధపడింది. "ఏ తొందరలో నీవు వెళుతున్నావో అది ఫలించదు" అని శపించింది. 'అందువల్లనే నీకు సంతానం కలుగలేదు' అని వసిష్ఠుడు చెప్పాడు. దిలీపుడు భార్య సంగమం కోసం ఇంటికి త్వరగా వెళ్ళటమూ సమర్థనీయమే. అది ఆమెకు రుతు సమయం. భార్యల రుతు సమయాలను భర్తలు గుర్తుపెట్టుకుని మెలగాలని పూర్వ కావ్యాలలో సూచించారు. గృహస్థ ధర్మాలలో అది కూడా ఒకటి. పుత్ర సంతానం పొందటం అనేదీ గృహస్థ ధర్మమే. మానవుల

జీవిత విధానాన్ని నిర్దేశించే నియమాలలో ఇలాంటివి చాలా ఉన్నాయి. ఇప్పటికీ సమాజంపై వీటి ప్రభావం ఉంది. ప్రతి మనిషీ మూడు రుణాలతో పుడతాడట. అవి ఋషి, దేవ, పితృ రుణాలు. ఋషుల రుణం తీర్చుకోవాలంటే వేద శాస్త్రాలు చదవాలి. దేవతల రుణం తీర్చుకోవాలంటే యజ్ఞాలు చేయాలి. పితృ రుణం తీర్చుకోవాలంటే సంతానాన్ని పొందాలి. ఈ మూడూ మానవుని మనుగడకు అవసరం. చదువు - ఉపాధి - వంశాన్ని విస్తరించు కోవటం - వృద్ధాప్యంలో తలిదండ్రులను చూడటం అనే అంశాలు ఈ మూడు విధుల తోనూ ముడిపడి ఉన్నాయి. కాలక్రమంలో వీటిని వక్రీకరించటంవల్లనూ, వీటి పరిధిని పరిమితం చేయటంవల్లనూ ఈ విధుల నుంచి కొందరు తప్పించుకోవటం వల్లనూ వైషమ్యాలతో సమాజం రోగగ్రస్తమైంది.

పితృరుణం తీర్చుకోవటం కోసం రుతు సమయంలో భార్యతో సంగమించాలి అలా సంగమించకపోవటం అధర్మంగా కొన్ని శాస్త్రాలు చెప్పాయి. అందుకే దిలీపుడు ఇంటికి తొందరగా వెళ్తున్నాడన్నారు. భార్యాసంగమ ఫలితంగా కలగవలసిన సంతానం కలగకపోవడం కామధేనువు శాపం వల్లనే అనీ, 'ఆ కామధేనువును ప్రసన్నం చేసుకుంటేనే గాని నీకు సంతానం కలగ'దనీ వసిష్ఠుడు చెప్పాడు.

ఇంతకూ కామధేనువు ఏమని శపించిందంటే "ఏ సంతానం కోసం నీవు నన్ను ఉపేక్షించి వెళుతున్నావో ఆ సంతానం, నీవు నా సంతానాన్ని ఆరాధించకుండా నీకు కలగదు" అని (రఘువంశం 1-77).

ఇక్కడా వారసత్వ రాజకీయాలున్నాయి. "కామధేనువు ఇప్పుడు ఇక్కడ లేదు. వరుణుడు చేస్తున్న సత్ర యాగానికి పాతాళ లోకానికి వెళ్ళింది. దాని సంతానం 'నందిని' నా దగ్గర ఉంది. దానిని నీవూ, నీ భార్యా ఆరాధించి ప్రసన్నం చేసుకోండి" అని వసిష్ఠుడు చెప్పాడు. పాతాళలోకమంటే భారతదేశ పటంలో నాగ్‌పూర్ కింద ఉన్న చోళ, చేర, పాండ్య రాజ్యాలు. ఇప్పటి కేరళ రాష్ట్రం - కన్యాకుమారీ పరిసర ప్రాంతాలూ - పాతాళ లోకం లెక్కలోకే రావచ్చు. విష్ణువు బలి చక్రవర్తిని పాతాళానికి అణచి వేశాడంటే, దక్షిణానికి మరీ కింది ప్రాంతాలకు, సముద్రం వరకూ తరిమేశాడని అర్థం.

ఆర్య రాజ్య విస్తరణ, గంగాతీర మైదానాలకు దక్షిణం వైపుకు సాగిన క్రమంలోనే ఇలాంటి కథలు రూపొందాయి.

దిలీపుడు అతని భార్య సుదక్షిణ కలిసి నియమంగా నందినీ ధేనువును పూజించారు, సేవించారు. దిలీపుడు రాజ్య వ్యవహారాలన్నీ పక్కనపెట్టి నందిని సంరక్షణలోనే కాలం గడుపుతూ వచ్చాడు. ఈ విధంగా గోవుల ప్రాశస్త్యాన్ని ఆర్య వాఙ్మయం ప్రచారం చేసింది. ఆవు ఆర్యులకు సమస్తం, వారి ధనమూ, ఆహారమూ అవే. ఆ సంప్రదాయం రకరకాల మార్పులతో ఈనాడు గోమాంస భక్షణ నేరమనే వరకూ వచ్చింది.

నందిని రాజుకు పరోక్షంగా కొన్ని పరీక్షలు పెట్టింది. ఒక సింహం నందిని మీదకు దూకబోయినట్టూ రాజు నందినికి బదులుగా తన శరీరాన్ని సింహానికి ఆహారంగా సమర్పించబోయినట్టూ సన్నివేశాలు కల్పించి నందిని అనుగ్రహంతో రాజుకు శాప విమోచనం కలిగించారు. దిలీపునికి సుదక్షిణా దేవి వల్ల కలిగిన కుమారుడు రఘువు. రఘువు పేరుమీదనే ఇక మీదట తన వంశం ప్రసిద్ధి పొందాలని దిలీపుడు కోరుకున్నాడట.

దేవగణాలకు విధేయంగా ఉండటం, యాగాలు, గోపూజలు చేయటం వంటివి ఇక్ష్వాకు వంశీయుల పద్ధతులు. వీరి రాజ్యం ఉత్తర కోసల. రఘువు తండ్రి దగ్గరే అన్ని విద్యలూ నేర్చుకున్నాడు. ఇతనికి యుక్త వయస్సులో గోదాన విధి, వివాహమూ జరిగాయి. గోదాన క్రతువు అనేది "వడుగు" లాంటి ఒక ఆచారం. రఘువు యువరాజుగా ఉండగా దిలీపుడు 99 అశ్వమేధ యాగాలు చేశాడు. రఘువు యాగాశ్వాల వెంట ఉంటూ అన్ని దిక్కుల రాజులనూ జయిస్తూ ఉండటంవల్ల అశ్వమేధ యాగాలు నిర్విఘ్నంగా సాగాయి. నూరోసారి యాగాశ్వాన్ని ఇంద్రుడు దాచిపెట్టాడు.

అశ్వమేధ యాగాల గురించి ఇక్కడ కొంచెం చెప్పుకోవాలి. అశ్వమేధ యాగం చేస్తున్నప్పుడు యాగదీక్ష వహించి ఒక గుర్రానికి ఒక ప్రకటన పత్రం వేళ్ళాడదీసి దాన్ని యథేచ్ఛగా వదిలేస్తారు. ఆ గుర్రం ఫలానా రాజుకు చెందినదనీ, ఆ రాజు ఆధిపత్యాన్ని అందరూ ఒప్పుకోవాలనీ, ఒప్పుకోని పక్షంలో గుర్రాన్ని అడ్డగించి దానివెంట వచ్చే సైన్యంతో పోరాడి గెలవాలనీ ఆ ప్రకటన పత్రంలో ఉంటుంది. ఆ విధంగా చుట్టుపక్కల ఉన్న చిన్నా చితకా రాజులను తమ అధీనంలోకి తెచ్చుకోవటం జరుగుతూ ఉండేది. నూరు అశ్వమేధాలు చేసినవాడు ఇంద్రుడవుతాడని శాస్త్రాలు చెబుతున్నాయి. ఇంద్రుడు స్వర్గలోకానికి అధిపతి. స్వర్గం దేవగణాల లోకం. భారతదేశ పటంలో పైన ఉత్తరంలో ఉన్న రాజ్యాలు దేవభూములు. స్వర్గలోకాలంటే అవే. భారతదేశ పటంలో పైభాగాన ఉన్నది స్వర్గలోకం. మధ్యలోనిది మర్త్యలోకం. దిగువన ఉన్నది పాతాళ లోకం. స్వర్గ, మర్త్య, పాతాళ లోకాలు ఇవే. నూరు అశ్వమేధాలు చేసి ఉండటం ఇంద్రపదవికి అర్హత. ఇప్పటి ఎన్నికలలో ఓటు విలువల లెక్కింపు లాంటిదే అప్పటి అశ్వమేధాల లెక్కింపు. (అమెరికా ప్రెసిడెంటు పదవికి జరిగే ఓట్ల లెక్కింపు పద్ధతికి ఇది దగ్గరగా ఉంది.)

ఎవరైనా అశ్వమేధయాగాలు చేస్తున్నారంటే ఇంద్రునికి అనుమానం. తన పదవికి ముప్పు వస్తుందేమోనని జాగ్రత్తపడుతూ ఉంటాడు. సాధారణంగా యాగాశ్వాలను దాచేస్తూ ఉంటాడు. అలాంటి సంఘటనలు పురాణాలలో చాలా ఉన్నాయి. ఇక్కడ ఎలాగో దిలీపుని 99 యాగాలవరకూ ఇంద్రుడు సహించాడు. నూరోసారి అడ్డుకున్నాడు. అదృశ్యంగా వచ్చి గుర్రాన్ని దాచేశాడు. యాగాశ్వం కనబడక రఘువు తత్తరపడుతున్నాడు. అప్పుడు నందినీ ధేవను వచ్చి వారికి సహాయపడింది. ఆ ఆవు మూత్రంతో కళ్ళు తుడుచుకుంటే రఘువుకు ఇంద్రుని మాయ బోధపడింది. గుర్రాన్ని తూర్పు దిక్కుగా తీసుకుపోతున్న

ఇంద్రుడు కనబడ్డాడు. "యజ్ఞ భాగాలను ముందుగా ఎప్పుడూ అనుభవించేవాడివి నీవే. నీవు ఇలా చేస్తున్నావేమిటి?" అని రఘువు అడ్డుకున్నాడు. ఇంద్రునికీ, రఘువుకూ జరిగిన సంవాదం రాజనీతి సూక్తులతో నిండి ఉంది.

యజ్ఞాలను ధ్వంసం చేసినవారిని శిక్షించాలనే నీ నియమాన్ని నీవే అతిక్రమిస్తున్నావేమిటి? అని రఘువు ఇంద్రుడిని నిలదీశాడు. అవినీతిని, అధర్మాన్నీ ప్రశ్నించాలనే సూచన ఇక్కడ ఉంది. 'ఎక్కడికక్కడ అవినీతినీ, లంచగొండితనాన్నీ ప్రభుత్వాధికారులే ప్రోత్సహిస్తున్న వర్తమాన రాజకీయ వ్యవస్థలో ఇలాంటి అంశాలను వైదికమతానుయాయులు ప్రచారం చేస్తే బాగుండేది. మూఢభక్తి ఆవరించి ఉన్న సమాజానికి ఇలాంటి విషయాలు తెలియాలి.'

"అశ్వమేధ యాగం కోసం విడిచిన గుర్రాన్ని వదలిపెట్టు. వేదవేత్తవైన నీవు ఇలా చేయడం తగదు" అని రఘువు ఇంద్రుడిని గద్దించాడు. (ర.వం. 3-46). అంతవరకు ఇంద్రుడితో అంత గట్టిగా మాట్లాడిన వారులేరు. అందుకని ఇంద్రుడు ఆశ్చర్యపోయాడట. వెనక్కి తిరిగి వచ్చి రఘువుకు సమాధానం చెప్పాడు. "నా కీర్తి నేను కాపాడుకోవద్దా? ఇంతవరకు 'శతక్రతు' (వంద క్రతువులు చేసినవాడు) అనే బిరుదు నాకే ఉండింది. ఈ రోజు నీ తండ్రి నా కీర్తిని అధిగమించడానికి ప్రయత్నిస్తున్నాడు. మరి నా కీర్తిని నేను రక్షించుకోవాలి కదా" అన్నాడు. (3-48)

ఒకరు నెలకొల్పిన రికార్డు మరొకరు బ్రద్దలు కొట్టడానికి ప్రయత్నించడం - సెంచరీలు సాధించడం - వంటి మానవ ఆకాంక్షలు - అసూయా ద్వేషాలు, స్వార్థచింతన, లోకరీతి ఈ ఘట్టంలో ప్రస్ఫుటమవుతున్నాయి. "నేను తప్ప మరొకరు సెంచరీ కొట్టడానికి వీల్లే"దన్నాడు ఇంద్రుడు. కుదరదన్నాడు రఘువు. ఇద్దరికీ యుద్ధం జరిగింది. రఘువు ఇంద్రుని గాయపరచడమే కాకుండా, వజ్రాయుధపు దెబ్బనూ తట్టుకున్నాడు. రఘువు పరాక్రమానికి ఇంద్రుడు సంతోషించి "గుర్రాన్ని తప్ప వేరే దేనినైనా కోరుకోవలసింది"గా రఘువును అనుగ్రహించాడు. రాజీధోరణికి దిగాడన్నమాట. ఏ విషయంలోనైనా పోట్లాటకు దిగితే తప్ప అధికార వర్గం చర్చలకు దిగిరాదు. చర్చలలోనూ సంధి ప్రయత్నాలు చేస్తుంది. అసలు సమస్య దాటవేస్తుంది. ఈ కుటిల రాజకీయాలన్నీ రఘువుకు తెలుసు.

బలవంతులతో విరోధం పెట్టుకొని సమస్యను మరింత జటిలం చేసుకోవడం కంటే రాజీపడడమే మంచిదనుకున్నాడు. "గుర్రాన్ని వదలడం వీలుకాదనుకుంటే, నా తండ్రికి నూరు అశ్వమేధాలు చేసిన ఫలం ఇవ్వు" అని అడిగాడు. ఆ సంగతిని బాహాటంగా ప్రకటించాలనీ కోరాడు.

ప్రభుత్వ వాగ్దానాలు నమ్మలేని పరిస్థితి అనాదూ ఉండేది. అందుకే గెజిట్‌లో ప్రకటన జి.వో. రావాల్సిందే, ఇంద్రుడు దానికి ఒప్పుకుని వెళ్ళిపోయాడు. రఘువు అసంతృప్తితోనే వెనుదిరిగాడు.

దేవగణాలు కేంద్రం అనుకుంటే స్థానిక నాయకులు కేంద్రాన్ని కాదనలేని పరిస్థితి. కేంద్రమూ సామంతులను (రాష్ట్రాల నాయకులను) వదులుకోలేని పరిస్థితి. ఈ విధంగా ఇచ్చి పుచ్చుకోవటాల వ్యవహారాలు పూర్వమూ జరిగాయి.

**రఘువు**

దిలీపుడు రఘువుకు రాజ్యం అప్పగించి వానప్రస్థ ఆశ్రమం స్వీకరించాడు. రఘువు సమర్థుడైన పాలకుడు. వర్ణాశ్రమ ధర్మాలు కాపాడాడు. దిగ్విజయం చేశాడు. ఆ క్రమంలో అరణ్య భూములనూ వశం చేసుకున్నాడు. గంగానది లంకలలో జయ స్థంభాలు వేయించాడు. సుహ్మ, వంగ, ఉత్కళ, పాండ్య, కామరూప దేశాల రాజులు ఇతనికి మిత్రులయ్యారు. ఆ తర్వాత ఆయన "విశ్వజిత్" యాగంచేసి తన సంపదనంతా దానం చేశాడు. అలాంటి స్థితిలో కౌత్సుడనే మునికుమారుడు వస్తే మట్టి పాత్రలో అతిథ్యం ఇచ్చాడట. కౌత్సుడు తన గురువైన వరతంతు మహర్షికి ఇవ్వడం కోసం రాజును పద్నాలుగు కోట్ల బంగారు నాణాలు అడగాలని వచ్చాడు. రాజుగారి స్థితిచూచి అడగలేకపోయాడు. అయినప్పటికీ విషయం తెలుసుకున్న రాజు అంత ధనమూ ఇస్తానన్నాడు. ఆ మర్నాడే ధనాధిపతి అయిన కుబేరుని మీదికి దండెత్తి వెళ్ళి అంత డబ్బూ తేవాలనుకున్నాడు. ఆ సంగతి తెలుసుకున్న కుబేరుడు రాత్రికి రాత్రే రాజు ధనాగారాన్ని బంగారు నాణాలతో నింపేశాడు. ఒక బ్రాహ్మణ బ్రహ్మచారి వచ్చి ఏదేనా కోరినప్పుడు కాదనకూడదని శాస్త్రాలు చెబుతున్నాయి. అందుకే రఘువు, కుబేరుడు ఇద్దరూ స్పందించారు. రఘువు ఆ ధనం అంతా కౌత్సునికే ఇచ్చి పంపాడు. ఆ ధనపు సంచులను ఒంటెల మీద అడగుర్రాల మీదా వేసి తీసుకువెళ్ళారు. కౌత్సుడు రఘువు మహిమకు ఆశ్చర్యపడుతూ "నీలాంటి కుమారుడే నీకు కలుగుతాడు", అని ఆశీర్వదించాడు. రఘువు కుమారుడు అజుడు. గుణాలలోనూ, రూపంలోనూ తండ్రి వంటివాడేనట. ఒక దీపం నుంచి వెలిగించిన మరో దీపంలాగా వారున్నారని కాళిదాసు వర్ణించాడు. "...ప్రవర్తితో దీప ఇవ ప్రదీపాతే..." (ర.వం. 5-37).

**అజుడు**

అజుని గురించి విశేషాలు చాలా ఉన్నాయి. ప్రస్తుతాంశం ఇందుమతీ స్వయంవర ఘట్టం. ఇందుమతి విదర్భ రాజైన భోజుని సోదరి. ఆమె స్వయంవరం ప్రకటించినప్పుడు దేశ దేశాల రాజులుందరూ అక్కడికి వెళ్ళారు. ఇందుమతి చెలికత్తె వారిని ఒక్కొక్కరినీ ఇందుమతికి పరిచయం చేస్తూ వచ్చిన సందర్భంలో ఆయా రాజుల గురించీ, ఆయా దేశాల భౌగోళిక, ఆర్థిక పరిస్థితుల గురించీ వివరంగా చెప్పింది. సమకాలీన చారిత్రకాంశాలు ఆ వివరాలలో ఉన్నాయి. అజుడు ఇందుమతీ స్వయంవరానికి ప్రయాణమై వెళ్ళే దారిలోని వన భూములూ, జానపదులు రాజును సేవించటాలూ గమనిస్తే, వన భూములలో

చెల్లాచెదురుగా జన పదాలున్నట్లు స్పష్టమవుతుంది. అజుని ప్రయాణం నర్మదా నదీతీరంలో సాగింది. నర్మద నాగుల సోదరి. అవన్నీ నాగుల రాజ్యాలు. నర్మదా నదిలో ఒక ఏనుగు భీభత్సం సృష్టిస్తుంటే దానిని అదుపు చేయడానికి అజుడు బాణం వదిలాడు. ఆ బాణం తాకగానే ఏనుగు ఒక గంధర్వునిగా అయింది. ప్రియంవదుడనే గంధర్వుడు మతంగుని శాపంవల్ల ఏనుగుగా అయ్యాడట. అతనికి ఇప్పుడు శాపవిమోచనం అయింది. తన గర్వ ప్రవర్తన చేతనే తనకు ఈ శిక్షపడిందని ప్రియంవదుడు చెప్పాడు. మహర్షి శాంతమూర్తి గనుక తాను బతిమాలుకోగానే శాప విమోచనమూ అనుగ్రహించాడని చెప్పాడు. అజుని బాణంతో అతనికి శాపం తొలగి పూర్వరూపం వచ్చింది. మతంగుని తపోనిధిగా, మహర్షిగా 'రఘువంశం' కీర్తించింది. రామాయణమూ కీర్తించింది.

జనస్థానం గురించి ముఖ్యంగా తెలుసుకోవలసిన అంశం ఒకటి ఉంది.

ఇందుమతీ స్వయంవర ఘట్టంలో ఆహ్వానం అందుకుని వచ్చిన రాజులందరూ సభలో ఆసీనులై ఉన్నారు. ఇందుమతి చెలికత్తె సునంద ఒక్కొక్క రాజునూ పరిచయం చేస్తూ ఇందుమతిని తీసుకువస్తున్నది. ఆ స్వయంవరానికి నాగ రాజులు కూడా వచ్చారు. వారి పరాక్రమాన్ని అక్కడ బాగా పొగిడారు.

సునంద పాండ్యరాజును గురించి చెబుతున్న సందర్భంలో ఒక శ్లోకం (6-62) "అస్త్రం హరాదాప్తవతా...పురాజనస్థాన విమర్దశంకీ సంధాయ లంకాధిపతిః ప్రతస్థే." అని ఉంది. దాని భావం ఇది – జనస్థానానికి దేవతలవల్ల ఉపద్రవం ఉన్నదని లంకాధిపతి (రావణుడు) ముందే ఊహించాడట. అందుకని తానే ముందుగా స్వర్గం మీద దండెత్తి వారిని జయించాలనుకున్నాడు. ఈ క్రమంలో ముందుగా రావణుడు పాండ్యునితో మైత్రి చేసుకున్నాడు. ఎందుకంటే పాండ్యుని దగ్గర హరుడు ఇచ్చిన అస్త్రం ఉంది. పాండ్యుడు దేవతలకు సహాయపడితే ఆ అస్త్రమహిమవల్ల తనకు దేవతలను జయించటం కష్టమవు తుంది. అందుకని రావణుడు ముందే పాండ్యునితో మైత్రి చేసుకుని ఆ తర్వాత ఇంద్రునిపై దండెత్తాడు. "అలాంటి మహావీరుడు పాండ్యుడు. ఇతనిని వరిస్తే నీవు దక్షిణ దిక్కుకే రాణివి అవుతావు" అని సునంద ఇందుమతికి చెప్పింది.

దీనివల్ల తెలుస్తున్నదేమిటంటే జనస్థానాన్ని నాశనం చెయ్యాలనే తలంపు దేవ గణాలకు ఎప్పటినుంచో ఉంది. కాళిదాసు కాలంనాటికి ఈ సంగతులు బహిరంగ రహస్యాలే.

ఖర దూషణాది పద్నాలుగు వేలమంది రాక్షసులను రాముడు చంపటం రామాయణంలో అరణ్యకాండలో (19 నుండి 30వ సర్గ వరకు) 12 సర్గలలో 325 శ్లోకాలలో ఉంది. జనస్థానంలో జరిగిన ఈ హింసాకాండ వంటిది అప్పటి నాగరిక దేశాలలో ఎక్కడైనా జరిగిందో లేదో అనుమానమే. ఒకే ఒక్క వ్యక్తి పద్నాలుగు వేల మందిని క్షణాలమీద చంపటం ఇక్కడ జరిగింది. ఇది అద్భుత శక్తులు ప్రదర్శించే కల్పన.

రాముడి దగ్గర చాలా ఆయుధాలున్నాయి. రాముడికి అటువంటి శక్తిమంతమైన ఆయుధాలు సురులు అగస్త్యుని ద్వారా అందించారు. రాముడు అరణ్యాలకు వెళ్ళిందే రాక్షస సంహారం కోసం. రాక్షస సంహారం కోసమే ఇంద్రుడు శరభంగముని ఆశ్రమంలో మంతనాలు జరిపాడు. రాక్షసులపై అతనిది అప్రకటిత యుద్ధం. అయినా వాటిని ఆత్మరక్షణ చర్యలుగా రామాయణ కర్తలు ప్రజలను నమ్మించారు. అవి ఇప్పటి ఎన్‌కౌంటర్లే.

'జనస్థానం' అంటే జనులుండే చోటు. దండకారణ్యంలో ప్రస్రవణ పర్వత ప్రాంతంలో జనావాస ప్రాంతాలు కొన్ని ఉన్నాయి. వాటిలో ఖరుని పట్టణం ఉంది. అది సీతా రామలక్ష్మణులు ఆశ్రమం కట్టుకున్న పంచవటికి దగ్గరలోనిదే. కోరమండల్ తీరం ఒకప్పుడు ఖర, దూషణుల పాలనలో ఉండేదట. ఖరుని మండలమే కోరమండల్ అయిందంటారు.

గోదావరి తీరాన పంచవటిని ఇప్పటి నాసిక్‌కు రెండు మైళ్ళ దూరంలో గుర్తించారు. ఐదు వటవృక్షాలున్న చోటు పంచవటి. ఇది ఖరుని మండలం లోనిదే. రాముడు ఖరుని అనుమతి లేకుండా ఇక్కడ ఆశ్రమం కట్టుకున్నాడు. శూర్పనఖ ఆ విషయం గమనించి అడిగినందుకే అవమానించబడింది.

పంచవటికి ఒక విశేషం ఉంది. ఇక్కడి వటవృక్షాలు పూర్వం గంధర్వులట. అగస్త్యుడిని ఎటూ కదలకుండా చేయాలని ప్రయత్నించిన గంధర్వులు అతని శాపం వల్ల వృక్షాలుగా మారారట. అహల్య శాప విమోచనం లాగానే వీరికీ శ్రీరామ దర్శనంతో శాపం తీరిందని కంబ రామాయణం చెప్పింది.

అగస్త్యుడు దక్షిణానికి రావటం స్థానిక జాతులను అణచిపెట్టేందుకే. ఆర్య మునులలో, అగస్త్యునిది కీలకపాత్ర. ఆర్యరాజులకు సహాయంగా ఉంటూ వారికి ఆయుధాలు సరఫరా చేసిన ఘనత అగస్త్యునిది.

గంధర్వులూ, యక్షులూ, నాగులూ, రాక్షసులూ ఆర్య విస్తరణను అడ్డుకోవటం వల్లనే జనస్థానంలో యుద్ధం జరిగింది. ఈ యుద్ధం చాలా కాలం నడిచి ఉండాలి. బహుశః పధ్నాలుగేళ్ళూ నడిచిందేమో. యుద్ధంలో ఖరునిది ప్రధాన పాత్ర.

**ఖరుడు**

విశ్రవసునికి "రాక" అనే ఆమెవల్ల పుట్టిన కొడుకు. పులస్త్య బ్రహ్మ మనుమడు. విశ్రవసుడు తల్లి గర్భంలో ఉన్నప్పుడే తండ్రి వేదాలు చదువుతుంటే విని నేర్చేసుకున్నాడట. అలాంటి వాని కొడుకు ఖరుడు. విశ్రవసుని మరో భార్య కైకసి. ఆమె వల్ల విశ్రవసునికి రావణుడు, కుంభకర్ణుడు, విభీషణుడు, శూర్పనఖ కలిగారు. శూర్పనఖ ఖరునికి సవతి సోదరి.

శూర్పనఖ దండకలో తన సవతి సోదరులతో నివసిస్తూ ఉండేది. సోదరుని రాజ్యం కాబట్టి దండకలో ఆమె యథేచ్ఛగా తిరుగుతూ ఉండేది. పరదేశీయులయిన రామ

లక్ష్మణులను గమనించి వారిని గౌరవంగా పలకరించి "రాక్షస రాజ్యానికి ఎందుకు వచ్చారు? ఆయుధాలతో ఎందుకు తిరుగుతున్నారు?" అని అడిగింది. వారు ఆమెను చులకనగా చూశారు. అభ్యంతరకరంగా మాట్లాడారు - పరిహాసాలు చేశారు. ఆమె గట్టిగా అడిగితే పట్టుకుని ముక్కు చెవులు కోశారు. రక్తం ఓడుతున్న స్థితిలో శూర్పనఖ ఖరుని దగ్గరకు పరిగెత్తి పోయింది.

ఆమెను ఆ స్థితిలో చూడగానే ఖరుడు నివ్వెరపోయాడు. కలవరపడ్డాడు. ఆమెకు ఆ స్థితి కలిగించిన వారిపై కోపమూ వచ్చింది. క్రోధ సంతప్తుడైన ఖరుడు "ఏం జరిగిందో చెప్పు" ఎవరు నీకు అంగహాని కలిగించారు? నిరపరాధిగా ఉన్న కృష్ణ సర్పాన్ని కదిలించిన వాడెవడు? దేవ, గంధర్వ ముని గణాలలో ఎవరు నిన్ను ఇలా చేశారు? పాకాసురుని చంపిన ఇంద్రుడు తప్ప నాకు విరోధులెవరున్నారు?" అంటూ తత్తరపడ్డాడు.

ఖరుడు వీరుడు. అసుర గణాలలోని వాడు. వారికి దేవగణాలూ, ఆర్యగణాలూ అప్పటి శత్రువర్గాలు. ఈ వైరం వన్య సంపదకు సంబంధించినదే. దండకలోని ఖనిజ/వృక్ష వనరుల కోసమే దేవ/ఆర్య గణాల ప్రయత్నాలన్నీ. శూర్పనఖ తన విషయం చెప్పింది. జరిగినదానిని ఆమె వక్రీకరించి చెప్పిందంటారు. రామాయణ కవులు ఎన్ని వక్రీకరణలు చేశారో ఇప్పుడు మనమూ ఊహించలేము. చెల్లెలికి జరిగిన అవమానాన్ని ఖరుడు సహించ లేకపోయాడు. 14 మంది రాక్షసవీరులను రాముని మీదికి పంపారు. రామాయణకర్తలు రాక్షసులను క్రూరులుగా చిత్రించారేగాని రాముని దౌర్జన్యాన్ని క్రూరత్వాన్ని చెప్పలేదు. అక్రమంగా రాక్షసుల రాజ్యంలో నివాసం ఏర్పరచుకొని అదేమని అడిగిన వారికి "మేము దశరథుని పుత్రులం. దండకలో ఉండటానికి వచ్చాం" అంటూ అహంకారంతో బదులు చెప్పిన రాముడు ఖరుని భటులను చూసి, "మమ్మల్ని ఎందుకు విసిగిస్తున్నారు. పాపులూ, పాపాత్మకులూ అయిన మిమ్మల్ని (యుద్ధంలో) చంపాలని మునులు ఆజ్ఞాపించారు. అందుకే మిమ్మల్ని చంపుతాను" అంటూ 14 మంది వీరులనూ చంపేశాడు.

రాక్షసుల గడ్డమీద రాక్షసులను చంపాలని మునుల ఆజ్ఞ - ఆర్య మునుల దారుణ శాసనాలూ వాటిని ఆర్య క్షత్రియులు అమలు పరచటాలూ, స్థానికులను హింసించటాలూ, - ఇదే చరిత్ర. హంతకులే పాలకులై పూజలు పొందుతున్న వ్యవస్థ ఈ దేశంలో ఉంది. ఇది మతపరంగా ప్రతిష్ఠించబడటమే బాధాకరం.

ఈసారి ఖరుని సేనానాయకుడు దూషణుడు 14 వేలమంది రాక్షసులతో వాహనాలతో, ఆయుధాలతో యుద్ధానికి సిద్ధమయ్యాడు. రాక్షసుల ఆయుధాలు శూలం, కత్తి, ఇనుప రోకలి (పరిఘ), గద, ముసలం, బల్లెం, ఈటె మొదలైనవి. బాణాలు వేయగల వారూ ఉన్నారు. యుద్ధ భేరీలు - గుర్రాలు పూన్చిన రథాలు, జెండాలు, అన్ని హంగులూ గొప్పగా ఉన్నాయి. వీరి ఆయుధ సంపద ఖనిజ వనరుల వల్ల వచ్చినదే.

ఖరునికి అపశకునాలు ఎదురైనా లెక్కచెయ్యలేదు. చాలా కోపంతో రామలక్ష్మణులను చంపాలనే లక్ష్యంతో ఉన్నాడు. ఆ యుద్ధం చూడటానికి మునులు, దేవతలు, గంధర్వులు, సిద్ధులు చారణులు వచ్చారట. వాళ్ళంతా రాముడు జయించాలనే కోరుకుంటూ చర్చించు కుంటూ వచ్చారు. (అరణ్య. 24-19) "తతో దేవా గంధర్వా... ఋష యశ్చ...(అరణ్య - 24-19, 20) దేవ, ఋషి గణాలు రాముని యుద్ధం చూడటానికి వచ్చారు. స్వస్తి గోబ్రాహ్మణే భ్యో అస్తు లోకానాం యే అభిసంగతాః జయతాం రాఘవో యుద్ధే. పౌలస్త్యాన్ రజనీ చరాన్" (24-21) అంటూ భజన మొదలుపెట్టారు.

రాక్షసులందరూ పులస్త్య వంశజులు. పులస్త్యుడు ప్రజాపతులలో ఒకడు. గోబ్రాహ్మణులకు శుభమూ పౌలస్త్యులకు నాశనమూ వారు కోరుకున్నారు. "మనం బతుకుతూ పక్కవారిని బతక నిద్దాం" అనే సద్భావన రామరాజ్యంలో లేదన్నమాటే. ఆ ఘట్టంలో రాముని రూపం ప్రళయ కాలరుద్రునిలాగా ఉన్నదని స్కాంద పురాణం చెప్పింది. విష్ణువు ఆయుధాలతోపాటు శివుని ఆయుధాలూ, ఇంద్రుని ఆయుధాలూ, పరశురాముని గండ్రగొడ్డలీ కూడా అతని దగ్గర సిద్ధులకు చారణులకు కనిపించాయట. ఖరుని సేనా నాయకులు శ్యేనగామి, పృథుగ్రీవుడు, యజ్ఞశత్రు, విహంగముడు, దుర్జయుడు, కరవీరాక్షుడు, పరుషుడు, కాలకార్ముకుడు, మేఘమాలి, మహామాలి, సర్పాస్యుడు, రుధిరా శనుడు దూషణు వెంట ఉన్నారు. ఈ పేర్లన్నీ ఆర్యులు సంస్కృతీకరించి రాసినవే. అసలు పేర్లు కాదు. యజ్ఞ శత్రువు - రుధిరాశనుడు (రక్తం ఆహారంగా గలవాడు) సర్పాస్యుడు (పాము ముఖం కలవాడు) వంటి పేర్లు ఆర్యమునుల కల్పనలే. మహా కపాలుడు, స్థూలాక్షుడు, ప్రమాథి, త్రిశిరస్సు అనేవారూ దూషణుని వెంట ఉన్నారు.

యుద్ధానికి ముందు అపశకునాలు రామునికీ కనిపించాయి. అయితే ఆ ఉత్పాతాలన్నీ రాక్షసుల చేటు సూచిస్తున్నాయన్నాడు రాముడు. ఈ సందర్భంలో దుశ్శకునాలూ, శుభశకునాలూ వివరంగా చెప్పారు.

ఇంత మందితోనూ తానొక్కడే యుద్ధం చేస్తానన్నాడు రాముడు. "నా పాదాల మీద ఒట్టు. నాకు ఎదురు చెప్పకు. సీతను తీసుకుని ఆ కొండ గుహలో ఉండు" అని లక్ష్మణునీ, సీతనూ దూరంగా పంపేశాడు.

కవచం వేసుకొని ధనుర్బాణాలతో సిద్ధంగా ఉన్నాడు. 25వ సర్గలో 45 శ్లోకాలలో ఖరుని సేనతో రాముని యుద్ధాన్ని వర్ణించారు. 26వ సర్గలో దూషణునితో యుద్ధం 38 శ్లోకాలు.

రాముడు నూరువేలు పదివేలు బాణాలు వదులుతూ అనాయాసంగా యుద్ధం చేశాడు. ఆ బాణాలు రాక్షసుల శరీరాలు ఖండించి ఆకాశానికి పోయి ప్రకాశిస్తున్నాయట. సన్నటి నాళం లాంటి బాణాలు, పదును మొనలతో చెవిలో నాటేటట్లు వేసే బాణాలూ, రాముడు వేశాడు. అంతే కాదు, రాక్షసుల ఆయుధాలు తన బాణాలతో అందుకుని వాటితోనే వారి గొంతులు కోశాడు.

రాముడు అమ్ముల పొది నుండి బాణం తీయటం, సంధించటం, విడవటం అనేవి తెలియటమే లేదు; కాని బాణాలు, ఆకాశమంతా నిండుతున్నాయి. రాక్షసుల శరీరాల తునకలు నేలంతా నిండాయి.

రాముడు కత్తితో దూషణుని ధనుస్సు నరికాడు. రథం విరగ్గొట్టాడు. నాలుగు బాణాలతో, నాలుగు గుర్రాలనూ చంపాడు. అర్ధచంద్రాయుధంతో సారథి తలనూ తెగ్గొట్టాడు. రెండు బాణాలతో దూషణుని భుజాలు నరికాడు. పక్కనే "సాధు సాధు" అంటూ దేవ మునిగణాలు స్తోత్రాలు చేస్తున్నారు. ఆర్యులు స్థానికులను ఎంత దారుణంగా హింసించారో మునులు హింసను ఎంత ఆనందించారో ఈ వర్ణనలవల్ల బోధపడుతుంది. తమ వనరులను ఉనికిని కాపాడుకోవటానికి ప్రయత్నిస్తున్న గిరిజనులూ, ఆదివాసీలూ ప్రభుత్వ (రాజ్య) శక్తుల చేతుల్లో ఈనాడూ ఇలాగే హింసకు గురవుతున్నారు. అగ్రవర్ణాల చేతిలో ఈనాడూ దళితులు హింసకు ఇలాగే గురి అవుతూ ఉన్నారు.

మహా కపాలుని తల ఒక బాణంతో కొట్టాడు. ప్రమాధి బాణాలు తగిలి కిందపడితే అతని కళ్ళల్లోకి బాణాలు వేశాడు. (స్థూలాక్షుని కళ్ళలో కత్తులుదించిన సంఘటనలాంటిది ఆంధ్రదేశంలో కారంచేడులో (1985) జరిగింది. రాముని కాలపు హింసారూపాలను ఇప్పుడు అగ్రవర్ణాలు అందిపుచ్చుకున్నాయి.) దూషణుని చంపగానే అక్కడ మునులు సాధు సాధు అంటూ (26-13) రాముని ప్రోత్సహించారు.

రాముడు ఒక క్షణంలోనే 5 వేల బాణాలు ప్రయోగించి 5 వేల సేనను హత మార్చాడు.

ఖరునితో యుద్ధంచేస్తూ నూరుగురిని చెవుల వంటి బాణాలతో చంపాడు. వెయ్యి బాణాలతో వెయ్యి మందిని చంపాడు. రాముని బాణాలు బంగారంతోనూ, వజ్రాలతోనూ అలంకరింపబడి ఉన్నాయి. వాటి తయారీ విదేశాలలో జరిగి ఉంటుందా? అవి దేవగణాలు అందించినవే కదా.

యుద్ధ భూమి రక్తంతో తడిసి, రాక్షసుల అవయవ ఖండాలతో చెల్లా చెదరైన వెంట్రుకలతో దర్భలు పరచిన యజ్ఞవేదిలాగా ఉన్నదని కవి వర్ణించాడు (26-31-33). గోబ్రాహ్మణుల యజ్ఞ వేదికలు అంత భీభత్సంగా ఉండేవన్న మాట. మాంసమూ, రక్తమూ కలిసిన బురద జనస్థానమంతా నిండింది. 14 వేల రాక్షసులు చనిపోయాక ఖరుడు, త్రిశిరస్సు మిగిలారు. (26-35)

ఖరుని సేనాపతి త్రిశిరస్సుతో యుద్ధం 27వ సర్గ అంతా వర్ణించారు. 20 శ్లోకాలు ఎత్తి పొడుచుకోవటం, బాణాలు వేసుకోవటం. చివరకు రాముని బాణాలు త్రిశిరస్సు గుండెల్లో దిగాయి. మూడు బాణాలతో మూడు తలలూ తెగాయి. రామాయణ కవులు హింసనూ, రక్తధారలనూ, రక్తపు రంగులనూ ఆసక్తితో వర్ణించారు. (పంది రక్తపు రంగునూ వర్ణించారు).

అంతకు పూర్వం రామునితో మునులు మాట్లాడటం చూసిన సీత రాముని వ్యవహారంలో అప్పుడే అనుమానపడింది. 'ఆయుధాలతో వనవాసం చేయటం సమంజసం కాదనీ ఆయుధం చేతిలో ఉంటే ఎవరికైనా దానిని వాడాలని బుద్ధిపుడుతుందనీ' చెప్పింది. (అరణ్య 9, 10 సర్గలు మొత్తం) అనుష్ఠిస్తున్నానని చెబుతున్న రుషి ధర్మానికీ అనుసరిస్తున్న విధానానికీ పొంతన లేని వ్యవహారం రామునిది. వైరం లేకుండానే పరుల ప్రాణాలు హరించే 'రౌద్రము' అనే వ్యసనానికి లోనవుతునన్నావని సీత హెచ్చరించినా రాముడు వినలేదు.

మునులలో చాలామంది రామునికి ఆయుధాలు ఇచ్చారు. బ్రహ్మ ఇచ్చిన బాణం, ఇంద్రుడిచ్చిన అంబులపొది, కత్తి, విష్ణువు అసురులను చంపిన ధనుస్సూ ఇవన్నీ ఆగస్త్యుని దగ్గర ఉన్నాయట. వాటిని ఆయన రామునికి ఇచ్చాడు. సీతారాములు మిథిలలో ఉన్నప్పుడు జనక మహారాజు చేసిన యాగంలో వరుణుడు రామునికి ఒక ధనుస్సు ఇచ్చాడట. అదీ, కవచాలూ, అక్షయ బాణాలున్న అమ్ముల పొదులూ, బంగారు పిడులున్న రెండు కత్తులూ. రాముడు ఇవన్నీ ఆచార్యుని ఇంట్లో పెట్టాడట. వాటిని వనవాసానికి వెళ్ళేముందు తీసుకురమ్మని రాముడు లక్ష్మణునికి చెప్పాడు (31-27, 28, 29, 30).

ఆ ఆయుధాలన్నీ రామలక్ష్మణులు వెంటతెచ్చుకున్నారు. జనస్థాన యుద్ధంలో రాక్షసుల ఆయుధాలు విరిగితే వారికి కొత్తవి రావటంలేదు. రామునికి వేనవేలు బాణాలు, అస్త్రాలు చేతికి అందుతున్నాయి. ఆయుధాల సరఫరా దేవగణాలు చేశారు. విప్రులు, మునులు మాటిమాటికీ స్తుతిస్తూ రాముడిని ప్రోత్సహించారు.

"స్వస్తి గో బ్రాహ్మణేభోస్తు లోకానాం...జయతాం రాఘవో" అంటూ స్తోత్రాలు చదువుతున్నారు. ఖరునితో యుద్ధం 28వ సర్గ - 33 శ్లోకాలు.

రాముడు అగస్త్యుడిచ్చిన వైష్ణవ ధనుస్సు వాడాడు. ఎన్నెన్ని బాణాలతో ఏయేచోట్ల కొట్టాడో వివరంగా వర్ణించారు. చివరకు రథం విరిగి నేలమీద నిలబడి గదతో యుద్ధానికి సిద్ధపడ్డాడు ఖరుడు. అతనితో రాముడు నిదానంగా చేసిన సంభాషణ 29, 30 సర్గలలో ఉంది. రాక్షసులు ఎంత పాపకర్ములో చెప్పటం - మునులను హింసించారన్న ఆరోపణలు చెయ్యటం ఆ సర్గలలో చెప్పారు. ఫలానా మునిని హింసించారు అని ఎక్కడా పేరు చెప్పలేదు. అన్నీ ఆరోపణలే.

ఖరునితో రాముడు గదా యుద్ధం చెయ్యలేదు. బాణాలతోనే అతన్ని, అతని గదనూ పడగొట్టాడు. ఆ స్థితిలోనూ ఖరుని ధైర్యాన్నీ పరాక్రమాన్ని కవి గొప్పగా వర్ణించాడు. రాముడు రాక్షసనింద చేస్తూనే ఉన్నాడు - వడగళ్ళు తిన్న నలికండ్ల పాములాగా నీవు చస్తావన్నాడు. (29-5)

"రాక్షస పాంశనుడవైన నీవు చస్తే దండక శరణుకోరే వారికి శరణ్యంగా ఉంటుం"దన్నాడు. (అంటే దండకను కోరే మునులు దండకను ఆక్రమిస్తారన్నమాట) (30-8) జనస్థానంలో ఈ రాక్షసులంతా చస్తే మునులు ఇక్కడ నిర్భయంగా ఉంటారన్నాడు.

"జనస్థానే హతస్థానే తవ రాక్షస మచ్చరైః నిర్భయా
విచరిష్యన్తి సర్వతో మునయో వనే" (30-9)త

...రాక్షస స్త్రీలనూ ఖరుని భార్యలనూ నీచులని తిట్టాడు. వారు దిక్కులేనివారై ఎక్కడికైనా పారిపోతారన్నాడు. "రాక్షసులు బ్రాహ్మణ కంటకులు" అంటూ నిందించాడు. దాదాపు 45 శ్లోకాలు ఖరుడు రాముని ఆత్మస్తుతినీ పరనిందనూ భరిస్తూనే ఒక సాల వృక్షాన్ని పెకలించి దానితో రామునిపై తలపడ్డాడు. అప్పుడు రాముడు ఇంద్రుడు ఇచ్చిన బాణాలతో ఖరుడిని పడగొట్టాడు. రామునిచేత హతుడైన ఖరుడు వజ్రాయుధంచేత చంపబడిన వృత్రాసురుని లాగా బలాసురునిలాగా నురుగు చేత చంపబడిన నముచి లాగా కింద పడ్డాడట. (30-28). ఖరుడు మరణించాక దేవగణాల/మునుల స్తోత్రాలు మిన్నుముట్టాయి. ఈ పని (రాక్షస సంహారం) కోసమే శరభంగుని ఆశ్రమానికి ఇంద్రుడు వచ్చి మంతనాలు జరిపాడనీ ఇందుకోసమే రాముడిని ఉపాయంగా దండకకు తేవటం జరిగిందని మునులు మాట్లాడు కున్నారు. (30-29, 33) శ్వేతారణ్యంలో శివునికంటి మంటకు ఆహుతి అయిన అంధకాసురుని ప్రసక్తి (30-27) ఇక్కడ తెచ్చారు.

"ఏతర్థం మహాతేజా..." ఏషాం వధార్థం క్రూరాణాం రక్షసాం పాపకర్మణాం (30-31)

"...సుఖం ధర్మం చరిష్యంతి దండకేషు మహర్షయః..." (30-32)

తాము దండకలో ఇక సుఖంగా ఉంటామన్నారు. శత్రువును నిరాయుధుని చేసి పాత సంగతుల చిట్టావిప్పి అతనిని దూషించే మనస్తత్వమూ - అందులో పొందే ఆనందమూ రాముని ప్రవర్తనలో చూపారు. రాక్షసులపై అభియోగాలు ఇవి-

1) మునులు, బ్రాహ్మణులు రాక్షసుల భూములు ఆక్రమిస్తుంటే అడ్డు చెప్పటం.
2) మునులకు మర్యాదలు చెయ్యకపోవటం.
3) యజ్ఞాలకు పశువులను సరఫరా చేయకపోవటం.
4) మునులను తినటం, చంపటం (నిజానికి మునులే రాక్షసులను తిన్నారు. వాతాపిని అగస్త్యుడు భోంచేయటం ఇందుకు ఉదాహరణ)
5) స్త్రీలను అందుబాటులో ఉంచకపోవటం. దేవగణాలకు ఆర్యులు తమ స్త్రీలపై హక్కు ఇచ్చినట్టుగా, యక్ష, నాగ, అసుర రాక్షస స్త్రీలను ఆర్యులకు అప్పగించక పోవటం. తమ స్త్రీలను అవమానిస్తుంటే చూస్తూ ఊరుకోకపోవటం.
6) యజ్ఞాలను, గోబ్రాహ్మణాధిక్యతను - వర్ణాశ్రమ ధర్మాలను పాటించకపోవటం.

ఇవీ ఆర్యులకు కోపం కలిగించిన అసలు కారణాలు. "రాక్షసులు బ్రాహ్మణ కంటకులు" అనటం చూస్తే బ్రాహ్మణుల సంప్రదాయాలు, వర్ణధర్మ పాలన వంటివి స్థానిక జనానికి దుస్సహంగా ఉండేవని అర్థం చేసుకోవచ్చు.

అంధకాసుర, వృత్రాసుర వృత్తాంతాలూ, నముచి బలాసురుల జ్ఞాపకాలూ అప్పటికి ఉన్నాయి. ప్రజలు వాటిని ఎప్పటికీ మరచిపోరని వాల్మీకి గుర్తుచేస్తున్నాడా?

ఖరుడిని గురించి ప్రసిద్ధంగా ఉన్నకథ ఒకటి ఇక్కడ ప్రస్తావించుకోవాలి. ఖరుడు శివభక్తుడు. శివుని పూజించి మూడు శివలింగాలు పొందాడు. వాటిని తన స్వస్థానానికి తీసుకువెళ్ళవలసి ఉంది. ఆ లింగాలను దారిలో ఎక్కడా కిందపెట్టరాదని శివుడు చెప్పాడట. కేరళలోని వైకోమ్ ప్రాంతానికి చేరేసరికి ఒక లింగాన్ని నేలమీద పెట్టవలసి వచ్చింది. అది అక్కడే భూమిపై నిలిచిపోయిందట. దానిని పెకలించలేక మిగతా రెండు లింగాలనూ ఖరుడు అక్కడే ప్రతిష్ఠించాడట. అక్కడ దక్షిణామూర్తిరూపం గురించి వినబడే కథలలో ఇదొకటి.

వాయిద్యాల ధ్వనులు - రాముని మీద పూల జల్లులూ - ఎలక్షన్‌లో గెలిచిన అభ్యర్థులను పార్టీ అనుచరులు ఊరేగించే దృశ్యంగా ఊహించుకోవచ్చు. ఒకటిన్నర ముహూర్తంలోనే రాముడు ఖర, దూషణాదులనూ, వారి సైన్యాన్ని 14 వేల రాక్షసులను చంపాడన్నారు. ఆటంబాంబు అయితేనో, విషవాయువు ప్రసరిస్తేనో సునామీతోనో, భూకంపంతోనో ఇంత విధ్వంసం క్షణాలలో జరుగుతుంది. (అర్ధాధిక ముహూర్తం అంటే మూడు గడియల కాలం అంటున్నారు.)

"అర్థాధిక ముహూర్తేన రామేణ నిశితైశ్వరై
చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమ కర్మణాం" (అరణ్య 30-35)

రాముని పరాక్రమానికి ఆశ్చర్యపడుతూ దేవగణాలు ఇళ్ళకు వెళ్ళారు. అనంతరమే సీతా, లక్ష్మణుడూ గుహలో నుంచి బయటకు వచ్చారు.

ఇది జనస్థాన ప్రజలను రాముడు నిర్మూలించిన కథ. దండకను ఆర్యమునులు ఆక్రమించిన తీరు ఇది. ఇప్పుడు భారతదేశంలో గిరిజనులు తమ స్థావరాలను కోల్పోతున్న కథలూ ఇలాగే ఉన్నాయి. ప్రతిఘటన పోరాటాలు సాగుతున్నాయి. కార్పొరేట్ సంస్థలు దేవగణాల లాగానే ఆనందంతో ఇళ్ళకు వెళ్తారా అనేదే చూడవలసి ఉంది.

అదివాసీల చరిత్రలో ఓడిపోయిన సందర్భాలున్నాయి. కాని లొంగిపోయిన సందర్భాలు లేవని చరిత్ర విశ్లేషకులు చెప్పే వాస్తవాలను ప్రభుత్వాలూ, ప్రజలూ గమనించ వలసి ఉంటుంది. రాజ్యశక్తులు ఎంతగా నిర్వీర్యం చేసినా కింది వర్గాల నుంచి నాయకత్వం వస్తూనే ఉంది. శూద్ర, అతిశూద్ర వర్గాలకు చెందిన రాజ్యాలు - గిరిజనుల రాజ్యాలూ బలంగా ఎదుగుతూనే వచ్చాయి.

పదో శతాబ్దానికి పూర్వం బోయల రాజ్యాలు ఉదయగిరి (నెల్లూరుకు వాయవ్యంగా) ప్రాంతంలో ఉండేవట. పదో శతాబ్దంలో (క్రీ.శ. 930) అక్కడికి తూర్పు చాళుక్య రాజులు ప్రవేశించి బోయలను తరిమేశారంటారు.

ఆ పరిసరాలలోనే పాలించిన పల్లవులు తొలుత ఆదివాసీ లేనంటారు. అయితే వారు బ్రాహ్మణ విధేయులు.

కాకతీయ సామ్రాజ్య స్థాపకులు శూద్ర వర్ణాలే అని ఒక వాదం ఉంది. మధ్యప్రదేశ్‌లో సాత్పురా పర్వత ప్రాంతాలలో పూర్వం గోండు రాజుల రాజ్యాలుండేవి.

ఆదిలాబాద్ ప్రాంతాలలోను గోండు రాజులు రాజ్యాలు పాలించారు. వరంగల్ జిల్లాలో దొరలుగా గ్రామాలు పాలించిన లంబాడీ కుటుంబాలున్నాయి.

స్థానికుల ఆర్థిక, మత విషయాలను నియంత్రించటానికి ఆర్య ధర్మం ఏదో ఒక రూపంలో ఇప్పటికీ బలప్రయోగం చేస్తూనే ఉన్నది.

దండకారణ్య భూములలోనూ, మధ్యప్రదేశ్‌లోనూ, ఉత్తరప్రదేశ్‌లోని కొన్ని ప్రాంతాలలోనూ ఉండే గిరిజన, ఆదివాసీ తెగల ప్రజలు ఈనాటికీ దేశీయ మూలాలు కలిగి ఉండి కూడా నాగరికతకు దేశసంపదకు విజ్ఞానశాస్త్ర ఫలాలకు సుఖజీవనానికి దూరమయ్యారు. వనరుల దోపిడీకి గురవుతున్నారు. మైదాన ప్రాంతాల ప్రజల స్వార్థపరత ఇందుకు చాలావరకు కారణమని ఒప్పుకోవలసిందే. ఉదాహరణకు బుందేల్‌ఖండ్, బాగేల్ ఖండ్ ప్రాంతాల కోలీలలో వారి వారి జీవిత విధానాలలో కొన్ని తేడాలున్నప్పటికీ భిన్న సంస్కృతి కలవారైనప్పటికీ వారు ఒకే మూలం గల తెగ. మధ్యప్రదేశ్‌లో వారు గిరిజన తెగలుగా లెక్కలోకి వచ్చారు. ఉత్తరప్రదేశ్‌లో షెడ్యూల్డ్ కులాల లెక్కల్లో ఉన్నారు. అడవులపై తమకుగల హక్కులు వదులుకుని, భూమి వదులుకుని, పరంపరాగతంగా ఉన్న వృత్తులు వదులుకుని ఈనాడు ప్రభుత్వ ఫ్యాక్టరీలలో గనులలో కూలీలుగా బతకవలసిన పరిస్థితి వారికి కలిగింది.

ఒకదేశపు వనరులను మరో దేశం దోచుకోవటం అనేది ప్రపంచ వ్యాప్తంగా కనిపించే వాస్తవం. సహజ వనరుల కోసం దురాక్రమణలకు దిగటం – రాజ్యాల మధ్య – దేశాల మధ్య యుద్ధాలు జరగటం – మామూలే. ఆఫ్రికాలోని 'కాంగో' దేశం ఇలాంటి దోపిడులకు చిరకాలంగా గురి అవుతూ వస్తున్నది. ఒకప్పుడు రబ్బరు కోసం బెల్జియం రాజు కాంగోపై దాడి చేశాడు. రెండో ప్రపంచయుద్ధం సమయంలో బాంబుల తయారీకి కావలసిన యురేనియం కాంగో నుంచే తీసుకున్నారు – బలవంతంగానే. అగ్రరాజ్యమైన అమెరికా ఇప్పటికీ అక్కడి గనుల నుండి నిధి నిక్షేపాలు తవ్వుకునిపోతూనే ఉన్నదట. ఇలాంటి సందర్భాలలో ఆ దేశ ప్రజలు నిస్సహాయులవుతున్నారు. గని కార్మికులుగా మారుతున్నారు. వారి చేత పనిచేయించుకోవటం సామ్రాజ్యవాద దేశాలు తమ హక్కుగా భావిస్తున్నాయి. తమ వనరులు తామే తవ్వితీసి పరాయి దేశానికి అప్పగించవలసిన దుస్థితిని ప్రశ్నించిన కార్మికులు అక్కడ వందలాదిగా హత్యలకు గురవుతున్నారు. అది కాంగో లోని పరిస్థితి.

భారతదేశంలో పరిస్థితి అలాంటిది కాదు. తమ వనరులను మరోవర్గానికి – అంటే పరాయి వర్గానికి – అప్పగించి తమను నిరాశ్రయులు చేయటం అనేది తమ దేశమే అమలు జరపడం ఇక్కడ జరుగుతున్నది. రాజులూ, రాజ్యాలూ ఉన్న కాలంలో అలా జరిగింది. రాజ్యాలన్నీ కలిసిపోయి అఖండ భారతదేశం ఏర్పడ్డాక, ప్రజాస్వామ్య

ప్రభుత్వం ఏర్పడినాక కూడా వనరుల/ఆస్తుల/భూముల దోపిడీ జరగటం, హింసాయుతంగా అవి అమలు జరగటం సహించరానిది.

భారతదేశ చరిత్ర అంతా వర్గపోరాటాల చరిత్ర. ఏ దేశ చరిత్ర అయినా ఇలాగే ఉండవచ్చు. కాని స్థానిక రాజ్యాలనూ సంస్కృతినీ నాశనంచేసిన వారిని దేవుళ్ళుగా కొలవటం ఈ దేశంలోనే జరిగింది - జరుగుతున్నది.

## దూషణాసురుడు

ఉజ్జయినీ క్షేత్రంలో మహా కాళేశ్వరుని గురించి చెప్పేటప్పుడు ఎన్నో యుగాల క్రితం ప్రజలను బాధించిన దూషణాసురుని ప్రస్తావిస్తారు. అతనిని చంపిన శివుడే మహా కాళేశ్వరుడని స్థల పురాణం చెబుతోంది. దూషణ (తిట్టటం) వల్ల బహుశః గో బ్రాహ్మణులను. నిందించటంవల్లనో కర్మకాండను ప్రశ్నించటం వల్లనో ఆ మానవుడు దూషణాసురుడై ఉండాలి. అతనిని అనార్య దేవుడైన శివునిచేతనే చంపించారు.

గోబ్రాహ్మణ నింద సహించలేని సమాజపు కట్టడి. ఇది.

జనస్థానంలో రాముని అరణ్యవాస సందర్భంలో రామునిచేత చంపబడ్డ ఖర దూషణాదులలోని దూషణాసురుడు ఇతడు కాకపోవచ్చును. గో బ్రాహ్మణులను నిందించిన స్థానికులలో దూషణాసురులు చాలామంది ఉండి ఉండాలి. ఈ పేరు సంస్కృతీకరించబడిన పేరే.

# కాలనేమి

కాలనేమి దైత్యవీరుడు. ఈ పేరు చాలా సందర్భాల్లో కనిపిస్తుంది. ఈ పేరుగల వారు చాలామంది ఉండి ఉంటారు.

1. రామాయణ కథలో కనిపించే కాలనేమి రావణుని మిత్రుడు. రామరావణ యుద్ధంలో లక్ష్మణుడు మూర్ఛపోయినప్పుడు హనుమంతుడు సంజీవని మూలిక కోసం వెళ్తుంటే ఆటంకాలు కలిగించాడు. ఆర్యులను తిరస్కరించిన దైత్యుడు.

2. అమృత మథనం కాలంనాటి కాలనేమి మారీచుని కొడుకు. సముద్రుని మిత్రుడు. అమృతం దైత్యులకు దక్కకుండా పోయిన సందర్భంలోనూ దేవగణాలతో దైత్యులు చేసిన ఇతర యుద్ధాలలోనూ కాలనేమి ప్రముఖ పాత్ర వహించాడు. అనేక పర్యాయాలు కాలనేమి దేవగణాలను తిప్పికొట్టాడు. సింహం ఎక్కి త్రిశూలం ధరించిన కాలనేమి కోటి మంది దైత్యులను వెంటపెట్టుకుని వస్తుంటే దేవగణాలు గడగడ వణికిపోయేవట. సింహాల వంటి వీరులు సింహాలు ఎక్కివస్తున్న అద్భుత దృశ్యాన్ని స్కంద పురాణం వర్ణించింది. నారదుడు కాలనేమి తపోబలాన్ని, వరబలాన్ని ఇంద్రునికి చెప్పి విష్ణువు వస్తే తప్ప కాలనేమిని ఎవరూ జయించలేరని చెప్పాడట. విష్ణువు కాలనేమితో యుద్ధంచేసి అతన్ని నేల కూల్చాడు. ఆ తర్వాత కిందపడి ఉన్న గాయపడిన అసురులను ఇంద్రుడు చంపటం మొదలుపెట్టాడు. అలాంటి వారిని చంపడం బ్రహ్మహత్యతో సమానమని నారదుడు ఇంద్రుణ్ణి ఆపాడు. దైత్యులు ఓడిపోయిన సంగతి శుక్రునికి తెలిసి మృత సంజీవని విద్యతో అందరినీ బ్రతికించాడు. ఆ విధంగా కాలనేమి బ్రతికాడు.

3. స్కంద పురాణం ప్రకారం "తారకాసురునికి, దేవగణాలకు జరిగిన యుద్ధంలోను కాలనేమి పాల్గొన్నాడు. దైత్యులు నిరాశపడిన సందర్భాలలో వారిని ఉత్తేజ పరిచాడు. ఒక దశలో మాయా యుద్ధం చేశాడు. తన శరీరాన్ని విస్తరించి ఆకాశమంతా అన్ని దిక్కులా నిండిపోయాడట. తన శరీరంలో నుంచే సూర్యులను పుట్టించాడట. దానితో చంద్రుడు కనపడకుండా పోయాడు. ముల్లోకాలు జ్వాలలతో నిండి కల్లోలపడగా దైత్యులు ఉత్సాహం తెచ్చుకున్నారు. సూర్యుడు తన మాయాబలంతో 'శంబరాస్త్రం' వేసి రూపాలు తారుమారు చేశాడట. దైత్యులకు దేవతల రూపం, దేవతలకు దైత్యుల రూపం వచ్చాయి. కాలనేమి శత్రువులనుకొని తనవారినే చంపాడు. కత్తులతో, బాణాలతో, గదతో, పిడి గుద్దులతో, పదికోట్లమందిని చంపాడు. 'నిమి'ని ఇంద్రుడనుకొని పట్టిలాగాడు. అప్పుడు నిమి అతనికి వాస్తవం చెప్పి బ్రహ్మాస్త్రంతో శంబరాస్త్రం మాయను ఛేదించవలసిందిగా చెప్పాడు. మాయ విచ్చిపోగానే సూర్యుడు మహేంద్రజాలంతో దైత్యులను, దానవులను తపింపచేశాడు. కాలనేమి దానిని ఎదుర్కొని వర్షం కురిపించాడు. వారి తాపాన్ని

తగ్గించాడు. వేలకొలది వాహనాలను, లక్షలకొలది యక్షులను, కిన్నరులను, పిశాచ ముఖ్యులను వధించాడు. (అప్పుడు యక్షులు, కిన్నరులు, ఇంద్రుని పక్షాన ఉన్నారు.) కుబేరునితోనూ ఇతడు యుద్ధం చేశాడు. విష్ణువుకు, కాలనేమికి జరిగిన యుద్ధాన్ని చాలా వివరంగా (110 శ్లోక పంక్తులతో) వర్ణించారు. స్కందపురాణం మహేశ్వర ఖండంలోని కౌమారిక ఖండంలో 18-19 అధ్యాయాలలో ఈ వివరాలు ఉన్నాయి. ఒక యుద్ధంలో ఇతడు అయిదు లక్షల యక్షులను, అయిదు లక్షల కిన్నరులను, ఏడు లక్షల పిశాచ వీరులనూ చంపాడట. ఈ సంఖ్యలు అతిశయోక్తులే (మహేశ్వర ఖండం కౌమారిక ఖండం. 2-19-27)

4. మత్స్య మహాపురాణం ప్రకారం కాలనేమి స్వతంత్ర ప్రతిపత్తిగల దైత్య నాయకుడు. ఆ వివరాలు ఇవి :

మత్స్య పురాణంలో (అధ్యాయం 171-177) మత్స్యుడు మనువుకు చెప్పిన వివరాలు ఇలా ఉన్నాయి. వృత్రాసురుని వధ తర్వాత దానవులు కోపంతో దేవగణాలనూ వారికి సహాయపడ్డ తమవారినీ యక్ష పన్నగ, పిశాచ రాక్షసులనూ కూడా చంపటం మొదలుపెట్టారట. సమయ సందర్భాలను బట్టి జాతుల కూటమి అప్పుడూ ఉండేది. దైత్యులు దానవులు కలసి ఉన్న సమయం అది. వారిదే ఆధిపత్య వర్గం అయింది. వారికి రాజ్యాధికారం వచ్చింది. ఒక్కోసారి స్థానిక జాతులయిన పిశాచ, పన్నగ వర్గాలు దేవగణాలతో కలుస్తూ ఉండేవి. (దీనిని ఇప్పటి రాజకీయాలలోని మిత్ర పక్షాల కూటమిగా చెప్పుకోవచ్చును) దానవుల చేతిలో ఓడిన దేవగణాలు నారాయణుని శరణు కోరారు. ఆయన అభయమిచ్చాడు. "దానవులు నా చేతిలో ఓడిపోతారు – ముల్లోకాలు మీకు వశపడతాయి" అని చెప్పాడు. అది ఇవతల వారికీ తెలిసింది. ఎవరికి వారు యుద్ధ ప్రయత్నాలు ముమ్మరం చేశారు. ఆ వివరణ అద్భుతంగా ఉంది. ఆ సందర్భంలో స్థానికంగా చాలా చోట్ల వారు ఒకరొకరితో ఘర్షణపడ్డారు. వారి యుద్ధాలలో మయుని రథానికి ఎలుగుబంటులు పూన్చారట. స్థానిక జాతులు కాబట్టి ఇలాంటి జంతురూపాలను వర్ణించారు. విరోచనుని రథానికి గాడిదలను కట్టారు. వరాహాలు, ఒంటెలు, మేఘాలూ కూడా వాహనాల జాబితాలో ఉన్నాయి. హయగ్రీవుని రథానికి గుర్రాలున్నాయి.

త్వష్ట రథానికి ఎనిమిది ఏనుగులు పూన్చారు. సైనికులలో పదాతులూ ఉన్నారు. సైన్యం కోసం జరిగిన ఏర్పాట్లలో సైన్యాన్ని వినోదపరచే ఏర్పాట్లూ ఉన్నట్టు వర్ణించారు. దేవతల పక్షంలో కొందరు యక్షులూ, గంధర్వులూ చేరారు. సైన్యం ముందు అప్సరసల నాట్యమూ, వేదగానమూ ఉన్నాయి. ఇంద్రుని రథం మీది జెండాపై 'నాగరాజు' బొమ్మ ఉంది. రథాలు, దుస్తులు, వాహనాలు అన్నీ విలువైన మణులు తాపడం చేసి మెరుస్తూ ఉన్నట్టు వర్ణించారు.

అసురులు మంత్రాలు వల్లిస్తుండటం గమనిస్తే దేవగణాలతో సమంగా అంతకంటే ఎక్కువగా ఈ స్థానిక జాతులు విద్యలు నేర్చి ఉన్నారని అర్థమవుతుంది.

ఒక యుద్ధంలో దానవులు గెలుస్తున్నట్లు కనబడగానే ఇంద్రుడు తమస్సు సృష్టించాడు. దాన్ని చీల్చటానికి మయుడు ఔర్వాగ్ని సృష్టించాడు. ఊర్వుడు అనేముని గురించీ యోగం గురించీ అతని తపస్సు గురించీ బ్రహ్మచర్యం గురించి ఇక్కడ చాలా చెప్పారు. పూర్వం అతడు తన తొడను మధించుకుని అగ్ని వంటి పుత్రుని సృష్టించాడు. అతడే ఔర్వుడు. అతనిని హిరణ్యకశిపుడు గురువుగా సంభావించి ప్రసన్నం చేసుకున్నాడు. ఆ ప్రభావంవల్ల దానవులు బలవంతులుగా ఉన్నారు.

ఔర్వాగ్ని నుండి బయటపడటానికి దేవతలు నానా కష్టాలు పడ్డారు. వాయువు, వరుణుడూ కలిసి ఆ అగ్నిని చల్లార్చారు. ఆ దశలో కాలనేమి విజృంభించాడు. ఆ యుద్ధాన్ని గొప్పగా వర్ణించారు. కాలనేమి ధాటికి ఇంద్రుడు కదలలేని వాడయ్యాడు. వరుణుడు, ఇతర దిక్పాలకులు ఇతని వశమయ్యారు. ప్రపంచంలోని తత్వాలన్నీ కాలనేమిని సేవించాయి.

విష్ణువు మీద కాలనేమికి జాతివైరం ఉంది. “మా పూర్వుల శత్రువు ఇతడు. మధు కైటభులను చంపినవాడు. ఇతనివల్లనే మాకూ దేవగణాలకు తగవులు వస్తున్నాయి. ఇతడు స్త్రీల విషయంలోనూ బాలుర విషయంలోనూ దయలేనివాడు. అనేకమందిని చంపాడు. బాలుర తండ్రులనూ, స్త్రీల భర్తలనూ చంపాడు. వారికి దుఃఖం కలిగించాడు.” అని కాలనేమి విష్ణువును నిందించాడంటే అటువంటి సంఘటనలు ఎన్నో జరిగే ఉంటాయి. ఆ విషయాలు మరుగున పడేసి పురాణకర్తలు పరోక్షంగా కాలనేమి చేత విష్ణు సంకీర్తనం చేయించారు. నిందాస్తుతి అంటూ నిందలన్నీ స్తుతులుగా చెప్పారు. కాలనేమి విష్ణువును అనరాని మాటలన్నాడని రాశారు. విష్ణువును తిడుతూ అనేక చేతులతో అతని మీదికి యుద్ధానికి వెళ్ళిన కాలనేమి విష్ణువును గాయ పరచటం, గరుడుని గాయపరచడం, విష్ణువు చక్రం ప్రయోగించడం వివరంగా చెప్పారు. నారాయణుడు (విష్ణువు) శరీరాన్ని పెంచి పాదాలతో భూమిని ఆక్రమించి బాహువులతో దిక్కులు ఆక్రమించి చక్రం ఎత్తి కాలనేమి చేతులు నరికాడు. తర్వాత అతని నూరు శిరస్సులు నరికాడట. (కాలనేమికి నూరు తలలు,.నూరు చేతులూ) విష్ణువును విశ్వవ్యాపిగా భూమ్యాకాశాలు నిండిన రూపంతో వర్ణించడానికే ఇదంతా చెప్పారు. చేతులు, శిరస్సులు తెగి కూఢా కాలనేమి మొండెం అలాగే నిలిచి ఉన్నదట. అప్పుడు గరుడుడు ఆ దేహాన్ని పడగొట్టాడు.

కాలనేమిని అత్యంత ప్రయాసతోనే చంపగలిగారు. కాలనేమి శస్త్ర విద్యలు, అస్త్ర విద్యలు తెలిసిన వీరుడు. మంత్రపూర్వకంగా వేసే అస్త్రాలు దైత్యులకూ తెలుసు. దేవగణాల కంటే మిన్నగా వీరికి రసాయన విద్యలూ, ఔషధ విద్యలూ తెలుసు. స్త్రీలు చికిత్సా విధానాలలో నిష్ణాతులుగా ఉండేవారు. అధర్వణవేదం ప్రకారం క్షయ, కుష్ఠు వంటి

రోగాలకు 'ఆసురీ' చికిత్స చేసేవారు 'ఆసురి' అంటే అసుర సంబంధమైనది అసుర స్త్రీలు చేసేది అని చెప్పుకోవచ్చు. ఇప్పటికీ గిరిజన ఆదివాసీ స్త్రీలు వైద్యంలో చెట్ల మందులు వాడటంలో నిష్ణాతులు. వాటిని మంత్రపూర్వకంగా ఇవ్వటం ఇప్పుడూ ఉంది.

కాలనేమి పేరుతో మరికొందరున్నారు. ఒక కాలనేమి కూతురు బృంద, జలంధరుని భార్య. జలంధరుడు దేవగణాలతో యుద్ధం చేస్తున్న సమయంలో విష్ణువు జలంధరుని రూపంలో వచ్చి బృంద పాతివ్రత్యాన్ని భంగపరిచాడు. ఆ తర్వాతనే జలంధరుని యుద్ధంలో చంపగలిగాడు. బృంద విష్ణువుని శపించింది. ఆమె తులసిగా భూలోకంలో పూజలందు కుంటుందని విష్ణువు వరం ఇచ్చాడు.

జలంధరుడు గొప్ప పరాక్రమవంతుడు. సజ్జనుడూ అని పురాణాలే చెబుతున్నాయి. రాజకీయ, సామాజిక ప్రయోజనాల కారణంగానే అమాయకులూ, నిరపరాధులూ కూడా యుద్ధాలలో పాల్గొనవలసి రావటం; వారి స్త్రీలు శత్రువుల ద్వేషాలకు, దురాగతాలకు బలి అవుతూ ఉండటం సామాన్యంగా కనిపించే విషయం. ఒక కాలనేమి తర్వాతి జన్మలో కంసుడుగా పుట్టాడట. మాళవదేశపు ఒక బ్రాహ్మణుని పేరు కాలనేమి. అతడు యజ్ఞ దత్తుని కొడుకు. (కథాసరిత్సాగరం). 'కాలనేమి' అనే పేరు శౌర్యానికీ, జ్ఞానానికీ ప్రతీకగా పురాణ కథలలో నిలిచింది.

# మారీచుడు

"మారీచుడు" అనే పేరు అసుర సమాజంలో సాధారణంగా కనిపిస్తుంది. రామాయణం బాలకాండ (24-26, 27) ప్రస్తావించిన మారీచుడు నాగరాణి తాటక కొడుకు.

"తాటకానామ భద్రంతె...మారీచో రాక్షసః
పుత్రో యస్యాః శక్ర పరాక్రమః నిత్యం త్రాస యతే ప్రజా..."

(మారీచుడు తాటక కొడుకు. ఇంద్రుని వంటి పరాక్రమం కలవాడు. రాక్షసుడు. నిత్యమూ ప్రజలను బాధిస్తూ ఉంటాడు.)

ఈ పరిచయ వాక్యాలు మునులు (పురోహితవర్గం) రాజుకు (పాలకవర్గానికి) చెప్పినవి. ఆ ముని పేరు ఏదైనా కావచ్చు. విన్న రాజు ఎవరైనా కావచ్చు కాని అప్పటి సమాజపు వర్గ వైరుధ్యాలను స్పష్టంగా చెబుతున్న మాటలు ఇవి. తమ విరోధులను రాక్షసులుగా తిట్టిపోయటం అప్పటి నుంచీ ఉన్న వ్యవహారమే. శతాబ్దాల పూర్వపు ఆ స్థితి ఈనాటికీ కొనసాగుతున్నది.

రామాయణం బాలకాండలో విశ్వామిత్రుడు ప్రస్తావించిన ఈ రాక్షసులు నిత్యమూ ప్రజలను బాధిస్తుండేవారట. ప్రజలంటే ఎవరో అక్కడ వివరాలు లేవు. తాటక, మారీచుడు, దండకలో పాలకవర్గం వారు. వారు దండకలోని ప్రజలను బాధిస్తున్నట్టయితే ఆ పాలకులు తమ ప్రజలనే బాధిస్తున్నట్టు అనుకోవాలి. ఇప్పటి ప్రజా ప్రభుత్వాల లాగానే వారూ సామాన్యులను పత్తి రైతులనూ ఆదివాసీలనూ వేధించారా లేక ప్రక్క రాజ్యాల ప్రజలను బాధిస్తూ వచ్చారా? అలా అయితే ఆ విషయం మునులు చెప్పే వరకు ఆయా రాజులకు తెలియలేదన్నట్టేనా?

దండక భూములలో యజ్ఞాలూ, యాగాలూ, తపస్సులూ చెయ్యటానికి వెళ్ళిన వారికి అక్కడి వారు ఏమైనా ఆంక్షలు పెట్టారేమో. "మీ ఆచారాలు మా రాజ్యంలో సాగవు" అని చెప్పారేమో. వలసదారులనూ, మతప్రచారకులనూ జాగ్రత్తగా గమనించటం రాజుల పాలనా సామర్థ్యమే అవుతుంది గాని హింస అనిపించుకోదు. అయితే భారతదేశపు పురాణ సాహిత్యం వలసవాదాన్నీ, మతతత్వాన్నీ సమర్థించటమే గాక స్వధర్మ రక్షణాపరులను రాక్షసులుగా చిత్రించి సాహిత్యంలో స్థిరపరచి ప్రామాణికం చేసింది.

అయోధ్య రాజుల ప్రతినిధిగా రాముడు దండకలో ప్రవేశించి అక్కడి ప్రజలను సంహరించటం దానిని ప్రజారక్షణగా చెప్పుకోవటం ఎలా ఉందంటే ఇరాక్ ప్రజలను రక్షించటం కోసం అమెరికా తన సైన్యాలను ఇరాక్‌కు పంపి ఇరాక్ పాలకుడైన సద్దాం హుస్సేన్‌ని సకుటుంబంగా హతమార్చినట్టే ఉంది. ఎవరినైనా చంపాలంటే వారు ప్రజా కంటకులనీ, రాక్షసులనీ ప్రచారం చేసి చంపటం ఆర్యనీతి.

మారీచుడు అలాంటి నీతికి బలి అయినవాడే.

మారీచుని తండ్రి సుందుడు. సుందుని తండ్రి జంభాసురుడు. వీరంతా యక్ష కుటుంబాల వారు. జక్కులవారినే పురాణాలు యక్షులుగా ప్రస్తావించాయి. ఇప్పటి ఆదివాసీల లాగానే తమ సంస్కృతినీ, సంపదనూ కాపాడుకునే ప్రయత్నంలో వారు ఆర్యరాజులనూ, మునులనూ ఎదుర్కొన్నారు. ఆ ఘర్షణలలోనే జంభుడు అగస్త్యుని చేతిలో మరణించాడు. అగస్త్యుని శాపాగ్నికి గురి అయ్యాడూ అంటే కాల్చివేయ బడ్డాడనే అర్థం. అప్పుడు శాపాగ్నులు, ఇప్పుడు తుపాకులు. "శాపానికి పూర్వరూపం 'సోపద'" – అంటే శిక్ష అని అర్థం. మత నియమాలను అతిక్రమించిన వారికి వేసే శిక్షను జైనమతంలో 'సోపద' అంటారు. ఈ విధానాన్నే వైదిక ఆర్యులు అనుసరించారు. మునులు వేసిన శిక్షలన్నీ 'శాపాలు'గా ఆర్యవాఙ్మయం చెప్పింది.

జైనం ప్రబలంగా, ప్రజల జీవన విధానంగా ఉన్నప్పటి సమాజాన్ని వైదికమతం నిరసించి వ్యతిరేక ప్రచారం చేసింది. జైనాన్ని అంటిపెట్టుకునే ఉంటూ వైదికమతాన్ని అనుసరించని వారిని ఆర్యమునులు 'సోపద'లకు (శాపాలకు) గురిచేశారు. ఈ శాపాలు శిక్షా రూపాలు.

ఆ శిక్షలకు విచారణ, అప్పీలు ఉండవు. సుందునికి పడిన శిక్ష అదే. తన తండ్రిని ఎందుకు చంపారని అడగటానికి వెళ్ళిన మారీచునీ, అతని తల్లి తాటకనూ కూడా అగస్త్యుడు శపించాడు. మునులు వారిని చిత్రహింసలు పెట్టారు. శారీరకంగా వికృత పరచారు. నరమాంసం తింటూ బతకాలన్నారు.

ఆహార విహారాలలో కొందరిని నియంత్రించారనటానికి ఇది ఉదాహరణ. మాల మాదిగలు ఇత్తడి సొమ్ములే ధరించాలనీ, మలినమైన చిరిగిన బట్టలేకట్టుకోవాలనీ, చచ్చిన పశువుల మాంసం తినాలనీ చెప్పిన సమాజానికి మూలాలు రామాయణ వ్యవస్థలో – కథలలో కనబడతాయి.

దండకలోని ప్రజలనూ, పాలకులనూ వైదిక సమాజం ఎలా శిక్షించిందో ఈ ఘట్టంలో వివరంగా ఉంది. బూటకపు ఎన్‌కౌంటర్లను ప్రశ్నించినందుకు వారికి ఈ శిక్షలు పడ్డాయి. సుందుని హత్య ఎందుకు ఎలా జరిగిందో ఎవరూ చెప్పలేదు. అడగటానికి వెళ్ళిన భార్యనూ, కొడుకునూ కూడా శిక్షించారు. కొంచెం ఆలోచిస్తే ఇందుకు కారణాలు స్పష్టంగానే తెలుస్తాయి. తమ అటవీ భూములను ఆక్రమించుకోరాదనీ – తమ భూములలో యజ్ఞాలు, యగాలు – జంతు బలులు హోమాలు చేయరాదనీ దండకలోని నాగ యక్ష జాతులు పట్టుబట్టినందుకే ఈ శిక్షలు వారికిపడ్డాయి. ఈనాడూ ఆదివాసీలపై గిరిజనులపై ఇలాంటి హింసాకాండ అమలవుతున్నది.

మారీచుని కథ ఇంతటితో ఆగలేదు. ఒకనాడు అయోధ్య రాకుమారులు వచ్చి తాటకను నిర్దాక్షిణ్యంగా హత్యచేసి వెళ్ళిపోయారు. ఆమె ఒంటరిగా, నిరాయుధురాలిగా

ఉన్న సమయంలో ఈ హత్య జరిగింది. మారీచుడు ప్రతీకారం తలపెట్టకుండా ఉండగలడా? తల్లినీ, తండ్రినీ హత్యచేసిన వైదిక మునులపై ద్వేషం పెంచుకోకుండా ఉండగలడా?

మారీచునికీ అతని మిత్రుడు సుబాహునికీ ఆర్య సంప్రదాయాలు నచ్చలేదు. తమపై వారు చూపే ఆధిపత్య ధోరణీ నచ్చలేదు.

విశ్వామిత్రుని యాగం సందర్భంలో మారీచుడు తన అనుయాయులతో ఆ యాగాన్ని సాగనీయకుండా అడ్డుపడ్డాడు. యాగ రక్షకులుగా ఉన్న రామలక్ష్మణులతో తలపడ్డాడు. కాని వారి ఆయుధాల ధాటికి తట్టుకోలేకపోయాడు. రాముని బాణపు దెబ్బకు దూరంగా సముద్రంలో పడ్డాడు.

మారీచుని రాజ్యం "మాచర్ల" ప్రాంతంగా చెబుతుంటారు. త్రేతాయుగంలో పల్నాటి సీమ దండకారణ్యంలో భాగంగా ఉండేది. అది అసురులు పాలించిన ప్రాంతం.

బాలకాండ తర్వాత మారీచుని ప్రసక్తి మళ్ళీ అరణ్యకాండలో కనిపిస్తుంది. రావణుడు మారీచుని దగ్గరకు వచ్చి సీతను అపహరించేందుకు అతని సహకారం కోరాడు. మారీచుడు కామరూపి. కోరిన రూపం ధరించగల విద్య అతని దగ్గర ఉంది. మారీచుడు రావణుని ప్రోత్సహించలేదు, పైగా నిరుత్సాహపరిచాడని రామాయణం చెబుతోంది.

అప్పటికే రామునిపై పగ సాధించటానికి తాను ప్రయత్నించి భంగపడినట్టు మారీచుడు రావణునికి చెప్పాడు. పగ గురించి చెబుతూనే అతడు రాముడిని పొగిడాడని రాశారు. శత్రువుల చేత కూడా రామ కీర్తన చేయించటం పురాణకర్తల మతతత్వ ధోరణికి అద్దం పడుతున్నది. సీతారాములు అరణ్యవాసానికి వచ్చారని తెలిశాక తాను మళ్ళీ పగ సాధించే ప్రయత్నాలు చేశాననీ, ఒక మృగంగా మారి రాముడిని పొడవటానికి వెళ్తే రాముడు మూడు బాణాలతో తనను కొట్టాడనీ ఆ గాయాల బాధ ఇంకా ఉన్నదనీ మారీచుడు చెప్పుకున్నాడు. (అరణ్య సర్గలు 35-41). సీతను అపహరించి రామునితో వైరం తెచ్చుకోవద్దని మారీచుడు రావణునికి హితవు చెప్పాడు. 'రాముని దగ్గరకు వెళ్ళి పరాక్రమం చూపేవాడు ప్రాణాలతో తిరిగిరాడని' మారీచుడు అన్నట్టుగా రామాయణకర్తలు రాశారు. రాముడు జనస్థానంలో రాక్షస స్త్రీలను అవమానించి పద్నాలుగు వేలమంది రాక్షసులను (ఖర, దూషణాదులను) చంపి ఆ అరణ్యాన్ని మునులను, దేవగణాలకు అప్పగిస్తుంటే రాక్షస రాజు అయిన రావణాసురుడు కలగజేసుకున్న సందర్భం అది. రాముని భార్య సీతను అపహరించి రామునికి పాఠం చెప్పాలని రావణుని ఆలోచన.

"బంగారు లేడి రూపంలో సీతను ఆకర్షించు. లేడి కోసం రాముడు ఇటురాగానే నేను సీతను అపహరిస్తాను. ఈ సాయం చెయ్యి" అని రావణుడు మారీచుని అడిగాడు.

మారీచుడు అప్పటికే నారచీరలు ధరించి సన్యాసిలాగా జీవితం గడుపుతున్నాడట. "రాముడితో వైరం వద్దు. ఆయన గొప్ప పరాక్రమవంతుడు. నామీద అప్పుడెప్పుడో వేసిన బాణాల బాధ నేను ఇంకా మరచిపోలేను. 'ర'శబ్దం వింటేనే భయపడుతున్నాను" అంటూ

రావణుని నిరుత్సాహపరచాడని రాశారు. మారీచుడు రావణునికి రాజనీతి చెప్పబోవటం, అతడు తిరస్కరించటం సంభాషణ 5 సర్గలలో ఉంది. అప్పటికి మారీచుడు శ్రమణకునిగా జీవితం గడుపుతున్నాడని అర్థమవుతున్నది.

"నా పరాక్రమం తెలిసే విశ్వామిత్రుడు రాముడిని యాగరక్షణ కోసం తెచ్చుకున్నాడ"ని చెప్పిన మారీచుడు, చివరకు 'ర' అంటేనే భయపడుతున్నానని చెప్పటం గురించీ నమ్మదగినదిగా లేదు. మారీచుడు రాక్షసుల సంస్కృతి – లంకా నగరాన్ని గురించీ మాట్లాడుతూ లంకా నగరవాసులు నృత్యగాన ప్రియులు అనీ, రకరకాల వేడుకలు కలిసి చేసుకునేవారనీ, సామాజిక ఉత్సుకత కలిగినవారనీ చెప్పటం గమనించాలి. ఎక్కువ తక్కువ, ధనిక పేద తారతమ్యాలు లేకుండా కలసిపోయి ఉండే ప్రజలు అసురులు, అంటూ తన సంస్కృతిని గురించి గర్వంగా చెప్పుకున్న మారీచుడు మొదట రావణుని నిరుత్సాహ పరిచినా తర్వాత అతని ప్రయత్నానికి సహకరించాడు. బంగారు లేడిగా సీతను ఆకర్షించాడు. ఆ ప్రయత్నంలో రామబాణంతో నేల కూలాడు. మరణ సమయంలో "సీతా లక్ష్మణా" అని కేకలు వేయటం వల్ల పర్ణశాలలో సీతకు రక్షణగా నిలిచిన లక్ష్మణుడు సీతను వదలి రావటమూ, ఆ సమయంలో రావణుడు ఆమెను అపహరించటమూ జరిగాయి.

ఒక విధంగా తల్లిదండ్రుల హత్యలకు మారీచుడు ప్రతీకారం తీర్చుకున్నాడనవచ్చు. మారీచుని కొడుకు కాలనేమి. అసుర వీరులలో ప్రముఖుడు.

బూటకపు ఎన్‌కౌంటర్లు శతాబ్దాల క్రితపు సంస్కృతిగా వైదిక సమాజంలో కనబడటం గమనించదగ్గది. ఇప్పటికీ ఇరవై ఒకటో శతాబ్దంలోనూ తాటక, సుందుడు, మారీచుడు ఆదివాసీలలో కనబడుతూనే ఉన్నారు. ప్రభుత్వ వర్గాలు, కార్పొరేట్ సంస్థలు, తమను దోచుకుంటున్న ప్రతి సందర్భంలోనూ, ఛత్తీస్‌గడ్, సర్కెగూడాలలో గాని, ఒడిశా పోస్కోస్టీల్ ప్లాంటు ప్రతిఘటనలలో గాని శ్రీకాకుళంలో, విశాఖలో ఎన్నెన్నో చోట్ల వారి స్ఫూర్తి ఉద్యమాలను నడిపిస్తున్నది.

నాగరిక సమాజానికి వారి సౌకర్యాలకూ, గిరిజనుల అటవీ సంపద కావాలి. వారి వనరులు కావాలి. యజ్ఞాలకు ప్రాజెక్టులకు వారి భూములు కావాలి. సంపన్న వర్గాల పొలాలు తడపటానికి గిరిజనులను, పేదలను భూమిలేని వారుగా బతుకులేని వారిగా చేస్తున్న ఈ విధానాలను ప్రశ్నించటం అప్పుడూ నేరమే అయింది. ఇప్పుడూ నేరమే అవుతున్నది. పాలక వర్గాల రాజనీతి, దండనీతి ఇలాగే సాగితే ఈ దేశంలో మానవత్వం ఎటుపోతుందో ఆలోచించాలి.

# రామరావణ యుద్ధం

రామ రావణ యుద్ధం భారతదేశంలో అత్యధిక శాతం ప్రజలకు ఆసక్తికరమైన అంశం. రావణవధ జరిగాక రామరాజ్యంలో అందరూ సుఖ సంతోషాలతో ఉన్నారనే భ్రమలు చాలా ఉన్నాయి. "బలి రాజ్యం రావాలి" అని స్థానిక ప్రజలు కోరుకోవటాన్ని మరపించటానికి రామరాజ్యాన్ని ప్రచారం చేశారు.

రామాయణంలో రాముని పాత్రను బుద్ధుని గుణ శీలాలతో మలిచారు. బుద్ధుడిని ప్రజలు మరిచిపోయేలాగ రాముడిని తెరపైకి తెచ్చారు. అంత గొప్ప నాయకుడు (హీరో) ఉన్నప్పుడు ప్రతినాయకుడు (విలన్) అతనికి దీటుగానే ఉండాలి. స్త్రీలూ ప్రజలూ ఇష్టపడే రీతిలో రాముడ్నీ ప్రజలు ద్వేషించే రీతిలో రావణుడినీ గుణశీలాలతో తీర్చిదిద్దారు. అయినా రామునిపాత్ర రావణుని ముందు తీసికట్టే అయింది.

రామ రావణ యుద్ధాన్ని చాలా గొప్పగా వర్ణించారు.

"గగనం గగనాకారం, సాగరః సాగరో పమ

రామరావణ యోర్యుద్ధం రామరావణ యోరివ." (యుద్ధ. 110-23, 24)

ఆకాశానికి ఆకాశమే సాటి సాగరానికి సాగరమే సాటి. రామరావణ యుద్ధానికి సదృశమైనది రామరావణ యుద్ధమే అన్నారు.

రావణుడు రాక్షస ప్రభువు. 32 కోట్ల ప్రజలకు పాలకుడట. ఇతని రాజధాని లంక. రావణుని తండ్రి విశ్రవసువు. తల్లి కైకసి. రావణుని భార్య మండోదరి మయుని కూతురు. రావణుని రావణ బ్రహ్మగా చెబుతూంటారు. విశ్రవసుని విశ్రవో బ్రహ్మగానూ చెబుతారు. జ్ఞానానికి సూచనగా బ్రహ్మ బిరుదం వారికి వచ్చింది.

రావణుడు గొప్ప తపశ్శాలి. అతని గురించి ప్రచారంలో ఉన్న కథలు అతని మూర్తిమత్వాన్నీ, పరాక్రమాన్నీ విశదం చేస్తున్నాయి. లంకానగరాన్ని విశ్వకర్మ నిర్మించాడట. సుకేశి కొడుకులయిన మాలి, సుమాలి, మాల్యవంతుడు అనేవారు లంకా నగరంలో ఉండేవారు. వారు బ్రహ్మనుద్దేశించి తపస్సుచేసి వరాలు పొందారు. అయినప్పటికీ ఇంద్రుడు వారితో యుద్ధంచేసి వారిని ఆ నగరం నుండి వెళ్ళగొట్టి లంకానగరాన్ని కుబేరునికి ఇచ్చాడు. తర్వాతి కాలంలో సుమాలి కూతురి కొడుకు రావణుడు బలవంతుడై తన తాతల నగరాన్ని వశపరచుకున్నాడు. కుబేరుని పుష్పక విమానం కూడా తీసుకున్నాడు.

పరస్త్రీలను చెరపట్టటం రావణునికే ప్రత్యేకమైన దుర్గుణంగా కథలు ప్రచారం చేశారు. కొన్ని పురాణ కథల ప్రకారం సీతకంటే ముందు రావణుడు సీత అత్తగారైన కౌసల్యను ఆమె పెళ్ళికి ముందే అపహరించి ఒక పెట్టెలో దాచిపెట్టాడట. కౌసల్య కొడుకువల్ల తనకు మరణం ఉన్నదని తెలిసి ఆ పనిచేశాడట. అప్పుడు వరదలు రావటం

– దశరథుని ఓడ వరదల్లో చిక్కుకోవటం – అదృశ్యశక్తులు కౌసల్య ఉన్న పెట్టెను అక్కడకు చేర్చటం – కౌసల్యా, దశరథులకు జటాయువు వివాహం జరపటం – వంటి అద్భుత సన్నివేశాలతో ఆ కథ ప్రచారమైంది.

ఒక కథ ప్రకారం సీత, మండోదరి రావణుల కూతురేనంటారు. ఆమె కారణంగా రావణునికి మరణం ఉన్నదని తెలిసి ఆమెను పెట్టెలోపెట్టి వదిలేస్తే ఆమె జనకునికి దొరికింది. సీత ఎవరో తెలియక రావణుడు ఆమెను అపహరించాడు – స్త్రీల అపహరణలు – దివ్యశక్తులు – అద్భుత సంఘటనలు ప్రాచీన గ్రీకు తదితర వాఙ్మయాల్లో కనిపిస్తాయి. తమిళంలో 'సంగం' కాలపు 'మణిమేఖల' కథలోనూ ఇలా ఎవరో ఎత్తుకుపోవటాలు – తిరిగి కలుసుకోవటాలు అదృశ్యశక్తుల ప్రమేయాలు కనిపిస్తాయి. భాగవతంలో కంసుడు దేవకి అష్టమ సంతానంవల్ల తనకు మరణం సంభవిస్తుందని తెలుసుకుని దేవకిని చెరసాలలో పెట్టటంలోనూ అదృశ్యశక్తుల ప్రమేయం కనిపిస్తుంది. ప్రజలు పరంపరగా రామాయణంలోనిగా చెప్పుకునే చాలా సన్నివేశాలు వాల్మీకి రామాయణంలో కనబడవు.

సీత స్వయంవరానికి రావణుడు కూడా వచ్చి శివధనుస్సు ఎత్తలేక భంగపడ్డాడనీ కొందరూ, శివధనుస్సు మీద గౌరవంతో దానికి నమస్కరించి వెళ్ళిపోయాడని కొందరూ చెబుతారు.

రావణుడు బలగర్వితుడు. బలగర్వంతోనే అతడు నష్టపోయాడంటారు. "అతి రూపాత్ హృతా సీతా, అతి గర్వాచ్చ రావణః... అతి దానాత్ బలిర్బద్ధః అతి సర్వత్ర వర్జయేత్" అనేది నీతి. (అందంగా ఉండటంవల్లనే (అతిరూపం) సీతను అపహరించారు. గర్వాతిశయంతో రావణుడు నశించాడు. అతిగా దానాలు చేసి బలి బంధింపబడ్డాడు. అందుకే అతి పనికిరాదు.) రావణుడు పదివేల సంవత్సరాలు తపస్సుచేసి బ్రహ్మను మెప్పించాడు. ఆ శక్తులతో దేవలోకంమీద దండెత్తాడు. ఇంద్రుడు విష్ణువు సహాయం కోరాడట. విష్ణువు నేర్పుగా తప్పించుకున్నాడు. "ఈసారికి నీవే దేవగణాలను కూర్చుకుని యుద్ధం చెయ్యి. ఆనక రావణుడిని నేనే చంపుతాను..." అన్నాడు. అహమేవ నిహంతాస్మి రావణం ససుతం యుధి...(26-20) అప్పుడు జరిగిన ఒక యుద్ధంలో మేఘనాధుడు (రావణుని కొడుకు) ఇంద్రుడిని బంధించి లంకకు తీసుకు పోయాడు. బ్రహ్మ వెళ్ళి ఇంద్రుడిని విడిపించుకున్నాడు. అందుకే మేఘనాధుడు 'ఇంద్రజిత్తు'గా పేరు పొందాడు. ఆ తర్వాతనే రాముడు భూలోకంలో అవతరించాడు. అతనికి సాయంగా దేవగణాలన్నీ తమ తమ శక్తులతో భూలోకంలో అవతరించటం జరిగింది. విష్ణువు ఆయుధాలు కూడా భూలోకానికి దిగివచ్చాయి. రామావతారం అప్పటిది. అంటే రావణుని కొడుకు కంటే కూడా రాముడు ఒక తరం చిన్నవాడన్నమాట.

రావణుని గురించిన కథలు చూస్తే రావణులు చాలామంది ఉన్నారా అని అనుమానం వస్తుంది. మైరావణుడు (మహిరావణుడు) జానపద కథలలో ప్రసిద్ధుడు.

దక్షిణా పథంలో ఆర్యులను ఎదుర్కొన్న స్థానిక తెగల నాయకులు 'రావణులుగా' ప్రశస్తి పొందారేమో. ముండా జాతి వారిలో "ఉరవన్" శాఖ వారు తమను రావణ సంతతిగా చెప్పుకుంటారు.

రామ రావణ యుద్ధానికి కారణం రావణుడు సీతను అపహరించటం కాదు: రాముడు జనస్థానాన్ని నాశనం చేయటం.

తాను ఎంతో అపురూపంగా చూసుకుంటున్న జనస్థానం నిర్మానుష్యమయిందని రావణునికి తెలిసింది. శూర్పనఖ కంటే ముందుగానే అకంపనుడు ఆ వార్త చెప్పాడు. అప్పుడే రావణునికి ఆగ్రహం కలిగింది. సోదరుల మరణవార్త విని రావణుడు తానే స్వయంగా రామలక్ష్మణులను చంపటానికి సిద్ధపడ్డాడు. తొందరపాటు తగదని అకంపనుడు హెచ్చరించాడు. బలప్రయోగం కంటే వేరే ఉపాయం ఆలోచించాలన్నాడు.

"రాముని భార్య అతిలోకసుందరి. ఆమె లేకుంటే రాముడు జీవించలేడు. సీతను అపహరించుకువస్తే ఆమె వియోగంతో రాముడు మరణిస్తాడు. ఆ వెనుక లక్ష్మణుడూ మరణిస్తాడు" అని సూచించాడు. సీతను ఎత్తుకు రావాలన్న ఆలోచన రావణునికి అలా కలిగింది. అప్పుడు రావణుడు మారీచుని ఆశ్రమానికి వెళ్ళాడట. మారీచుడు రాముని గురించి గొప్పగా చెప్పి రావణుని నిరుత్సాహ పరిచాడు. "నీ భార్యతో నీవు సుఖంగా ఉండు. రాముడిని అతని భార్యతో సుఖపడనీ, అనవసరంగా వినాశనం ఎందుకు?" అని సర్దిచెప్పి పంపేశాడు.

ఆ తర్వాతనే శూర్పనఖ రావణుని దగ్గర సీత సౌందర్యాన్ని వర్ణించి "ఆమె నీకు తగిన భార్య అవుతుందని" చెప్పి యుద్ధానికి ప్రోత్సహించింది. శత్రువుని చంపి అతని అంతఃపుర జనాన్ని తమ అంతఃపురంలో చేర్చుకోవటం ఒకప్పటి సంప్రదాయం. అందుకే రాజులు తాము ఓడిపోతామనే సందేహం కలిగినప్పుడు తమ అంతఃపురాలను ఆత్మాహుతికి సిద్ధం చేసేవారు. స్త్రీలు పురుషుల సంపద. వారికి నిర్ణయాధికారాలు లేవు.

అకంపనుడు – శూర్పనఖ – చెప్పిన మాటలతోనే రావణుడు సీతను అపహరించ టానికి బయలేరాడు. రాక్షస రాజుగా అతనికి ఈ ప్రతిచర్య తప్పనిసరి అయింది. సీతను ఎత్తుకు వచ్చినా ఆమెను గౌరవంగా చూశాడు.

ఆర్య అనార్య నేపథ్యాలతో ఆలోచిస్తే ఈ సంఘటనలలో వాస్తవాలు – వక్రీకరణలు – స్పష్టమవుతాయి. ఆర్యేతర స్త్రీలపట్ల ఆర్యుల క్రూర ప్రవర్తనను సమర్థించుకునే క్రమంలో ఆర్య పౌరాణికులు రావణుని దుష్టునిగా ప్రచారం చేశారు. రాముని అవతార పురుషునిగా నిలబెట్టారు. రావణుని లంకా నగరంలోని సైన్యవ్యవస్థను రామాయణం అతిశయంగానే చెప్పింది. నగరం తూర్పు ద్వారంవైపు 10,000 సైన్యం – దక్షిణంలో 1,00,000 (లక్ష) సైన్యం, పడమటి ద్వారం వైపు 10 లక్షల సైన్యం, ఉత్తరం వైపు 10 అర్బుదాల సైన్యం కాపలా ఉంటారనీ నగర కాపలాదారులు నూరువేలమంది అనీ చెప్పారు. ప్రతి నాయకుడిని

ఎంత గొప్పగా చెబితే నాయకుని శౌర్యం అంతకు రెట్టింపు అని జనం అనుకోవాలన్న ఊహ అది.

రావణునికి శాపాల కథలు చాలా ఉన్నాయి. ఒకప్పుడు కైలాసానికి వెళ్ళి, కోతి ముఖంతో ఉన్న నందిని చూసి పరిహాసంగా నవ్వాడట. దానితో, కోతులవల్లనే నీ వంశం నాశన మవుతుందని నంది రావణుని శపించాడట. వేదవతి శాపమూ, నలకూబరుని శాపమూ ఉన్నాయి. రావణుడు ఒకప్పుడు రంభను బలాత్కరించాడట – ఇకమీదట 'పరస్త్రీని బలాత్కరిస్తే మరణిస్తావు' అని రంభ ప్రియుడు నలకూబరుడు శపించాడట. బలవంతులయిన అనార్య వీరులకు ఇలాంటి శాపాలు ముందే సిద్ధంచేసి ఉంచటం పురాణ కథల సంప్రదాయం.

రావణుడు శివభక్తుడు. శైవ క్షేత్రాలలో ఇప్పటికీ రావణుని పేరు వినిపిస్తుంది. కాళహస్తీశ్వరాలయంలో మహాశివరాత్రి బ్రహ్మోత్సవాలలో దేవరాత్రి, భూతరాత్రి, గాంధర్వ రాత్రి, నాగరాత్రి ప్రత్యేకంగా జరుగుతాయి. గాంధర్వ రాత్రి నాడు రావణాసుర మయూర వాహనాలపై శివుని ఊరేగిస్తారు.

రావణుని గురించి జానపద గేయాలలో "పాతాళ హోమం" గేయం ప్రసిద్ధి పొందింది. రామునితో యుద్ధం జరుగుతూ ఉండగా రావణుడు ఒక పాతాళ గుహలో చేరి హోమం మొదలుపెట్టాడట. ఆ యజ్ఞం నిర్విఘ్నంగా పూర్తి అయితే ఇక అతన్ని ఎవరూ గెలువలేరు. ఈ సంగతి విభీషణుడు తెలుసుకొని రామునితో చెప్పాడు. యజ్ఞానికి విఘ్నం కల్గించటానికి వారు వానరులను పంపారు. వానరుల అల్లరి చేష్టలు చెప్పనలవి కానివి. వారు రావణుని జుట్టుపట్టి ఈడ్చారట. అతని చేతిలోని ఆహుతులను లాగిపడేశారు. యజ్ఞవాటికను నాశనం చేశారు. పదార్థాలన్నీ చిందరవందర చేశారు. అతని భుజాలమీద ఎక్కి మీసాలుపట్టుకొని లాగి, తలలు కదిలిస్తూ, చెవుల్లో కేకలుపెట్టారు. అయినా రావణుడు చలించలేదు. అప్పుడు మండోదరిని లాక్కువచ్చారు. ఆవిడచేత భర్తకు నీతులు చెప్పించారు. ఆమెను కూడా అవమానపరుస్తూ ఉంటే వెక్కి వెక్కి ఏడుస్తున్న ఆమెను చూడలేక రావణుడు దీక్ష విరమించి ఆ వానరులను అక్కడి నుండి తరిమేశాడు. రావణుడు వానరులను చంపలేదు. నాలుగు తగిలించి తరిమేశాడు అంతే. ఇదంతా పాఠకులను, ప్రేక్షకులను రంజింపచేయటానికి అల్లిన కథగా కనిపిస్తుంది.

ఈ విధంగా రావణుని వ్రత దీక్షను చెడగొట్టిన రాముడు యుద్ధంలో "పతివ్రతలను, మునులను పట్టుకొని వ్రతాలు చెరిచిన దుర్మార్గంవల్ల నీవు ఇప్పుడు నాకు చిక్కావు" అని అనటం దుర్మార్గమే. అసురుల చర్యలు దుర్మార్గమైనవిగాను, అవే చర్యలు రాముడు చేస్తే అవి లోక శ్రేయస్సు కోసం చేసినవిగాను ప్రచారమయ్యాయి.

రావణుని చంపే ఘట్టంలో కూడా చాలా వర్ణనలు ప్రజలను ఆకట్టుకొనడానికే ప్రచారం చేశారు. రావణుడు ఒక తల రెండు చేతులతోనే యుద్ధం చేశాడని ఒకసారి,

పది తలలతో యుద్ధం చేశాడని మరోసారి చెప్తుంటారు. రాముడు బాణంతో రావణుని తల తెగవేసినప్పుడు ఒక తల కిందపడగానే మరో తలమొలుస్తుండేదట. విభీషణుని సలహామీద రావణుని నాభి మూలంలో (కడుపులో) అగ్నిబాణంవేస్తే అక్కడి అమృతం నిర్మూలమైందట. అప్పుడు 10 తలలు 20 చేతులు త్రుంచగా 109 సార్లు మొలిచి ఆ తర్వాత అంతమై ఒక తల రెండు చేతులు మాత్రమే మిగులుతాయని ఆలోపలనే బ్రహ్మాస్త్రంతో అతనిని చంపాలని విభీషణుడు సలహా యిస్తే రాముడు అలాగే రావణున్ని చంపాడని కథలున్నాయి. ఇవి వాల్మీకి రామాయణంలో లేవు.

రావణుడు సిద్ధ విద్యలు నేర్చినవాడు. సిద్ధులు అమృత ఘుటికలు దగ్గర పెట్టుకుంటారట. ఘుటిక మింగిన సిద్ధుడిని ఎవరూ ఏమి చేయలేరట. ఆ విధమైన ప్రచారం రావణుని గురించి జరిగి ఉంటుంది. ఈ కథలు గమనిస్తే రావణుడు జైన/బౌద్ధ మతానుయాయిగా కనిపిస్తాడు. అందువల్లనూ ఆర్య రాజు (రాముడు) ఇతనిపై శత్రు భావంతో ఉన్నాడు. యుద్ధంలో అసురులకే ప్రత్యేకమైన ఆసురాస్త్రం వంటివీ ప్రస్తావించారు. మహాశక్తి, రౌద్రాస్త్రం, సీరాస్త్రం వంటివీ అసురులకు తెలుసు. రావణుని సేనలో ఇంద్రజిత్తు, ప్రహస్తుడు, కుంభకర్ణుడు, దుర్ముఖుడు, వజ్ర దంష్ట్రుడు, వజ్రహస్తుడు, ధూమ్రాక్షుడు, మహా పార్శ్వుడు, మహోదరుడు, త్రిశరుడు, దేవాంతకుడు, నరాంతకుడు, అతికాయుడు వంటి పేర్లు కనిపిస్తాయి. ఇవన్నీ సంస్కృత విశేషణాలతో కూడిన పేర్లు. అసలు పేర్లు ఏమిటో.

రావణుని రావణ బ్రహ్మగా గౌరవించారు. రావణుని చంపిన నేరానికి బ్రహ్మహత్యా దోషం పోగొట్టుకోవటానికి రాముడు చాలా తీర్థక్షేత్రాలు దర్శించవలసి వచ్చింది. రాముని శౌర్యాన్ని చెప్పటానికి చేసిన వర్ణనలూ అతిశయంగానే ఉన్నాయి. 18 వేల ఏనుగులను, కామరూపు లైన రాక్షసవీరులనూ, పదివేల రథాలను, 14 వేల గుర్రాలను, రెండు లక్షల మంది బంటులనూ $1^{1/2}$ గంటలలో రాముడు చంపేశాడట. (యుద్ధ సర్గ 94-31-32) పైనుంచి దేవ గంధర్వ సిద్ధమునులు "సాధు సాధు" అంటూ "స్వస్తి గోబ్రాహ్మణేభ్యో అస్తు" అంటూ ప్రశంసిస్తూ ఉన్నారట. ఈ దివ్యాస్త్ర బలం నాకు, పరమశివునికీ మాత్రమే ఉంది అన్నాడట రాముడు.

రావణుడు అనేక యుద్ధాలలో ఆరితేరిన వీరుడు. అతని చేతిలో ఓడిపోయిన వారిలో మహా మహా యోధులున్నారు. ఆ విధంగా పోలిస్తే రాముడు చంపినది నిరాయుధు రాలయిన తాటకను. ఆ తర్వాత ఇద్దరు అసుర బాలురను (మారీచ, సుబాహులను) ఆ తర్వాత జనస్థానాలలోని ప్రజలనూ, ఆ తర్వాత చెట్టుచాటు నుంచి వాలినీ. జనస్థాన యుద్ధం వెనక దేవగణాలూ మునులు ఉన్నారు. అడుగడుగునా ఆయుధాలు అందిస్తూ వారు రాముని ప్రోత్సహించారు. వాలిని చంపటం వెనక యుద్ధనీతి లేదు. రామ రావణ యుద్ధంలోనూ దేవ గంధర్వ గణాలు స్వస్తి వచనాలు పలుకుతూ, "జయంతాం రాఘవః సంఖ్యే రావణం రాక్షసేశ్వరం" (యుద్ధ. 110-21) అంటూ వచ్చారు. రావణుని చంపటం

కోసం రాముడు, ఆర్యగణాలు, గొప్ప ప్రయత్నాలే చేశారు. అసురులకు ఎప్పుడూ తోడ్పడే నాగులను రావణునికి సాయం పోనివ్వకుండా తమవైపుకు తిప్పుకున్నారు. నాగ సైనికులు ఎక్కువగా ఉండే వానర, భల్లూక రాజులు రావణునికి వ్యతిరేకంగా రాముని ఆ వైపు పోరాడే పరిస్థితులు ఏర్పరచారు.

రావణుడు మహావీరుడు. దేవదానవ రాక్షసులవల్ల మరణం లేకుండా వరాలు పొందాడు. నరులు తనను ఏమీచేయలేరన్న ధీమాతో ఉండేవాడు. స్థానిక జనస్థానాలన్నింటి పైనా ఇతని పర్యవేక్షణ ఉండేది. ఆర్యుల దురాక్రమణలను తిప్పికొట్టి స్థానిక అసుర జాతులకు రక్షకుడుగా సార్వభౌముడుగా ఉన్నట్టు రామాయణంలోని వర్ణనల వల్ల తెలుస్తున్నది.

రావణునితో యుద్ధం చేయటానికి ఆర్యగణాలు తమ సకల శక్తులూ రామునికి ఇచ్చారు. ఇంద్రుడు తన రథాన్నీ సారథి మాతలినీ పంపాడట. రాముడు ఆ రథం ఎక్కి దివ్యాస్త్రాలతో యుద్ధం చేశాడు. (సర్గ 103, 104, 105, 106) అయినా జయించలేక పోతుంటే అగస్త్యుడు వచ్చి "ఆదిత్య హృదయం" అనే మంత్రం ఉపదేశించాడు.

రావణుని చంపే ప్రయత్నంలో అన్ని ఆయుధాలు నిర్వీర్యమైపోయాక మాతలి సలహాపై రాముడు బ్రహ్మాస్త్రం వేశాడు. ఈ అస్త్రం బ్రహ్మ నుంచి ఇంద్రునికి - అతని నుండి అగస్త్యునికి - అతని నుండి రామునికి అందిన ఆయుధం. ఆర్య బ్రాహ్మణుల శక్తులన్నీ కేంద్రీకరించిన అస్త్రం. అది రావణుని ప్రాణాలు హరించి తిరిగి రాముని చేరుకున్నదట. ఆర్య బ్రాహ్మణుల అధికారం తిరిగి వారికి దక్కటాన్ని ఇది సూచిస్తున్నది. స్కందపురాణం ప్రకారం రామరావణ యుద్ధం 87 రోజులు జరిగింది. యుద్ధ విరామం 15 రోజులు పోతే పోరాడిన కాలం 72 రోజులు. వైశాఖం రెండో రోజున విభీషణుని లంకాధిపతిగా చేశారు.

రావణుడు స్థానిక అసురులలో "కోయతూర్" తెగలకు చెందిన ప్రభువు అని ప్రతీతి. నాగ, సూర్య, వేద, రావణ అనే నాలుగు వంశాలను కలిపి 'కోయతూర్'లుగా వ్యవహరిస్తారు. రావణుని గోండుల రాజుగానూ చెబుతారు. గోండులు ఆత్మగౌరవానికీ శౌర్యానికీ పేరుపొందారు. తమను రాజవంశీయులుగా వారు చెప్పుకుంటారు. గోండి పురాణం ప్రకారం గోండి సమాజాన్ని ప్రభావితం చేసిన 12 మంది నాయకులలో రావణుడు ఒకడు. మధ్యభారతదేశంలోని ఆదివాసీలు తమను రావణ సంతతిగా చెప్పుకుంటారు.

పరశురాముని వరుస హత్యలతో చెదిరిపోయిన అసుర క్షత్రియులు రావణుని నాయకత్వంలో సంఘటితమైనట్లు జోతిరావ్ పూలే చెప్పారు. అనంతర కాలంలో ఆర్యుల పాలన ఈ దేశంలో స్థిరపడటానికి రావణవధ, రామనామ కీర్తనమూ ఉపకరణాలయినాయి.

ఒక రావణుడు అర్క ప్రకాశము అనే గ్రంథం రాశాడట. ఇది వైద్యశాస్త్ర గ్రంథం. (1956 బుద్ధజయంతి సంచిక విస్సా అప్పారావుగారి వ్యాసం) ఆ రావణుడు మరొకరు కావచ్చును.

మానస సరోవరం దగ్గర రాక్షస్‌తల్ అనే సరస్సు ఉంది. అక్కడే రావణుడు రోజుకు ఒక తల చొప్పున నరుక్కుంటూ తపస్సు చేశాడనీ పదో రోజుకు శివుడు సాక్షాత్కరించాడనీ కథ. ఈ స్థలాన్ని "రావణస్థల్" అనీ అంటారు. ఆ పక్కనే గజానన శిఖరం ఉంది. అక్కడి రోడ్డు ఇంద్రలోకానికి దారి. ఆ దారిగుండానే మాంధాతలాంటి రాజులు ఇంద్రుడి దగ్గకు వెళ్ళివస్తుండేవారట.

మానససరోవర పరిక్రమ(ణ)లో అష్టపద పర్వతం ఉంది. అది జైనుల ఆధ్యాత్మిక కేంద్రం. అసురులు జైన, బౌద్ధ నేపథ్యం గల వారని ఊహించటానికి ఇలాంటి ఆధారాలు దోహదం చేస్తున్నాయి.

రావణుడు తపస్సు చేసిన స్థలాలూ శివుని నుండి ఆత్మలింగం పొందిన కథలూ చాలా ఉన్నాయి. గోకర్ణం, కర్ణాటకలోని మురుదేశ్వర ఆలయం రావణునితో ముడిపడి ఉన్న స్థలాలు.

రాజస్థాన్‌లోని జైపూర్‌లో రావణునికి ఆలయం ఉంది. దసరా పండుగకు ఇక్కడ ఉత్సవాలు చేస్తారు. దక్షిణ దేశంలో చాలాచోట్ల రావణుడినే నాయకునిగా అభిమానిస్తున్నారు. హిందూదేవుళ్ళ పండగలలో ఉత్సవాలలో 'రావణ వాహనం' ఉంటుంది.

ఇతిహాసాలు, పురాణాలు ఏకాలపువైనా గాని భారతదేశానికి సంబంధించినంత వరకు, సమాజాన్నీ, రాజ్యాన్నీ నడిపించే చోదక శక్తులుగా రూపొందాయి. సమాజాన్ని పాలకవర్గపు ఆసక్తులకు అనుగుణంగా నియంత్రించే సామగ్రి వీటినిండా నింపారు. నిత్య జీవిత వ్యవహారాలలో అడుగడుగునా వీటిలోని విషయాలు ప్రజలకు పాలకులకు గుర్తు వస్తుంటాయి. మార్గనిర్దేశం చేసే సాంస్కృతిక సాధనాలుగా మనిషిలో కొత్త ఆలోచన రాకుండా సమాజంలో కొత్త ధోరణులు తలెత్తకుండా ఒక మూసలో ఇవి సమాజాన్ని నడిపిస్తున్నాయి. వారిలో మతమౌఢ్యాన్ని నింపుతున్నాయి. ఈ ధోరణి దేశ ప్రగతికి ఆటంకం కలిగిస్తుందనే ఆలోచన ఉన్నప్పటికీ కొన్ని వర్గాలు వీటిని పెంచి పోషిస్తున్నాయి. వర్ణ ధర్మాల పరిధి నుండి ఉత్పత్తి శక్తులు విడిపడినప్పటికీ వర్ణ వివక్ష సాగుతూనే ఉంది. కర్మ సిద్ధాంతం ప్రజలను కట్టిపడేస్తూ ఉంది. శ్రమ దోపిడీనీ, మానవుల మధ్య అసమానతలనూ సమర్థించే మత మౌఢ్యాలను అడ్డుకోవటం ఇప్పటి సామాజిక అవసరం.

# లోహాసురుడు

లోహాసురుడు అనే పేరు సాధారణ పాఠకులకు కొత్తదే. లోహాసురుని కథ స్కందపురాణంలో ఉంది. ఈ కథలోనే రామశాసన ప్రసక్తి ఉన్నది. రామరాజ్యం సుప్రతిష్ఠిత మైన తర్వాత రాముడు దండకలోని ఈ లోహాసురుని భూములనే వైదిక ప్రముఖులకు ధారాదత్తం చేశాడు. రాముడు దానం చేసిన భూములు కొన్ని అంతకుముందు జైనులకు ఇచ్చినవి. ఈ నేపథ్యంలో లోహాసురుని గురించి తెలుసుకోవటం అవసరం.

స్కంద పురాణంలోని మూడవ భాగమైన బ్రహ్మఖండంలో ధర్మారణ్యఖండం ఉంది. దీనిలో పూర్వభాగంలో 23, 29 అధ్యాయాలలో లోహాసురుని కథ ఉంది. ధర్మారణ్య క్షేత్రం అసురుల భూమి. శక్తిమంతమైనది. అక్కడ చేసిన తపస్సు మిగతాచోట్ల చేసిన తపస్సు కంటే ఎన్నోరెట్లు ఫలితాన్నిస్తుందని బ్రహ్మ దేవగణాలతో చెప్పాడు. అప్పటి నుండే ఆ భూమిపై పట్టుకోసం, అధికారం కోసం ఘర్షణలు మొదలై ఉండాలి. ఆ ప్రాంతం సహజ వనరులు కలది గనుక అక్కడి పాలకులు బలంగా ఉన్నారు. ఆధిపత్య సమస్యలు ఫలవంతమైన భూముల చుట్టూ, క్షేత్రాల చుట్టూ అల్లుకొని ఉండటం సర్వసాధారణం. ఇక్కడ జరిగిందీ అదే. దేవదానవ యుద్ధాలలో అసురులది పైచేయిగా ఉంటూ వచ్చినప్పుడు దేవగణాలు శత్రువులను అణచివేసే ఉపాయాల కోసం బ్రహ్మను ఆశ్రయించటం పురాణ కథలలో తరచుగా వినిపిస్తుంటుంది. అలాంటి ఒక సందర్భంలో తమకు ఎక్కువ శక్తులు కావాలని దేవ గణాలు బ్రహ్మను అడిగారు. అప్పుడు ఆయన వారికి ధర్మారణ్య క్షేత్రం గురించి చెప్పాడు. అక్కడి తపస్సు ఎక్కువ శక్తినిస్తుందనీ, ప్రభావం కలది అనీ చెప్పాడు. ఆ విధంగా ధర్మా రణ్యక్షేత్ర భూములపై వారికి ఆసక్తి కలిగించాడు.

అసురుల రాజ్యమైన ధర్మారణ్యాన్ని ఆక్రమించుకునే కుట్రగానే పై ఉదంతాన్ని చూడవలసి ఉంటుంది. ధర్మారణ్యంలోని క్షేత్రాలన్నీ ఆయురారోగ్యాలను కలిగించే క్షేత్రాలే. వృత్రాసురుని హత్య చేసిన ఇంద్రుడు బ్రహ్మ హత్యాపాతకం నుంచి దండకలోనే విముక్తుడయ్యాడు. దండకలోని మలద కరూశ దేశంలో ఆరోగ్యాన్ని తిరిగి పొందాడు. మహిమాన్వితమైన ఆ క్షేత్రాన్ని రాముని సాయంతో దేవగణాలు, ఆర్యులు వశపరచుకున్నారు. అందుకోసమే రాముడు నాగరాణి తాటకను చంపాడు. అందులో ఒక తీర్థాన్ని ఇంద్రుడు తన కొడుకైన జయంతుని పేర జయంతేశ్వర క్షేత్రంగా ప్రసిద్ధం చేశాడు. (నాయకుల పేర్లు జిల్లాలకూ పథకాలకూ పెట్టటం అప్పటి నుంచీ ఉన్నది.)

స్కందపురాణం చెప్పిన ధర్మారణ్యక్షేత్ర స్థలాలు చాలా ఉన్నాయి. గ్రంథ విస్తర భీతివల్ల లోహాసురునికి సంబంధించిన అంశాలే ఇక్కడ ప్రస్తావించటం జరుగుతున్నది.

అన్ని క్షేత్రాలలో లాగానే పురాణాలు ఈ క్షేత్రాన్ని త్రిమూర్తులతో ముడిపెట్టాయి. బ్రహ్మ, విష్ణువు, శంకరుడు ఈ క్షేత్ర మాహాత్మ్యాన్ని అనుభవించినవారేనట. అక్కడ చేసిన తపస్సు, దానం కోటి రెట్లు అవుతాయట. అక్కడ ఒకప్పుడు నారాయణుడు (విష్ణువు) తపస్సు చేశాడు. మరొకప్పుడు శివుడు తపస్సు చేశాడు. అప్పుడు శక్తి (పార్వతి) కూడా అతనిని అనుసరించి వెళ్ళి ఎన్నో విద్యా రహస్యాలు తెలుసుకున్నది. ఆ విధంగా అది శ్రీమాత నిలయంగా శివసతి నిలయంగా ప్రసిద్ధమయింది. శివసతి తన శరీరం నుండి కుల దేవతలను పుట్టించింది. వారి నుంచి నానారూపాలు గల అనేక శక్తులు శుభాలను కలిగించేవీ, సిద్ధశక్తులూ ఉద్భవించాయి. ఈనాటి కులదేవతల ఆవిర్భావం అక్కడే జరిగిందనుకోవాలి. ధర్మారణ్య క్షేత్రంలో శ్రీమాత (పార్వతి) అభీష్టమే చెల్లుతుంది అని స్కందపురాణం చెప్పింది. అయినా బ్రాహ్మణుల ఆధిక్యాన్ని తెలిపే రామశాసనం అక్కడే వేయించటం ఒక సామాజిక మార్పును సూచించేదిగా అర్థం చేసుకోవాలి. అప్పటికి అక్కడ ప్రబలంగా ఉన్న సిద్ధ సంప్రదాయాన్నీ, స్త్రీ దేవతల పూజలనూ, అసుర, జైన, బౌద్ధ, శైవ ధర్మాలనూ అధిగమించే విధంగా వైదిక మత సార్వభౌమత్వాన్ని నెలకొల్పటం జరిగింది. ఒక కృతయుగంలో దేవతలు ఈ క్షేత్రంలో యజ్ఞాలు చేసి గొప్ప శక్తులు సంపాదించారు. ఆ శక్తులతో స్వర్గానికి వెళ్ళి హాయిగా ఉన్నారట. మరో కృతయుగంలో లోహాసురుడు పుట్టి వారిని బాధించాడని స్కందపురాణం చెప్పింది.

లోహాసురుడు అనే పేరు రెండుమూడు చోట్ల కనిపిస్తున్నది. ఈ పేరు సంస్కృత భాషా వ్యుత్పత్తి గల పదం. లోహయుగ సంస్కృతిని స్ఫురింపచేసే కాలం నాటిది కావచ్చు. అసురుల లోహ సంపదను ఖనిజ వనరులను సూచించేదీ కావచ్చు.

స్కంద పురాణం ప్రకారం లోహాసురుడు బలి కొడుకు. ఒక లోహాసురుడు కృతయుగం నాటి అసురుడు. వీరిరువురూ ఒకరే కావచ్చు, భిన్న వ్యక్తులు కావచ్చు. చరిత్రలో ఇలాంటి లోహాసురులు ఎందరున్నారో? ఒక కృతయుగంలో పుట్టిన లోహాసురుడు దుర్మార్గుడనీ, మునులను బాధించేవాడనీ విప్రులను భయపెట్టేవాడనీ రాశారు. ఇతడు బ్రహ్మవేషం ధరించి ఉండేవాడట. బావులూ, చెరువులూ పాడు చేయటం, యజ్ఞాలకు భంగం కలిగించటం వంటివి చేస్తూ ప్రజలను భయపెట్టాడనీ మునులు చెప్పుకున్నారు. వాటిలో వాస్తవం ఎంతో? ఇతని బాధలు పడలేక బ్రాహ్మణులు, మునులు, వణిజులు ఆ చోటు వదలిపెట్టి ముక్తారణ్యానికి వెళ్ళిపోయారట. లోహాసురుని ఆగడాలను నిశితంగా పరిశీలిస్తేగాని అవి ఒక వర్గాన్ని బాధించేందుకు చేసినవో, స్వీయవర్గాన్నీ, సంస్కృతినీ రక్షించుకునేందుకు చేసినవో బోధపడదు. బావులు, చెరువుల విషయంలో, నీటి వనరుల వినియోగం విషయంలో అసురులకూ, దేవజాతులకూ మొదటి నుండీ ఘర్షణలు జరుగుతూనే వచ్చాయి. వృత్రాసుర వధ దగ్గరి నుండీ 1985 జులైనాటి కారంచేడు మారణహోమం వరకూ జరిగిన ఘర్షణలు నీటి కారణంగా జరిగినవే. మంచినీటి

చెరువులను కలుషితం చేయవద్దన్నందకు జరిగినవే. చెరువులనూ, నదీ జలాలనూ స్వచ్ఛంగా ఉంచకపోవటంలో వర్గ సంస్కృతి పాత్ర ఉన్నది. ఆచార వ్యవహారాల ప్రమేయం ఉన్నది.

బలి చక్రవర్తి కుమారుడైన లోహాసురుడు ప్రజారంజకుడయిన చక్రవర్తి. అన్నదమ్ములకు ఇష్టుడు. ఇతని రాజ్య భూములు దండకలోనే ఉన్నాయి. చాలా కాలానికి అన్నదమ్ములంతా గతించాక లోహాసురుడు తత్వచింతనలో పడ్డాడు. ఎవరిని ఆరాధించాలి? ఎవరిని ఎక్కువగా ధ్యానించాలి? అనుకుంటూ తపస్సు చేశాడు. గాలి, నీరు, చెట్లనుండి రాలిపడిన ఆకులు మాత్రమే ఆహారంగా వంద సంవత్సరాలు సరస్వతీ[1] నదీతీరంలో తపస్సు చేశాక శివుడు ప్రత్యక్షమయ్యాడు. వరం కోరుకోమన్నాడు. ముసలితనం, మృత్యువూ తనను చేరకుండా వరం కావాలన్నాడు లోహాసురుడు. శివుడు సరేనన్నాడట. తర్వాత కూడా లోహాసురుడు అక్కడే తపస్సుచేస్తూ ఉండిపోయాడు. ఈసారి ముక్తికోసం తపస్సు చేశాడన్నారు. జరా మరణాలు లేనివానికి ముక్తి దేని నుంచి? ఈ తపస్సు వందల, వేల సంవత్సరాలు సాగుతుండగా దేవరాజు ఇంద్రుడు భయపడ్డాడు. రకరకాల రూపాలు ధరించి లోహాసురుని భయపెట్టాడట, బాధించాడట. కొట్టడమూ మొదలుపెట్టాడు. (ఇది పాలకవర్గపు పోలీసుల హింసాకాండను గుర్తు తెస్తున్నది) లోహాసురునికి ధ్యానభంగం కలిగింది. అయినా అతడు శాంతంగానే ఉన్నాడు. ఇంద్రుడు దేవగణాలతో వెళ్ళి లోహాసురుని బాధించాడు. అయినా లోహాసురుడు చలించలేదు. దేవగణాలను తరిమి పంపేశాడు. ఎవరి జోలికీ పోకుండా తత్వచింతనతో తపస్సు చేసుకుంటున్న వాడిని కదిలించటం, బాధించటం అనే చర్యలు ఇప్పటి ఆదివాసీలపై పాలకుల దమనకాండను గుర్తుకు తెస్తాయి. సామాన్య ప్రజలపట్ల బలహీనులపట్ల పాలకవర్గ ధోరణి ఎప్పుడూ ఒకలాగే ఉంటుందని ఇలాంటి కథల వల్ల నమ్మకం కలుగుతుంది. ఒక అసురుని చేతిలో ఓడి పోవటం దేవగణాలకు ప్రతిష్ఠాత్మక సమస్య అయింది. లోహాసురుని ఎలాగైనా జయించాలనీ అతని రాజ్య భూములు వశం చేసుకోవాలనీ దేవగణాలు పట్టుదలగా ప్రయత్నాలు చేశారు. విష్ణువు సహాయం కోరారు. విష్ణువు నూర్ల సంవత్సరాలు లోహాసురునితో యుద్ధం చేశాడు. అయినా జయించలేకపోయాడు. సకల దేవగణాల బలమూ, శక్తులూ ఆయనలో ప్రవేశించాయి. అయినా ఉపయోగం లేకపోయింది, బ్రహ్మ, రుద్రుల బలమూ అతనిని ఆవహించింది. అయినా లోహాసురుని ఎదుట ఆయన నిలవలేకపోయాడు. అప్పుడు త్రిమూర్తులు కుయుక్తులకు పాల్పడ్డారు. లోహాసురునితో చర్చలకు దిగారు. శాంతియుత

---

1 అసురులు తపస్సులు - ఎక్కువగా సరస్వతీ నదీతీర ప్రాంతాల్లో చేశారు.
"దేవీతా నదీ తమా సరస్వతీ" అని వేదాలలో ప్రసక్తమైన సరస్వతీ పరీవాహక ప్రాంతాలలో అసుర సంస్కృతి పరిఢవిల్లింది. సింధు నది పాయలలో ఒక పాయ నీరు - యమున ఎగువ నీరు కలసి సరస్వతి ఒక పెద్ద నదిగా ప్రవహించేదట. ప్రకృతి వైపరీత్యాలవల్ల సరస్వతీ ప్రవాహం క్రీ.శ. 1900 ప్రాంతాలలో ఎండిపోయిందటున్నారు. హరప్పా క్షేత్రాల క్షీణతకు ఇది ఒక కారణం కావచ్చు. ఈ సంస్కృతి అసుర సంస్కృతితో ముడిపడి ఉంది.

వాతావరణంలో చర్చలు జరిగాయి. "దేవగణాలతో విరోధపడవద్దు" అని బ్రహ్మ లోహాసురునికి హితోపదేశం చేశాడు. ప్రేమగా మాట్లాడాడు. "నీ తండ్రి బలి చక్రవర్తి మూడు లోకాలనూ హరికి ఇచ్చాడు. తాను పాతాళానికి వెళ్ళాడు. నీవు కూడా శాంతంగా ఉండు. వాక్కును అదుపులో ఉంచుకో. శివభక్తితో భూమిమీద ఉండు. త్రిమూర్తులు నీ దేహంలో ఉంటారు. అందుకు సమ్మతించు. దేవతలను కదల్చకు. నీకు వరాలు ఇస్తాను" అని నచ్చచెప్పాడు. కిందివర్గాలనూ, బలహీనవర్గాలనూ పాలకవర్గం ఇలాగే బుజ్జగిస్తూ, నియంత్రిస్తూ ఉంటుంది. ఉద్యమాలను చల్లారుస్తూ తన ప్రయోజనాలు నెరవేర్చుకుంటూ ఉంటుంది. "మీకు కావలసినన్నీ ఇస్తాం. వేరేచోట భూములు ఇస్తాం. చేతికి కొంత డబ్బు ఇస్తాం, మేము చెప్పినట్టు వినండి, మాపై పోరాటాలు చేయకండి" అని చెప్పటం యుగాలుగా వస్తున్న దుష్ట రాజకీయం. దేవతలను కదల్చకుండా వారిని తనలో ఉండనిచ్చి వారికి అణగి ఉండటం – (ఇది అనంతర కాలంలో దాసభక్తిగా పేరు పడింది.) మూఢభక్తి ప్రచారం ఈ కథలో స్పష్టంగా కనబడుతుంది. బలి చక్రవర్తి పట్ల కూడా ఇలాంటి కుతంత్రమే సాగింది. భక్తి పేరిట ఆధునిక యుగంలోనూ అలాంటి కుతంత్రాలే నడుస్తున్నాయి. ఈ సామాజిక రాజకీయ నీతిని ముఖ్యంగా బలహీన వర్గాలను అణచి ఉంచటానికే అనుసరిస్తున్నారు. లోహాసురుడు సజ్జనుడు. త్రిమూర్తుల మాట మన్నించాడు. "బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు సకల దేవతా గణమూ నా శరీరంలో ఉండటం నాకు గౌరవమే" అనుకున్నాడు. ఆధిపత్య వర్గాలకు విధేయంగా ఉండటం ఇప్పటికీ కింది వర్గాలు తమ ధర్మంగానూ, గౌరవంగానూ భావిస్తారు.సమాజంలో శతాబ్దాలుగా పైవర్గాలు, పురోహిత వర్గమూ ప్రవేశపెట్టిన బలహీనత అది. లోహాసురుడు తమ మాటకు అంగీకరించగానే త్రిమూర్తులు అతని శరీరాన్ని ఆవహించి అతనిని ఒక కూపంలో తొక్కిపడేశారు. కదలకుండా చేశారు. నోరెత్తకుండా చేశారు. మరెప్పుడూ దేవతలపైకి రాకుండా చేశారు. ఇచ్చిన మాటకు కట్టుబడి ఉండాలన్నారు. అదే ధర్మం అన్నారు.

"నీ శరీరం ఒక తీర్థం అవుతుంది. దాని ప్రభావం అనంతం. గయక్షేత్రంలో 21 సార్లు చేసిన తర్పణం కంటే ధర్మారణ్యక్షేత్రంలోని కూపంలో (నీ శరీర కూపం) ఒకసారి చేసిన తర్పణం గొప్పదవుతుంది" అని పొగిడారు. పొగడ్తలతోనే అతనిని గెలిచారు. "నీ సత్యవాక్కుకు మేము బద్ధులమయ్యాము" అన్నారు. శ్రాద్ధ పిండాలలో ఎవరికి ఎన్ని భాగాలో అదీ చెప్పారు. మంచి మాటలతో చిన్నపాటి మొత్తం ఎరచూపి పెద్ద పెద్ద ప్రయోజనాలు పొందే ఈనాటి అవినీతి సంఘటనలు, భూఆక్రమణలు బడుగు వర్గాలను ఎట్లా వశపరచు కుంటున్నాయో అదే రీతి పూర్వమూ సాగిందనటానికి ఈ సంఘటన ఉదాహరణ. ప్రతీకాత్మకంగా చూస్తే ఇది లోహపు స్థావరాలను అగ్ర, ఆధిపత్య వర్గాలు తమ చేతుల్లో పెట్టుకొన్నారనటాన్ని సూచిస్తుంది. దక్షిణ భారతదేశపు భూమి విలువైన మణిమాణిక్యాలకూ, ఖనిజాలకూ నెలవు. పైవిధంగా నయానా, భయానా ఆ స్థావరాలను పాలకవర్గాలు వశపరచుకొని తమవారికి పంచిపెట్టాయి.

స్కందపురాణం ప్రకారం రామ రావణ యుద్ధం 87 రోజులు జరిగింది. యుద్ధ విరామం 15 రోజులు పోతే యుద్ధం జరిగిన రోజులు 72. వైశాఖం తొలిరోజు రాముడు యుద్ధ భూమిలో ఉన్నాడు. రెండో రోజు విభీషణుని లంకాధిపతిగా అభిషేకించాడు. ఆ తర్వాత అయోధ్యకు వెళ్ళేడు. రాముడు అయోధ్యను 42వ ఏట నుంచీ (సీత వయస్సు 33) పదివేల నూర్ల సంవత్సరాలపాటు పాలించాడట. ఆ కాలంలోనే పుణ్యతీర్థాల గురించి తెలుసుకుంటూ ధర్మారణ్య క్షేత్రానికి సపరివారంగా వెళ్ళాడు. అప్పటికి ఇంకా అక్కడ యక్ష రాక్షసులున్నారని విన్నాడు. ఎందుకో ఈసారి వారిపై దండెత్తలేదు. అక్కడి దేవతాలయాలను దర్శిస్తూ ముందుకు సాగాడు. ఒకచోట రాత్రి ఆయనకు ఒక స్త్రీ ఏడుపు వినిపించింది. ఎవరు ఎందుకు ఏడుస్తున్నారో కనుక్కోవటానికి భటులను పంపాడు. ఆవిడ, “మీరు కాదు, రాముడినే రమ్మనండి” అన్నది. రాముడే వెళ్ళాడు. ఆవిడ కాసేపు రాముణ్ణి పొగిడింది. “నీవు విష్ణువు అవతారం” అనీ చెప్పింది.

ఆమె దండకారణ్య దేవత (అట). “లోహాసురుని భయంవల్ల విప్రులంతా పది దిక్కులకూ వెళ్ళిపోయారు. నేను శూన్యంగా ఉన్నాను. ఈ అరణ్యాన్ని ఉద్ధరించు” అని అడిగింది: ఆ రాక్షసుడు దీన్ని ఆక్రమించి ఉన్నాడు గనక ఇక్కడికి ఎవరూ రావటం లేదన్నది. పూర్వం వణిజులు, బ్రాహ్మణుల అవాసాలు ఉండే చోట్లన్నీ పాడుపడి పోయాయి. పిల్లల ఆటలూ, ఆడపిల్లల కలస్వనాలూ, విహారాలూ, యజ్ఞధూపాలూ ఏమీ లేవు. వారిని తిరిగి రప్పించాలన్నది. వారి వివరాలు తనకు తెలీదన్నాడు రాముడు. ఆవిడే వారి వివరాలు ఇచ్చింది. ఆ వివరాల ప్రకారం 18 వేలమంది బ్రాహ్మణులూ, 36 వేలమంది వైశ్యులూ లెక్కతేలారు. బ్రాహ్మణులు వేదవిద్యలలో (చదవటం-రాయటం) ప్రసిద్ధులు. 64 గోత్రాల వారు. వైశ్యులలో కొందరు స్థానాచారులూ కొందరు కులాచారులూను.. ఈ కూపంలో లోహాసురుడున్నాడనే భయంతో వారు పారిపోయి ఉంటారా?

రాముడు వాళ్ళందర్నీ వెతికించి రప్పించాడు. వారికి రకరకాల దానాలు ఇచ్చాడు. ఒక శాసనం చేశాడు. అంతమందికీ ఉంగరాలు, బట్టలు, కర్ణాభరణాలూ, యజ్ఞోపవీతాలు, రంగు రంగుల ఆవులు నూర్లకొద్దీ ఇచ్చాడు. వాటితోపాటే ఆవులకు పైన వేసే పట్టు బట్టలు - బంగారు కొమ్ములు - వెండి గిట్టలు - రాగి పృష్టాలు (వీపుల మీది అలంకరణలు) కంచు పాత్రలు (పాలు పితుక్కోవటానికి) ఇచ్చాడు. ఆవులతోపాటు దూడలూ ఉన్నాయి. (స్కంద. 2-1-33) క్రీ.శ. తొలి శతాబ్దాలలో బ్రాహ్మణులకు ఇచ్చిన దానశాసనాలతోనే భూస్వామ్యం మొదలయిందని చరిత్రకారులు, సమాజ శాస్త్రవేత్తలు చెబుతున్నారు ఆ కోణంలో రామశాసనాన్ని అప్పటి సామాజిక దర్పణంగా భావించాలి. రాముడు వారికి ఇచ్చిన బహుమతుల జాబితా అప్పటి వైదికుల సుఖ జీవనాన్ని తెలుపుతున్నది. ఇక్కడ రాముడు చేసినది “జీర్ణోద్ధారం” అనీ బ్రాహ్మణుల హితం కోసమే చేశాడనీ స్కందపురాణం స్పష్టంగానే చెప్పింది. “ద్విజానాంచ హితార్థాయ” అనీ అన్నది. “రామలేఖన విచిత్రైస్తు·

లభితం ధర్మశాసనం" అనీ చెప్పింది. ఆ శాసనం అలానే నష్టం కాకుండా లభించిందనీ ఇంకా ఉన్నదనీ అంటున్నది. (స్కంద. 32, 23 అధ్యాయాలు).

స్కందపురాణం ప్రకారం త్రేతాయుగం నుండి కలియుగం వచ్చేవరకూ, ఇంకా కలియుగంలోనూ హనుమంతుడు అక్కడ ఉండి రామశాసనాన్ని నడిపిస్తున్నాడు. బ్రాహ్మణుల ఆజ్ఞ, శ్రీమాత ఆజ్ఞ అక్కడ నడుస్తాయని చెబుతూనే బ్రాహ్మణుల ఆజ్ఞలకు పెద్ద పీటవేశారు.

వైశ్యులకు, బ్రాహ్మణులకు పునరావాసం కల్పిస్తూ రాముడు శాసనం చేశాడు. వారికి ఇళ్ళు కట్టించాడు. సమస్త సౌకర్యాలు కల్పించాడు. అయితే అవి తీసుకోవటానికి వారు ఒక పట్టాన ఒప్పుకోలేదు. (వారి కంటికి అవి ప్రభుత్వం బలహీనవర్గాలకూ, మాల మాదిగలకూ కట్టించే ఇచ్చే ఇళ్ళలాగా కనిపించాయేమో). దానాలు స్వీకరించటంలోనూ పురోహిత వర్గం గొప్ప లౌక్యాన్ని ప్రదర్శిస్తుంది. ఎదుటివారి కోసమే తాము దానాలు తీసుకుంటున్నట్టు భేషజాలకు పోవటం అప్పుడూ ఉంది.

రాముడు ఇవ్వబోయిన దానాలు వారు వద్దన్నారు. "మేము రాజుల దగ్గర దానాలు తీసుకోము, మా ఆచారాలు వేరు. మేము త్రిమూర్తుల చేత స్థాపించబడ్డవారము. వారి ఆజ్ఞ లేకుండా దానం తీసుకోము" అన్నారు. రాముడు త్రిమూర్తులను రప్పించాడు. వారు చెప్పాక వీరు దానాలు తీసుకున్నారు. త్రిమూర్తులు ఆ పురోహితుల గురువులో మఠాధిపతులో అయి ఉంటారా? అనేది ఆలోచించాలి. మొత్తానికి బ్రాహ్మణులు, వణిజులు రాముని నుండి దానాలు తీసుకున్నారు. రాముడు వారి కోసం గృహశాలలు, బ్రహ్మశాలలు అందమైన ఆకారాలతో నిర్మింపజేశాడు. ఇంటి సామగ్రి - వస్తువులు - బంగారం - ఇతర ధాతువులూ కోట్ల విలువైనవి సరఫరా చేశారు.

ద్విజుల శుశ్రూష కోసం మరికొందరిని తెచ్చారు. కొత్తగా డ్యూటీలు వేశారన్న మాట. ఆ లెక్కలు అతిశయంగానే కనిపిస్తాయి. ద్విజుల కోసం మండలాలలో అధికారులను ఏర్పాటు చేశారు. రామ శాసన పాలకులుగా వణిగ్వరులను లక్ష పాతిక మందిని ఏర్పాటు చేశారు. వారిని, "మాండలికులు" అన్నారు. ఈ వణిగ్వరులకు (వైశ్యులకు) మరింత మంది సేవకులను ఏర్పాటు చేశారు.

36 వేలమంది వైశ్యులకు లక్ష పాతికమంది శూద్రులు సేవలు అందించటానికి ఏర్పాటయ్యారు. అప్పటికి అంత జనాభా ఉన్నదా? అనేది ఆలోచించాలి. క్రీస్తుపూర్వం పదివేల సంవత్సరాల నాటికి ప్రపంచంలోనే, మానవ జనాభా ఇరవై లక్షలు దాటి ఉండదని శాస్త్రవేత్తల అంచనా. క్రీస్తు శకారంభానికి ప్రపంచ జనాభా 30 కోట్లు అని చెబుతున్నారు. ఈ లెక్కన రామాయణం ఎప్పటి కథో ఆలోచించవలసిందే. రామరావణ యుద్ధ సందర్భంలోనూ సైన్యం లెక్కలు బిలియన్లకు మించి ఉన్నాయి. స్కందపురాణం ప్రకారం రాముడు చేసిన దానాలు అసంఖ్యాకంగా ఉన్నాయి. ఈ వివరాలన్నీ రాముడు

రాగిరేకు మీద రాయించాడు. ఆ క్షేత్ర రక్షణ కోసం హనుమంతుడిని అక్కడ పెట్టాడు. (స్కంద. 2-1-34) వర్ణ భేదాలు, వృత్తులు ఎవరెవరు ఏమేమి చేయాలి. ఏకార్యానికి ఎవరెవరు ఎంతెంత తీసుకోవాలి, అందులో ఎంత భాగం ఎవరెవరికి వెళ్ళాలి, అనేదంతా రామశాసనంలో వివరంగా ఉన్నదట. రామశాసనాన్ని అమలుపరిచే బాధ్యత హనుమంతునిది. అందుకే భారతదేశంలో ముఖ్యంగా ఆంధ్రదేశంలో ఊరూరా రాతి పలకల మీద, గుట్టల మీద ఆంజనేయుని బొమ్మలూ, విగ్రహాలు కనబడతాయి. రామశాసనం అమలు జరుగుతోందో లేదో ద్విజుల శుశ్రూష సాగుతున్నదో లేదో, వర్ణ ధర్మం పటిష్ఠంగా ఉన్నదో లేదో అని పర్యవేక్షించటానికే అక్కడ హనుమంతుడు ఉంటాడు. ఆయన అందుకే చిరంజీవిగా ఉన్నాడని అంటారు. వృత్తులు, కులాలు స్థిరపరచిన ఈ ఏర్పాటు రాముని నాటిది. ఆయన బ్రాహ్మణులకు ఇచ్చిన దాన శాసనాలతో దేశంలో భూస్వామ్య వ్యవస్థ బలపడుతూ వచ్చింది.

లోహాసురుని కథ నిశితంగా పరిశీలిస్తే అసురుల లోహయుగ సంస్కృతికి ఇది సంకేతంగా తోస్తుంది. మాతృ ఆరాధన, జంతు ఆరాధన, ప్రకృతి ఆరాధన వంటి ఆదిమ సంప్రదాయాలతోబాటు భౌతిక వనరులను సృజనాత్మకంగా మలుచుకోవటంలో ఆదిమ సమాజాలు పురోగమన దిశలో ఉన్న తరుణంలో ఆర్య బ్రాహ్మణీయ శక్తులు ఆ ఉత్పాదకతను సొంతం చేసుకోవటానికి సాగించిన దాడులు దేవాసుర యుద్ధాలు. ఆ సమయంలోనే త్రిమూర్తుల కథలూ సృష్టి, స్థితిలయాల కథలూ బాగా ప్రచారం చేసి జానపదులను ఆర్య సమాజం ఆకట్టుకున్నది. పూజలూ, భక్తి మార్గాలూ, మూఢ సంప్రదాయాలూ, పూజారి వ్యవస్థా, పెద్ద - చిన్న భేదాలూ, పితృస్వామ్యమూ ఒక్కుమ్మడిగా సమాజంలో బలవంతంగా ప్రవేశపెట్టటం జరిగింది. ఇవన్నీ ఒకదానితో ఒకటి జతపరుస్తూ సారస్వతం వెల్లివిరిసింది. ఈ భావజాలంతో జానపదుల కథలు మౌఖిక పురాణాలూ మార్పులకు లోనవటమూ జరిగింది. త్రిమూర్తులు చెప్పాక ఎవరైనా వినవలసిందే అని బలంగా నమ్మించారు. సాధారణంగా శివుడు కేంద్రంగా ఉండే కుల పురాణాలన్నీ త్రిమూర్తుల చుట్టూ తిరగటం ఈ వైదిక సారస్వతపు ప్రభావమే. అగ్రకులాలకు విధేయంగా కింది కులాలు ఉండాలని చెప్పటమూ, ఆశ్రిత కులాల ఏర్పాటూ ఆ కుట్రలో భాగాలే. అతి ప్రాచీన పురాణంగా చెప్పబడే ఆది జాంబవపురాణం కూడా ఈ విధేయతను ఇముడ్చుకున్నది. ఆదిశక్తి ప్రభావం తగ్గి త్రిమూర్తుల ప్రభావం పెరగటం జరిగింది. జాతుల కలహాలలో ఓడినవారు, గెలిచిన వారికి దాస్యం చేయటం వంశ పారంపర్యంగా దాసులుగా ఉండటం, తమ వృత్తి నైపుణ్యాలతో యాజమాన్య వర్గాలను సేవించటం జరుగుతూ అది వృత్తి కులాల విధేయతకూ వర్ణ వివక్షకూ దారితీసింది. ఆదిమ సమాజాలలో వర్ణ వివక్ష అంటరానితనం అనేవి లేవు.

ఈ క్రమ పరిణామాన్ని పురాణాలు స్పష్టంగానే చెప్పాయి. ఇప్పటికీ కలియుగం లోనూ హనుమంతుడు రామశాసనాన్ని నడిపిస్తున్నాడట. కలియుగంలో వర్ణధర్మాలు భ్రష్ట

మౌతాయని చాలా పురాణాలు చెప్పాయి. బ్రహ్మంగారి తత్వాలూ చెప్పాయి. అయినప్పటికీ బ్రాహ్మణుల ఆజ్ఞ, శ్రీమాత ఆజ్ఞ అక్కడ నడుస్తున్నాయన్నారు. ధర్మారణ్య క్షేత్రంలో ఒకప్పుడు జైన, బౌద్ధ ధర్మాలు వ్యాపించి ఉండేవి. రామశాసనంతో అవి క్షీణించాయని చెప్పే కథలూ, స్కందపురాణంలో ఉన్నాయి. ఉదాహరణకు ఒక కథ చూద్దాం - 'ఆముదు' అనే రాజు కథ. ప్రజలు వైష్ణవ ధర్మాన్ని వదిలి బౌద్ధాన్ని ఆశ్రయించిన విషయం చెప్పింది. ఆముదు ఒక రాజు. అతని భార్య 'భామ'. వారు బౌద్ధ ధర్మానుయాయులు, వారి కూతురు రత్నగంగ. ఇంద్రసూరి అనే వాని నుంచి మంత్ర విద్య నేర్చుకొని క్షపణురాలయింది. జైన ధర్మాన్ని అనుసరించింది. ఆమె భర్త కుంభీపాలుడు. ఆముదు అల్లునికి "మోహరక" గ్రామం ఇచ్చాడు. దానికి ఆ ఊరి బ్రాహ్మణులు ఒప్పుకోలేదు. వారు జైన ధర్మానికి వ్యతిరేకులు. రామశాసనం ప్రకారం ఆ గ్రామం తమదనీ అక్కడ కుంభీపాలుని పాలన చెల్లదనీ వారు అన్నారు. కుంభీపాలుడు జైనుడు. అందుకే వారు వ్యతిరేకించారు. ఈ ఫిర్యాదులు హనుమంతుని దగ్గరకు వచ్చాయి. విచారణ జరిగింది. అక్కడ జరిగిన వాదనలు ఆసక్తికరంగా ఉన్నాయి. రామ శాసనాన్ని తాను మన్నించనన్నాడు కుంభీపాలుడు, మామగారిచ్చిన గ్రామం మీద తనకు హక్కులున్నాయన్నాడు. "బాహ్మణులు పశుహింసా పరాయణులు, యజ్ఞ క్రతువులు చేస్తారు" అని నిందించాడు. తాము వేదమంత్రాలతోనే యజ్ఞాలు చేస్తామనీ అక్కడ చేసే జంతువధ ఉత్తమమైనదనీ అది హింసకాదని, బ్రాహ్మణులు వాదించారు. యజ్ఞాలను వ్యతిరేకించిన అసురుల విధానం జైన, బౌద్ధ ధర్మాలలో కొనసాగటం ఇక్కడ గమనించ వలసిన అంశం. హనుమంతుని తీర్పు, ఇరువర్గాల ఘర్షణలూ చెప్పాలంటే చాలా ఉన్నాయి. రామశాసనం నాటికే దేశంలో జైనమూ, బౌద్ధమూ విస్తరించి ఉండటాన్నీ వాటికి వైష్ణవం తోడి సంఘర్షణనూ వివరించటానికే ఈ కథ.

త్రిమూర్తులూ, మునులూ, దేవగణాలు లోహాసురుని అణచిపెట్టిన సంగతిని ఎంతగానైనా విశ్లేషించుకోవచ్చు. (1) రాజకీయ పార్టీల లాబీయింగ్ విధానాలూ, అధిష్ఠాన వర్గ నిర్ణయాలూ, సంపన్న వర్గాలకు లాభం కలిగేలాగనే పార్టీ నిర్ణయాలు ఉండటమూ, అణకువగా ఉండేవారిని అణచటమూ అనే వర్గ సమాజ లక్షణాలు ఇక్కడ కనబడతాయి. (2) ఖనిజ నిక్షేపాలూ, అటవీ సంపదా ఉన్న ప్రాంతాలను నయానా, భయానా స్వాధీనం చేసుకునే విధానాలు. (3) మతపరమైన, సంస్కృతిపరమైన ఆధిపత్యాన్ని వైరి వర్గాల ప్రాంతంలో నెలకొల్పటం. వారి విధానాలను నిరాకరించటం - వైష్ణవ మతాన్ని ప్రతిష్ఠించటం (4) సామ్రాజ్యవాదం - భూస్వామ్య వ్యవస్థ. (5) వృత్తులు - కులాలు స్థిర పడటం. (6) యజమానులు - సేవకులుగా - సమాజం విభజించబడటం. (7) పురోహిత వర్గాన్ని సంతోషపెట్టేందుకు అరణ్య భూములను వశపరచుకోవటం, ఆ భూములపై వారికి ఆధిపత్యం ఇవ్వటం. మూఢభక్తి - పూజారి వ్యవస్థ. (8) గిరిజనుల భూములను

గిరిజనేతరులకు వశపరచటం. (9) శ్రీ మాతకు దీటుగా బ్రాహ్మణులను నిలపటం. (10) వివిధ వర్ణాల వారికి ఏ పనికి ఎంత ఇవ్వాలో వారి వారి వాటాలు నిర్ణయించటం.

ప్రజోపయోగ కార్యాలెన్నో చేసిన అశోకుని శాసనాలు చరిత్రలో ఉన్నాయి. ఇప్పుడు అమలులో లేవు. స్కందపురాణం చెబుతున్న రామశాసనం చరిత్రకు అందటంలేదు గాని, అమలులో ఉన్నది. భారతీయ సమాజానికి మూల స్తంభంగా నిలిచి ఉంది. ఆధునిక యుగంలోని ప్రజాస్వామ్య ప్రభుత్వాలూ ఈ శాసనానికే బద్ధులై ఉంటున్నాయి. ఈ అణచివేత ఇలా ఎంతకాలం?

పురాణ కథలు ఆధ్యాత్మిక భావాలతో ఉంటాయనుకుంటాము గాని వాటిలో నిబిడీకృతమై ఉన్న సామాజిక అణచివేతనూ, రాజ్య స్వభావాన్నీ పట్టుకోగలిగితే పురాణకర్తల లోకజ్ఞతను ప్రశంసించకుండా ఉండలేము.

# మహిషాసురుడు

మహిషాసురుని కథకు ఒక ప్రత్యేకత ఉన్నది. హిందూ పురాణాల ప్రకారం మహిషాసురుడిని శ్రీదేవి చంపింది. "మహిషాసుర మర్దని"గా ఆమెను ఈనాడు భక్తి ప్రపత్తులతో కొలుస్తున్నారు. ఆమె చుట్టూ ఒక బలీయమైన పూజా సంస్కృతి నెలకొని స్థిరపడి ఉంది. ముఖ్యంగా కింది వర్గాలలో మూఢభక్తిని ప్రచారంచేసి వారి ఆలోచనలను – మేధోశక్తినీ ఒక పరిమిత పరిధిలో నియంత్రించటానికి ఈ సంస్కృతి దోహదం చేస్తున్నది. స్త్రీ సృజనాత్మకతను జీవితాన్నీ పూజల చుట్టూ – వ్రత నియమాల పరిధిలో నియంత్రించ టానికీ ఈ సంస్కృతి దోహదం చేస్తున్నది. స్త్రీల శూద్రుల సృజనాత్మకతను ఒక పరిమిత పరిధిలోనే ఉంచటం దీని వెనుకగల ఉద్దేశ్యం. ఈ ఉద్దేశాన్ని మరుగుపరచే విధంగా స్త్రీలను ఆకర్షించే కథలు – సంఘటనలు ప్రచారమయ్యాయి. మహిషాసురుడు స్త్రీలను బాధించేవాడనీ అందుకే పరాశక్తిగా దేవి అతన్ని చంపిందనీ స్త్రీలు గర్వపడే విధంగా ఈ కథలున్నాయి. కిందివర్గాలనూ స్త్రీలనూ ఎదగనీయకుండా చేసిన కుతంత్రమే ఇది.

'మహిషము' అంటే దున్నపోతు. హిందూ పురాణాల ప్రకారం దున్నపోతు యముని వాహనం. యముడు దిక్పాలకులలో ఒకడు. సమస్త జీవాలకూ న్యాయ నిర్ణేత. మనుషులకు ప్రాణం ఎంత కాలం ఉంచాలి; వారు చేసిన కర్మల ఫలితం ఎలా నిర్ణయించాలి, వారి పాప కర్మలకు ఎలాంటి శిక్షలు విధించాలి, అనేది నిర్ణయించేది యముడే. అతడు యమ ధర్మరాజు. అలాంటి ధర్మరాజు వాహనం మహిషం చిహ్నంగా గల ఒక తెగ పూర్వం ఉండేది.

ఒక జైనతీర్థంకరుని చిహ్నం కూడా మహిషమే. ఈ కోణంలో చూస్తే మహిషం చిహ్నంగాగల జాతులు జైన ధర్మాన్ని అనుసరించేవారనీ జైనాన్ని అణచివేసి మహిషాన్ని యుముని వాహనంగా చేశారనీ అర్థమవుతుంది. జైనం మీద తిరుగుబాటుగానే మహిషా సుర సృష్టి జరిగి మహిషాసుర మర్దనిగా దేవిని పూజించే సంప్రదాయం నెలకొన్నది.

పురాణాల ప్రకారం మహిషుడు, దితి కశ్యపుల కొడుకు. దితి కొడుకులు దైత్యులు. వీరు దేవ గణాల చేతిలో మరణిస్తూ ఉండటంతో దితి దేవగణాలనూ వారి రాజైన ఇంద్రుడినీ జయించగల కొడుకు కోసం తపస్సు చేసింది. ఆమె తపస్సు తీవ్రతను (వేడిని) పక్కనే సుపార్శ్వుడు అనే ముని భరించలేకపోయాడు. "నీకు 'మహిషుడు' పుడతాడు" అని, ఆమెను శపించాడు. ఆ విధంగా దున్నపోతు తలతో మహిషుడు పుట్టాడంటారు. స్త్రీల తపస్సును దృఢ సంకల్పాన్నీ సహించలేని సమాజానికి ప్రతీకగా ఆ మునిని చెప్పుకోవాలి. అసుర వీరులందరికీ చెప్పే గుణాలే మహిషునికీ చెప్పారు. మునులను – దేవగణాలను – స్త్రీలను – పిల్లలను బాధించటం అనేవి సమాజంలో సామాన్య ప్రజల సానుభూతిని

పొందే అంశాలు. ఎవరినైనా దుష్టులుగా ముద్రవేయాలంటే ఈ గుణాలు వారికి ఉన్నాయని చెబితే చాలు. వారిని చంపటానికి సమాజం ఆమోదిస్తుంది; సహకరిస్తుంది.

తల దున్నపోతులాగ శరీరం మనిషిలాగ ఉండే దుష్టుల రూపకల్పన ప్రపంచ సాహిత్యంలో ఉంది. అద్భుతమైన అనుభూతుల కోసం ఇలాంటి పాత్రలు సృష్టిస్తూ ఉంటారు. గ్రీకు పురాణాలలో "మినోటార్" పేరుతో ఒక మహిషాసురుడున్నాడు. ఆ రాక్షసుడు రోజూ నగరంలోకి వచ్చి జనాలను తింటూ ఉండేవాడు. దానితో రాజుగారే అతనితో ఒక ఒప్పందం చేసుకుని అతనికి పద్మవ్యూహం లాంటి ఒక భవనం కట్టించి అందులో ఉంచాడట. యుద్ధాలలో ఓడిపోయి బందీలుగా చిక్కిన శత్రువులను రోజూ అతనికి ఆహారంగా పంపు తుండేవాడట. ఆఖరుకు ఒక ఏథెన్స్ వీరుడు (రాకుమారుడు థీసస్) ఆ రాక్షసుని చంపి రాజ్యానికీ రాజుకూ ఊరట కలిగించాడు. ఇలాంటి జానపద కథలు చాలా ఉంటాయి.

మహాభారతంలోని బకాసురుని కథ కూడా ఇలాంటిదే. అద్భుతాశ్చర్యాలు కలిగించే ఇలాంటి కథలు వినోదానికీ విజ్ఞానానికీ దారితీయవచ్చునేమో గాని భారతదేశంలో మాత్రం, వర్గ వైషమ్యాలకూ మూఢ భక్తికీ - పూజా సంస్కృతికీ ఆలవాలమయ్యాయి. జాతి ఆలోచనలను ఎదగకుండా చేశాయి.

మహిష్మానులు ఒక స్థానిక తెగకు చెందిన ప్రజలు. హైహయులనీ ప్రతీతి. ఇప్పటి మైసూరు నగరం మహిష్మానుల నగరం. ఆ తెగవారినీ అసురులుగా వైదికమతం ముద్రవేసింది. పూర్వం ఇక్కడ జైనం ఎక్కువగా ఉండేది.

వింధ్య పర్వత ప్రాంతాలలో నివసించే ఒక స్థానిక తెగకు మహిషకులతో సంబంధం ఉన్నదనీ వారు జైన బౌద్ధ ధర్మాలను పాటిస్తూ ఉండేవారనీ ఆ విధంగా వైష్ణవ మతానికి విరోధులయ్యారనీ అందుకే అసురులుగా ప్రచారమయ్యారని చెబుతారు. మహిషుని గురించి చాలా కథలున్నాయి.

1. మహిషుడు దితి, కశ్యపుల కొడుకు
2. ఒక మహిషుడు, అనుహ్రదుడు, సూర్మి అనేవారి పుత్రుడు. (భాగవతం)
3. మహిష్మతి అనే ఆమె, శాపంవల్ల మహిషమై కొలనులో క్రీడిస్తూ ఉండగా సింధు ద్వీపుడనే రాజు రేతస్సు కొలనులో పడిందట. దానిని ఆమె మింగి గర్భం ధరించి మహిషాసురుని కన్నది. (వరాహ పురాణం).
4. రంభుడు అనే దనుజుడు మహిషంతో రమిస్తే మహిషాసురుడు కలిగాడు. (దేవీ భాగవతం.) ఒక మహిషాసురుని (మహిషాక్షుడు) కుమారస్వామి చంపాడని భారతం (అరణ్యపర్వం 5-258 - 285) చెప్పింది.

ఈ కథలన్నీ గమనిస్తే ఇవి భిన్న ధర్మాల మధ్య ఉన్న స్పర్ధల నేపథ్యంలో రూపొందినట్లు కనిపిస్తుంది. వీరంతా మహిషక తెగలోని వీరులు. అసుర మతాలను

నాశనం చేయటం కోసం జరిగిన ప్రయత్నాల సమాహారంగా ఈ కథలను అర్థం చేసుకోవాలి.

మహిషుని చంపిన దేవీ శక్తిని దుర్గ, అంబిక, చండిక, చండి వంటి చాలా పేర్లతో ప్రసిద్ధం చేశారు. మహిషాసురుని కొడుకు గజాసురుడు. శివుడు గజాసురుని చంపటం గురించీ కథలున్నాయి.

దితి కశ్యపుల కొడుకు మహిషాసురుడు ప్రజలను బాధించటం సంగతి ఏమోగాని అతడు గొప్ప తాత్వికుడుగా కనిపిస్తాడు. ఇతడు శివుని గురించి తపస్సుచేసి తనకు మరణం లేకుండా వరం కావాలన్నాడు. పుట్టినవారు మరణించక తప్పదనీ అలాంటి వరం ఇవ్వ లేననీ శివుడు చెప్పాడు. ఇంకోటేదైనా కోరుకోమన్నాడు. "ఎవరివల్ల మరణం కలుగుతుదని భయపడతావో - ఎవరెవరివల్ల మరణం రాదనుకుంటావో ఆలోచించి చెప్పు - అలాంటి వరం ఇస్తా"నని కూడా సూచనప్రాయంగా చెప్పాడు. స్త్రీలకు తనను చంపగలిగేటంత శక్తి ఉండదని మహిషుడు భావించాడు - అందుకే స్త్రీ చేత మరణం కలిగేలాగ వరం కోరుకున్నాడు.

వరగర్వంతో మహిషుడు దేవతలను బాధించాడనీ అందుకే వారంతా కలిసి శక్తిని ఆరాధించి తమ శక్తులన్నీ ఆమెకు ఇచ్చి - తమ తమ ఆయుధాలు ఇచ్చి ఆమెచేత మహిషుని చంపించారనేది పురాణాలలో ప్రసిద్ధంగా ఉన్న కథ. దేవి (సింహాన్ని వాహనంగా చేసుకుని) మహిషుని (దున్నపోతు) చంపింది.

స్త్రీల పట్టుదలకు ఉదాహరణగానూ ఈ కథలు తీసుకోవచ్చు. శత్రువులను జయించగల కొడుకు కోసం దితి తపస్సు చేయటం - ఆమె దీక్ష పక్కవారికి భరించలేనంత తీవ్రంగా ఉండటం - దేవి ఎన్నెన్నో మెలకువలతో ఎందరో పరివార దేవతలతో మహిషుని చంపటం ఆలోచింపదగ్గవి. స్త్రీల చేత అసురులను చంపించటం - ఆ స్త్రీమూర్తుల చుట్టూ పూజా సంప్రదాయాలు విస్తరింప జేయటం - ఆ విధంగా స్థానిక సంస్కృతిపై తమ ఆర్య సంస్కృతి ముద్రవేయటం గమనిస్తే ఈ గెలుపు వ్యూహాత్మకమైనదనే తోస్తుంది.

నరకాసుర వధ - మహిషాసుర వధ - రెండూ హిందువులకు గొప్ప ఊరట కలిగించిన సంఘటనలుగా ఉత్సవాలు చేసుకోదగినంత ప్రముఖమైనవిగా నిలిచిపోయాయి. దీపావళి, దసరా పండుగలలో స్త్రీల పరంగా బొమ్మల కొలువులు - వ్రతాలు, నోములు - లక్ష్మీపూజలు - ఎన్నెన్నో సంప్రదాయాలుగా స్థిరపడ్డాయి. ప్రజలను భక్తిలోనే ఉంచే మార్గాలు ఇవి. మహిషాసుర మర్దని అంశతో శక్తులుగా పూజలందుకుంటున్న వారంతా ఆదిమ సమాజపు గ్రామశక్తులే. పురాణ సాహిత్యం స్థానిక చరిత్రను సంస్కృతీకరించి దేవాసుర గాథల పేరుతో ప్రచారంచేసి వాస్తవాలను తారుమారు చేసింది. భక్తి సిద్ధాంతాన్నీ, కర్మ సిద్ధాంతాన్నీ ప్రచారం చేయటం వెనక ప్రజలను భక్తిమత్తులో ఉంచే కుట్ర ఉన్నది. అది పాలకవర్గాల ప్రయోజనం. దీనికి కర్మ సిద్ధాంతాన్నీ జోడించారు. కర్మఫలం ఎవరైనా సరే తప్పించుకోలేరు

అంటూ కథలు అల్లారు. దేవతలు కూడా కర్మ ఫలాన్ని తప్పించుకోలేరు అని భర్తృహరి లాంటి తాత్విక కవుల చేతనే చెప్పించారు.

నేతా యస్య బృహస్పతిః ప్రహరణం వజ్రం సురాసైనికాః
స్వర్గో దుర్గ మనుగ్రహః ఖలుహరో రైరావణో వారణః
ఇత్యాశ్చర్య బలాన్వితోఽపి బలభిద్భగ్నః పరైస్సంగరే
తద్వ్యక్తం నను దైవ మేవ శరణం ధిగ్ ధిగ్ వృథా పౌరుషమ్ (భర్తృహరి - దైవపద్ధతి)[1]

Indra, the ruler of Heaven possessing vast and astonishing powers and prowess was however defeated in the battle with his foes, the Rakshasas though he had Brihaspathı as his preceptor and counsellor, the Vajrayuda as his weapon, the gods themselves as his fighting forces, heaven itself as his citadel, Lord Vishnu himself as his guide, and Iravatha as his bearer. Hence it can verily be said that no amount of unaided human effort is sufficient to crown our efforts but his supreme will and grace.

బృహస్పతి గురువుగా, వజ్రాయుధం ఆయుధంగా, ఐరావతం వాహనంగా, సురులు సైనికులుగా, స్వర్గం రాజ్యపు కోటగా హరి అనుగ్రహం ఉండి కూడా ఇంద్రుడు శత్రువుల చేతిలో ఓడిపోయాడు. దైవానుగ్రహం లేని పురుష ప్రయత్నం వృథా అని దీనివల్ల తెలుస్తోంది.

దైవానుగ్రహం కోసం పూజలు చేయాలనే సూచన దీనిలో కనిపిస్తుంది. దుర్గామాత ఆలయాలు, భద్రకాళి ఆలయాలు భారతదేశంలో దాదాపు అన్ని రాష్ట్రాలలోనూ కనబడతాయి. చాలా రాష్ట్రాలలో వీరిని గురించిన కథలు మహిషాసురుని వంటి రాక్షసుల కథలతోనే ముడిపడి ఉన్నాయి. కేరళలో తిరువాన్మూరు ప్రాంతాలలో జరిగే పడయని కడమ్మనిట్టలో జరిగే ఉత్సవాలలో అసుర సంహార గాథలు ప్రదర్శిస్తుంటారు. అలాంటి గాథలలో ఒకటి దారికా సంహారం. ఈ రాక్షసుడి పేరు 'దారుకుడు' తపస్సుచేసి ఏ పురుషుడూ తనను జయించకుండా వరం పొందాడు. అందువల్ల అతనిని స్త్రీచేత చంపించారు. దారుకుని చంపిన "కాళి" ఉగ్ర స్వరూపిణి. ఆమె శివుని మూడో కంటి నుంచి పుట్టిందట. దారుకుని చంపాక కూడా ఆమె భీకరమూర్తిగానే ఉగ్రంగా ఉంది. అప్పుడు శివుడు పరివార దేవతలను - శక్తులను (మరుత్, పిశాచ, యక్షగణాలను) పిలిచి ఆమె ప్రసన్నురాలయ్యేలాగ చేయాలన్నాడు. వారు వివిధ రూపాలతో, నృత్య గానాలతో, ఆమెను అలరించి ఆమె కోపాగ్ని చల్లార్చి ఆమె అనుగ్రహం పొందారు. అప్పటి దేవీశక్తుల వివిధ రూపాలను గుర్తుతెచ్చే విధంగా ఈ ఉత్సవాలలో కళాకారులు ముఖాలకు రకరకాల మాస్కులు (తొడుగులు) ధరించి నృత్యాలు చేస్తారు. విచిత్ర వేషాలు, దసరా వేషాలు ఇలా ప్రసిద్ధమైనాయి. వీటిలో వివిధ జంతురూపాలనూ ప్రదర్శిస్తారు.

---

1 (భర్తృహరి నీతి శతకం with English translation by P Krishna Murthy 1965)

దసరా నవరాత్రులు ఇలాంటి వేషాలకు ఆటపాటలకు ప్రాముఖ్యం ఇచ్చాయి. అన్నీ అసుర సంహారాలను, శివమహిమలనూ తలపోసుకునే లక్ష్యం కల ఇతివృత్తాలే.

హిందువుల జాతరలలోనూ సంబరాలలోనూ దున్నపోతును బలి యిచ్చే సంప్రదాయం కింది కులాలవారి చేతనే ఆచరింప చేస్తారు. మహిషాసురుడు అసుర వీరుడు – అతనిని గుర్తుకుతెచ్చే సంబరాలు ఆర్యగణాలకు ఆనందాన్నివ్వవచ్చు. కాని కింది కులాలచేత మహిషాన్ని (గావుపట్టే సంప్రదాయం) చంపించటంలో అంతరార్థం ఏమిటి? వారి వీరులను వారే కించపరచేలా చేయటం – అలాంటి సంబరాలను గ్రామ పెద్దలు ప్రోత్సహించటం – కింది కులాలను మూఢభక్తిలోనికి నెట్టి నిర్వీర్యం చేయటానికే అనిపిస్తుంది. తమ నాయకులు ఓడినా ప్రతిపక్షపు నాయకుల గెలుపును పండగ చేసుకునే స్థితికి ప్రజలను తేవటం రాజకీయం. ఈ విధంగా దైవానుగ్రహం అనే భావనలోకి స్త్రీలనూ శూద్రులనూ తరలించారు.

# నరకాసురుడు

కొన్ని పురాణాల ప్రకారం నరకుడు కశ్యపునికీ కాళిక (దక్షుని కూతురు)కూ పుట్టినవాడు. ఒక నరకుడు భూమిపుత్రుడు. నరకాసురుడు దేవ/ఆర్య గణాలకు బలమైన ప్రత్యర్థి. హిందువుల దసరా పండగ మహిషాసురుని చంపటంతోనూ దీపావళి పండగ నరకుని చంపటంతోనూ ఈనాటి వరకూ ముడిపడి ఉన్నాయంటే వారు ఆర్యులకు ఎంతటి శత్రువులో అర్థం చేసుకోవచ్చు.

నరకాసురుని వృత్తాంతం వరాహావతార కథ నుంచి కృష్ణావతారం వరకు నడిచిందంటే ఈ మధ్య కాలంలో నరకాసుర నామధేయులు చాలామంది ఉన్నారా? లేక ఒక్కడే అన్ని యుగాలూ చిరంజీవిగా ఉన్నాడా అని అనుమానం కలుగుతుంది. నరకాసురుని పుట్టుక వరాహావతారం కాలం నాటిది. ఒక జలప్రళయం తర్వాత మళ్ళీ సృష్టి మొదలు కావలసి ఉన్న సమయానికి భూమి నీటిలో మునిగి ఉన్నది. భూమిని నీటిలో నుంచి పైకి తీస్తే తాను సృష్టిచేస్తానన్నాడు బ్రహ్మ. భూమిని పైకి తెచ్చేవారెవరు? బ్రహ్మ ఆలోచనలో పడ్డాడు. అతని ముక్కు నుంచి వరాహ శిశువు ఊడిపడింది. అది చూస్తుండగానే పెద్దదై పోయింది. భూమిని తన కోరలతో పట్టుకుని పైకెత్తింది. అప్పటికి భూమి దైత్యులది. దైత్యరాజు హిరణ్యాక్షుడు వరాహుడిని అడ్డుకున్నాడు. వరాహం హిరణ్యాక్షునితో యుద్ధం చేసి అతనిని చంపేసి భూమిని పట్టుకువచ్చేసింది. అది భూమి ఆక్రమణకు మూర్తీకరణం. భూమిని స్త్రీగా భావించి ఆమెకూ వరాహునికీ ఒక పిల్లవాడు పుట్టాడని పురాణాలు చెప్పాయి. ఆ పిల్లవాడు నరకుడు. అతనికి వరాహ రూపంరాలేదు. భిన్న జాతుల స్త్రీ పురుషుల కలయిక ఫలితంగా పుట్టాడు గనక అసురుడయ్యాడన్నారు.

భూమి విష్ణువును కామించిందనీ కొన్ని పురాణాలు రాశాయి. భూమి దైత్యులను వదిలేసి ఆర్యులు కావాలనుకున్నదా? వారిని వరించి వెళ్ళిందా? ఆర్యులు దైత్యుల నుండి భూమిని లాక్కున్నారా? అనేది ఆలోచించనీయకుండా పురాణాలు రసవత్తరమైన కథలు అల్లేశాయి.

ఈ కథలో భూమి (భూదేవి) నిజంగానే విష్ణువును వరించి వెళ్ళిందా? బలాత్కారానికి లోనయిందా అనేదీ ప్రశ్నే. ఫలితంగా పుట్టిన ఆ పిల్లవాడు ఎలా పెరిగాడో ఏ పురాణమూ చెప్పటంలేదు. ఆ పిల్లవాడి పుట్టుకకు కారణమైన ఆ తండ్రి అతన్ని చంపేటప్పుడే రెండో సారి అతనిని చూశాడు - అదీ కొన్ని యుగాల తర్వాత. ఈ కథకు భాష్యాలు ఎన్నయినా చెప్పుకోవచ్చు. నరకుని తల్లి నిస్సహాయురాలయిన మాతృమూర్తి. కిందివర్గాల స్త్రీలను బలాత్కరించిన అగ్రవర్ణాల పురుషులు ఆ స్త్రీలు తమ ఇష్టంతోనే లైంగిక సంపర్కానికి ఒప్పుకున్నారని దబాయించటం - తమను కామించారని చెప్పుకోవటం ఇప్పుడూ నడుస్తున్న

వ్యవహారమే. ఈ కొడుకు నీకే పుట్టాడనీ సంపదలో భాగం కావాలనీ ఆస్తి పంచాలనీ ఆ తల్లి అడిగిందో ఏమో నరకుని చంపవలసిన అవసరం ఏర్పడింది.

నరకుడు బలశాలిగా ఎదిగాడు. తనకంటూ ఒక రాజ్యం ఏర్పాటుచేసుకున్నాడు. అతని రాజధాని ప్రాగ్జ్యోతిషపురం. సుప్రతీకము అనే ఏనుగు అతని వాహనం. వీరుడైన భగదత్తుడు అనే కొడుకూ బుద్ధిశాలురయిన మంత్రులూ దండనాయకులతో నరకుడు సంపన్నంగానే ఉన్నాడు. అతనిని చంపాలి గనక అతనిపై అభియోగాలు మోపారు. ప్రజలను హింసిస్తున్నాడనేది చాలా సులువుగా మోపే అభియోగం. స్త్రీలను చెరపట్టాడనేది మరొక అభియోగం. లంచాలు తింటున్నాడని ప్రచారంచేసి ఉద్యోగాల నుండీ పదవుల నుండీ తీసేయటం ప్రజాస్వామ్య వ్యవస్థలోనే సాగుతున్నప్పుడు రాచరిక పాలనలో జరగడం విశేషమేం కాదు.

నరకుడు దేవమాత దితి కుండలాలు 'చెవి కమ్మలు' అపహరించాడట. ఆ కుండలాలు అమృతమయమైనవి - క్లేశాన్ని పోగొట్టేవీను. అంతేకాదు వరుణుని రాజ చిహ్నామైన గొడుగును కూడా దొంగిలించాడట. (విష్ణుపురాణం). 'మణి పర్వతం' అనే అమరాద్రి స్థానాన్ని (దేవతలకొండ) వశపరచుకున్నాడట. ఇంద్రుని వాహనమైన ఐరావతాన్నీ కావాలన్నాడట. దేవగణాలూ ఇంద్రుడూ ఈ కష్టాలన్నీ కృష్ణునితో చెప్పుకున్నారు. కృష్ణుడు నరకుని మీదికి దండెత్తివెళ్ళి నరకుని చంపి ఆయా వస్తువులన్నీ వారికి అందజేశాడట. విష్ణువుకూ కృష్ణునికీ ఇక్కడ అభేదం చెప్పారు.

జన్యుపరంగా చాలామంది అసురులకు దేవగణాలతో సంబంధం కనిపిస్తుంది. నరకుడు మిశ్ర సంతతి. అతనికి తల్లి కులం వచ్చిందా? తండ్రి కులం వచ్చిందా అనేది ఆలోచించాల్సిన అంశం. సమాజంలో అతని స్థాయి ఎలాంటిది? అసురులు ఇలాంటి మిశ్ర (సంకర) సంబంధాల నేపథ్యం కలవారా? వారిని సమాజం అంగీకరించక దూరం పెట్టిందా అని ప్రశ్నించుకుంటే అవుననే సమాధానం వస్తుంది.

నరకాసురుని వృత్తాంతం వింటే అది నిర్ధారణ అవుతుంది. నరకాసురునిపై మోపబడ్డ అభియోగాలు నేరస్థ జాతులపై చేసే అభియోగాలే. దేవమాత అదితి కర్ణ కుండలాలు (చెవిపోగులు) అపహరించటం - వరుణుడి గొడుగు ఎత్తుకుపోవటం - ఇంద్రుని ఐరావతం తనకు కావాలనుకోవటం మొ।నవి. నేరాలుగానే చెప్పారు. సముద్ర మథనంలో వెలువడ్డ సంపద చాలావరకు దేవగణాలు తీసుకున్నారు. వాస్తవానికి అది ఉమ్మడి కృషి ఫలితంగా లభించిన సంపద. అందరికీ రావలసిన ఆ సంపదలో వాటా ఆశించటం నేరం అయిందా? నరకాసురుని కృష్ణుడు చంపాడట - (విష్ణువు వాహనంగా చెప్పబడే) గరుడుని ఎక్కి యుద్ధం చేశాడట. తన చక్రాయుధంతో నరకుని చంపి అతని సంపదనంతా తన నగరానికి తరలించాడనీ నరకుని అంతఃపురంలోని పదహారు వేలమంది రాజకన్యలను తన భోగకాంతలుగా చేసుకున్నాడనీ పురాణాలు చెబుతున్నాయి. వారు

కృష్ణుని వరించారనీ ఆయన వారిని వివాహమాడి భార్యలుగా చేసుకున్నాడనీ భాగవతం అంటున్నది. ఇక్కడ మరో సందేహమూ వస్తుంది. భూమి వరాహ రూపంలోని విష్ణువును వరించటం బలాత్కారం కావచ్చునా? అత్యాచార ఫలితంగా పుట్టిన కొడుకు నరకుడు అందుకే దేవద్వేషి అయ్యాడా? అనేది ప్రశ్నే.

వరాహం భూమిని తీసుకుపోతున్నప్పుడు హిరణ్యాక్ష దైత్యుడు అడ్డుపడ్డాడు. భూమి దైత్యులది. కాబట్టి హిరణ్యాక్షుడు అడ్డుకున్నాడు. వరాహం హిరణ్యాక్షుని చంపి భూమిని ఎత్తుకుపోయింది. కోస్టల్ కారిడార్లకూ, ఆలయాల విస్తరణకూ కావాలంటూ ఇరవై ఒకటో శతాబ్దంలో ఆదివాసీల భూములనూ, అమాయక బలహీన ప్రజల భూములనూ ప్రభుత్వాలు లాక్కుంటున్నట్టే అక్కడా జరిగింది. ఈ సంఘటనను చాలా రకాలుగా విశ్లేషించుకోవచ్చు.

1. భూ ఆక్రమణ 2. స్త్రీల బలాత్కారం 3. భిన్నవర్గాల సంతానం తల్లిదండ్రులలో ఎవరికీ చెందకుండా దుర్భరంగా పెరగటం 4. ఆ సంతానం సమాజానికి భారం కావటం 5. ఆ సంతానం అంటరాని చెప్పరాని కులంగా ముద్రవేయబడటం. 6. అలాంటి అక్రమ సంతానాన్ని చంపటమే సమస్యకు పరిష్కారంగా భావించటం. (నరకుని చంపిన సందర్భం), భారతదేశంలో దీపావళి పండగకూ లక్ష్మీ పూజలకూ దారితీసిందనే కథలు నమ్మితే పై విశ్లేషణలూ ఆలోచించవలసిందే.

అసుర జాతుల ఆవిర్భావంలో వర్గీకరణంలో ఇలాంటి కోణాలు కూడా పరిశీలించాలి. వరాహ రూపాన్ని భూదేవికీ, నృసింహరూపాన్ని చెంచులక్ష్మికీ అంటగట్టడం బాధాకరమైనదే. దానిని రసవత్తరంగా వర్ణించటం పురాణాలకే చెల్లుతుంది. ఆస్వాదించటం కొందరికే పరిమితం.

పురాణాలలో కనిపించే స్త్రీ పురుష సంబంధాల కథలు ఒక్కో సందర్భంలో జుగుప్స కలిగిస్తాయి. అగ్రవర్ణాల పురుషులు కిందివర్ణాల స్త్రీలను కామించినప్పుడు అవి భక్తి శృంగారాలవుతాయి. దేవకార్యం పేరుతో మోసాలు జరిగినప్పుడు ఆ స్త్రీలను కొన్ని వరాలతో నోరెత్తకుండా చేస్తారు.

భిన్నవర్గాల స్త్రీ పురుష సంబంధాల మూలంగా జన్మించిన వారి కులాలు సాధారణంగా న్యూనతకు లోనయ్యాయి. కొన్ని సందర్భాలలోనే వారు గౌరవపాత్రు లయ్యారు. ఆయా పరిస్థితుల ప్రభావం వల్లనేమో.

వానరులుగా చెప్పబడుతున్న వాలి, సుగ్రీవుడు, ఆంజనేయుడు తమ తల్లులకు దేవగణాల సంపర్కం (బలాత్కారం) వల్ల కలిగారు. ఆర్యజాతి స్త్రీలపై హక్కు సంపాదించుకున్న దేవగణాలు స్థానిక జాతుల స్త్రీలపైనా అలాంటి హక్కును ఆశించి ఉంటారు. వారు ప్రతిఘటించినప్పుడు ఆ సంతానాన్ని దూరం పెట్టారు. స్థానిక జాతులైన నాగ యక్ష స్త్రీల పట్ల ఆర్యపురుషులు అమానవీయంగానే ప్రవర్తించారు. తాటక, శూర్పనఖ, అయోముఖి వంటివారు ప్రతిఘటించటం వల్లనే వారి కథలు వక్రీకరణకు గురయ్యాయి.

నరకాసుర వధ సంపద కోసం జరిగింది. నరకుని చంపాక అతని నగరంలోని సంపద అంతా కృష్ణుని నగరానికి చేరింది. నరకుని అంతఃపురం కాంతలూ, పదహారు వేలమంది రాజకన్యలూ కృష్ణుని భోగస్త్రీలయ్యారు. అందువల్ల అది సంబరాలు జరుపుకో వలసిన సందర్భం అయింది. ఈనాటికీ నరకాసుర వధను దీపాలతో టపాసులతో లక్ష్మీ పూజలతో జరుపుకుంటున్నారంటే అది దేవ/ఆర్య రాజులు అసుర రాజులను జయించిన అపూర్వ స్మృతిగా ఉండిపోయిందన్నమాట.

నరకాసురుని వృత్తాంతాన్ని మరో విధంగానూ అన్వయించుకోవచ్చు. నరకుడు భూమిపుత్రుడు. భూమి జీవ విస్తరణకూ, పంటలకూ, ఫలవృద్ధికీ ఆధారం. వరాహం అంటే పంది – అడవి పందులు పంటలను నాశనం చేస్తుంటాయి. పంటలను రక్షించు కోవటానికి ప్రయత్నించే అసురులను హిరణ్యాక్ష, నరకాసుర పదాలు సూచిస్తున్నాయి. ఆర్యుల నుంచి తమ రాజ్యాలను రక్షించుకునే ప్రయత్నంలో అమరులైన అసుర క్షత్రియులనూ ఈ కథ స్ఫురణకు తెస్తుంది.

నరకాసురుడిని కృష్ణుడు చంపటానికి వెళ్ళిన ఘట్టాన్ని వర్ణిస్తూ పోతన కృష్ణునికీ విష్ణువుకూ అభేదం చెప్పాడు. హరి.గరుడునిపై ఎక్కి యుద్ధానికి వెళ్ళాడన్నాడు. విష్ణువుకు వాడే విశేషణాలన్నీ కృష్ణునికి వాడాడు. ఇలాంటివి పురాణాలలో తరచు కనిపిస్తాయి. “హరి గరుడ వాహనారూఢుడై చను సమయంబున హరికి సత్యభామ యిట్లనియె.” (భాగ. 9–150) నరకుని నగరానికి వాయు, జల, అగ్ని ప్రాకారాలున్నాయి. మురాసురుడు దుర్గ రక్షకుడు. మురాసురుడినీ అతని ఏడుగురు కొడుకులనూ, దండనాధుడినీ హరి యుద్ధంలో ఓడించి చంపేశాడు. తర్వాత నరకుడు యుద్ధానికి వచ్చాడు. మొదట్లో సత్యభామ నరకుడితో యుద్ధం చేసింది. ఆమె యుద్ధాన్ని హరి మెచ్చుకుని నీకు కావలసిన నగలు చేయిస్తానన్నాడట. (స్త్రీలు నగలతోనే తృప్తిపడతారని పురుషుల నమ్మకం.) సత్యభామ నుంచి విల్లు అందుకున్నా హరి చక్రంతోనే నరకుని తల తెగవేశాడు. దేవగణాలూ మునులూ పూలవర్షం కురిపించారట. అప్పుడు భూదేవి వచ్చి కుండలాలు, వరుణుని గొడుగు, వైజయంతి అనే వనమాల, మరొక మహారత్నమూ సమర్పించి ఆ దేవదేవుడిని స్తుతించింది. నరకాసురునికి అప్పటికి పిల్లలున్నారు. వారిపైనా కృష్ణుడు (విష్ణువు) వైరం సాధిస్తాడేమోనని భూదేవి ముందు జాగ్రత్త చర్యగా కానుకలు సమర్పించింది.

కృష్ణుడు నరకాసురుని నగరంలోని పదహారు వేలమంది కన్యలను (తన మన్ననకు ఉవ్విళ్ళూరుతున్న వారిని) ద్వారకకు పంపాడు. నరకాసురుని భాండాగారంలోని ధనాన్ని, రథాలనూ, ఏనుగులనూ కూడా ద్వారకకు పంపాడని భాగవతం చెబుతున్నది. పదహారు వేలమందికీ భవనాలు కట్టించి ఒక మంచి ముహూర్తంలో వారిని పెళ్ళిచేసుకున్నాడని కూడా చెప్పింది.

భూమి హక్కుదారులను చంపి భూమిమీద హక్కు నిర్ధారించుకోవటం - ఈ కథలో కనిపిస్తుంది. భూమిని నమ్ముకున్న రైతులు తమ పొలాలలోనే ఆత్మహత్యలు చేసుకోవలసి రావటం - ఆ భూముల నుండి వేరుచేయబడటమూ అనంతర పరిణామాలు. భూమి పుత్రుడిగా నరకుడిని 'భౌమ' పదంతో వ్యవహరిస్తారు. మట్టి పేడ, ఎరువు వంటి వానితో అనుసంధానం చేసి జీవ విస్తరణకూ ప్రత్యుత్పత్తికీ ప్రతీకగా చెబుతారు. ఆదిమ సమాజంలో మట్టిని, పేడను లక్ష్మీదేవిగా (సంపదగా) పూజించే సంప్రదాయం ఉండేది. నరకుని మరణంవల్ల ఆర్య/దేవగణాలకు శత్రువు బాధ తొలగింది. కృష్ణునికి స్త్రీలు లభించారు. మధురానగరానికి సంపద లభించింది. కాబట్టి ఇది వారికి పండగ అయింది. నరకుని చంపి ఆర్యులు చేసుకునే 'దీపావళి' భూమి ఆక్రమణదారులకూ సంపదను దోచుకున్న వారికీ పండగ. అప్పనంగా భూములు దక్కించుకున్న వారూ భారీ ప్రాజెక్టుల కాంట్రాక్టు దారులూ చేసుకోవలసిన పండగ అది.

ఈ కథలో భోగపరాయణులకూ శ్రమజీవులకూ జరిగిన ఘర్షణ ఉంది. నరకుడు భూమిపుత్రుడు. భూమి రత్నగర్భ. కొడుకును పోగొట్టుకుని కూడా క్షమాగుణంతో వ్యవహరించింది. కొడుకును చంపినవానికి రత్నహారం బహూకరించింది. అగ్ర/ఆధిపత్య వర్గాలపట్ల కింది వర్గాలు అంత విధేయతతోనూ మెలగాలా? ఒకప్పటి ఆచారకాండ అలాగే ఉండేది. రైతులు అప్పులు చేసి పస్తులుండి బ్రాహ్మణ పురోహితులు చెప్పిన కర్మకాండలు చేయవలసి ఉండేది. అలాంటి ప్రవర్తనను ఇలాంటి కథల ద్వారా ఆదర్శవంతంగా చెప్పారనుకోవాలి. హరినీ కృష్ణుడినీ కలిపి చెప్పిన ఈ కథ కొన్ని వర్గాలకు గొప్ప కథ. వారికి ఇందులో అనౌచిత్యం కనిపించలేదు.

# తటస్థ వర్గాలు - "రజి"

రెండు బలమైన పార్టీలున్నప్పుడు వర్గ స్పృహ ఉన్నవారు తమకు అనుకూలమైన పార్టీలో చేరిపోవటం రివాజు. ఏ పార్టీలోనూ చేరని వారిని ఈ రెండు పార్టీలూ ఏదో ఒక ప్రలోభంతో ఆకర్షిస్తూ ఉంటాయి. కీలకమైన - బలమైన వ్యక్తిత్వంగల వ్యక్తులనూ, నాయకులనూ వారివల్ల పార్టీకి కలగబోయే ప్రయోజనాలను అంచనా వేసుకుని మరీ ఆహ్వానిస్తుంటారు. చాలా సార్లు రాజకీయాలలో తటస్థ వైఖరి కీలకంగానే పరిణ మిస్తుంది.

పురాణాలలోనూ, పూర్వపు దేవాసుర సమాజంలోనూ ఇలాంటి సందర్భాలు చాలా కనిపిస్తాయి. మహాభారతంలో కురుపాండవ సంగ్రామం మొదలయ్యేముందు కృష్ణుని సహాయాన్ని రెండు పక్షాలూ కోరాయి. కృష్ణుడు తటస్థుడు కాదు - పాండవ పక్షపాతిగా పేరుపొందినవాడే అయినా కౌరవులు అతని సహాయం ఆశించారు.

దేవాసుర యుద్ధాల్లో దేవగణాలు, అసుర గణాలు, అధికార రాజకీయాలలో బద్ధ శత్రువులు. ఈ రెండు పక్షాలలోనూ చేరని గణరాజ్యాలు చాలా ఉండేవి. సాధారణంగా పాలకవర్గాలు తాము సూర్యవంశానికో, చంద్రవంశానికో చెందినట్టు ప్రచారం చేసుకుంటూ ఉంటాయి. చంద్రవంశ రాజుల వర్ణనలో మత్స్య పురాణం 'రజి' అనే రాజును పేర్కొన్నది. రజి ధర్మాత్ముడు, బలవంతుడు. దేవ అసుర గణాలకు జరిగే ఘర్షణలలో కల్పించుకునేవాడు కాదు. తటస్థంగా ఉండేవాడు. ఒకప్పుడు దేవాసురుల ఘర్షణలు మరీ ఎక్కువై ఏ పక్షమూ గెలవలేకపోతున్నప్పుడు ఆ రెండు పక్షాలవారూ "రజి" సహాయం కోరారట. (మత్స్య మను సంవాదం చంద్రవంశానువర్ణనలో - బుధాద్యుత్పత్తి అనే 24వ సర్గలో వివరాలున్నాయి).

బృహస్పతి భార్య తారకూ, చంద్రునికీ పుట్టినవాడు బుధుడు. బుధుడు చంద్రుని వారసుడుగా రాజు అయ్యాడు. అతనికి "ఇల"వల్ల కలిగిన వాడు పురూరవ(సు)డు. ఇతడు నూరు అశ్వమేధాలు చేశాడట. (ఇంద్రుడు ఎలా ఊరుకున్నాడో?)

పురూరవునికీ, ఊర్వశికీ పుట్టిన పుత్ర సంతానం ఎనిమిది మంది. వారిలో 'ఆయువు' అనేవానికి అయిదుగురు కొడుకులు. వారిలో 'రజి' అనేవాడు చాలా బలవంతుడట. దేవ గణాలనూ వారి ప్రత్యర్థులైన అసుర గణాలనూ కూడా జయించగల శక్తిశాలి. అతనికి నూరుగురు కొడుకులు. వారందర్నీ రాజేయులు అనేవారు. రజి కాలంలో దేవాసురులకు యుద్ధం సంభవించింది. దేవాసుర యుద్ధాలు చాలా జరిగాయి. వాటిలో 12 యుద్ధాలను మత్స్య మహాపురాణం పేర్కొన్నది. రజి కాలంలో జరిగిన అలాంటి ఒక యుద్ధం మూడువందల సంవత్సరాలు సాగింది. ఎవరికీ గెలుపుదక్కడంలేదు. రజి ఎవరికి సహాయంచేస్తే వారు గెలుస్తారని బ్రహ్మ చెప్పాడు. (ఇప్పటి కాలంలోని తటస్థ వర్గాలు, ఎన్నికల సమయంలో ఏర్పడే పార్టీల కూటమి - వంటివాని బీజం అప్పటిదే.) అసురులు

రజి దగ్గరకు వెళ్ళి తమకు సాయపడవలసిందిగా కోరారు. "గెలిచాక నాకు ఆధిపత్యం ఇస్తే నేను మీతో కలుస్తాను" అని రజి చెప్పాడు. అందుకు వారు ఒప్పుకోలేదు. దేవగణాలూ రజి దగ్గరకు వెళ్ళాయి. రజి షరతుకు ఒప్పుకున్నాయి. దేవతల రాజైన ఇంద్రుడు తాను 'రజి'కి పుత్రస్థానంలో - యువరాజుగా ఉండటానికి ఒప్పుకున్నాడు. రజి సహాయం వల్ల యుద్ధంలో దేవగణాలు గెలిచాయి. 'రజి' రాజయ్యాడు. కొంతకాలం రాజ్యంచేసి, రాజ్యం ఇంద్రునికి ఇచ్చి తాను తపస్సుకు వెళ్ళిపోయాడు. రజి కొడుకులు నూరుగురూ బలవంతులూ, గుణవంతులూను. తండ్రి పాలించిన రాజ్యం తమకే రావాలని వారు ఇంద్రుడి దగ్గర్నుంచి రాజ్యం లాక్కున్నారు. యజ్ఞభాగాలూ లాక్కున్నారు.

ధర్మంగా వారసత్వంగా రావలసిన రాజ్యం - ఒప్పందం ప్రకారం రావలసిన రాజ్యం అనేవి క్లిష్టమైన అంశాలు. ఎన్నికల సర్దుబాట్లు, రాజ్యాధికారం కొన్నాళ్ళపాటు ఒకరూ తర్వాత మరొకరూ చేపట్టాలనే ఒప్పందాలూ ఇవి భారతదేశ రాజ్యాలలో అనాదిగా జరుగుతుండేవని ఈ కథ తెలియచెప్పుతున్నది.

రజి పుత్రులు రాజ్యాన్ని వదలకపోవటంతో ఇంద్రుడు తన గురువును ప్రాధేయ పడ్డాడు. తాను అధికారంలోకి రావటానికి ఏదో ఒక ఉపాయం ఆలోచించాలన్నాడు. ఆయన ఇంద్రునిచేత రకరకాల క్రతువులు చేయించాడట. అందులో కొన్ని పౌష్టిక (పుష్టి కలిగించే) కర్మలు. అవి ప్రజాధనం/రాజ్య సంపద ఆరగించి బలపడే కార్యక్రమాలయి ఉండాలి. మరికొన్ని కర్మలు ఎలాంటివీ అంటే పాలకవర్గం అవినీతిలో కూరుకుపోయేటట్టు చేసే కర్మలు. పాలకవర్గాన్ని ప్రలోభపెట్టి మోహపెట్టి వారిని ధర్మం నుండి తప్పించే కర్మలట. ఈ కర్మల ప్రభావంవల్ల రజి కొడుకులు ధర్మంతప్పి అవినీతిలో కూరుకుపోయారు. ప్రజలు వారిని తిరస్కరించారు. తర్వాతి ఎన్నికలలో అధికార పక్షం - (రాజేయులు) - ఓడిపోయింది. ఇంద్రుడు మళ్ళీ ఎన్నికయ్యాడు. రాజ్యాధికారం హస్తగతం చేసుకున్నాడు.

అధికారంలో ఉండాలంటే అవినీతికి దూరంగా ఉండాలని చెప్పే కథ ఇది. వర్తమాన కాలపు రాజకీయాలకు బాగా అనువర్తిస్తుంది. ఇలాంటి సార్వకాలికత వల్లనే పురాణ కథలు సజీవంగా నిలిచి ఉన్నాయి.

ఈ కథలో రాజకీయ, సామాజిక చలనాలకు సంబంధించిన అంశాలెన్నో గమ నించవచ్చు. స్వార్థ ప్రయోజనాల కోసం ఏర్పడే పార్టీలలో చేరకుండా తటస్థంగా ఉండే వైఖరి - తనదైన మూర్తిమత్వాన్ని పెంపొందించుకోవాలనే ప్రబోధం - ఎదుటివారిని కూల్చటానికి వారిచేత తప్పులు చేయించటం అనే కూటనీతి - అవినీతిమయమైన ప్రభుత్వాలను ప్రజలు తిరస్కరించాలనే చైతన్యం - ఆలోచించేకొద్దీ ఎన్నెన్నో అంశాలు ఈ వృత్తాంతం వెనక స్ఫురిస్తాయి.

పౌష్టిక కర్మలను కథకు సంధానించటం మతపరంగా చేసిన ప్రచారం. ప్రజా కంటకులు కావటం అనేది శత్రువు చేసే పౌష్టిక క్రియలవల్ల కూడా జరగవచ్చుననేది మూఢ నమ్మకమే అయినా అది సూక్ష్మ రాజకీయం. స్వార్థశక్తుల కుట్రలతో గుణవంతులూ

చెడిపోతారనీ, అధర్మంవైపు మొగ్గుతారనీ మానవ మనస్తత్వాన్నీ, బలహీనతలనూ, ప్రవర్తనా రీతులనూ చెబుతున్న ఈ కథలలాంటివి బాగా ప్రచారంలోకి తేవలసి ఉంది.

ఎదుటివారిని అధికారం నుంచి దించే ప్రయత్నంలో ఇలాంటి వ్యవహారాలు ఇరవై ఒకటో శతాబ్దంలోనూ ప్రజాస్వామ్యయుగంలోనూ కనబడటం ఈ కథ సార్వకాలికతకు నిదర్శనం.

## నృగుని కథ

నృగ మహారాజు ప్రస్తావన రామాయణంలో ఉత్తరకాండ (53-18-22)లో ఉంది. రాజులు ప్రజలపట్ల ముఖ్యంగా మహాత్ములపట్ల బాధ్యతగా ఉండాలనేది ఈ కథ లోని నీతి. సందర్భం ఏమిటంటే రావణవధ తర్వాత రాముడు పట్టాభిషిక్తుడై అయోధ్యను పాలిస్తున్న కాలంలో సీతపై అపవాదు వచ్చింది. ఏ విధమైన విచారణ లేకుండా ఆమెను అడవుల్లో వదిలేశారు. అప్పటి నుంచీ రాముడు అన్యమనస్కంగా విచారంగా ఉండేవాడట. ఒకసారి ఒక మహాత్ముడెవరో రాముని దర్శనానికి వచ్చాడు. ఆ సంగతి లక్ష్మణుడు రామునికి చెప్పటానికి వెళ్తే ఆయన సరిగా వినిపించుకోలేదు. ఆ తర్వాత ఎప్పుడో ఆ విషయం లక్ష్మణుడు రామునికి చెప్పాడు. రాముడు చాలా నొచ్చుకున్నాడట. "మహాత్ములకు దర్శనం ఇచ్చి తీరాలి. వారిషట్ల, రాజకార్యాల పట్ల అలక్ష్యం తగదు" అని చెబుతూ ఉదాహరణగా నృగుని కథ చెప్పాడు.

నృగుడు అనే రాజు దానధర్మాలకు ప్రసిద్ధుడు. పుష్కర క్షేత్రంలో ఒకప్పుడు ఆయన ఒక బ్రాహ్మణునికి ఒక ఆవును దానం ఇచ్చాడు. ఆ ఆవు ఎలాగో తిరిగివచ్చి పాత మందలో కలిసిపోయింది. ఆ మర్నాడు రాజుగారు అదే ఆవును మరో బ్రాహ్మణునికి దానం ఇచ్చాడు. మొదట దానం తీసుకున్న బ్రాహ్మణుడు ఆ ఆవును గుర్తుపట్టి రెండో వానితో వివాదపడ్డాడు. ఇద్దరూ రాజు దగ్గరకు వెళ్ళారు. రాజుగారి దర్శనం దొరకలేదు. కోపంతో ఇద్దరూ రాజును శపించారు. "అర్థులకు దర్శనం ఇవ్వలేదు కాబట్టి నీవు అదృశ్యంగా ఉంటావు" అని – అంతేగాదు "తొండ"గా అయి పడి ఉంటావు. "విష్ణువు వాసుదేవునిగా భూమిమీద అవతరించేవరకూ అలాగే పడి ఉండు. ఆయనవల్ల నీకు శాపవిముక్తి కలుగుతుంది" అన్నారు. విష్ణువునూ వాసుదేవునీ వైష్ణవ మతాన్నీ ప్రచారం చేసే లక్ష్యం ఈ శాపంలో స్పష్టపడుతూనే ఉంది. పరోక్షంగా ఈ కథ నుంచి తెలుసుకోదగిన మంచి అంశాలూ ఉన్నాయి. రాజులు ప్రజలపట్ల బాధ్యతగా ఉండాలి. దానాలు చేసే ఉత్సాహంలో ఒకరికి ఇచ్చిన దానినే తిరిగి మరొకరికి ఇవ్వకూడదు అనేది ముఖ్యాంశం. ప్రస్తుత కాలంలో భూముల పంపిణీ – పేదలకు ఇళ్ళస్థలాల పంపిణీ చాలా భారీస్థాయిలో జరుగుతున్నాయి. పట్టా కాగితాలు వేలమీద పంపిణీ అవుతున్నాయి. భూములు ఉండవు – ఇళ్ళూ ఉండవు. విషయాన్ని ఫిర్యాదుచేస్తే పట్టించుకునే వారూ ఉండరు. సామాన్యులకయితే న్యాయం జరుగదు – అదే కాస్త పేరూ, పరపతీ ఉన్నవారికయితే అధికారగణం స్పందిస్తుంది. స్పందించటం విషయంలో రామరాజ్యం మెరుగేమో – శాప భయాలుండేవి.

# స్త్రీలపట్ల వివక్ష

ఆర్యధర్మం స్త్రీలను రెండో శ్రేణి పౌరులుగానే చూసింది. భారతదేశంలో మాతృస్వామ్య, మాతృవంశానుక్రమ సమాజాలున్న ప్రాంతాలు ఆర్యులవశమౌతున్న క్రమంలో అవి అంతరిస్తూ వచ్చాయి. రామాయణ కాలానికి పితృస్వామ్యం స్థిరపడింది. దానిని ఇంకా బలపరిచే సన్నివేశాలతో రామాయణ మహాభారతాలూ అనంతర కాలపు పురాణాలూ, కావ్యాలూ వెలువడ్డాయి. "మాతృదేవోభవ" అన్నారు గాని, తండ్రికి ఇచ్చిన మాటలకే విలువ ఎక్కువ. పాతివ్రత్యం చాలా గొప్పది. కొడుకులను కన్నతల్లికి గౌరవం ఎక్కువ.

వైదిక వాఙ్మయం స్త్రీలకు పురుషులతో సమ ప్రతిపత్తిని ఇవ్వలేదు. చరిత్ర పూర్వ యుగంలో స్త్రీలు ఉన్నత దశను అనుభవించారనీ జ్ఞానార్జనలోనూ ముందున్నారనీ చెబుతారు కాని, సామాజిక ఆంక్షలు స్త్రీలపై ఎక్కువగానే ఉండేవి. ఒక దశలో స్త్రీలూ, శూద్రులు జ్ఞానార్జనకు అనర్హులు. ఈ రెండు వర్గాలకూ సేవాధర్మమే విధించారు. దానితోనే వారు ముక్తి పొందుతారన్నారు.

జైన బౌద్ధ ధర్మాలు స్త్రీలకు విద్యావకాశాలు ఇచ్చాయి. ప్రాచీన ప్రాకృత సంస్కృత నాటకాలలోనూ వాఙ్మయంలోనూ కనబడే కొన్ని కొన్ని ప్రస్తావనల వల్ల ఈ విషయం గ్రహించవచ్చు.

యోగిని సంప్రదాయం ఒకప్పుడు ఉండేది. బృహత్కథలో బౌద్ధ, జైన సన్యాసుల/ సన్యాసినుల ప్రస్తావనలున్నాయి. రకరకాల విద్యలు నేర్చుకోవటంలో దిగువ వర్గాలవారే ముందున్నారు. నర్మదా తీరంలోని పంచవటీ ఘాట్ పూర్వ సంస్కృతికి చిహ్నంగా ఏర్పడినదే. యోగినులు రాజనీతి, వైద్యం, వశీకరణోపాయాలు తెలిసి ఉన్నవారుగా సాహిత్యంలో కనిపిస్తున్నారు. జైన బౌద్ధ ధర్మాలు వైదిక ధర్మానికి ఎప్పుడూ భయావహంగానే ఉన్నాయి. వాటి నుండి తమ ధర్మాన్ని రక్షించుకోవటానికి వైదిక ధర్మం స్త్రీలనే ఆయుధాలుగా చేసుకున్నది.

మత ధర్మాలు ఏవి ఎలా ఉన్నా స్త్రీల విషయానికి వస్తే ఎన్నెన్నో కఠిన నియమాలు కఠిన నిర్ణయాలూ కనబడతాయి. "అసత్యం చెప్పకూడదు" అనేది నీతి. కాని, స్త్రీల విషయంలో అది వర్తించదు; అసత్యం చెప్పినా పాపం అంటదు. "శరణన్న వారిని రక్షించాలి" కాని ఆ పని స్త్రీలు చేయకూడదు. రాజ్యం వ్యతిరేకించిన వారికి ఆశ్రయం ఇవ్వటం ఎప్పుడూ రాజద్రోహమే. 'స్త్రీలను చంపకూడదు' అనేది నీతి. కాని అధర్మవర్తనులయిన స్త్రీలను చంపవచ్చు. (అధర్మవర్తనులయితే ఎవరినైనా దండించవలసిందే కదా!) ఇలాంటి కూట నీతి స్త్రీల పట్ల అమలు అయింది, అవుతూ ఉంది.

అసురులనూ, స్త్రీలనూ రాజ్యం అణచివేసిందనటానికి పురాణాలలో చాలా కథలు ఉదాహరణ. పురుషాధిక్య సమాజం తమకు మద్దతుగా ధర్మశాస్త్రాలను రూపొందించు కున్నది. స్త్రీల విషయంలో రామాయణం చెప్పిన చాలా సూత్రీకరణలు అప్పటి మత, సాంస్కృతిక ధోరణులకు దర్పణాలు. అవన్నీ ధర్మశాస్త్రాల స్థాయిలో ప్రచారమై ప్రమాణాలయ్యాయి. సిద్ధాంతాలయ్యాయి.

అప్సర స్త్రీల విషయంలో రామాయణం చెప్పిన కథలు శోచనీయమైనవి. పాల సముద్రం మథించినప్పుడు ఒకరసం పుట్టుకొచ్చిందట.అందులోంచి అరవైకోట్ల మంది కన్నె పడుచులు పుట్టుకువచ్చారు. 'అప్' అంటే నీరు రసం. రసంలోంచి వచ్చారు కాబట్టి వారిని అప్సరసలు అన్నారట. వారితోపాటు అనేకమంది పరిచారికలూ వచ్చారట. అప్సరసలను పెండ్లిచేసుకోవటానికి ఎవరూ ఇష్టపడలేదు. అందువల్ల వారు భోగకన్యలు అయ్యారు.

"అప్సునిర్మదనా దేవరస స్తస్మా ద్వర స్త్రియః
ఉత్పేతుర్మనుజ శ్రేష్ఠ తస్మాదప్సరోభవన్
అప్రతిగ్రహణాత్తాశ్చ సర్వా సాధారణాః స్మృతాః" (బాల. 45-20-22)

('సాధారణా' అంటే సామాన్య, భోగకన్య అని అర్థం) పురుషుల భోగపరాయణతకు ఇది సమర్థన – సౌకర్యపు ఏర్పాటు కూడాను.

రాముడిని రాజుగానూ, దేవునిగానూ ప్రచారం చేస్తున్నారు కాబట్టి వ్యక్తులపరంగా చూస్తే స్త్రీలు తమకు ఇచ్చిన మాట గురించి పురుషులను నిలదీయటం దుష్ట స్వభావం అవుతుంది. ఆయనకు ప్రతిగా కైక వరాలు అడగటం గొప్ప దోషంగా పరిగణించారు. పురుషులు ఏ నిర్ణయాలు చేసినా స్త్రీలు వాటిని మౌనంగా అంగీకరించాలని ఎదురు మాట్లాడకూడదనీ రామాయణం చెబుతున్నది. కైకను నిందించటంతో ఆగకుండా, ఆమె తల్లికీ మొండితనం ఉన్నదని చెప్పటం ఒక లౌక్యం.

స్త్రీలను ఎప్పుడూ ఖాళీగా ఉంచకూడదనీ వారికి ఏదో ఒక పని చెబుతూనే ఉండాలనీ, శాస్త్రాలు చెబుతున్నాయి. పూజలు, ఉపవాసాలు, వ్రతాలు స్త్రీల సామాజిక జీవనాన్ని నియంత్రించాయి. మూఢభక్తికి దారితీశాయి. వారిని ఆలోచించనీయకుండా చేశాయి. ఏ ఇద్దరు స్త్రీలు కలిసినా వంటల గురించీ, ఇంటి పనుల గురించీ, కుటుంబ సభ్యుల పట్ల మెలగవలసిన తీరు గురించీ పతి భక్తి, పతి శుశ్రూష గురించే మాట్లాడుకునే పరిస్థితి ఇప్పటికీ ఉన్నదంటే దానికి పునాదులు ఎంత గట్టిగాపడ్డాయో అర్థం చేసుకోవచ్చు.

స్త్రీలకు పనిచేయటమేగాని ఫలితం పొందటం తెలియదని ఇటీవలి సర్వేలు తెలుపుతున్నాయి. ప్రపంచంలోని పనిలో మూడింట రెండు వంతులు స్త్రీలే చేస్తారట. ఆదాయంలో వారికి దక్కేది పది శాతమే. ప్రపంచవ్యాప్తంగా లెక్కలు తీస్తే భూమిలో ఒక శాతం మాత్రమే స్త్రీల అధీనంలో ఉన్నది. ఇంత వివక్షకు గురి అవుతున్నా స్త్రీలు కుటుంబాల కోసమే శ్రమిస్తున్నారు. ఉద్యమాలలోనూ బలి అవుతున్నారు.

హిందూ ధర్మశాస్త్రాలు కులధర్మపత్నికి ఆరు రకాల కర్తవ్యాలు విధించాయి. అన్నీ పురుషులను ఆనందింపచేసేవే. "భర్తను వశపరచుకోవటమే స్త్రీ జీవిత పరమార్థం" అనే తప్పుడు సంకేతాలు అందించటంలో పురాణాలది ముఖ్యపాత్ర మహాభారతంలో ద్రౌపది, సత్యభామ, రుక్మిణి వంటి పాత్రలు ఇలాంటి చిత్రీకరణలతో వచ్చాయి.

"ఈ లోకంలో సుఖం సులభంగా దొరకదు. ఉత్తమ స్త్రీలు కఠిన పరిశ్రమ అనంతరమే సుఖాలు పొందగలుగుతారు" అంటున్నది పాండవపత్ని ద్రౌపది.

"సుఖం సుఖే నేహ న జాతు లభ్యం
దుఃఖేన సాధ్వీ లభతే సుఖాని"

"సుఖంతో సుఖం రాదు. దుఃఖంతోనే సాధ్వీమణులకు సుఖం" అన్నది. ఆమె జీవితం అలాగే గడిచింది. సతీ ధర్మాలు ఆమెనోట చాలా చెప్పించారు. ఏ పనిమీదనైనా బయటకు వెళ్ళిన భర్త ఇంటికి రాగానే లేచి ఎదురువెళ్ళి కాళ్ళు కడుక్కోవటానికి నీళ్ళు ఇచ్చి ఆసనం చూపటం భార్య ధర్మం అనీ ఆ పని పరచారికలకు అప్పగించకూడదనీ చెప్పింది. గృహ కార్యాలన్నీ ఆమె స్వయంగా చూసుకునేది. పాండవులు ఇతర భార్యల (సవతుల) అవసరాలు కూడా ఆమె కనిపెట్టి ఉండేది. ఆర్థిక వ్యవహారాలూ రాబడి, ఖర్చులు అన్నీ చూసుకునేది. ఎవరూ నిద్రలేవక ముందే నిద్రలేచి అందరూ నిద్రించాకనే నిద్రించేదట. "ప్రథమం ప్రతి బుధ్యామి... చరమం సంవిశామిచ..." మహారాణి ద్రౌపది దినచర్య ఇది. అయినా మహాభినిష్క్రమణ సమయంలో ఆమె పడిపోయినప్పుడు ధర్మరాజు ఆమెవైపు తిరిగి చూడనైనాలేదు.

ఇక్కడ గ్రహింపుకు వచ్చే మరో విషయం ఏమిటంటే, ఎన్ని ఆంక్షలున్నప్పటికీ స్త్రీలు రాజకీయ పరిణామాలనూ రాజ్య వ్యవహారాలనూ పరిశీలిస్తుండే వారన్న వాస్తవం. పురుషులు మాత్రమే చేస్తారని చెప్పే చాలా పనులు బాణవిద్య – రథం నడపటం వంటివి స్త్రీలూ చేయగలిగేవారు. మహాభారతంలో అలాంటి దృష్టాంతాలున్నాయి. స్త్రీలపట్ల సమాజం అసహనంగానే ఉండేదనీ స్త్రీలను విలాసవస్తువులుగా భావించేదనీ అనటం పాతమాటే. భర్తను ఎంతగా సేవించినా స్వర్గారోహణకు మహాప్రస్థానాలకూ స్త్రీలను పరిగణించేవారే కాదు.

స్త్రీలను చంపకూడదనే సాధారణ ధర్మం ఉన్నప్పటికీ వారిని కొన్ని పరిస్థితులలో చంపవచ్చునని రామాయణం చెప్పింది. "అధర్మ పద్ధతిలో నడచుకొనే స్త్రీలను చంప వలసిందే" అన్నది. ధర్మాధర్మ నిర్ణయాలు పాలకవర్గమే చేస్తుంది ఇప్పటిలాగానే. తాటక అనే యక్ష స్త్రీ నాగుల నాయకురాలుగా ఒక రాజ్యాన్ని పాలిస్తున్న సమయంలో మునులు ఆమెను రాముని చేత చంపించారు. ఆమె యజ్ఞవిరోధి కాబట్టి దేశం సుఖం కోసం – గోబ్రాహ్మణ హితం కోసం వర్ణధర్మ పరిరక్షణ కోసం ఆమెను చంపటం సమంజసం అనీ పాపం కాదనీ చెప్పారు. ఆ సందర్భంలోనే అంతకుముందు స్త్రీలను చంపిన ఉదాహరణలు కొన్ని ఇచ్చారు.

1. భృగుమహర్షి భార్యను విష్ణువు చంపాడు. భృగు మహర్షి గురించి పురాణాలు గొప్పగా చెప్పాయి. ఆయన దేవగణాలకూ, అసురగణాలకూ కూడా పూజ్యుడు. 'భృగు' అంటే యజ్ఞాలలో అగ్నిని కాపాడేవాడు అని అర్థం. అదొకపని, ఒక విద్య. వృత్తిపనిగా స్థిరపడింది. నిప్పు తయారుచేయటం - ఆరిపోకుండా కాపాడటం - మొదట నేర్చుకున్న వారు భృగువులు. అడవులలో దావాగ్నిని చూసిన మానవులు తాము స్వయంగా నిప్పు రాజేయటం నేర్చుకోవటం అనేది ఒక గొప్ప ఆవిష్కరణ. దానిని 'అరణి'గా పవిత్రమైన పనిగా ప్రచారం చేశారు. కొన్ని కుటుంబాలు తాము నిత్యాగ్నిహోత్రులమని చెప్పుకోవటం సమాజంలో గుర్తింపును కోరుకోవటం కోసమే: ఇంట్లో ఎప్పుడూ (నిప్పు) వెలుగు ఉండటం ఒక హోదా అయింది. ఇరవయ్యో శతాబ్ది పూర్వార్థంలో అగ్గిపెట్టెలు వ్యాప్తిలోనికి రాని కాలంలో పల్లెటూళ్ళలో ఇళ్ళలో నిప్పురాజేయాలంటే ఏదో ఒక ఇంటిలో మొదట రాజేసేవారు. నిప్పు అవసరమైనవారు ఆ ఇంటికి వెళ్ళి మండుతున్న కట్టెల నుంచి తమ కట్టెను లేదా తాటాకులను రాజేసుకుని (అంటించుకుని) తెచ్చుకునేవారు. (తాటాకులలో కొబ్బరిపీచుపెట్టి అంటించి తెచ్చుకోవటం ఒక జ్ఞాపకం.) భృగువుల వంశంలో ఒక భృగు మహర్షి భార్యను విష్ణువు చంపాడట. ఆ కథ వివరాలు ఇవి - ఒకప్పుడు దేవగణాలు అసురులను తరుముతూ ఉంటే అసురులు వచ్చి భృగువు ఆశ్రమంలో దాక్కున్నారు. భృగువు భార్య వారికి ఆశ్రయం ఇచ్చింది. వారిని లోపల దాచిపెట్టింది. దేవగణాలు వచ్చి అడిగితే వారు అటురాలేదన్నదో, వారికి అప్పగించనన్నదో మొత్తానికి వారికి సహకరించ లేదు. దేవగణాల నాయకుడుగా విష్ణువు ఆశ్రమంలోనికి వెళ్ళబోయాడు. భృగువు భార్య అడ్డుకున్నది. అంతే, ఆమెను చక్రంతో చంపేశాడు. అసురులనూ చంపేసి ఉండాలి. ఆ సమయంలో భృగువు ఇంట్లో లేడు. ఇంటికి వచ్చి జరిగిన వృత్తాంతం తెలుసుకుని విష్ణువును శపించాడు. "నీవూ భార్యావియోగం పొందుతావు" అనేది శాపం. భార్యను చంపినందుకు ప్రతీకారం ఈ రూపంలో ఉండటం పురుషస్వామ్యమే. భార్య లేకపోతే ఎంత అసౌకర్యమో - విష్ణువుకు తెలిసిరావాలన్నదే అంతరార్థం. శరణుకోరిన వారికి ఆశ్రయం ఇచ్చి హత్యకు గురైన భృగు పత్ని దేవగణాల దృష్టిలో అధర్మపరురాలయింది. అసురులు ఆమె హత్యకు చింతించారా? ప్రతీకారం తీర్చుకున్నారా అనేది పురాణాలు చెప్పవు. అధికార, కుల, మత, వర్గ ద్వేషాలతో కొట్టుకుంటున్న సమాజంలో మనుషులపై జాలిపడి ఆశ్రయమివ్వటం నేరం - అధర్మం - ఆనాడూ ఈనాడూ అదే రాజ్యనీతి.

అదివాసుల గూడేలలో రోజూ ఎందరెందరో భృగుపత్నులు హత్యలకు గురి అవుతున్నారు. ఇన్‌ఫార్మర్లుగా రక్షక భటుల చేతుల్లోనూ ప్రత్యేక సైనిక దళాల చేతుల్లోనూ హతమవుతున్న వారి లెక్కలులేవు. ఓటర్ల జాబితా లెక్కలే పాలకవర్గాలకు ముఖ్యం. ఆ లెక్కలే వారికి ప్రాణం. జాలి, కరుణ, అహింసా తత్వాలను, అణువణువునా నింపుకున్న భృగుపత్నులు ప్రతిదేశ చరిత్రలోనూ ఉన్నారు. ముఖ్యంగా ఇండియాలో ఆదివాసీ, గిరిజన

తండాలలో అణచివేతకు గురవుతున్న రాష్ట్రాలలో అడవుల్లోని గూడేలలో మానవత ఇంకా మిగిలే ఉందనటానికి గుర్తుగా అడుగడుగునా కనిస్తారు.

విష్ణువు చంపిన ఒక భృగుపత్ని గురించి రామాయణం చెప్పింది. ఆమె శుక్రాచార్యుని తల్లి ఉశన. రాక్షసగురువైన శుక్రుడు దేవగణాలను శిక్షించాలనే కోరికతో తపస్సు చేస్తున్నప్పుడు (ఈ తపస్సు శంకరుని గురించి చేశాడట.) శుక్రుని తల్లి కూడా ఒక దృఢమైన వ్రతం (రాక్షసుల రక్షణ కోసమే) మొదలుపెట్టిందట లోకాలను "అనింద్రం" (ఇంద్రుడు లేనివిగా) చేయటానికే ఆ వ్రతం.

అప్పుడు దేవగణాల ప్రార్థనపై విష్ణువు ఉశన తలనరికాడు. పాలకవర్గం తన వారికోసం చేసే, చేయించే హత్యలను ఇది బలపరుస్తున్నది. అలాంటి రాజనీతినీ విచారణ కూడా లేకుండా వేసే శిక్షలనూ పురాణాలలోని ఇలాంటి కథలు ప్రోత్సహిస్తున్నాయి. రాముడు తాటకను చంపే ఘట్టంలో అతనిని ప్రోత్సహిస్తూ విశ్వామిత్రుడు ఇలాంటి ఉదంతాలు చెప్పాడు.

"విష్ణువాపి పురా రామ భృగుపత్నీ దృఢవ్రతా అనింద్రలోక మిచ్ఛంతీ కావ్యమాతా విషూదితా" (బాల. 25-21) కావ్యమాత ఉశన. ఆమె భృగువు భార్య. భృగువును 'కవి' అంటారు. కవి కొడుకు కావ్యుడు. (శుక్రుడు).

ఇంద్రుని ఆధిపత్యాన్ని పడగొట్టే ఏ వ్రతమూ ఆర్య/దేవ గణాలు సాగనివ్వలేదు. ఆర్య అనార్య వివాహ సంబంధాలను తెలిపే ఇలాంటి కథలు ఎన్ని కాలగర్భంలో కలిసిపోయాయో.

అధర్మపరులుగా చెప్పబడ్డ స్త్రీల జాబితాలోని ఒక మంథర కైక అరణపు దాసి. ఆమె రామాయణ కాలంనాటిది. పురాణాలలోని ఒక మంథర గంధర్వ స్త్రీ. ఒక మంథర విరోచనుని కూతురు; బలిసోదరి. ఈ మంథర భూమినంతా నాశనం చేయాలనుకున్నదట. ఆమెకు అంత కోసం ఎందుకు వచ్చిందో అని ఆలోచిస్తే ఆ కోపం సహజమేననిపిస్తుంది. ఆమె తండ్రినీ అన్ననూ అంటే విరోచనునీ, బలిచక్రవర్తినీ ఇద్దరినీ దేవగణాలు దుర్మార్గంగానే చంపాయి. బ్రాహ్మణ వేషంలో విరోచనుని దగ్గరకు వెళ్ళి "కిరీటంతో సహా నీ తలకావాలి" అని అడిగి తల దానం పుచ్చుకున్నాడు ఇంద్రుడు. విరోచనుడు తన తల తానే నరుక్కుని ఇంద్రునికి ఇచ్చాడు. రాజ్యం కొందరి తలలు కావాలంటుంది. రాజ్య స్వభావం అది. ఆ కారణంగా విరోచనుని కూతురు మందరకు ఈ వ్యవస్థపై కోపం ఉంది. (ఈమెనే పురాణాలు గంధర్వ స్త్రీగా చెప్పాయా?)

అనంతర కాలంలో దేవగణాలు బలిని పాతాళానికి అణచివేశాయి. ఆ సందర్భం లోనూ బలి సోదరికి దేవగణాలపై ఆగ్రహం ఉంది. ఆమె లోకాలన్నీ మింగాలనుకోవటం సహజమే. అవి దేవగణాల పాలనలోనే కదా ఉన్నాయి. అప్పుడు ఇంద్రుడు ఆమెను చంపేశాడు.

వామనావతారంలో విష్ణువు బలిని యాచించి రాజ్యం తీసుకొని ఇంద్రునికి ఇచ్చాడు. బలి సోదరి ఆ సందర్భంలో అడ్డుపడిందేమో. అందుకే ఇంద్రుడు ఆమెను చంపాడు. గంధర్వ స్త్రీగా చెప్పబడిన మంథర ఈమే కావచ్చు, కాకపోవచ్చు. బలి రాజ్యాన్ని దేవ గణాలు కుట్రతో వశపరచుకున్నాయి. ఆ సందర్భంలో ప్రజల తిరుగుబాటును ఈ కథ సూచిస్తున్నదా? మంధర ఆ తిరుగుబాటు లేవదీసిందా? ఏమైనప్పటికీ ఈ కథ అధికార రాజకీయాల కుతంత్రాలకు - హత్యలకు దర్పణం.

మందర మరోపేరు దుందుభి. దుందుభి అంటే పాచికల అటలో ఉపయోగించే ఒక ఎత్తుగడ అనీ గంధర్వ స్త్రీలు ఈ ఆటలో ప్రవీణులనీ అధర్వణ వేదం చెబుతోంది. (అధ 11-2,5). దుందుభి అనేది ఒక వాద్య విశేషం. ఇదీ గంధర్వులను సూచిస్తుంది. దుందుభి సగినం (డప్పు మోతలో ఒక రకం) దుష్టశక్తుల నుండి రక్షించుకునే ఒక మంత్రం అని వేద వాఙ్మయం చెబుతోంది. అడవులలో తిరిగేటప్పుడు క్రూరమృగాల నుండి రక్షించుకునేందుకు డప్పులు మోగించుకుంటూ వెళ్ళేవారు. ఆ సందడికి జంతువులు దూరంగా పారిపోవాలన్నదే అక్కడి తాత్పర్యం. భయంపోవటానికి మనస్సులో ఏవేనా జపించుకుంటూ ఉండటమూ ఉంది. మనసుతో చేసేది మంత్రం. తనువుతో చేసేది తంత్రం అంటారు. ఆంజనేయ దండకం చదువుకుంటూ పోవటం ఇలాంటిదే. లయ బద్ధంగాసాగే డప్పులమోత ఒకరకమైన చికిత్సా విధానమనీ చెబుతారు. కొన్ని రకాల పసరులు పూసిన డప్పులు భిన్నంగా ధ్వనిస్తాయి. గిరిజనుల మూలికా వైద్యంలో ఈ డప్పుల మోతకు ప్రాధాన్యం ఉంది. ఈ వైద్యంలో స్త్రీలూ నిష్ణాతులే. దుందుభిని స్థానిక గంధర్వ (గిరిజన) స్త్రీల మూలికా వైద్య ప్రక్రియకు ప్రతీకగా గ్రహిస్తే వారిని ఇంద్రుడు (రాజ్యశక్తి) (కార్పొరేట్ వైద్యసంస్థల కోసం ప్రభుత్వాసుపత్రులను నిర్లక్ష్యం చేయటం) అడ్డుకొనటాన్ని ఈ కథ సూచిస్తున్నదేమో? పరిశీలించాలి.

రాక్షస స్త్రీలు చాలా అందమైనవారు. వివిధ వర్ణాల శరీరచ్ఛాయతో ఉన్న వారిని రావణుని మందిరంలో హనుమంతుడు చూసినట్లు వాల్మీకి వర్ణించాడు. "శ్యామావదాతాస్త్ర న్యాః... కాశ్చిత్ కృష్ణా వరాంగనాః కాశ్చిత్ కాంచన వర్ణాంగ్యః ప్రమతా రాక్షసాలయే..." (కొందరు కృష్ణ వర్ణంలోను, కొందరు కాంచన వర్ణంలోను ఉన్నారట).

సీతకు కాపలాగా ఉన్న రాక్షస స్త్రీలు సౌజన్యమూర్తులు. రావణుని వంటి వీరుడు సీతను కోరుకోవటమే గొప్పగా వారు భావించేవారు. అది వారికి గల స్వామిభక్తి. సీత వారిపట్ల అభిమానం చూపేది. వారికి పతివ్రతల కథలు చెబుతుండేదట. త్రిజట అనే ఆమె సీతపట్ల అభిమానంగా ఉండేది. రాముడు వచ్చి విడిపించుకు వెళ్తాడని అమె సీతను ఓదారుస్తూ ఉండేది. రామాయణంలో "త్రిజట స్వప్నం" ప్రత్యేకతగలది. రాముడు గొప్ప పల్లకీలో రావటం - ఎనిమిది ఎద్దులు కట్టిన రథంమీద సీతారాములు వెళ్ళటం ఒక ఏనుగు మీద లక్ష్మణుడు ఆసీనుడై ఉండటం వంటి దృశ్యాలు త్రిజట స్వప్నంలో చూసింది.

ఇవన్నీ బౌద్ధమత సంబంధంగా శుభ చిహ్నాలు. ఎనిమిది ఎద్దులు బుద్ధుని అష్టాంగమార్గానికి చిహ్నం. ఏనుగు మతంగులకూ - బౌద్ధమతానుయాయులకూ శుభ కరమైనది. రాక్షస స్త్రీలు తాము నమ్మిన ధర్మాన్ని ఆచరిస్తుండేవారు. స్వామిభక్తి కలవారయినా వారు రావణుని విషయంలో సీతను నిర్బంధించనూలేదు. పరుష వాక్యాలు పలికిన దాఖలాలూ లేవు. స్వచ్ఛమైన అంతరంగంతో ఉండేవారు. వానర స్త్రీలూ రాజనీతి వైదుష్యం కలవారే. ఎటువంటి సన్నివేశాన్నయినా చతురతతో ఎదుర్కొనేవారు. ఇలాంటి ఘట్టాలను పురాణాలు చాలా మామూలుగా యధాలాపంగా చెప్పాయి.

## సీత

రామాయణంలో సీత పాత్ర గురించి రాయాలంటే ఎన్ని పేజీలూ చాలవు. సీత భూమి పుత్రిక. భూదేవి అంత సహనమూ, క్షమా సీతకున్నాయి. సృష్టి స్థితి లయాల జ్ఞానమూ ఆమెకు ఉంది.

"ఉద్భవ స్థితి సంహార కారిణీం క్లేశ హారిణీం
సర్వశ్రేయస్కరీం సీతాం నతోహం రామవల్లభాం"

(సృష్టి, స్థితి, లయాలకు కారణమైన తల్లి - క్లేశ హారిణి అందరకూ శ్రేయస్సును కలిగించేదీ రాముని భార్య అయిన సీతకు నేను నమస్కరిస్తున్నాను) అంటూ భక్తులు అమెను గౌరవించారు.

అద్భుత రామాయణం సీతను శక్తిస్వరూపిణిగా చెప్పింది. అద్భుత రామాయణమూ వాల్మీకే రాశాడంటారు. వాల్మీకి తన రచనను మొదట 'సీతాచరితం'గానూ "పౌలస్త్య వధ"గానూ రాశాడన్న విషయం చాలామందికి తెలుసు. అయినా సీతపరంగా చాలా విషయాలు అప్రధానంగా ఉండిపోయాయి. ఆమెను భర్తచాటు భార్యగానే సమాజానికి చూపించారు. సీత పాండిత్యమూ శక్తియుక్తులూ, రాజనీతి - వైదుష్యమూ, శత్రువుల పట్ల కూడా మానవతా దృష్టితో మెలగటం - రాక్షస, వానర స్త్రీలపట్ల ఆమె చూపిన ఆదర భావం - సమదృష్టి - ఇవన్నీ పౌరాణికులు గొప్పగా చెప్పినా ఆమె రామునికంటే ఎప్పటికీ తక్కువదే. స్త్రీల బుద్ధి కుశలతను మనస్ఫూర్తిగా అంగీకరించటమూ, మెచ్చు కోవటమూ ఈనాటికీ సమాజానికి అలవడలేదు.

సీతను గురించి అద్భుత రామాయణం చెప్పిన ఒక సంఘటన ఇక్కడ ప్రస్తావించు కోవాలి. ఒకప్పుడు రాముడు కొలువుతీరి ఉండగా అందరూ ఆయనను పొగుడుతున్నారు - సీత తప్ప. సీత ఒకమాటైనా మాట్లాడకపోవటం రామునికి ఇబ్బందిగా అనిపించింది. అమెను కదిలిస్తే అప్పుడు వేయి తలల రావణాసురుని గురించి చెప్పిందట - చాలా గొప్పగా. రామునికి రోషం తన్నుకు వచ్చింది. వెంటనే ఆ రావణాసురుని మీదికి దండెత్తి వెళ్ళాడు. ఆ యుద్ధంలో మూర్ఛపోయాడు. అప్పుడు సీత కాళి రూపంలో ఆ రావణుని సంహరించింది. యుద్ధాలలో పురుషులు మూర్ఛపోయినప్పుడు స్త్రీలు పగ్గాలు చేపట్టటం

చాలా కథల్లో కనిపిస్తుంది. స్త్రీశక్తి గుర్తుచేస్తూ పురుష స్వామ్యాన్ని సవాలు చేయవలసిన సామాజిక/రాజకీయ అవసరాలు అప్పుడు ఏర్పడ్డాయేమో. అద్భుత రామాయణాలు తెలుగులో చాలా వచ్చాయి. ముడింబి కృష్ణయ్యా, పెనుమల్లి బాపయ్యా, ముద్దు లక్ష్మీనారాయణ, వేల్పూరి వెంకటేశ్వర్లు మొ॥వారు ఇలాంటి కథలతో రామాయణాలు వెలువరించారు. ఇవిగాక అద్భుతోత్తర రామాయణమూ (తిరుమల వేంకట తాతాచార్యులు గారి రచన) ఉంది. ఇవి మరుగున పడిపోవటం విచారకరమే.

సీతారాముల కల్యాణం జరిగిన స్థలం 'జనకపురి' ఇప్పుడు నేపాల్‌లో ఉందనీ అక్కడి ఆలయాలలో సీతామందిరం వెనక ఉన్న విశాల ప్రదేశంలోనే సీతారాముల పెళ్ళి జరిగిందనీ అంటారు. చారిత్రకంగా ఆ స్థలాలను వేటినీ నిర్ధారించలేము. కాని సీతా రాములు అజరామరంగా ఉన్నారు. ఈ దేశంలో సర్వత్రా వారి ముద్ర ఉంది.

రామాయణంలోని రాముడు పురుషస్వామ్యానికి ప్రతినిధి. అప్పటికి మాతృస్వామ్య ఛాయలున్నాయి "కౌసల్యా సు ప్రజా రామా" కౌసల్య కొడుకైన ఓ రామా అని (అయో. 16-3) విశ్వామిత్రుడు రాముని సంబోధించటం ఇందుకు తార్కాణం. ఇప్పటికీ తిరుమల తిరుపతి క్షేత్రంలోని వేంకటేశ్వరుడినీ కౌసల్య కొడుకైన రామునిగానే నిద్రలేపు తున్నారు – సీత, కౌసల్య, సుమిత్ర, కైకేయి, మంథర, అనసూయ వంటి స్త్రీ పాత్రలు ఎంతో లోకజ్ఞానం కలిగి ఉన్నప్పటికీ పురుషులకు విధేయంగానే ప్రవర్తించవలసి రావటం అప్పటి సామాజిక నియంత్రణను సూచిస్తుంది. ఒక స్త్రీ ఎవరైనా గాని తమకంటే ఉన్నతంగా ఉండటాన్ని (ఆలోచనలోగాని ఆచరణలోగాని) సహించలేని పురుషస్వామ్యం రామాయణ పాత్రలలో నిక్షిప్తమై ఉంది.

సీతారాముల అరణ్యవాస సమయంలో సీత విరాధుని చేతికి చిక్కిన సందర్భంలో రాముని అంతరంగం ఎంత క్షోభపడిందంటే పరపురుషుని హస్తాలలో ఉన్న సీతను చూసినప్పుడు తనకు కలిగిన దుఃఖం తండ్రి మరణవార్త విన్నప్పుడు కూడా కలగలేదని లక్ష్మణునితో చెప్పుకున్నాడు. భార్యలపట్ల పురుషుల ఆలోచనా ధోరణికి ఇది తార్కాణం. భార్య అంటే తనకు మాత్రమే చెందిన వస్తువుగా వారు భావిస్తారు. ఆమె మనోభావాలు వారికి పట్టవు. భార్యను సహధర్మచారిణిగానే గ్రహించినా ఆచరణలో ఆమె అతనికి సేవకురాలు వంటిదే. సీతారాములకు వివాహమైన సందర్భంలో, జనకుని భార్య తమ కూతుళ్ళను తాము ప్రాణంగా పెంచుకున్నామనీ వారిని బాగా చూసుకోవాలనీ అల్లుళ్ళతో చెప్పింది. సీత గుణశీలాలు గుర్తించి ఆమెను దాసిగా అనుగ్రహించవలసిందిగా రాముడిని కోరినట్లు కొన్ని రామాయణాలలో ఉంది. ఇంటి కోడలిని ఇంట్లో అందరికీ దాసిగా చూడటం – ఆమె సేవలు ఇంట్లో అందరికీ అందాలనుకోవటం ఒకప్పటి ఆలోచనా ధోరణి. ఇప్పుడూ చాలావరకు అదే నడుస్తున్నది. ఒక సందర్భంలో రాముని అంతఃపురానికి సుమంతుడు వెళ్తే అక్కడ సీత రామునికి విసురుతూ కన్పించిందట. సేవకులు ఎందరున్నా

భర్తలకు భార్యలు స్వయంగా సేవలు చేయవలసిందే. పతివ్రతా ధర్మాల విషయానికి వస్తే రామాయణంలోని పాత్రలన్నీ ఆ విషయాలు చర్చించాయి. వనవాసానికి తానూ వస్తానన్న తల్లికి రాముడు సతీధర్మాలు చెప్పాడు. భర్తను విడిచిపెట్టడం భార్యకు తగదనీ మనసులో కూడా భర్తను నిందించకూడదనీ రాముడు తల్లికి చెప్పాడు. స్త్రీకి భర్త దైవం. భర్తే ప్రభువు అంటూ చెప్పిన మాటలు 25 శ్లోకాలు.

వనవాసానికి వెళ్తూ సీత, కౌసల్య ఆశీస్సుల కోసం వెళ్ళినప్పుడు కౌసల్య చెప్పిన సతీ ధర్మాలు 10 శ్లోకాలు. 'అలాగే' అంటూ సీత నోట మళ్ళీ బోలెడన్ని శ్లోకాలు పతివ్రతా ధర్మాలతో చెప్పించారు.

రాముడిని వనవాసానికి పంపాలని కోరిన కైకను సమాధానపరచే ఉద్దేశంతో దశరథుడు ఆమెకు రాముని మంచితనాన్నీ కౌసల్య సౌజన్యాన్నీ చెప్పాడు (అయో. 12-68). ఆ సందర్భంలో చెప్పినవన్నీ సేవాధర్మాలూ, సతీ ధర్మాలూను.

శుశ్రూషలో దాసీలాగాను, వివిధ సందర్భాలలో సఖిలాగాను, భార్యలాగానూ, తల్లిలాగానూ, సోదరిలాగానూ కౌసల్య తనను సేవిస్తుందని దశరథుడు చెప్పాడు. అటువంటి వన్నీ ధర్మశాస్త్రాలలో చేరాయి. అలాంటి సేవలనే స్త్రీల నుండి పురుషులు కోరుకుంటున్నారు. ఎటువంటి సన్నివేశాలలోనైనా స్త్రీ బాహ్య సౌందర్యాన్నే పురుషులు ఎక్కువగా పరిగణనలోకి తీసుకోవటం పరిపాటి. రాముడు సీతను "మదిరేక్షణ"గానే చూశాడు.

భర్త దగ్గర లేనప్పుడు స్త్రీలు అలంకారాలు చేసుకోకూడదనీ దీనులవలె ఉండాలనీ ధర్మశాస్త్రాలు చెబుతున్నాయి. లంకలో సీతవర్ణన స్త్రీలకు ఆదర్శంగా ఉండాలనే విధంగా ఉంది. జీర్ణించిపోయిన చీర - కన్నీరు - నిరాహార నియతి మొ॥ వన్నీ వాల్మీకికన్నా ఇతర రామాయణ కవులు మరింతలుగా చేసి చెప్పారు. పతివ్రతలు పరపురుషుని తాకటం అటుంచి వారి ముఖం సరిగా చూడనైనా చూడకూడదు. హనుమంతుడు లంకకు వెళ్ళినప్పుడు సీతను తన వీపుమీద ఎక్కించుకుని తీసుకువచ్చేద్దామనుకున్నాడు. అయితే సీత గొప్ప రాజనీతిజ్ఞురాలు. అలా వచ్చేస్తే రావణునికీ, రామునికీ తేడా ఏముంటుంది - అని ఆలోచించింది. భర్త గౌరవం నిలపటమే భార్య ధర్మం. "రాముడు తన ప్రతాపం చూపించి నన్ను తీసుకువెళ్ళాలి" అన్నది. భార్యలు భర్తలనే నమ్ముకోవాలి - వారి మీదే ఆధారపడాలి - కష్టమైనా సుఖమైనా భర్తతోనే అనే ధర్మాలన్నింటికీ సీతను ఆదర్శంగా చూపారు. సీతకు హనుమంతుడు పుత్రసమానుడని అన్నారు గాని అతని వీపుమీద ఎక్కితే పరపురుషుల స్పర్శ అవుతుందని జంకారు.

సీత రావణునితో మాట్లాడేటప్పుడు మధ్యలో గడ్డిపరక అడ్డంగా ఉంచేదని ప్రచారం. రాముడు సీతను ఎత్తుకుపోయినప్పుడు ఆమెను తాకలేదనీ ఆమె నిలుచున్న నేలనే పెళ్ళగించుకు వెళ్ళాడనీ నమ్మేవారున్నారు.

బంగారు లేడిని వెతుక్కుంటూ రాముడు వెళ్ళినప్పుడు "హా సీతా, హా లక్ష్మణా" అనే ఆర్తనాదం విని సీత సహజంగా భయపడింది. లక్ష్మణుని రామునికి సహాయంగా

పంపాలనుకోవటమూ, లక్ష్మణుడు వెళ్ళనన్నప్పుడు అతని స్వభావాన్ని అనుమానించటమూ సీత అప్పటి సమాజానికి నిదర్శనాలు.

సీతమ్మవారి కష్టాలు రామాయణ శ్రోతలకు బాధకలిగిస్తాయి. సీతను శీలపరీక్ష చేయటం గొప్ప దృశ్యం. రావణ వధానంతరం సీతను తన దగ్గరకు తీసుకురమ్మని రాముడు విభీషణునికి చెప్పాడు. సీత పల్లకిలో వచ్చింది. పల్లకిచుట్టూ, ఆమె చుట్టూ మూగిన వారిని విభీషణుడు పక్కకు జరగవలసిందిగా చెబుతున్నప్పుడు ఆ సందడికి రాముడు విసుక్కున్నాడు. "వాళ్ళందర్నీ ఎందుకు ఇబ్బంది పెడతావు. వీళ్ళంతా ఆత్మీయులు. స్త్రీలకు ప్రాకారాలు, తెరలు, రాజ మర్యాదలు రక్షణ ఇవ్వవు. ఆమె సద్వర్తనమే ఆమెకు రక్ష – అంటూ (8 శ్లోకాలు) ఆమె పల్లకీ దిగి కాలినడకనే ఇక్కడకు వస్తుందిలే. వీళ్ళందరినీ ఉండనివ్వు" అన్నాడు. స్త్రీల సత్ప్రవర్తన గురించి రాముడు చెప్పిన ఆ మాటలు నిందార్థకం గానే ఉన్నాయి. (యుద్ధ సర్గ 117). ఆ మాటలు విని లక్ష్మణుడు సుగ్రీవ హనుమంతులు వ్యధచెందారట. సీత ఎంత బాధపడింది.

ఆ తర్వాత ఆమెతో రాముడు పలికిన మాటలు పరుషమైనవే. "నీకు రాక్షసుని చెరనుండి విముక్తి కలిగించే నిమిత్తం దుష్టసంహారం చేశానే గాని నిన్ను పొందటానికి కాదు. పరుల ఇంట్లో ఇంత కాలం ఉన్నందున నీ ప్రవర్తన విషయంలో నాకు సందేహం కలుగుతూంది. దీపకాంతిని నేత్రరోగి చూడలేకపోయినట్లు నేను నిన్ను చూడలేక పోతున్నాను. రావణుడు తన ఒడిలో పెట్టుకుని తీసుకువెళ్ళిన నిన్ను ఉత్తమ వంశానికి చెందిన నేను ఎలా గ్రహించగలను? నీవు ఇష్టమున్న చోటికి వెళ్ళు. లక్ష్మణుని రక్షణలోగాని భరతుని రక్షణలోగాని ఉండటానికి ఆలోచించు. లేదా వానరరాజైన సుగ్రీవుని ఆశ్రయించి గాని, రాక్షస ప్రభువు విభీషణుని ఆశ్రయించిగాని కాలంగడుపు. రావణుని ఇంట్లో ఇంతకాలం ఉన్నావు. దివ్యరూపంగల నిన్ను చూసి రావణుని మనస్సు ఎలా చలించిందో ఏమో" అంటూ మాట్లాడాడు. (సర్గ 118. 25 శ్లోకాలు)

"కులసతిని ఎత్తుకుపోయిన శత్రువుని గెలువలేకపోయానన్న అపనింద రాకుండా రావణుని చంపాను. ఇక నీ యిష్టం వచ్చిన చోటికిపో... నేను నిన్ను ఒల్లను" అని రాముడు అనటం, సీత ఆ మాటలు విని మూర్ఛపోవటం అగ్నిలో దూకిన సీతను అగ్ని దేవుడు ఎత్తుకువచ్చి ఆమె పవిత్రురాలని చెప్పడం, బ్రహ్మదేవుడు కూడా నచ్చచెప్పటం లాంటి ఘట్టాలు లోకంలో స్త్రీ పురుష సంబంధాల విషయంలో కలిగే అపోహలకు నిదర్శనంగా ఉన్నాయి. అలాంటి కష్టాలు మరే స్త్రీకీ కలగకుండా జాగ్రత్తపడాలనే ఆలోచన ఎవరికీ రాదు. శీలపరీక్షలు – స్త్రీలే శీలవంతులుగా ఉండాలనుకోవటం – అగ్ని పరీక్షలు స్త్రీలకే ఉండానుకోవటం వంటి దృష్టిలో మార్పు రాలేదు. స్త్రీలను అణచి ఉంచే నిబంధనలు సమాజానికి అవసరంగా కనిపిస్తాయి. అప్పటికీ, ఇప్పటికీ స్త్రీల విషయంలో సమాజ ధోరణిలో మార్పులేదు. పురుషాహంకారానికీ, అనుమానాలకూ సీత బలి అయిందని

ఎవరూ అంగీకరించరు. సానుభూతి చూపుతారు అంతవరకే. భర్తనూ, పిల్లలనూ వద్దనుకుని 'ఈ సంసారం ఇక చాలు' అంటూ సీత అభిమానంతో ఆగ్రహంతో భూమిలోకి వెళ్ళిపోవటాన్ని ఒక మహత్తర ఘట్టంగానే భక్తులు ఆస్వాదిస్తున్నారు. స్త్రీలను ఆత్మహత్యలవైపు నెట్టే సందర్భాలు ఎలా ఉంటాయో సీత చరిత్రను చూస్తే అర్థమవుతుంది. భూమిలో దొరికిన బిడ్డ తిరిగి ఆ ఒడిలోకే చేరటం ఒక తాత్త్విక దర్శనం.

రాముని మహాభినిష్క్రమణం (సరయూ నదిలో దిగి తమ్ముళ్ళతోనూ పౌరులతోనూ స్వర్గానికి వెళ్ళటం) గురించి రామాయణం గొప్పగా వర్ణించింది. అవతార పురుషులంతా మూల స్వరూపాలలో కలిసినప్పుడైనా సీత (భూదేవి/శ్రీదేవి) ప్రసక్తి రాలేదు.

మహాభారతంలో ద్రౌపది పరిస్థితి కూడా ఇలాంటిదే. అయిదుగురు భర్తలనూ శ్రద్ధతో సేవించిన ద్రౌపది పాండవుల మహాభినిష్క్రమణ సమయంలో ముందుగా నేలకు ఒరిగింది. ధర్మరాజు ఆమె వైపు చూడనుకూడా లేదు. పైగా ఆమె ప్రవర్తనలో నేరాలు ఎంచాడు. జూదం మీది వ్యవసంతో తాను కుటుంబానికీ ద్రౌపదికీ తెచ్చిపెట్టిన అవమానాలు ఆయనకు గుర్తురాలేదు.

స్త్రీలపై జరిగిన గృహ హింసలనే కాదు, అత్యాచారాలనూ పురాణాలు చెప్పాయి.

**అత్యాచారాలు**

పూర్వం ఉతథ్యుడు (ఉచథ్యుడు) అనే ముని ఉండేవాడు. అతని భార్య మమత. ఉతథ్యుని తమ్ముడు బృహస్పతి. బృహస్పతి దేవతల గురువు. అయినప్పటికీ ఇంద్రియాలను అదుపులో పెట్టుకోలేని కాముకుడుగా ఒక కథలో కనిపిస్తాడు. మమత గర్భవతిగా ఉన్నప్పుడు బృహస్పతి ఆమెను కామించాడు. ఆమె అతనికి ధర్మబోధ చేసింది. "నా గర్భంలో నీ అన్నకొడుకు పెరుగుతున్నాడు నీవు నన్ను కామించటం తగదు" అని చెప్పింది. అయినా బృహస్పతి వినలేదు. మమతపై అత్యాచారం చేశాడు. అతని వీర్యం మమత గర్భంలోకి జారే సమయంలో గర్భంలోని శిశువు బృహస్పతిని వారించాడు. "నీ రేతస్సు అమోఘం. అది కూడా శిశువు అవుతుంది. కాని ఇక్కడ నేను ముందుగా ఉన్నాను, ఇక్కడ ఇద్దరు ఉండే అవకాశం లేదు. నీ ప్రయత్నం మానుకో - అది నీచమైన పని" అన్నాడు.

బృహస్పతికి కోపం వచ్చింది. "ఇలాంటి సమయంలో నన్ను వారించావు గనక నీవు అంధుడవు అవుతావు" అని ఆ పసికందును శపించాడు. ఆ శిశువే దీర్ఘతముడు. గుడ్డివాడు అయినా గొప్ప ముని అయ్యాడు.

పెదతండ్రి కామవాంఛ ఫలితంగా గుడ్డితనాన్ని అనుభవించిన దీర్ఘతముడు తానూ అత్యాచారం చేశాడు. ఈ దీర్ఘతముడు తన తమ్ముని భార్యను కామించాడు. అదీ వృద్ధాప్యంలో. ఈ సంఘటనను మత్స్యపురాణం చాలా గౌరవంగా చెప్పింది. తాను తల్లి

గర్భంలో ఉండగా ఆమెపై అత్యాచారం జరిగిన సంగతి ఆయనకు గుర్తురాలేదు. అది చాలా సాధారణమైన విషయంగా ఆయన భావించాడు కాబోలు.

మమత ను బృహస్పతి బలాత్కరించిన ఘట్టాన్ని కూడా పురాణాలు చాలా సాధారణ విషయంలాగానే చెప్పాయి. దీర్ఘతముని విషయంలోనూ అదే ధోరణి. దీర్ఘతముడు మహాత్ముడట – అంతకుముందు అతడు ఒక ఎద్దు నుంచి గోధర్మాలూ, మానవ ధర్మాలూ విని ఉన్నాడు. పశుధర్మం ఆయనకు బాగానే నచ్చింది. అందువల్ల వరుస అవుతుందా లేదా అని ఆలోచించకుండా కోడలి వంటి స్త్రీని కామించాడని మరో పురాణకథ చెబుతోంది. వరుస అయితే తప్పులేదన్న ధ్వని కూడా కథలో వినిపిస్తున్నది. స్త్రీలు ఎలాంటివారయినా పురుషుల బలాత్కారాలకు గురి అవుతూ ఉండేవారనీ, నచ్చిన స్త్రీని అనుభవించటం పురుషులు తమ హక్కుగా భావిస్తుండేవారనీ ఈ కథనాల నుంచి స్పష్టమవుతున్నది.

అయితే ఒక దీర్ఘతముని విషయంలో సన్నివేశం మారింది. దీర్ఘతముడు కోడలి వరుస అయిన ఆ స్త్రీని తన చేతులతో అదిమి పట్టుకున్నప్పుడు ఆమె అతన్ని విదిలించి వేసింది. పూర్వపు మమతలాగా లొంగిపోలేదు. ఒక తరానికి మరొక తరానికి స్త్రీలు ధైర్యాన్ని కూడగట్టుకుంటున్నారటానికి ఈ ఉదంతాన్ని ఉదాహరణగా తీసుకోవచ్చు. "నీవు ఎద్దులాగా ప్రవర్తిస్తున్నావు. గుడ్డివాడవూ వృద్ధుడవూ అని నిన్ను మేము పోషిస్తున్నాం. నీ నడవడి మంచిది కాదు. నిన్ను వదలి పెడుతున్నాం" అని చెప్పి అతనిని ఒక చెక్క పెట్టెలోపెట్టి గంగానదిలో వదలిపెట్టిందట. ఈ కథ మత్స్య మహాపురాణంలో (48-56-60) ఉంది. ఈ కథ ఇంతటితో ముగిస్తే బాగుండేది. కాని అలా జరగలేదు.

మునులు మహానుభావులు అనే విషయాన్ని నిరూపించటం కోసం ఈ కథను పురాణకర్తలు పొడిగించారు. విపరీత ప్రవర్తన గల దీర్ఘతముడిని అసురుల/శూద్రుల వంశకర్తగా వర్ణించి ఆ వంశాలపై బురదచల్లారు. దీర్ఘతముడు ఉన్న చెక్కపెట్టె బలిచక్రవర్తి కంట పడిందట. ఆయన అది తెరచి చూసి ఆ మునిని ఆదరించాడు. మనుష్య స్త్రీ అయిన తన భార్యకు సంతానం కలిగించవలసిందిగా ఆ మునిని కోరాడట. బలి అసురుడు – తన సంతానం మానవలోకంలో ఉండాలన్న కోరికతో అలా వ్యవహరించాడట. భర్త అనుమతితో/అజ్ఞతో భార్య వేరొక పురుషునివల్ల సంతానం పొందవచ్చునని ధర్మశాస్త్రాలు చెబుతున్నాయి. మహాభారత కథలో చాలామంది అలా పుట్టినవారే. అదే పద్ధతిలో ఈ దీర్ఘతముడిని బలి నియోగించాడు. బలి భార్య మొదట ఆ మునిని ఏవగించుకుని అతని దగ్గరకు తన దాది కూతురును (శూద్రస్త్రీని) పంపిందట. ఆమెకు పుట్టిన పిల్లలు పుట్టుక వల్ల శూద్రులయినా అధ్యయనంతో బ్రాహ్మణత్వం పొందారట. వారు తన కొడుకులు కాదని బలి తెలుసుకుని మళ్ళీ భార్యను బతిమాలాడు. ఈసారి దీర్ఘతముని ప్రవర్తన మరింత జుగుప్సాకరంగా ఉంది. అతనికి ఒంటినిండా పెరుగు, ఉప్పు, ఇప్పతేనె పూసి బలి భార్య (సుదేష్ణ) నాకవలసి వచ్చింది. ఆవిడ ఒక ప్రదేశం (అపాన ప్రదేశం)

వదలిపెట్టేసిందట. అందువల్ల ఆమెకు అపానంలేని కొడుకు పుట్టాడు. పెద్దకొడుకు అలా పుట్టినా మిగతా పారు నలుగురు బాగానే పుట్టారట. అంగ, వంగ, కళింగ, పుండ్ర, సుహ్మ దేశాలు వారిపేరిట ప్రసిద్ధమయ్యాయి. వీరంతా బలి కొడుకులుగా ప్రసిద్ధులు. ఇలాంటి వ్యవహారాలలో పూర్వపు స్త్రీలు ఎంత లైంగిక హింసకు లోనయ్యారో ఇలాంటి పురాణ కథలు వివరిస్తుంటాయి.

ఇంత కథలోనూ స్త్రీలపట్ల సానుభూతి లేకపోగా ఆ లైంగిక హింసాకాండను ఒక ధర్మ కార్యంగా పురాణాలు స్వీకరించాయి. పురుషుల లైంగిక ఆనందం - వర్ణ వ్యవస్థ ఈ రెండింటికీ సమాజం ప్రాధాన్యం ఇచ్చింది. ఇప్పటికీ ఇస్తూనే ఉంది.

దీర్ఘతముడు కామధేనువు కరుణవల్ల మంచి రూపమూ, యవ్వనమూ పొందాడట. అతని కార్యకలాపాలు మరెంతగా విస్తరించవలసి ఉందో. కామధేనువులు పేద ప్రజలనూ, రైతులనూ వదలిపెట్టి ఇలాంటివారినే అనుగ్రహిస్తుంటాయా? అనేది ప్రశ్న.

**యవ్వన సుఖాలు**

పురాణాల ప్రకారం పుణ్యాలు చేయటంవల్ల వచ్చే ఫలితం మరణించాక స్వర్గానికి వెళ్ళటం. పురుషులు రంభ, తిలోత్తమ వంటి అప్సరసలతో భోగాలు అనుభవిస్తూ ఉంటారు. మరి స్త్రీలు ఏమవుతారో పురాణాలు స్పష్టంగా చెప్పటంలేదు. వాళ్ళు నరకానికే వెళ్తారని వాళ్ళ ఉద్దేశం కావచ్చు. మధ్యయుగాలలోని కొన్ని కావ్యాలు - రుక్మాంగద చరిత్ర వంటివి - స్త్రీ పతివ్రతగా మంచి నడవడికతో ఆచారాలతో ఉంటే పరలోకంలో దేవి ఆప్యాయత పొందుతుందని చెప్పాయి. తల్లి దగ్గర లభించే సాంత్వన ప్రేమ - అనురాగం వంటివన్నీ శ్రీదేవి నుంచి వారు పొందుతారన్నది. స్త్రీలను అలాంటి ప్రేమే పరమపదం.

రామాయణం పురుషుల పరంగా వారి స్వర్గలోక ప్రయాణాలు వర్ణించింది. శరభంగుడు అనే ముని అగ్నిలో దూకినప్పుడు ఆ దేహం కాలి బూడిద అయింది. ఆ ముని తొలి యవ్వనం తొణికిసలాడే శరీరంతో బ్రహ్మలోకానికి వెళ్ళటం అందరూ చూసినట్లు రామాయణం వర్ణించింది. (అరణ్యకాండ - 5 సర్గ.) మాండకర్ణి అనే ముని పదివేల సంవత్సరాలు తపస్సుచేశాడట. ఆ తపస్సు భంగం చేయటానికి అయిదుగురు అప్సరసలు వచ్చారు. ఆ అయిదుగురితోనూ ఆ ముని నవయువకుడై భోగాలు అనుభవిస్తున్న "పంచాప్సర సరస్సు"ను రామాయణం పేర్కొన్నది. (అరణ్య సర్గ. 11) యౌవనాన్ని ఇచ్చి పుచ్చుకోవటమూ పురాణ కథలలో కనబడుతుంది. (చూ. మృతసంజీవనీ విద్య) ఇవన్నీ పురుష ప్రవృత్తికి అద్దంపడుతున్న కథలు.

**శతకన్యా దానము**

పురాణ కథలలో కన్యలను దానం చేయటం చాలా సాధారణంగా కనిపిస్తుంది. వీరులైన వారికి చేసే సత్కారాలలో కన్యలను దానం చేసేవారు. పూజలలో పురోహితులకు

కన్యలను దానం చేసేవారు. ఎవరేనా ఏదేనా అడిగితే ఈమెను ఎవరికైనా ఇచ్చి నీకు కావలసినది తెచ్చుకో అంటూ తాకట్టు వస్తువులాగా స్త్రీలను ఇచ్చేసేవారు. అలాంటి కథలు చెప్పాలంటే చాలా ఉన్నాయి. రామాయణం బాలకాండలో విశ్వామిత్రుడు రామలక్ష్మణులకు చెప్పిన రకరకాల కథలు అప్పటి/అంతకు పూర్వపు సమాజాన్ని ముఖ్యంగా అసుర/వైదిక సమాజాలను ప్రతిబింబిస్తున్నాయి.

స్త్రీలకు ఉండవలసిన గుణాలు సూచిస్తూ చెప్పిన కథలలో ఈ కిందిది ఒకటి. పూర్వం కుశనాభుడు అనే రాజు ఉండేవాడు. కుశనాభునికి ఘృతాచివల్ల నూర్గురు కూతుళ్ళు కలిగారట. ఈ ఘృతాచి అప్సరసల్లో ఒకరై ఉండవచ్చు. నూరుగురూ అందగత్తెలు. రూప యౌవనశాలురైన వారిని వాయువు కామించాడు. "మీరంతా నా భార్యలు కండి - మనుష్యభావం పోయి దీర్ఘాయుస్సు పొందండి" అని వారిని ప్రలోభపెట్టాడు. వారు అతనిని లెక్కపెట్టలేదు. "మాకు తండ్రియే సర్వస్వం, ఆయన మమ్మల్ని ఎవరికి ఇస్తే వారే మాకు భర్త అవుతారు." "పితాహి ప్రభు రస్మాకం దైవతం పరమం హినః

"యస్యనో దాస్యతి పితాసనో భర్తా భవిష్యతి" (32-22) అన్నారు.

వాయువు కోపంతో వారి శరీరాలు కుదిపేసి కుబ్జలుగా చేశాడు. స్త్రీలు స్వతంత్ర నిర్ణయాలు తీసుకోకూడదు. అనే నిబంధన/నీతి ఇక్కడ ఉంది. తండ్రి ఈ విషయం తెలుసుకుని కూతుళ్ళను మెచ్చుకున్నాడు.

"క్షమా గుణం స్త్రీలకైనా పురుషులకైనా అలంకారమే..." (33-7) అన్నాడు. వాయువును ఏమీ అనలేదు. వెంటనే కూతుళ్ళకు పెళ్ళిచేసేశాడు. వరుడు బ్రహ్మదత్తుడు. 'చూళి' అనే మునికి మానసపుత్రుడు, 'సోదమ' అనే గంధర్వ స్త్రీ పుత్రుని కోసం కోరితే చూళి తన భావం నుండే ఆ బాలుణ్ణి సృష్టించాడట. శరీర సంపర్కం లేకుండానే సంతానం పొందటాన్ని ఒక దశలో నమ్ముతుండేవారు.

బ్రహ్మదత్తునితో వివాహం కాగానే ఆ కన్యలకు కుబ్జత్వం పోయింది. కూతుళ్ళకు పెళ్ళిచేశాక కుశనాభుడు పుత్రకామేష్టి చేసి గాధి అనే కొడుకు పొందాడు. గాధి కొడుకు విశ్వామిత్రుడు. ఈ కథ విశ్వామిత్రుడే స్వయంగా రామలక్ష్మణులకు చెప్పాడు. ఆయన చెప్పిన కథలలో హిమవంతుని ఇద్దరు కూతుళ్ళ గురించీ (గంగ, ఉమ), తారకాసురుని చంపటానికి జరిగిన ప్రయత్నాల గురించీ కూడా చెప్పాడు. అసురులతో, అసురుల సంస్కృతితో దేవ గణాలకూ మునిగణాలకూ ఉన్న వైరుధ్యం ప్రతి సందర్భంలోనూ వ్యక్తమవుతూ ఉంటుంది. దేవతల శాస్త్రజ్ఞానం, లౌకిక జ్ఞానం గొప్పవట. రాక్షసుల/అసురుల జ్ఞానమూ, తపస్సూ, దీక్ష - అన్నీ నాశన హేతువులట. బాలకాండ నుండి ఉత్తరకాండ వరకూ ఇదే ధోరణి. స్త్రీల విషయంలో వాయువు దౌర్జన్యమూ, స్త్రీలు తండ్రి/భర్త/సోదరుల ఆజ్ఞ ప్రకారం నడుచుకోవాలనటమూ తండ్రి ఎవరికి ఇస్తే వారిని కన్యలు

భర్తగా అంగీకరించవలసి రావటమూ గమనిస్తే మనుధర్మశాస్త్రం ఇలాంటి సంఘటనల నుండే రూపొందిందనిపిస్తుంది. వైదిక వివాహ మంత్రాలు ఆర్య స్త్రీలపై దేవగణాలకు హక్కు ఉన్నట్లు చెబుతున్నాయి. కాబట్టే వాయువు కుశనాభుని కూతుళ్ళను తాకగలిగాడా? ఉన్నత వర్గాల పురుషులు తమ కింద పనిచేసే వర్గాల స్త్రీల మీద లైంగికపరమైన హక్కు చూపటానికి అదే కారణమా? ఆర్య మునుల భార్యలపట్ల కూడా దేవగణాల ప్రవర్తన ఏమంత గౌరవపూర్వకంగా లేదు. దేవరాజు ఇంద్రుని సంగతి చెప్పనక్కర్లేదు. దిక్పాలకులూ అలాంటివారే. అగ్ని దేవుడు మునుల భార్యలపట్ల కామదృష్టితో ఉండేవాడని కథలున్నాయి.

స్త్రీలను తోటి మానవులుగా మనసూ.ఆలోచనలూ కోరికలూ ఆత్మగౌరవమూ ఉన్నవారిగా ఆర్య సమాజం ఎన్నడూ చూడలేదు. ఆడపిల్లలను వంశవృద్ధికరంగా పరిగణించలేదు. కాని, పుట్టింటికీ, మెట్టిన ఇంటికీ గౌరవం ఆడపిల్లల వల్లనే కలుగుతుందని ప్రచారం చేసుకున్నారు. ఆంక్షలు విధించారు.

స్త్రీలకు ఇచ్చిన మాటకు విలువ ఇవ్వకపోవటం - వారిని నగలతో, బట్టలతో పొగడ్తలతో సంతోషపెడితే సరిపోతుందని అనుకోవటం రామాయణ కాలపు సమాజంలో ఉంది. కైకను వివాహం చేసుకొనే సమయంలో కైకేయికి పుట్టే కుమారునికే రాజ్యాధికారం ఇస్తానని దశరథుడు కైకేయి తండ్రికి వాగ్దానం చేశాడని చెబుతారు. అందుకే భరతుడు ఊళ్ళోలేని సమయంచూసి తొందరగా రామునికి పట్టాభిషేకం చేయటానికి దశరథుడు పూనుకున్నాడు. ఆ విషయం కైకకు ముందు తెలియనీయలేదు. దాసి మంథర ద్వారానే కైకేయికి ఆ విషయం తెలిసింది. రాముడంటే ఆమెకు ప్రీతి. అందువల్ల విషయం చెప్పగానే మంథరకు విలువైన బహుమానం ఇచ్చింది. రాముడు యువరాజుగా ఉంటాడు. తర్వాత భరతునిదే రాజ్యం అనుకున్నది. రాజ్యాధికారం ఒకసారి రామునికి వెళ్ళాక భరతునికి ఇక అవకాశం రాదని మంథర విడమరిచి చెప్పాకనే ఆమెకు సమస్య అర్థమయింది. పురుషాధిక్యత కింద నలిగిపోతున్న రాజవంశాల స్త్రీలకు సన్నిహితులయిన మధ్యతరగతి వారే ఆలోచనలు చెప్పడం ఇక్కడ గమనించదగ్గ అంశం.

పురుషులకు స్త్రీల శరీరాలే ముఖ్య ఆకర్షణ. ఆ స్త్రీల మానసిక భావాలు ఉద్వేగాలు అనవసరం...అని నిరూపించే ఘట్టం ఇది. (అయో. 9, 18, 9 సర్గలు)

ఆర్యమునులూ దేవగణాలూ స్త్రీలను, ముఖ్యంగా కిందివర్గాల స్త్రీలను లైంగికంగా స్వేచ్ఛగా ఉపయోగించుకున్నారు. 'అగ్ని దేవుడు పెండ్లి అయిన స్త్రీలకు భర్త. పెండ్లికాని స్త్రీలకు జారుడు' వంటి అశ్లీల భావనలు వేదాలలో ఉన్నాయి. వేదాలు హిందువులకు, ప్రశ్నించడానికి వీలులేని పవిత్ర గ్రంథాలు. స్త్రీలను లైంగికంగా ఉపయోగించుకుని వారి కన్యాత్వం చెడలేదని వరం ఇచ్చిన సంఘటనలూ పురాణాలలో ఉన్నాయి. లోక మర్యాద తప్ప స్త్రీల మనోభావాలను పట్టించుకోని సమాజం పురాణాలలో కనిపిస్తుంది.

అహల్య, ద్రౌపది, సీత, తార, మండోదరి పురాణ పాత్రలలో ప్రసిద్ధులు. వీరిని పంచకన్యలు అంటారు. వీరిలో సీత, ద్రౌపది అయోనిజలు. అంటే తల్లీ తండ్రీ ఎవరో తెలియని పిల్లలు. అప్పటి సమాజం వారిని గౌరవంగానే చూసింది. పంచకన్యలనబడే ఈ అయిదుగురూ తాము చేయని నేరానికి - తమ ఇష్టాయిష్టాల ప్రమేయం లేకుండా గృహ/లైంగిక/హింసకు/అగ్ని పరీక్షలకు గురి అయ్యారు. ఈ పాత్రలను సమాజానికి ఆదర్శంగా అన్ని హింసలనూ తట్టుకున్న పతివ్రతలుగా చిత్రించటం స్త్రీల అణచివేతలో భాగమే.

## అహల్య వృత్తాంతం

అహల్య రాయిగా పడి ఉన్నదనటం ప్రజలను ఆకట్టుకోవటానికి పౌరాణికులు చెప్పేకథ. అహల్య రాయి అయిందనటం. "రాతిని నాతిగా చేసిన రాముడు" అని పాటలు పాడటం రాముని మహిమనూ గొప్పతనాన్నీ ప్రకటించటానికే. ఇది చాలా ఎక్కువ ప్రచారం అయిన కల్పన. ఇంద్రునితో కలిసిందనే కోపంతో గౌతముడు అహల్యను వదలి పెట్టేశాడు. ఆశ్రమం వదలి వెళ్ళిపోయాడు. ఇల్లు వదలి వెళ్ళిపోయిన భర్తకోసం ఎదురు చూస్తూ ఆవిడ అతి దీనంగా జీవితం గడుపుతూ ఉంది. ఇంద్రుని పట్ల ఆమె ఆకర్షితురాలై ఉండవచ్చు. ఇంద్రుడు ఆమెను బలవంతంచేసి అత్యాచారం చేసి ఉండవచ్చు. ముని భార్య కనుక ఇంద్రునికి శాపం తగిలింది - కొంచెం శిక్షపడింది - అది కఠినమైనది కాదు. ఆధిపత్యవర్గాలకు ఇచ్చే శాపాలు ఒక్కోసారి వారికి ఉపయోగకరంగా ఉంటాయి.

గౌతముడు ఇంద్రుని శపించి ఇల్లు వదలిపోవటం భార్యను దోషిగా లోకానికి చూపుతున్న సంఘటన. స్త్రీలను అవమానపరచే కేసుల్లో ఇదొకటి.

అహల్య రాయి అయిందని వాల్మీకి చెప్పలేదు. ఆమె పొగ కమ్మిన నిప్పురవ్వలాగా మంచుకప్పిన చంద్రరేఖలాగా ఉందన్నాడు.

సతుషారా వృతాం సాభ్రాం పూర్ణచంద్ర ప్రభామివ।
ధూమేనాతి పరీతాంగీం దీప్తామగ్ని శిఖామివ (బాలకాండ - 49-14).

భర్త తిరస్కారానికి గురైన వారు అలా ఉండాలి అనే నిర్దేశం ఇందులో ధ్వనిస్తుంది. మహాకవి కాళిదాసు "మేఘసందేశ" కావ్యంలో కుబేరుని శాపానికి గురై భార్యకు దూరంగా ఉన్న యక్షుని గురించి చెప్పాడు. ఆ యక్షుని భార్య కూడా ఇలాగే దీనంగా విరహ స్థితిలో ఉన్నట్టు చూపారు. స్త్రీ పురుషులలో ఎవరికి శిక్షపడినా ఎక్కువగా బాధపడేది స్త్రీయే. అవమానాలూ దారిద్ర్యమూ అనుభవించేది ఆమె పిల్లలే.

విశ్వామిత్రుడు రాముడిని మిథిలకు తీసుకువెళ్తూ మధ్యలో గౌతమాశ్రమానికి తీసుకువెళ్ళాడు. అక్కడ అహల్య దీనంగా కనిపించింది. రాముడు వచ్చేంతవరకు ఆమె ముల్లోకాలకూ దుర్నిరీక్ష్యగా (స్పష్టంగా కనబడనిది) ఉన్నదట. రాముడు వెళ్ళాక ఆమె మామూలుగా అయింది. రాముడు అహల్య ఆతిథ్యం స్వీకరించాడు. మిథిలకు వెళ్ళాక

అక్కడ అహల్య కొడుకైన శతానందుని చూశాడు. అహల్య గురించి వారితో మాట్లాడి ఏమైనా సర్దుబాటు చేశాడేమో. అందుకే అహల్యకు మేలుచేసినవాడిగా పేరు పొందాడు. లోకరీతిని చూపే సంఘటన ఇది.

అహల్య చుట్టూ చాలా కథలు వచ్చాయి. అవన్నీ పనిలేనివాళ్ళు పక్కవారి గురించి చెప్పుకునే కాలక్షేపం కబుర్ల వంటివే. అహల్యకు గౌతముని వల్ల ఒక కూతురు ఉన్నదట. ఇంద్రునివల్లా సూర్యునివల్లా ఇద్దరు కొడుకులట. ఆ కొడుకులు నీ కొడుకులు కారని కూతురు తండ్రికి చెబితే ఆయన వాళ్ళని సముద్రంలో పడేసి అహల్యను శపించాడు. తన గుట్టు బయటపెట్టిందని అహల్య కూతురుని "గుడ్డిదానివి అవుతావు - నీకు వానరుడు పుడతాడు" అని శపించిందట - ఇది విచిత్ర రామాయణంలోని కథ.

శతానందుడు గౌతమునికీ అహల్యకూ పుట్టినవాడనీ జనకుని పురోహితుడనీ వాల్మీకి రామాయణం చెప్పింది.

అహల్యను బ్రహ్మ సృష్టించాడని ఒక కథ - ఆమె ముద్గలుని కూతురు అని మరో కథ - ఆవిడ పెళ్ళి గురించి మరో కథ - ఇలా ఈ కథలన్నీ ఒక వివాదం చుట్టూ వచ్చిన కథలు. ధర్మార్థ కామమోక్షాలు జతపరుస్తూ పండితులు వీటిపై బోలెడంత చర్చ జరిపారు.

రాముని భార్య సీత కొన్నాళ్ళు రావణుని లంకలో ఉండటంవల్ల అపవాదుకు గురయింది. అప్పుడు రాముడు అగ్నిపరీక్ష పెట్టాడు. ఆమెను అనుమానించపోయినా లోకుల మాటలకు విలువ ఇచ్చాడన్నారు. అహల్యను క్షమించిన రాముడు, (ఆమెకు శాప విమోచనం కలిగించాడన్న కల్పనలు నమ్మితే అలాగే అనుకోవాలి) తన భార్య సీతపట్ల అలాంటి ఔదార్యం ఎందుకు చూపలేకపోయాడు? రావణుని చంపి అయోధ్యకు వచ్చాక అపవాదువేస్తే ఆమెను అడవులకు పంపేశాడు. ఏ కొద్ది అనుమానం ఉన్నా స్త్రీలను ఇంటి నుంచి బయటకు గెంటేయాలన్న సూత్రాన్ని ప్రవేశపెట్టటానికా?

రామాయణం వేర్వేరు కాలాలలో వేర్వేరు సమాజాలలో జరిగిన సంఘటనల సమాహారం కాబట్టే ఈ తేడానా? లేకపోతే అహల్య నాటి పరిస్థితికీ సీత లంకలో ఉండి తిరిగి వచ్చిన నాటి పరిస్థితికీ సమాజ నియమాలలో మార్పు వచ్చిందనుకోవాలా? గౌతముడు అహల్యను ఆశ్రమం నుంచి గెంటివేయలేదు. నిరాశ్రయురాలిని చేయలేదు. రాముడు సీతను ఇంట్లో నుంచి గెంటివేశాడు; అడవులలో వదిలేశాడు. ఈ రెండూ రామాయణంలోని సంఘటనలే. ఆధునిక కాలంలోనూ స్త్రీలపట్ల అత్యాచారాలు జరుగుతున్నాయి; భర్తలకు భార్యలపై అనుమానాలూ వస్తున్నాయి. స్త్రీలు ఇల్లు వదలాల్సిన పరిస్థితులూ ఏర్పడుతున్నాయి.

రాముని ఆదర్శంగా ఎంచుకుంటున్న పురుషులు ఎక్కువగా కనిపిస్తున్నారు. వారికి ఈ విషయంలో రామాయణం ఆదర్శంగా నిలిచింది. వరకట్న నిషేధాల కేసుల్లో తీర్పుచెప్పే న్యాయమూర్తుల ఇళ్ళలోనూ న్యాయవాదుల ఇళ్ళలోనూ కూడా వరకట్నం

తగాదాలుంటున్నాయి. ఎవరినైనా దెబ్బతీయాలంటే వారి స్త్రీలపై అపవాదు వేయటం లోక రీతిగా ఉండేది. రామాయణ సమాజం అందుకు ఉదాహరణ.

స్త్రీల ఉనికినీ ఔన్నత్యాన్నీ గుర్తించకపోవటంలో ఈనాటి పురుషులను తప్పుపట్ట లేము. వారికి మార్గదర్శనం చేసిన పూర్వ సమాజం అలా ఉన్నది. శంకరాచార్యుల వంటి వారికే మాత తన గురించి గుర్తుచేయవలసి వచ్చిందనిఒక కథ చెబుతుంటారు. శంకరా చార్యులు ఇహలోక పరలోక విషయాల గురించి గొప్పగా ఆలోచించిన మేధావి, ఎన్నో చర్చలు చేశారు. రచనలూ చేశారు. ఆయన ఒకరోజు రోడ్డుమీద నడుస్తూ నడుస్తూ ఒక గుంటలోపడిపోయాడు. ప్రక్కన ఎవరూలేరు. గుంట జారుడుగా ఉన్నది; లోతుగానూ ఉన్నది. పైకి రాలేకపోతున్నాడు. లేచే ప్రయత్నం చేస్తూ జారుతూ పడినప్పుడల్లా 'అమ్మా, అమ్మా' అంటున్నాడు. అంతలో ఒకామె అక్కడ ప్రత్యక్షమయింది. "ఇప్పుడు గుర్తువచ్చిందా నీకు అమ్మ?" అన్నది. చేయి ఆసరా ఇచ్చింది. దాంతో శంకరుడికి జ్ఞానోదయమయింది.

శంకరాచార్యునికి ఆత్మజ్ఞానం కలిగించిన ఇలాంటి సంఘటనే మరొకటి ఉంది. శంకరుడు పండితుడూ - బ్రాహ్మణుడూను. ఆయన రోడ్డు మీద నడుస్తుంటే అందరూ పక్కకు తొలిగి దారి ఇచ్చేవారు. ఒకరోజున ఒక చండాలుడు ఎదురువచ్చాడు. "ఎవరిని తొలగిపొమ్మంటున్నావు? నా శరీరాన్నా? నా ఆత్మనా?" అని ప్రశ్నించాడు. శరీరమూ, ఆత్మా ఒకటేనా వేర్వేరా అనే జిజ్ఞాస అలా మొదలయింది.

ఎక్కడెక్కడి పాపాలనూ స్త్రీలు భరించవలసి రావటం పురాణ కథలలో ఉంది. ఒకప్పుడు విశ్వరూపుడనే వానిని ఇంద్రుడు చంపాడు. విశ్వరూపునికి మూడు తలలట. సోమపానంచేసే తల కపింజల పక్షి అయింది. సురాపానం చేసే తల కలవింకం అయింది (కలివికోడి?) అన్నంతినే తల తిత్తిరి పక్షి అయింది. ఈ మూడు పక్షుల రూపాలతోటీ బ్రహ్మహత్య వచ్చి ఇంద్రుడిని చుట్టుకుంది. ఇంద్రుడి కష్టాలు ఎవరూ తప్పించలేకపోయారు. బ్రహ్మహత్యను బతిమాలుకుని ఒక సంవత్సరం ఆ దోషం అనుభవించి (కఠిన కారాగారశిక్ష లాంటిది అయి ఉంటుంది.) తర్వాత "నా పాపం పుచ్చుకోండి" అంటూ భూమిని - జలాన్ని - వృక్షాలను - స్త్రీలను ప్రార్థించి వారికి ఆ శిక్షను బదిలీ చేశాడు. వాళ్ళు గారంటీదారులుగా ఉన్నారనుకోవాలి. అందుకు గాను వారికి కొన్ని మినహాయింపులు ఇచ్చాడు. భూమి తనమీద చేయబడ్డ గోతులు అవే పూడిపోయే విధంగా - నీళ్ళు తనలో కడగబడ్డవన్నీ స్వచ్ఛంగా అయ్యేవిధంగా - చెట్టు కొట్టి వేసినా తిరిగి మొలకెత్తే విధంగా, స్త్రీలకు ఎప్పుడూ కామ సుఖం కలిగేవిధంగా వరాలు ఇచ్చాడట. అలా అవి కోరాయనీ రాశారు. ఆ దోషాలు ఈ నలుగురిలోనూ, భూమి మీద నెరియలు (ఇరిణలు)గా నీటిమీద బిందువుల నురగగా చెట్లమీద ఎండుకొమ్మల రూపంలో స్త్రీలలో రజోవికారంగా (రుతుక్రమంగా) కనిపిస్తూ ఉంటుందని భాగవతం చెబుతోంది. (6-316). ఎవరో చేసిన దోషం మరెవరో అనుభవించటం అంటే ఇదే. "ఎప్పుడూ కామ సుఖం" అనేది అంటగట్టి స్త్రీలను అన్ని విధాలా చులకనగా చూడటానికి ఇలాంటి కథలు బాగా అల్లారు.

స్త్రీల జీవితాలను వ్రత నియమాలతో కట్టిపడేయటం లోకంలో ఉంది. ఆ వ్రతాలన్నీ పురుషుల కోసమే కాబట్టి పురుషులు వాటిని ప్రోత్సహిస్తూ ఉంటారు. అయితే అవి పరోక్షంగా పురోహితవర్గానికి ఉపకరించే సాధనాలుగా రూపొందాయి. వ్రతాలు చేశాక విధిగా బ్రాహ్మణులకు దానం ఇయ్యవలసిన వస్తువుల జాబితా సిద్ధంగా ఉంటుంది. సౌభాగ్య శయన వ్రతం అనేది చేస్తే కొన్ని నెలలపాటు చేసి చివరలో బ్రాహ్మణ దంపతులకు కొత్త మంచం మీద పూజాసామగ్రి/ప్రతిమలూ/వస్త్రాలు/ఉచిత దానం చేయాలి. ధాన్యం/ అభరణాలూ/ఆవులూ కూడా దానం ఇవ్వాలి.

ఈ వ్రతాలన్నింటినీ మించి "అనంగ శయన వ్రతం" అనే ఒక వ్రతం మత్స్య పురాణం చెప్పింది. (అధ్యాయం 70) అది అమానవీయమైన వ్రతం. కృష్ణుని మరణానంతరం అతని భార్యలు దోపిడీ దొంగల అకృత్యాలకు గురై (అర్జునుడు వారిని రక్షించలేకపోయాడు) బలాత్కరించబడ్డారట. అలాగే దేవాసుర యుద్ధాలలో దేవతల చేతుల్లో వందలు, వేలకొలదిగా అసురులు/దానవులు/దైత్యులు/రాక్షసులు మరణించినప్పుడు వారి స్త్రీలు బలాత్కారాలకు లోనయ్యారట. ఇలాంటి వారినందర్నీ వేశ్యావృత్తిలో ఉండవలసిందిగా ఇంద్రుడు నిర్ణయించాడు. రాజమందిరాలలోను దేవమందిరాలలోను భక్తిగా వేశ్యాధర్మంలో ఉండండి. మీకు సౌభాగ్యం (ఐదవతనం) ఉంటుంది. వెలతీసికొని, మీ దగ్గరకు వచ్చే వారిని భక్తితో సంతోషపెట్టాలి - అంటూ సంసారం నుండి తరించటానికి ఒక వ్రతం చెప్పాడు. ఆ వ్రత విధానాలు స్త్రీలను లైంగికంగా ఉపయోగించుకునేందుకు ఏర్పరిచిన నియమాలు. - మన్మధాత్మకుడైన గోవిందుడినో, నారాయణుడినో ప్రతిమచేసి ధూప దీప నైవేద్యాలతో పూజించాలి. తర్వాత వేదపారంగతుడైన బ్రాహ్మణుని పిలిపించి పూజించి కుంచెడు బియ్యం, నేతి పాత్ర ఇచ్చి, "మన్మధ ప్రేయతాం" అని దానం చేయాలి. తర్వాత అతనినే మన్మధునిగా భావించి అతడు కోరినట్టు సంతోషపెట్టాలి. అలాగ ప్రతి ఆదివారం పదమూడు మాసాలు చెయ్యాలి. పదమూడు మాసాలూ ఒకరినే పూజించాలి. వీలుపడని పక్షంలో అతని అనుమతితో మరొక బ్రాహ్మణుని సేవించాలి. పదమూడు మాసాలు అయ్యాక బ్రాహ్మణ దంపతులను బంగారు గొలుసులు, యజ్ఞోపవీతం - ఉంగరాలు - కడియాలు - మురుగులు - సన్నని వస్త్రాలు - గంధమాల్యాలతో అలంకరించి వారికి శయన దానం చేయాలి. ఆ జాబితాలో పడకగది వస్తువులన్నీ - దీపం, చెప్పులు, పీటలతో సహా ఉన్నాయి. ఒక కడవలో బెల్లం నింపి దానిమీద రాగిపాత్ర దానిమీద అసనం - దానిమీద రతీ మన్మధుల బంగారు ప్రతిమలు, బంగారు సరిగ (జరీ) బట్టతో కట్టి ఆ విప్రదంపతులకు దానం ఇవ్వాలి. కంచుపాత్ర - చెరకుగడ - పాడి ఆవు కూడా ఇవ్వాలి. ఇవన్నీ చాలా వివరంగా చెప్పారు. అభాగ్య రాక్షస స్త్రీలపట్ల సమాజపు వైఖరి ఇది. ఆ తర్వాతనూ వారు ఇంటికి వచ్చిన వారిని సంతోషపెడుతూనే ఉండాలి. ఈ వ్రతం చేసిన స్త్రీలు విష్ణులోకం చేరతారని ఆశపెట్టారు.

రాక్షస స్త్రీలను "భూలోకంలో వేశ్యలుగా పుట్టండి" అని చెప్పి, దేవేంద్రుడు వారికి చెప్పిన స్వధర్మం ఇది – అని దాల్భ్యముని కృష్ణుని పదహారు వేలమంది భార్యలకూ చెప్పాడు. వారు అదే వ్రతం ఆచరించారని మత్స్యపురాణం చెప్పింది. వారు ఆచరించేలాగ చేసింది సమాజం. ఇది అనంగశయ వ్రతం. అలాగే "అశూన్య శయన వ్రతం" మరోటి ఉంది. శయ్య శూన్యంగా ఉండకుండా అంటే భార్య ఎప్పుడూ ప్రక్కనే ఉండేలాగ (విష్ణువుకు లక్ష్మి ఎలాగో అలాగ ఉండటానికి) చేసే వ్రతం ఇది. బ్రాహ్మణ దంపతులకు సకల వస్తు సామగ్రీ ఇచ్చి పూజించటం అనే పద్ధతి ఇక్కడా ఉంది.

రాజ్యమూ, ధర్మశాస్త్రాలను ప్రవచించే ఆర్య పురోహితవర్గము స్థానిక జాతుల స్త్రీలపట్ల అమలు పరచిన నీతి ఇది. వేశ్యావృత్తిని బలంగా నిలుపుతూ వారి నుండి పన్నులు కూడా వసూలు చేసిన చరిత్ర భారతదేశానికి ఉంది. ఆధునిక యుగాలలోనూ ఇది ప్రచ్ఛన్నంగా అమలులో ఉంది. రాజ్యమూ పోలీసులూ ఆ వ్యవస్థను కాపాడుకుంటూ వస్తున్నారు.

లైంగిక అవసరాల కోసం గ్రామాలలో కిందికులాల స్త్రీలకు ఆచారం పేరుతో ఈ వృత్తిని అంటగట్టారు. ఇంటి ఆడపిల్లను ఒకరిని బసివిగా జోగినిగా మాతమ్మగా చేసి ఊరిలోని మగవాళ్ళ లైంగికావసరాల కోసం వదలిపెట్టటం ఆచారంగా నెలకొల్పారు. ఈ ఆచారాల మూలాలు పురాణాలలోనివే. ఇంద్రుడూ ఆర్య పురోహితులూ ఏర్పరచినవే. ఒకసారి బలాత్కరింపబడిన స్త్రీని ఇక ఎన్నిసార్లు అయినా బలాత్కారాలకు గురిచేయ వచ్చునని నమ్మే వ్యవస్థ ఏర్పడటానికి పురాణ మూలాలే దోహదం చేశాయి. ఈనాటి న్యాయస్థానాలు ఆ వ్యవస్థను కాదనలేకపోతున్నాయి. కింది వర్గాల స్త్రీలనే కాదు అగ్రవర్ణాల స్త్రీలనూ సమాజం కొన్ని పనులకు ఉపయోగించుకున్నది; కొన్ని కొన్ని పనులకు దూరం పెట్టింది. కొన్ని కొన్ని కార్యక్రమాలకు స్త్రీలు అర్హులు కారంటుంది. ఉదాహరణకు కింది సంఘటన చెప్పుకోవచ్చు.

క్రీ.పూ. ఒకటో శతాబ్దికి చెందిన ఒక ప్రాకృత శాసనంలో నాగామ్నిక అనే రాణి భర్త మరణించిన తర్వాత వైదిక యజ్ఞాలు చేసినట్లు ఉంది. స్త్రీలు యజ్ఞాలు చేయటం ఏమిటి? ఈ శాసనంలో ఏదో పొరపాటు ఉంది. ఒక పదం ఎగిరిపోయిందో అరిగి పోయిందో అని పండితులు సందేహించారట. కాని శంకర నారాయణ అనే పండితుడు మాత్రం స్త్రీలు యజ్ఞాలు చేయటం శాస్త్రాలు అనుమతించాయని చెప్పారు. 'స్వర్గ కామో యజేత' (స్వర్గాన్ని కాంక్షించే వారు యజ్ఞాలు చేస్తారు) అనే వాక్యంలో "స్వర్గ కామ" అనేది పుల్లింగం కాట్టి దాన్ని పూర్వ పండితులు పురుషులకే అన్వయించారనీ అది పొర పాటు అనీ ఆయన వివరించారు. పురుషాధిక్యత అలా అలా వేళ్ళూనుకుంది. నాగామ్నిక 15 వైదిక క్రతువులు చేసిందట. అందులో అశ్వమేధమూ, రాజసూయమూ కూడా ఉన్నా యంటున్నారు. వివరాలలోకి పోకుండా ఉంటే స్త్రీలపరమైన చాలా ఆంక్షలు శాస్త్రాల

పేరిట తప్పుగా అన్వయిస్తూ దేశకాల పాత్రానుగుణంగా బలవంతులయిన పురుషులే ఏర్పరచారనీ అర్థమవుతుంది.

**ఆరాధనా రీతులు - భక్తి నైవేద్యాల కథలు**

మానవులను భగవదారాధన వైపుకు ఆకర్షించే ప్రయత్నంలో వివిధ మతాలు రకరకాల ధోరణులు అవలంబించాయి. ఆ ధోరణులలోనూ రీతులలోనూ ఒక సారూప్యత కనిపిస్తుంది. ఈ ఆరాధనా రీతులను ప్రవేశపెట్టినవారు మానవ స్వభావాన్ని బాగా గమనించినవారు కావటంవల్ల మానవుల స్వభావానికి అనుగుణంగా ఈ రీతులను రూపొందించారు. భగవంతుని ఆరాధనలో అనేక రకాలు, భక్తి, జ్ఞాన, కర్మ మార్గాలు భగవద్గీత చెప్పింది. ఇతర మతాలలోనూ అలాంటి మార్గాలు కనిపిస్తాయి. మహమ్మదీయులు బక్రీద్ పండుగలో ఆరాధనకు అర్పించబోయే మేకనూ/గొర్రెనూ బాగా పరీక్షించి ఎంపిక చేసుకొంటారు. ఆ మేక/గొర్రె శరీరంమీద ఎన్ని రోమాలు ఉంటే అల్లా అన్ని పాపాలు క్షమిస్తాడట. అందుకని బొచ్చు ఎక్కువగా ఉన్న వాటిని ఎంపిక చేసుకుని "బిస్మిల్లా" చేస్తారు.

పర్వదినాలలో భగవంతునికి మంత్రయుక్తంగా జంతువులను బలి ఇస్తే పాపం అంటదు - పైగా పాప ప్రక్షాళన కూడా అవుతుందని నమ్మేవారు. ఈ నమ్మకం అన్ని మతాలలోనూ ఉంది. హిందువుల యజ్ఞాలలో గుర్రాలనూ, మేకలనూ, గొర్రెలనూ బలిగా ఇచ్చేవారు. ఇప్పటికీ జాతరలలో ఆ పద్ధతి నడుస్తోంది. నైవేద్యాలతోపాటు నైవేద్య పాత్రలకూ కథలున్నాయి. సాధారణంగా పూజలలో రాగి పాత్రలో నైవేద్యం పెడుతుంటారు. దీనికి ఒక కథ ఉంది. పూర్వం గుడాకేశుడు అనే రాక్షసుడు ఉండేవాట. అతడు విష్ణు భక్తుడు. విష్ణువును గురించి పదహారు వేల సంవత్సరాలు తపస్సుచేశాడట. (ఇవి పూర్వపు లెక్కలు ఈనాటి లెక్కలు, కాదు) విష్ణువు ప్రత్యక్షమయ్యాడు. వరం కోరుకోమన్నాడు. కొన్ని వేల జన్మలపాటు తాను విష్ణుభక్తిలో ఉండేవిధంగా గుడాకేశుడు వరం అడిగాడు. తాను విష్ణుచక్రం వల్ల మాత్రమే మరణించాలనీ కూడా కోరుకున్నాడు. రాక్షసులకు ఇలాంటి కోరికలేమిటో.

ఒక వైశాఖ శుద్ధ ద్వాదశినాడు విష్ణువు గుడాకేశునిపై తన చక్రం ప్రయోగించాడట. గుడాకేశుని శరీరంలోని మాంసం రాగిగానూ, ఎముకలు వెండిగానూ మలినాలు కంచుగానూ మారాయి. ఆ రాగితో (మాంసంతో) రాగిపాత్ర తయారుచేశారు. రాగిపాత్రలో పెట్టిన నైవేద్యం విష్ణువుకు ఇష్టమట. రాగిపాత్రలోని నైవేద్యంలో ఎన్ని మెతుకులుంటాయో అన్ని వేల సంవత్సరాలపాటు ఆ నైవేద్యాన్ని సమర్పించిన భక్తుడు వైకుంఠంలో ఉంటాడట. ఇవన్నీ విష్ణువు స్వయంగా భక్తులకు చెప్పిన విషయాలేనట. సృష్టి రహస్యాలకు సంబంధించిన జిజ్ఞాసను మేధావులు ఇలా రకరకాల కథనాలతో తీర్చుకుంటూ వచ్చారు. ఉద్దేశపూర్వకంగా ప్రజలను భ్రమలో ఉంచటం అనే లక్ష్యం ఈ ఆరాధనా రీతులలో కొట్టొచ్చినట్టు కనిపిస్తూ

ఉంటుంది. జంతుబలి ప్రపంచవ్యాప్తంగా క్రీ.పూ. 4,500 ప్రాంతాలకే ఉన్నట్టు పరిశోధనలు తెలుపుతున్నాయి.

ఏయే జంతువులు బలి ఇవ్వదగినవో ఏయే జంతువుల మాంసం ఏయే వర్ణాల వారు తినవచ్చునో, ఏ జంతువులను ఎవరు తినకూడదో అన్నీ వైదిక వాఙ్మయంలో చెప్పబడి ఉన్నాయి. రామాయణంలోనూ ఉన్నాయి. పురాణాలలోనూ చేరాయి.

జంతుబలుల గురించి చెప్పాలంటే రష్యా దక్షిణ ప్రాంతాలలోనూ ఉక్రెయిన్‌లోనూ ఉన్న విధానాలే వైదిక విధానాలలోనూ కనిపిస్తాయని కొందరి అభిప్రాయం. వీరుల సమాధులలో గుర్రాలనూ ఇతర జంతువులనూ ఉంచే పద్ధతి క్రీ.పూ. 4500-3500 మధ్య కనిపించింది. కొన్ని కుటుంబాలు అగ్నిహోత్రం ఉంచుకునే సంస్కృతి క్రీ.పూ. 200-300ల నాటికి ఉన్నదంటారు. హోమాల సంస్కృతి క్రీ.పూ. 1800 నాటిదని కొందరు అంటున్నారు.

విష్ణువును గొప్ప దైవంగా నిలబెట్టే ప్రయత్నంలో వైష్ణవులు ఇలాంటి కథలు ప్రచారం చేశారు. వైష్ణవం, శైవ, జైన, బౌద్ధ, మతాల తరవాత వ్యాప్తిలోకి వచ్చిన మతం. విష్ణువు అవతారాలుగా చెప్పబడుతున్న రాముడూ, కృష్ణుడూ, వేంకటేశ్వరుడూ మొన్న మొన్నటివారే కావటంవల్ల ఇతర మతాలలో స్థిరపడిన నమ్మకాలను ఈ మతం తనవిగా ప్రచారంలోకి తెచ్చుకున్నది. స్వార్థ ప్రయోజనాల కోసం తమ కింది వర్గాలను భ్రమలో ఉంచటమే ఈ ప్రచారాల ప్రధాన లక్ష్యం. ఇందులో సామాజిక, ఆర్థిక రాజకీయ ప్రయోజనాలన్నీ ఇమిడి ఉన్నాయి.

# సిద్ధ సంప్రదాయం

సిద్ధ (దర్శనం) సంప్రదాయం భారతదేశంలో అత్యంత ప్రాచీనమైనది. ఇది వైదిక సంస్కృతి కంటే ముందటిది. ఆర్యులు ఈ దేశానికి రాకమునుపే ఈ దర్శనం దేశమంతటా వ్యాపించి ఉండేది. హరప్పా నాగరికతలో, తుంగభద్రలోయ సంస్కృతిలో, ఆది శైవంలో, జైనంలో, బౌద్ధంలో దీని ఛాయలు కనిపిస్తాయి. హరప్పా తవ్వకాలలో కనిపించే ఒక చెట్టు – ఒక ఎద్దు – పద్మాసనంలో ఉన్న ఒక యోగిముద్ర అమ్మతల్లి విగ్రహాలూ ఈ సంస్కృతి చిహ్నాలుగా పరిశోధకులు గుర్తించారు. 'సిద్ధ' అనేది సంస్కృత పదంకాదనీ మూల ద్రావిడపదమనీ పూర్తిగా దేశీయమనీ చెప్పారు; రావిచెట్టు కింద ఆసీనుడైన యోగి దక్షిణామూర్తి. (రావిచెట్టు ఔషధ గుణాలుకలదనీ మేధాశక్తి వికసనానికీ జ్ఞానోదయానికి దోహదం చేస్తుందనీ 'సిద్ధి' కలిగిస్తుందనీ ప్రతీతి.)

సిద్ధ సంప్రదాయం పాటించే వారు "శ్రమణకులు". ఒకప్పుడు విదేశీయులు భారత ఉపఖండాన్ని సిద్ధుల భూమిగా శ్రమణకదేశంగా సమరియ/ సమరిట దేశంగా చెప్పుకునే వారట. భారతీయ పురాణాలు అసురులను సిద్ధ సంప్రదాయాన్ని అనుసరించే వారుగా చెప్పాయి. సిద్ధులు కవనంలోనూ, యోగం, వైద్యం, కుండలినీ శక్తి జాగరణ, తంత్రం, రసవిద్య వంటి వానిల్లోనూ నిష్ణాతులుగా ఉండేవారు.

రామాయణంలో విశ్వామిత్రుడు సిద్ధాశ్రమంలో యజ్ఞం చేశాడు. ఆ యజ్ఞం భగ్నం చేయటానికి అసురులు ప్రయత్నిస్తున్నారని చెప్పి రామలక్ష్మణులను (పాలకవర్గ ప్రతినిధులను) సహాయంగా యజ్ఞ రక్షకులుగా తీసుకువెళ్ళాడు. జనకునికి రామలక్ష్మణులను పరిచయం చేసినప్పుడు "సిద్ధాశ్రమంలో అసురులను నిశ్శేషం చేసిన వీరుడు ఇతడే" అని చెప్పాడు. సిద్ధాశ్రమం, అసురులకు చెందినది. అక్కడ యజ్ఞాలు నిషేధం. ఆ ఆశ్రమంలోని సిద్ధులపట్ల వైదికమతానికి తీవ్ర ద్వేషం ఉంది. వైదిక మతం యాగాలను ఆచరిస్తే అసుర మతం యోగాన్ని ఆలంబనగా గ్రహించింది.

సృష్టికి పూర్వం అంతా శూన్యంగా ఉన్న సమయంలో పరమ పురుషుని సంకల్పం వల్ల (ధ్యానం) అతడు భావన చేయటంవల్ల ఈ చరాచర జగత్తు ఏర్పడిందని పురాణాలు చెబుతున్నాయి. ఆ పరమ పురుషుడు జ్యోతిర్మహేశ్వరుడని ఆదిజాంబవ పురాణం చెబుతున్నది. వృత్తి పురాణాలూ ఈ పరమ పురుషుని శంకర/శివ/మహాదేవ/జంగమ దేవర పేర్లతో చెబుతున్నాయి. శైవతత్త్వం సిద్ధ/యోగతత్త్వం కలది. సిద్ధాంతరీత్యా సాంఖ్యమూ, ఆచరణరీత్యా యోగ విద్యలూ జనజీవితాలకు మార్గదర్శకంగా ఉండేవి. అసుర ప్రముఖులందరూ శివార్చనాపరులు. యోగాచరణతో ధ్యానంతో తపస్సుతో అపూర్వ శక్తులు పొందారు. సిద్ధులు క్రతుకర్మకాండలను ప్రచారం చేయలేదు. సామాన్య ప్రజలతో

కలసి ఉంటూనే అవసరమైన రీతిలో వారికి తోడ్పడేవారు. మూలికా వైద్యం, సాంఖ్యం, యోగం వంటి విద్యలు ప్రచారం చేశారు. ప్రకృతికీ జీవులకూ గల సంబంధాన్ని తెలిపే జ్ఞానాన్ని ప్రజల భాషలో పాటలద్వారా వచనాల ద్వారా అందించారు. జీవుల మధ్య నెలకొని ఉన్న బంధం (పాశం) అతి సహజమైనది. అందులోనే సిద్ధిపొందాలన్నారు. దేహం గురించీ లౌకిక ప్రపంచంలో మెలగవలసిన తీరు గురించీ, ప్రాణికీ ప్రాణికీ మధ్యగల సంబంధం (పాశం) గురించీ వారు చర్చించారు. పశుపతి ప్రాణికోటికంతకూ నాధుడు – మనశ్శరీరాల సాధన ద్వారా శాంతిని సాధించే మార్గం సిద్ధమార్గం అని చెప్పారు.

కాశీ పాండ్యన్ గారి ప్రకారం మొదటి సిద్ధుదు దక్షిణామూర్తి. రెండో సిద్ధుదు బుద్ధుడు. ప్రముఖ దళిత సిద్ధాంతకర్త అయోతీదాస్ (1845–1914) ప్రకారం బుద్ధుడు ఆదిగురువు. బౌద్ధధర్మం ఆదివేదం. బుద్ధుడికి ఆర్యవాఙ్మయం భగవాన్, జిన, దశబల, ధర్మరాజు, వినాయక, తీర్థంకర, చైత్య, శాస్త, అర్హత పదాలు వాడింది. మహాశ్రమణ, మహాబోధి అనేవీ బుద్ధుని సూచించే పదాలే. 'భగవాన్' విశేషణం ఆ తర్వాత ఆర్యమునులకు కొందరికి వాడారు.

తమిళ సాహిత్యం యోగ దక్షిణామూర్తిని, పరమశివునిగా యోగీశ్వరునిగా మహా దేవునిగా గణమూర్తిగా ఇంకా అనేకానేక నామాలతో ప్రస్తుతిస్తున్నది. తమిళ జైన సాహిత్యం జైనుల మొదటి తీర్థంకరుడైన అరుహన్ (రుషభనాధుడు)తో శివునికి సమ ప్రతిపత్తి ఇచ్చింది.

శైవతత్వమూ సిద్ధ యోగ తత్వాలూ అవినాభావ సంబంధం కలిగి జన జీవితాలకు దగ్గరగా ఉండేవి. వీటికి సంబంధించిన తొలి సారస్వతమంతా ప్రాకృత భాషలలోనే ఉంది. కథా వాఙ్మయంలో మొదటిదైన గుణాఢ్యుని బృహత్కథలో సిద్ధుల ప్రస్తావన, శ్రమణుల ప్రస్తావన ఉంది. పైశాచి కథా నాయకుడైన ఉదయనుదు జైనుడు. ఈ కథ పాళీ భాషలలో ప్రసిద్ధంగా ఉండేది. దానిని సంస్కృతంలోకి 'కథాసరిత్సాగరం'గా అనువదించు కున్నారు. అనంతర కాలంలో "పెరుంకథై"గా కొంటువేలిర్ అనే రచయిత తమిళంలో రాశారు.

ఆయా ధర్మాలను ఆచరించే సమాజాలలో స్థానికతనుబట్టి రకరకాల ఉప విభాగాలుండేవి. వాటిలో "కులం" అనేది ఒక చిన్న (యూనిట్) విభాగం. ఇది వర్తమాన కాలపు కులంకాదు. "కులం" శబ్దాన్ని సమూహం అనే అర్థంలో వాడారు. అనంతర కాలంలో ఈ సమూహాలు కులాలు ఘనీభవించాయి. సమయాలను కులసంఘాలుగా ప్రచారంలోకి తెచ్చారు.

క్రీ.శ. 12, 13 శతాబ్దాల వరకు పాలకులు – ప్రజలు – వైదిక దేవుళ్ళతోపాటు బుద్ధుణ్ణి కూడా ఆరాధిస్తూ వచ్చారు. కాకతీయుల కాలానికి జైన, శైవ, బౌద్ధ, వైష్ణవాలు చతుస్సమయాలుగా వ్యాప్తిలో ఉన్నాయి.

## దక్షిణామూర్తి

శివుడు తామసగుణం గలవాడని చెప్పినా దక్షిణామూర్తి జ్ఞాన సంపన్నుడు. అసురులు (అనార్యులు) బౌద్ధ ధర్మాచరణశీలురై జ్ఞాన సంపన్నులయ్యారనటానికి ఈ మూర్తి సంకేతం. దక్షిణామూర్తి ఉజ్జయినిలోని మహా కాళేశ్వరుని ఆలయంలో చితాభస్మంతో హారతి అందుకుంటూ ఉంటాడు. ఇక్కడి శివుడు దక్షిణాభిముఖంగా ఉన్నాడు. (దూషణాసురుడనే రాక్షసుని చంపి ఉజ్జయిని రాజ్యాన్ని కాపాడిన మూర్తిగా ఒక కథ ప్రచారంలో ఉంది.)

కేరళలోని వైకోం ప్రాంతంలో ఒక దక్షిణామూర్తి ఆలయం ఉంది. ఖరుడు అనే రాక్షసుడు చిదంబరంలోని శివుని అనుగ్రహంతో మూడు శివలింగాలు పొంది వాటిని తీసుకువెళ్తూ వైకోం ప్రాంతంలో ఒక లింగాన్ని నేలమీద పెడితే అది నేలలో కూరుకు పోయిందట. అక్కడే మిగతావి కూడా ప్రతిష్ఠించాడట. అసురవీరులైన ఖర, దూషణులతో ఈ క్షేత్ర మాహాత్మ్యాలు ముడిపడి ఉండటం ఆలోచించదగ్గదే. తర్వాతి కాలంలో పరశు రాముని సూచనల ప్రకారం ఇక్కడ మహాదేవుడిని ఉదయం దక్షిణామూర్తిగా మధ్యాహ్నం కిరాతమూర్తిగా కొలవటం ఆరంభమయిందంటారు. పరశురాముడు ఆర్య సంప్రదాయి.

తమిళనాడులో అలన్‌గుడి (కుంభకోణానికి 17 కి.మీ. దూరం)లో శివుడు గురు దక్షిణామూర్తిగా వెలిశాడు. దేవదానవులకు జ్ఞానబోధ చేసిన మహాదేవుడితడు.

ఆంధ్రదేశంలో ప్రాచీన కోటేశ్వర ఆలయంలో (కోటప్పకొండ) మేధా దక్షిణామూర్తి ఉన్నాడు. ఆదిమ సంస్కృతి విస్తృతిని ఈ రూపాలలో గమనించవచ్చు.

## ధ్యానమార్గం

ప్రకృతిని అర్థంచేసుకునేందుకూ మానసిక ఉద్వేగాలను అదుపు చేసుకునేందుకూ ఆదిమ సమాజం ధ్యానాన్ని ఒక మార్గంగా గుర్తించి ఆచరించింది. ప్రాచీన మునులూ, అసురులూ ఈ ధ్యానమార్గాన్ని అనుసరించారనటానికి పురాణాలలోని కథలు నిదర్శనాలు. సృష్టిలోని జీవరాసుల పట్ల సుహృద్భావం, సృష్టికర్తపట్ల భక్తిప్రపత్తులూ ఏదైనా కావాలని పించినప్పుడు సృష్టికర్తను ఉద్దేశించి ధ్యానం చేయటమూ అసురుల కథలలో సాధారణంగా కనిపించే లక్షణాలు. ఆ సృష్టికర్తను బ్రహ్మగా పురాణాలు నిర్ధారించటం అనంతర కాలపు పరిణామం. ధ్యాన మార్గం నుండే యోగ శాస్త్రం రూపుదిద్దుకున్నది. ధ్యాన పద్ధతులను అవలంబించిన వారిలో ఆది జాంబ మునినీ, ముందుగా స్మరించుకోవాలి. ధ్యానాన్ని జీవన విధానంగా క్రియాశక్తిగా వారు చూశారు.

యోగశాస్త్రం మోక్షసాధనకూ ఆధ్యాత్మిక సత్యాన్వేషణకూ మార్గంగా చెప్పబడు తున్నప్పటికీ శారీరక ఆరోగ్యానికి, మానసిక వికాసానికీ మార్గంగా ఈనాడు ప్రచారంలో ఉంది. యోగశాస్త్రం అనగానే పతంజలి (క్రీ.పూ. 200 ప్రాంతం) మహర్షిని చెబుతారు. పతంజలి గ్రంథం ఆర్యీకరణ చెందిన రూపం. దీనికి ముందే బుద్ధఘోషుని 'విశుద్ధ మగ్గ' (శుద్ధమైన మార్గం) ఉన్నది. ఈ విజ్ఞానం పూర్వం పైశాచి, పాళి, మాగధి, అర్ధమాగధి,

శౌరసేని వంటి మాండలిక/ప్రాంతీయ/స్థానిక ప్రాకృత భాషలలో ఉండేది. ఆ భాషలను అణచివేసి సంస్కృతం ఆర్యభాషగా ముందుకు వచ్చాక మూల భావనలను పెంపొందించిన వారు తెరవెనుకకు పోయారు. జాతుల వైరుధ్యాలు సంస్కృతి వైరుధ్యాలతో ముడిపడి ఉండటం ఇందుకు ముఖ్యకారణం.

ప్రాచీన భారతదేశ చరిత్రనూ, సాహిత్యాన్నీ సమన్వయపరచి చూస్తే ఈ దేశం అటు హిమాలయాల నుంచి ఇటు కన్యాకుమారి వరకు యోగులతో, మునులతో ఒక విశిష్ట సంప్రదాయ పరంపరను కలిగి ఉన్నట్లు అర్థమవుతుంది. అతి ప్రాచీన కాలంలో భారతదేశాన్ని సందర్శించిన విదేశీ యాత్రీకులు ఈ దేశాన్ని అద్భుతమైన దేశంగా వర్ణించారు. అప్పటికి ఇక్కడ అన్నీ చిన్న చిన్న రాజ్యాలు ఉన్నాయి; జనపదాలున్నాయి. అయినా వారు ఈ దేశంలో ఒక అఖండ తత్వాన్ని చూశారు. ఈనాటికీ ఈ దేశాన్ని భిన్నత్వంలో ఏకత్వం కలిగిన దేశంగా చెప్పుకుంటున్నామంటే "శతాబ్దాలుగా ఈ దేశాన్ని పట్టి ఉంచుతున్న ఆ ఏకసూత్రత ఏమిటి" అని ప్రశ్నించుకుని "అదే సిద్ధ సంప్రదాయం" అంటున్నారు శ్రీ కాశీ పాండ్యన్ (The Hidden Heritage). యోగంలో మనసునూ శరీరాన్నీ సమన్వయపరచటం ముఖ్యం. పురాణాలు యోగాన్ని విపులంగా చర్చించాయి. నారాయణ మార్కండేయ సంవాదం, గీతోపదేశం వంటివన్నీ ఆ కోవలోనివే.

బౌద్ధ గ్రంథాల నుండే పతంజలి యోగశాస్త్రానికి విషయ సేకరణ జరిగింది. బౌద్ధంలోని త్రిపిటకాలలో 'యోగాపచర' శబ్దం కనిపిస్తున్నది. యోగాచారులు బౌద్ధ దార్శనికులు. బౌద్ధానికి పూర్వమే స్థానిక జాతుల జీవన శైలిలో ధ్యాన పద్ధతులున్నాయి. గిరిజన, ఆదివాసీ జన జీవితాలలో ఏకాగ్రత వారికి అద్భుత శక్తులు, విద్యలు సాధించి పెట్టటం ప్రత్యక్ష నిదర్శనం. సిద్ధ విద్యలకు మూలమైన భావనలు స్థానికులవే. వీరి ఆలోచనలే జైన, బౌద్ధధర్మాలలో చర్చించబడి నిగ్గుతేలాయి. ఆర్య వాఙ్మయంలోని తాత్వికతకు మూలం ఈ భావనలే. భారతీయ తాత్వికత ఇంతగా సంపన్నం కావటానికి ఆర్య ఆర్యేతర వర్గాల మధ్య జరిగిన పరస్పర ప్రక్రియ దోహదం చేసిందని పాశ్చాత్య తత్వవేత్త నిమియన్ స్మార్ట్ (Nimian Smart) అభిప్రాయం. ఈ ఆర్య ఆర్యేతర వర్గాలు దేవాసుర వర్గాలే. వీరి వైరుధ్యాలలోనూ ఘర్షణలలోనూ ఉన్న ఆలోచనాధార, అనుకూల ప్రతికూల భావజాలం వారి వారి పద్ధతులను పరిపుష్టం చేస్తూవచ్చింది. సంప్రదాయ సాహిత్యంలోని దర్శన శాస్త్రాలను (న్యాయ వైశేషిక సాంఖ్యయోగ పూర్వోత్తర మీమాంసలు) ఇందుకు ఉదాహరణగా తీసుకోవచ్చు. మానవుని మానసిక పరిణతికీ ప్రకృతిని అర్థంచేసుకోవటానికీ వృత్తిలో ఏకాగ్రతకూ యోగం సాధనంగా ఉండేది. నైతిక, లౌకిక జీవితగమనానికే దీనిని అభివృద్ధి చేశారు.

ఇప్పటికీ యోగాసనాల్లో శశాంకాసనం (కుందేలు వంటి శరీర భంగిమ) శలభాసనం (మిడుత వంటి భంగిమ) సింహాసనం (సింహముద్ర) కాకిముద్ర వంటివి ఆచరణలో

ఉన్నాయి. ఆయా జంతువులను అనుకరిస్తూ వాటి నైపుణ్యాలను అలవరచుకునే ఆలోచన వీటి వెనుక ఉన్నది. దుఃఖ నివారణ మార్గాలను అన్వేషించే క్రమంలో వర్ధమాన మహావీరుడూ, శుద్ధోధనుని కుమారుడైన సిద్ధార్థ గౌతముడూ ధ్యానాన్నే ఆశ్రయించారు. వారిలో ప్రజ్ఞను మేల్కొలిపినది ధ్యానమే.

ఏ విషయం మీద మనసు లగ్నంచేస్తామో దానివైపే మనసు అఖండంగా సాగటం 'ధ్యానం'. ధ్యానం ఆర్యేతరుల ఆలోచన. వైదికేతరమైనది. ధ్యానంతో అద్భుతశక్తులు సాధించిన ధ్యాన గురువులు స్థానిక జాతులవారే.

'ధ్యానం'లోని అద్భుతశక్తిని గుర్తించిన మీదటనే వైదిక వాఙ్మయం 'ధ్యానం' చుట్టూ రకరకాల సోపానాలు ఏర్పరచి తనదిగా ప్రచారం చేసుకున్నది. మనిషి జీవితాన్ని ఎలా నడుపుకోవాలో – ప్రపంచంతో ఎలాంటి సంబంధం కలిగి ఉండాలో – తనను తాను ఎలా తీర్చిదిద్దుకోవాలో వివరించే సూత్రీకరణలు ధ్యానం కేంద్రంగా ప్రతిపాదించటమూ మనిషి ప్రవర్తనా నియమావళిని పొందుపరుస్తూ యోగాన్ని ఒక శాస్త్రంగా పరిపుష్టం చేయటమూ అనంతర పరిణామాలు.

వైదిక మునులు ధ్యానమూ, తపస్సూ, జపమూ వంటి రకరకాల పరిభాషతో యోగశాస్త్రాన్ని జటిలంగా తయారుచేశారు. జైన, బౌద్ధ ధర్మాల విస్తృతిని వ్యాప్తినీ అరికట్ట టానికి ఈ శాస్త్రాన్ని అన్ని శాస్త్రాలకు లాగానే కింది వర్గాలకు దూరం చేశారు. అప్పటికే ప్రఖ్యాతులైన వారిని తమ అనుయాయులుగా ప్రచారం చేసుకున్నారు. ఇదంతా వైదిక మతవాదుల పన్నుగడ.

యోగాన్నీ, ధ్యానపద్ధతులనూ అర్థంచేసుకోవటానికి పతంజలి యోగశాస్త్రం మీదనే ఆధారపడవలసిన పరిస్థితి ఈనాడు ఏర్పడింది. రామాయణ కాలానికి జైన, బౌద్ధ ధర్మాలు ప్రబలంగా ఉన్నాయి. వాటి నుండి ప్రజలను మళ్ళించటానికి రామాయణం ప్రయత్నించింది. దొంగలను దూరంపెట్టినట్టే బౌద్ధులనూ, నాస్తికులనూ, దూరం పెట్టాలన్నాడు, రాముడు. (అయోధ్య. 109–34)

పతంజలి ప్రకారం యోగాంగాలలో యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణము, ధ్యానము, సమాధి అనే ఎనిమిది స్థితులు (దశలు) ప్రసిద్ధంగా ఉంటాయి. ఇవే అష్టాంగాలు.

అసుర వీరుల తపస్సులలో విశ్వామిత్ర, మతంగుల తపస్సులలో ఈ అష్టాంగాల మూలాలను గమనించవచ్చు. లోక వ్యవహారంలో ఉన్నదానినే తమకు ఆమోదయోగ్యంగా ప్రమాణంగా నిలబెట్టటం సాధారణంగా పండితులు చేసేపని. ఆ విధంగా కొన్ని లక్షణాలతో, సూక్తులతో విధి నిషేధాలతో వారి శాస్త్రాలు రూపొందుతాయి. పతంజలి యోగసూత్రాలూ అలాగే రూపుదిద్దుకున్నాయి. అయిదు చిత్తవృత్తులూ, అయిదు చిత్తవృత్తి క్లేశాలూ తొమ్మిది చిత్త విక్షేపాలూ, మరో నాలుగు దుఃఖ లక్షణాలూ ఆయన విశ్లేషించి చెప్పారు. వీటిని

అధిగమించటానికి ప్రధానంగా నాలుగు మార్గాలట. 1. మైత్రి 2. కరుణ 3 ముదిత 4. ఉపేక్ష. ఇవి జైన, బౌద్ధ ధర్మాల నుండి గ్రహించినవే. శ్వాస ప్రశ్వాసలతో శ్వాసక్రియాగతిని నిర్దేశించుకోవటం ప్రాణాయామం. మనశ్శాంతికీ ఆరోగ్యానికీ ఉపకరించే విధానం ఇది.

ఇందులో "సోహం" (స అహం) అనే దానిని తిరగేసి 'హంస'గా చెబుతారు. హంస అంటే ప్రాణం అనీ ఆ ప్రాణమే పరబ్రహ్మ అనీ జీవాత్మ పరమాత్మల గురించిన రకరకాల సిద్ధాంతాలు శాస్త్రాలలో అగమ్యంగా అల్లుకుని ఉంటాయి. ఆర్యేతరుడైన బోయ వానికి తారకమంత్రంగా 'రామ' నామాన్ని తిరగేసి 'మరా' అని ఉపదేశించారట మహర్షులు. ఆర్యేతరులను ఎటూ ఎదగనీయని ఆలోచనల నాటి రాజ్యం అది. ఇవి అజపమంత్రాలట.

ధ్యానంలో 'ఓం'కారానికి ప్రాముఖ్యం ఉంది. అదిజాంబవ పురాణం ప్రకారం "ఓం" అంటే ఆదిదేవుడు. అది ప్రణవ మంత్రం. ఆ మంత్రంతోనే జ్యోతిర్మహేశ్వరుడు చరాచర సృష్టిచేశాడు. సంప్రదాయ పురాణాలు కూడా ధ్యానశక్తితోనే సృష్టి జరిగిందనీ చెబుతున్నాయి. అదే సంకల్ప బలంగా చెబుతున్నాయి. ఓంకారం అ ఉ మ శబ్దాల కలయిక. ధ్యానం ద్వారా వాటిని విడగొడితే గొప్ప శక్తి జనిస్తుందని ఆ శక్తితో అద్భుతాలు చేయవచ్చుననీ నమ్మకం. ఆ శక్తితోనే విశ్వామిత్రుడు త్రిశంకువుకు స్వర్గం సృష్టించి ఇచ్చాడంటారు. మంత్రజపమూ, తపస్సూ ఈ దేశ సంస్కృతిగా ఇప్పటికీ కొనసాగుతున్నాయి.

శ్రీదేవీ భాగవతంలో 'పరదేవత' విశిష్టతను గురించి చెప్తూ ధ్యానయోగాన్ని ప్రస్తావించారు. ఒకప్పుడు బ్రహ్మ, విష్ణులోకానికి వెళ్తే ఆ సమయానికి విష్ణువు నిశ్చల ధ్యానంలో ఉన్నాడట. "సర్వశక్తిమంతుడవైన నీవు ధ్యానించటం ఏమిటి? నీకంటే పరమార్థం ఏదైనా ఉందని నేను అనుకోవటంలేదు. నీవు ధ్యానించే ఆ పరదేవత ఎవరు?" అని బ్రహ్మ విష్ణువును అడిగాడు.

"నీవు సృష్టిస్తావనీ, నేను పోషిస్తాననీ, రుద్రుడు సంహరిస్తాడనీ అంటారు. అది తప్పు. సామాన్యులు అలా అనుకుంటారు. మనలను ముగ్గురనూ సృష్టించినది ఒక తేజోరాశి. ఆదిశక్తి, ఆ పరాశక్తి అనుగ్రహంతోనే మనం ఈ పనులు చేయగలుగుతున్నాం... మధుకైటభులు అనే రాక్షసులతో అయిదువేల సంవత్సరాలు యుద్ధంచేసి గెలిచానంటే అది పరాశక్తి అనుగ్రహంవల్లనే...నేనూ ఒకరికి లొంగి ఉన్నవాడినే... నాకు ధ్యానింప దగిన పరపదార్థం ఉన్నది. ఆ పదార్థమే శక్తి. ఆ శక్తికి మించినది లేదు..." అని విష్ణువు చెప్పాడు. పరదేవతను హృదయ పీఠం మీద నిలిపి చేసే ధ్యానం "తపస్సు"[1] అని ఆర్య వాఙ్మయం చెప్పింది. ఈ పరదేవతను పార్వతిగా చెప్పింది. కాని, ప్రాచీన కాలంలో

---

1 తపస్సు గురించి వివరిస్తూ "దేహంలో నేను అనే స్ఫురణ ఎక్కడి నుండి కలుగుతుందో గమనించి మనస్సును దానిలో లీనం చెయ్యటమే తపస్సు" అని కావ్యకంఠ గణపతి మునికి (17-11-1878 - 25-7-1936) రమణ మహర్షి చెప్పారట. ఈ ఉపదేశం 17-11-1907 నాటి సంఘటన.

'మాతంగి'ని పరదేవతగా మహాశక్తిగా కొలిచారు. స్థానికుల భావనను ఆర్యమతం సొంతం చేసుకుని పరాశక్తిగా పార్వతిని ప్రతిష్ఠించింది. మాతంగిని పార్వతిగా చెప్పింది. పార్వతి మతంగునికి కూతురుగా పుట్టిందని కథలు ప్రచారం చేసింది.

**జైనం**

భారతదేశంలోని ఆదిమ ప్రజల ధార్మికచింతనలోనే జైన, బౌద్ధ మతాలు ఎదిగాయి. జైనం బౌద్ధానికంటే ముందటిది. జైనమతాన్ని వ్యాప్తిలోకి తెచ్చినవాడు వర్ధమాన మహావీరుడు (క్రీ.పూ. 540-468). అతనికి ముందు 23 మంది తీర్థంకరులు ఈ ధర్మాన్ని ప్రచారంచేస్తూ వచ్చారు. అంటే క్రీ.పూ. 10, 11, శతాబ్దాలలోనే మత విశ్వాసాలకు సంబంధించిన విశ్లేషణ ఆరంభమైందన్నమాట. బౌద్ధంలోనూ గౌతమబుద్ధునికి (563-483) ముందు ఎందరో బోధిసత్త్వులు మతధర్మాలనూ ప్రవర్తనారీతులనూ బోధించినట్టు జాతక కథలు చెబుతున్నాయి. ఈ రెండు మతాలూ స్థానిక ప్రజలను సాంస్కృతికంగా పురోగమింప జేసిన మతాలు. వీటికి ప్రాతిపదిక ఆదిమ భారతీయులైన అసురుల భావజాలమే.

ఆర్యులు ఈ దేశానికి వలసవచ్చేనాటికి ఈ దేశంలో స్థానికులుగా అసురులున్నారు. ఆర్యుల వేదాలనూ యజ్ఞాలలోని పశు హింసనూ క్రతు కర్మకాండలనూ, స్వర్గ నరకాల ఊహలనూ అసురుల మతం ఖండించింది.

జైనుల బోధనలు ప్రజల భాషలలో ప్రజలకు అర్థమయ్యే రీతిలో ఉండేవి. ఎక్కువగా మాగధీ ప్రాకృతంలోను, అర్ధమాగధిలోను తీర్థంకరులు తమ ఉపదేశాలు ప్రచారం చేశారు. తీర్థంకరులు అంటే మార్గదర్శకులు అని అర్థం. జైనంలోని చాలా విధానాలను తర్వాతి కాలంలో వైదికమతం ఆమోదించింది. జైన పద్ధతులూ సాంఖ్యశాస్త్రంలో చేరాయి. ఆర్యేతర జాతుల కోసమే జైన, బౌద్ధధర్మాలు కృషిచేశాయనీ, సింధు నాగరికతకు చెందిన మతవిశ్వాసాల నుంచే ఇవి ఆవిర్భవించాయనీ ప్రొఫెసర్ "జాకొబి" అభిప్రాయం. జైన కవులు తెలుగు కవులకంటే ముందుగానే దేశభాషలలో కావ్యాలు రాశారు. ఆర్యుల నిరంకుశ ధోరణులను మత రీతులనూ ఎదుర్కొనే క్రమంలో జైనమూ, బౌద్ధమూ వికసించాయి. మానవుని బాధలకు కారణాలు అజ్ఞానం, అహంకారం, అలవాటు, ద్వేషం, కోరిక. వీటివల్లనే దుఃఖం కలుగుతుంది. అశాశ్వతమైనదాన్ని శాశ్వతంగా, బాధాకరమైనదాన్ని సంతోషకరమైనదిగా తలచటం అవిద్య. దుఃఖానికి అవిద్యయే కారణం. వీటిని 8 యోగ మార్గాలతోను జయించవచ్చునని, ఎవరికి వారు తమలోని జ్ఞానజ్యోతి కనుగొనగలరని జైనము, బౌద్ధము చెప్పాయి.

వ్యక్తిగత వైషమ్యాలకు అతీతంగా సమాజ పురోగతిని కాంక్షించే అప్పటి వ్యవస్థ ఎన్నో కారణాలవల్ల శిథిలమై ఈనాటికి వర్గ, వర్ణ సమాజంగా రూపొందింది. ఒకప్పటి అసుర ప్రముఖుల కథలను చూసినప్పుడు వారు తపస్సుతోను, యోగమార్గాలతోను అతీతశక్తులను పొందినట్లు తెలుస్తున్నది. కొన్ని కొన్ని సందర్భాలలో ఆ శక్తుల దుర్విని

యోగం జరిగి ఉండవచ్చు. ప్రతి వ్యవస్థలోను ఉదాత్త చరితులు ఉంటారు. చపలచిత్తులూ ఉంటారు. చరిత్రలో అసురయుగం, జైన, బౌద్ధాలు ప్రచారంలో ఉన్న యుగం అనటానికి కన్నడ, తమిళ సారస్వతాలు, జైన బౌద్ధకవుల రచనలు ఆధారంగా కన్పిస్తున్నాయి. తెలుగులో అలాంటి రచనలు శిథిలమయ్యాయి. జైన దేవతలను పూర్వ యక్ష, జంభాల, పదాలతో వ్యవహరిస్తుండటం యక్షులు, నాగులు జైనాన్ని ఆదరించారనటానికి ఆధారం. ("జంభాల రాజు" విగ్రహం ఇటీవలి పురావస్తు తవ్వకాలలో గుర్తించారు.)

రామలక్ష్మణులు, రావణుడూ కూడా జైన ధర్మావలంబకులే అని జైనుల నమ్మకం. జైన, బౌద్ధ భిక్షువులను, తపస్వులనీ శ్రమణకులనీ వ్యవహరిస్తారు. ప్రాచీన భారతదేశం శ్రమణకుల దేశంగా పేరుపొందింది. శ్రమణక పదం విదేశీయుల ఉచ్చారణలో 'సమరిటన్' అయిందనీ బైబిలు ప్రస్తావించిన, సమరిటనులు భారతీయులే అనీ కొందరి అభిప్రాయం. జైనాచార్యులు విశేష విద్యలలో నిష్ణాతులై ఉండేవారు. మూలికా వైద్యం – వశీకరణ విద్యలు – మంత్ర విద్యలు, ఇంద్రజాల, మహేంద్రజాలాలు, ఆకాశగమనం – పరకాయ ప్రవేశం వంటి సిద్ధ విద్యలు జైనులపరంగా వ్యాప్తిలోకి వచ్చాయి.

యక్షులకూ, జైన బౌద్ధ ధర్మాల చింతనకూ జన్య జనక సంబంధం ఉంది. ప్రాచీన జైనాలయాలలో యక్షుల విగ్రహాలు తప్పనిసరిగా ఉంటాయి. తపస్సుతో అతీత శక్తులు సాధించవచ్చుననే అసురుల విశ్వాసాల క్రమ పరిణతి జైనంలో కనిపిస్తుంది. భౌతిక సంపదలను నిరసించి తపస్సువైపు మొగ్గటం – శత్రువుల కుట్రలను ఎదుర్కోవటానికి మాత్రమే యుద్ధాలు చేయటం వంటి లక్షణాలు అసురుల కథలలో కనబడతాయి. జైనం నీతివర్తనకూ స్వయంకృషికీ, ఆత్మశుద్ధికీ ప్రాధాన్యం ఇచ్చింది. తపస్సును మోక్ష సాధనంగా చెప్పింది. ఇక్కడ మోక్షం అంటే జ్ఞానం – ఎరుక – విద్య – అదే ఆత్మవిద్య.

జైన శ్రమణకులు లోకహితం కోసం శ్రమించారు. దేశ సంచారం చేస్తూ ప్రజలకు వైద్య సదుపాయాలు అందించేవారు. ఉత్తరాన గంగా మైదాన ప్రాంతాలలోనూ దక్షిణాన కర్ణాటక, ఆంధ్ర ప్రాంతాలలోనూ జైనం బలంగా వ్యాపించిందని పురావస్తు ఆధారాలు నిరూపిస్తున్నాయి. 'జైన శ్రమణకులు' లేకి వ్రతం ఆచరిస్తూ ఉండేవారు. భిక్ష అడిగి జీవనం సాగించటం లేదా పంట పొలాలలో కిందరాలిపడిన ధాన్యపు గింజలు ఏరుకుని తెచ్చుకుని వాటిని వండుకు తినటం (శిలోంఛ వృత్తి) ద్వారా జీవనం సాగించటం లేకి వ్రతంలో ప్రధాన నియమం. అనంతర కాలంలో ఈ లేకి వ్రతాన్ని "లేకితనం"గా అపహాస్య పదంగా నిందార్థంలో ప్రచారం చేసిన వైదిక ధర్మం ఈ వ్రతాన్ని వానప్రస్థంగా ఆశ్రమ ధర్మాల్లో ప్రవేశపెట్టింది. నియమబద్ధ జీవనానికి జైనం ఆచరించిన అనేక ధర్మాలు, నియమాలు వైదికమతం గ్రహించింది. మరోపక్క వాటిని అవహేళనచేస్తూ జైనమత వ్యాప్తిని నిరోధించింది. శిలోంఛ వృత్తి అవలంబించిన ఒక విశ్వరూపుని గురించి భాగవతం చెప్పింది. (6-280-296)

విశ్వరూపుని గురువుగా చేసుకోవలసిందిగా బ్రహ్మ దేవగణాలకు సూచించినప్పుడు దేవగణాలు విశ్వరూపుని ఆశ్రయించారు. అప్పటికి వారు అసురుల చేతిలో ఓడిపోయి కష్టాలలో ఉన్నారు. విశ్వరూపునివల్ల విద్యలు నేర్చి బలశాలులు అయ్యారు. విశ్వరూపుడు శిలోంఛవృత్తి గురించి దేవగణాలకు చెప్పాడు. అది జైన సన్యాసుల వృత్తి. 'మాయ' గురించీ ఆయన చెప్పాడు. దానిని మాయా మతంగా ప్రసిద్ధం చేశారు. యా = ఏది, మా = కాదు, ఏది కాదో అది మాయ. యదార్థాన్ని మరుగుపరచేది మాయ అని విశ్వరూపుడు చెప్పాడు. ఐశ్వర్యాన్నిచ్చే నారాయణ కవచం అనే విద్యను ఆయన ఇంద్రునికి ప్రసాదించాడనీ భాగవతం చెప్పింది. ఇంద్రుడే విశ్వరూపుని తలలు నరికి చంపాడనటం వైదిక మతానికి జైనంపై ఉన్న ద్వేషాన్ని తెలుపుతున్నది. (నారాయణ కవచం నారాయణుని ఉన్నతునిగా చూపే ప్రయత్నం – కల్పన).

జైన, బౌద్ధాలలోని గ్రాసాటన, భిక్షాటన నియమాలను "గాసట బీసట"లుగా వైదికమతం గేలిచేసింది. మరోపక్క ఆ నియమాలనే తన ఆచార వ్యవహారాలలో చేర్చుకున్నది.

జైనుల "సల్లేఖన వ్రతమూ" అలాంటిదే. దీనిలో "ఇచ్ఛా మరణం" లక్ష్యం. నయం కాని వ్యాధులచేత పీడించబడేవారూ, వృద్ధాప్యంవల్ల దైనందిన కార్యకలాపాలు నిర్వహించుకో లేని వారూ అలాంటి కొన్ని సందర్భాలలో ప్రాణాలను త్యజించటానికి కొన్ని కొన్ని మార్గాలు శాస్త్రాలు అనుమతించాయన్నారు. అగ్నిలో ప్రవేశించటం, పర్వత శిఖరాల నుంచి దూకటం – నీళ్ళలో దూకటం, నిరాహారదీక్ష (సల్లేఖన వ్రతం) అవలంబించటం వంటివి అలాంటి మార్గాలలో కొన్ని. చరిత్రపరంగా మగధను పాలించిన మౌర్యరాజులూ, నందరాజులూ జైనాన్ని అనుసరించారు. చంద్రగుప్త మౌర్యుడు సల్లేఖన వ్రతంతో కాలధర్మం పొందాడు. పురాణాలు, ఇతిహాసాల పరంగా చూస్తే రఘువంశ రాజులూ సల్లేఖన వ్రతంతోనే (నిరాహార దీక్షతో) ప్రాణాలు త్యజించారు. రాముడు జలప్రవేశంతో తనువు చాలించాడు. భారతంలో భీష్మునిదీ ఇచ్ఛామరణమే. శ్రీశైలం శిఖరం నుంచి దూకి ప్రాణాలు త్యజిస్తే మరణించే ముందు కోరుకున్న కోరికలు మరుజన్మలో తీరతాయనే నమ్మకానికీ ఇవే మూలాలు.

పురాణాలలో మునులూ – తదితరులూ అగ్నిలో ప్రవేశించి స్వర్గానికి వెళ్ళటం వంటి కథలున్నాయి. ఇవి జైనం నుండి తీసుకున్న భావనలే. తీర్థంకరులలో వర్ధమాన మహావీరుడు పంచవ్రతాలను బోధించాడు. వైదిక ధర్మంలోని పంచ మహాయజ్ఞాలకు అలాంటి భావనలు స్ఫూర్తినిచ్చాయి.

జైనుల సమావేశాలను 'సంగమం' అంటారు. క్రీ.పూ. మూడవ శతాబ్దంలో పాటలీ పుత్రంలో స్థూలబాహుని ఆధ్వర్యంలో ఒక సంగమం క్రీ.శ. 5వ శతాబ్దంలో 'వలభి'లో దేవరధి క్షమ శ్రమణుని ఆధ్వర్యంలో ఒక సంగమం జరిగాయని చరిత్ర చెబుతున్నది. తెలంగాణ ప్రాంతంలోని వేములవాడ, బోధన్, కొలనుపాక, మహబూబ్‌నగర్ జిల్లా జడ్చర్ల

లోని పాదాలగెడ్డ ప్రాంతాలు జైన స్థావరాలుగా ఉండేవి. సిద్ధిపేటలూ, సిద్ధుల గుట్టలూ సిద్ధుల ఉనికికి నిదర్శనాలు. తూర్పుగోదావరి జిల్లా తాటిపాక ఒకప్పటి జైనక్షేత్రం. జైన మునుల భారీ విగ్రహాలు ఒకప్పుడు అక్కడ ఉండేవి. దేహమంతా భూమిలోకి దిగబడి తల మాత్రమే కనిపిస్తున్న ఒక పెద్ద శిలా స్వరూపాన్ని ఇటీవలి వరకూ "జైనుని తల" అంటూ చూపేవారని జిల్లా గెజిట్‌లో ఉంది. పెద్ద పెద్ద బావులను జైనుల బావులుగా చెబుతారు. ఈ ప్రాంతమంతా తాటిపాక సీమగా పూర్వం వ్యవహారంలో ఉండేది. నగరం తాలూకా ఒక ద్వీపకల్పంలాగా ఉంటుంది. తూర్పున సముద్రమూ మిగతా రెండు పక్కలా గోదావరి పాయలైన వైనతేయ, వసిష్ఠ ప్రవాహాలు ఈ సీమను చుట్టి ఉంటాయి. 1904లో దీనిని (నగరం తాలూకాను) నరసాపురం తాలూకా నుండి విడదీసి ప్రత్యేక తాలూకాగా చేశారు. అక్కడ బౌద్ధమూ బలంగా ఉండేది.

తూర్పుగోదావరి జిల్లా పిఠాపురంలో జైనసన్యాసుల విగ్రహాలు అక్కడక్కడా శిథిలా వస్థలో కనిపించేవి. హిందువులు వీరిని "సన్యాసి దేవుళ్ళు"గా పిలిచేవారనీ. కరువు కాటకాల సమయాలలో పూజించేవారనీ. ఇలాంటి ప్రతిమలు తూర్పుగోదావరి జిల్లాలో చాలాచోట్ల ఉన్నాయని గెజిటీర్లు చెబుతున్నాయి. ఏ జిల్లా గజిటేర్లు చూసినా ఇలాంటి జైన శిధిలాల చరిత్ర కనిపిస్తూనే ఉంటుంది. పూర్వపు జైన స్థావరాలు అనంతర కాలంలో శివాలయాలుగా, బౌద్ధ విహారాలు విష్ణువు ఆలయాలుగా మారిపోయాయి.

బక్సార్ దగ్గరి శివాలయాలలో శివుని విగ్రహంలో జైనముని పార్శ్వనాథుని పోలికలున్నాయి. జైనుల నుండే నయనార్లు వచ్చారంటారు. రాజకీయ ప్రాబల్యాలను బట్టి జైనులకూ, శైవులకూ, బౌద్ధులకూ, వైష్ణవులకూ మధ్య ఎన్నో ఘర్షణలు జరిగాయి. సిద్ధుల ప్రాంతాలు శివాలయాలుగా రూపొందటాన్ని సిద్ధేశ్వరాలయం సూచిస్తుంది.

పెనుగొండలోని పచ్చ పార్శ్వనాథుని ఆలయంలో యక్షిణి పద్మావతి. యక్షుడు దరనేంద్రుడు. వీరి విగ్రహాలు పార్శ్వనాథుని సేవించుకుంటున్నట్టు ఉంది. అక్కడే అజిత్ నాథుని ఆలయమూ ఉంది. అక్కడిదే "పాదబెట్ట"కొండ. జైనుల పవిత్రక్షేత్రం. ఇక్కడి జైన ఆలయాలు చాలా కాలగర్భంలో కలిసిపోయాయి. ఆంధ్రదేశం యక్షుల (రాక్షసుల) పాలనలో ఉన్నకాలంలో ఇక్కడి తాత్వికచింతన సిద్ధగురువుల చుట్టూ తిరిగింది. ఆ భావజాలమే జన జీవితాలను ప్రభావితం చేసింది.

జైన కవులూ భారత రామాయణాలు రాశారు. వారి కథనాలు వైదిక కవులు రాసిన వాటికి భిన్నంగా ఉంటాయి. క్రీ.శ. ఒకటో శతాబ్దం నుంచి పదిహేనవ శతాబ్ది వరకు జైన రామాయణాలు 15కి పైగా వచ్చాయట. వాటిలో రామ రావణ సంబంధాలు భిన్నంగా కనిపిస్తాయి.

ఆయా సమాజాలలో ఆధ్యాత్మిక గురువులుగా వ్యవహరించే యోగినులను బ్రాహ్మణ ధర్మం కుల దేవతలుగా స్థిరపరచింది. యక్షులు, రాక్షసులు తమను బాధిస్తున్నారని

బ్రాహ్మణులు ఫిర్యాదులు చేసినప్పుడు ఈ ఏర్పాటు జరిగినట్లు స్కందపురాణం చెబుతోంది. బ్రాహ్మణుల రక్షణ కోసం లోకశ్రేయస్సు కోసం వివిధ గోత్రాలవారికి ఆ ప్రదేశంలోని సిద్ధులను పవయోగినులను శ్రీమాత ప్రభృతులను ఏర్పరచారు. స్థానికులను ఆర్యజాతులకు భృత్యులుగా చేయటం ఇక్కడ స్పష్టంగానే ఉంది.

## బౌద్ధం

బుద్ధుడు (క్రీ.పూ. 563-483) జీవించి ఉండగానే ఆయన భావజాలం ప్రజలలో వ్యాపించింది. వేదమతం ప్రచారం చేస్తున్న యజ్ఞక్రతువులలోని జీవహింసను స్వర్గం - మోక్షం పేరుతో జరిగే కర్మకాండను శ్రాద్ధ తర్పణాలను అప్పటికే అసురులు ప్రశ్నిస్తూ ఉన్నారు. వర్ణ ధర్మాన్నీ వారు తిరస్కరించారు. తమిళదేశంలోని పరయా కులానికి చెందిన ప్రజలు ఈ దేశ మూలవాసులనీ వారు బౌద్ధులనీ అయోతీదాస్ (1845-1914) అప్పటి బ్రిటిష్ పాలకులకు వివరించారు (1898లో)

సామ్రాజ్యవాద/రాచరిక వ్యవస్థల స్థానంలో బౌద్ధం, సంఘ వ్యవస్థను ప్రవేశపెట్టింది. ప్రజలు ఏ ధర్మంవైపు మొగ్గుతున్నారో గ్రహించి ఆ ధర్మాలను తమవిగా స్వంతం చేసుకోవటం రాజనీతి. బౌద్ధాన్ని దెబ్బతీయటానికి వైదికమతం సామదాన భేద దండోపాయాలు అవలంబించింది. బుద్ధుడిని విష్ణువు (నారాయణుడు) అవతారాలలో ఒకనిగా చేస్తూ ప్రచారం ఆరంభించింది. "దమ్మేన పదే రంజతీతి భో రాజా" రాజు ధర్మంతో ప్రజలను రంజింపజేయాలి అనే దమ్మపదం సూక్తులను - బౌద్ధంలోని అష్టాంగ మార్గాన్ని "రాజా రక్షతి దమ్మేన అత్తనోవ పజం పజం" (రాజు ప్రజలను ధర్మంతో రక్షించాలి) అనే బుద్ధుని ఉపదేశాలనూ స్వంతం చేసుకున్నది. బుద్ధుని అనంతరం ఆయన ఉపదేశాలను క్రోడీకరించి ఆయన శిష్యులు ప్రచారం చేసిన రీతిలోనే హిందూ పురోహితవర్గం తన మత విశ్వాసాలకు తాత్వికతను ఆపాదించింది.

తథాగత, శబ్దం బుద్ధునికే వాడతారు. బుద్ధుడు 'తథాగతుడు' అలాగే ఉన్నవాడు (One who has thus come or thus gone) అని అర్థం.

రామాయణంలో బుద్ధః తథాగతం అనే పదాల ప్రయోగం (అయో. 109-34) కనబడుతుంది. దొంగలను ఎలా దూరం పెడతామో అలాగే బౌద్ధులను దూరం పెట్టాలని రాముడు అన్నట్లుగా చెప్పారు. కాలక్రమంలో ప్రజలను ఆకర్షించటం కోసం బుద్ధుడి మార్గాన్నే అనుసరించవలసిన పరిస్థితి ఏర్పడి బుద్ధుడిని దశావతారాలలో ఒకనిగా అవతారమూర్తిగా చేర్చేసుకున్నారు.

తీర్థ క్షేత్రాల దగ్గర పూజలు చేయించేటప్పుడు చదివే సంకల్పంలో 'బౌద్ధావతారే' అనటం మొదలుపెట్టారు. గయా క్షేత్రంలో చెప్పే సంకల్పం "వైవస్వత మన్వంతరే... మేరోః దక్షిణ దిగ్భాగే ఆర్యావర్తాంతర్గత మగధ దేశే గయా గదాధర క్షేత్రే కోలాహల పర్వతే మధువనే విక్రమశకే బౌద్ధావతారే బార్హస్పత్యమాసే ప్లవ నామ సంవత్సరే ఆత్మ

సహితై – శతకులోద్ధారణార్థం" అంటూ చెప్పటం ఉంది. గయ దగ్గర ధర్మారణ్య క్షేత్రం, బుద్ధగయ ఉన్నాయి. అక్కడే బ్రహ్మావాదుల గుడి ఉన్నదట.

"బౌద్ధంలోని త్రిశరణాలే త్రిమూర్తి రూపకల్పనకు స్ఫూర్తి. శివుని మూడు ముఖాలు త్రిశరణాలకు సంకేతం. భారతదేశంలో యోగులు ఇద్దరే. ఒకరు బుద్ధుడు – రెండోవారు దక్షిణామూర్తి" అంటారు శ్రీ కాశీపాండ్యన్. అశోకుని ఖాబ్రా మైనర్ శిలాశాసనం బుద్ధ దమ్మ సంఘాలను ప్రస్తావించింది. బుద్ధ ధర్మాన్ని ఆయన అనుయాయులు దేశ దేశాలలో ప్రచారం చేశారు.

ఆర్యుల రాజ్యాలలో కోసల, మిధిల, కేకయ రాజ్యాలు బౌద్ధ ప్రభావంగలవట. ప్రస్తుతపు అయోధ్య స్థలం పూర్వపు సాకేత రాజ్యం. బృహదశ్వుడు అనే బౌద్ధ రాజు దానిని పాలించాడు. అనంతర కాలాలలో అది మరో వంశం వారి పాలనలోకి వెళ్ళింది. వారిలో మిత్రశృంగుడనే రాజు తన పేరుకు "రామ్" అనేది చేర్చుకున్నాడట.

బౌద్ధ రాజులలో 'జంభాల' పేరుగల రాజులున్నారు. జంభ, జంభాల – పేర్లు అసుర జాతులలో ముఖ్యంగా యక్షులలో కనిపిస్తున్నాయి. జంభాల రాజుల విగ్రహాలు పురావస్తు తవ్వకాలలో బయటపడ్డాయి.

బుద్ధుడు చెప్పిన ధ్యాన పద్ధతులు పతంజలి యోగ సూత్రాలలో చేరాయి. అష్టాంగ యోగం బుద్ధుని అష్టాంగమార్గ ఫలితంగానే రూపుదిద్దుకున్నది. 'భగవాన్' పదం మొదట్లో బుద్ధునికే వాడేవారు. అనంతర కాలంలో ఆర్యమునులకూ ఈ పదం జోడించటం మొదలయింది.

అనేకమంది ఆచార్యులు వైదికమతం అనబడే ధర్మానికి బౌద్ధసంబంధమైన భాష్యాలు చెబుతూ ఆ మతాన్ని ప్రజలకు దగ్గర చేయటానికి ప్రయత్నించారు.

కర్మ, ఆత్మ, పునర్జన్మ వంటి తాత్విక రంగాలలో అసురుల భావజాలానికి జైనమూ, బౌద్ధమూ ఒక నిర్దిష్ట రూపాన్నిచ్చాయి. అనంతరకాలపు వర్ణ వ్యవస్థలో ముఖ్యంగా అట్టడుగు వర్గాలకూ, కులాలకూ ఇవి అనుసరణీయంగా రూపొందాయి. వర్ణ వ్యవస్థ నుంచి బయట పడటానికి కావలసిన నైతికతను, ఆత్మవిశ్వాసాన్ని ఇవి ప్రజలలో కలిగించాయి. బుద్ధుని బోధనలను ఇముడ్చుకుంటూ శ్రీకృష్ణుని నోట 'గీత' చెప్పించవలసిన అవసరం వైదిక మతానికి కలిగిందంటే బౌద్ధం ప్రభావాన్ని, అది ప్రవేశపెట్టిన సామాజిక విలువలనూ అంచనా వేయవచ్చు.

క్రీ.పూ. రెండవ శతాబ్దానికే జైన, బౌద్ధాల మీద దాడులు మొదలయినాయి.

అరబ్బుల దండయాత్రలలోను ఇతర విదేశీ దండయాత్రలలోనూ ఈ వైదిక మతస్థులు బౌద్ధులనే బలిపశువులుగా చేశారనీ అంటారు. హిందువులమీద ద్వేషంగల జాతులు హిందువులనే భ్రాంతిలో బౌద్ధులను చంపిన చరిత్ర కూడా ఉన్నది. భారతదేశంలో బౌద్ధం కొన్నాళ్ళు కనుమరుగైనా డా. అంబేద్కర్ దానిని మరలా పరివ్యాప్తం చేశారు. ఈ ధర్మానికి తాత్విక మూలాలు అసురులవే.

# మునుల ఆశ్రమాలు

పురాణాలలో వివిధ సంప్రదాయాలకు చెందిన, విభిన్నమైన భావజాలం కలిగిన మునులు కనబడతారు. ఆర్య మునులు వైదిక సంప్రదాయాన్నే నమ్మినవారు. వాస్తవానికి వేదవాఙ్మయంలో తాత్వికత గాని అలౌకిక భావ సంపద కాని కనిపించదు. అసురుల ఆలోచనలలోనే జీవన సాఫల్యాలు, మానవుని ప్రస్థానం, మరణానంతరం జీవితం గురించిన ఊహలు కనిపిస్తాయి. ఆ నేపథ్యంలో ఆర్య, ఆర్యేతర మునులను గురించి ప్రస్తావించు కోవటం అవసరం.

మౌనంగా ఉండేవాడు ముని. శిష్యులకు మార్గనిర్దేశం చేసే క్రమంలో ఒక్కొక్క మునిదీ ఒక్కొక్క పద్ధతి. ఆర్య మునులలో రాజపురోహితులుగా ఉన్న వారిలో కొంత రాజసమూ కనిపిస్తుంది. రాజాస్థానాలలోని వారూ, అరణ్యాలలో తపోవృత్తిలో ఉన్నవారూ ఆర్యుల వ్యాప్తికి సహకరించిన వారూ తమకంటూ ఒక ప్రత్యేకతను పొందినవారూ చాలమంది పురాణాలలో కనిపిస్తారు. వారిలో జాబాలిని తప్పక పేర్కొనవలసిందే.

**జాబాలి**

జాబాలి హేతువాది. బ్రాహ్మణోత్తముడు. రాముడిని. అరణ్యవాసం నుంచి వెనకకు రప్పించాలనే లక్ష్యంతో భరతుని వెంట రాముని దగ్గరకు వెళ్ళిన సందర్భంలో అయన రామునికి చేసిన ఉపదేశం భౌతిక వాద వివరణతో స్పష్టంగా నాస్తిక తత్వంతో కూడి ఉంది.

"తండ్రికిచ్చిన మాట కోసం నీవు అరణ్యాలలో ఎందుకు బాధపడతావు. సృష్టి అనేది అణుభాగాల పరస్పర చర్య. వ్యక్తి మరణించి మట్టిగా మారుతున్నాడు. ప్రత్యక్షంగా చూడగలిగిన దానిని మాత్రమే నమ్మాలి. ఇహలోక సుఖాలే వాస్తవం. తండ్రికిచ్చిన మాట తండ్రితోనే పోయింది. అయోధ్యకు వచ్చి రాజ్యాన్ని స్వీకరించి సుఖ జీవితం గడపవలసింది" అని బోధించాడు.

"జీవి అనేది రేతస్సు, అండముల కలయిక ఫలితమే తప్ప వేరు కాదు. జీవికి ఫలప్రద కారణం తండ్రి. భౌతిక కారణం తల్లి. నీ తండ్రి ఇప్పుడు శరీరంతో లేడు. అతనికిచ్చిన మాట అతనితోనే పోయింది. నీ వంటి బుద్ధిశాలి, నిరర్థకములైన విషయాలను గురించి ఆలోచనలు చేయకూడదు. ఈ లోకంలో ఎవరు ఎవరికి బంధువులు. ఎవరివల్ల ఎవరికి లాభం? ఏ ప్రాణి అయినా ఒంటరిగానే పుడుతుంది. ఒంటరిగానే మరణిస్తుంది. ఇతడు నా తండ్రి అనీ ఈమె నా తల్లీ అనీ మమకారాలు పెట్టుకునేవాడు పిచ్చివాడు. ఈ ప్రపంచంలో ఎవరూ ఎవరికీ ఏమీకారు.

"ఒకడు వేరే గ్రామానికి వెళ్తూ తోవలో ఏదో ఒక సత్రంలో బసచేస్తాడు; తెల్లవారి బయలుదేరి ముందుకు సాగిపోతాడు. తల్లిదండ్రులతోను గృహ సంపదలతోను మనిషికి

గల సంబంధం అలాంటిదే. ఈ సంబంధాలన్నీ తాత్కాలికాలు. సజ్జనులు ఈ బంధనాల పట్ల ఆసక్తి చూపరు.

"వనవాస జీవితం కష్టం. తండ్రి ఇచ్చిన రాజ్యం వదలి ఇలాంటి అరణ్యవాసాన్ని నీవంటివాడు ఆశ్రయించటం తగనిపని. దేశాంతరం వెళ్ళిన భర్తకోసం నిరీక్షిస్తున్న స్త్రీ లాగా అయోధ్య నీకోసం నిరీక్షిస్తోంది. అయోధ్యకు వచ్చి పట్టాభిషేకం చేసుకో" అని చెప్పాడు. "ఈ మానవ సంబంధాలు ఎక్కడికక్కడే పూర్తి అయిపోతాయి. ఇవి పరలోకంతో కొనసాగుతాయనుకోవటం భ్రమ" అనీ చెప్పాడు. (అయో. 108వ సర్గ)

"దశరథుడు నీకు ఏమీ కాడు. నీవు ఆయనకు ఏమీకావు. ఆ రాజు వేరు. నీవు వేరు" దశరథ మహారాజు తాను చేరవలసిన చోటుకు చేరాడు. అన్ని ప్రాణులకూ అది సహజం. నీవు అనవసరంగా బాధపడుతున్నావు..." అన్నాడు.

ఈ సందర్భంలో శ్రాద్ధ తర్పణాల గురించి కూడా జాబాలి చెప్పాడు. "లోకంలో జనులు అష్టకాశ్రాద్ధాలు ఆబ్దిక శ్రాద్ధాలూ చేస్తూ ఆ పదార్థాలు పితృదేవతలకు చేరతాయని నమ్ముతుంటారు. అన్నం ఇక్కడే నశించిపోతుంది కదా. దానిని చనిపోయిన వారు ఎలా తింటారు? ఒకరు తిన్న ఆహారం మరొకరి శరీరానికి చేరుతుందా? అలాగయితే దూర దేశాలకు వెళ్ళే వారికీ శ్రాద్ధాలు పెట్టవచ్చు. అప్పుడు వారికి దారి బత్తెంతో పని ఉండదు" అన్నాడు. (ఈ మాటలనే జోతిరావు పూలే ప్రజలకు వివరించి చెప్పారు)

శాస్త్రాలలోని కొన్ని కొన్ని విషయాలు అసంగతాలు అని కూడా జాబాలి చెప్పాడట.

–"దేవతలను పూజించు. దానాలు చెయ్యి. యజ్ఞాలు చెయ్యి. ఇల్లు వాకిలి వదిలి సన్యాసం స్వీకరించు – వంటి విషయాలతో కూడిన గ్రంథాలు పనిలేని వాళ్ళు రాసినవి. ఇతరుల ధనాన్ని సుఖంగా దానం తీసుకునే బుద్ధితోనే వారు అలాంటివి రాసిపెట్టారు" అన్నాడు.

ఈ వాదాన్ని రాముడు తిరస్కరించాడు. కర్మవాదం ముందుకు తెచ్చాడు. (అయో –109–28) భౌతికవాదం అప్పటికి బలంగా ఉన్నదనటానికి జాబాలి మాటలు ఉదాహరణ. ఇలాంటి భావ చైతన్యానికి హేతుదృక్పథానికి జైనమూ, బౌద్ధమూ కారణమైనాయి. (జాబాలి నిజంగా నాస్తికుడు కాదనీ రాముడిని ఒప్పించటానికే అలా మాట్లాడాడనీ, వసిష్ఠుడు రామునికి సర్ది చెప్పాడు. అది వేరే విషయం.)

జాబాలి ప్రకృతితో సమన్వయం సాధించిన తపశ్శాలి. ఆయన ఆశ్రమంలో పరస్పర విరోధులుగా చెప్పబడే జంతువులు కూడా మైత్రీ భావంతో ఉండేవట. మైత్రీభావం బుద్ధుని భావజాలం నుంచి వచ్చినదే. జింకపిల్లకు పాలు ఇస్తున్న పెద్ద పులులు జాబాలి ఆశ్రమంలో కనబడేవట. "జాబాలి" చార్వాక మత ప్రవర్తకుడంటారు. కళింగంలో ప్రచారమైన బౌద్ధం చార్వాకంగా ప్రసిద్ధమై ఉండాలి. కళింగదేశ (ఒరిస్సా ప్రాంతం) ప్రజలు అహింసా వ్రతానికి స్వావలంబనకూ పేరు పొందారు. అక్కడివారు కారువాకులు – వారే చార్వాకులుగా

పరిగణనకు వచ్చి ఉంటారు. అశోకుని భార్యలలో చారు వాచి, కోరువాకి అనే పేర్లుగల వారున్నారు. వారు కళింగానికి చెందినవారై ఉండవచ్చు.

'కారువాకి' అనే పదం (Carvac/Carvak) భ్రష్టరూపంగా చార్వాకం అయిందేమో ఆలోచించాలి. కారు కూతలు - (సహింపరాని మాటలు) వేద నిందకులనుద్దేశించే వాడుకలోకి వచ్చాయేమో.

కళింగ ప్రజలకూ అశోక చక్రవర్తికీ జరిగిన కళింగ యుద్ధం చరిత్రలో ఉంది. ఆ తర్వాత కళింగులకు చోళులతో ఒక శతాబ్దం క్రితం యుద్ధం జరిగినట్లు సింహాచలం ఆలయంలో రెండు తమిళ శాసనాలు, ద్రాక్షారామంలో తెలుగు తమిళం సంస్కృతం కలిసిన భాషలో ఒక శాసనమూ ఉన్నాయట. సింహాచలంలో కొన్ని రాగిరేకులలోనూ యుద్ధం గురించి ఉన్నదంటారు. ఇవి కాళింగుల స్వతంత్ర ప్రవృత్తినీ బౌద్ధధర్మాభినివేశంతో కూడిన వారి సంస్కృతినీ పరోక్షంగా ప్రతిబింబిస్తున్నాయి.

రాముని సమాధానంలో కులీన, అకులీన వంటి పదాలు కనిపించటం అప్పటి సామాజిక వ్యవస్థను ప్రతిబింబిస్తున్నది.

చార్వాకమతమూ భౌతికవాదమూ అప్పటికి ఉన్నాయి. వాటిని కర్కశంగా అణచి వేశారు.

## చార్వాకుడు

ఒక చార్వాకుడు మహాభారతంలో కనిపిస్తున్నాడు. ధర్మానికి ప్రతిరూపంగా చెప్పుకునే ధర్మరాజు ఒకప్పుడు చార్వాకుల ప్రశ్నలకు గురయ్యాడు. శిశుపాలుని వంటి రాజులు ధర్మరాజు చర్యలను ప్రశ్నిస్తూనే వచ్చారు. అలాంటి వారిని రాజ్యం తీవ్రంగా శిక్షించింది. ధర్మరాజు రాజ్యార్హతను గురించి ప్రశ్నించి మరణశిక్ష పొందిన (హత్యకుగురయిన) ఒక చార్వాకుని గురించి ఇక్కడ ప్రస్తావించుకోవాలి.

ధర్మం, అధర్మం - న్యాయం, అన్యాయం అనేవి వేర్వేరుగా కనిపించినా వాటి మధ్య ఉన్న విభజన రేఖ అతి సున్నితమైనది. ఆ విషయం గుర్తించారు గనకనే పూర్వ పండితులు సమస్యాత్మక నిర్ణయాలలో "ధర్మసూక్ష్మత" మీద నెపంవేసి తప్పించుకునేవారు.

ధర్మరాజు సింహాసనాన్ని అధిష్ఠించే సందర్భంలో అసమ్మతి నీడలు కనిపించాయి. నిర్వేదమూ కనిపించింది. కురుక్షేత్ర యుద్ధం ముగిసేసరికి పాండవుల పక్షంలోనూ కౌరవుల పక్షంలోనూ అతి తక్కువ మంది మాత్రం మిగిలారు.

"అధికారం కోసం ఇంత రక్తపాతం జరిగింది - బంధుమిత్రుల్ని చంపాను. పాపాత్ముణ్ణి. నేను రాజ్యం పాలించటానికి తగుదునా?" అని ధర్మరాజు నిర్వేదంలో పడ్డాడు. ఆయనకు ఆ ఆలోచన రావటానికి కారణం బహుశః అక్కడక్కడ లోకులు అనుకునే మాటలు కావచ్చు. ఆత్మ పరిశీలన చేసుకున్నప్పుడు ఆయనకే న్యూనతా భావం కలిగిందేమో. మొత్తానికి ఆయనకు సందేహం కలిగింది.

"తాను సింహాసనం ఎక్కడానికి తగుదునా" అనే సంశయాన్ని ఆయన తనవాళ్ళ దగ్గర వ్యక్తంచేశాడు. తమ్ముళ్ళు సర్దిచెప్పారు. కృష్ణుడూ నచ్చచెప్పాడు. వాళ్ళంతా తనకు నచ్చచెప్పాలనే ధర్మరాజు కూడా ఆశించాడేమో. లోకులు అనుకునే మాటలను ఆ విధంగా ఖండించటానికి ప్రయత్నాలు జరిగాయనుకోవాలి. చివరకు వారంతా బంధుమిత్రుల్ని చంపటం అనే చర్యను క్షత్రియ ధర్మంగా నిర్ధారించారు.

"యుద్ధం క్షత్రియ ధర్మం. ప్రతిస్పర్ధులను యుద్ధంలో చంపటం వీరుల కర్తవ్యం. రాజ్యం వీరభోజ్యం" - లాంటి ఊరడింపు మాటలన్నీ విని ధర్మరాజు కుదుటబడ్డాడు. తాను చేసినది పాపకర్మ కాదని అందరూ చెప్పేలాగ చూసుకోవటం గొప్ప రాజనీతి కుశలత. పాలకవర్గాలు, రాజకీయ పార్టీలు ఎప్పుడూ ఈ నీతిని అవలంబిస్తూనే ఉంటాయి. ఎన్నికలప్పుడు ప్రతిసారీ "గతంలో కొన్ని పొరపాట్లు జరిగాయి - ఒప్పు కుంటున్నాం - ఇకమీదట అలా జరగనివ్వం" అనే మాటలు వినటం ప్రజలకు అలవాటే.

మహాభారతం కాలంనాటికి పుణ్యకర్మలు, పాపకర్మలు స్పష్టంగా కొన్ని పరిధుల్లో ఉండేవి. అనుకూలమైన వాటిని పాపాలైనా, ధర్మసూక్ష్మాలుగా ముద్రవేసి నిలబెట్టుకునే వారు. అధికారులూ, పండితులూ వత్తాసు పలికేవారు. రాజును సముదాయిస్తూ పై సందర్భంలో వ్యాసుడు చెప్పిన పాపకర్మలు ఇవి.

1. ఆగమోక్త కర్మలు చేయకుండా ఉండటం, 2. నిషిద్ధమైనవి చేయటం - అనే ఈ రెండూ పాపాలు. (శాంతి. 1-291) ఈ రెండూ ధర్మరాజు చేయలేదు కాబట్టి ఆయన నిశ్చింతగా ఉండవచ్చునన్నాడు వ్యాసుడు. పాప కర్మలలో రాజులకు పాపకర్మలు వేరే ఉన్నాయట. 1. ధనంలో మునిగి తేలటం 2. యుద్ధంలో వెనుదీయటం 3. ప్రజలను రక్షించకుండా ఉండటం. ఈ మూడూ రాజులకు పాపకర్మలు. ఆ ప్రకారం ధర్మరాజు మొదటి రెండూ చేయలేదు. మూడో పాపం చేయకుండా ఉండాలంటే పట్టాభిషేకం చేసుకుని ప్రజలను రక్షించాలి (పాలించాలి) అని ధర్మరాజుకు నచ్చచెప్పారు. పట్టాభిషేకం చేసుకోక పోవటం పాపం అని భయపెట్టారు. వారి మాట మన్నించి ధర్మరాజు అట్టహాసంగా కరి నగరానికి బయలుదేరాడు. (శాంతి 1-347-360) ఆయన ప్రయాణానికి సరికొత్త రథం ఏర్పాటయింది. పదహారు తెల్లని గుర్రాలు కట్టారు దానికి. - రాజులు తమ పరివారాలతో - సైన్యాలతో అనుసరించి రాగా ఒక గొప్ప ప్రవాహంలాగా జనం కదలివెళ్ళారు. చైతన్యరథ యాత్రలూ, ప్రజాపథాలలోని రథ యాత్రలూ, ఎడ్లబండ్ల జాతరలూ ఈ మహోత్సవపు ఛాయలే. అవి ఈ మూలాల నుంచే వచ్చాయి. వందిమాగధుల ప్రశంసలూ బిరుదులు చదివే వారి హెచ్చరికలూ మంగళతూర్య ధ్వనులూ దిక్కులు నిండాయి. శైబ్యం, సుగ్రీవం, మేఘం, పుష్పం, వరాహకం అనే అయిదు గుర్రాలు పూన్చిన రథంలో కృష్ణుడూ వారితో వెళ్ళాడు. ధర్మరాజును ఆహ్వానిస్తూ కరిపురం సింగారించారు. (హస్తినాపురం, నాగనగరం అనీ ఈ నగరానికి పేర్లు).

ఈ సందర్భంలో ధర్మరాజును చూసి పౌరులు సంతోషంతో అనుకొన్న మంచి మాటలు, పొగడ్తలు భారతంలో కనిపిస్తాయి. ప్రతిస్పర్ధులు చేసిన విమర్శలు వినిపించకుండా కనిపించకుండా జాగ్రత్తపడ్డారు. ధర్మరాజు పట్టాభిషేకం వైభవంగా జరిగింది. అప్పుడు లేచాడు – అసమ్మతి వర్గీయుడు – చార్వాకుడు. అతడు దుర్యోధనుని మిత్రుడట. బ్రాహ్మణ వేషం ధరించి అక్కడి బ్రాహ్మణులతో కలిసిపోయి ఆ పట్టాభిషేకానికి వెళ్ళాడు. తన నిరసనను బాహాటంగా తెలియజేశాడు.

"తండ్రి, సోదరుడు, కొడుకు, గురువు అనే శంకలేకుండా అందర్నీ చంపాడు. చంపేటప్పుడు మనసులో ఏమాత్రం సందేహించలేదు. పెద్ద పాపం చేశాడు. వీడేమి రాజు" అని ఈ విప్రులంతా అంటున్నారు. ఆ మాట అడగవలసిందిగా నాకు చెప్పారు. అన్నాడు. ఆ మాటలు తనవి కావనీ ప్రజల ప్రతినిధిగా తాను చెబుతున్నాననీ అందరూ ఇలా అనుకొంటున్నారనీ మరీ మరీ చెప్పాడు. అది ప్రజాభిప్రాయం.

"శిష్టజనం ఏవగించుకునేటట్టు రాజ్యం కోసం ఇంత మందిని చంపావు. నీకు పాపం అంటుతుంది" అనీ అన్నాడు. వెంటనే కలకలం రేగింది. (ప్రజా కంటకులైన రాజులను పండితులు ఇలా నిలదీసేవారన్న సత్యం ఇక్కడ బోధపడుతున్నది. రాజరిక వ్యవస్థలోనూ చార్వాకుడు రాజును నిలదీశాడు. అదీ ధర్మరాజును. ధర్మరాజు నివ్వెర పోయాడు, సిగ్గుపడ్డాడు. "నన్ను ధిక్కరించకండి ఆదరించండి. మీకు మొక్కుతాను" అన్నాడు, అక్కడి బ్రాహ్మణ సమాజంతో.

"మ్రొక్కి వేడెద నను మీరు ధిక్కరింప, కాదరింపుడు..." (శాంతి. 1–365) అంటున్న ధర్మరాజును బ్రాహ్మణ సంఘాలు భయంతోనూ సంభ్రమంతోనూ చూశారు. "మునులు కూడా నన్ను అనుమతించారు" అన్నాడు ధర్మరాజు. అప్పట్లో మునుల మాటలు పాటించ దగ్గవి గనుక బ్రాహ్మణులు కంగారు పడుతూ "మేము అలా అనలేదు. అబ్బే.." అన్నారు. ఉత్తమ – క్షత్ర ధర్మంతో నీవు ఈ రాజ్యం సంపద సంపాదించుకున్నావు – అని ఆయనను ఓదార్చారు. ఆ మాయా భిక్షువును చూచి, "వీడు మావాడు కాదు...దుర్యోధన సఖుడైన రాక్షసుడు. పరివ్రాజక వేషంలో వచ్చి ఇలా చేస్తున్నాడు...నీవు పాల సముద్రంలాంటి వాడివి. ఈ కుక్క మొరిగితే నీకేమి? నీవు కలతపడకు...ఈ సామ్రాజ్యం పాలించు..." అన్నారు (1–366).

చార్వాకుడిని తమ హూంకారంతో చంపేశారు. కేసు విచారణ లేదు – అతని వాదమూ వినలేదు. శిక్షించారు. అదీ హూంకారంతో – అంటే, గట్టిగా అరుస్తూ తిడుతూ కొట్టి చంపారు. ఇది రాజకీయ హత్య. బ్రహ్మ తేజోనిహతితో చనిపోయిన ఆ దానవుని చూసి ధర్మరాజూ, తమ్ముళ్ళూ సంతోషించారు. ఈ వివరాలు సంస్కృత భారతంలో శాంతి పర్వం 38, 39 అధ్యాయాలలోనూ, తెలుగు భారతంలో శాంతిపర్వం మొదటి ఆశ్వాసం లోనూ ఉన్నాయి. రాజరిక వ్యవస్థలోని హత్యలు నేడూ సాగుతున్నాయి. క్రమశిక్షణ చర్యలు ఉంటున్నాయి. ప్రజాస్వామ్య ప్రభుత్వాలయినా ఇదే పద్ధతి.

మహాభారతంలోని సంఘటనలూ - ఉపకథలూ పూర్వం ఒకప్పుడు జరిగినవే. ఆ నోటా ఈ నోటా పరంపరగా ప్రజల నోళ్ళలో నానుతూ ఎన్నెన్నో మార్పులకు లోనవుతూ వచ్చిన ఆ కథలు గ్రంథరూపం దాల్చటానికి కొన్ని వందల సంవత్సరాలు పట్టి ఉండవచ్చు. వర్ణనలు ఎలా మార్పుపొందినా మూలగాథ అంటూ ఒకటి ఉంది. చార్వాకుని అసమ్మతి గ్రంథంలోకి ఎక్కిందీ అంటే కొంత వాస్తవం ఉందన్నమాట. చార్వాకుని అడ్డు తొలిగాక ధర్మరాజు పట్టాభిషేకం ఆనందంగా కొనసాగింది. చార్వాకునిపట్ల తాము అనుసరించిన పద్ధతిని సమర్థించుకోవటానికి ఒక కథ ప్రచారంలోకి తెచ్చారు. అది కృష్ణుడే చెప్పాడు. పాలక వర్గానికి అవసరమైన ధర్మసూక్ష్మాలు ఎక్కువ శాతం కృష్ణుని నోటనే వినిపిస్తాయి.

చార్వాకుడు కృతయుగం నాటి దైత్యుడు. గొప్ప తపస్సు చేశాడు. బ్రహ్మను మెప్పించాడు. ఏ ప్రాణివల్లనూ తనకు ప్రాణభయం ఉండకూడదని కోరాడు. బ్రహ్మ సరే నన్నాడు; అయితే ఒక షరతు. "బ్రాహ్మణులకు ఇష్టంలేని పనిచేయకు. అలా ఉన్నంత కాలమూ ఈ వరం పనిచేస్తుంది" అన్నాడు. "ఆ దైత్యుడు రకరకాలుగా అందర్నీ బాధిస్తూ చివరకు దుర్యోధన సఖుడై ఇలా మరణించాడు" అని కృష్ణుడు అక్కడి వారికి చెప్పాడు. (1-369). (కృతయుగం నుంచీ ద్వాపరయుగం వరకూ అతని దుర్మార్గాలు సాగాయన్న మాట. భారతంలో ఎక్కడా చార్వాకుని సలహాతో దుర్యోధనుడు చేసిన చెడ్డపనుల ప్రస్తావన లేదు.)

బ్రాహ్మణులు బ్రహ్మజ్ఞాన సంపన్నులు - అప్పట్లో పాలకపక్షం వారి మీద ఆధార పడేది, కాబట్టి బ్రాహ్మణులకు అంత ప్రాధాన్యం - గౌరవం ఇచ్చారు. అదంతా జ్ఞానం (విద్య) వల్ల కలిగిందే. బ్రాహ్మణులకు ఇష్టంలేనిపని చేయకు అనడమూ అందుకే.

అయినా రాజునూ, పాలకపక్షాన్నీ చార్వాకుడు ప్రశ్నించాడు. లోపాన్ని ఎత్తి చూపాడు. ఇప్పుడు ప్రజాప్రభుత్వాల పాలనలో పౌరులు ఎందుకు ప్రశ్నించటంలేదు? కొద్దిమందే ఎందుకు గళం విప్పుతున్నారు? అనేది ఆలోచించవలసిన ప్రశ్న.

## అగస్త్యుడు

దక్షిణా పథానికి వచ్చి స్థానికులను అణచివేయటానికి పూనుకొన్న ఆర్య మునులలో అగస్త్యుని పాత్ర ఎక్కువ. ఊర్వశిని చూసి చలించిన మిత్రావరుణుల (సూర్యుడు వరుణుడు) వీర్యం నుండి అగస్త్యుడు, వసిష్ఠుడూ పుట్టారట. (రామాయణం అరణ్యకాండ (సర్గ 11-47). అసుర రాజుల అణచివేతలో అగస్త్యుడు, వసిష్ఠుడు కీలకపాత్ర వహించారు. అరణ్యవాస సమయంలో రాముడు అగస్త్యుని ఆశ్రమానికి వెళ్ళినప్పుడు మునికి కత్తులు, విల్లు, బాణాలు ఇచ్చాడు. రావణునితో యుద్ధం చేస్తున్న సందర్భంలో ఒకసారి రాముడు దిగులుపడితే అగస్త్యుడు వెళ్ళి అతనికి 'ఆదిత్య హృదయం' అనే మంత్రం ఉపదేశించి ధైర్యం చెప్పాడు.

అగస్త్యుడు మృగ మాంసంతో నిత్యశ్రాద్ధం పెట్టేవాడట. (భారతం) అగస్త్యుని గురించి చెప్పేటప్పుడు వాతాపి, ఇల్వలుడు అనే ఇద్దరు రాక్షస సోదరుల కథ తప్పక చెబుతుంటారు.

ఇల్వలుడు ఇష్ట కామ్యసిద్ధి మంత్రం ఉపదేశించవలసిందిగా ఒక బ్రాహ్మణుని కోరాడు. ఇంద్రుని వంటి కొడుకు కావాలనేది అతని కోరిక. అది నెరవేరలేదు. రాక్షస రాజులకు ఇంద్రునివంటి కొడుకు ఉండటం అనే ఊహనే ఆర్య బ్రాహ్మణులు సహించరు. దానితో ఇల్వలుడు బ్రాహ్మణులపై ద్వేషం పెంచుకున్నాడనీ బ్రాహ్మణులను భోజనానికి పిలవటం వాతాపిని మేకగా చేసి వండి పెట్టడం బ్రాహ్మణులు తిన్న తర్వాత వాతాపిని పిలవటం - వాతాపి బ్రాహ్మణుల పొట్ట చీల్చుకొని బయటికి రావడం అనే పద్ధతిలో వారు బ్రాహ్మణులను చంపుతూ వచ్చారనీ, ఈ విషయం తెలిసి అగస్త్యుడు ఇల్వలుని దగ్గరకువెళ్ళి వారికి గుణపాఠం నేర్పాడని ఒక కథ. అయితే అసలుకథ వేరే ఉంది.

అగస్త్యుని భార్య లోపాముద్ర. అగస్త్యుడు ఆమెతో క్రీడించాలనుకున్నప్పుడు ఆమె మంచి బట్టలూ, అలంకారాలూ కావాలన్నది. డబ్బు కోసం తన తపస్సు ఖర్చుపెట్టడానికి ఇష్టపడక ఎవరి దగ్గర అవసరానికి మించి డబ్బు ఉంటుందో వాళ్ళను అడుగుదామని అగస్త్యుడు వెతుకుతూ వెళ్తే అవసరానికి మించి డబ్బున్న వాళ్ళు ఎవరూ కనబడలేదట. ఎవరో ఇల్వలుని పేరు చెప్పారు. అగస్త్యుడు, మరో ముగ్గురు, ధనంకోసం ఇల్వలుని దగ్గరకు వెళ్ళారు. ఇల్వలుడు వారికి ధనం ఇస్తానన్నాడు. ఆతిథ్యం ఇచ్చాడు. యథాప్రకారం తమ్ముడిని వండిపెట్టాడు. అగస్త్యుడు భోజనం చేయగానే "వాతాపి జీర్ణం" అంటూ వాతాపిని తిరిగి బతికి రాకుండా జీర్ణం చేసుకున్నాడు. ఇల్వలుడు అది గ్రహించి కూడా ఏమీ అనకుండా వీరికి డబ్బు ఇచ్చి పంపాడు. (ఇది భారతంలోని కథ) ఈ కథ రాక్షసుల వదాన్యత గురించి కాకుండా వారి దుష్టత్వాన్ని ప్రచారం చేసే కథగా మిగిలింది.

అగస్త్యుని గురించి చాలా కథలున్నాయి. అసురులను వ్యతిరేకించి/బాధించిన కథలే వాటిలో ఎక్కువ. సూర్యచంద్రుల రాకపోకలను అడ్డుకునేంతగా వింధ్య పర్వతం (అగము) బాగా ఎత్తు పెరిగిపోతూ ఉంటే దాని గర్వం అణచటానికి అగస్త్యుడిని అడిగారట. ఉత్తర దిశ నుంచి దక్షిణానికి వెళ్తూ ఆయన వింధ్యను దారి అడిగాడు. వింధ్య వినయంతో వంగి దారి ఇచ్చింది. "నేను తిరిగి వచ్చేవరకూ ఇలానే ఉండు" అని ఆయన చెప్పివెళ్ళాడు. మళ్ళీ అటు రానేలేదు. వింధ్య ఎత్తు తగ్గించి అలానే ఉండిపోయింది. అగము గర్వం అణిచాడు కాబట్టి అగస్త్యుడయ్యాడు. అంతకుముందు ఏమి పేరు ఉండేదో?

వృత్రాసురుడు సముద్రంలో దాక్కుంటే అగస్త్యుడు సముద్రజలాన్నంతా తాగేసి ఇంద్రుడు వృత్రుని చంపటానికి సహాయపడ్డాడట. కాలకేయులు, అనే గంధర్వుల సంహారం గురించీ ఇలాంటి కథనే చెప్పారు.

అగస్త్యుడు దక్షిణానికి వచ్చి తన శిష్యులతో అక్కడ ఆశ్రమాలు ఏర్పరచుకొన్నాడనీ మతంగుడి ఆశ్రమ ప్రాంతాలు ఆక్రమించాడనీ, ఈ ఆర్య మునుల యజ్ఞాలూ పటాటోపమూ సహించలేక మతంగుడు ఆ ప్రదేశం విడిచి దూరంగా లోపలికి మరో ఆశ్రమం నిర్మించు కున్నాడనీ ఒక కథనం.

దక్షిణ కైలాసంగా పిలిచే ఘంటసాల క్షేత్రానికీ అగస్త్యునికీ సంబంధం కల్పిస్తూ ఒక కథ ప్రచారంలో ఉంది. ఆర్యేతర క్షేత్రాలకు ఆర్య మునుల సంబంధం ఉందని చెప్పటంలోని అంతరార్థం స్పష్టమే. కృష్ణా జిల్లా ఘంటసాల ప్రాంతంలో జలధీశ్వరునిగా శివుడు వెలిశాడట. అక్కడ శివుడు పార్వతి ఒక పీఠంపై కొలువై ఉన్నారు. ఆ పీఠం క్రీ.పూ. 2050 కంటే పూర్వపు నిర్మాణం అనీ ఆ ఆలయంలోని గర్భాలయం - ఇతర నిర్మాణాలూ ప్రత్యేక వాస్తు నిర్మాణాలనీ అంటారు. ఆలయ విమాన శిఖరం మూడు శిఖరాలతో ఉండటం త్రిశరణాలకు సంకేతం అంటారు. అది జైన, బౌద్ధాల ప్రభావంగల అసురరాజుల కాలంలోని నిర్మాణం కావచ్చు. దానికీ అగస్త్యునితో కథ అల్లారు.

శివపార్వతుల కల్యాణానికి అందరూ ఉత్తరంవైపు వెళ్తూంటే అటువైపు బరువు పెరిగిందట. అప్పుడు శివుడు అగస్త్యుని పిలిచి దక్షిణాపథంలో తమను ప్రతిష్ఠించవలసిందిగా చెప్పాడట. (పెళ్ళిళ్ళలో టి.వి. స్క్రీన్ బయట ఏర్పాటుచేసినట్టే అప్పుడూ చేశారన్న మాట.) ఈ కథలు ఎలా ఉన్నా ఘంటసాల క్రీస్తుపూర్వం నుంచీ సముద్ర వ్యాపారానికి కేంద్రంగా ఉండేది. వ్యాపారులు ఆలయానికి ఇచ్చిన దానాల తాలూకు శాసనాలు ప్రాకృతంలో ఉన్నాయి. అప్పటి పాలకులు స్థానిక జాతులవారే.

కావేరి నదికీ అగస్త్యునికీ సంబంధించీ కథలున్నాయి. "కావేరి" చాలా అందమైనది. శివుని గురించి తపస్సు చేసింది. నదిగా ప్రవహించాలని ఆమె కోరిక. అగస్త్యుడు ఆమెను కోరి వివాహం చేసుకున్నాడు. తాను ఆశ్రమంలో లేనప్పుడు ఆమెను జాగ్రత్తగా చూసుకోవటానికి ఒక శిష్యుని కాపలా పెట్టాడు. ఆ శిష్యుడు ఆమెను ఒక పాత్రలో బంధించి పెట్టేవాడట. నీళ్ళు పాత్రలో పోసి ఉంచటం అనే సామాన్య విషయాన్ని ఇలా చెప్పారనుకోవాలి. అలా బంధించటంతో స్వచ్ఛంగా స్వేచ్ఛగా ఉండే కావేరి మనసు గాయపడింది. అగస్త్యుడు వింధ్యను దాటే సమయంలో సహ్యాద్రి దగ్గర తన మూర్తిమత్వాన్ని నిలబెట్టుకుంటూ పాత్రలోనుండి దూకి వెల్లువెత్తి ప్రవహించింది. అగస్త్య శిష్యుడు ఆమెను అడ్డుకోబోతే అక్కడే అదృశ్యమై పోయింది. ఆ ప్రదేశం 'తల కావేరి'. పడమటి కనుమలలోని కూర్గులో ఉంది. అక్కడ కావేరి జలాలు ఉంటాయి కాని, ప్రవాహం అదృశ్యంగా ఉంటుందట. పాతాళంలో కొన్ని కిలోమీటర్ల దూరం ప్రవహించి భాగమండలం దగ్గర కావేరిపైకి కనబడుతుంది. అక్కడ కావేరికి ఆలయం కట్టారు. కావేరి కూర్గు ప్రాంతంలో ఇంటింటా పూజలు అందుకుంటున్నది. (అక్కడే కొంత దూరంలో 'కబిని' నది కావేరిలో కలుస్తున్నది. కబిని కావేరికి ఉపనది.)

స్త్రీల స్వేచ్ఛను కట్టడిచేసిన సామాజిక అంశంగా ఈ కథను అన్వయించుకోవాలి. ఇవన్నీ గతంలోని సంఘటనలకు మూర్తీకరణలు.

## వసిష్ఠుడు

సప్తరుషులలోనూ సప్త బ్రహ్మలలోనూ వసిష్ఠుని పేరు కనబడుతుంది. సప్త రుషులు ప్రతిమన్వంతరానికీ మారుతుంటారు. వసిష్ఠుని పేరు మూడు, నాలుగు మన్వంతరాలలో కనబడుతున్నది. ఇతని గురించి పురాణాలలో రకరకాల కథలున్నాయి. బ్రహ్మ ఊర్వశిని కామించినప్పుడు అతని నాలుక ప్రాంతం నుంచి వసిష్ఠుడు పుట్టాడట. నిమి అనే రాజు యాగం సందర్భంగా నిమి వసిష్ఠుడు ఇద్దరూ ఒకరినొకరు శపించుకుని విదేహులయ్యారు. దేహంలేకుండా అలా ఉండిపోయి చాలాకాలం తర్వాత ఊర్వశి సంబంధంగానే మిత్రా వరుణుల (సూర్యుడు, వరుణుడు) వీర్యం నుంచి వసిష్ఠుడు అగస్త్యుడు పుట్టారు. ఇది వసిష్ఠుని రెండోజన్మ. వసిష్ఠుని గురించిన ఇలాంటి కథలు వింటుంటే వసిష్ఠులు చాలా మంది ఉండి ఉంటారనిపిస్తుంది. ఊర్వశి సంబంధంవల్ల బ్రహ్మకు బ్రాహ్మణ్యం ఇవ్వకుండా బ్రహ్మ కొడుకైన వసిష్ఠునికి బ్రాహ్మణ్యం ఇచ్చారట. ఈ విధంగా వసిష్ఠుని పాత్ర బ్రాహ్మణ్యానికి ప్రతీకగా ఉంది.

వసిష్ఠుడే 56 రాజ్యాలను, చతుర్వర్ణాలను ఏర్పరచాడనీ అసురులకు శుక్రాచార్యుని, దేవగణాలకు బృహస్పతిని గురువులుగా ఏర్పాటు చేశాడనీ ఆదిజాంబవ పురాణం చెబుతోంది. చరిత్రపరంగా క్రీ.పూ. ఆరవ శతాబ్దినాటికి ఉత్తర భారతదేశంలో 56 రాజ్యాలు (ఛప్పన్న దేశాలు) గుర్తించారు. ఈ 56 రాజ్యాలనూ ఆదిజాంబవ పురాణం పేర్కొన్నది. బ్రిటిష్‌వారు ఇండియా వదలివెళ్ళేనాటికి సుమారుగా 56 సంస్థానాలు (Princely States) ఉన్నాయి. ఈ అంశాలు పరిశోధించదగ్గవే.

చతుర్వర్ణాలను ఏర్పరచిన వసిష్ఠుడు మతంగుని కూతురైన అరుంధతిని వివాహం చేసుకున్నాడని చెప్పే కథలకు చాలా ప్రచారం ఉంది.

వర్ణాలు గుణ కర్మలనుబట్టి ఏర్పడేవనటానికి దీనిని ప్రతీకగా భావించవచ్చు.

వసిష్ఠుని ఆశ్రమం సంపదలతో ఉండటమే గాక సైనిక రక్షణతోనూ ఉండేదట. విశ్వామిత్రుడు రాజుగా ఉన్నప్పుడు ఒకసారి వసిష్ఠుని ఆశ్రమానికి వెళ్ళి ఆయన దర్శనం చేసుకున్నాడు. (రామా. బాలకాండ - సర్గ 52) వసిష్ఠుడు రాజుకు అతిథ్యం ఇస్తానన్నాడు. రాజు సపరివారంగా వెళ్ళాడు గనక మునులకు ఇబ్బంది ఎందుకని ఆతిథ్యానికి నిరాకరించాడు. అయినా వసిష్ఠుడు మరీ మరీ అడగటంతో అంగీకరించాడు. వసిష్ఠుని ఆవు (శబల) ఆతిథ్యపు ఏర్పాట్లన్నీ చేసింది. షడ్రసోపేతమైన ఆ విందుకు చెరకుగడలు, తేనెలు, రసాలు, పేలాలు, పానీయాలు, ఆసవాలు (మద్యం), భక్ష్యాలు, బెల్లపు వంటకాలు, తినుబండారాలు అన్నీ సిద్ధంచేసింది. అది చూసి విశ్వామిత్రుడికి ఆశ్చర్యం కలిగింది. ఆ ఆవును తనకు ఇమ్మని మునిని అడిగాడు. "అది గోరత్నం. రత్నాలన్నీ రాజుకు చెందుతాయి కాబట్టి దానిని తీసుకుని బదులుగా లక్ష ఆవులు ఇస్తాను" అన్నాడు. వసిష్ఠుడు ఇవ్వనన్నాడు.

విశ్వామిత్రుడు ఒక కోటి ఆవులనూ, 14 వేల ఏనుగులనూ, 800 బంగారు రథాలనూ 11 వేల గుర్రాలనూ, కావలసినంత బంగారం – రత్నరాసులూ ఇవ్వటానికి సిద్ధపడ్డాడు – అయినా వసిష్ఠుడు ఒప్పుకోలేదు. చివరకు విశ్వామిత్రుడు బలవంతంగా ఆవును లాక్కొని వెళ్ళబోయాడు – ఆ సందర్భంలో జరిగిన యుద్ధంలో శబల హూంకారం నుండి వందలకొద్దీ పహ్లవ సైనికులు వచ్చి విశ్వామిత్రుని సైన్యాన్ని ఎదుర్కొన్నారు. విశ్వామిత్రుని సైన్యం వారిని ఓడించేసింది. అప్పుడు శబల, శక, యవన సైన్యాన్ని సృష్టించింది. వారినీ విశ్వామిత్రుడు ఓడించాడు. అప్పుడు వసిష్ఠుని ఆదేశం ప్రకారం శబల 'అంబా'రవం నుంచి కాంభోజులు, పొదుగు నుండి పహ్లావులు, యోని నుండి యవనులు, పురీష ప్రదేశం నుండి శకులు, రోమ కూపాల నుండి మ్లేచ్ఛులు, హారీతులు, కిరాతులు పుట్టుకొచ్చారు. (బాల. – 55) ఆ సైన్యంతోనూ వసిష్ఠుని హూంకారంతోనూ విశ్వామిత్రుని సైన్యాలు నశించాయి. అప్పుడు విశ్వామిత్రుడు తపస్సుకు వెళ్ళి ధనుర్విద్య తెలుసుకుని వచ్చాడు. అంతవరకు రాజులకు కూడా ధనుర్విద్య పూర్తిగా చెప్పకుండా దాచిపెట్టారన్న మాట. ఆ తర్వాత కూడా విశ్వామిత్రుడు ఓడిపోయాడు. బ్రాహ్మణుని బ్రహ్మదండమే శక్తిమంతమైనదని నిర్ధారణ అయింది. విశ్వామిత్రుడు ఈ యుద్ధంలో ప్రయోగించిన అస్త్రాలు చాలా శక్తిమంతమైనవి వాటి గురించి ఒక (56) సర్గ అంతా చెప్పారు. బ్రహ్మాస్త్రాన్ని కూడా వసిష్ఠుని బ్రహ్మదండం నిర్వీర్యం చేసింది.

ఆర్యమునుల ఆశ్రమాలకు సైన్యం రక్షణ ఉండటమూ ఆ సైన్యం శక, యవన, పహ్లావ జాతుల సైనికులతో కూడి ఉండటమూ గమనించ వలసిన విషయం. పూలే చెప్పినట్టుగా భారతదేశపు అసుర క్షత్రియుల నుండి రాజ్యాధికారం తీసుకోవటానికి వీలుగా ఆర్యజాతులవారు తమ సైన్యాలను ఆర్యమునుల ఆశ్రమాలలో ఉంచేవారటానికి ఈ సంఘటన ఉదారణగా నిలుస్తున్నది.

## జమదగ్ని ఆశ్రమం

పరశురాముని తండ్రి జమదగ్ని ఆశ్రమంలో కోరిన కోరికలన్నీ తీర్చగల ఆవు ఉండేదట. ఆయన హైహయ రాజుకు ఇచ్చిన ఆతిథ్యం గొప్పగా వర్ణించారు. ఆ ఆవు ఆశ్రమంలో ఒక నగరాన్నీ – భోజనశాలల్నీ ఏర్పాటు చేసింది. అవన్నీ చూసి రాజు ఆ ఆవు కావాలని అడగటం – ఇవ్వకపోతే బలవంతంగా తీసుకువెళ్ళటానికి ప్రయత్నించటం – అతని సైన్యం జమదగ్నిని చంపటం – పరశురాముడు క్షత్రియులపై కోపంతో భూమండలంమీది రాజులందర్నీ వెదకి వెదకి చంపటం – పురాణాలు కథలుగా చెప్పాయి. ఆర్య బ్రాహ్మణులకూ అసుర క్షత్రియులకూ రాజ్యాల ఏర్పాటులోనూ ధనధాన్య సంపదలను కూడబెట్టటంలోనూ జరిగిన ఘర్షణలు అసంఖ్యాకం. కొన్నే సాహిత్యంలో నమోదు అయి ఉదాహరణలుగా నిలిచాయి.

## విశ్వామిత్రుడు

వైవస్వత మన్వంతర కాలంలోని సప్త రుషులలో విశ్వామిత్రుడు ప్రముఖుడు. వేదాలలో ప్రసక్తమైన దాశరాజ్ఞ యుద్ధంలో ఇతడు ప్రముఖపాత్ర వహించాడు. రామాయణం బాలకాండలో ఇతడు వసిష్ఠుని బ్రాహ్మణశక్తి (బ్రహ్మదండం) ముందు ఓడిపోయి వసిష్ఠునితో సమానమైన స్థాయిని పొందటానికి అనేక విధాలుగా ప్రయత్నించిన కథ ఉంది. "బ్రాహ్మణ బలమే బలం. దానిముందు క్షత్రియుల బలం పనికిరాదు" అనేది అప్పటికి స్థిరపడి ఉన్న వ్యవస్థ. విశ్వామిత్రుడు దానిని మార్చటానికి ప్రయత్నించిన కథ ఉంది. కృతకృత్యుడయ్యాడు కూడా. బ్రహ్మర్షి అయిన వసిష్ఠుని చేతనే "బ్రహ్మర్షీ" అని పిలిపించుకున్నాడు. వసిష్ఠుని శాపంవల్ల చండాలుడైన త్రిశంకుడిని అదే రూపంతో స్వర్గలోకానికి పంపగలిగాడు. అతని కోసం మరో స్వర్గాన్నే సృష్టించగలిగాడు. ఈ కోణంలో చూస్తే అయన వర్ణధర్మ వ్యవస్థను ఎదిరించినవానిగా కనబడతాడు. కాని అతడే వర్ణ ధర్మం నిలపటం కోసం - గోబ్రాహ్మణ హితంకోసం - నాగులరాణి అయిన 'తాటక'ను రామునిచేత (పాలకవర్గం చేత) చంపించాడనీ యజ్ఞ క్రతువులను ఆచరించటానికి రామలక్ష్మణులను సహాయంగా తీసుకువెళ్ళాడనీ రామాయణ కవులు రాశారు. ఇది పరిశీలించదగ్గ అంశం.

వర్ణధర్మాన్ని నిరసించిన వారూ, సమర్థించినవారూ ఒకే వ్యవస్థలో ఉన్నారనటానికి ఇవి ఉదాహరణలుగా నిలుస్తాయి. తమ తమ వాదనలను సమర్థించుకునేందుకు వారు విశ్వామిత్రుని పేరు వాడుకున్నారనీ భావించవచ్చు.

బ్రహ్మజ్ఞానం కోసమే కాదు - ధనుర్విద్య కోసం కూడా విశ్వామిత్రుడు కఠోర తపస్సు చేయవలసి వచ్చింది. విద్యావ్యవస్థపై బ్రాహ్మణులకున్న నియంత్రణను విశ్వామిత్రుని కథ నుండి తెలుసుకోవచ్చు. రామాయణంలోని విశ్వామిత్రుడు చండాల రూపం పొందిన త్రిశంకుడిని ఆదరించి అతని కోసం యజ్ఞం చేశాడు. తన తపస్సు ధారబోసి అతనిని సశరీరంగా స్వర్గానికి పంపాడు. చండాలురకూ స్వర్గానికి వెళ్ళే అర్హత ఉన్నదని విశ్వామిత్రుడు నిరూపించబూనటం అప్పటి వ్యవస్థలోని సామాజిక చలనానికి సంకేతం.

మార్కండేయ పురాణం ప్రకారం (హరిశ్చంద్రుని కథలో) విశ్వామిత్రుడు చండాల (మతంగ) కన్యలను తన పెంపుడు కూతుళ్ళుగా చెప్పుకున్నాడు. వారిని వివాహం చేసుకోవలసిందిగా హరిశ్చంద్ర మహారాజును కోరాడు; బలవంతపెట్టాడు. అందుకు నిరాకరించిన హరిశ్చంద్రుడిని ఎన్నో కష్టాలకు గురిచేసి అతనికి గుణపాఠం చెప్పటానికి ప్రయత్నించాడు.

ఈ కథలు వింటుంటే విశ్వామిత్రులు చాలామంది ఉండి ఉంటారనీ భిన్న సందర్భాలలోని విభిన్న సంఘటనలను ఒక వ్యక్తికే ఆపాదించి కవులు మూర్తీకరణం చేసి ఉంటారనీ అనుకోవచ్చు.

విశ్వామిత్రుని పుట్టుకను గురించిన కథలు భిన్న సంస్కృతుల సమ్మేళనానికి చిహ్నాలు. బ్రాహ్మణ క్షత్రియ వివాహ సంబంధాలు ఒప్పుకున్న వ్యవస్థలో వర్ణధర్మ వ్యవస్థను

ఎదిరించవలసిన పరిస్థితి ఉండటాన్నీ ఇవి సూచిస్తున్నాయి. ఆధునిక యుగంలోనూ చరిత్రలోనూ శూద్ర రాజులు బ్రాహ్మణుల కర్మకాండలకు తలవొగ్గవలసి రావటం – వర్ణధర్మాన్ని ఎదిరించలేకపోవటం కనిపిస్తున్నాయి. సమాజంలో సమధర్మం ఉండాలన్న వారు కూడా వర్ణవ్యవస్థను కాదనలేకపోతున్నారు. "అంటరానితనం పోవాలి – వర్ణ వ్యవస్థ ఉండాలి" అనే ప్రవచనాలు అలాంటివే. రామాయణ కావ్యం అనుకున్నంత ప్రాచీనం కాదని చెప్పటానికి అవకాశమిచ్చే ఆధారాలు విశ్వామిత్రుని చరిత్రలో ఉన్నాయి. వసిష్ఠుని హోమధేనువు 'శబల'ను విశ్వామిత్రుడు బలవంతంగా తన వెంట తీసుకుపోవాలని ప్రయత్నించిన సందర్భంలో వసిష్ఠునికీ విశ్వామిత్రుని సైన్యాలకూ ఘర్షణ జరిగింది. వసిష్ఠుని అనుమతితో శబల "పహ్లవ" సైన్యాన్ని సృష్టించింది. తర్వాత యవన సైన్యాన్నీ సృష్టించింది. వారు విశ్వామిత్రుని సైన్యంతో పోరాడారు. అంటే అప్పటికి ఆర్య మునుల ఆశ్రమాలు శక యవన సైనికుల స్థావరాలుగా రక్షిస్తూ ఉండే పరిస్థితి ఉన్నదనుకోవాలి. ఈ దేశానికి శకులూ యవనులూ వచ్చిన తర్వాతి కాలంలోనే పై సంఘటన జరిగిందను కోవాలి.

ఇలాంటి అంతర్గత సాక్ష్యాల వెలుగులో అప్పటి ఆర్య – ఆర్యేతర – అసుర – రాజకీయ శక్తులను, తిరుగుబాట్లను, అంచనా వేయ వలసి ఉంటుంది. స్థానిక (అసుర) రాజులకూ – విదేశీ సైనిక బలంతో ఉండే ఆర్యమునులకూ జరిగిన ఘర్షణలు ఎలాంటివో? ఆర్యమునులు స్థానికులపట్ల అమలుచేసిన ధార్మిక సామాజిక నియమాలు ఎలాంటివో? అవే స్థానికులను తిరుగుబాట్ల దారి పట్టించాయా? అనేది ఆలోచించాలి.

ఆర్యమునుల ఆశ్రమాల నుండి సమాంతర పాలన జరిగేదా అంటే జరిగేదనే అనిపిస్తుంది. అసురులను చంపటానికి శరభంగముని ఆశ్రమంలో జరిగిన మంత్రాంగం – సుతీక్షణ మహర్షి తన తపస్సునే రామునికి ధారపోయటానికి సిద్ధపడటం ఇవన్నీ ఆ ఆలోచనను బలపరుస్తున్నాయి.

బ్రహ్మజ్ఞానం కోసం విశ్వామిత్రుడు చేసిన తపస్సు మానవాళికి ఆదర్శం. ఆయన తపస్సు భంగంచేయటానికి ఎన్నెన్నో శక్తులు ప్రయత్నించాయి. అయినా ఆయన లక్ష్యాన్ని సాధించాడు.

## సుతీక్షణ మహర్షి ఆశ్రమం

రామాయణంలో ప్రసక్తమైన సుతీక్షణ మహర్షి ఆశ్రమం భయంకరమైన అడవిలో ఏకాంతంగా ఫల పుష్పాలతో కూడిన పరిసరాలతో సకల సౌకర్యాలతో సుఖంగా ఉన్నదట. సుతీక్షణ మహర్షి తన పుణ్య కర్మలతో లోకాలన్నీ జయించినట్టు ఇంద్రుడు చెప్పాడట. "లోకాలన్నీ నా వశంలో ఉన్నాయి. అవన్నీ నీకు ఇస్తాను. నీవు సీతా లక్ష్మణుడూ అందులో విహరించండి" అని రామునితో సుతీక్షణ మహర్షి అన్నాడు. ఆర్యమునులు చాలా స్థావరాలు దండకలో (మధ్య భారత దేశంలో) ఏర్పాటుచేసుకున్నారనటానికి ఇది

సంకేతం. మహర్షులు, దేవతలూ అక్కడికి వచ్చిపోతుండేవారు. ఆర్యుల రాజ్య విస్తరణకు ఆలోచనలు అక్కడ జరిగేవి. ఆశ్రమాలు పునాదులు. (అరణ్యకాండ సర్గ-6).

**శరభంగ మహర్షి ఆశ్రమం**

రామాయణం ప్రకారం ఆర్య/దేవగణాల పాలన స్థిరపడటానికి శరభంగుని ఆశ్రమంలో మంతనాలు జరిగాయి. ఇంద్రుడు అక్కడకు తరచుగా వస్తుండేవాడు. ఇంద్రుడు ఆర్యుల యుద్ధ నాయకుడు. రాముడు శరభంగుని ఆశ్రమానికి వెళ్ళినప్పుడు అక్కడ ఇంద్రుడున్నాడు. దివ్యాంగనలు వింజామరలు వీస్తున్నారు. దేవగణాలు, గంధర్వులు, మునులు చుట్టూ ఉన్నారు - రథం సిద్ధంగా ఉంది. రథానికి నాలుగువైపులా రక్షణగా వందమంది చొప్పున ఆయుధ పాణులయిన యువకులున్నారు. రాముడు వస్తూండటం చూసి ఇంద్రుడు త్వర త్వరగా రథం ఎక్కి వెళ్ళిపోయాడు. శరభంగుని ఆశ్రమానికీ రక్షణ వ్యవస్థ ఉండేది. ఈయనకూ, తపస్సువల్ల అనేక లోకాలు సిద్ధించాయట. ఆ ఫలమంతా ఆయన రాముడికి ఇచ్చి బ్రహ్మలోకానికి వెళ్ళటానికి అగ్నిలో ప్రవేశించి పదిహేనేళ్ళ బాలునిలాగా బయటకు వచ్చి లోకాలన్నీ దాటి బ్రహ్మలోకానికి వెళ్ళాడు. ఆర్య రాజ్య విస్తరణకు కావలసిన ఏర్పాట్లన్నీ శరభంగుని వంటి మునులు చేశారు.

ఆర్య మునులు యజ్ఞాలు చేయటాన్ని చాలా పురాణాలు ప్రస్తావించాయి. వాటిలో కొన్ని సంవత్సరాల తరబడిసాగేవి. అపారమైన ధనం, బంగారం, వస్తు సామగ్రీ పోగు పడేది. అక్కడి సంపద చూసి రాజులే ఆశ్చర్యపోయేవారు. అలా ఆశ్చర్యపోయిన ఒక రాజును ఆ సంపద హరించాలనుకుంటున్నాడనే నెపంతో మునులు శపించిన ఉదంతాలూ ఉన్నాయి.

భరద్వాజుని ఆశ్రమం గంగాయమునల సంగమ ప్రదేశంలో ఉన్నది. భరద్వాజుడు దేవతల గురువైన బృహస్పతి కొడుకు. ఆర్య పురోహితులలో ఒకడు. ఇతని ఆశ్రమం చాలా పెద్దది. అందులో అనేక పర్ణశాలలున్నాయి. భరతుడు శ్రీరాముడిని తిరిగి అయోధ్యకు తీసుకువెళ్ళాలనే సంకల్పంతో సపరివారంగా బయలుదేరి శ్రీరాముని దగ్గరకు వెళ్తూ మార్గమధ్యంలో భరద్వాజుని ఆశ్రమంలో ఆగాడు. భరతుని పరివారంలో వసిష్ఠాది గురువులు - ఇతర పురోహితులు - రాజపత్నులు - రాజస్త్రీలు - సైనికులు పరిచారకులు చాలా మంది ఉన్నారు. - వారితో బళ్ళూ, రథాలూ, ఎద్దులూ, గుర్రాలూ, ఉన్నాయి. అందరికీ భరద్వాజుడు ఆతిథ్యం ఇచ్చాడు. ఆ విందు వర్ణన గొప్పగా ఉంది. (అయో. 91 సర్గ).

భరద్వాజుని ఆశ్రమంలో విందు ఏర్పాట్లు విశ్వకర్మ చేశాడు. దిక్పాలకులంతా ఇంద్రవరుణ యమ కుబేరులు స్వయంగా వచ్చి ఏర్పాట్లన్నీ చూశారు.

నదీ నదాలన్నీ ఫల రసాల ప్రవాహాలతో వచ్చాయి. చెరకు రసాల ప్రవాహంతో కొన్ని, మంచినీళ్ళతో కొన్నీ వచ్చాయి. గాన వినోదాలకు అప్సరసలు వచ్చారు. ఘృతాచి,

విశ్వాచి, మిశ్రకేశి, అలంబుస, హేమ, నాగదంత, హిమ మొ॥వారు నాట్యాలతో అతిథులను సంతోషపెట్టారు. భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్యాది ఆహారాలకు కొదవేలేదు. అప్పటికప్పుడు విశ్వకర్మ భోజనశాలలు, విశ్రాంతి భవనాలు కట్టాడు. సైనికులకూ ఏర్పాట్లు జరిగాయి. గజశాలలు, అశ్వశాలలు, రథాలు ఆగే స్థలాలు, ఏర్పాటయ్యాయి.

భరతుని కోసం ఒక రాజభవనం ఏర్పాటయింది. రకరకాల శయ్యలు – ఆసనాలు – వస్తు సామగ్రితో – ప్రతి ఒక్కరికీ ఏర్పాట్లు జరిగాయి. అక్కడికి నదులు కూడా వచ్చాయి. చక్కని తీరాలతో స్నానఘట్టాలు ఏర్పరచారు. ఇరవైవేల మంది అప్సరసలు పరిచర్యల కోసం వచ్చారు. వారిని చూడగానే పురుషులు పరవశులైపోయారట.

ఏడెనిమిది మంది స్త్రీలు ఒక్కొక్క పురుషుడినీ నదీ తీరానికి తీసుకువెళ్ళి నలుగులు పెట్టి ఒళ్ళుపట్టి స్నానాలు చేయించారు. ఒళ్ళు తుడిచి పాలు, ఇతర పానీయాలు తాగించారు. (స్త్రీలను భోగవస్తువులుగా చూసే సమాజపు వర్ణన ఇది.)

ఇన్ని పరిచర్యలు పొందిన ఆ సైనికులు అయోధ్యకు పోకుండా అక్కడే ఉంటా మన్నారు. ఎక్కడివారక్కడ సుఖంగా ఉండండి అనీ స్వర్గమంటే ఇదే అనీ కేకలు వేస్తూ నవ్వుకుంటూ పరుగులుతీస్తూ తింటూ తాగుతూ ఆనందించారు. ఏనుగులకూ గుర్రాలకూ కూడా ఒళ్ళు కడిగి చక్కనిమేత తినిపించారు.

బావుల నిండా ఖర్జూర రసాలు, పాయసాలు ఉన్నాయి. వంటపాత్రలు, భోజనాలు వడ్డించే పళ్ళాలు, గిన్నెలు రకరకాలవి అన్నీ బంగారువే. స్నానాలకు ఉసిరిపొడి, ఇతర సుగంధ చూర్ణాలు – కషాయాలూ – దంతధావన సామగ్రీ – చందనం – అద్దాలు – దువ్వెనలు – వస్త్రాలు – కౌపీనాల దగ్గర్నుంచీ సిద్ధంచేసి పెట్టారు. గుట్టలుగా పాదరక్షలూ సరఫరా చేశారు. ఆర్యమునుల ఆశ్రమాలు ఇంత సంపన్నమైనవి. ఆ సంపద స్థానికుల నుండి తీసుకున్నదే.

## మతంగాశ్రమం

రామాయణం అరణ్యకాండలో కబంధుడు వర్ణించిన మతంగాశ్రమం ఆర్యమునుల ఆశ్రమాలకు భిన్నంగా మూల భారతీయ సంస్కృతితో ప్రశాంతంగా ఉంది. (సర్గ–73) ప్రకృతి శోభలో – మతంగవనం ఇంద్రుని నందనవనానికి దీటుగా ఉన్నదని వర్ణించారు. మతంగవనాన్ని మతంగుడు స్వయంగా రూపొందించాడు. మతంగుడు పవిత్ర గంగానదీ జలాలను ఆహ్వానించి పంపా సరోవరాన్ని నింపాడట. వృద్ధాప్యంలో ఆయన సప్త సముద్రాలను తలచుకుంటే అవే స్వయంగా ఆశ్రమానికి వచ్చి చేరి అక్కడి "సప్తసాగర తీర్థం"గా అయ్యాయి. ఆ తీర్థంలోనే మతంగుడు స్నానంచేసి తడిబట్టలు చెట్లపై ఆరవేసేవాడని శబరి చెప్పింది. ఆయన వాడిన పూజా ద్రవ్యాలు – వాడిపోకుండా ఇంకా సువాసనలతో ఉండటం, ఆరవేసిన బట్టలు అలాగే ఉండటం చూసి రామలక్ష్మణులు ఆశ్చర్యపోయారు.

మతంగ మహర్షి శిష్యులు ఏకాగ్ర చిత్తులు, శాంతస్వభావులు, ఆ పరిసర ప్రాంతాల వారంతా మతంగుని శిష్యులే. గురువుగారికి పళ్ళూ కందమూలాలు తెచ్చేటప్పుడు మార్గాయాసంవల్ల వారి శరీరాల నుంచి జారిన చెమటబొట్లు దారిపక్కన ఉన్న చెట్లపై పడి పువ్వులుగా అయ్యాయట. స్వేద బిందువుల వల్ల ఏర్పడినవి కాబట్టి అవి ఎప్పటికీ వాడిపోవు" "స్వేద బిందు సముత్థాని న వినశ్యంతి" అని కబంధుడు చెప్పాడు. శ్రమశక్తిని గురించిన ఆలోచనలు అసురులకు ఉన్నాయనటానికి ఇది నిదర్శనం. (అరణ్య - 73-24).

శబరి మతంగుని శిష్యురాలు శబరి ఆ ఆశ్రమంలో తాను పరిచారికనని చెప్పుకున్నది. కాని ఆమెను 'శ్రమణి'గా రాముడు సంబోధించాడు. గురువుగారి సూచన ప్రకారం రాముడు వచ్చే వరకూ ఆగి అతనికి ఆతిథ్యం ఇచ్చి అప్పుడు శరీరాన్ని త్యజించింది. ఆమె రామునికి వన్య పదార్థాలతో అతిథ్యం ఇచ్చింది. చాలా పళ్ళు సేకరించి అవి తియ్యగా ఉన్నాయో లేదో రుచిచూసి మరీ ఇచ్చిందని పౌరాణికులు చెబుతుంటారు. శబరి ఎంగిలిని గ్రహించిన మహానుభావునిగా రాముని పొగడుతుంటారు. వాల్మీకి రామాయణంలో ఈ విషయం లేదు. అహల్య రాయి అయిందన్న లాంటి కల్పనే ఇదీనూ.

మతంగుడు నియమ జీవనానికి ధ్యాన తత్పరతకూ పేరు పొందాడు. ధ్యాన రీతులకు శ్రమ జీవనానికి మతంగుడు ప్రాధాన్యం ఇచ్చాడు.

పనిచేసేకొద్దీ మెలకువలు తెలుస్తాయి. నైపుణ్యాలు అలవడతాయి. కొత్త ఆలోచనలు వస్తాయి. ఐహిక ఆముష్మిక చింతన వారిని పరిపూర్ణత వైపు నడిపిస్తుంది. మతంగ శిష్యులు ఆ విధంగా దండక ప్రాంతంలో గణనకెక్కారు.

'శ్రమణ' శబ్దం జైన, బౌద్ధ ధర్మాలలోనే ఎక్కువగా ఉపయోగిస్తారు. శైవంలోనూ, జైనంలోనూ ప్రాణుల ఇహలోక త్యాగం (వృద్ధాప్య దశలో భౌతిక శరీరాన్ని విడిచిపెట్టటం) గురించిన భావనలు ఒకేరీతిగా కనిపిస్తాయి. శైవంలోని భృగుపాతం - జైనంలోని సల్లేఖన వ్రతం జీవి చరమావస్థకు మార్గనిర్దేశం చేస్తున్నాయి. ఈ పద్ధతులు కొన్ని దేశాలలో ఇటీవలి వరకు ఉండేవట. స్నాన సంధ్యాది అనుష్ఠానాలు చేసుకునే శక్తిలేక, నానాటికీ కృశించిపోతున్న వానప్రస్థులకు (వృద్ధులకు అనే భావం) భృగు పాత, జలపాత, అగ్నిపాత మరణం విధించబడింది. ఇది అధర్మం కాదు. స్త్రీ పురుషులిద్దరకూ ఇది వర్తిస్తుంది. భృగుపాతం అంటే ఎత్తైన కొండమీద నుంచి దూకటం, జలపాతం అంటే నీళ్ళలో దూకటం, అగ్నిపాతం అంటే అగ్నిలో దూకటం - ఇవి ప్రాణాలను త్యజించే రీతులు - వీటిని శాస్త్రాలు సమ్మతిస్తున్నాయట.

మతంగుడు అగ్ని ప్రవేశం చేశాడు. శబరి కూడా ఆ రీతిలోనే దేహాన్ని త్యజించింది. మహాభారతం ప్రకారం ఒక మతంగుడు చండాలుడు. అతడు చండదేవుడుగా ప్రసిద్ధుడై తపోదీక్షతో మహర్షి అయ్యాడు. ఒక మతంగుడు తపస్సుచేసి "కర్దమ ప్రజాపతి"గా

ప్రసిద్ధి పొందాడు. చరిత్ర ప్రకారం శకుల పాలనలో వారు రాష్ట్ర పాలకులుగా మహా క్షాత్రపులను నియమించారు. ఉజ్జయిని, తక్షశిల, మధుర, మాళవలలో వీరిని "శాత్రపీ"లనీ పిలిచారు. ఉజ్జయిని క్షాత్రపులు కర్దమక వంశానికి చెందినవారని చరిత్ర చెబుతున్నది. పురాణాల ప్రకారం కర్దముని భార్య మనువు కూతురు, దేవహుతి. కర్దముని కూతుళ్ళు తొమ్మిదిమంది. 1. కళ, 2. శ్రద్ధ, 3. అనసూయ, 4. అవిర్భువు, 5. గతి, 6. శ్రియ, 7. ఖ్యాతి, 8. అరుంధతి, 9. శాంతి. వీరు మహర్షుల భార్యలయ్యారు. వారి నుంచే సృష్టి విస్తరించింది. ఆ విధంగా ఈ దేశంలోని ప్రజలంతా మతంగ వారసత్వం కలవారే. మతంగుని కుమారుడు కపిలుడు. యోగసాంఖ్యశాస్త్రకర్త.

రామాయణంలోని మతంగుని భావధార ఆర్య ధర్మానికి భిన్నమైనది. మైత్రీ భావనతో జీవులమధ్య సామరస్యాన్ని నెలకొల్పిన మహర్షిగా మతంగుని మార్గం సామాన్య జనులను ఆకర్షించింది.

ఒక మతంగుడు తపశ్శక్తితో పరాశక్తిని పుత్రికగా పొందాడట. ఆ పరాశక్తి పార్వతి అంటారు, వైదిక సంప్రదాయవాదులు. ఆమె "మాతంగి" అని స్థానికులు చెబుతుంటారు. మాతంగి అతీతశక్తులు కలది. మాతంగీ ధ్యానం ఏకాగ్రతనూ సర్వోన్నత స్థానాన్నీ ప్రసాదిస్తుందన్నారు.

మధ్యప్రదేశ్‌లోని ఖజురహో ఆలయాలలో మతంగేశ్వరుని ఆలయం ఉంది. అక్కడే పార్శ్వనాథ్, ఆదినాథ్, శాంతినాథ్‌ల ఆలయాలు ఉన్నాయి. మతంగుని మార్గం ఒక విశిష్టమైన రీతికి దారిచూపిందనీ అప్పటికి ఉన్న అసుర తత్త్వాలనూ జైన, బౌద్ధ భావనలనూ కలుపుకున్నదనీ తెలుస్తున్నది.

ఆ విశిష్ట సంప్రదాయాన్ని ఆర్యధర్మం నిరాదరించింది. మతంగ సంప్రదాయాన్ని అనుసరించిన ప్రాచీన జాతులు అనంతర కాలంలో వర్ణధర్మ వ్యవస్థలో దిగువకు నెట్టి వేయబడి అంటరానివారుగా పరిగణింపబడ్డారు.

**శంబూకుడు**

రామాయణ కాలపు శూద్రముని. రాముని రాజ్యంలో వర్ణాశ్రమధర్మ వ్యవస్థ కచ్చితంగా అమలు జరిగేది. శూద్రులు జ్ఞానార్జనకూ తపస్సుకూ అనర్హులనీ. వారు వేదం వింటే వారి చెవులలో సీసం కరిగించిపోసి చంపాలనీ కఠినమైన శిక్షావ్యవస్థ అమలులో ఉండేది. శూద్రుడు తపస్సుచేస్తే రాజ్యంలో అనర్థాలు కలుగుతాయని నమ్మేవారు. ఒకప్పుడు రాముని రాజ్యంలో ఒక బ్రాహ్మణ బాలుడు మరణించాడట. తండ్రి బతికి ఉండగా కొడుకు మరణించటం జరిగిందంటే అది రాజు దోషం - రాజు అధర్మపాలన వల్లనే ఇలా జరిగిందని ఆ బ్రాహ్మణుడు ఆరోపించి కొడుకు శవంతో రాజద్వారం వద్ద కూచుండిపోయాడు.

రాముడు వెంటనే బయలుదేరి రాజ్యమంతటా వెదకి ఒక శూద్రముని తపస్సు చేస్తుండటాన్ని గమనించి వెంటనే అతని తల కత్తితో నరికేశాడు. విచారణ లేదు - అప్పీలూ లేదు. వెంటనే బ్రాహ్మణ బాలుడు బతికాడట.

బుద్ధునికీ ఇలాంటి ఒక సంఘటన ఎదురయింది. ఒక తల్లి, చనిపోయిన తన కొడుకు శరీరాన్ని బుద్ధుని దగ్గరకు తెచ్చి అతనిని ఎలాగైనా బతికించాలని కోరింది. పుట్టిన ప్రతి ప్రాణికీ మరణం తప్పదని బుద్ధుడు ఆమెకు బోధపరచాడు. "ఎవరి యింటిలో ఇంతవరకూ ఎవరూ చనిపోలేదో వారి యింటి నుంచి కొన్ని ఆవాలు తెచ్చి ఇస్తే ఆ కుర్ర వాడిని బతికిస్తా"నన్నాడు - ఆమె ఇల్లిల్లూ తిరిగింది. మరణంలేని ఇల్లు ఆమెకు దొరకలేదు. ఆ విధంగా బుద్ధుడు ప్రాపంచిక సత్యాన్ని ఆమెకూ ప్రజలకూ బోధపరచాడు.

మరణించిన బ్రాహ్మణ బాలకుడిని తిరిగి జీవింపజేయటం ద్వారా రాముడు బుద్ధుని కంటె గొప్పవాడని నిరూపించటానికి ప్రజలకు వర్ణధర్మంపై నమ్మకం కలిగించటానికీ ఈ కథను రామాయణం ప్రచారం చేసింది. ఆర్య ధర్మంలో శూద్రుల సామాజిక ప్రతిపత్తిని విశదపరిచే కథ ఇది.[1]

1 ప్రాచీన ధర్మాన్ని కాపాడుకుంటూ వచ్చిన సంఘటనలూ - పాత్రలూ - పురాణంలో ఎన్నో ఉన్నాయి. గ్రంథ విస్తరణ భీతివల్ల చాలా ముఖ్యమనుకొన్న విషయాలే ఇందులో ప్రస్తావించటం జరిగింది.

# భగవద్గీత

కర్తవ్య నిర్వహణ పేరుతో ఆర్య వ్యవస్థ ప్రవేశపెట్టిన ఆయుధం భగవద్గీత. లోక వృత్తాన్ని బోధిస్తున్నట్టే కనిపిస్తూ వర్ణ వ్యవస్థను దైవాసుర ప్రవృత్తులను ప్రస్తావించటం ఈ రచనలోని లౌక్యం.

రామాయణం రాసిన వాల్మీకి, భారత, భాగవతాలను పురాణాలనూ అందించిన వ్యాసుడూ స్థానిక జాతులవారే అని చెబుతూ వారిచేతనే వర్ణవ్యవస్థను కులధర్మాలను చెప్పించటమూ లౌక్యమే. స్థానిక ప్రజలు సంఘటితపడకుండా ఎప్పటికప్పుడు పాలకవర్గం జాగ్రత్తపడుతూనే వచ్చింది. ఆ క్రమంలోనే బౌద్ధుల 'దమ్మపదాన్ని' ఆదర్శంగా తీసుకుని భగవద్గీత తయారుచేశారు. శంకరాచార్యులు సంస్కరించిన హిందూమతం "ప్రచ్ఛన్న బౌద్ధం"గా పేరుపొందిన విషయం ఈ సందర్భంలో గుర్తుంచుకోవాలి.

మహాభారత కాలం నాటికి 'దమ్మపద' వ్యాప్తిలో ఉంది. పాళీ భాషలోనూ దేశ భాషలలోనూ ప్రచారంలో ఉన్న బుద్ధుని ఉపదేశాలను ఆర్య వాఙ్మయం సంస్కృతీకరించి వాటిని ఆర్యధర్మాన్ని ప్రతిబింబించే విధంగా మలుచుకున్నది.

'దమ్మపదం'లో 423 ప్రవచనాలు వివిధ శీర్షికలతో ఉన్నాయి. మనస్సు, ఇంద్రియాలు, ఆత్మ - సజ్జనులు, మూర్ఖులు, న్యాయవర్తనం, బ్రాహ్మణవర్గం, కోరికలు, వృద్ధాప్యం, సాహసం, ప్రపంచం వంటి శీర్షికలలో మానవ ధర్మాచరణను బోధించారు. అవే విషయాలు 'గీత' కూడా ప్రస్తావించింది.

బుద్ధం శరణం గచ్ఛామి

ధర్మం శరణం గచ్ఛామి

సంఘం శరణం గచ్ఛామి అనే ప్రబోధంతో బౌద్ధం బాధ్యతాయుతమైన సామాజిక ధర్మం వైపు ప్రజలను నడిపించింది. కాని, గీత బాధ్యతారహితమైన సమాజావిర్భావానికి దారి తీసింది.

"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహంత్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః॥" (భగ. 18.66)

"సమస్త ధర్మాలూ వదలిపెట్టి నన్నొక్కడినీ శరణు పొందు. నేను నిన్ను సమస్త పాపాల నుండీ విముక్తుని చేస్తాను. సందేహించకు" అన్నది. ఇక సామాజిక ధర్మం ఎక్కడ?

మానవునిలో మూఢభక్తిని పెంచటం - పాపాలెన్ని చేసినా కృష్ణార్పణం అంటే సరిపోతుందని భరోసా ఇవ్వటం - ధర్మం అంటే ఏమిటో స్పష్టంగా చెప్పకుండా

సాగదీయటం – గీతలో కనిపిస్తాయి. ఇవి పాలకవర్గాల ప్రయోజనాలను కాపాడటానికి ఉద్దేశించినవే. గీతపట్ల చాలా జాగ్రత్తగా ఉండాలి.

"ధర్మక్షేత్రే కురుక్షేత్రే, సమవేతా యుయుత్సవః" అంటూ ప్రారంభమౌతుంది భారతంలోని గీత – ధర్మక్షేత్రమైన కురుక్షేత్రంలో యుద్ధానికి నా కుమారులూ, పాండవులూ వెళ్ళారు కదా అక్కడ ఏం జరుగుతోంది అని ధృతరాష్ట్రుడు సంజయుడిని అడగటంతో భగవద్గీత మొదలవుతోంది. ఆ యుద్ధరంగమే ధర్మాన్ని నిర్ణయిస్తుందని ధృతరాష్ట్రుని నమ్మకం.

యుద్ధరంగాన్ని చూసిన అర్జునుడు బంధుమిత్రులను చంపలేనని చెప్పిన మాటల నిండా కులనాశం, కులధర్మాలు, వర్ణసంకరం, జాతి ధర్మం, కులస్త్రీలు చెడిపోవటం, స్త్రీల నడవడి ప్రస్తావనకు వచ్చాయి. (యుద్ధంలో) చంపేవాడు, చనిపోయేవాడు అంటూ ఉండరు. 'ఆత్మనిత్యం'. చిరిగిన దుస్తులు తీసివేసి కొత్త బట్టలు తొడుక్కున్నట్టుగా జీవి ఒక శరీరాన్ని విడిచి మరో శరీరంలో ప్రవేశిస్తుంది అని కృష్ణుడు చెప్పాడు. యుద్ధం బంధువుల మధ్యనే జరిగిన సందర్భాలలో ఈ ఓదార్పు అవసరమైంది. ఈ క్రమంలోనే కర్మ గురించీ, కర్మ ఫలాల గురించీ చర్చించారు. కర్మ ఫలాలు బలంగా ఉన్నప్పుడు వ్యక్తిత్వ వికాసానికి అవకాశం ఎక్కడ?

ఒక వ్యక్తి పుట్టుకతో శూద్రుడు కర్మవల్ల క్షత్రియుడు బ్రహ్మజ్ఞానంతో బ్రాహ్మణుడు అవుతాడన్న ఉపనిషత్తుల వాక్యాన్ని విస్మరించి

"చాతుర్వర్ణం మయాసృష్టం గుణకర్మ విభాగశః అంటూ (నాలుగో అధ్యాయం – జ్ఞాన కర్మ సన్యాసయోగం శ్లో. 4)

"చతుర్వర్ణాలయిన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను వారి వారి గుణకర్మల ననుసరించి వేర్వేరుగా సృష్టించాను" అని కృష్ణుని చేత చెప్పించారు. వర్ణ ధర్మాన్ని బల పరుస్తున్న ప్రవచనాలు గీతలో చాలా ఉన్నాయి. అంతతో ఊరుకోకుండా స్త్రీలు, వైశ్య, శూద్రులు, చండాలురు పాపజన్ములు అనీ గీత చెప్పింది.

"మాంహి పార్థ వ్యపాశ్రిత్య యేపిస్యుః పాపయోనా

యః స్త్రియో వైశ్యాస్తదా శూద్రహః ప్రియాతి పరాంగతిం" (అధ్యా. 9. శ్లో. 32)

ఒక జాతిని, కొన్ని వర్గాలను పాప జన్ములుగా నేరస్థ జాతులుగా చూడడంలో స్వార్థ ప్రయోజనాలు లేవని నమ్మాలా? అది వివక్షను పెంచిపోషించటం కాదా?

భగవద్గీతలో 18 అధ్యాయాలున్నాయి. వాటికి పేర్లున్నాయి. ప్రతి అధ్యాయం గొప్పతనాన్నీ వివరిస్తూ మళ్ళీ చివర సంక్షిప్తంగా 'యోగం' అంటూ మరో 18 విభాగాలు నిత్య పారాయణం కోసం చెప్పారు. 'యోగం' అనేది అసురుల భావన. దానిని వైదికమతం తనదిగా ప్రకటించుకున్నది.

(భగవద్గీత చివర్లో చెప్పిన 18 గీతా మాహాత్మ్య శ్లోకాలూ పద్మపురాణంలో కనిపిస్తున్నాయి. వాటికి కథలు జతపరచటం 'దమ్మపద' ప్రభావం. బుద్ధుని ఉపదేశాలను వినిపించే త్రిపిటకాలలోని 31 గ్రంధాలలో 'దమ్మపదం' ఒకటి. అందులో 26 వగ్గ (వర్గం)లున్నాయి. యమకవగ్గ, చిత్తవగ్గ, పండితవగ్గ, బుధవగ్గ, బాలవగ్గ, బ్రాహ్మణవగ్గ మొ॥నవి. ప్రతి వగ్గకూ ఒక్కోకథ జతపడి ఉంటుంది. నిత్య పారాయణంకోసం చెప్పిన గీతా మహాత్మ్య శ్లోకాలకు కథలు జతపరచటం పద్మపురాణంలో కనిపిస్తుంది. ఆ కథలు విష్ణుమూర్తి లక్ష్మీదేవికీ పరమశివుడు పార్వతికీ చెప్పినట్టు ఉంది.

ఇందులోని 18 అధ్యాయాలలో పదహారవది దైవాసుర సంపద్విభాగయోగం. అందులో దైవాసుర వివేచన చేశారు. మంచిగుణాలు, భావాలు, ఆలోచనలు దైవ గుణాలనీ. చెడు గుణాలు, ఆలోచనలు అసురగుణాలనీ అన్నారు. మానవులు తమలోని అసురగుణాలు గుర్తించి వాటిని వదలిపెట్టాలనేది నీతి. 'అసుర' పదం పట్ల ఆర్య సమాజానికి ఉన్న ద్వేషం శతాబ్దాల నాటిది. అది వర్తమానంలోనూ కొనసాగుతున్నది. అందుకే పురాణాలపట్ల, గీతపట్ల అప్రమత్తంగా ఉండాలి.

'రామ' నామ స్మరణ అన్నింటినీ పరిష్కరిస్తుందనేది రామాయణ సారం. "అన్ని ధర్మాలూ వదిలేసి నన్నే శరణు వేడుకో" అంటున్నాడు కృష్ణుడు. ఈ అవతార మూర్తుల గురించి డా. అంబేడ్కర్ వివరంగానే చర్చించారు. పురాణాలూ ఇతిహాసాలూ జాతి సంపద. వాటిని నిర్మలమైన మనస్సుతో అర్థం చేసుకోవాలి.

ఇతిహాసాలు, పురాణాలు ఏకాలపువైనా గాని భారతదేశానికి సంబంధించినంత వరకు, సమాజాన్నీ, రాజ్యాన్నీ నడిపించే చోదక శక్తులుగా రూపొందాయి. పాలకవర్గపు ఆసక్తులకు అనుగుణంగా నియంత్రించే సామగ్రి వీటినిండా నింపారు. నిత్య జీవిత వ్యవహారాలలో అడుగడుగునా వీటిలోని విషయాలు ప్రజలకు పాలకులకు గుర్తు వస్తుంటాయి. మార్గనిర్దేశం చేసే సాంస్కృతిక సాధనాలుగా మనిషిలో కొత్త ఆలోచన రాకుండా సమాజంలో కొత్త ధోరణులు తలెత్తకుండా ఒక మూసలో ఇవి సమాజాన్ని నడిపిస్తున్నాయి. వారిలో మతమౌఢ్యాన్ని నింపుతున్నాయి. ఈ ధోరణి దేశ ప్రగతికి ఆటంకం కలిగిస్తుందనే ఆలోచన ఉన్నప్పటికీ కొన్ని వర్గాలు వీటిని పెంచి పోషిస్తున్నాయి. వర్ణ ధర్మాల పరిధి నుంచి ఉత్పత్తి శక్తులు విడిపడినప్పటికీ వర్ణ వివక్ష సాగుతూనే ఉంది. కర్మ సిద్ధాంతం ప్రజలను కట్టిపడేస్తూ ఉంది. శ్రమ దోపిడీని, మానవుల మధ్య అసమానతలనూ సమర్థించే సాంస్కృతిక సాధనాలను అడ్డుకోవటం ఇప్పటి సామాజిక అవసరం.

## అనుబంధం i

### కర్దముడు

కర్దముడు త్రేతాయుగం నాటి ముని. ప్రజాపతులలో ఒకడు. అయితే మొదటి పదిమంది ప్రజాపతులలో ఈయన పేరులేదు. తర్వాత చేరింది. సృష్టి ప్రారంభ కాలంలో బ్రహ్మదేవుడు తన సృష్టికి ప్రథమ పురుషుడుగా స్వాయంభువ ప్రజాపతిని బహిర్గతం చేశాడట. ఆ స్వాయంభువుడు సంకల్ప మాత్రంచేత పూర్వకల్పంలో జీవన్ముక్తులై సృష్ట్యాది కర్మలలో తోడ్పడటం కోసం వేచి ఉన్న పదిమంది ప్రజాపతులను సృష్టించాడు. వారు 1. మరీచి 2. అత్రి 3. ఆంగీరసుడు 4. పులస్త్యుడు 5. పులహుడు 6. క్రతువు 7. ప్రచేతస్సు (దక్షుడు) 8. వసిష్ఠుడు 9. భృగువు 10. నారదుడు. ఆ తర్వాత 11. ధర్ముడు 12. మృత్యువు 13. అధర్ముడు 14. కాముడు 15. క్రోధుడు 16. లోభుడు 17. సరస్వతి 18. సముద్రుడు 19. నిరుతి 20. కర్దముడు ఇత్యాదిగా స్థావర జంగమ సృష్టి విస్తరించింది. (భాగవతం 3-373-379). ఇదంతా సూక్ష్మ దేవతా సృష్టి అని బ్రహ్మాండ సృష్టి విజ్ఞానం పుట 125లో చెప్పారు. ఈ పేర్లలో కొన్ని తేడాలున్నప్పటికీ కర్దముడు ఒక ప్రజాపతి అని అందరూ అంగీకరిస్తున్నారు.

ప్రజాపతులలో అయిదవవాడైన పులహుని కుమారుడు కర్దముడు అని ఒక వాదం ఉంది.

కర్దమము అంటే పంకము (బురద) అని అర్థం.

Kardama - Mud. The name of one of the lords of progeny (prajapatis) born from the shadow of Brahma. He is said to have practised great austerities (tapas) for 10,000 years on the banks of the Saraswati river after which Hari (Vishnu) appeared before him and praised him. Mythologically, Kardama and Ciklita (slime) are regarded as the sons of Sri (Lakshmi) the Goddess of good fortune who is also called Karisini, abounding in dung. In rites connected with vegetation and its growth, clay or mud are of the greatest importance. (Gonda, Aspects, pp. 218 - 262) The greek Demeter is the Goddess of the cultivated earth, the tilth and as Karpophoros 'she who bears fruits'. (Dictionary of Hinduism.)

## అనుబంధం ii

పరబ్రహ్మ స్వరూపుడు నిర్ణయించిన 56 రాజ్యాలు. 1. అంగ 2. వంగ 3 కాళింగ 4. కాంభోజ 5. కర్నాట 6. కుకురు 7. కొంకణ 8. టెంకణ 9. త్రిగర్త 10. కోసల 11. శూరసేన 12. ఆంధ్ర 13. పంచవిరాట 14. బూరు ఒరాట 15. మల్లవ 16. నేపాల 17. మగధ 18. పాంచాల 19. మద్ర 20. మచ్ఛ 21. మలయాళ 22. విరాట 23. వీర 24. సంవీర 25. సౌరాష్ట 26. విదేహ 27. విదర్భ 28. యుద్వల్ల 29. ద్రాయల 30. కాలసమాన 31. పులింద్రి 32. పాండ్య 33. గోల, 34. గాంధార, 35. కుంతల 36. దిపునుద్ర 37. సుధేష్ణ 38. గర్జర 39. శూరసేన 40. సైరు వాల్మీక 41. సింధు 42. కెరాల 43. లోలయ 44. పార్చిక 45. సిమ్మాల 46. బైలు గంధర్వ 47. వలుక 48. పాపజులుకల 49. నోజ 50. చకోర 51. వర్త 52 సంగర 53. పుష్పక 54. బంగాళ 55. బాహ్లిక 56. మహారాష్ట్ర.

ఈ 56 రాజ్యాలకు 56 చక్రవర్తులకు వసిష్ఠుని గురువుగా చేశాడు; వసిష్ఠుడు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులనే చతుర్విధాలు నిర్ణయించాడు.

ఆది జాంబవముని (జలవీరకన్య) (కమలాక్షి)

చపల మహాముని | రౌద్ర మహాముని

|

నీలమాముని

|

చర్మమాముని

|

నీలమాముని

|

పాలమాముని

|

బదీక్షమాముని

|

రుద్రాక్ష మహాముని

క్షుర మహాముని (రక్షాక్ష మహాముని) – భార్య శ్యామలాదేవి

|

మతంగ మహాముని (కర్దమ ప్రజాపతి)

భార్య దేవహూతి – మనువు కూతురు

కళ | శ్రద్ధ | అనసూయ | ఆవిర్భువు | గతి | క్రియ | ఖ్యాతి | అరుంధతి | శాంతి | కపిలుడు

(విశ్వమయ యుగంనాటి కథ ఇది)

## అనుబంధం iii

(కర్దమ ప్రజాపతి) మతంగుడు - (భార్య దేవహుతి)

- కళ (మరీచి)
  - కశ్యప ప్రజాపతి
    (భార్యలు 13 మంది)
    ఆదితికి ఆదిత్యులు
    దితికి దైత్య రాక్షసులు
    దనువుకు రాక్షసులు
    మునికి గంధర్వులు
    సురభికి గోగణం బ్రాహ్మణులు
    అప్సరలు
    వినతకు అనూరుడు, గరుత్మంతుడు
    అనుగకు సర్పాలు కలిగారు.
- శ్రద్ధ (అంగీరసుడు)
  - బృహస్పతి
- అనసూయ (అత్రి)
  - మునులు
- అవిర్బువు (పులస్త్యుడు)
  - రాక్షసులు
- గతి (పులహుడు)
  - కిన్నర కింపురుషులు
- గ్రియ (క్రతువు)
  - మతంగ సహచరులు
- ఖ్యాతి (భృగువు)
  - కవి
    - శుక్రుడు
      - శండ, అమర్క త్రృష్ట, ధరాత్ర
- అరుంధతి (వసిష్ఠుడు)
- శాంతి (అధర్వుడు)
- కపిలుడు

ఆది జాంబవ పురాణం ప్రకారం పరబ్రహ్మ స్వరూపుని ప్రభావంతో 33 కోట్ల దేవతలు 66 కోట్ల దానవులు తొమ్మిదికోట్ల సిద్దులు, ఏడుకోట్ల మునులు జన్మించారు. ఇది విశ్వరణ యుగం నాటి వృత్తాంతం. రామాయణం ప్రకారం కశ్యపునికి దితి, అదితి మొదలగువారు భార్యలు. ఇతర పురాణాలు కూడా ఈ పేర్లు చెప్పాయి.

# References


1. అంకెల్లో దాగిన ఆర్యుల అంతర్జాతీయ చరిత్ర (2011) కొత్త శివమూర్తి
2. ఆంధ్ర వాఙ్మయ చరిత్రము : వంగూరి సుబ్బారావు, కమల కుటీర్, ప్రెస్ పబ్లికేషన్స్, నరసాపురం, 1957.
3. ఇలియడ్ – ముత్తేవి రవీంద్రనాథ్, పీకాక్ క్లాసిక్స్ ప్రచురణ ప్ర.ము. 2012.
4. చెప్పులు కుడుతూ కుడుతూ – ఆంగ్లమూలం ఎమ్మరోషాంబుక్లొ (2011) తెలుగు అనువాదం వివిన మూర్తి
5. తెలుగే ప్రాచీనం – జి.వి. పూర్ణచంద్
6. దళిత బహుజనుల బానిసత్వానికి కారకులెవరు – భూపతి నారాయణమూర్తి (2013)
7. ధర్మవ్యాధుడు (1994) బోయి భీమన్న
8. నిరుద్ధ భారతము (1915) మంగిపూడి వేంకట శర్మ
9. బైబిలే పలుకుతోంది – N.V. బ్రహ్మం, కాలజ్ఞాని ప్రచురణలు (2012)
10. బ్రాహ్మణిజం జన్మరహస్యం – కొత్త శివమూర్తి – నాగ ప్రచురణలు-3 (2006)
11. భాగ్యోదయం – పద్మశ్రీ ఎం.బి. గౌతమ్, అనువాదం ఎస్. జగన్‌రెడ్డి, సమాంతర ప్రచురణలు (2009)
12. మార్కండేయ పురాణము
13. యజుర్వేద భాష్యము – ఆంధ్రానువాదం, దయానంద సరస్వతి, అన్నే కేశవాచార్య శాస్త్రి. (1963)
14. వడ్డారాధన సా.అ. ప్రచురణ (2001)
15. వాల్మీకి రామాయణం పరవస్తు రామానుజాచార్యుల వారి సహాయంతో గట్టుపల్లి శేషాచార్యులు వ్రాసిన ఆంధ్ర తాత్పర్య విశేషములు గల సంపుటాలు, శశిరేఖా ముద్రాక్షరశాల. (1914)
16. విప్రకల్ప సంగ్రహము – రాపాక రామస్వామి అనే యోహాను
17. వేదవ్యాసుడు (2000) బోయిభీమన్న
18. దేవీ భాగవతము
19. శ్రీ మత్స్య మహాపురాణము
20. శ్రీమదాంధ్ర మహాభారతము
21. శ్రీ మహాభాగతము

22. శ్రీ వరాహ పురాణము
23. శ్రీ స్కంద మహాపురాణము
24. A Dictionary of Hinduism - Margaret and James Stutley (1977) D.H.
25. A History of Indian Literature (500-1399) Sisir Kumardas, Sahitya Akademi Publication (2005)
26. A History of Sanskrit Literature - AAA Macdonell.
27. Colonialism, Orientalism and the Dravidian Languages, K. Venkateshwarlu (2012)
28. Cultural Leaders of India : Valmiki and Vyasa, Publication Division, Ministry of Information and Broadcasting, Govt. of India 1980.
29. Feeding the Baniya - Peasants and Usurers in Western India, David Hardiman (1996)
30. HCIP. The History and Culture of the Indian people, ed. by R.C. Majumdar.
31. Slavery - Mahatma Jotirao Phule.
32. The Hidden Heritage - Kasi Pandian
33. The Vedic people - Rajesh Kochhar (2000)
34. Valmiki Ramayana - V. Sitaramaiah, Sahitya Akademi, New Delhi 1972

హిందూ పురాణగాథలను ఒక చట్రంలో చూడటానికి అలవాటు పడ్డ పాఠకులకు ఈ పుస్తకంలోని విషయాలు అవతలి కోణాలను కూడా పరిచయం చేస్తాయి. వాటినీ పురాణాల నుండే తీసుకోవడం వల్ల పూర్వ సమాజాలలోని భిన్న దృక్పథాలను దర్శించటానికి అవకాశం కలుగుతున్నది.

పురాణ కర్తల కల్పనా వైచిత్రి వెనక మరుగునపడి ఉన్న వాస్తవాలను వెలికి తీసే ఒక ప్రయత్నంగా దీనిని చెప్పుకోవచ్చు. జాతుల అణచివేత, పితృస్వామ్యం బలపడటం - భిన్న మతాల సంఘర్షణలు - వంటి చారిత్రక సత్యాల ఛాయలనూ ఈ రచన స్పృశిస్తున్నది.

అసురుల సంస్కృతితోనే భారతీయ సంస్కృతి ముడిపడి ఉండటాన్నీ ఈ పుస్తకం స్పష్టం చేస్తున్నది.

తెలుగు అకాడమీ డైరెక్టరుగా పదవీ విరమణ చేసిన డా॥ విజయభారతి లోతైన పాండిత్యంతో రామాయణం వంటి పురాణాలను నిశితంగా విశ్లేషిస్తూ, పునఃపరిశీలిస్తూ వాటిలోని మాయామర్మాలను ఎత్తిచూపుతూ సత్యహరిశ్చంద్రుడు, దశావతారాలు, షట్చక్రవర్తులు, వ్యవస్థను కాపాడిన రాముడు, రామాయణ మునుల వంటి పలు పుస్తకాలు రచించారు. వీరు రాసిన అంబేద్కర్, పూలే జీవిత చరిత్రలు బహుళ ప్రాచుర్యం పొందాయి.